శ్రీః

పరమహంసపరివ్రాజకాచార్య శ్రీవాసుదేవానందసరస్వతీస్వామివిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

తెలుగుటీక - చింతగుంట సుబ్బారావు



ప్రకాశకులు

రావి మోహనరావు

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523 155.**

**ఆంధ్రప్రదేశ్.**

శ్రీః

పరమహంసపరివ్రాజకాచార్య శ్రీవాసుదేవానందసరస్వతీస్వామివిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

తెలుగుటీక - చింతగుంట సుబ్బారావు


ప్రతులు : 500

ప్రథమ ముద్రణ : 2019

పుటలు : 564

వెల : రూ. 300/-




404, Janjanam Complex,
Opp. I-Town Police Station,
**CHIRALA** - 523 157. **Cell : 94401 15411**

D.T.P.:
**P. PARVATHI**
Cell : 7416586775.

Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

శ్రీః

# ప్రస్తావన

ఇది శ్రీ దత్తపురాణమను మహాగ్రంథము, సంస్కృతమున పరమహంస పరివ్రాజకాచార్య శ్రీవాసుదేవానందసరస్వతీ స్వామి రచించినది, తెలుగులో టీకతో సమర్పింపబడుచున్నది. ఇది ఎన్మిది అష్టకములుగను, ఒక్కొక్క అష్టకము ఎన్మిది అధ్యాయముల గుచ్ఛముగను రూపము దాల్చినది. ఇందు మొత్తము 3500 శ్లోకములున్నవి. ఈ అష్టాష్టక అష్టాధ్యాయ విషయములు సూచికలో చూడవచ్చును. సంస్కృతవ్యాఖ్యతో కూడిన నాగరిలిపి ప్రతి నాకు లభించినది. దానిని పరిశీలించి తెలుగులో ప్రతిపదార్థతాత్పర్యములను కూర్చినాను. పాఠకమహోదారులకు ఇది ప్రయోజనకారి కాగలదని నమ్మిక.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశ్యానుచరితము అను ఈ అయిదు లక్షణములున్నది పురాణము, అని లక్షణము చెప్పబడినది. ఈ గ్రంథమునందు ఈ లక్షణములున్నవా? అను ప్రశ్నకు శ్రీవాసుదేవానందసరస్వతీ స్వామి వారి సమాధానము : ఈ గ్రంథమున ప్రకరణవశాత్తు ప్రథమకాండమున సర్గము, అంతిమకాండమున ప్రతిసర్గము, మధ్యలో వంశము, మన్వంతరము, వంశ్యానుచరితము వర్ణింపబడినవి కావున దీనిని పురాణమనుట సార్థకమే. ఇందు ఉపాసనాకర్మజ్ఞానకాండల విషయములను సమాచరించు భక్తుల అనుభవము ప్రతిపాదింపబడినది.

తెలుగువారికీ గ్రంథవిషయము నందించుట కర్తవ్యముగా నెంచి మిత్రులు రావి మోహనరావుగారు ప్రోత్సహించగా నే నీ పనికి పూనుకొని యథాశక్తి శ్రమించినాను. నా శ్రమ ఫలవంతమైనదను నమ్మికతో దీనిని మీ ముందు ఉంచుచున్నాను. ఈ కృషిలో నా ప్రతిభావ్యుత్పత్తులు చాలినవో లేదో ఆ శ్రీ దత్తునకే ఎఱుక. ఎఱుక గల పాఠకులు దత్తస్వరూపులై మన్నింప ప్రార్థన.

**భవదీయుడు**

**– చింతగుంట సుబ్బారావు.**



**శ్రీః**

జ్ఞానాది త్రికాణ్డ–అష్టాష్టక–చతుష్షష్ట్యధ్యాయ– పఞ్చశతాధిక సహస్రత్రయ (3500)శ్లోక – ద్వాదశసహస్రాధికలక్షాక్షర (112000) యుతం పరమ ప్రామాణిక పారాయణగ్రంథం శ్రీదత్తపురాణమిదమపూర్వం పరమహంస పరివ్రాజకాచార్యైః శ్రీశ్రీశ్రీవాసుదేవానందసరస్వతీస్వామిభిః విరచితమ్.

ఏనేన కృతం 'దత్తభజనమ్'. తదేవ శ్రీదత్తపురాణవిషయసూచికా.

బ్రహ్మశ్రీయుతాః శ్రీగరిమెళ్ళ సోమయాజులు శర్మాణః స్వపీఠికాయాం పరమహంసపరివ్రాజకాచార్య శ్రీవాసుదేవానందసరస్వతీస్వామినాం జీవితచరితమ్ విపులీకుర్వన్తి.

అద్య అస్మిన్ గ్రన్థే శ్రీచిన్తగుణ్ట సుబ్బరాయమహాభాగైః కృతయాంధ్రటీకయా–ష్టకచతుష్టయయుక్తః ప్రథమభాగః మయా పుస్తకరూపేణ ప్రకటీక్రియతే.

రమన్తాం పాఠకాః.

భవదీయః,

**రామోరా.**



ఓమ్

శ్రీరామచన్ద్రాయ నమః

# శ్రీవాసుదేవానందసరస్వతి (1854-1914)

ఆధునికభారతదేశచరిత్రలో 1850-1950 మధ్య కాలము సువర్ణయుగ మని చెప్పవచ్చును. 1947వ సంవత్సరమునందే భారతదేశమునకు స్వాతంత్ర్యము వచ్చినది. శ్రీరామకృష్ణపరమహంస, వివేకానందస్వామి వంటి యాధ్యాత్మిక గురువులు కాని; గాంధీమహాత్ముఁడు, బాలగంగాధరతిలకులు వంటి దేశభక్తులు కాని; శ్రీనివాసరామానుజన్, సి.వి.రామన్, జగదీశ్‌చంద్రబోసు వంటి శాస్త్రవేత్తలు కాని; అరవిందఘోషు, రవీంద్రనాథఠాగూరు వంటి విశ్వకవులు కాని; శ్రీచంద్రశేఖరసరస్వతి, శ్రీచంద్రశేఖరభారతి వంటి పీఠాధిపతులు కాని; శ్రీదాసగుప్తులు, శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణులు వంటి తాత్త్విక గ్రంథరచయితలు కాని; జవహర్‌లాల్ నెహ్రూ, రాజేంద్రప్రసాదు వంటి దేశనాయకులు కాని; బెల్లంకొండ రామరాయకవి, శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వంటి శతాధికగ్రంథకర్తలు కాని; మానవల్లి గంగాధరశాస్త్రి, తిరుపతివేంకటకవులు వంటి శతావధానులు కాని; బాలయోగి, సత్యసాయిబాబా వంటి యవతారపురుషులు కాని, శ్రీరమణ మహర్షి, కావ్యకంఠగణపతి వంటి తపోధనులు యెందఱో గొప్ప గొప్ప పురుషు లీ మధ్యకాలమునందే భారతదేశము నలంకరించిరి.

ఇట్టి మహానుభావుల యుత్తమ శ్రేణికిఁ జెందిన వారే శ్రీవాసుదేవానందసరస్వతీ స్వామివారు. వీరు గొప్ప దత్తాత్రేయభక్తులు. తపస్సంపన్నులు. మహాయోగులు. బహుగ్రంథకర్తలు.

మహారాష్ట్రదేశము నందలి "మాణగాఁవ్" అను గ్రామము వీ రవతరించిన పుణ్యస్థలము. వీరు ఋగ్వేదులు. అత్రి గోత్రీయులు. వీరి తల్లి రమాబాయి. తండ్రి గణేశభట్టు. ఈ పుణ్యదంపతులకు స్వస్తిశ్రీ ఆనందనామసంవత్సరశ్రావణబహుళ పంచమీభానువారము నాఁడు వీరు జన్మించిరి. అది శకసంవత్సరము 1776. అనఁగా 1854 క్రైస్తవాబ్దము.

వీరు బాల్యమునందే వేదము, స్మార్తము, జ్యోతిశ్శాస్త్రము మొదలగు వానిని నేర్చిరి. పౌరోహిత్యముతో జీవనయాత్ర సాగించెడి వారు. వీరికి 21 సంవత్సరముల వయస్సులో వివాహమైనది. వీరి ధర్మపత్ని యన్నపూర్ణాబాయి. వీరి కొక కొమార్తె కల్గినది. కొంతకాలమున కన్నపూర్ణాబాయి స్వర్గస్థురా లైనది.

భార్య గతించిన పిమ్మట వీరు శ్రీనారాయణానందసరస్వతీస్వామిపాదసన్నిధిలో సన్న్యాసాశ్రమమును స్వీకరించి **వాసుదేవానందసరస్వతీ** నామముతో భక్తి-వేదాంతములను బోధించుచు భారతదేశ మంతటఁ బర్యటించిరి.

**పుణ్యక్షేత్రములు :** పండరీపురము, గోకులము, బృందావనము, ఉత్తర మథుర (శ్రీకృష్ణాలయము), బ్రహ్మావర్తము, హరిద్వారము, బదరి, ఇందూరు (ఇండోర్), తిలకవాడ, ద్వారక, సిద్ధపురము, చిఖలద, తిరుమల, సరసి, షోండూరు, నర్సోబావాడీ, హంపి, ఋశ్యమూకము, కిష్కింధ, మహత్పూర్, కాళహస్తి, శివకంచి, విష్ణుకంచి, పక్షితీర్థము, చిదంబరము, రామేశ్వరము, శ్వేతారణ్యము, దక్షిణమధుర (మీనాక్షీ దేవాలయము), తంజావూరు, త్రిపురాంతకము, శ్రీశైలము, ముక్త్యాల, అమరావతి, వెల్లటూరు, పెదకళ్ళేపల్లి, కోటిలింగము (ధవళేశ్వరము), రాజమహేంద్రవరము (రాజమండ్రి), పిఠాపురము, కాకినాడ, పవని, హావనూరు, **గరుడేశ్వరము**, కురవపురము మొదలగు పుణ్యక్షేత్రములను సేవించిరి.

**పవిత్రతీర్థములు :**గంగ, నర్మద, ఘటప్రభ, విశ్వామిత్ర, తుంగభద్ర, కావేరీ సంగమము, కృష్ణ, సముద్రసంగమము (హంసలదీవి), సప్తగోదావరము మొదలగు పవిత్రనదులలో స్నానము లాచరించి, తపోజపాదులు నిర్వర్తించి యా యా నదీతీర గ్రామములోఁ జాతుర్మాస్యదీక్షలు శ్రద్ధతోఁ గావించిరి.

**అద్భుతకథలు :** వీరిని గూర్చి కొన్ని యద్భుతకథలు వినఁబడుచున్నవి. 1. వీరొక గ్రామములో సంచరించు చుండఁగా నొక త్రాఁచుపాము కనఁబడినది. దానిని మంత్రముతో బంధించినారు. వీరు తిరిగి వచ్చువఱకు నా పామట్లే బంధింపఁ బడి యున్నది. మంత్రము విప్పి దానిని విడిచిపెట్టి యప్పటి నుండి సర్పముల జోలికి వెళ్ళలేదఁట. 2. నర్మదానది వీరికి స్త్రీరూపములోఁ బ్రత్యక్షమై తన తీరములో నివసింపుఁడని వేఁడుకొన్నదఁట. 3. పండరీపురములో వీరికిఁ బాండురంగస్వామి ప్రత్యక్షమై స్వయముగాఁ బ్రసాద మిచ్చి నాఁడఁట. 4. నర్మదానదీతీరములో నున్న 'పేటలాద్' గ్రామములో వీరు చాతుర్మాస్యదీక్ష పూనిన సందర్భములో నొక నరకచతుర్దశి నాఁడు శ్రీదత్తాత్రేయస్వామి ప్రత్యక్షమై వీరిచే వేన్నీళ్ళతో నభ్యంగస్నానము చేయించుకొని హారతి గైకొనినాఁడఁట. 5. గుజరాత్ ప్రాంతా-రణ్యములో వీరు పర్యటించుచుండఁగా భిల్లరూపములో నశ్వత్థామ దర్శన మిచ్చినాఁ డఁట. 6. కృష్ణానదీతీరమున నున్న కురవపురములో దత్తాత్రేయక్షేత్రమునందలి గుహలో వీ రెక్కువ కాలము తపస్సు చేసి తపఃసిద్ధి పొందిరి. ఆ గుహను నేఁటికిని భక్తులు సందర్శించి ప్రణామము లర్పించుచున్నారు.

ఇవి యన్నియు నొక యెత్తు. వీరు మహారాష్ట్రీ – సంస్కృత భాషలలో రచించిన గ్రంథము లన్నియు నొకయెత్తు. వానిని స్థాలీపులాకన్యాయముగా సమీక్షింతము.

**మహారాష్ట్రీయగ్రంథములు : 1. దత్తలీలామృతసింధువు :** ఇది నర్మదానదీతీరములో 'ఇండోర్' మండలములో నున్న 'పేటలాద్' గ్రామములోఁ జాతుర్మాస్యములు చేసిన సందర్భములో రచించినది. **2. దత్తమాహాత్మ్యము :** ఇది 'మహత్పూర్'లో 11వ చాతుర్మాస్యము చేసిన సమయములో రచించినది.

**సంస్కృతగ్రంథములు :**

**1. ద్విసాహస్రీగురుచరిత్రము :** ఇది 'నర్సోబావాడీ' లో గురుద్వాదశి (శ్రీపాద శ్రీవల్లభాంతర్ధానద్వాదశి) సందర్భములో రచించిన గ్రంథము.

**2. ఋక్సంహితానిరూపణము :** ఇది బ్రహ్మావర్తములో 2 సంవత్సరముల పాటు పర్యటించిన సమయములో రచించినది. శ్లోకరూపము.

**3. కుమారశిక్ష :** ఇది 'షోండూరు'లో సుబ్రహ్మణ్య క్షేత్రములో రచించిన గ్రంథము.

**4. ద్వ్యర్థిషడాననస్తోత్రము :** ఇది దత్తాత్రేయ క్షేత్రమైన 'నర్సోబావాడీ'లో 16వ చాతుర్మాస్య సందర్భములో రచించినది.

**5. శ్రీవేంకటేశ్వరస్తోత్రము :** ఇది తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామిని సందర్శించినప్పుడు రచించినది.

**6. సదాశివబ్రహ్మేంద్రస్తుతి :** ఇది శ్రీసదాశివ బ్రహ్మేంద్ర సరస్వతీ స్వామి వారి సమాధిని (నెరూర్) దర్శించినప్పుడు చేసిన స్తోత్రము.

**శ్లో॥ స్వానందరసోన్మత్తః, స్వాంగం విస్మృత్య యో నరీనర్తి।**

**7. కృష్ణాలహరి :** ఇది కృష్ణానదీతీరములో సంచరించినప్పుడు రచించిన స్తోత్ర గ్రంథము. లహరీ వాఙ్మయములో దీనికిఁగూడ విశిష్టస్థానము గలదు.

**లహరీవాఙ్మయము**

లహరీ స్తోత్రశాఖ నారంభించిన వారు శ్రీశంకరభగవత్పాదాచార్యులు. వీరు రచించిన **'సౌందర్యలహరి', 'శివానందలహరి', 'ఆనందలహరి'** సుప్రసిద్ధములే. జగన్నాథ పండితరాయలు 1. గంగాలహరి, 2. యమునాలహరి, 3. విష్ణులహరి, 4. లక్ష్మీలహరి, 5. సుధాలహరి యను పంచలహరులను రచించినాఁడు. శ్రీకల్లూరి సుబ్రహ్మణ్య దీక్షితులు గారి 'గురుకృపానందలహరి', గరికపాటి సత్యనారాయణగారి 'దేవీకృపాలహరి' యిటీవల వెలువడిన గ్రంథములు. వీనిలో గంగాలహరికిఁ గృష్ణాలహరికి నెక్కువ పోలికలు గలవు.

## గంగాలహరి - కృష్ణాలహరి

ఇవి రెండును **శిఖరిణీ**వృత్తబద్ధములే. గంగాలహరిలో 52 శ్లోకములు గలవు. కృష్ణాలహరిలోఁగూడ 52 శ్లోకములే కలవు. గంగాలహరిలో మకుట నియమము లేదు. కృష్ణాలహరిలోఁ బ్రతిశ్లోకము-

**'నమః శ్రీకృష్ణే! తే జయ! శమితతృష్ణే! గురుమతే!'** అను మకుటముతో ముగియుచున్నది. ఇది తెలుఁగు శతకకవుల పద్ధతి.

**శ్లో॥ సమృద్ధం సౌభాగ్యం సకలవసుధాయాః కిమపి త-**
**న్మహైశ్వర్యం లీలాజనితజగతః ఖణ్డపరశోః ।**
**శ్రుతీనాం సర్వస్వం సుకృత మథ మూర్తం సుమనసాం**
**సుధాసౌన్దర్యం తే సలిలమశివం నః శమయతు ॥**

ఇది గంగాలహరి యారంభశ్లోకము.

**శ్లో॥ అపి శ్రీకృష్ణే! తే మహిమపరపారం వ్రజతి కో?**
**న శేషోఽశేషాస్యైరపి కథయితుం వా ప్రభవతి ।**
**అతో హ్రీతో వాచశ్చుచయ ఇహ వచ్మ్యల్పకమిదం**
**నమః శ్రీకృష్ణే! తే జయ! శమితతృష్ణే! గురుమతే॥**

ఇది కృష్ణాలహరి యారంభశ్లోకము.

జగన్నాథపండితరాయలు గంగాలహరిని పృథ్వీ - శార్దూలవిక్రీడిత - స్రగ్ధరా - ఉపజాతి వృత్తములతో ముగించినాఁడు. వాసుదేవానందసరస్వతి కూడఁ గృష్ణాలహరిని పృథ్వీ - శార్దూలవిక్రీడిత - స్రగ్ధరా - వృత్తములతో ముగించినారు.

**శ్లో॥ దరస్మితసముల్లసద్వదనకాన్తిపూరామృతై-**
**ర్భవజ్వలనభర్జితాననిశమూర్జయన్తీ నరాన్ ।**
**చిదేకమయచన్ద్రికాచయచమత్కృతిం తన్వతీ**
**తనోతు మమ శం తనోస్సపది శన్తనోరఙ్గనా ॥** - గంగాలహరి.

**శ్లో॥ ధరేన్ద్రతనయేఽభయేఽస్మ్యుపగతోఽనుకమ్పోదయే**
**జయేశ్వరి! హరీశరూపిణి!మణిద్యుతే త్వాఽర్థయే ।**
**అయే నది న దీనతాం వ్రజతు హృన్మదీయం స్వయేఽ**
**క్షయే వపుషి తేఽసితే భవతు దృక్త్వదీయేఽమ్మయే ॥ -కృష్ణాలహరి.**

**శ్లో॥ మన్త్రైర్మీలితమౌషధైర్విగలితం త్రస్తం సురాణాం గణైః**
**స్రస్తం సాన్ద్రసుధారసైర్విదళితం గారుత్మతైర్గ్రావభిః ।**
**వీచిక్షాళితకాళియాహితపదే! స్వర్లోకకల్లోలిని!**
**త్వం తాపం తిరయాధునా మమ భవ(జ్వా)వ్యాలావలీఢాత్మనః ॥-గం.ల.**

**శ్లో॥ కాచిత్ క్షాలయతి ప్రభోః పదయుగం కాచిత్కమారోహతి**
**స్వేదాత్కాపి జటాదితః ప్రకటితా బద్ధాపరోద్వాహితా ।**
**ఉచ్చైః కాచన మానినీహ పతితా జాతా గతా కాప్యథ**
**స్త్యక్తం తేన చ నామరూపమపి సత్కృష్ణే దశాయా మిహ॥ - కృ.ల.**

**శ్లో॥ ద్యూతే నాగేన్ద్రకృత్తిప్రమథగణమణిశ్రేణినన్దీన్దుముఖ్యం**
**సర్వస్వం హారయిత్వా స్వమథ పురభిది ద్రాక్ పణీకర్తుకామే ।**
**సాకూతం హైమవత్యా మృదులహసితయా వీక్షితాయా స్తవామ్బ!**
**వ్యాలోలోల్లాసివల్గల్లహరినటఘటీతాణ్డవం నః పునాతు ॥ - గం.ల.**

**శ్లో॥ దేవేద్యే! వేదవేద్యే! జయజయ! భయహృత్ త్వం కృపాకృష్టకృష్ణే**
**త్రాహిత్రాహి! గ్రహీతౄంస్తవ భవహరాభ్యాం సదా సత్యసన్ధే! ।**
**భూయో భూయోఽభయోక్తైర్వితర తవ తనుర్యేహ మోహప్రహర్త్రీ**
**సా మే కామేశమేధ్యా మనసి నయనయోరాదరాదస్తు దత్త ॥ - కృ.ల.**

ఇవి రెండు స్రగ్ధరావృత్తములు.

**శ్లో॥ ఇమామ్ పీయూషలహరీం, జగన్నాథేన నిర్మితామ్ ।**
**యః పఠేత్తస్య సర్వత్ర, జాయన్తే జయసమ్పదః ॥**

ఇది గంగాలహరి యంతిమశ్లోకము.

**శ్లో॥ కృష్ణాస్థప్రేరితమతిః, వాసుదేవసరస్వతీ ।**
**కృష్ణామస్తౌత్ తతః ప్రియాన్నరసింహసరస్వతీ ॥**

ఇది కృష్ణాలహరి యంతిమశ్లోకము.

శ్రీ వాసుదేవానందసరస్వతి తంజావూరులో 17వ చాతుర్మాస్యము జరిపినప్పుడు శ్రీకృష్ణాలహరికి సంస్కృతటీకను రచించినట్లు తెలియుచున్నది, గాని నాకు లభింపలేదు.

గంగాలహరి నా యమృతధారావ్యాఖ్యతో శ్రీరావి మోహనరావు గారి సంపాదకత్వములో, శ్రీరామానందసరస్వతీ స్వామి వారి ప్రధాన సంపాదకత్వములో

రామానందట్రస్ట్, వాడరేవు – చీరాల వారి సౌజన్యముతో 2017లోఁ బ్రకటింపఁ బడినది.

కృష్ణాలహరి 'పౌరాణికసార్వభౌమ' బ్రహ్మశ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రిగారి యాంధ్రవ్యాఖ్యానముతో శ్రీతిరుమలతిరుపతిదేవస్థానమువారిచే 1992లోఁ బ్రచురింపఁబడినది.

**8. మంత్రగర్భగణపతిస్తోత్రమ్ :**

శ్లో॥ వారణాస్యో దరఘ్నోఽర్ఘ్య ఏకదంతశ్శివాత్మజః ।
సుశర్మకృత్తారణోఽర్చ్యః కవిస్తత్పురుషప్రియః ॥ 1 ॥

శ్లో॥ దేవః పవిత్రేక్షణో ద్యోదంతీ చారుస్త్రిలోచనః ।
వాగ్మీశో మాయాతీతాత్మా తాపశోషాఖ్య ఆఖుగః ॥ 2 ॥

శ్లో॥ నందివంద్యోఽయమీశానో యశస్వీ యశఆస్పదః ।
దర్శనీయో విఘ్నరాజో విఘ్నహా విఘ్నకృద్విరాట్ ॥ 3 ॥

శ్లో॥ సభ్యో హృత్పద్మనిలయోద్మరసద్మవిహాపకః ।
రక్తాంగోఽర్కో హేమమాలీ హేరంబో హేమదంష్ట్రకః ॥ 4 ॥

శ్లో॥ స్వరాట్ప్రభా అజోఽనంతో వరేణ్యో మతిమాన్ గుణీ ।
తీర్థకీర్తిర్ వరకరః క్రత్వీశో హాపితాసురః ॥ 5 ॥

శ్లో॥ కృపాకరో ధూమకేతుస్ తుందిలో దేవవల్లభః ।
తపస్వీశస్ తాపహరో డాకినీ వారితోఽభయః ॥ 6 ॥

శ్లో॥ విశ్వప్రియో యక్షవంద్యో యష్టా నయవివర్ధనః ।
నానారూపో ధీర ఆద్యో ధీమతాం ధీరకః సుధీః ॥ 7 ॥

శ్లో॥ యమీశ్వరో మహాహస్తీ మహాత్మా మహ ఉత్తమః ।
కర్తాఽకర్తా హితకరో హితజ్ఞో హితశాసనః ॥ 8 ॥

శ్లో॥ స్తోతా స్తవ్యస్ తన్త్రమూలస్ తన్త్రజ్ఞస్ తన్త్రవిగ్రహః ।
త్రయీవేద్యో నోదనాజ్ఞో నోదనా నోదితద్విజః ॥ 9 ॥

శ్లో॥ మిత్రాభో మదనస్మేరో దంతీ మరుదుపాసితః ।
దండోఽప్రమత్తః శాస్త్రార్యస్ తీర్థమింద్రః స్తుతోఽపహా ॥ 10॥

శ్లో॥ సత్యసంధః ప్రకాశాత్మా ప్రసన్నః ప్రణతార్తిహా ।
మంత్రవిద్యాచోదితాత్మా చోదనా చోదితాఖిలః ॥ 11 ॥

శ్లో॥ త్రయీధర్మో దశాతీతో దక్షోఽభేద ఉమాసుతః ।
కం నః స దేయాత్ ప్రణుతోఽయాత్ స పాయాత్ సదా భయాత్॥12॥

ఇవి యన్నియు ననుష్టుప్ పద్యములు. ఇది 12 శ్లోకముల స్తోత్రము. ఈ శ్లోకపాదములందలి మొదటి 24 యక్షరములను గలిపినచో 1. "**వాసుదేవానంద సరస్వతీకృతవినాయకస్తోత్రమిదం సమంత్రకమ్**" అనియు; 5వ యక్షరములను గలిపి చదివినచో 2. "**దత్తాత్రేయాయ విద్మహే అవధూతాయ ధీమహి – తన్నో దత్తః ప్రచోదయాత్**" అనియు, 9వ యక్షరములను గలిపి చదివినచో 3. "**ఏకదంతాయ విద్మహే వక్రతుండాయ ధీమహి – తన్నో దంతీ ప్రచోదయాత్**" అనియు, 12వ యక్షరములను గలిపి చదివినచో 4. "**తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి – తన్నో రుద్రః ప్రచోదయాత్**" అనియు 4 మంత్రములు క్రమముగా వచ్చును.

**9.** మంత్రగర్భసరస్వతీస్తోత్రమ్ :

శ్లో॥ వాగ్వాదినీ పాపహరాసి భేదచోద్యాదికం మద్ధర దివ్యమూర్తే ।
సుశర్మదే వన్ద్యపదేఽస్తు విత్తాదయాచ తేఽహో మయి పూర్ణకీర్తే ॥ 1 ॥

శ్లో॥ దేవ్యై నమః కాలజితేఽస్తు మాత్రేయిసర్వభా అస్యఖిలార్థదా త్వమ్ ।
వాసోఽత్రతే నః స్థితయే శివాయాత్రీశస్య పూర్ణస్య కలాసి సా త్వమ్ ॥2॥

శ్లో॥ నందప్రదే సత్యసుతేఽభవాయ సూక్ష్మాం ధియం సమ్ప్రతి మే విధేహి ।
దయస్వ సారస్వజలాధిసేవి నృలోకపే రమ్మయి సంనిధేహి ॥ 3 ॥

శ్లో॥ సత్యం సరస్వత్యరిమోక్షసద్మతారిణ్యాసి స్వస్య జనస్య భర్మ ।
రమ్యం హి తే తీరమిదం శివాహేనాంగీకరోతీహ పతేత్ సమో హే ॥4॥

శ్లో॥ స్వభూతదేవాధిహరేఽస్మి వా అచేతా అపి ప్రజ్ఞ ఉపాసనాత్ తే ।
తీవ్రవ్రతైర్ జేతుమశక్యమేవ తన్ నిశ్చలం చేత ఇదం కృతం తే ॥5॥

శ్లో॥ విచిత్రవాగ్భిర్గగురూనసాధూ తీర్థాశ్రయాం తత్త్వత ఏవ గాతుమ్ ।
రజస్తనుర్వ్యాక్షమతేధ్యతీతాసుకీర్తి రాయచ్ఛతు మే ధియం సా ॥ 6 ॥

శ్లో॥ చిత్రాంగి వాజిన్యఘనాశినీ యమసౌ సుమూర్తిస్తవ చాంమయీహ ।
తమోఽఘహం నీరమిదం యదాధీతీతిష్ణుమే కేఽపి న తే త్యజంతి ॥ 7 ॥

శ్లో॥ సద్యోగి భావ ప్రతిమం సుధామ నాందీముఖం తుష్టిదమేవ నామ ।
మంత్రో వ్రతం తీర్థమితోఽధికం హి యన్మే మతం నాస్త్యత ఏవ పాహి॥ 8 ॥

శ్లో॥ త్రయీ తపోయజ్ఞముఖాని తాం తం జ్ఞం పాతి నాధిఘ్న ఇమేఽజ్ఞమార్యే! ।
కస్త్వల్పసంజ్ఞం హి దయే తయోనోదయార్హ్య ఆర్యోజ్ఝిత ఈశవర్యే ॥ 9 ॥

శ్లో॥ సమస్తదేవర్షినుతే! ప్రసీద! ధేహ్యస్య కే విశ్వగతే కరం తే ।
రక్షస్వ సుష్టుత్యుదితే ప్రమత్తః సత్యం న విశ్వాంతర ఏవ మత్తః ॥10॥

శ్లో॥ స్వజ్ఞం హి మాం ధిక్కృతమత్ర విప్రరత్నైర్వరం విప్రతరం విధేహి ।
తీక్ష్ణద్యుతేర్ యాధిరుగిష్టవాచోఽస్వ స్థాయ మే రాత్వితి తే రిరీహి ॥11॥

శ్లో॥ స్తోతుం న చైవ ప్రభురస్మి వేదతీర్థాధిపే! జన్మహరే! ప్రసీద ।
త్రపైవ యత్ సుష్టు తయేఽస్త్యపాయాత్ సా జాడ్యహాతిప్రియదా విపద్భ్యః ॥12॥

ఇవి యుపజాతి పద్యములు. ఈ స్తోత్రమునందుఁగూడ 12 శ్లోకములు గలవు.

ఈ శ్లోకపాదములందలి మొదటి 24 యక్షరములను గలిపి చదివినచో 1. **"వాసుదేవానందసరస్వతీవిరచితసమంత్రకసరస్వతీస్తోత్ర"** అనియు; 5వ యక్షరము లన్నింటిని గలిపి చదివినచో 2. **"పావకా నః సరస్వతీ వాజేభిర్వాజినీవతీ యజ్ఞం వష్టు ధియా వసు"** అనియు; 11వ యక్షరము లన్నింటిని గలిపి చదివినచో 3. **"దత్తాత్రేయాయ విద్మహే అవధూతాయ ధీమహి తం నో దత్తః ప్రచోదయాత్"** అనియు; 12వ యక్షరము లన్నింటిని గలిపి చదివినచో 4 **"చోదయిత్రీ సూనృతానాం చేతంతీ సుమతీనాం యజ్ఞం దధే సరస్వతీ"** అనియు; 16వ యక్షరము లన్నింటిని గలిపి చదివినచో 5. **"మహో అర్ణ సరస్వతీ ప్రచేతయతి కేతునా ధియో విశ్వాం విరాజతి"** అనియు 5 మంత్రములు క్రమముగా వచ్చును.

**10. ఆత్మపూజాదీపిక :** దీనిలో 20 శ్లోకములు గలవు.

1. ప్రబోధము, 2. ధ్యానము, 3. ఆవాహనము, 4. ఆసనము, 5. పాద్యము, 6. అర్ఘ్యము, 7. ఆచమనము, 8. స్నానము, 9. వస్త్రము, 10. యజ్ఞోపవీతము, 11. గంధము, 12. పుష్పము, 13. ధూపము, 14. దీపము, 15. నైవేద్యము, 16. తాంబూలము, 17. ప్రదక్షిణము, 18. నమస్కారము, 19. క్షమాపనము, 20. అలంకారము క్రమముగా వర్ణింపబడినవి.

దీనిలో వివిధ వృత్తములు వాడఁబడినవి. చివరి నాలుగు శ్లోకములలో ముద్రాలంకారము గలదు.

శ్లో॥ త్వం త్రీశాహమహం త్వమిత్యవగతేః స్థేమ్నే నిదిధ్యాసనా
త్మానస్తే పరిదక్షిణా హి విహితా యద్యచ్చ మే క్రీడితమ్ ।

**తద్బ్రహ్మాస్తు చిదన్వయేక్షితురథో త్వానుస్మరన్ వ్యాహరే-**
**త్తారం తారకమేకమాత్మని యథా శార్దూలవిక్రీడితమ్ ॥17॥**

ఈ వృత్తము శార్దూలవిక్రీడితము. '**సూర్యాశ్వైర్మసజస్తతాః సగురవః శార్దూలవిక్రీడితమ్**' అని వృత్తరత్నాకరలక్షణము. శార్దూలవిక్రీడితములోఁ బ్రతిపాదమునందును 'మ-స-జ-స-త-త-గ' యను గణములుండును.

**శ్లో॥ అసకృదభిహితా తేఽనేకజన్మాప్తపుణ్యైః**
**ప్రణతివితతిరేషా ద్వైతశేషా విశేషా ।**
**త్వయి వినిహితమేతన్మే జ్ఞ! సర్వం స్వకీయం**
**త్ర్యధిప! జయతు పూజా త్వద్యశోమాలినీయమ్ ॥ 18 ॥**

ఇది మాలినీ వృత్తము. '**ననమయయయుతేయమ్ మాలినీ భోగిలోకైః**' అని వృత్తరత్నాకరలక్షణము. మాలినీ వృత్తములోఁ బ్రతిపాదమునందును 'న-న-మ-య-య' - అను గణము లుండును.

**శ్లో॥ యన్మే న్యూనం సమ్మతం స్థూలదృష్ట్యా**
**భూమన్ తేఽనుక్రోశపీయూషవృష్ట్యా ।**
**నిత్యమ్ ప్రేయః స్వప్రభం శాలినీ యం**
**తస్యాభూత్సమ్పూర్ణతా శాలినీయమ్ ॥ 19 ॥**

ఇది శాలినీ వృత్తము. '**మత్తౌ గౌ చే చ్ఛాలినీ వేదలోకైః**' అని ఛందోమంజరీ లక్షణము. శాలినీ వృత్తములఁ బ్రతిపాదమునందును - 'మ-త-త-గ-గ' యను గణము లుండును.

**శ్లో॥ రోధనం హ్యాత్మనః శోధనం హ్యాత్మనః**
**పూజనం త్ర్యాత్మనో భోజనం స్వాత్మనః ।**
**యత్ర సైషాఽఽత్మపూజాస్తు కణ్ఠే సతాం**
**స్రగ్విణీ మా పరా స్త్రీవ కణ్ఠే సతామ్ ॥ 20 ॥**

ఇది స్రగ్విణీ వృత్తము. '**రైశ్చతుర్భిర్యుతా స్రగ్విణీ సమ్మతా**' - అని వృత్తరత్నాకర లక్షణము. స్రగ్విణీ వృత్తములోఁ బ్రతిపాదమునందును 'ర-ర-ర-ర' యను గణము లుండును.

ఈ నాలుగు పద్యములందును వృత్తనామములు సూచింపఁబడుటచే ముద్రాలంకారము.

**శ్లో॥ సూచ్యార్థసూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః ।
నితమ్బగుర్వీ తరుణీ దృగ్యుగ్మవిపులా చ సా ॥**

అని కువలయానందలక్షణము.

ఈ యాత్మపూజకు గ్రంథకర్తయే వ్యాఖ్యానము రచించినారు.

శ్రీ బెల్లంకొండ రామరాయ కవీంద్రులు (1875–1914), శ్రీవాసుదేవానంద సరస్వతీ యతీంద్రులు (1854–1914) సమకాలికులు. ఇరువురు బహుగ్రంథకర్తలై సంస్కృతవాఙ్మయమును సుపుష్టము చేసినవారే. బెల్లంకొండ వారు హయగ్రీవునిపై ననేక గ్రంథములు రచించినట్లే శ్రీవాసుదేవానందసరస్వతి దత్తాత్రేయునిపై ననేక గ్రంథములు రచించిరి. శ్రీదక్షిణామూర్తి, హయగ్రీవుఁడు, దత్తాత్రేయుఁడు సకల విద్యాప్రదాతలు.

**11. దత్తాత్రేయాష్టోత్తరశతనామావళి :** దీనిలో 24 శ్లోకములలో 108 దత్తాత్రేయనామములు చతుర్థీవిభక్తిలో నమోఽంతములుగాఁ జెప్పఁబడినవి.

**శ్లో॥ ఓంకారతత్త్వరూపాయ దివ్యజ్ఞానాత్మనే నమః ।
నభోఽతీత మహాధామ్న ఐంద్ర్యర్ధ్యా ఓజసే నమః ॥ 1 ॥**

**శ్లో॥ హ్రీంబీజాయార్జునేష్టాయ దర్శనాదర్శితాత్మనే ।
నతిసంతుష్టచిత్తాయ యతయే బ్రహ్మచారిణే ॥ 23 ॥**

**శ్లో॥ ఇత్యేష సత్స్తవో వృత్త్యోఽయాత్ కం దేయాత్ ప్రజాపినే ।
మస్కరీశో మనుస్యూతః పరబ్రహ్మపదప్రదః ॥ 24 ॥**

ఇవి యాద్యంత శ్లోకములు. ఈ యష్టోత్తరశతనామములకు గ్రంథకర్త రచించిన స్వోపజ్ఞవ్యాఖ్య గలదు. ఇది కూడ బెల్లంకొండవారి పద్ధతియే.

**12. దత్తప్రార్థనాచతుష్కము :**

**శ్లో॥ సమస్తదోషశోషణం స్వభక్తచిత్తతోషణం
నిజాశ్రితప్రపోషణం యతీశ్వరాగ్ర్యభూషణమ్ ।
త్రయీశిరోవిభూషణమ్ ప్రదర్శితార్థదూషణం
భజేఽత్రిజం గతైషిణం విభుం విభూతిభూషణమ్ ॥ 1 ॥**

**శ్లో॥ సమస్తలోకకారణం సమస్తజీవధారణం
సమస్తదుష్టమారణం కుబుద్ధిశక్తిజారణమ్ ।
భజద్భయాద్రిదారణం భజత్కుకర్మవారణం
హరిం స్వభక్తతారణం నమామి సాధుచారణమ్ ॥ 2 ॥**

**శ్లో॥ నమామ్యహమ్ ముదాస్పదం నివారితాఖిలాపదం**
**సమస్తదుఃఖతాపదమ్ మునీన్ద్రవన్ద్య! తే పదమ్ ।**
**యదశ్చితాన్తరా మదం విహాయ నిత్యసమ్మదం**
**ప్రయాన్తి నైవ తే భిదం ముహుర్భజన్తి చావిదమ్ ॥ 3 ॥**

**శ్లో॥ ప్రసీద సర్వచేతనే ప్రసీద బుద్ధిచేతనే**
**స్వభక్తహృన్నికేతనే సదామ్బ! దుఃఖశాతనే ।**
**త్వమేవ మే ప్రసూర్మతా త్వమేవ మే ప్రభో! పితా**
**త్వమేవ మేఽఖిలేహితార్థదోఽఖిలాకతోఽవితా ॥ 4 ॥**

ఈ శ్లోకములు పంచచామరములు. '**జరౌ జరౌ తతో జగౌ చ పంచచామరం వదేత్**' అని వృత్తరత్నాకరలక్షణము. పంచచామరములోఁ బ్రతి పాదము నందును 'జ - ర - జ - ర - జ - గ' - గణము లుండును.

ఈ శ్లోకములు నాల్గు నంత్యానుప్రాసభాసురములు.

ఈ స్తోత్రము శ్రీశంకరభగవత్పాదులు రచించిన 'ముదాకరాత్తమోదకం సదా విముక్తిసాధకమ్' అను గణేశపంచరత్నస్తుతి వంటిది.

**13. దత్తాపరాధక్షమాపణస్తోత్రమ్ :** దీనిలో 8 శ్లోకములు గలవు.

**శ్లో॥ దత్తాత్రేయ! త్వాం నమామి ప్రసీద! త్వం సర్వాత్మా సర్వకర్తా న వేద ।**
**కోఽప్యన్తం తే సర్వదేవాధిదేవ! జ్ఞాతాజ్ఞాతాన్ మేఽపరాధాన్ క్షమస్వ ॥1॥**

**శ్లో॥ శాన్తాఽస్తు భూర్నః శివమంతరిక్షం**
**ద్యౌశ్చాభయం నోఽస్తు దిశః శివాశ్చ ।**
**ఆపశ్చ విద్యుత్ పరిపాన్తు దేవాః**
**శం సర్వతో మేఽభయమస్తు శాన్తిః ॥ 8 ॥**

ఇవి యాద్యంత శ్లోకములు.

**14. దత్తభజనము :**

1. వేదపాదనుతితోషిత దత్త! 2. శ్రావితశాస్త్ర విరోధక దత్త!, 3. సమ్మతవేద శిరోమత దత్త!, 4. సంస్పృష్టేశ్వరసత్క్రియ దత్త!... ... .... సభక్తచిత్తాహ్లాదక దత్త!, సుకర్మయోగస్థాపక దత్త! 64॥

దీనిలో 64 చరణములు కలవు. వచనము లన్నియు భగవద్భజన కనుకూలమైన సంగీతలయానుసారముగా సాగినవి. ఈ భజనస్తోత్రమునందలి విశేషమేమనఁగా నిందలి 64 వాక్యములలో దత్తపురాణమందలి 64 యధ్యాయములలోని విషయములు వచ్చుచున్నవి. ఇది దత్తపురాణ విషయానుక్రమణిక. కళలు కూడ 64 కదా!

**15. దేవప్రబోధము :** దీనిలో 10 శ్లోకములలో శ్రీదత్తాత్రేయస్వామి మేలుకొలుపు కలదు.

**శ్లో॥ నిత్యో హి యస్య మహిమా న హి మానమేతి**
**స త్వం మహేశ! భగవన్! మఘవన్మఖేద్య! ।**
**ఉత్తిష్ఠ తిష్ఠదమృతైరమృతైరివోత్కై-**
**ర్గీతాగమైశ్చ పురుధా పురుధామశాలిన్ ॥**

**దత్తపురాణము**

శ్రీవాసుదేవానందసరస్వతికృతులలో నిది తలమానికము. భక్తులకు **నిత్య పారాయణ** గ్రంథము. దీనిలో 1. జ్ఞానకాండము, 2. ఉపాసనా కాండము, 3. కర్మకాండము నను 3 కాండములు, 8 అష్టకములు, 64 అధ్యాయములు, మొత్తము 3500 శ్లోకములు, 112000 అక్షరములు గలవు. దీనిపై గ్రంథకర్తలగు స్వామివారే విస్తృతమగు స్వీయవ్యాఖ్యను జోడించిరి. ఈ దత్తపురాణ విశేషములను ద్వితీయ భాగపీఠికలో వివరింతును.

ఇట్టి యుద్గ్రంథములను సంతరించిన శ్రీవాసుదేవానందసరస్వతీసంయ-మీంద్రులు శకాబ్దము 1836 (క్రీ.శ.1914) ఆషాఢశుక్లపాడ్యమి నాఁడు నర్మదానదీతీరమున గరుడేశ్వరములో బ్రహ్మైక్యము నొందిరి.

వివిధకృతులలో శ్రీదత్తాత్రేయస్వామి దివ్యస్వరూపమును భక్తులకు సాక్షాత్కరింపఁ జేసిన శ్రీవాసుదేవానందసరస్వతీస్వామిచరణులకు నా పునః పునః ప్రణామములు. స్వామివారి జీవితవిశేషములను దెలుపుటలో శ్రీమల్లాది చంద్రశేఖరశాస్త్రిగారి కృష్ణాలహరీ పీఠిక నా కెక్కువ తోడ్పడినది. వారికి నా నమోవాకములు. ఈ దత్తపురాణమున కాంధ్రతాత్పర్యమును శ్రీ చింతగుంట సుబ్బారావు గారు రచించిరి. వీరు బహుభాషాకోవిదులు. నాలుగు భాషలలో ననేక కృతులు వెలయించిన వారు. వీరికి నా యభినందనములు. ఈ గ్రంథమును ముద్రించి భక్తుల కందించుచున్న పుణ్యము మిత్రులు శ్రీ రావి మోహనరావు గారిది. వీరు స్వయముగా రఘువంశ - మేఘసందేశాది కావ్యములకు వ్యాఖ్యలు రచించుటయే కాక యెంతో ధనము వెచ్చించి సుమారు 180 గ్రంథములను దెలుఁగు పాఠకుల కందించిన మహానుభావులు. వీరికి నా కృతజ్ఞతాభినందనములు.

శ్రీపరమేశ్వరార్పణమస్తు.

విజయవాడ,
వికారిశ్రావణబహుళత్రయోదశీ
సౌమ్యవాసరము, 28.08.2019.

**ఇట్లు,**
**సకలసుకవిబుధజనవిధేయుఁడు,**
**గరిమెళ్ళ సోమయాజులుశర్మ.**

విషయసూచికా

శ్రీః

# దత్తభజనమ్

## I

1. వేదపాదనుతితోషిత దత్త!
2. శ్రావితశాస్త్రవిరోధక దత్త!
3. సంమతవేదశిరోమత దత్త!
4. సమ్ప్రృష్టేశ్వరసత్క్రియ దత్త!
5. కర్మేట్ తత్త్వజ్ఞాపక దత్త!
6. స్మృతితః సన్నిధికారక దత్త!
   సహ్యమహీధరవాసిన్ దత్త!
   కాశీగంగాస్నాయిన్ దత్త!
   కమలాపత్తనభిక్షుక దత్త!
   శాండిల్యానుగ్రాహక దత్త!
7. యోగాష్టాంగజ్ఞేశ్వర దత్త!
8. యోగఫలాభిజ్ఞేశ్వర దత్త!

## II

9. శిక్షితపాతంజలమత దత్త!
10. అర్పితసాయుజ్యామృత దత్త!
11. విక్షేపావృతివర్జిత దత్త!
    అసంగ అక్రియ అవికృత దత్త!
    స్వాశ్రయశక్త్యుద్బోధక దత్త!
    స్వైకాంశాహితవిశ్వక దత్త!
    జీవేశ్వరతాస్వీకృత దత్త!
    వ్యష్టిసమష్ట్యంతర్గత దత్త!
    గుణతో రూపత్రయధర దత్త!
    నానాకర్మగతిప్రద దత్త!
12. స్వభక్తమాయానాశక దత్త!
13. అనసూయాత్ర్యాహ్లాదక దత్త!
14. మత్స్యాద్యవతారాత్మక దత్త!
15. ప్రహ్లాదానుగ్రాహక దత్త!
    అసురసురోరగశిక్షక దత్త!
16. జ్ఞానకాండసందర్శక దత్త!



## III

17. నవవిధభక్తిపరాయణ దత్త!
స్వమంత్రజాపకతారక దత్త!
18. యోగభ్రష్టద్విజనుత దత్త!
సతీమాహాత్మ్యప్రముదిత దత్త!
సత్యనసూయాత్ర్యర్భక దత్త!
19. కృతవీర్యానుగ్రాహక దత్త!
20. జమ్భాఖ్యాసురఘాతక దత్త!
దేవేన్ద్రాభీష్టార్పక దత్త!
అర్జునహృద్యవరప్రద దత్త!
21. మోక్షేచ్ఛ్వర్జునసంస్తుత దత్త!
శిల్పజ్ఞోద్గతిశంసక దత్త!
కామశాస్త్రవిజ్ఞాపక దత్త!
సప్తగ్రహవిద్రావక దత్త!
22. విష్ణుదత్తవరదాయక దత్త!
23. కర్మవిపాకాఖ్యాపక దత్త!
ఝుటింగపీడాహారక దత్త!
24. భీతప్రాజ్ఞాహ్లాదక దత్త!



## IV

25. శ్రవణాదివిధిద్యోతక దత్త!
26. సయోగవిజ్ఞానార్పక దత్త!
27. విముక్తచర్యాజల్పక దత్త!
28. శక్తభక్తహితయోజక దత్త!
29. భార్గవరామాహ్లాదక దత్త!
30. అర్జునసాయుజ్యప్రద దత్త!
31. రేణుకాభీష్టార్థప్రద దత్త!
32. పాతితభూపకదంబక దత్త!

## V

33. ఋతధ్వజానుగ్రాహక దత్త!
34. మదాలసానుగ్రాహక దత్త!
35. అలర్కరాజ్యోత్కర్షక దత్త!
36. అలర్కరాజ్యత్యాజక దత్త!
37. యోగసిద్ధిసందర్శక దత్త!
38. యోగానుచర్యాభాషక దత్త!
39. మృత్యులక్ష్మసంజల్పక దత్త!
40. అలర్కగీతోత్తమగుణ దత్త!
విహితాలర్కశ్రేయో దత్త!

## VI

41. ఆయురాజవరప్రద దత్త!
42. నహుషాశేషారిష్టద దత్త!
43. ఆయుఃశోకద్రావక దత్త!
ఇందుమతీహృద్ధర్షక దత్త!
44. ప్రకటితనహుషసుతేజో దత్త!
ఘాతితహుండాసురబల దత్త!
ఆయుర్లిప్సాపూరక దత్త!
45. యదురాజానుగ్రాహక దత్త!
బహుగురుతత్త్వగ్రాహక దత్త!
శ్రీయదువంశాహ్లాదక దత్త!
46. మన్వంతరసత్కీర్తిగ దత్త!
సప్తద్వీపక్ష్మాప్రియ దత్త!
47. దినకరవంశోత్కర్షక దత్త!
48. హిమకరవంశోద్ధారక దత్త!
పూరితభక్తమనోరథ దత్త!
ఉపాసనాకాండప్రియ దత్త!



## VII

49. దేహోద్ధవ్యోద్భేదక దత్త!
శరీరదోషాదర్శక దత్త!
తనుసాఫల్యద్యోతక దత్త!
ఋచీకాతప ఆఖ్యాపక దత్త!
భాషితసున్దాసురమృత దత్త!
50. జల్పితవైశ్యోత్తమగత దత్త!
అభిహితవిట్ సుతదుర్గత దత్త!
51. నానాధర్మద్యోతక దత్త!
52. నిషేధవిధిసందర్శక దత్త!
53. వైష్ణవధర్మదర్శక దత్త!
54. సన్మాహాత్మ్యద్యోతక దత్త!
55. మాఘస్నానఖ్యాపక దత్త!
56. భాషితరాక్షసమోచన దత్త!
సుకృతోత్సుకజనరోచక దత్త!



## VIII

57. సోమకీర్తినృపతారక దత్త!
అధర్మసాధ్వసహారక దత్త!
వర్ణాశ్రమవృషకారక దత్త!
బ్రహ్మచారివృషబోధక దత్త!
58. గృహస్థధర్మద్యోతక దత్త!
59. శ్రాద్ధసుపద్ధతిదర్శక దత్త!
60. దర్శితసత్తిథినిర్ణయ దత్త!
61. కృతదుష్కర్మవినిర్ణయ దత్త!
ప్రాయశ్చిత్తస్థాపక దత్త!
62. కర్మవిపాకజ్ఞాపక దత్త!
63. సత్సంస్కారద్యోతక దత్త!
వనస్థతప ఆదర్శక దత్త!
64 పంచప్రలయాసంగత దత్త!
సమ్మతసంన్యాసాశ్రమ దత్త!

ఇతి భజనమ్। గ్రంథవిషయానుక్రమణికా చ సంపూర్ణా.

శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

ప్రథమాష్టకము - ప్రథమాధ్యాయము

**శ్లో॥ అగ్నిమీళే పరం దేవం యజ్ఞస్య త్వాం త్ర్యధీశ్వరమ్ ।**
**స్తోమోఽయమగ్రియోఽర్థ్యస్తే హృది స్పృగస్తు శన్తమః ॥ 1**

**ప్రతిపదార్థం :** యజ్ఞస్య = యజ్ఞముయొక్క, దేవమ్ = దేవుని, పరమ్ = పరమునకు హేతువైన, త్ర్యధీశ్వరమ్ = అగ్ని, వాయు, ఆదిత్యులను నియంత్రించువాడైన, లేక, సత్త్వరజస్తమో గుణత్రయమును నియంత్రించువాడైన, త్వాం అగ్నిమ్ = అగ్ని స్వరూపుడవైన నిన్ను, ఈళే = ప్రార్థింతును. అయం స్తోమః= ఈ స్తోత్రము, అగ్రియః (అగ్ర్యః) = అన్నిటికి ముందున్నదై, శంతమః = పరమకల్యాణప్రదమై, అర్థ్యః = అర్థముల నుండి వైతొలగనిదిగ, తే = నీ యొక్క, హృది = హృదయమునందు, స్పృక్ = తాకునది, అస్తు = అగుగాక!

**తాత్పర్యం :** అగ్ని స్వరూపుడవైన నిన్ను ప్రార్థింతును. నీవు యజ్ఞగమ్యుడవైన దేవుడవు. పరమునకు హేతువైనవాడవు; ఇహమున సత్త్వరజస్తమోగుణములను, అగ్నివాయురాదిత్యులను నియంత్రించువాడవు. ఈ స్తోత్రము నీ హృదయమును తాకి, ముందుండి నడిపించునదై, పరమకల్యాణప్రదమై, ధర్మ, అర్థ, కామ, మోక్షములను నాల్గుపురుషార్థములనుండి తొలగిపోనీయనిది అగుగాక! *

**శ్లో॥ అయం దేవాయ దూరాయ గిరాం స్వాధ్యాయ సాత్వతామ్ ।**
**స్తోమోఽస్త్వనేన విన్దేయం తద్విష్ణోః పరమం పదమ్ ॥ 2**

**ప్ర :** అయం స్తోమః = ఈ స్తోత్రమును, దేవాయ = స్వయంప్రకాశుడైన, గిరామ్ = వాక్కులకు, దూరాయ = విషయదూరుడైనవానికై, సాత్వతామ్ = భక్తులకు, స్వాధ్యాయ = మిక్కిలి ఆరాధించుటకు, అస్తు = అగుగాక!, అనేన = దీనిచేత, తత్ విష్ణోః = ఆ విష్ణునియొక్క, పరమం పదమ్ = పరమమైన స్థానము, విన్దేయమ్ = పొందెదము.

**తా :** ఈ స్తోత్రము స్వయంప్రకాశుడును వాగ్విషయదూరుడును అయిన దేవుడు భక్తులకు ఆరాధనలో మిక్కిలి చేరువయగు గాక! దీనిచే ఆ విష్ణుని పరమపదము పొందుదుము. *

**శ్లో॥ ఏతా యా లౌకికాః సన్తు హీనా వాచోఽపి నః ప్రియాః ।**
**బాలస్యేవ పితుస్తే త్వం స నో మృళ మహాన్ అసి ॥ 3**

**ప్ర :** ఏతాః = నానా రీతులైన, యాః లౌకికాః వాచః = యే లౌకికమైన వాక్కులు, హీనాః అపి =చాలనివైనను, బాలస్య = కుమారుని మాటలు, పితుః ఇవ = తండ్రికివలె, తే = నీకు, ప్రియాః = ఇష్టమైనవి, సన్తు = అగుగాక!. సః త్వమ్ = పితృసముడవైన నీవు, నః = మమ్ము, మృళ (మృడ) = సుఖింపజేయుము. (తథా = అట్లుగా), మహాన్ అసి = పూజ్యుడవగుచున్నావు.

**తా :** మా ప్రార్థనలు లౌకికవాక్కులు. కావున నానారీతులై యుండును. ఆ కారణమున మా భక్తిభావమును వ్యక్తీకరింప నశక్తములగును. అట్లయినను, నీవు పితృస్థానీయుడవు కావున పూజ్యుడవుగా, మా అశక్తతను మాటలు చక్కగా నేర్వని కుమారుని వాక్కులుగా ముద్దుజేసి మన్నింపుము. ఇట్లు మమ్ము సుఖింపజేయుము. నీకు మృడుడను నామము, **మృడతి సుఖయతీతి మృడః,** సుఖింపజేయువాడవనియే కదా సార్థకమైనది. *

**శ్లో॥ అయం వాం నాత్మనోస్తత్త్వమధిగమ్యాస్తి దుర్మనాః ।**
**హృద్రోగం మమ సూర్య త్వం హరిమాణం చ నాశయ ॥ 4**

**ప్ర :** అయమ్ = ఈ భక్తుడు, వాం తత్త్వమ్ = మీ ఇర్వురి తత్త్వమును, న అధిగమ్య = తెలియక, దుర్మనాః అస్తి = చెదిరిన మనస్సుగలవాడైయున్నాడు. సూర్య = ఓ సూర్య దేవా!, ఆత్మనః = నా ఆత్మవైన, త్వమ్ = నీవు, హరిమాణమ్ = హరించుచున్న, మమ హృద్రోగం చ = నా హృదయరోగమును గూడ, నాశయ = నశింపజేయుము.

**తా :** ఈ భక్తుడు మీ ఇద్దరి సారభూతసత్యమును తెలియనివాడై మనస్సు చెదిరి యున్నాడు. ఓ సూర్యదేవా! నా ఆత్మవైన నీవు నన్ను హరించుచున్న నా యీ హృద్రోగమును నశింపజేయుము. *

**శ్లో॥ ప్రమన్మహేఽస్మాన్విద్ధీతి స్తోతారస్తే వయం నమః ।**
**భగవో దేవ తే స్తోమమారే అస్మే చ శృణ్వతే ॥ 5**

**ప్ర :** (భో) భగవః = ఓ భగవంతుడా!, అస్మాన్ = మమ్ములను, విద్ధి = తెలియుము, ఇతి = అని, ప్రమన్మహే = యాచించుచున్నాము. వయం తే స్తోతారః = నిన్ను స్తుతించువారమైన మేము, (భో) దేవ = ఓ దేవా!, ఆరే = బహిర్ముఖులమై దూరస్థులమైన, అస్మే = మా యొక్క, స్తోమం చ = స్తోత్రమును గూడ, శృణ్వతే = వినుచున్న, తే = నీకు, నమః = నమస్కారము.

**తా :** ఓ భగవాన్! మమ్ము గుర్తించుమని వేడుకొనుచున్నాము. మేము నిన్ను స్తుతించువారము. ఓ దేవా! బహిర్ముఖులమై నీకు మేము దూరస్థులమైనాము. అయినను, నీవు మా స్తోత్రమును వినుచునే ఉన్నావు. నీకు నమస్కారము. *

**శ్లో॥ ఇంద్రో మదాయ యాతీహ స్తవరం సోమినో యథా ।**
**స్తోతౄనేహి తథాస్మాంస్తే మాధ్వీర్గావో భవన్తు నః ॥ 6**

**ప్ర :** ఇహ = లోకమున, యథా = ఏ విధముగ, ఇంద్రః = ఇంద్రుడు, సోమినః = సోమయాగము చేయువాడైన, మదాయ = మదము కొరకు (సోమరసము కొరకు), పరమానందము కొరకు, స్తవరమ్ = స్తవము చేయువానిని, యాతి = అనుగ్రహించుచున్నాడో, తథా = ఆ విధముగ, స్తోతౄన్ = స్తోత్రము చేయువారైన, అస్మాన్ = మమ్ము, ఏహి = అనుగ్రహించుము. నః = మా యొక్క, గావః = స్తోత్రరూపములైన గోవులు, తే = నీకై, మాధ్వీః = రసవంతములు, మధురములు, భవన్తు = అగుగాక!

**తా :** లోకంలో సోమరసంకొరకు, పరమానందంకొరకు సోమయాగముచేయు సోమయాజి ప్రార్థన నాలించి ఇంద్రుడు ఎట్లనుగ్రహించునో, అట్లే, నిన్ను స్తోత్రముచేయు మమ్ము నీ వనుగ్రహించుము. మా స్తోత్రములు గోవులెట్లు తమ పాలను ప్రసన్నులై అనుగ్రహించునో, అట్లే మా స్తోత్రములు గోవులై నిన్ను సంతోషింపజేయుగాక! *

**శ్లో॥ ద్వే విరూపేఽత్ర మాయాయాస్తేఽత్ర మగ్నోఽస్మి పీడితః ।**
**మాభితః సన్తపన్తీహ సపత్నీరివ పర్శవః ॥ 7**

**ప్ర :** తే మాయాయాః = మాయవైన నీకు, ద్వే = రెండు, విరూపే = పరస్పరవిరుద్ధమైన రూపములు (కలవు); అత్ర = ఆ రెండిటిలో, మగ్నః (సన్) = మునిగినవాడనై, పీడితః = పీడింపబడినవాడను, అస్మి = అగుచున్నాను; ఇహ = ఈ విషయమున, మా అభితః = నా సమక్షమున, సపత్నీః ఇవ = సవతులవలె, పర్శవః = మనోవ్యథలు, సంతపన్తి = బాధించుచున్నవి.

**తా :** అమ్మా మాయా! నీకు పరస్పరవిరుద్ధములైన రెండు రూపములున్నవి. ఈ రెండిటి మధ్య నేను కొట్టుమిట్టాడుచున్నాను. ఈ కారణమువలన అనేకములైన మనోవ్యథలతో సవతుల పోరులో నలిగిపోవు మగనివలె నేను పీడితుడను. *

**శ్లో॥ ఇదం శ్రేష్ఠమపి ప్రాప్య జన్మ గన్తాధ ఏవ తత్ ।**
**కురు ప్రసాదం జ్ఞాత్వైతత్తేనాహం భూరి చాకన ॥ 8**

**ప్ర :** శ్రేష్ఠమ్ = ఉత్తమమైన, ఇదం జన్మ = ఈ జన్మను, ప్రాప్య అపి = పొంది కూడ, అధః = పతనదిశగా, గన్తా = సాగుచున్న, తత్ = ఆ కారణముగా, ఏతత్ = ఈ సత్యమును, జ్ఞాత్వా = తెలిసికొని, ప్రసాదమ్ = అనుగ్రహము, కురు = చేయుము; తేన = దానిచే, అహమ్ = నేను, భూరి = అత్యున్నతముగ, చాకన = కోరుదును.

**తా :** ఈ ఉత్తమమైన మానవజన్మను పొంది కూడ అధోగతిగా సాగుచున్న కారణంగా ఈ సత్యము నెఱిగించుటచే నేను ఉత్తమకామ్యమును పొందుదును. *

**శ్లో॥ ప్రవస్తుజ్ఞానాజ్జహాతి నిష్కామశ్చేన్మృతిం త్వహమ్ ।**
**నా తాదృశోఽతః కామాది సర్వం రక్షో నిబర్హయ ॥ 9**

ప్ర : ప్రవస్తు = ఉత్తమవస్తువులయొక్క, జ్ఞానాత్ = జ్ఞానమువలన, నిష్కామః చేత్ = కోరికలేనివాడైన యెడల, మృతిమ్ = మృత్యువును, జహాతి = విడచివేయును; అహం తు = నేనైతే, న తాదృశః = అట్టివాడను కాను; అతః = అందువలన, సర్వం కామ+ఆది రక్షః = కామము మొదలుగాగల పీడకశక్తులను, నిబర్హయ = అంతమొందించుము.

**తా :** ఉత్తమజ్ఞానమును పొందిన కారణముగా కోరికలేని కర్మయోగియైనచో మృత్యువును విడచును. నేనైతే అట్టి జ్ఞానిని కాను. ఆ కారణముగా, కామక్రోధలోభమోహమదమాత్సర్యములు అను పేర్లుగల నన్ను పీడించు శక్తిగల రాక్షసులను అంతమొందించుము.

**శ్లో॥ సుషుమామూర్ధియః స్తోమైరాగచ్ఛైతే వయం విభో! ।**
**త్వదంశాస్త్వం పతిర్నోఽసి దేవో దేవేషు మేధిరః ॥ 10**

ప్ర : ఆగచ్ఛ = రమ్ము, విభో! = ఓ సర్వవ్యాపీ!, ఏతే వయమ్ = అట్టి మేము, స్తోమైః = స్తోత్రములతో, అమూర్ధియః = ఈ మనోవృత్తులను, సుషుమ = శోధింతుము, త్వత్ = నీ యొక్క, అంశాః = అంశలము, దేవేషు = దేవతలలో, మేధిరః = మేధావియైన, దేవః = దేవుడవు, నః = మాకు, పతిః = పాలకుడవు, అసి = అగుచున్నావు.

**తా :** ఓ సర్వవ్యాపీ! రమ్ము. మేము స్తోత్రములతో మా మనోవృత్తులను శోధింతుము. మేము నీ అంశలము. దేవతలలో మేధావియైన దేవుడవు మాకు పాలకుడవగుచున్నావు. *

**శ్లో॥ వసూ రూపం రూపమిహ ప్రతిరూపోఽసి నో పృథక్ ।**
**ఏతాని భూతాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః ॥ 11**

ప్ర : వసూ రూపమ్ = ఆత్మరూపము, రూపం ప్రతిరూపః = ఆత్మకు ప్రతిబింబరూపము గలవాడవు, అసి = అగుచున్నావు; యే మనీషిణః = మననశీలురైన వారగు, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు (వారు), ఏతాని భూతాని = ఈ భూతములను, నో పృథక్ విదుః = వేరైన వానినిగా గుర్తించరు.

**తా :** నీవు ఆత్మరూపుడవు. ఆత్మకు ప్రతిబింబరూపముగా నీవే యీ సమస్త భూత ప్రకృతివి కూడ అయి యున్నావు. మననశీలురైన బ్రాహ్మణులు యీ విషయము నెఱుగుదురు కావున నీవు వేరు, యీ భూతప్రకృతి వేరు, అని భావించక, సర్వము ఆత్మవైన నీవే యని తెలియుదురు. *

**శ్లో॥ తం ను త్వాం కిం బ్రువేఽల్పజ్ఞో భగవన్తం క్షమస్వ భోః! ।**
**ఓషమాగహి మాం త్వం చేత్సఖా సన్నతిమన్యసే ॥ 12**

ప్ర : భోః! = ఓ స్వామీ!, అల్పజ్ఞః (అహం) = అల్పజ్ఞుడను (నేను), తం భగవన్తమ్ = అంతటి

భగవంతుడవైన, త్వామ్ = నిన్ను గూర్చి, ను = నిశ్చయముగా, కిం బ్రువే = ఏమి చెప్పగలను?; క్షమస్వ = మన్నింపుము; సఖా సన్ = సఖుడవై, మామ్ = నన్ను, అతిమన్యసే చేత్ = ప్రియునిగా భావింతువేని, ఓషమ్ = శీఘ్రముగ, ఆగచ్ఛ = రమ్ము.

**తా :** ఓ స్వామీ! అల్పజ్ఞుడనైన నేను సర్వజ్ఞుడవైన నిన్ను గూర్చి యేమి చెప్పగలను? నన్ను మన్నించుము. సఖునిగా నన్ను ప్రేమింతువేని, శీఘ్రముగ రమ్ము. *

**శ్లో॥ తా వాసనా ఘ్నన్తి యథా వృశ్చికస్యారసం విషమ్ ।**
**అతో మాం పామి భూయిష్ఠాం నమ ఉక్తిం విధేమ తే ॥ 13**

**ప్ర :** తాః వాసనాః = అనిర్వచనీయమైన ఆ పూర్వజన్మవాసనలు, యథా = ఎట్లు, వృశ్చికస్య = తేలుయొక్క, అరసం విషమ్ = ఆనందకారకము గాని విషము, ఘ్నన్తి = చంపుచున్నదో (అట్లు చంపుచున్నవి). అతః = ఆ కారణమున, మామ్ = నన్ను, పాహి = రక్షించు. తే = నీ కొరకు, భూయిష్ఠామ్ = గొప్పనైన, నమ ఉక్తిం = స్తోత్రమును, విధేమ = చేయుదును.

**తా :** తేలు విషమెట్లు సంతోషము నివ్వక ప్రాణము తీయునో అట్లే ఇవి యిట్లని తెలియని పూర్వజన్మసంస్కారములు (లేక సంచితకర్మ) చంపుచున్నవి. కావున నన్ను రక్షించుము. నిన్ను గొప్పగా స్తోత్రము చేయుదును. *

**శ్లో॥ ని హోతా సీదసి విభో! యస్త్వం యష్టుర్గృహే ప్రియ! ।**
**తం త్వాహ్వయే జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే ॥ 14**

**ప్ర :** విభో! = ఓ సర్వవ్యాపీ!, యః త్వమ్ = యే నీవు, యష్టుః = యజ్ఞము చేయు యజమానియొక్క, గృహే = గృహమునందు, హోతా (సన్) = హోతరూపమున, నిషీదసి = అనుగ్రహించుచున్నావో, ప్రియ! = ఓ ప్రియుడా!, బ్రహ్మణామ్ = అన్నము మొదలగువానికి, బ్రహ్మణః = వేదమునకును, పతే = పతి, పాలకుడునైన, జ్యేష్ఠరాజమ్ = సర్వోన్నతుడవైన, తం తు త్వా = అట్టి నిన్ను, ఆహ్వయే = ఆహ్వానింతును.

**తా :** ఓ సర్వవ్యాపీ! నిన్ను ఆహ్వానించుచున్నను. నీవు యజమాని గృహములో హోతరూపమున నుండి అనుగ్రహించుచున్నావు. ఓ ప్రియుడా! అన్నమునకు, వేదమునకు గూడ నీవే పాలకుడవు. నీవు సర్వోన్నతుడవు. *

**శ్లో॥ సేమామవిడ్ఢి ప్రభృతిమీశిషే యోఽవ మానిశమ్ ।**
**త్వం విశ్వేశాం యదీశానో బ్రహ్మణా వేషి మే హవమ్ ॥ 15**

**ప్ర :** సః త్వమ్ = అట్టి నీవు, ఇమాం ప్రభృతిమ్ = ఈ ప్రకృష్టభృతిని, అవిడ్ఢి = స్వీకరించుము; యః ఈశిషే = ప్రభుత వహించు కారణమున, అనిశమ్ = ఎల్లవేళల, మా = నన్ను, అవ = కాపాడుము; యత్ = ఏ కారణమున, విశ్వేశాం (విశ్వేషాం) = అందఱకు, ఈశానః = ఈశ్వరుడవు,

(అసి = అగుచున్నావో), బ్రహ్మణా = స్తోత్రముతో, మే = నా యొక్క, హవమ్ = ఆహ్వానమును, వేషి = కోరుచున్నావు.

**తా :** అట్టి నీవు నేను సమర్పించు ఈ ఉత్తమహవిస్సును చేకొనుము. నీవు ప్రభువైనందువలన ఎల్లవేళల నన్ను కాపాడుము. నీవు అందఱకును ఈశ్వరుడవు అందువలన స్తోత్రముతో (మంత్రకృతముగా) నే నర్పించు ఆహ్వానము నీకు ప్రీతికరమే. *

**శ్లో॥ మన్దః స్వకోఽయం దీనోఽజ్ఞ ఇతి విద్వాన్ భవాన్ ప్రభుః ।**
**ఇన్ద్ర ఆశాభ్యః పరి మాం సర్వాభ్యో అభయం కరత్ ॥ 16**

**ప్ర :** మన్దః = తెలివితక్కువ వాడు, దీనః = అర్థబలము, అంగబలము ఇత్యాది లేనివాడు, అజ్ఞః = అజ్ఞాని, (అపి = అయినప్పటికి), అయమ్ = వీడు, స్వకః = నావాడు, ఇతి = అని, విద్వాన్ = తెలిసి, ప్రభుః = సమర్థుడు, ఇన్ద్రః = పరమేశ్వరుడు అయిన, భవాన్ = తమరు, మాం పరి = నన్ను అన్ని దిక్కులనుండి, సర్వాభ్యః ఆశాభ్యః = సమస్తమైన కోరికలనుండి, అభయమ్ = భయములేనివానిగా, కరత్ = చేయుదువు గాక!

**తా :** వీడు తెలివితక్కువవాడు, యే బలమూ బలగమూ లేనివాడు, అజ్ఞాని అయినను వీడు నావాడు (నా భక్తుడు) అని తెలిసిన సమర్థుడవైన ఈశ్వరుడవు నీవు. కావున యే దిక్కునుండియు, యే కోరికవలనను నాకు భయము కలుగకుండ చేయుమని ప్రార్థన. *

**శ్లో॥ ప్ర య ఆరుపితాం భ్రాన్తిం త్వత్ప్రసాదాజ్జహాతి సః ।**
**విముచ్యతే తద్విప్రస్త్వాం జాగృవాంసః సమిన్ధతే ॥ 17**

**ప్ర :** యః = ఎవడు, త్వత్ = నీ యొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, ఆరుపితామ్ = ఆరోపింపబడిన. భ్రాన్తిమ్ = భ్రాన్తిని, ప్రజహాతి = విడచివేయునో, సః = ఆతడు, విముచ్యతే = విడువబడుచున్నాడు. తత్ =ఇట్లే కారణమున, విప్రాః = వివేకవంతులు, జాగృవాంసః = జాగరూకులైనవారు, త్వామ్ = నిన్ను, సమిన్ధతే = ఉపాసించుచున్నారు.

**తా :** నీ అనుగ్రహమువలన ఎవడు భ్రాన్తిని విడచిపెట్టునో, ఆతడు విశేషమైన ముక్తిని పొందు చున్నాడు. ఈ కారణమున వివేకవంతులు జాగరూకలై భగవానుడైన నిన్ను ఉపాసించుచున్నారు. *

**శ్లో॥ ఇచ్ఛన్తి దేవా అపి తే ప్రసాదాయ నృజన్మ తత్ ।**
**విద్వాన్నామాని తే దత్త! విశ్వాభిర్గీర్భిరీమహే ॥ 18**

**ప్ర :** దేవాః అపి = దేవతలు గూడ, తే = నీ యొక్క, ప్రసాదాయ = అనుగ్రహము పొందుటకై, నృ-జన్మ = మానవులుగా పుట్టుకను, ఇచ్ఛన్తి = కోరుచున్నారు. (హే) దత్త! = ఓ దత్త!, విశ్వాభిః = సమస్తమైన లౌకిక, సాంస్కృతికములైన, గీర్భిః = వాక్కులచే, తే = నీ యొక్క, నామాని = నామములను, విద్వాన్ = తెలిసికొని, తత్ = ఆ కారణముగ, ఈమహే = ప్రార్థింతుము.

**తా :** ఓ దత్త! దేవతలుగూడ నీ అనుగ్రహమును పొందు నిమిత్తము మానవులుగ జన్మించవలెనని కోరుకొందురు. ఆ కారణమున, అట్టి నరజన్మను పొందియున్న మేము మా సమస్త లౌకిక భాషాజ్ఞానమును, సాంస్కృతికాధ్యాత్మిక వాక్ శక్తిని ఉపయోగించి, తెలిసి నీ నామములను స్మరింతుము. *

**శ్లో॥ ఇన్ద్ర! త్వా భజతః సూరేర్దుర్లభం కిం తరామి తత్ ।**
**భక్త్యా క్లేశాది తే నావా గమ్భీరానుదధీరివ ॥ 19**

**ప్ర :** (హే) ఇన్ద్ర! = ఓ ఇంద్ర!, శ్రేష్ఠుడా!, దత్త!, త్వా = నిన్ను, భజతః = సేవించువారైన, సూరేః = పండితునకు, కిం దుర్లభమ్ = అసాధ్యమేమి?। తత్ = ఆ కారణమున, తే భక్త్యా = నీ భక్తియనబడు, నావా = నౌకచేత, గంభీరాః = గంభీరమైన, ఉదధీః = సముద్రములను, ఇవ = వలె, క్లేశ++ఆది = బాధలు మొదలైన వానిని, తరామి = తరింతును, దాటుదును.

**తా :** ఓ ఇంద్రుడా! దత్తా! నిన్ను సేవించు పండితునకు అసాధ్యమేదీ లేదు. ఆ కారణమున నీ భక్తినే నౌకగా గ్రహించి, సముద్రములవలె అపారములు, అగాథములునైన క్లేశములను తరింతును. *

**శ్లో॥ న తా రోద్ధుం ధియః శక్తా యోగేనాపి తతస్సదా ।**
**త్రాతారం ధీమహీశ! త్వాం ధియో యో నః ప్రచోదయాత్ ॥ 20**

**ప్ర :** తాః = రాగద్వేషాదులైన, ధియః = చిత్తవృత్తులను, రోద్ధుమ్ = అడ్డుకొనుటకు, యోగేన అపి = యోగసాధనలచేతనైనను, న శక్తాః = అశక్తులము। తతః = ఆ కారణమున, (హే) ఈశ! = ఓ ఈశ్వరా!, సదా = ఎల్లవేళల, త్రాతారమ్ = కాపాడువాడవైన, త్వామ్ = నిన్ను, ధీమహి = ధ్యానింతుము। యః = అట్లు ధ్యానింపబడినవాడవైన నీవు, నః = మా యొక్క, ధియః = చిత్తవృత్తులను, ప్రచోదయాత్ = ప్రేరణచేతువు గాక!

**తా :** కామక్రోధాది షడ్వర్గరూపమైన మా చిత్తవృత్తులను నిరోధించుటకు యోగసాధనలచేనైనను అశక్తులము. కావున, ఓ ఈశ్వరా!, ఎల్లవేళల మమ్ము కాపాడు నిన్ను ధ్యానింతుము. నీవు మా చిత్తవృత్తులను ధర్మబద్ధములగునట్లు ప్రేరేపించుము. *

**శ్లో॥ వైశ్వానరాయ దత్వాన్నం విధిలబ్ధం సదైవ తే ।**
**భవామో భజనే సక్తా అస్మాకం శృణుధీ హవమ్ ॥ 21**

**ప్ర :** వైశ్వానరాయ తే = వైశ్వానరాగ్నివైన నీకు, సదా ఏవ = ఎల్లకాలమును, విధి-లబ్ధమ్ = దైవవశమున లభించిన, అన్నమ్ = అన్నమును, దత్వా = సమర్పించి, భజనే = సేవయందు, సక్తాః = ఆసక్తిగలవారము, భవామః = అగుచున్నాము। అస్మాకమ్ = మాదైన, హవమ్ = ఆహ్వానమును, శృణుధీ (శృణుహి) = వినుము.

**తా :** నీవు వైశ్వానరాగ్నివై సర్వప్రాణులలో వ్యాపించియున్నావు; **అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః**, అని గీతావాక్యము కదా. అట్టి నిన్ను మాకు దైవవశమున లభించిన ఆహారముతో సత్కరించి సదా సేవించుచున్నాము. మా ఆహ్వానమును మన్నించి మమ్ము తరింపజేయుము. *

**శ్లో॥ ఏవా త్వామిన్ద్ర! విప్రాసో జాగృవాంసో విపన్యవః ।**
**స్తువన్త్యేభ్యో హి తే కోఽపి న జ్యాయా అస్తి వృత్రహన్ ॥ 22**

ప్ర : (హే) ఇన్ద్ర! = ఓ ఇంద్రుడా!, త్వాం ఏవ = నిన్నే, విపన్యవః = విశేషముగ స్తోత్రము చేయువారైన, జాగృవాంసః = అప్రమత్తులగు, విప్రాసః = మేధావులు, స్తువన్తి = స్తోత్రము చేయుచున్నారు. ఏభ్యః హి = ఈ స్తోత్రములకే, తే = నీకు, కః అపి = మరియొకడెవడైన, జ్యాయాన్ = మించినవాడు, అధికుడు, వృత్రహన్ = ఆవరణాజ్ఞానమును నశింపజేయువాడు, న అస్తి = లేదు.

**తా :** ఓ ఇంద్రుడా! అప్రమత్తులైన మేధావులు నిన్నే స్తోత్రము చేయుచున్నారు. ఈ స్తోత్రములకు యోగ్యుడైన వాడు వేరొకడెవడైన నిన్ను మించిన వాడు ఆవరించియున్న మా అజ్ఞానమును మాపువాడు లేడు. *

**శ్లో॥ ప్ర ఋభుభ్యో గృణద్భ్యస్తే మర్త్యేభ్యోఽప్యమృతత్వమిత్ ।**
**దత్తం స్మృత్వా తవ మనోరథ ఆయాతు పాజసా ॥ 23**

ప్ర : మర్త్యేభ్యః అపి = మానవులకైనను, తే గృణద్భ్యః = నిన్ను గ్రహించిన, ఋభుభ్యః = దేవతలకు, అమృతత్వమ్ = అమరత్వము, ప్రదత్తం ఇత్ (ఇవ) = ఇవ్వబడినదానివలె, స్మృత్వా = స్మరించి, తవ మనోరథః = నీ కోరిక, పాజసా = వేగముగా, ఆయాతు = వత్తువుగాక!

**తా :** పూర్వము దేవతలకు వలె నిన్ను గ్రహించిన మానవులకు గూడ అమరత్వమీయబడిన నీ సంకల్పమును స్మరించి వేగముగా వత్తువుగాక! *

**శ్లో॥ ఇదము త్యదిషం శ్రేయో యజ్జగ్ధ్వా పరితృప్యతి ।**
**సాధుస్తద్భజనం తేఽస్మే ఇషం స్తోతృభ్య ఆభర ॥ 24**

ప్ర : త్యత్ ఇదము (తత్ ఇదము) = అట్టి ఇదియే, ఇషమ్ = అన్నము, శ్రేయః = శ్రేష్ఠము, యత్ = దేనిని, జగ్ధ్వా = తిని, సాధుః = సాధువు, పరితృప్యతి = తృప్తిచెందుచున్నాడో, తత్ = అది, తే = నీకు, భజనం = సేవింపదగిన, ఇషమ్ = అన్నము, అస్మే స్తోతృభ్యః = స్తోత్రము చేయు మా కొరకు, ఆభర = ఇమ్ము.

**తా :** ఏ అన్నమును తిని సాధువు తృప్తి చెందుచున్నాడో ఆ అన్నమే శ్రేష్ఠమైనది. అదియే నీకును సేవింపదగినది. నిన్ను స్తోత్రము చేయు మాకును అట్టి అన్నమునే దయచేయుము. *

**శ్లో॥ త్వామగ్నే మాయినం మాయాం జేతారమపరాజితమ్ ।**
**హిత్వా కం శరణం యామః స నో బోధి శ్రుధీ హవమ్ ॥ 25**

**ప్ర :** (హే) అగ్నే = ఓ అగ్నీ!, మాయినమ్ = వశపరచికొనునదైన, మాయామ్ = మాయను, జేతారమ్ = జయించువాడవైన, అపరాజితమ్ = ఓటమినెఱుగని, త్వామ్ = నిన్ను, హిత్వా = విడిచి, కమ్ = ఎవనిని, శరణం యామః = శరణుజొచ్చెదము?, సః (త్వం) = అట్టివాడవగు నీవు, నః = మమ్ములను, బోధి = జ్ఞానవంతులుగా చేయుము, హవమ్ = ఆహ్వానమును, శ్రుధీ (శ్రుణు) = వినుము॥

**తా :** ఓ అగ్నీ! వశీకరణశక్తి గల మాయను నీవు జయింతువు. నిన్ను జయించునదేదియును లేదు. అట్టి నీవు మాకు జ్ఞానదానము చేయుము. మా ఆహ్వానమును చెవిబెట్టుము. నిన్ను గాక మేము వేరెవ్వరిని శరణు వేడగలము? *

**శ్లో॥ మహీ మహేశోఽజ్ఞానేన భవానవతు మావృతమ్ ।**
**యథా వై సూర్యం స్వర్భానుస్తమసావిధ్యదాసురః ॥ 26**

**ప్ర :** మహీ = బ్రహ్మాదులకు, జ్ఞానమునకు, బ్రహ్మాండమునకును, మహా+ఈశః = గొప్ప, పరమ ఈశ్వరుడవైన, భవాన్ = తమరు, అజ్ఞానేన = అజ్ఞానముచేత, ఆవృతమ్ = ఆవరించబడియున్న, మామ్ = నన్ను, అవతు = రక్షించుగాక!, యథా = ఏ విధముగ, ఆసురః = అసురుడైన, స్వర్భానుః = రాహువు, తమసా = చీకటితో, సూర్యమ్ = సూర్యుని, విధ్యత్ వై = ఆవరించునో, (తథా = అట్లే).

**తా :** నీవు మహేశుడవు : అనగా, బ్రహ్మాది మహనీయమూర్తులకు, ఆత్మజ్ఞానమునకు, బ్రహ్మాండమునకు ప్రభువు నీవు. కావున తమరు అజ్ఞానముచే ఆవరించబడిన జ్ఞానముతో, అసురుడైన రాహువు తన తమస్సుతో కప్పివేసిన సూర్యుని తేజస్సునావరించినట్లున్న, నన్ను రక్షింతురుగాక! *

**శ్లో॥ ప్రయుంజతి యదాత్మానం మనీషా మనసా సహ ।**
**తదైవ భవతైకాన్తం జానతా సఙ్గమేమహి ॥ 27**

**ప్ర :** యదా = ఎప్పుడు, మనసా సహ = మనస్సుతో కూడ, మనీషా = బుద్ధి, ఆత్మానమ్ = తనను తాను, ప్రయుంజతి = నిగ్రహించికొని ఈశ్వరునితో ఏకమగునో, తదా ఏవ = అప్పుడే, జానతా = సర్వజ్ఞుడవైన, భవతా = నీతో, ఏకాన్తమ్ = ఐక్యతను, సంగమేమహి = పొందుదుము.

**తా :** వివేకముతో మనస్సును నిగ్రహించి ఎప్పుడు ఆత్మ ఈశ్వరునితో మమైకమగునో అప్పుడే సర్వజ్ఞుడవైన నీతో ఐక్యత లభించును. *

**శ్లో॥ ఋతస్య గోపాస్త్వం దేహి మహ్యం శం యుఞ్జతే ధియః ।**
**భీతాయ నాథమానాయ ఋషయే సప్తవధ్రయే ॥ 28**

**ప్ర :** ఋతస్య = అనుభవించవలసిన కర్మఫలముయొక్క, గోపాః త్వమ్ = రక్షకుడవైన నీవు, ధియః = చిత్తవృత్తులను, యుంజతే = ఏకీకృతము చేసి, భీతాయ = భవభయముల గలవాడనైన, నాధమానాయ = ప్రార్థించుచున్నవాడనైన, ఋషయే = ఆత్మసాక్షాత్కారమునకై ప్రయత్నించు చున్నవాడనైన, సప్తవధ్రయే = సప్తవధ్రినైన, మహ్యమ్ = నా కొరకు, శమ్ = అత్యంత, పరమ సుఖమును, దేహి = ఇమ్ము.

**తా :** నీవు రక్షకుడవు. నేను సంసారభయభీతుడను, ఆత్మదర్శనాభిలాషిని, **సప్తవధ్రిని**, నిన్ను ప్రార్థించుచున్నవాడను. నేను అనుభవించక తీరని కర్మఫలమునుభవించుటలో నా చిత్తవృత్తులకు యోగమును కల్పించి, నాకు పరమ సుఖము కలుగజేయుము. *

**శ్లో॥ త్వం హి పాతాఽసి నో దత్త పరిబాధస్వ దుష్కృతమ్ ।**
**కామాదీన్యస్య బీజాని జహి రక్షాంసి సుక్రతో ॥ 29**

**ప్ర :** హి = ఎందులకనగా, త్వమ్ = నీవు, పాతా = రక్షకుడవు, అసి = అయి యున్నావు; (అందువలన), నః = మా యొక్క, దుష్కృతమ్ = దుశ్చర్యలను, పాపకర్మను, పరిబాధస్వ = తొలగించుము; అస్య = దీనియొక్క, బీజాని = విత్తనములైన, కామ = కామము, ఆదీని = మొదలగునవి, రక్షాంసి = సర్వభక్షకములైన రాక్షసులు; (వానిని), (హే) సుక్రతో! = ఓ భక్త దుష్కర్మనాశకక్రియాబుద్ధే శ్రీదత్త!, జహి = తొలగించుము.

**తా :** ఓ భగవాన్ దత్త! నీవు రక్షకుడవు, భక్తుల దుష్కర్మలను నశింపజేయువాడవు. కావున మా దుష్కర్మలను, వాని విత్తనములైన కామక్రోధలోభమోహమదమాత్సర్యములనబడు ఆరు ఆసురీ గుణకర్మలను మా నుండి తొలగింపుము. *

**శ్లో॥ పిబా సోమమితి శ్రుత్వా యష్టుర్హూతిం శుభం ద్రవత్ ।**
**ఆయాసి పురురూప! త్వమాసు గోషూపపృచ్యతామ్ ॥ 30**

**ప్ర :** సోమమ్ = సోమమును, పిబ = త్రాగుము, ఇతి = అని, యష్టుః = యజ్ఞముయొక్క, హూతిమ్ = ఆహ్వానమును, ద్రవత్ శుభమ్ = శీఘ్రశుభమును, శ్రుత్వా = విని, (హే) పురు-రూప! = ఓ యజ్ఞపురుషా!, త్వమ్ = నీవు, ఆయాసి = వచ్చుచున్నావు, ఆసు (ఆశు) = వెంటనే, గోషు = ఇంద్రియములతో గూడిన అన్తఃకరణములందు, ఉపపృచ్యతామ్ = బలమును కూర్చుగాక!

**తా :** సోమమును త్రాగు మని యజ్ఞమాహ్వానించగా, ఆ శుభమును శీఘ్రమే విని, ఓ యజ్ఞపురుషా! నీవు వచ్చుచున్నావు; వెంటనే మా ఇంద్రియములకును, అంతఃకరణములకును బలము గూర్తువు గాక! *

**శ్లో॥ ఇన్ద్రం వోతాన్యం న పృథఙ్మన్యే మాయాభిరిద్భవాన్ ।**
**పురురూప ఇతీక్షే త్వమమిత్రాన్ సుషహాన్కృధి ॥ 31**

ప్ర : ఇన్ద్రమ్ = దేవరాజైన ఇంద్రుని, వోత అన్యమ్ = అన్యునైనగాని, పృథక్ = (నీకంటె)వేరుగా, న మన్యే = తలంపను, భావించను; మాయాభిః ఇత్ = మాయలచేతనే, భవాన్ = తమరు, పురురూపః = బహురూపములు కలవారు, ఇతి = అని, ఈక్షే = చూతును, తెలియుదును; త్వమ్ = నీవు, అమిత్రాన్ = హితులుగానివారైన కామక్రోధాది శత్రువులను, సుషహాన్ = సుఖముగ సహించగలుగువానినిగా, కృధి = చేయుము.

**తా :** నీకంటె ఇంద్రుడు వేరు కాదని భావింతును. నీవు నీ మాయలచేతనే బహురూపములు ధరింతువని తెలియుదును. మాకు హితులుగానివారైన కామాది శత్రువులను మేము సుఖముగ సహించగల శక్తిని కలిగించుము. *

**శ్లో॥ యజ్ఞా యజ్ఞాధీశ సర్వే త్వన్మయా అపి తేషు నః ।**
**జపయజ్ఞో మతస్తేన సము పూష్ణా గమేమహి ॥ 32**

ప్ర : (హే) యజ్ఞాధీశ! = ఓ యజ్ఞప్రభూ! యజ్ఞాః = యజ్ఞములు, సర్వే = అన్నియు, త్వత్+మయాః అపి = నీ స్వరూపములే యైనను, తేషు = వానిలో, జపయజ్ఞః = జపరూపమైన యజ్ఞము, నః = మాకు, మతః = బుద్ధిసమ్మతము। తేన = ఆ జపయజ్ఞముతో, పూష్ణా = జగత్పాలకుడవైన నీతో, సమ్+ఉ = అఖండైక్యతనే, గమేమహి = పొందెదము.

**తా :** ఓ యజ్ఞాధీశా! యజ్ఞములన్నియు నీ స్వరూపములే. అయినను వానిలో మా మతికెక్కినది జపయజ్ఞము. కావున దాని నిమిత్తముననే జగత్పాలకుడవైన నీతో అఖండానందైక్యతను పొందెదము. *

**శ్లో॥ స్తుషే నరాప్యం తుష్టః సన్నథో యస్యా అయోముఖమ్ ।**
**మాయాం జిత్వా భవాంస్తాం మే విశ్వాహా శర్మ యచ్ఛతు ॥ 33**

ప్ర : నర+ఆప్యమ్ = నరులు పొందుటకు యోగ్యమైన నారాయణుని, స్తుషే = స్తోత్రము చేయుదును; తుష్టః సన్ = తృప్తిచెందినవాడై, అథో = తరువాత, యస్యాః = ఎవ్వతెకు, అయః = ఇనుమువలె కఠినమైన, ముఖమ్ = ముఖము కలదో, తాం మాయామ్ = ఆ మాయను, జిత్వా = గెల్చి, ఓడించి, విశ్వాహా = విశ్వములును, అహస్సులునైన, భవాన్ = తమరు, మే = నాకు, శర్మ = అత్యంతసుఖమును, యచ్ఛతు = ఇత్తురుగాక!

**తా :** నరులకు ప్రాప్యుడైన నారాయణుని స్తుతింతును. తృప్తి చెంది, ఏ మాయకు ఇనుమువలె కఠినమైన ముఖము కలదో ఆ మాయను జయించి, విశ్వాహములన్నియు నీవే యైన ఓ స్వామీ! నాకు మహాసుఖము నిమ్ము. *

**శ్లో॥ జుషస్వ స్తోమమీశైతే ప్రియాసః సన్తు సూరయః ।**
**వయం స్తోమప్రియానేన యచ్ఛా నః శర్మ దీర్ఘశ్రుత్! ॥ 34**

**ప్ర :** (హే) ఈశ! = ఓ ఈశ్వరా!, ప్రభూ!, స్తోమమ్ = స్తోత్రమును, సోమము, జుషస్వ = సేవించుము; (హే) స్తోమప్రియ! = ఓ స్తోత్రప్రియా, ఓ సోమప్రియా!, ఏతే (ఏతేన) = వీనిచే, ప్రియాసః = ప్రియులము, సూరయః= భక్తులము, వయమ్ (అపి) = మేమును, సన్తు = అగుదుము గాక!, (హే) దీర్ఘశ్రుత్ = ఓ దూరమునుండి వినగలుగువాడా!, అనేన = దీనిచే (ఈ స్తోత్రముచే, ఈ సోమముచే), నః = మాకు, శర్మ = అత్యంత సుఖమును, యచ్ఛ = ఇమ్ము.

**తా :** ఓ ఈశ్వరా! నీ వీ సోమమును (స్తోత్రమును) స్వీకరించుము. ఓ సోమప్రియా! (స్తోత్రప్రియా!) వీనిచే మేమును నీ భక్తులమై, ప్రియులమై యుందుముగాక! ఓ దూరశ్రవ! దీని మూలమున మాకు అత్యంతసుఖమును దయసేయుము. *

**శ్లో॥ ఉగ్రో జజ్ఞే మృత్యురయమదుగ్ధా ఇవ ధేనవః ।**
**ధియో మేఽనేనేదృగీశ! న జాతో న జనిష్యతే ॥ 35**

**ప్ర :** ఉగ్రః = భయంకరుడైన, మృత్యుః = మృత్యువు, జజ్ఞే = తెలిసికొనెను; అనేన = దీనిచే, మే = నా యొక్క, ధియః = చిత్తవృత్తులు, ధేనవః = పాడి ఆవులు, అదుగ్ధాః ఇవ = పితుకబడని వానివలె (జాతాః = అయినవి), ఈదృక్ = ఇట్టివాడు, (హే) ఈశ! = ఓ ఈశ్వరా!, న జాతః = పుట్టలేదు, న జనిష్యతే = పుట్టబోడు॥

**తా :** ప్రమాదము లేక పొరబాటు అను యీ భయంకరమృత్యువు తెలిసికొనెను. దీనిచే నా చిత్తవృత్తులు పితుకబడని పాడియావులవలె నిరుపయోగమై పోయినవి. ఇట్టి మృత్యుతుల్యమైన పొరబాటును పోలిన మరియొక దానిని ఈశ్వరుడు పూర్వము సృష్టించలేదు, ఇక సృష్టించబోడు. *

**శ్లో॥ ప్రబ్రహ్మైహీదమాకర్ణ్యోర్వారుకమివ బన్ధనాత్ ।**
**మృత్యుఞ్జయ! ప్రమాదాఖ్యాన్మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్ ॥ 36**

**ప్ర :** ప్ర = ఉత్తమమైన, ప్రకృష్టమైన, బ్రహ్మ = స్తోత్రమును, ఇదమ్ = దీనిని, ఆకర్ణ్య = విని, ఏహి = రమ్ము; బంధనాత్ = బిగిసిన కట్లనుండి, ఊర్వారుకం ఇవ = దోసపండును వలె, ప్రమాద+ఆఖ్యాత్ = పొరబాటు (ప్రమాదము) అను పేరుగల మృత్యోః = మృత్యువునుండి, ముక్షీయ = విడిపించుము; అమృతాత్ = మోక్షమునుండి, మా (ముక్షీయ) = విడిపించకుము, (హే) మృత్యుంజయ! = ఓ మృత్యుంజయా!

**తా :** ఓ మృత్యుంజయా! ఉత్తమమైన ఈ స్తోత్రమును విని రమ్ము; దోసపండు దాని తొడిమనుండి విడబడునట్లు మమ్ము ప్రమాదము (పొరబాటు) అను ఈ మృత్యువునుండి విడబడ జేయుము. మోక్షము ననుగ్రహించుము. *

**శ్లో॥ యదద్య వర్ష్మ తేనైవ పశ్యేమ శరదశ్శతమ్ ।**
**స్తోత్రాయ తే హతే మృత్యౌ జీవేమ శరదశ్శతమ్ ॥ 37**

**ప్ర :** యత్ = ఏది, అద్య = నేడు, వర్ష్మ = శరీరమో, తేన ఏవ = దానితోడనే, శతమ్ = నూరు, శరదః = శరదృతువులను, పశ్యేమ = చూతుము; మృత్యౌ = మృత్యువు, హతే (సతి) = మరణించినది కాగా, తే = నీ యొక్క, స్తోత్రాయ = స్తోత్రము చేయుటకై, శతమ్ = నూరు, శరదః = శరదృతువులు, జీవేమ = జీవింతుము.

**తా :** నేడున్న ఈ శరీరము తోడనే నూరేండ్లు చూతుము. మృత్యువు లేనిదైనచో నీ స్తోత్రమునకై నూరేండ్లు జీవింతుము. *

**శ్లో॥ ప్రత్యుత్తమం మహేశ! త్వాం మనామహ ఇహాగహి ।**
**మృలా! సుక్షత్ర! మృళయ మా నో దుఃశంస ఈశత ॥ 38**

**ప్ర :** (హే) మహేశ! = ఓ మహేశ్వరా!, త్వాం ప్రతి = నిన్ను గూర్చి, ఉత్తమమ్ = ఉత్తముని గూర్చి, మనామహ (మనామహే) = యాచించుచున్నాము; ఇహ = ఇక్కడకు, ఆగహి (ఆగచ్ఛ) = రమ్ము; (హే) సుక్షత్ర! = ఓ మహాబలా!, (నః) మృళయ = మమ్ము సుఖవంతుల జేయుము; మృలా! = ఓ మృడా!, దుఃశంసః = దుష్కృతుల చర్యలు, నః = మాకు, మా ఈశత = కలుగకుండుగాక!

**తా :** ఓ మహేశా! ఉత్తముడవైన నిన్ను యాచించుచున్నాము. ఇక్కడకు రమ్ము. ఓ మహాబలా! మాకు సుఖము కలుగజేయుము. ఓ మృడా! దుర్జనుల చర్యల ఫలము మాకు కలుగకుండు గాక! *

**శ్లో॥ తిస్రో వాచస్తేఽత్ర వరాం క ఈశానం న యాచిషత్ ।**
**భక్త్యా గృణీమస్త్వాం స్తోత్రైస్తేభిర్నస్తూయమాగహి ॥ 39**

**ప్ర :** తే = నీకు, నీ యొక్క, తిస్రః వాచః = మూడు వాక్కులు (లక్షణములు), అత్ర = వానిలో, వరామ్ = శ్రేష్ఠమైనదానిని, కః = ఎవడు, న యాచిషత్ = యాచింపడు?; భక్త్యా = భక్తితో, స్తోత్రైః = స్తోత్రములతో, త్వాం ఈశానమ్ = ఈశ్వరుడవైన నిన్ను, గృణీమః = కొనియాడుదుము; తేభిః = ఆ స్తోత్రములతో, నః = మాకొరకు, తూయమ్ = శీఘ్రముగా, ఆగహి = రమ్ము.

**తా :** నీకు మూడు వేదరూపములు చెప్పబడినవి. క్రియా, భక్తి, జ్ఞానము లనబడు ఆ మూడిటిలో శ్రేష్ఠమైన భక్తిని కోరనివారెవరు? అట్టి భక్తితో ఈశ్వరుడవైన నిన్ను స్తోత్రము చేయుదుము. ఆ స్తోత్రములతో మాకై శీఘ్రమే రమ్ము. *

**శ్లో॥ దూరాద్విహాయ సర్వం త్వామృషయో యే చ తుష్టవుః ।**
**మర్తా అమర్త్యస్య తే తద్భూరి నామ మనామహే ॥ 40**

**ప్ర :** సర్వమ్ = సమస్తమును, విహాయ = విడచిపెట్టి, యే ఋషయః = ఋషులైన వారెవరో, తే చ = వారుగూడ, త్వామ్ = నిన్ను, తుష్టవుః = స్తుతించిరి; తత్ = ఆ కారణమున, మర్తా =

మరణము ధర్మముగా గలవారమైన మేము, అమర్త్యస్య = మర్త్యలోకధర్మములను విడచినవాడవైన, తే = నీ యొక్క, నామ = నామమును, భూరి = భవమును నశింపజేయసమర్థమైనంత గొప్పగా, మనామహే = స్మరింతుము.

**తా :** అన్ని ఉపాయములను విడచి ఋషులు, సర్వసంగపరిత్యాగులైనను, నిన్ను స్తుతించిరి. ఆ కారణమున మరణము ధర్మమై జీవించు మేము, అమరుడవైన నీ నామమును భవతాపనాశమునకై గొప్పగా స్మరింతుము. *

**శ్లో॥ య ఇన్ద్ర! త్వం యో నమసా స్వధ్వరో హీతి సంస్తుతః ।**
**ఇన్ద్రో బ్రహ్మేన్ద్ర ఋషిరిత్యుప బ్రహ్మాణి నః శ్రుణు ॥ 41**

**ప్ర :** (హే) ఇన్ద్ర! = ఓ ఈశ్వరా!, యః త్వం = యే నీవు, నమసా = నమస్కారముచేత, సు-అధ్వరః = శుభములిచ్చువాడవు, ఇతి = అని, సంస్తుతః = స్తుతించబడినవాడవు, (అసి = అయియున్నావు); ఇన్ద్రః హి = ఇంద్రుడే, బ్రహ్మ = బ్రహ్మ, ఇన్ద్రః = ఇంద్రుడు, ఋషిః = ప్రజాపతి, ఇతి = అని, నః = మా యొక్క, బ్రహ్మాణి = స్తోత్రములు, ఉపశ్రుణు = చెవియొగ్గి వినుము.

**తా :** ఓ ఈశ్వరా! నీవు నమస్కారప్రియుడవని, నమస్కారములందుకొని శుభములిత్తువని వేదము స్తోత్రము చేయుచున్నది. ఇంద్రుడే బ్రహ్మ, ప్రజాపతి యని నుతించు మా స్తోత్రములను దగ్గర నుండి చెవియొగ్గి వినుము. *

**శ్లో॥ వయము త్వా వరం దేవమస్మభ్యం శర్మ సప్రథః ।**
**మనామహే పృణన్తం తదభిత్వామిన్ద్ర! నోనుమః ॥ 42**

**ప్ర :** అస్మభ్యమ్ = మాకు, శర్మ = క్షేమమును, సప్రథః = ఇచ్చువాడవైన, త్వాం వరం దేవమ్ = శ్రేష్ఠుడవైన దేవుడవైన నిన్ను, పృణన్తమ్ = తృప్తిపరచుచు, మనామహే = ధ్యానింతుము; తత్ త్వా = అట్టి నిన్ను, అభి = గురించి, (హే) ఇన్ద్ర = ఓ ఇంద్రా!, వయం నోనుమః = మేము స్తుతింతుము.

**తా :** ఓ ఇంద్రా! నీవు మాకు క్షేమమును గూర్చువాడవు. శ్రేష్ఠుడవైనట్టి నిన్ను ధ్యానించి, నుతింతుము. *

**శ్లో॥ ప్రకృతాన్యపి సూక్తాని శృణ్వన్తం జాతవేదసమ్ ।**
**త్వాం గృణన్తి న కే త్వం హి యేషామిన్ద్రో యువా సఖా ॥ 43**

**ప్ర :** ప్రకృతాని అపి = ప్రాకృతములే యైనను, సూక్తాని = సూక్తములను, శృణ్వన్తమ్ = వినుచున్న, జాతవేదసమ్ = ప్రజ్ఞాపూర్ణుడవైన, త్వామ్ = నిన్ను, కే = ఎవరు, న గృణన్తి = తెలియకున్నారు?, యేషామ్ = ఎవరికి, త్వం = నీవు, యువా సఖా = నిత్యయౌవనముగల సఖుడవు, ఇన్ద్రః హి = ఇంద్రుడవే, (అసి = అయి యున్నావు).

**తా :** నీ వెవరికి నిత్యయౌవనుడవైన సఖుడవై యున్నావో, వారు పఠించు ప్రాకృతీసూక్తములను వినుచున్న పూర్ణప్రజ్ఞుడవైన ఇంద్రుడవే నీవని తెలియని వారెవరు? *

**శ్లో॥ త్వావతః పాహి నో మర్త్యాన్యత ఇన్ద్ర! భయామహే ।**
**ఆదిశ్య పదభక్తిం తే తతో నో అభయం కృధి ॥ 44**

**ప్ర :** త్వావతః = నీవారమైన, మర్త్యాన్ నః = మర్త్యులమైన మమ్ము, పాహి = కాపాడుము; (హే) ఇన్ద్ర! = ఓ ఇంద్రా!, యతః = ఏ సంసారమువలన, తే = నీ యొక్క, పదభక్తిమ్ = పాదసేవను, ఆదిశ్య = నిర్దేశించి, కలిగించి, అభయమ్ = భయములేని స్థితిని, కృధి = కలిగించుము.

**తా :** మేము మర్త్యులము, నీ వారము. ఈ సంసారము మమ్ము భయపెట్టుచున్నది. ఓ ఇంద్రా! మాకు నీ పాదభక్తి నొసగి భయములేని స్థితిని ప్రసాదించుము. *

**శ్లో॥ ఆ త్వా రథం న తురగైః స్తోత్రైః త్వాఽవర్తయామసి ।**
**స త్వం న ఇన్ద్ర మృళయ యస్య తే స్వాదు సఖ్యమిత్ ॥ 45**

**ప్ర :** రథం న తురగైః = గుఱ్ఱములు లేని రథమయిన, స్తోత్రైః = స్తోత్రములచే, త్వా = నిన్ను, ఆవర్తయామసి = సమీపమున నిల్పుదుము; సః త్వమ్ = అట్టి నీవు, నః = మమ్ములను, ఇన్ద్ర! = ఓ ఇంద్ర!, మృళయ = సుఖింపజేయుము; యస్య తే = ఆ నీవైన, సఖ్యమ్ = స్నేహము, స్వాదు ఇత్ = ముక్తిజనకమై అనుభవయోగ్యమే.

**తా :** ఓ ఇంద్రా! మా స్తోత్రములు గుఱ్ఱములు లేని రథములు. వానిపై నిన్ను రప్పించి మా చెంత నిల్పుకొందుము. అట్లు వచ్చి నిల్చిన నీవు మాకు పరమసుఖమును కలిగించుము. నీతోడి ఈ మా సఖ్యము ముక్తిప్రదమగును గాక! *

**శ్లో॥ ఆ ప్రబోధం భవోఽబోధః స్వప్నవద్దుఃఖదోఽశుచిః ।**
**పతితాన్ దుఃఖితాన్నౄన్నః పాహి త్వం శృణుధీ గిరః ॥ 46**

**ప్ర :** ఆ ప్రబోధమ్ = ఆదినుండియు, భవః = సంసారము, అబోధః = జ్ఞానమునకు విరోధి (జ్ఞానముకలుగనివ్వనిది), దుఃఖదః = దుఃఖదాయకము, స్వప్నవత్ = స్వప్నమువలె, అశుచిః = మలినమైనది, (తథా అపి = అట్లయినను), పతితాన్ = పతితులను, దుఃఖితాన్ = దుఃఖమునకు లోనైన వారిని, నౄన్ నః = నరులమైన మమ్ము, పాహి = కాపాడుము; త్వమ్ = నీవు, (నః) గిరః = మా స్తోత్రములను, శృణుధీ = వినుము.

**తా :** సంసారము పుట్టినది మొదలు జ్ఞానమును దరికి రానివ్వక, దుఃఖమును కలిగించుచు, కలవలె మలినమై యున్నది. కావున నరులమైన మేము పతితులము, దుఃఖితులము. నీవు మా ప్రార్థనలను మన్నించి మమ్ము కాపాడుము. *

**శ్లో॥ ఇన్ద్రాయ సామ తే గాతుం న క్షమో నామ తే గృణే ।**
**బణ్మహాన్ అసి సూర్య! త్వం సత్రా దేవ! మహాన్ అసి ॥ 47**

ప్ర : ఇన్ద్రాయ తే = ఇంద్రుడవైన నీ కొరకు, సామ = సామవేదమును, గాతుమ్ = గానముచేయుటకు, న క్షమః = సమర్థుడను కాను, తే నామ = నీ పేరును, గృణే = ఉచ్చరింతును, ఎఱుగుదును; (హే) సూర్య! = ఓ సూర్యుడా!, త్వమ్ = నీవు, బట్ = సత్యముగా, మహాన్ = గొప్పవాడవు, అసి = అగుదువు; (హే) దేవ = ఓ దేవా!, (త్వం = నీవు), సత్రా = సత్యమును ప్రకటింతువు, కర్మలలో ప్రేరణ కలిగింతువు.

**తా :** ఓ సూర్య! నీవు సత్యముగా గొప్పవాడవు (సత్యమంత గొప్పవాడవు): ఓ దేవా! నీవు సత్యమును ప్రకటించి, జ్ఞానమును కలిగించి, కర్మలో ప్రవర్తింపజేతువు. సామలను నీకై పాడుటకు సమర్థుడను కాను: నీ నామమును మాత్రము నే నెఱిగి పలుకగలను. *

**శ్లో॥ సోమః పునానోఽన్తారామో మయా త్వం నాధిలక్షితః ।**
**ఈక్షే తుచ్ఛాన్ బహిర్భోగాన్యోషా జారమివ ప్రియమ్ ॥ 48**

ప్ర : స+ఉమః = ఆత్మవిద్యాసహితుడవు, పునానః = పవిత్రీకరించువాడవు, అంతారామః (అంతర్+ఆరామః) = హృదయమున వసించువాడవు అయిన, త్వమ్ = నీవు, మయా = నా చేత, న అధిలక్షితః = కడపటి లక్ష్యముగా చేసికొనబడలేదు; (అతః = అందువలన), తుచ్ఛాన్ = నీచములయిన, బహిః+భోగాన్ = లౌకికభోగములను, యోషా = స్త్రీ, ప్రియం ఇవ = ప్రియుని వలె, జారమ్ = విటుని, ఈక్షే = చూచుచున్నాను.

**తా :** స్వామీ! నీవు ఆత్మవిద్యావంతుడవు; పవిత్రీకరించువాడవు, హృదయమున వసించు వాడవు. అయినను నిన్ను దెలిసి చేరుట లక్ష్యముగా నేను జీవించుట లేదు. అందువలన క్షణికములైన ఇంద్రియభోగములను, వ్యభిచారియైన స్త్రీ విటుని ప్రియుడని భ్రమించినట్లు, నేనును భావించు చున్నాను. *

**శ్లో॥ ప్రణ ఇన్దోరపి స్మేరం రూపం తే దర్శయామలమ్ ।**
**నౄన్ స్తోతౄన్ పాహ్యంహసో నో జహి రక్షాంసి సుక్రతో! ॥ 49**

ప్ర : ఇన్దోః అపి = చంద్రుని కంటెను, స్మేరమ్ = విప్పారినదైన, అమలమ్ = మలినములేనిదైన, తే = నీ యొక్క, ప్రణ = సనాతనమైన, రూపం = ఆకృతిని, నః = మాకు, ప్రదర్శయ = దర్శనమిమ్ము; (హే) సుక్రతో! = ఓ శుభమైన ప్రజ్ఞగలవాడా!, స్తోతౄన్ = స్తోత్రము చేయుచున్నవారైన, నౄన్ = నరులను, అంహసః = పాపమునుండి, బాధనుండి, పాహి = రక్షించుము; నః = మమ్ములను, రక్షాంసి = కామాది రాక్షసగుణములనుండి, జహి = విడిపింపుము.

**తా :** ఓ ప్రజ్ఞాశాలీ! నీవు చంద్రుని కంటె నిర్మలముగా విప్పారిన వాడవు. నీ రూపము సనాతనము.

మేము నిన్ను స్తోత్రము చేయుచున్నాము, నరులము. మాకు నీ శుభదర్శనమిమ్ము, కామక్రోధాది రాక్షసుల బారినుండి మమ్ము విడిపించి కాపాడుము. *

**శ్లో॥ హి న్వన్తి ద్వైతమస్త్యస్మాద్భయం విన్దతి మామిహ ।**
**యదన్తి దూరకే యచ్చ పవమాన వి తజ్జహి ॥ 50**

ప్ర : హి = ఏల యనగా, అన్తి = సమీపమున, ద్వైతం = ద్వయభావము, అస్తి = ఉన్నదో, అస్మాత్ = దానివలన, భయమ్ = భయము, మాం = నన్ను, విన్దతి = తెలియుచున్నది; (హే) పవమాన! = ఓ గార్హపత్యాగ్నీ!, యత్ = ఏది, అన్తి = సమీపమో, యత్ చ = ఏదియును, దూరకే = దూరమో, తత్ = దానిని, ను = వెంటనే, విజహి = విశేషముగా విడిపింపుము.

**తా :** అదేమనగా, ద్వయభావము మాకు అత్యంతసమీపమున ఉన్నది. కాగా, దానివలన మాకు భయము కలుగుచున్నది. ఓ గార్హపత్యాగ్నీ! మాకు సమీపమునగల ద్వైతమునుండి, దూరమున గల జ్ఞానమునిచ్చి, ఇహపరముల భయమునుండి, విడుదల ప్రసాదించుము. *

**శ్లో॥ ధర్తా కారకశక్తీనాం సర్వేషాం త్వమిహైక ఇత్ ।**
**యశోఽత్రేదం పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే ॥ 51**

ప్ర : (హే) బ్రహ్మణఃపతే = వేదశాసక! (కర్మజ్ఞానశాసక), ఇహ = ఇక్కడ, ఇప్పుడు, ఈ విశ్వంలో, సర్వేషామ్ = అన్నివిధముల, కారకశక్తీనామ్ = కార్యకారణశక్తులకు, ధర్తా = ధరించువాడవు, త్వమ్ = నీవు, ఏకః ఇత్ (ఏవ) = ఒక్కడవే; (అతః = ఆ కారణమున), అత్ర = లోకమునందు, ఇదమ్ = ఈ, పవిత్రమ్ = పవిత్రమైన, యశః = కీర్తి, వితతమ్ = వ్యాపించినది.

**తా :** ఓ వేదపాలకా! కర్మజ్ఞానశాసకా! ఈ సృష్టిలో అన్ని విధముల కార్యములకు ప్రేరకకారణశక్తులకు అధికారివి నీవు ఒక్కడవే. అందువలన నీకు పవిత్రమైన కీర్తి లోకమంతటనూ వ్యాపించియున్నది. *

**శ్లో॥ అసర్జి భవతా విశ్వమనిత్యమవశం బృహత్ ।**
**త్వం సంస్మర జ్ఞ! శరణ! వత్సం జాతం న ధేనవః ॥ 52**

ప్ర : (హే) జ్ఞ! = ఓ కర్మఫలమునెఱిగినవాడా!, (హే) శరణ = ఓ భక్తరక్షక!, భవతా = నీ మూలమున, అనిత్యమ్ = క్షణికమైనది, అవశమ్ = స్వతంత్రము కానిదియైన, బృహత్ = గొప్ప, విశ్వమ్ = విశ్వము, అసర్జి = సృష్టియైనది; త్వమ్ = నీవు, ధేనవః (ఇవ) = పాడియావులవలె, జాతమ్ = పుట్టిన, వత్సమ్ = దూడను, న = మరువక, సంస్మర = స్మరించుకొనుము.

**తా :** ఓ కర్మఫలమునెఱిగినవాడా! ఓ భక్తరక్షకా! ఈ క్షణికమైన, అస్వతంత్రమైన విశాలవిశ్వము నీ మూలమున (నీ నిమిత్తమున) సృష్టియైనది. పాడియావు తన దూడను మరువనట్లు నీవును నీ సృష్టియైన ఈ విశ్వమును మరువక స్మరించుకొనుము. *

**శ్లో॥ పురోజితీశ! భో భూమన్నత్ర మామమృతం కృధి ।**
**యత్రానన్దాశ్చ మోదాశ్చ ముదః ప్రముద ఆసతే ॥ 53**

ప్ర : (హే) పురః జిత! = ఓ పురమును జయించినవాడా!, (హే) భూమన్ ఈశ! = ఓ మహేశా!, యత్ర = ఏ తావున, ఆనన్దాః = పితృదేవతల ఆనందములు, చ = మరియు, మోదాః = దేవతల సంతోషములు, చ = మరియు, ముదః = ఇంద్రుని సంతోషము, (చ = మరియును), ప్రముదః చ = బ్రహ్మానందమును, ఆసతే = ఉండునో, తత్ర = ఆ తావున, మామ్ = నన్ను, అమృతమ్ = అమరునిగా, కృధి (కురు) = చేయుము.

**తా :** ఓ త్రిపురహరా! ఓ మహేశ్వరా! పితృదేవతలకు, దేవతలకు, ఇంద్రునకు, వారి వారి లోకముల ప్రత్యేకానందములు కలుగగా బ్రహ్మానందము లభించునో అట్టి తావున, అట్టి లోకమున (సత్యలోకమున) నాకు అమరత్వమును ప్రసాదించుము. *

**శ్లో॥ అయం స ఇతి విద్వాన్ సన్ యమాయ ధృతవద్ధవిః ।**
**కృతో జుహోమ్యతోఽదేవా యమాయ జుహుతా హవిః ॥ 54**

ప్ర : అయమ్ = ఈ ఆత్మ, సః = ఈశ్వరుడు, ఇతి = అని, విద్వాన్ సన్ = జ్ఞానవంతుడనగుచు, యమాయ = యమునికొరకు, ధృతవత్ = ధరించబడిన, హవిః కృతః = సహజమైన హవిస్సుగా, (ఈ శరీరమును), జుహోమి = వ్రేల్చుచున్నాను; అతః = అందువలన, యమాయ = యమునికై, హవిః = హవిస్సు, అదేవాః = ఓ మర్త్యులార! జుహుతా = వ్రేల్చుడు.

**తా :** ఈ ఆత్మయే ఈశ్వరుడు, ధరింపబడిన ఈ శరీరము యమునకు సహజమైన హవిస్సు, అను జ్ఞానముతో, ఓ మర్త్యులారా! హవిస్సును యమున కర్పింపుడు. *

**శ్లో॥ నివర్తధ్వమితో దేవా భద్రం నో అపి వాతయ ।**
**మనో హరే! మాం పాహ్యర్తం పితా పుత్రమివ ప్రియ ॥ 55**

ప్ర : (హే) దేవాః = ఓ దేవతలారా!, ఇతః = ఈ విషయసుఖములను, నివర్తధ్వమ్ = మరలించుడు; (హే) హరే! = ఓ సంసారదుఃఖహరా!, భద్రమ్ = క్షేమమును, నః = మా యొక్క, మనః అపి = మనస్సునకు గూడ, వాతయ = ప్రసరింపజేయుము; మామ్ = నన్ను, పుత్రమ్ = కుమారుని, పితా ఇవ = తండ్రివలె, పాహి = కాపాడుము.

**తా :** ఓ దేవతలారా! ఈ విషయసుఖములను నానుండి మరలింపుడు. ఓ సంసారదుఃఖనాశకా! మా మనస్సులకు గూడ క్షేమమును కలిగించుము; నన్ను కుమారుని తండ్రి కాపాడినట్లు కాపాడుము. *

**శ్లో॥ ప్రమా ప్రమాతా ప్రమేయం త్రిపుటీహ న విద్యతే ।**
**రూపం తేఽవికృతం సత్వం మధుమన్మే పరాయణమ్ ॥ 56**

**ప్ర :** ప్రమా = ప్రామాణికమైన యథార్థజ్ఞానము, ప్రమాతా = ఇంద్రియముల ద్వారా ప్రమను పొందు అంతఃకరణముతో కూడిన జీవుడు, ప్రమేయమ్ = నిస్సంశయముగ తెలియదగిన ఇంద్రియ విషయము, అను ఈ, త్రిపుటీ = మూడింటి కూడలి, ఇహ = ఈ అఖండత్వమున, న విద్యతే = కలుగదు; (ఇట్టి) తే రూపమ్ = నీ రూపము, అవికృతం సత్వమ్ = వికారములులేని శుద్ధ సత్వస్వరూపము, మధుమత్ = మధురమై, మే = నాకు, పరాయణమ్ = గమ్యమైనది.

**తా :** పరమాత్మ శుద్ధసత్వస్వరూపము, అఖండమునైన చైతన్యము. లౌకికవ్యవహారములలో ఉన్నట్లు ఇక్కడ తెలియువాడు, తెలిసికొనబడునది, తెలిసినది అను మూడు ఉండవు. పరమాత్మ స్వరూపము నిర్వికారము, అమృతమయము. అదియే నాకు గమ్యము. *

**శ్లో॥ ప్రహోతారోఽత్రైవ మనోన్వాహువామహ ఇత్యతః ।**
**గమాది మనసో నాస్య యో యజ్ఞస్య ప్రసాధనః ॥ 57**

**ప్ర :** అత్ర ఏవ = ఇక్కడనే, అభిచారమంత్రముతో మృతుని బంధువులు, మనోన్వాహువామహ = మనోన్వాహువామహ, ఇతి = అని సమీపమునకు, ప్రహోతారః = భూతయజ్ఞము చేయువారలు (పలుకుదురు), అతః = ఆ కారణమున, గమ+ఆది = గమ మొదలగున దంతయు, మనసః = మనస్సుననే, యః = ఏది, యజ్ఞస్య = యజ్ఞసంబంధి, ప్రసాధనః = ప్రకృష్టసాధనమో, (తత్ = అది), అస్య = ఆత్మకు చెందినది, న = కాదు.

**తా :** నిత్యము భూతయజ్ఞము చేయువారు 'మనోన్వాహువామహ' అనుచు యే అభిచారమంత్రముతో గతించినవానిని బంధువులు తలంచుచున్నారో ఆ గమాది సర్వము మనస్సంబంధి సాధనమే తప్ప ఆత్మ సంబంధి సాధనము కాదు. *

**శ్లో॥ యే యజ్ఞే నార్చన్త్యనేన సర్వే నన్దన్తి తే త్వయా ।**
**నాన్యేఽతస్త్వత్ప్రియా ఏవ విరూపాసో దివస్పరి ॥ 58**

**ప్ర :** యే = అధికారులైనవారెవరు, అనేన యజ్ఞేన = ఈ జ్ఞానయజ్ఞముచే, అర్చన్తి = అర్చించుచున్నారో, తే సర్వే = వారందరు, త్వయా = ఆత్మవైన నీతో, నన్దన్తి = ఆనందించుచున్నారు, న అన్యే = అన్యులు కారు; అతః = ఆ కారణమున, త్వత్ = నీ యొక్క, ప్రియాః = ప్రియులైనవారు, ఏవ = మాత్రమే, విరూపాసః = నామరూపప్రకాశనములేని, దివః+పరి = స్వయంప్రకాశులు.

**తా :** అర్హత గలవారు కొందరు నిన్ను యజ్ఞముచే జ్ఞానరూపముగ అర్చించుచున్నారు. వారందరు ఆత్మానందమును పొందుచున్నారు. జ్ఞానయజ్ఞముతో కాక కామ్యకర్మయజ్ఞములతో నిన్నారాధించు తదితరులు ఈ ఆత్మజ్ఞానమును పొందలేకున్నారు. అందువలన ఆత్మకు ప్రియులైనవారు మాత్రమే దైహిక నామరూపప్రకాశమున గాక, ఆత్మదైన స్వయంప్రకాశముతో వెల్గుచున్నారు. *

**శ్లో॥ దేవానాం ను వశే యోఽస్య సుమంగలీరియం వధూః ।**
**స్నేహేషు తచ్చ్యుతో భోగీ పతిర్బన్ధేషు బధ్యతే ॥ 59**

**ప్ర :** యః = ఎవడు, దేవానామ్ = ఇంద్రియములకు, వశే = వశవర్తియో, అస్య = ఆ బహిర్ముఖునకు, ఇయమ్ = ఈ అశుచిరూపయైన, వధూః = వధువు, సుమంగలీః = సుమంగలియును (బుద్ధికలుగును); (అట్టి) భోగీ = స్త్రీలోలుడు, స్నేహేషు = తన కామవాంఛాభోగములలోబడి, త్వత్ = ఆత్మవైన నీనుండి, చ్యుతః = దిగజారినవాడై, పతిః = తాను భోగించుచున్నానను అహంకారియై, బన్ధేషు = బంధములలో, బధ్యతే = కట్టబడుచున్నాడు.

**తా :** ఇంద్రియవశుడైన వానికి స్త్రీలౌల్యము శుభప్రదము, సుఖప్రదము అనిపించును. అట్టి భోగి కామవాంఛాపరుడై తన భార్యతోనైనను అతికాముడై ప్రవర్తించుచు, తన ఆత్మనుండి పతనమై, తాను భోగించుచున్న కర్తనని అహంకరించుచు, కామము నుండి క్రమముగ క్రోధలోభమోహమద మాత్సర్యములలో చిక్కుకొని, మోక్షమును పొందలేకుండును. *

**శ్లో॥ విహితం సర్వమిత్తే త్వమతో జ్యాయాంశ్చ పూరుషః ।**
**పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి ॥ 60**

**ప్ర :** సర్వం ఇత్ (ఏవ) = భూతభవిష్యవర్తమానములన్నియు, తే విహితమ్ = నీ విశేషకార్యమే। త్వమ్ = నీవు, జ్యాయాన్ చ = అధికుడవైన, ఉత్తముడవైన, పూరుషః = కర్తవే। విశ్వా భూతాని = భూతములైన విశ్వము, అస్య = నీ యొక్క, పాదః = పాదము, నాల్గవ భాగము; త్రిపాదస్య = (త్రిపాత్+అస్య) నీ యొక్క మూడు పాదములు (భాగములు), దివి = జ్యోతిరూపద్యోతనాత్మకమైన స్వరూపమునగల, అమృతమ్ = ముక్తి.

**తా :** కాలస్వరూపమైన భూతభవిష్యద్వర్తమానములు నీ కృతములే. ఈ త్రికాలములందలి, భూతములన్నియు నీ నాల్గవ పాదముయొక్క నామరూప ప్రకృతియైన విశ్వమే. దీనికతీతమైన నీ అమృతానంతజ్యోతిఃస్వరూపమే నీవైన మూడు పాదముల మేరగల ముక్తి.

ఏకాంశేన స్థితో జగత్, అను స్మృతి వాక్యము నిట స్మరింపదగును. *

**శ్లో॥ హయే! జాయే! ఇతి వదన్యా సాలావృకహృత్సమా ।**
**తన్మయో న స వేదాముమాత్మానం తవ పూరుష! ॥ 61**

**ప్ర :** యా = యే స్త్రీ, సాలావృకహృత్ = ఒక కుక్క లేక తోడేలు లేక లేడి లేక పిల్లి లేక గుంటనక్క లేక కోతి హృదయముతో, సమా = సమానమైనదో, (తాం ప్రతి = ఆమెను గురించి), హయే (అయే) జాయే = ఓసి భార్యా!, ఓసి నా బిడ్డలతల్లీ!, ఇతి = అని, వదన్ = పలుకుచు, తత్+మయః = ఆమెయే లోకమై, (యః = ఎవడుండునో), సః = ఆతడు, (హే) పూరుష! = ఓ పురుషుడా!, అముం తవ ఆత్మానం = ఈ నీ ఆత్మను, న వేద = తెలిసికొనలేదు.

**తా :** ఒక స్త్రీ హృదయమొక జంతు హృదయము. ఏ పురుషుడు తన ఆత్మను తెలిసికొనలేక స్త్రీలోలుడగునో, ఆతడు జంతుసమజీవి యగును. *

**శ్లో॥ ఉభా ఉపాధితోఽత్రైకః పాకేన మనసాన్తితః ।**
**త్వాం యదీక్షేత తం మాతా రేహిళ స ఉ రేహిళ మాతరమ్ ॥ 62**

**ప్ర :** ఉపాధితః = ఉపాధివలన, ఉభౌ = భేదమున రెండైనవి, అత్ర = ఈ రెండిటి మధ్య, ఏకః = ఒక్కటి, పాకేన = పరిపాకముచేత, మనసా అన్తితః = అంతఃకరణమువలన, త్వామ్ = నిన్ను, యది ఈక్షేత = అభేద దృష్టితో చూచినచో, తం మాతా = మాయోపాధితో గల అవిద్యను, రేహిళ = త్యజించును; సః ఉ = ఆతడే, మాతరమ్ = మాయోపాధితోడి అవిద్యను, రేహిళ = త్యజించును.

**తా :** ఉపాధి భేదమువలన దేవుడు – జీవుడు అని రెండుగా అయిన (లేక, శరీరము – ఆత్మ అని రెండైన) ఒకే ఒక్క తత్వము, అంతఃకరణము ద్వారా నిన్ను అభేదదృష్టితో చూచినచో, మాయోపాధితోగల అవిద్యను త్యజించును. అంతఃకరణమున అభేదదృష్టిగల వ్యక్తియే అవిద్యను త్యజించగలడు. *

**శ్లో॥ తదిదాత్మన్! హృది వపుః పశ్యన్తస్తే మనీషయా ।**
**మునయో వాతరశనాః పిశంగా వసతేఽమలాః ॥ 63**

**ప్ర :** (హే) ఆత్మన్ = ఓ ఆత్మా!, తత్ ఇత్ = అదియే, తే వపుః = నీ శరీరము, హృది = సత్త్వప్రధానమైన హృదయమునందు, మనీషయా = కోరికచే, భావనచే, అవగాహనచేత, పశ్యన్తః = చూచుచున్నవారైన, తే మునయః = ఆ మునులు, వాతరశనాః = గాలియే కట్టుబట్టలుగా గలవారు, పిశంగాః = దుమ్ముకొట్టుకున్నవారు, (అట్లయినను), అమలాః = మలినములేనివారై, శుభ్రముగా, శుచిగా, వసతే = ఉన్నారు.

**తా :** ఓ ఆత్మా! అదియే నీ శరీరము సత్త్వప్రధానమైన హృదయమున లగ్నమై అందున్న నీ మెఱుపుదీవ వంటి జ్యోతిని చూచుచుండు మునులు బాహ్యప్రపంచశూన్యులై, దేహాభిమానములేక దిగంబరులై, స్నానాది విధులులేక ధూళిధూసరితాంగులై యుండియును, అంతఃశుచిగలవారై నిర్మలులగుచున్నారు. *

**శ్లో॥ త్వం చిన్మయం బుధా రూపం సఙ్జానానా ఉపాసతే ।**
**యో అస్య పారే రజసః స నః పర్షదతి ద్విషః ॥ 64**

**ప్ర :** బుధాః = జ్ఞానులు, త్వమ్ = నిన్ను, చిత్+మయం = జ్ఞానమయమైన, రూపమ్ = రూపమును గలవానిగా, సంజానానాః = చక్కగా నెఱిగినవారై, ఉపాసతే = ఉపాసించుచున్నారు; యః = ఎవడు, అస్య రజసః = ఈ రజోగుణమునకు ఉపలక్షణమైన తమస్సునకు, పారే = ఆవలి యొడ్డున గల, సః = ఆత్మయొక్క, ద్విషః = శత్రువులను, పర్షదతి = దాటును, తరించును.

**తా :** జ్ఞానులు నిన్ను జ్ఞానమయునిగా, జ్ఞానమే రూపముగా గలవాడవని నెఱిగి ఉపాసించుచున్నారు. రజోగుణమునకు ఉపలక్షణమైన తమోగుణమునకు అంగములైన ఆత్మజ్ఞానవిరోధి వికారములను తరించి ఆవలి నీ జ్ఞానచేతనను తెలియగల్గుచున్నారు. *

**శ్లో॥ ఇషే త్వోర్జే చౌదనేన నిత్యహోమేఽపి గవ్యతః ।**
**యజన్త్యహం త్వకామస్త్వాం శ్రేష్ఠతమాయ కర్మణే ॥ 65**

**ప్ర :** ఇషే = కోరుదురు, త్వా చ = నిన్నేమో, ఓదనేన = అన్నముతో, ఊర్జే = బలవంతునిగా చేయుచున్నారు; నిత్యహోమే అపి = ప్రతిదినము చేయు హోమమునందు కూడ, గవ్యతః = గవ్యముల వలన (పాలు, పెరుగు, నెయ్యి ఆది గోసంబంధి ద్రవ్యములతో), యజన్తి = అర్చించుచున్నారు; అహం తు = నేనైతే, అకామః = యే కోరికలు లేనివాడనై, త్వామ్ = నిన్ను, శ్రేష్ఠతమాయ కర్మణే = అత్యుత్తమ కర్మకై, (యజామి = అర్చించుచున్నాను).

**తా :** యజ్ఞము చేయువారు కామ్యములతో చేయుదురు. ప్రతిదినము హోమమును గృహస్థవిధిగా చేయువారు కూడ పాలు, పెరుగు, నెయ్యి వంటి గోసంబంధి హోమద్రవ్యములు వ్రేల్చి నిన్ను బలవంతుని చేయుచున్నారు. నేనైతే కామ్యకర్మరూపమున కోరికలు తీర్చుకొనుటకై కాక, సకామ కర్మ శ్రేష్ఠమే యైనను, నిష్కామకర్మ శ్రేష్ఠతమమను ఆప్తవాక్యానుసారము, నైష్కర్మసిద్ధికై నిన్ను అర్చించుచున్నాను. *

**శ్లో॥ అగ్న! ఆయాహీతి గాతుం త్వాఽక్షమః స్తౌమి కేవలమ్ ।**
**నిషీద మే హృది యథా ని హోతా సత్సి బర్హిషి ॥ 66**

**ప్ర :** (హే) అగ్న! = ఓ అగ్నీ! ఆయాహి = రమ్ము, ఇతి = అని, త్వా = నిన్ను, గాతుమ్ = పాడుటకు, అక్షమః = అసమర్థుడను, (అతః = అందువలన), కేవలం స్తౌమి = స్తోత్రము మాత్రమే చేయుచున్నాను; యథా = ఎట్లు, హోతా = హోమము, బర్హిషి = అగ్నియందు, నిసత్సి (నిషత్సి) = చేరునో, (తథా = అట్లు), మే హృది = నా హృదయమున, నిషీద = చేరుము.

**తా :** ఓ అగ్నీ! నిన్ను ఆహ్వానించుచు సామగానము చేయుటకు నేను అశక్తుడను కావున స్తోత్రము మాత్రము చేయుచున్నాను. అగ్నియందు ఆహుతులెట్లు చేరునో నీవును అట్లే నా హృదయమున చేరుము. *

**శ్లో॥ శం నో దేవీః ప్రసాదాత్తే సన్తు ధీవృత్తయోఽనిశమ్ ।**
**ఆత్మప్రవాహాః స్వారస్యాచ్ఛంయోరభిస్రవన్తు నః ॥ 67**

**ప్ర :** తే = నీవైన అంతరాత్మయొక్క, దేవీః = ప్రకాశశీలములైన, ధీవృత్తయః = చిత్తవృత్తులు, ప్రసాదాత్ = ఆత్మయందలి తత్పరతవలన, అనిశమ్ = ఎల్లవేళల, నః = మాకు, శంయోః = సుఖప్రదములు, సన్తు = అగుగాక!, స్వారస్యాత్ = ఆత్మానందమువలన, ఆత్మప్రవాహాః = సర్వభూతాంతఃకరణప్రవృత్తులు, నః = మాకై, అభిస్రవన్తు = సుఖదములై ప్రవహించుగాక!

**తా :** అంతరాత్మప్రకాశమువలన మా చిత్తవృత్తులు ఎల్లవేళల మాకు సుఖప్రదములగుగాక! అందులకు అవి ఆత్మతత్పరములగు గాక! ఈ ఆత్మానందము బహిఃప్రవాహమై సర్వభూతముల అంతఃకరణప్రవృత్తుల ఆనందము మాకై సుఖవంతమగుగాక! *

**శ్లో॥ జ్ఞాతేఽస్మిన్ పాశముక్తిః సకలవిదితి తత్ స్యాదనిర్దేశ్యమేకం**
**సూక్ష్మం చాతీన్ద్రియం సత్తదయమితి గిరా శాబ్దనిర్దేశ్యమేవ ।**
**వాక్యైస్తత్త్వం విరోధేఽపి సతి సుమతిభిః సోఽయమిత్యాదివత్తద్**
**భాగత్యాగేన లక్ష్యం వరగురుకృపయా లభ్యమైక్యం హి తద్‌జ్ఞైః ॥ 68**

**ప్ర :** అస్మిన్ = స్వప్రకాశమైన ఆత్మ, జ్ఞాతే (సతి) = అఖండానందము తెలిసినది కాగా, పాశముక్తిః = సంసారబంధములనుండి విడుదల, (భవతి = అగును)। సకలవిత్ ఇతి చ = సర్వజ్ఞత్వమున్ను, స్యాత్ = కలుగును. ఏకమ్ = ఒక్కటి, అతీంద్రియమ్ = ఇంద్రియజ్ఞానమునకు అందనిది, సూక్ష్మమ్ = సూక్ష్మమైనది, ప్రత్యక్షప్రమాణమునకు అతీతమైనది, సత్ = కాలాతీతమైన సత్యము, ఇతి = అని, గిరా = వేదముచే, వాక్యైః = గురువాక్యములచే, శాబ్దనిర్దేశ్యమ్ = ఆప్తవాక్యములచే నిర్దేశింపబడినదైన, తత్ = 'తత్' అను ఉపనిషత్సత్యము, అయం ఏవ = ఇదియే. తత్త్వమ్ = తత్త్వమనబడు, పరమసత్యము, విరోధే సతి అపి = పరోక్ష – అపరోక్షముల మధ్య విరోధమున్నను, సుమతిభిః = మతిమంతులచే, సః = ఆత్మ, అయం ఇతి = ఇది యని, లక్ష్యం హి = నిశ్చిత గమ్యము, తత్ జ్ఞైః = సత్యతత్త్వము నెఱిగినవారిచే, వరగురుకృపయా = ఉత్తమగురుని అనుగ్రహముచే, ఐక్యమ్ = అఖండానందము, లభ్యమ్ = పొందదగినది.

**తా :** స్వప్రకాశమైన ఆత్మసాక్షాత్కారమైనచో, సంసారబంధములు తెగిపోవును, సర్వజ్ఞత్వమున్నూ కలుగును. ఇంద్రియజ్ఞానమునకతీతముగా అన్ని ప్రమాణములకు అందనిదై, కాలాతీతమైన సత్యస్వరూపమొకటి కలదని వేదములు చెప్పుచున్నవి, గురువులుపదేశించుచున్నారు. ప్రత్యక్ష – పరోక్ష అనుభవముల మధ్యగల విరోధమును పరిహరించి, ఆత్మ 'ఇది' యని నిశ్చితగమ్యమును నిర్దేశించికొని ఆత్మవేత్తలు గురుకృపతో ఆత్మానందమును పొందుదురు. *

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ప్రథమాష్టకే ప్రథమాధ్యాయః ॥

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

ప్రథమాష్టకము - ద్వితీయాధ్యాయము

శ్లో॥ అయం దేవాయనస్త్రీశస్తత్త్వదీపోఽమలోఽస్య భూః ।
సాక్షీ పరః శివోఽచిన్త్యోఽవ్యక్తోఽనన్తో జయత్యజః ॥ 1

**ప్రతిపదార్థం :** అయమ్ = ఈతడు, అపరోక్షస్వయంప్రకాశత్వముగలవాడు కావున దేవాయనః = దేవాయనుడనబడువాడు, త్రీశః = విశ్వ, తైజస, ప్రాజ్ఞులనబడు ముగ్గురు అహంకారులందు అంతర్యామియైనవాడు, తత్త్వదీపః = ఆత్మతత్త్వమును ప్రకాశింపజేయువాడు, అమలః = రాగద్వేషాది వికారములు లేనివాడు, సాక్షీ = ఉదాసీనుడై చూచుచుండువాడు, పరః = సాక్షియైయుండియు గుణాతీతుడైనవాడు, శివః = అట్లుండుటవలన పరమసుఖస్వరూపుడైన అద్వయుడు, అచిన్త్యః = మనోవృత్తుల కతీతుడు, కావున, అవ్యక్తః = ఇంద్రియమనోబుద్ధులకు తెలియరానివాడు, అనన్తః = ఎట్టి ప్రాకృతికపరిమితులు లేనివాడు, అజః = పుట్టుటలేని శాశ్వతుడు, భూః = ఉనికియే తానైన వాడు, అట్టి **శ్రీదత్తాత్రేయుడు**, జయతి = జయము చేయుచున్నాడు.

**తాత్పర్యం :** ఈతడు ప్రత్యక్ష స్వయంప్రకాశుడు; విశ్వాహంకార, తైజసాహంకార, ప్రాజ్ఞా-హంకారము లన్నిటిలో అంతర్యామియై, ఆత్మతత్త్వమును, రాగద్వేషములులేక సాక్షియై, గుణాతీతుడైనందువలన సుఖస్వరూపుడై మనోవృత్తులకు లొంగక, తెలియరాక, పుట్టుకయేలేక అనంతుడై, శాశ్వతుడై, ఉనికియే తానైన, తానే సర్వమైన **శ్రీదత్తాత్రేయుడు**, ఆత్మస్వరూపుడు. *

శ్లో॥ కశ్చిద్ద్విజవరో దైవాత్సర్వసంస్కారసంస్కృతః ।
అధీతవేదవేదాంగశ్చరితాశ్రమసత్క్రియః ॥ 2

**ప్ర :** కశ్చిత్ = ఒకానొక, ద్విజవరః = ఉత్తమబ్రాహ్మణుడు, దైవాత్ = ధార్మికమైన నడవడికను బట్టి, సర్వ = అన్నివిధముల, సంస్కార = సంస్కారములచేత, సంస్కృతః = సంస్కరింపబడినవాడు, అధీత = అధ్యయనము చేయబడిన, వేదవేదాంగః = నాలుగు వేదములు, శిక్షావ్యాకరణ-

ఛందోనిరుక్తజ్యోతిషకల్పములను ఆరు అంగములు గలవాడు, చరిత = ఆచరింప బడిన, ఆశ్రమ-సత్క్రియః = ఆశ్రమోచిత విధులుగలవాడు.

**తా :** ఒకానొక బ్రాహ్మణుడు ధార్మికప్రవర్తనగల ఉత్తముడు : బాల్యాదిక్రమమున శాస్త్రోక్తమైన సంస్కారములన్నియు చేయబడినందున సంస్కారవంతుడై, వేదవేదాంగములన్నియు విధిగా అధ్యయనముచేసి, బ్రహ్మచర్యాది ఆశ్రమధర్మములను ఆచరించినవాడాతడు. *

**శ్లో॥ మాతాపితృగురూద్యుక్త ఋణత్రయవివర్జితః ।**
**సద్భక్త్యోపాస్తయోగీన్ద్రః ప్రాయశ్చిత్త్యస్తకల్మషః ॥ 3**

**ప్ర :** మాతా = తల్లి, పితృ = తండ్రి, గురు = గురువు అను ఈ ముఫ్వురియందును, ఉద్యుక్తః = తత్పరుడైనవాడు, ఋణత్రయ = ఋషి, దేవ, పితృ ఋణములు మూడును, వివర్జితః = లేనివాడు, సద్భక్త్యా = నిలుకడయైన భక్తితో, ఉపాస్త = ఉపాసింపబడిన, యోగీన్ద్రః = ఉత్తమయోగి, ప్రాయశ్చిత్తి = ప్రాయశ్చిత్తములతో, అస్త = తొలగిపోయిన, కల్మషః = పాపములు గలవాడు.

**తా :** ఆ బ్రాహ్మణుడింకను తల్లి, తండ్రి, గురువు అను ముఫ్వురి సేవలో నిమగ్నమై యుండువాడు; ఋషి, దేవ, పితృ ఋణములు లేనివాడు, భక్తితో యోగీంద్రుడైన దత్తాత్రేయుని ఉపాసించువాడు, ప్రాయశ్చిత్తములతో పాపములను తొలగించుకొన్నవాడు. *

**శ్లో॥ విధివత్కృతసంన్యాసస్త్యక్తసర్వైషణో వశీ ।**
**చతుఃసాధనసమ్పన్నో దైవీసమ్పత్సమన్వితః ॥ 4**

**ప్ర :** విధివత్ = శాస్త్రోక్తముగ, కృత = చేయబడిన, సంన్యాసః = సంన్యాస ఆశ్రమము గలవాడు; త్యక్త = విడువబడిన, సర్వ = అన్ని విధముల, ఏషణః = కోరికలు గలవాడు; వశీ = ఇంద్రియములను జయించినవాడు; చతుః = నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రఫల-భోగవిరాగము, శమాదిషట్కము, ముముక్షుత్వము, అనబడు నాలుగైన, సాధనసంపన్నః = సాధనములతో కూడినవాడు, దైవీసంపత్ = సత్వగుణసంపదను, సమన్వితః = పొందియున్నవాడు.

1. శమ, 2. దమ, 3. ఉపరతి, 4. తితిక్షా, 5. శ్రద్ధా, 6. సమాధానం అను ఈ ఆరును **శమాదిషట్కము**.

ఇహలోకభోగములు, స్వర్గలోకభోగములు, రెండిటియందు ఆసక్తి లేకుండుటకు **ఇహాముత్రఫలభోగవిరాగ**మని పేరు.

**తా :** ఆ బ్రాహ్మణుడు శాస్త్రోక్తముగ సంన్యసించినవాడు; యే కోరికలు లేనివాడు; ఇంద్రియసుఖాభిలాష లేనివాడు; నాలుగు సాధనములుగల భాగ్యశాలి; సత్త్వగుణమునందు ప్రవర్తించువాడు. *

శ్లో॥ దృఢం నిరుద్ధసత్త్వాన్యచిత్తవృత్తిర్యతిర్హి సః ।
ఏవం సన్నపి నో శాన్తిః ప్రాప్తో నానాశ్రుతభ్రమాత్ ॥ 5

ప్ర : సః = ఆతడు, దృఢమ్ = గట్టిగ, నిరుద్ధ = అడ్డగింపబడిన, సత్త్వ–అన్య = సత్త్వగుణభిన్నమైన, చిత్తవృత్తయః = మనోవర్తనములుగలవాడు, ఏవమ్ = ఈ రీతి, సన్ అపి = అయినను, నానా = అనేకములైన, శ్రుత = శాస్త్రముల జ్ఞానమువలన కలిగిన, భ్రమాత్ హి = చంచలత్వమువలననే, శాన్తిః = శాన్తి, (వానిచే), నో ప్రాప్తః = పొందబడినది కాదు.

తా : ఆ బ్రాహ్మణుడు సంపూర్ణముగ నిర్విరోధముగ సత్త్వగుణమునందు ఉన్నవాడే యైనను, వానికి నానాశాస్త్రజ్ఞానమున్నందువలన నిలుకడలేక శాంతి లభించలేదు. *

శ్లో॥ దృష్ట్వా తం ఖిన్నహృదయం విషీదన్తం శుచాన్వితమ్ ।
తత్పుణ్యేన్దూదయాలోకహృష్టానుగ్రహసాగరః ॥ 6

శ్లో॥ సహసాఽఽవిరభూచ్ఛ్రీమాన్ దత్తాత్రేయో దిగమ్బరః ।
అవతీర్ణోఽత్ర యో దీనానుద్ధర్తుం భక్తవత్సలః ॥ 7

ప్ర : శుచా =దుఃఖముతో, అన్వితమ్ = కూడినట్టి, ఖిన్నహృదయమ్ = క్రుంగిన హృదయముగల వానిని, విషీదన్తమ్ = నిరాశపడియున్నవాడైన, తమ్ = ఆ బ్రాహ్మణుని, దృష్ట్వా = చూచి, తత్ = వానియొక్క, పుణ్య = పుణ్యకర్మఫలము అనబడు, ఇన్దు = చంద్రుని, ఉదయ = పొడుపును, ఆలోక = చూచుటచేత, హృష్ట = ఆనందించిన, అనుగ్రహసాగరః = సముద్రమంతటి దయగలవాడైన, దిగంబరః = ఆవరణములేమియు లేని, యః = ఎవరు, భక్తవత్సలః = గోమాత తన దూడను వలె భక్తుని అవసరమెఱిగి సమకూర్చువాడైన, దీనాన్ = దీనులను, ఉద్ధర్తుమ్ = ఉద్ధరించుటకు, అవతీర్ణః = అవతరించినవాడైన, శ్రీమాన్ దత్తాత్రేయః = శ్రీమంతుడగు దత్తాత్రేయుడు, సహసా = వెంటనే, అత్ర = అచట (ఆ బ్రాహ్మణుని ముంగిట), ఆవిరభూత్ = ప్రత్యక్షమాయెను.

తా : ఆ బ్రాహ్మణుడు దుఃఖితుడై, హృదయమున క్రుంగిపోయి, నిరాశ చెందియుండుట చూచి, వాని పుణ్యకర్మలు ఫలోదయములై వెన్నెల గురియు సమయమైనదని హర్షముతో సముద్రమువలె దయ పొంగులు వారగా, వాని బోలిన దీనులను ఉద్ధరించుటకొరకై అవతరించిన శ్రీదత్తాత్రేయ స్వామి గోమాత ఆర్తిగొన్న తన దూడకై పరుగున వచ్చినట్లు దిగంబరుడై వెంటనే ఆ బ్రాహ్మణుని ముంగిట సాక్షాత్కరించినాడు. *

శ్లో॥ స్మర్తృగామ్యనసూయాత్రితపఃసన్తానసత్ఫలః ।
సర్వాభాసకతత్తేజో పిహితాక్షో మహామతిః ॥ 8

శ్లో॥ యతిస్తస్మై నమశ్చక్రే శ్రద్ధాభక్త్యా మహాత్మనే ।
కస్మై వాఙ్మనసాతీతరూపాయానన్తశక్తయే ॥ 9

**శ్లో॥ పూర్వేషామాదిగురవే సర్వజ్ఞానస్వరూపిణే ।**
**సద్భక్తిజ్ఞానగమ్యాయ నిర్గుణాయ గుణాత్మనే ॥** **10**

**ప్ర :** అనసూయా–అత్రి = అనసూయాదేవి, అత్రిమహర్షి అనువారియొక్క, తపఃసంతాన = తపస్సులకు, సత్ ఫలః = మంచి ఫలమైనవాడు, సర్వాభాసక = అన్నింటిని ప్రకాశింపజేయు, తత్ తేజః = ఆ బ్రహ్మతేజస్సు గలవాడు, పిహిత = మూయబడిన, అక్షః = కన్నులు గలవాడు, మహామతిః = ఉదారబుద్ధిగలవాడు, (ఆవిరభూత్ = సాక్షాత్కరించెను). తస్మై మహాత్మనే = ఆ మహాత్మునకు, మనసాతీత = మనస్సునకు అందని, రూపాయ = రూపముగలవానికి, అనన్తశక్తయే = పరిమితులులేని శక్తిగలవానికి, నిర్గుణాయ = గుణవికారములకు లోనుగానివానికి, సద్భక్తిజ్ఞానగమ్యాయ = మచ్చలేని భక్తిచేత, జ్ఞానముచేత తెలియదగినవానికి, గుణాత్మనే = గుణవంతునకు, పూర్వేషామ్ = బ్రహ్మాదులకు, ఆదిగురవే = తొల్లిటి గురువైన వానికి, కస్మై = బ్రహ్మరూపునకు, స్మర్తృగామియతిః = స్మరించుచున్న యతి, శ్రద్ధాభక్త్యా = శ్రద్ధగలభక్తితో, నమః చకార = నమస్కరించెను॥

**తా :** ఆ బ్రాహ్మణున కట్లు సాక్షాత్కరించిన అవతారమూర్తియైన శ్రీ దత్తాత్రేయుడు అనసూయ అత్రి మహర్షుల తపఃఫలముగా కుమారుడైనవాడు. విశ్వమునంతయు ప్రకాశింపజేయు తేజోవంతములైన వాని కన్నులు మూసి యున్నవి. ఆతడుదారబుద్ధి, యతి, మనస్సున కందని రూపము వానిది. వాని శక్తి ఇంతింతయని పరిమితి నెన్నరానిది. ఆతడు మూర్తీభవించిన జ్ఞానమే. గుణవికారములు లేనివాడే యైనను మచ్చలేని భక్తులకు, జ్ఞానులకు సగుణసాకారమూర్తియై దర్శనమిచ్చువాడు. బ్రహ్మాదులకు సైతము తొలిగురువు. పరబ్రహ్మస్వరూపుడు. అట్టి ఆ స్వామికి, సాక్షాత్కరించినంతనే, ఆ బ్రాహ్మణుడు భక్తిశ్రద్ధలతో నమస్కరించినాడు. *

**శ్లో॥ స తమాశ్వాస్య యోగీన్ద్రో దయాలుర్భగవాన్ ప్రభుః ।**
**ప్రాహ భిక్షో కిమర్థం త్వం దుర్మనా ఇవ లక్ష్యసే ॥** **11**

**శ్లో॥ సర్వనాశకరత్వాత్తన్మద్భక్తేనోపపద్యతే ।**
**వద తస్మాన్మమాగ్రే త్వం దౌర్మనస్యస్య కారణమ్ ॥** **12**

**ప్ర :** సః దయాలుః = ఆ దయగలవాడైన, భగవాన్ = భగవంతుడైన, యోగీన్ద్రః = యోగులలో ఉత్తముడైన, ప్రభుః = దత్తాత్రేయప్రభువు, తమ్ = ఆ బ్రాహ్మణుని, ఆశ్వాస్య = ఓదార్చి, ఉత్సాహపరచి, ప్రాహ = ఇట్లనెను : (హే) భిక్షో = ఓ యతీ!, త్వమ్ = నీవు, కిమర్థమ్ = ఏ ప్రయోజనమును కోరి, దుర్మనాః ఇవ = దుఃఖితమనస్కునివలె, లక్ష్యసే = ప్రవర్తించుచున్నావు?, సర్వనాశకరత్వాత్ = సమస్తమును నశింపజేయునదగుటవలన, తత్ = ఆ దుఃఖము, మద్భక్తే = నా భక్తునియందు, న ఉపపద్యతే = ఉండదగినది కాదు; తస్మాత్ = అందువలన, మమ అగ్రే = నా యెదుట, త్వమ్ = నీవు, దౌర్మనస్యస్య = నీ దుఃఖమునకు గల, కారణమ్ = కారణమును, వద = చెప్పుము.

**తా :** ఆ దయగల దత్తాత్రేయప్రభువు ఆ బ్రాహ్మణుని ఓదార్చి, ప్రోత్సహించుచు ఇట్లనెను : ఓ యతీ! నీ దుఃఖమునకు కారణమేమి? నీవు యే ప్రయోజనము నాశించి పొందలేకుంటివి? నా భక్తుడవైన నీకీ దుఃఖము తగదు. దుఃఖము ఉన్నదానినంతను నశింపజేయును. కావున నీ దుఃఖకారణమును నాకు వివరించుము. *

**శ్లో॥ శ్రుత్వా సహార్ద్రం తద్వాక్యం జ్ఞాత్వా సర్వగురుం యతిః ।**
**తం ప్రత్యువాచ తద్భక్తియన్త్రితో నతకన్ధరః ॥ 13**

**ప్ర :** సహ+ఆర్ద్రమ్ = ఆర్ద్రతతో కూడినదైన, తత్ వాక్యమ్ = ఆ మాటలను, శ్రుత్వా = విని, తమ్ = ఆతనిని, సర్వగురుమ్ = పరమగురువైన దత్తాత్రేయునిగా, జ్ఞాత్వా = తెలిసికొని, తత్ = వానియందలి, భక్తి = భక్తిచే, యన్త్రితః = ప్రేరేపింపబడినవాడై, నత = వంచిన, కన్ధరః = శిరస్సుగలవాడైన, యతిః = ఆ బ్రాహ్మణసన్న్యాసి, ప్రత్యువాచ = బదులాడెను.

**తా :** ఆర్ద్రమైన ఆ మాటలు విని, వానిని ఆదిగురువైన దత్తాత్రేయునిగా గుర్తించి, భక్తితో శిరస్సు వంచి ఆ బ్రాహ్మణసన్న్యాసి ఇట్లు సమాధానమిచ్చెను. *

**శ్లో॥ విముక్తో ముచ్యతేఽనర్థాదితి శ్రుత్వా తదీహయా ।**
**ప్రవృత్తస్య మమాజ్ఞస్య భ్రమదోఽభూచ్ఛ్రుతార్ణవః ॥ 14**

**ప్ర :** విముక్తః = విశేషముగా విడువబడినవాడు, అనర్థాత్ = సంసారదుఃఖములనుండి, ముచ్యతే = విడుదల పొందును, ఇతి = అని, శ్రుత్వా = విని, తత్ ఈహయా = ఆ కోర్కెతో, ప్రవృత్తస్య = ప్రవర్తించిన, అజ్ఞస్య = అజ్ఞానినగు, మమ = నాకు, శ్రుత+అర్ణవః = శాస్త్రవిషయసముద్రము, భ్రమదః = చిత్తచాంచల్యమును కల్గించినది, అభూత్ = ఆయెను.

**తా :** జ్ఞానసముపార్జనచేత లౌకికబాధలనుండి ముక్తినొందినవాడు బాధలనుండి విడుదల పొందునని విని, అట్లు నిర్బాధముగా శాంతితో జీవించు కోరికతో నేను వివిధశాస్త్రముల అధ్యయనము చేసి ఆ యా విషయజ్ఞానమును సంపాదించితిని. అట్లు సంపాదించబడిన శాస్త్రజ్ఞానము ఒక సముద్రమైనది. కాగా, ఆ జ్ఞానము నాకు శాంతినివ్వక, సుఖమివ్వక, చిత్తచాంచల్యమునే కలిగించినది. *

**శ్లో॥ ప్రమాణాని ప్రమేయాని సంశయశ్చ ప్రయోజనమ్ ।**
**తథా దృష్టాన్తసిద్ధాన్తావయవస్తర్కనిర్ణయౌ ॥ 15**

**ప్ర :** ప్రమాణాని = ప్రమాణములు (గుణదోషనిర్ణయమునకు అష్టవిధముల ఆధారములు : ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద, అర్థాపత్తి, అనుపలబ్ధి, సంభవ, ఐతిహ్యములు), ప్రమేయాని = నిస్సంశయముగ తెలియవచ్చునవి, సంశయః = సందేహము, చ = మరియు, ప్రయోజనమ్ = లక్ష్యము, తథా = అట్లే, దృష్టాన్త = పోలిక, సిద్ధాన్తౌ = స్థిరాభిప్రాయము, అను ఈ రెండు, అవయవః = తర్కమున కుపకరించు ప్రతిజ్ఞా, హేతు, ఉదాహరణ, ఉపనయ, నిగమనము

లనబడు ఐదు అంగములలో నొకటి, తర్కనిర్ణయః = తర్కశాస్త్రోక్తపద్ధతిని ధృవీకరించబడు అభిప్రాయము.

**తా :** వివిధాధారములతో గుణదోషనిర్ణయము, సంశయము, సందేహనివృత్తి, లక్ష్యము, పోలిక, స్థిరాభిప్రాయము, దానికుపకరించు తర్కశాస్త్రపద్ధతులు... *

**శ్లో॥ వాదో జల్పో వితణ్డా చ హేత్వాభాసాశ్ఛలాని చ ।**
**జాతినిగ్రహస్థానాని పదార్థానక్షపాజ్జగౌ ॥ 16**

**ప్ర :** వాదః = ఒక నిర్ణయమునకు అనుకూల, ప్రతికూలపరిస్థితులను గుర్తించుట, జల్పః = వివాదము, వితణ్డా = అపసవ్యమైన వాదము, చ = మరియు, హేతు = కారణము, ఆభాసాః = భ్రమలు, ఛలాని = మోసములు, చ = మరియు, జాతి = నిష్ప్రయోజనమైన సమాధానము, నిగ్రహ = తర్కమున దోషము, స్థానాని = దండ, కోష, పుర, రాష్ట్రములనబడు నాలుగు, పదార్థాన్ = న్యాయశాస్త్రమంగీకరించిన పదునారు ప్రమాణాది శీర్షికలు, అక్షపాత్ = న్యాయదర్శనమును ప్రతిపాదించిన గౌతమమహర్షి లేక తదనుయాయి, జగౌ =

**తా :** గౌతమమహర్షి ప్రతిపాదించిన న్యాయదర్శన సంబంధులగు పదునారు ప్రమాణము మొదలుగాగల శీర్షికలు (శ్లో. 15,16లలో చెప్పబడినవి). *

**శ్లో॥ ఏతేషాం తత్త్వజ్ఞానాన్నుః శ్రేయోఽకలయరూపకమ్ ।**
**స్వదుఃఖజన్మప్రవృత్తిదోషమిథ్యావిదాం క్రమాత్ ॥ 17**

**శ్లో॥ ఉత్తరోత్తరనాశే స్యాత్తదనన్తరనాశతః ।**
**దేహినాం ముక్తిరిత్యేతత్సద్వితీయం ప్రదృశ్యతే ॥ 18**

**ప్ర :** ఏతేషామ్ = వీనికి, తత్త్వజ్ఞానాత్ = మూలమైన సూక్ష్మసత్యము నెఱుగుటవలన, అకలయరూపకమ్ = అవిభాస్యసంపూర్ణైక స్వరూపము గలది, శ్రేయః = మోక్షము, స్వ = తనదైన, దుఃఖజన్మ = దుఃఖముతో కూడిన జన్మ, ప్రవృత్తి = జీవితము, కొనసాగింపు, అను దోషములు, మిథ్యావిదామ్ = మాయనెఱిగిన వారలకు, క్రమాత్ = క్రమముగ, ఒక దానివెంట నొకటిగ, ఉత్తరోత్తరనాశే = ముమ్ముందటివి నశించుటలో, తత్ = దాని, అనన్తరనాశతః = తర్వాతిదాని నాశమువలన, ముక్తిః స్యాత్ = ముక్తి కలదు, ఇతి = అని, సద్వితీయం నుః = రెండవదానితో కూడియే, ప్రదృశ్యతే = సంభావ్యమగుచున్నది.

**తా :** గౌతమమహర్షి ప్రతిపాదించిన న్యాయదర్శనము ననుసరించి చూచిన మోక్షమార్గము జ్ఞానమే యను వేదవాక్యము "**నాన్యః పంథా ఆయనాయ విద్యతే**" అనుట పొసగదు. ఎట్లనగా, పదార్థతత్త్వజ్ఞానమువలన మిథ్యాజ్ఞానము నశించును; దానివలన రాగాది దోషనాశనము; దానినుండి ప్రవృత్తి నాశము; దానివలన జన్మనాశము, ప్రారబ్ధకర్మనాశము ఫలభోగమువలన, జ్ఞానమువలన సంచితకర్మనాశము, అని ఉత్తరోత్తరనాశక్రమము సూచించబడినది కదా. *

**శ్లో॥ కణాదామ్నాయప్రామాణ్యం మత్వా ధర్మః స వై యతః ।**
**నృణామభ్యుదయశ్రేయః సిద్ధిరిత్థం ప్రవిచ్య చ ॥ 19**

**ప్ర :** కణాద = కణాదునియొక్క, ఆమ్నాయ = వేదప్రమాణమును, మత్వా = తలంచి, ధర్మః = ధర్మము, సః వై = అదియే, యతః = దేనినుండి, దేనివలన, నృణామ్ = నరులకు, అభ్యుదయ = ఐహికసుఖములు, శ్రేయః = మోక్షము అనునివి, సిద్ధిః = కలుగునో, ఇత్థమ్ = ఈ రీతిగ, ప్రవిచ్య చ = పరిశీలించి, వివేకించియే.

**తా :** కణాదవైశేషికమతముననుసరించి, దేనివలన నరులకు లౌకికసుఖములు, ముక్తి కలుగునో, దానిని వివేకించి ధర్మమిదియని చెప్పవలె. ఇదియే తర్కమునకనుకూలించు వేదప్రమాణము. *

**శ్లో॥ ద్రవ్యాణి గుణకర్మాణి సామాన్యఞ్చ విశేషకః ।**
**సమవాయః పదార్థాః షట్ చైతేషాం తత్త్వసంవిదా ॥ 20**

**ప్ర :** ద్రవ్యాణి = పృథివి, ఆపః, తేజస్, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, మనస్సు, ఆత్మ అను తొమ్మిది; గుణకర్మాణి = సత్త్వ, రజస్, తమస్సులను గుణములు, వాని వలన కలుగు కర్మలు; షట్ పదార్థాః = ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద, అర్థాపత్తి, అనుపలబ్ధి అను ఆరు పదార్థములు లేక ప్రమాణములు; సామాన్యమ్ = సర్వసాధారణమైనది, విశేషకః చ = ప్రత్యేకమైనది కూడ, ఏతేషామ్ = వీనికి, సమవాయః = విడదీయరాని సంబంధము, తత్త్వసంవిదా = తాత్త్విక-జ్ఞానముచేత (తెలియదగినవి).

**తా :** ద్రవ్యములు, గుణకర్మలు, పదార్థభేదములు, సామాన్యవిశేషలక్షణములు, వీనికి గల విడదీయరాని సంబంధము, ఇవి యన్నియు సూక్ష్మవిచారణద్వారా వివేకించి తెలియదగినవి. *

**శ్లో॥ సాధర్మ్యవైధర్మ్యాభ్యాం స్వస్వోపాధ్యనుశాయినామ్ ।**
**అసజ్జానాం ముక్తిరితి ప్రాహ సోఽపి విరుద్ధవత్ ॥ 21**

**ప్ర :** సాధర్మ్య = సమానధర్మములు, వైధర్మ్యాభ్యాం చ = విరుద్ధధర్మములు గల వానిచేత కూడ, స్వ స్వ = తమ తమ, ఉపాధి+అనుశాయినామ్ = ఉపాధిభిన్నత్వమున, అసజ్జానామ్ = అసత్‌నుండి పుట్టిన వానికి, ముక్తిః = ముక్తి, ఇతి = అని, ప్రాహ = చెప్పెను; సః అపి = అది కూడ, విరుద్ధవత్ = విరుద్ధమువలెనే (తోచును).

**తా :** శరీరములు, వాని వాని ధర్మములు కొన్నిట సమానముగాను, మరికొన్నిట విరుద్ధ ధర్మములతోను ఉండి, అవి ముందు లేనివై క్రొత్తగా వచ్చినవై ఉండుట వలన వానికి ముక్తికలుగుట యను దానిలో విరోధము తోచును. *

**శ్లో॥ ఆమ్నాయస్య క్రియార్థత్వాచ్ఛాస్త్రదృష్టవిరోధతః ।**
**పునస్తథా ఫలాభావాన్నానర్థక్యం చ జైమినిః ॥ 22**

**ప్ర :** ఆమ్నాయస్య = వేదమంతటికి, క్రియార్థత్వాత్ = కర్మప్రతిపాదనయే అర్థమగుటవలన, శాస్త్రదృష్టవిరోధతః = శాస్త్రానుసారము సృష్టి ప్రళయములను అంగీకరించక విరోధించుటవలన, పునః = మరల, ఫలాభావాత్ తథా = ఆత్మసాక్షాత్కారఫలము లేనందువలన నట్లే, నానర్థక్యమ్ = అనేకత్వము, జైమినిః చ = జైమినిమహర్షి ప్రతిపాదించిన పూర్వమీమాంసాసిద్ధాంతమున కూడా కలదు.

**తా :** వేదము పూర్తిగా కర్మనే ప్రతిపాదించుచున్నది; సృష్టి ప్రళయములను అంగీకరించుట లేదు; కర్మకు ఆత్మసాక్షాత్కారమును ఫలముగా చెప్పుటయు లేదు, అని జైమినిమహర్షి ప్రతిపాదించిన పూర్వమీమాంసాసిద్ధాంతము ఏకత్వమునుగాక అనేకత్వమునే చెప్పుచున్నది. *

**శ్లో॥ అవాదీదతదర్థానాం వేదవాదరతోఽల్పదృక్ ।**
**కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః ॥ 23**

**ప్ర :** అల్పదృక్ = లోతుగా విచారించనివాడగు, వేదవాదరతః = వేదము చెప్పిన వాని అర్థములలో ఆసక్తిగలవాడు, అతదర్థానామ్ = అనాత్మవాదములను, అవాదీత్ = పలుకును; కర్మాణి = కర్మలను, కుర్వన్ ఏవ = చేయుచునే, ఇహ = లోకమున, శతం సమాః = నూరు సంవత్సరములు జిజీవిషేత్ = జీవించవలెనని కోరుకొనును.

**తా :** వేదవాదాసక్తులు లోతుగా విచారించక అనాత్మవాదము సేయును, కర్మలు చేయుచునే లోకమున నూరేండ్లు జీవింపగోరును. *

**శ్లో॥ యావజ్జీవం చాగ్నిహోత్రం జుహోతి చ దహన్తి చ ।**
**తం యజ్ఞపాత్రైరిత్యాదిశ్రుతేః సర్వాయుషో నృణామ్ ॥ 24**

**ప్ర :** యావత్ జీవమ్ = ప్రాణమున్నంతవరకు, అగ్నిహోత్రమ్ = అగ్నిహోత్రమున, జుహోతి = హవిస్సులను హోమము చేయుచున్నాడు; చ = మరియు, నృణామ్ = నరులయొక్క, సర్వాయుషః = ఆయువంతయు, యజ్ఞపాత్రైః = యజ్ఞపాత్రలతో, ఇతి ఆది = ఈ మొదలైన, శ్రుతేః చ = వినికిడి వలనను (వేదము వినుటవలన), తమ్ = వానిని, దహన్తి చ = (అవసానమున) దహించు చున్నారు కూడ.

**తా :** ఈ కర్మరతులు జీవించియున్నంత కాలము నిత్యము తమ ఇంటిలోనే అగ్నికుండమును నిర్మించి, హోమము చేయుచు, హవిస్సులను దహించుచు యజ్ఞపాత్రలతోనే జీవించుచు, తత్సంబంధి శ్రుతివాక్యములను పఠించుచు, వినుచు, కడకు, అవసాన కాలమున, ఆ అగ్నియందే దహింపబడుచున్నారు కూడ. *

**శ్లో॥ వ్యాప్తత్వాత్కర్మభిర్దోషశ్రవణాచ్చాప్యకర్మణః ।**
**తచ్ఛేదనాలక్షణార్థధర్మానుష్ఠానతో ధ్రువమ్ ॥ 25**

**ప్ర :** కర్మభిః = కర్మలచేత, వ్యాప్తత్వాత్ = వ్యాపింపబడినందువలన, అపి చ = మరియు, అకర్మణః = కర్మచేయకుండుటకు, దోషశ్రవణాత్ = దోషము చెప్పబడినందువలన, తత్ = ఆ కర్మను, చోదనలక్షణార్థ = నడిపించు (ప్రేరేపించు) లక్షణము, ప్రయోజనముగల, ధర్మ = ధర్మమును, అనుష్ఠానతః = ఆచరించుటవలన, ధ్రువమ్ = నిశ్చయముగా

**తా :** కర్మాచరణ విస్తారముగా చెప్పబడినందున, కర్మచేయకుండుటలో దోషమెంచబడినందున కూడ, ఆ కర్మ తప్పనిదై దానికి ధర్మాచరణ సారథిగా నిశ్చయింపబడినది. *

**శ్లో॥ అమృతత్వం భవేన్నృణామితి స ప్రాబ్రవీదిహ ।**
**పునః పాతాదిశ్రవణాద్భాతీదం జన్మమధ్రువమ్ ॥ 26**

**ప్ర :** అమృతత్వమ్ = ముక్తి, నృణామ్ = నరులకు, భవేత్ = కలుగును, ఇతి = అని, సః = ఆతడు, ప్రాబ్రవీత్ = నిశ్చయించి చెప్పెను; ఇదం జన్మ = ఈ జన్మ, ఇహ = ఈ లోకమున, పునః పాత ఆది = మరల కలుగుట, సంసారదుఃఖము అనునివి, శ్రవణాత్ = చెప్పబడినందువలన, అధ్రువమ్ = అనిశ్చితముగా, భాతి = ప్రకాశించుచున్నది.

**తా :** పునర్జన్మ, పునః కర్మ, చెప్పబడినవి కావున నరులకు అమృతత్వము, ముక్తి అనునవి అనిశ్చితములు, సందేహాస్పదములు. *

**శ్లో॥ ఉత్కర్షాదపి మోక్షస్య సర్వోత్కర్షశ్రుతేస్తథా ।**
**అనావృత్తి శ్రుతేర్బన్ధాభావాన్ముక్తస్య చాన్యథా ॥ 27**

**ప్ర :** మోక్షస్య = మోక్షమునకు, సర్వ+ఉత్కర్షశ్రుతేః = ఇతరపురుషార్థములన్నిటివలన ప్రతిబంధకము చెప్పబడినందున, తథా = అట్లే, అనావృత్తిశ్రుతేః = పునరావృత్తిలేనిది మోక్షమనినందువలన, బన్ధ+అభావాత్ = బంధములు లేనందువలన, ముక్తస్య = ముక్తునకు, అన్యథా చ = మరియొక విధమున్నూ.

**తా :** ధర్మ, అర్థ, కామ, మోక్షములు అను నాలుగు పురుషార్థములలో ధర్మార్థకామములు మూడును మోక్షవ్యతిరిక్తములు : ఈ మూడును జీవుని బద్ధుని చేయునవే. అర్థకామముల నిర్వహణము ధర్మబద్ధమైనను, ధర్మాచరణతో సహ ఆ మూడును కర్మబద్ధములు కావున ఫలభోగము తప్పనిదే. దాని కారణమున పునఃజన్మకర్మలు కలుగును. మోక్షము అనగా పునరావృత్తిలేనిది. పునరావృత్తినుండి తద్రాహిత్యమెట్లు సంభవము? *

**శ్లో॥ పుంసోఽప్యపురుషార్థత్వాన్నానాత్మత్వం వివిచ్య చ ।**
**పఞ్చవింశకపుంజ్ఞానాన్ముక్తిర్బన్ధో విపర్యవత్ ॥ 28**

**ప్ర :** పుంసః అపి = పురుషులకు గూడ, అపురుషార్థత్వాత్ = పురుషార్థవర్తనము లేనందువలన, నానా+ఆత్మత్వమ్ = శరీరములు వేర్వేరైనందున ఆత్మలును భిన్నములుగ నుండుట యనునది,

వివిచ్య చ = వివేకించియు, పంచవింశక = ఇరువదియైదు, పుంజ్ఞానాత్ = తత్త్వముల జ్ఞానము వలన, ముక్తిః = మోక్షము, విపర్యవత్ = విపర్యముగ, బన్ధః = బంధము.

**తా :** పురుషులందరు పురుషార్థములను మనసులోనుంచుకొని ప్రవర్తించు వారు కారు. ఇట్లు పురుషులలో ఆచారైక్యత లేనందున దైహిక నానాత్వము, దాని వలన ఆత్మయొక్క ప్రత్యగత్వము వివేకించవలసినదే. ఇట్లు విపర్యముగ చూచినచో, పంచభూతములు, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, పంచేంద్రియవిషయములు, మాయ, శుద్ధవిద్య, మహేశ్వర సదాశివులు, మనస్సు, అను యీ ఇరువది యైదు తత్త్వముల జ్ఞానమువలన బంధమే తప్ప ముక్తియెట్లు? *

**శ్లో॥ విరక్తస్యైవ తత్సిద్ధిర్న తు శ్రవణమాత్రతః ।**
**అనాదివాసనాదార్ఢ్యాచ్ఛనైశ్చిత్తప్రసాదనాత్ ॥ 29**

**ప్ర :** తత్ సిద్ధిః = ఆ మోక్షసిద్ధి, అనాది = మొదలెఱుగరాని, వాసనాదార్ఢ్యాత్ = వాసనలు దృఢముగా వ్రేళ్ళూనియున్నందున, శనైః = మెల్లగా, చిత్తప్రసాదనాత్ = చిత్తము నిర్మలమగుట వలన, విరక్తస్య = వైరాగ్యము కలిగిన వానికి, ఏవ = మాత్రమే, తు = కాని, శ్రవణమాత్రతః = శాస్త్రములను వినినందువలన (చదివినందువలన), న = కాదు.

**తా :** ప్రతి వ్యక్తిలోనూ పూర్వజన్మసంస్కారములు గట్టిగా వ్రేళ్ళూని యుండుటవలన, ఆ పూర్వజన్మవాసనలకు మొదలెక్కడో తెలియనందువలన, వానిని మెల్లమెల్లగా సాధనల ద్వారా మనస్సును వాసనారహితముగ చేసికొనిన రాగద్వేషములను తొలగించుకొని వైరాగ్యము గలవారికి మాత్రమే ముక్తి సిద్ధించును; కేవలము శ్రవణ పఠనాదిమాత్రశాస్త్రజ్ఞానవంతులకు ముక్తి లభించదు. *

**శ్లో॥ వైరాగ్యాభ్యాసధ్యానాద్యైరత్యన్తపురుషార్థతా ।**
**ఆత్మజ్ఞానతత్త్వవిదో దుఃఖాత్యన్తనివర్తనమ్ ॥ 30**

**ప్ర :** వైరాగ్య+అభ్యాస–ధ్యాన+ఆద్యైః = వైరాగ్యముచేత, అభ్యాసము, ధ్యానము మొదలగు వానిచేత, అత్యన్త = అధికమైన, పురుషార్థతా = ధర్మార్థకామమోక్షములను పురుషార్థములు ఫలించుట కలుగును; ఆత్మజ్ఞానతత్త్వవిదః = ఆత్మసత్యత్వజ్ఞానమును పొంది తత్త్వమునెఱిగినవానికి, దుఃఖ+అత్యన్త–నివర్తనమ్ = దుఃఖము అధికముగా తొలగింపబడుట కలుగును.

**తా :** వైరాగ్యముతో, అనాసక్తుడై శాస్త్రోక్తమైన అభ్యాసములు చేయుచు, ధ్యానాది అంగములు గల యోగమార్గము ననుసరించిన వాని ధర్మాచరణము, అర్థకామాది ధర్మాచరణము ఫలవంతములగును. ఆత్మజ్ఞానము గల్గిన వానికి అధికముగా దుఃఖము తొలగిపోవును. *

**శ్లో॥ నివృత్తేఽప్యనువృత్తిప్రదర్శనాన్న తు దృష్టతః ।**
**తచ్ఛుద్ధిః ప్రత్యాహికక్షుత్ప్రతీకారవదత్ర తు ॥ 31**

**ప్ర :** నివృత్తేః అపి = మోక్షానుభవము గూడ, ప్రత్యాహిక = దైనందిన, క్షుత్ = ఆకలి, తత్ శుద్ధిః = అది తీరుట వలన కలుగు తృప్తి, ప్రతీకారవత్ = ఎప్పటికప్పుడు ప్రతిక్రియద్వారా కలిగిన విధముగా, అత్ర తు = ఆ విషయమున గూడ, అనువృత్తిప్రదర్శనాత్ = యోగసమాధి కలిగినంత కాలమే, అందువలననే, దృష్టతః తు = దర్శనమువలననైతే, న = కాదు.

**తా :** ప్రవృత్తినుండి నివృత్తి కలుగుట యనునది కొద్ది కాలము యోగసమాధిస్థితిలో కలిగి మరల అనుభవమునకు రాకుండునదియే కావున ఆకలిగొన్నవాడు మరల మరల ఆహారమును సేవించి తృప్తి జెందినట్లు, మోక్షానుభవము కోరినపుడెల్ల సమాధిస్థితిని పొందుటే ఉపాయమగును కాని ఆత్మదర్శనమొక్కసారి కలిగినందువలన నిల్చిపోవునది కాదు. *

**శ్లో॥ న భవేత్పురుషార్థత్వం తత్ప్రతీకారచేష్టనాత్ ।**
**ఇత్యాహ సాంఖ్యోప్యేతన్మే నేష్టం దృష్టవిరోధతః ॥ 32**

**ప్ర :** తత్ ప్రతీకారచేష్టనాత్ = (పై శ్లోకమున చెప్పబడిన), ఆ ప్రతీకారచర్యగా మాటిమాటికి సమాధిని పొంది దుఃఖోపశమనమును కలిగించుకొనుటవలన, పురుషార్థత్వమ్ = మోక్షమను సర్వపురుషార్థపరమత్వము, న భవేత్ = కలుగదు, ఇతి = అని, సాంఖ్య = కపిలమహర్షి ప్రతిపాదించిన సాంఖ్యసిద్ధాంతము, ఆహ = చెప్పినది; దృష్టవిరోధతః = ఏకమేవ అద్వితీయం బ్రహ్మ అను అద్వైతదర్శనమునకు మోక్షము అచింత్యమను సాంఖ్యదర్శనము విరుద్ధము కావున, తత్ అపి = ఆ సాంఖ్యముగూడ, మే = నాకు, న ఇష్టం = ఇష్టము కాదు.

**తా :** సమాధిస్థితిలో మాత్రమే పొందగలిగిన ఆ ప్రశాంతి యనబడు మోక్షము నిజమునకు దుఃఖోపశమనమార్గమే తప్ప మోక్షమనుట పొసగదు, అని మోక్షమిట్లు లేనేలేదని కపిలుని సాంఖ్యసిద్ధాంతము కదా. ఇది శ్రీ శంకరుని అద్వైతమునకు విరుద్ధము కనుక ఇదియు నాకు సమ్మతము గాదు. *

**శ్లో॥ పుమర్థశూన్యపుంసః స్యాద్ధర్మమేఘసమాధినా ।**
**క్లేశకర్మవిముక్తిర్వై తదా జ్ఞానం విముక్తిదమ్ ॥ 33**

**ప్ర :** పుమర్థశూన్యపుంసః = పురుషార్థములులేని పురుషులకు, ధర్మమేఘసమాధినా = ధర్మమను అమృతమును వర్షించు సమాధిచేత, క్లేశకర్మవిముక్తిః = దుఃఖదాయకమైన కర్మనుండి విముక్తి, స్యాత్ = అగును, తదా = అట్లు, అప్పుడు, జ్ఞానం వై = జ్ఞానమే, విముక్తిదమ్ = ముక్తిని ప్రసాదించునది యగును.

**తా :** పురుషార్థములు లక్ష్యముగా జీవించని వారికి ధర్మము అనునది ఒక్కటియైనను అమృతమును వర్షించి అది కర్మఫలదుఃఖములను తొలగించును. ఆ విధముగా ధర్మాధర్మవిచక్షణజ్ఞానమే వారికి ముక్తిని ప్రసాదించును. *

**శ్లో॥ సర్వావృతిమలాస్తస్యాకర్మస్య శుక్లకృష్ణకమ్ ।**
**ఇతరేషాం తు త్రివిధం తద్విపాకో ద్వయాత్మకః ॥ 34**

**ప్ర :** సర్వ = అన్ని విధముల, ఆవృతిమల = ఆవరణముల యొక్క మాలిన్యము, అస్తస్య = తొలగిపోయినవాని యొక్క, అకర్మస్య = కర్మలేనివానియొక్క, తత్ = ఆ కర్మయొక్క, విపాకః = ఫలము, ద్వయాత్మకః = రెండు విధములైనది, శుక్లకృష్ణకమ్ = శుక్లకృష్ణమార్గములు; ఇతరేషాం తు = తదితరులకేమో, త్రివిధమ్ = మూడు విధములు.

**తా :** అన్ని ఆవరణముల మాలిన్యమును త్యజించినవాడు అనగా సంన్యసించినవాడు, వానికి కర్మమాలిన్యము అంటదు. కాని ఆ కర్మఫలమును మాత్రము శుక్లకృష్ణమార్గములలో అనుభవించును. ఇతరులకు ఆ కర్మఫలము ఇష్టం, అనిష్టం, ఇష్టానిష్టం అని మూడు విధములు. *

**శ్లో॥ క్రియాయోగౌ తన్నివృత్త్యై తపోజపముఖా క్రియా ।**
**సంప్రజ్ఞాతేతరౌ యోగౌ ధర్మౌ చిత్తస్య పఞ్చ చ ॥ 35**

**ప్ర :** తత్ నివృత్త్యై = ఆవరణముల నివారణకై, తపః జపముఖా = తపస్సు, జపము మొదలగు క్రియలతో కూడిన, క్రియా యోగౌ = కర్మ, యోగము అనునవి రెండు; ఇతరౌ = ఇతరములు రెండు, సంప్రజ్ఞాత = సంప్రజ్ఞాతము, యోగౌ = యోగములు, ధర్మౌ = రెండు ధర్మములు, చిత్తస్య = చిత్తము యొక్క, పంచ చ = ఐదైనవియు *

**శ్లో॥ భువో మూఢక్షిప్తవిక్షిప్తైకాగ్ర్యవినిరుద్ధకాః ।**
**తిస్రో బన్ధాయ ముక్త్యై ద్వే యోగినామీశసేవినామ్ ॥ 36**

**ప్ర :** భువః = భూములు, మూఢక్షిప్త విక్షిప్త+ఏకాగ్ర్య వినిరుద్ధకాః = మూఢ, క్షిప్త, విక్షిప్త, ఏకాగ్ర్య, వినిరుద్ధకములనబడునవి; (వీనిలో), తిస్రః = మూఢ, క్షిప్త, విక్షిప్త అను మూడును, బంధాయ = బంధమునకైన భూములు, ద్వే = ఏకాగ్ర్య, వినిరుద్ధకము లనబడు రెండును, ఈశ సేవినామ్ = ఈశ్వరసేవకులైన, యోగినామ్ = యోగులయొక్క, ముక్త్యై = ముక్తికొరకగునవి.

**తా :** ఆవరణముల నివారించుటకై చేయదగిన కర్మలు జపతపాదులు, యోగసాధనలను రెండు విధములు. సంప్రజ్ఞాతమునకంటె భిన్నములైనవి. చిత్తసంబంధి యోగధర్మములు రెండిటి భూములయిదు. ఇవి: మూఢ, క్షిప్త, విక్షిప్త, ఏకాగ్ర్య, వినిరుద్ధకములు. వీనిలో మొదటి మూడును బంధమును కలిగించునవి కాగా మిగత రెండును బంధముక్తిని కలిగించునవి. *

**శ్లో॥ శాన్తోగ్రమూఢవృత్త్యూనే చిత్తే నిత్యైకరూపిణః ।**
**స్వరూపేఽవస్థితిర్ద్రష్టుర్వృత్తిసారూప్యమన్యథా ॥ 37**

**ప్ర :** శాన్త = శాంతించిన, ఉగ్ర = కామక్రోధాది రజోగుణసంబంధులు, మూఢ = ఆలస్యభ్రాంతి-నిద్రాది తమోగుణసంబంధులునైన, వృత్తి = వృత్తులు లేక వికారములు, ఊనే చిత్తే = లేని

చిత్తమునందు, నిత్య+ఏకరూపిణః = ఎప్పుడును ఏకాగ్రత గల, ద్రష్టుః = యోగికి, స్వరూపే = ఆత్మరూపమునందు, అవస్థితిః = నిలిచియుండుట, అన్యథా = మరియొకవిధమున, వృత్తి = వర్తనమందు, సారూప్యమ్ = ఆత్మజ్ఞానియై యుండుట.

**తా :** రాజసవికారములు, తామసవికారములు పూర్తిగా శాంతించిన చిత్తము ఏకాగ్రము కాగా, అట్టి యోగి ప్రత్యక్ష (అపరోక్ష) అనుభూతితో ఆత్మయందే నిలిచి యుండును. లేదా, ఒకవేళ, బహిర్ముఖుడైనను, వాని వర్తనమున ఆత్మజ్ఞానము రూపుదాల్చి యుండును. *

**శ్లో॥ తచ్ఛుద్ధిసామ్యం కైవల్యం సత్త్వపుంసోస్తు యోగతః ।**
**సర్వజ్ఞానం సర్వజయః ప్రకాశావరణక్షయః ॥ 38**

**ప్ర :** సత్త్వపుంసోః తు = సత్త్వగుణమును సాధించినవానికైతే, యోగతః = యోగము కారణముగా, తత్ శుద్ధి సామ్యమ్ = ఆ శుద్ధి సమత్వమైన, కైవల్యమ్ = మోక్షము, అనగా, సర్వజ్ఞానమ్ = సమస్త విశ్వమును గురించిన ఎఱుక, సర్వజయః = సంకల్పసిద్ధి, ప్రకాశ+ఆవరణక్షయః = ప్రాకృతికమైన సర్వావరణములు తొలగిపోవుట.

**తా :** సత్త్వగుణమును సాధించినవానికి, యోగియైన కారణముగ, ఆవరణశుద్ధిపూర్వక కైవల్యము, సర్వజ్ఞత్వము, సర్వజయము, ప్రాకృతికావరణముల ప్రభావము తొలగిపోవుట అనునవి సిద్ధించును. *

**శ్లో॥ సిద్ధిలాభః కాయసమ్పత్తద్ధర్మానాభిఘాతనమ్ ।**
**దోషబీజక్షయే యోగాత్కైవల్యాస్య కా కథా ॥ 39**

**ప్ర :** సిద్ధిలాభః = అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అను అష్టసిద్ధులు లభించుట, కాయసంపత్ = భూతభౌతికమైన, ధర్మ+అనభిఘాతనమ్ = ధర్మములచేత బాధింపబడకుండుట, దోషబీజక్షయే = దోషబీజము నశించుటచేత, యోగాత్ = యోగమువలన, కైవల్యస్య = మోక్షప్రాప్తియనుట, కా కథా = చెప్పవలెనా?

**తా :** అణిమాది అష్టసిద్ధులు లభించుట, శరీరము తనధర్మములైన పాంచభౌతికతవలన బాధింపబడకుండుట, దోషబీజమేలేని శుద్ధసత్త్వస్వరూపుడైన యోగికి మోక్షము సిద్ధించుననుట సహజోక్తి. *

**శ్లో॥ ఇతి చక్షుఃశ్రవాః ప్రాహ నేదం దోషశ్రుతేర్వరమ్ ।**
**అథాతో బ్రహ్మజిజ్ఞాసేత్యుపక్రమ్య యతోఽస్య చ ॥ 40**

**ప్ర :** ఇతి = అని, చక్షుఃశ్రవాః = శేషుడు, ప్రాహ = చెప్పెను, ఇదమ్ = ఇది, దోషశ్రుతః = '**బ్రహ్మైవ సన్ బ్రహ్మాపి ఏతి**', అను శ్రుతిదోషము కంటె, న వరం = మేలైనది కాదు; అథ =

సాధనసంపత్తిని సేకరించిన తరువాత, అతః = అక్కడనుండి, బ్రహ్మజిజ్ఞాసా = బ్రహ్మమును తెలియు కోరిక, ఇతి = అని, ఉపక్రమ్య = ప్రారంభించి, యతః = యెందువలన, బ్రహ్మసూత్ర సిద్ధాన్తచర్చయో, అస్య చ = దాని విషయము గూడ.

**తా :** ఇట్లని శేషుడనును. ఇది దోషశ్రుతికంటె మిన్నయేమున్నది? **అథాతో బ్రహ్మజిజ్ఞాసా** అని ప్రారంభించు బ్రహ్మసూత్రముల సిద్ధాంతచర్చ కూడ. *

**శ్లో॥ జన్మాద్యుపాధేరాత్మానౌ గుహావిష్టౌ ప్రదర్శ్య చ ।**
**తదైక్యార్థం శమాద్యుక్త్వా తత్సిద్ధ్యర్థం క్రియాదికమ్ ॥ 41**

**ప్ర :** జన్మ+ఆది = జన్మతో మొదలగు, ఉపాధేః = శరీరమువలన, గుహావిష్టౌ = హృదయమున ప్రవేశించియున్న, ఆత్మానౌ = జీవాత్మ పరమాత్మలను, ప్రదర్శ్య చ = ప్రదర్శించియును, తత్+ఐక్యార్థమ్ = ఆ రెండిటి ఏకత్వసాధనకై, శమాది = శమము, దమము, తితిక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానములనబడు షడ్గుణసంపత్తి సాధ్యములని, ఉక్త్వా = చెప్పి, తత్ సిద్ధ్యర్థమ్ = దానిని సాధించుటకు, క్రియా+ఆదికమ్ = అన్నిటిని సాధించుటకు యజ్ఞాది కర్మకాండను,

**శ్లో॥ పునః కామ్యక్రియాకర్తుర్విఫలం చార్చిరాదినా ।**
**ప్రదర్శ్యాసకృదావృత్త్యా శ్రవణాదేః పరాత్మనోః ॥ 42**

**ప్ర :** పునః చ = మరలను, అర్చిః ఆదినా = అర్చిరాదినా తత్ప్రథితేః అని ప్రమాణీకరింపబడినట్లు, కామ్యక్రియాకర్తుః = కామ్యకర్మలయొక్క, విఫలమ్ = అశాశ్వతత్వము వలని ఆ యా ఫలముల అశాశ్వతత్వమును, ప్రదర్శ్య = నిరూపించి, అసకృత్ ఆవృత్త్యా = పదే పదే తఱచుగా, పరాత్మనోః = జీవాత్మ పరమాత్మల యొక్క (గురించి), శ్రవణ+ఆదేః = శ్రవణము, కథనము, పఠనము, మననము అనబడు సాధనలవలన,

**శ్లో॥ విజ్ఞానాత్పురుషార్థత్వం పూర్వోత్తరమలక్షయః ।**
**ఇతరస్యాప్యసంశ్లేషో యావదారబ్ధమీక్షితుః ॥ 43**

**ప్ర :** విజ్ఞానాత్ = విశేషజ్ఞానము ద్వారా, పురుషార్థత్వమ్ = పురుషార్థపర్యవసానముగా మోక్షము, పూర్వ+ఉత్తరమలక్షయః = సంచితప్రారబ్ధాది కర్మఫలపాపము నశించుట, ఇతరస్య అపి = పుణ్యకర్మల పుణ్యఫలమున్నూ, యావత్ = ఎంతలో, ఆరబ్ధమ్ = మొదలగునో, (అంతలో), ఈక్షితుః = సాక్షిమాత్రుడైన జ్ఞానికి, అసంశ్లేషః = అంటకుండుట (భోగము లేకుండుట).

**తా (శ్లో.41-43):** జన్మతో ఉపాధి లభించినందువలన, ఆ శరీరమున హృదయమున కొలువై యున్న జీవాత్మ పరమాత్మలొక్కటైన స్వస్వరూపమును దర్శించుటకు, ఆ ఐక్యతను సాధించుటకు శమాది షడ్గుణసంపత్తిని ముందుగా సాధించవలెనని చెప్పి, అందుకై యజ్ఞాది కర్మకాండ ఆవశ్యకతను ప్రతిపాదించి, మరల ఆ కామ్యక్రియల ఫలము అశాశ్వతమని నిరూపించి, శ్రవణ

మననాది సాధనల వలన తఱచుగా జీవాత్మ పరమాత్మల గురించి విశేషజ్ఞానమును సంపాదించుట ద్వారా తురీయపురుషార్థమైన మోక్షము, పాపపుణ్యకర్మఫలనాశమున్ను, ఈ జన్మలో చేసిన కర్మలు కూడ, సాక్షిమాత్రుడైన జ్ఞానికి భుక్తము కాకుండుట చెప్పబడినవి. *

**శ్లో॥ శబ్దాదనావృత్తిరితి బ్రాహ్మణేనోపసంహృతమ్ ।**
**ప్రమాణయుక్తితస్త్వేతైః స్వస్వపక్షో దృఢీకృతః ॥ 44**

ప్ర : శబ్దాత్ = '**న స పునరావర్తతే**' అని శబ్దము, అనగా, నోటిమాటగా చెప్పబడినది (నైయాయికులంగీకరించిన ప్రమాణము), అనావృత్తిః = పునరావృతము కానిది, ఇతి = అని, బ్రాహ్మణేన = వ్యాసునిచేత, ఉపసంహృతమ్ = ఉపసంహరించబడినది; ప్రమాణయుక్తితః తు = అనుకూలమైన శ్రౌతప్రమాణముతోనేమో, ఏతేః = వీనియొక్క, స్వస్వపక్షః = తమ తమ పక్షము, దృఢీకృతః = పటిష్ఠముగ చేయబడినది.

**తా :** నైయాయికులంగీకరించిన శబ్దప్రమాణము వ్యాసునిచే తిరస్కరింపబడినది. తమకు అనుకూలమైన శ్రుతి ప్రమాణముతో ఎవరికి వారు తమ వాదమును గట్టిగా వినిపించుచున్నారు. *

**శ్లో॥ ఇతరేఽప్యమృతత్వం చ బహుధా దర్శయన్త్యహో! ।**
**ఈశస్యాభావమన్యత్వం సర్వజ్ఞత్వాది కేచన ॥ 45**

**ప్ర :** కేచన = కొందరు, ఇతరే అపి = ఇతరులు కూడ (శూన్యవాదులు), ఈశస్య = ఈశ్వరుని యొక్క, అభావమ్ = లేకపోవుటను, సర్వజ్ఞత్వ+ఆది = సర్వజ్ఞత్వము మొదలైనవానిని, చ = మరియు, అమృతత్వమ్ = మోక్షమును, అన్యత్వమ్ = కర్మల ననుసరించి ఫలముండుటను, చ = కూడ, బహుధా = అనేకవిధముల, దర్శయన్తి = దర్శించుచున్నారు, అహో = ఔరా!

**తా :** బౌద్ధమాది కొన్ని ఇతర దర్శనములు దేవుడు లేడని శూన్యవాదము చేయుచునే, కర్మ-ఫలానుభవము తప్పదనుచు, సర్వజ్ఞత్వసిద్ధి, మోక్షసిద్ధి కలవని నమ్మబలుకును. ఏమాశ్చర్యము!

**శ్లో॥ కేచిత్ప్రధానప్రాధాన్యం కేచిదీశస్య చోభయోః ।**
**అగ్రేఽణూన్సదసత్కేచిత్కేచిదారమ్భవాదినః ॥ 46**

**ప్ర :** కేచిత్ = కొందరు, ప్రధాన = ప్రధానముయొక్క, ప్రాధాన్యమ్ = ప్రాముఖ్యతను, కేచిత్ = కొందరు, ఈశస్య = ఈశ్వరుని యొక్క (ప్రాముఖ్యత), చ = మరియు, ఉభయోః = ప్రధానము, ఈశ్వరుడు, ఇద్దరియొక్క ప్రాముఖ్యతను, కేచిత్ = కొందరు, అగ్రే = కారణమూలముగా, అణూన్ = అణువులను, సత్+అసత్ = సత్తు అసత్తు అనువానిని, కేచిత్ = కొందరు, ఆరంభవాదినః = ఈశ్వరుడే పరమకర్తయని సిద్ధాంతీకరించువారు.

**తా :** కొందరు సాంఖ్యవాదులు సత్త్వరజస్తమో గుణములు సమతౌల్యస్థితిగల ప్రధానము లేక ఆద్యాప్రకృతియొక్క ప్రముఖతను చెప్పగా, మరికొందరు, ఈశ్వరుడే సర్వప్రధానుడను పాతంజల

సిద్ధాంతమును చెప్పుదురు. కొందరు రెండిటిని అంగీకరింతురు. కొందరు అణువాదులు పరమాణువే సర్వాధారమందురు. కొందరు సత్తు అనుచు ఉనికి అనునదే మూలము, దానినుండి అసత్తు కలిగినదని శాశ్వత, అశాశ్వత తత్త్వమును వివరింతురు. మరియును కొందరు ఈశ్వరుడే పరమకర్తయనియు, ప్రకృతి నిమిత్తకర్త యనియు వాదింతురు. *

**శ్లో॥ పరిణామపరాః కేచిద్వివర్తమతయోఽపరే ।**
**ఏవం విప్రతిపత్త్యా మే దౌర్మనస్యమభూత్ప్రభో! ॥ 47**

**ప్ర :** కేచిత్ = కొందరు, పరిణామపరాః = క్రమపరిణామమే సృష్టియని వాదించువారు, అపరే = మరికొందరితరులు, వివర్తమతయః = ఉభయదోషములను (అనగా గుణవికారము, పరిణామము అను వానిని) పరిహరించుటకు, జగత్తు బ్రహ్మమునకు రూపాంతరమే యను వివర్తవాదులు, ఏవమ్ = ఈ విధముగ, విప్రతిపత్త్యా = పరస్పర విరుద్ధవాదములలో, మే = నాకు, దౌర్మనస్యమ్ = దుఃఖము, అభూత్ = అయినది, ప్రభో! = ఓ ప్రభూ!

**తా :** కొందరు సృష్టి క్రమపరిణామ ఫలితమను పరిణామవాదులు; కొందరు సృష్టి గుణవికారము అనగా, ఈ రెండిటి పరిహరించు వివర్తవాదులు జగత్తు బ్రహ్మరూపాంతరమందురు; ఇట్టి ఏకాభిప్రాయమునకు తావులేని వాదములన్నియు తెలిసికొన్న మీదట నా కీ దుఃఖము కలిగినది, ప్రభూ! *

**శ్లో॥ ఏతేషాం కతమః శ్రేయాఞ్ఛివః పన్థాఽభయప్రదః ।**
**సుగమో మేఽద్య కృపయా సంప్రదర్శయ సద్గురో! ॥ 48**

**ప్ర :** సద్గురో = ఓ సద్గురు!, ఏతేషామ్ = వీనిలో, కతమః = యేది, అభయప్రదః = భయమును తొలగించు, శివః పన్థా = సుఖకరమైన మార్గమగు, శ్రేయాన్ = శ్రేయస్కరమైన, సుగమః = సులభసాధ్యమైనదో, మే = నాకు, అద్య = ఇప్పుడు, కృపయా = దయతో, సంప్రదర్శయ = తెలియజెప్పుము.

**తా :** ఓ సద్గురూ! ఇన్ని మార్గములలో యేది అభయప్రదమో, సులభసాధ్యమో, శివంకరమో, మోక్షప్రదమో నా కిప్పుడు దయతో తెలియజెప్పుము. *

**శ్లో॥ భిక్షాచర్యం మే దయాలో యదర్థం**
**తప్తం యత్నాత్తత్తపో మే యదర్థమ్ ।**
**దైవాదాప్తం ప్రార్థయే త్వాం తదర్థం**
**దుఃఖాఢ్యం వీక్ష్యైహికాముష్మికార్థమ్ ॥ 49**

**ప్ర :** దైవాత్ = దైవవశమున, మే = నాకు, యదర్థమ్ = ఏ ప్రయోజనసాధనకై, భిక్షాచర్యమ్ = సన్న్యాసము, ఆప్తమ్ = ప్రాప్తమైనదో, యదర్థమ్ = ఏ ప్రయోజనమునకై, యత్నాత్ = ప్రయత్న

పూర్వకముగ, మే = నా యొక్క, సత్+తపః = ఉత్తమమైన తపస్సు, తప్తమ్ = తపించబడినదో, ఐహికదుఃఖాఢ్యమ్ = సంసారదుఃఖముతో గుర్తింపుగలదానిని, వీక్ష్య = చూచి, ఆముష్మికార్థమ్ = ఆత్మోద్ధారకమైన, తదర్థమ్ = ఆ ప్రయోజనమును, దయాలో = ఓ దయామయా!, త్వామ్ = నిన్ను, ప్రార్థయే = ప్రార్థించుచున్నాను.

**తా :** ఓ దయామయా! దైవవశమున నాకు సన్న్యాసము లభించినది. అట్లే తపస్సు చేయుటయు ఒనగూడినది. దుఃఖభూయిష్టమైన సంసారమును, దానినుండి విడుదలకై ఆత్మజ్ఞానమును పరిశీలించి నా కీ సంన్యాసము, తపస్సు కలుగుటలో ఉద్దిష్ట ప్రయోజనమేమియో, ఆ ఆత్మార్థమును నాకు ప్రసాదించుడు. *

**శ్లో॥ ఇన్ద్రియోత్థం సుఖం తుచ్ఛమాగమాపాయిధర్మకమ్ ।**
**కోఽవశం క్షణికం విద్వానిచ్ఛేదిహ పరత్ర చ ॥ 50**

**ప్ర :** ఇన్ద్రియ+ఉత్థం సుఖమ్ = ఇంద్రియముల వలన కలుగు సుఖము, తుచ్ఛమ్ = హీనమైనది, ఆగమాపాయిధర్మకమ్ = జననమరణమూలకమైన అపాయమును కలిగించునది, క్షణికమ్ = క్షణకాలముండి పోవునది, (ఇట్టి దానిని), ఇహ = ఈ లోకమున గాని, పరత్ర చ = మరియొక లోకమున గాని, కః విద్వాన్ = ఏ జ్ఞాని, అవశమ్ = అవశుడై, ఇచ్ఛేత్ = కోరుకొనును?

**తా :** ఇంద్రియసుఖములు క్షణికములు, హేయములు, జననమరణాది కర్మపరిపాకమునకు ఫలములు, ఇట్టి సుఖములను విద్వాంసుడెవడు తెలిసి తెలిసి ఇహపరముల నెక్కడగాని కోరుకొనునంత అవశుడగును? *

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ప్రథమాష్టకే ద్వితీయోఽధ్యాయః ॥

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## ప్రథమాష్టకము - తృతీయాధ్యాయము

**శ్లో॥ ఏతా యాః సద్గిరః శ్రుత్వా శ్రీదత్తో భగవాన్ ప్రభుః ।**
**దయాలుర్దయనీయం తమభినన్ద్యాఽఽహ సాదరమ్ ॥ 1**

**ప్రతిపదార్థం :** యాః ఏతాః సద్గిరః = ఇట్టి యీ మంచి మాటలను, శ్రుత్వా = విని, దయాలుః ప్రభుః = దయగల ప్రభువైన, భగవాన్ శ్రీదత్తః = శ్రీ దత్తభగవానులు, సాదరమ్ = ఆదరముతో, అభినన్ద్య = వానిని అభినందించి, దయనీయం తమ్ = జాలిగొలుపుచున్న వానిని ఉద్దేశించి, ఆహ = పలికెను.

**తాత్పర్యం :** వాని జాలి మాటలను విని, ఆ మాటలలోని ఆంతర్యమెంత ఉత్తమమో భావించి, దయగల ప్రభుపాదుడు తొలుత వాని నభినందించి, శ్రీదత్తభగవానుడు సాదరముగ వానితో నిట్లనెను. *

**శ్లో॥ సమ్యగ్వ్యవసితా బుద్ధిస్తత్త్వజిజ్ఞాసయా తవ ।**
**సమీచీనః కృతోఽయం తే ప్రశ్నోఽతోఽవహితః శృణు ॥ 2**

**ప్ర :** తవ బుద్ధిః = నీ వివేకము, తత్త్వజిజ్ఞాసయా = సర్వాధారసత్యమును తెలిసికొనవలెనను కోరికతో, సమ్యక్ = బాగుగ, వ్యవస్థితా = పరిణతి చెందినది; అయం తే కృతః ప్రశ్నః = నీ చేత చేయబడిన ఈ ప్రశ్నము, సమీచీనః = అడుగ దగినది; అతః = అందువలన, అవహితః = సావధానుడవై, శృణు = వినుము.

**తా :** సర్వమూలకసత్యము నెఱుగవలెనను కోరికతో జ్ఞానోన్ముఖుడవైన నీ వివేకము చక్కగా వికసించినది. కనుక నీ వడిగిన ప్రశ్న సరియైనది. అందువలన సావధానుడవై వినుము. *

**శ్లో॥ యావన్న జాయతే సాక్షాదీశ్వరాత్సమనుగ్రహః ।**
**సచ్ఛాస్త్రం సద్గురుశ్చాపి తావల్లభ్యః కృతో నృణామ్ ॥ 3**

**ప్ర :** యావత్ = ఎంతకాలమునకు, సాక్షాత్ = నేరుగా, ఈశ్వరాత్ = పరమాత్మునినుండి,

సమనుగ్రహః = అందుకవసరమైన అనుగ్రహము, జాయతే = కలుగునో, తావత్ = అంతకాలము వరకు, నృణామ్ = నరులకు, సత్‌శాస్త్రమ్ = తమకు దగిన శాస్త్రము, అపి చ = మరియు, స గురుః = తమకు దగిన గురువు, న లభ్యః కృతః = లభించకుండును.

**తా :** పరమాత్ముని అనుగ్రహము నేరుగా కలుగనంతవరకు నరులకు తమకు సరియైన శాస్త్రముగాని, గురువుగాని లభించుట జరుగదు. *

**శ్లో॥ ఈశ్వరారాధనధియా స్వధర్మాచరణాత్సతామ్ ।**
**ఈశప్రసాదస్తద్రూపః సులభశ్చాత్ర సద్గురుః ॥** 4

**ప్ర :** సతామ్ = సత్పురుషులకు, ఈశ్వర+ఆరాధన-ధియా = ఈశ్వరుని ఆరాధించుచున్నాను అను బుద్ధితో, స్వధర్మ+ఆచరణాత్ = తమ ధర్మమును ఆచరించుట కారణముగా, ఈశ్వరప్రసాదః తద్రూపః = ఈశ్వరప్రసాదరూపమైన, సద్గురుః = సద్గురువు, అత్ర = వారి విషయమున, సులభః చ = అప్రయత్నముగనే లభించును.

**తా :** సత్పురుషులకు తాము తమ తమ నిత్యనైమిత్తికకర్మలన్నిటిని ఈశ్వరార్పణముగ ఈశ్వరారాధన బుద్ధితో చేసినట్లయిన, వారి విషయమున అప్రయత్నముగనే ఈశ్వరప్రసాదముగ సద్గురువు లభించును. *

**శ్లో॥ సద్గురోః సంప్రసాదోఽస్య ప్రతిబన్ధక్షయస్తతః ।**
**దుర్భావనాతిరస్కారాద్విజ్ఞానం ముక్తిదం క్షణాత్ ॥** 5

**ప్ర :** అస్య = అట్టివానికి, ప్రతిబన్ధక్షయః = మోక్షమున కాటంకమైన పాపము నశించుట, తతః = ఆ కారణముగ, దుర్భావనాతిరస్కారాత్ = సంశయము, భావరాహిత్యము, విపరీతభావన అనబడు దుర్భావనలను తిరస్కరించుటవలన, క్షణాత్ = వెంటనే, ముక్తిదం విజ్ఞానమ్ = ముక్తిప్రదమైన విశేషజ్ఞానము, అనునివి, సద్గురోః = సద్గురువుయొక్క, సంప్రసాదః = శ్రేయోదాయకమైన అనుగ్రహఫలము.

**తా :** అట్లు సద్గురువు లభించిన వానికి పాపనాశము, దుర్భావనలు నెట్టివేయబడుట, వీని వలన విశేషమైన జ్ఞానము తద్ద్వారా సద్యోముక్తి, ఇవి సద్గురుని ప్రసాదముగ లభించునవి. *

**శ్లో॥ తస్మాత్త్వమిహ ధన్యోఽసి యతస్తే బుద్ధిరీదృశీ ।**
**అతోఽప్యనపగామీహ సంప్రాప్తోఽస్మి యదృచ్ఛయా ॥** 6

**ప్ర :** తస్మాత్ = ఆ కారణముగా, త్వమ్ = నీవు, యతః = ఏ కారణమువలన, తే బుద్ధిః = నీ వివేకము, ఈదృశీ = ఇట్టిదాయెనో, ఇహ = లోకమున, ధన్యః = ధన్యుడవు, అసి = అయియున్నావు; అతః అపి = అందువలనను, ఇహ = ఇచట, అనపగామీ = అవినాశినైన, (అహం

= నేను), యదృచ్ఛయా = నా యంతట నేను, సంప్రాప్తః = వచ్చిన వాడను, అస్మి = అయి యున్నాను.

**తా :** నీవు వివేకివైనందువలన ధన్యుడవైతివి. ఆ కారణమున అవినాశినైన నేను స్వేచ్ఛగా వచ్చి యున్నాను. *

**శ్లో॥ స్వాత్మవిజ్ఞానేన ముక్తిర్న పదార్థవివేకతః ।**
**బ్రహ్మవిత్పరమాప్నోతి పదం తన్నైవ కర్మఠః ॥ 7**

**ప్ర :** స్వ+ఆత్మవిజ్ఞానేన = తనదైన ఆత్మను గురించిన విశేషజ్ఞానముచేత, ముక్తిః = ముక్తి, పదార్థవివేకతః = పదార్థవివేచనవలన, న = కాదు; బ్రహ్మవిత్ = బ్రహ్మజ్ఞాని, పరం పదమ్ = పరమపదమును, ఆప్నోతి = పొందుచున్నాడు; తత్ = అది, కర్మఠః న ఏవ = కర్మిష్ఠి కాదు.

**తా :** ఆత్మజ్ఞానముచేత మాత్రమే ముక్తి. పదార్థవివేచనవలన కాదు. బ్రహ్మజ్ఞాని పరమపదమును పొందుచున్నాడు, కర్మిష్ఠి కాదు. *

**శ్లో॥ శోకం తరత్యాత్మవిన్నో క్షణికాకనివృత్తిమాన్ ।**
**అద్వితీయాత్మద్రష్టేహాభయం విన్దతి నేతరః ॥ 8**

**ప్ర :** ఆత్మవిత్ = ఆత్మజ్ఞాని, శోకమ్ = దుఃఖమును, తరతి = దాటును, క్షణికాక = క్షణికమైన, నివృత్తిమాన్ = ఉపశమనమును కోరువాడు, న = కాదు; అద్వితీయ+ఆత్మద్రష్టా = అఖండాత్మ దర్శనము గలవాడు, ఇహాభయమ్ = సంసారదుఃఖభయములేని స్థితిని, విన్దతి = పొందుచున్నాడు, న ఇతరః = అన్యుడు కాదు.

**తా :** ఆత్మజ్ఞానికి దుఃఖము కలుగదు. తన దుఃఖములనుండి తాత్కాలికోపశమనములను పొందగోరు వాని దుఃఖము తీరదు. అఖండాత్మద్రష్టకు అభయము లభించును. అన్యులకు కాదు.

**శ్లో॥ రసలాభాత్పరానన్దీ భవతీతరథా న తు ।**
**కర్తృత్వాదివిహీనస్య విభోర్నిత్యైకరూపిణః ॥ 9**

**ప్ర :** రసలాభాత్ = సారగ్రహణమువలన, **రసంహ్యేవాయం లబ్ధ్వాఽఽనన్దీ భవతి** యను వాక్యార్థము ననుసరించి అఖండైకత్వసారగ్రహణమువలన, ఆనన్దీ = ఆనందించినవాడు, భవతి = అగుచున్నాడు, ఇతరథా తు = వేరు పద్ధతిలోనైతే, న = కాదు; కర్తృత్వ+ఆది = కర్తృత్వము మొదలగునవి, విహీనస్య = లేనటువంటి, విభోః = సర్వవ్యాపకుడైన, నిత్య+ఏకరూపిణః = సదా అఖండపూర్ణుడైన వానికి

**శ్లో॥ జగదారమ్భకత్వం నో ఘటతేఽస్యాక్రియస్య హి ।**
**పరిణామోఽపి న సతో నిరంశస్యావికారిణః ॥ 10**

**ప్ర :** అస్య అక్రియస్య హి = అట్టి కర్మయే లేని వానికి, జగత్+ఆరంభకత్వమ్ = సృష్టికి కర్తగా

ప్రారంభించువాడగుట, నో ఘటతే = సంభవించదు; నిరంశస్య = అంశలుగా భాగింపరాని అఖండైకరూపునకు, అవికారిణః = నిర్వికారునకు, పరిణామః అపి = మార్పుల పరంపర యనునది కూడ, సతః = ఉనికియే తానైన వానికి, న = లేదు.

**తా :** 8వ శ్లోకంలో చెప్పబడిన అఖండాత్మద్రష్టకు సారగ్రహణముచే ఆనందము కలుగును, మరియొక విధమున కాదు. క్రియాకర్తృత్వము లేని ఏకరూపియైన వ్యాపకునకు జగత్తు నారంభించుట సృష్టి చేయుట యనునది ఉండదు కదా. అట్లే, అవిభక్తనిర్వికారపూర్ణుడు మార్పులకు లోనగుట, ఆ కారణమున నామరూపగుణాది లక్షణములను భిన్నవిభిన్నములుగ పరిణామ-ఫలముగా పొందుట యనునది కూడ అసంభవమే. *

**శ్లో॥ నాణవోఽగ్రేఽవిద్యమానాః ప్రభవో జగదుద్భవే ।**
**తేషాం సర్వాత్మసంయోగే ప్రథిమాఽనుపపత్తితః ॥ 11**

**ప్ర :** అగ్రే = మొదట, అవిద్యమానాః అణవః = లేని అణువులు, జగత్+ఉద్భవే = ప్రపంచపు పుట్టుకయందు, తేషామ్ = వాని యొక్క, సర్వ+ఆత్మసంయోగే = అన్ని ఆత్మల కలయికలో, ప్రథిమా = వైశాల్యము, అనుపపత్తితః = ఉద్భవించుట వలన, న ప్రభవః = కలుగదు.

**తా :** అణువాదులు చెప్పిన అణువులు ప్రపంచపు పుట్టుకకు ముందు లేవు, సమస్త మొక్కటే అఖండాద్వయతత్త్వము కనుక. సృష్టియైన తరువాత ఆ అణువులు ప్రభవించుట జరుగదు.

**శ్లో॥ నాప్యసత్కర్తృ తస్యాగ్రేఽప్రామాణ్యాచ్చాప్యసమ్భవాత్ ।**
**జడం ప్రధానమప్యేకం న క్షమం జగదుద్భవే ॥ 12**

**ప్ర :** అసత్+కర్తృ అపి = అసత్తునకు గూడ, (అనగా లేనిదానికి లేక అశాశ్వతమైన దానికి), కర్తయనువాడు, న = లేదు, తస్య అగ్రే = అంతకు ముందు, అప్రామాణ్యాత్ = ప్రమాణము లేనందువలన, అపి చ = కూడ, అసంభవాత్ = అసంభవమైనందువలన, జగత్+ఉద్భవే = ప్రపంచపు పుట్టుక విషయమున, ఏకం జడం ప్రధానం అపి = ఒక ప్రధానమను అచేతన పదార్థము కూడ, న క్షమమ్ = సమర్థము కాదు.

**తా :** సృష్టి విషయమున, తొలుత నొక అసత్తు కలదనుటకు ప్రమాణము ఎట్లుండును? ఆ అసత్తునకు కర్తయొకడుండుటెట్లు? అసత్ అనగా 'లేనిది' అని అర్థము కదా. లేక ఆ అసత్తు తరువాత నొక సృష్టికర్త కలడనుటెట్లు? సృష్టికి మూలమైన ప్రధానమనునది యొకటి కలదనుట మాత్రము పొసగునా? ఆ ప్రధానము అచేతనము కదా. దానినుండి చేతన ఎట్లు సృష్టియగును? ఇట్లు అదియు అసమర్థమే. *

**శ్లో॥ సృజతీవ తదాత్మైకః స్వైకాంశాదూర్ణనాభివత్ ।**
**లీలాకైవల్యమస్యేదం లోకవత్సమదర్శినః ॥ 13**

**ప్ర :** తత్ = ఆ కారణమున, ఆత్మా ఏకః = అవికృతమైన ఆత్మ, స్వ = తనదైన, ఏకాంశాత్ =

ఒక్క అంశమువలన, ఊర్ణనాభివత్ = సాలీడు విధముగా, ఇదమ్ = ఈ, లీలాకైవల్యమ్ = క్రీడారూపమైన కేవలత్వము, అస్య = దానియొక్క, సమదర్శినః = అవిరుద్ధరూపముగా గ్రహించువారికి, లోకవత్ = లోకముగా, సృజతి+ఇవ = సృష్టించుచున్నదానివలె.

**తా :** పైన చర్చించిన రీతిలో, విచారించిన, అవికృతాత్మయే, సాలీడు తనలో నుండియే తన గూడును సృష్టించుకొన్న విధముగా, తన ఒక్క అంశముతో లోకమును సృష్టించినట్లు తోచును. ఇట్లే లోకము, ఆత్మ సమమని దర్శించువారికి ఒక క్రీడాకైవల్యము యేర్పడినది. *

**శ్లో॥ యథైకస్యాపి పుంసోఽన్తః స్వప్నావేశాత్ క్షణాన్తరే ।**
**సత్యవద్భాతి నానాత్వం బోధే సర్వం విలీయతే ॥ 14**

**ప్ర :** యథా = ఏ విధముగా, ఏకస్య అపి పుంసః = ఒక్కడేయైన వ్యక్తికి, స్వప్న+ఆవేశాత్ = స్వప్నస్థితి కలిగినందువలన, అన్తః = తన లోపల, నానాత్వమ్ = అనేకత్వము, సత్యవత్ = నిజము అనిపించునట్లు, భాతి = ప్రకాశించుచున్నదో, బోధే = మెలకువ కలిగనంతనే, క్షణాన్తరే = ఒక్క క్షణములోనే, సర్వమ్ = అంతయు, విలీయతే = వానిలోనే కలిసి పోవుచున్నదో,

**శ్లో॥ తథాఽఽత్మనోఽనాదిమాయావేశాదేకస్య చాప్యయమ్ ।**
**మిథ్యాభ్రమః ప్రబోధేఽయమేకః స్వాత్మైవ శిష్యతే ॥ 15**

**ప్ర :** తథా = ఆ విధముగా, ఆత్మనః = ఆత్మకు, అనాది = మొదలెఱుగని, మాయా = మాయయొక్క, ఆవేశాత్ = స్థితికలుగుటవలన, ఏకస్య చ అపి = ఒక్కనిదే యైనను, అయమ్ = ఈ, మిథ్యాభ్రమః = లేనిది ఉన్నట్లు అనిపించు భ్రాంతి, ప్రబోధే = ఆత్మజ్ఞానము కలుగుటలో, అయం ఏకః స్వ+ఆత్మా ఏవ = ఒక్కటైన ఈ తన ఆత్మ మాత్రమే, శిష్యతే = మిగులును.

**తా :** ఒకే వ్యక్తి స్వప్నావస్థలో తనయందే ఎన్నిటినో భిన్నభిన్నవస్తువులను, సంఘటనలను, వ్యక్తులను చూచి అవి యథార్థమనియే భావించినను, ఆ వ్యక్తి ఆ స్వప్నావస్థనుండి జాగ్రదవస్థలోనికి మేల్కొనిన వెంటనే అన్నియు మాయమై తానొక్కడే మిగిలినట్లు, ఆత్మజ్ఞానము గలవానికి మాయక్రమ్మినందువలన, లోకభ్రాంతి కలుగును. ఐనను ఆ భ్రాంతినుండి మేల్కొని ఆత్మయే తానని, లోకము భ్రాంతి యని తెలియును. *

**శ్లో॥ భాతీదం స్వాన్తరాదర్శదృశ్యవన్మాయయా బహిః ।**
**స్వప్నవజ్జాతమివ తత్ప్రబుద్ధః స శివోఽస్మ్యహమ్ ॥ 16**

**ప్ర :** స్వ+అన్తః = తన లోపల, ఆదర్శదృశ్యవత్ = అద్దములోని దృశ్యమువలె, మాయయా = మాయచేత, స్వప్నవత్ = స్వప్నమువలె, జాతం ఇవ = పుట్టినదివలె, ఇదమ్ = ఇది (ప్రపంచము), భాతి = ప్రకాశించుచున్నది; తత్ = అది, ప్రబుద్ధః = మేల్కొన్నదై, సః శివః అహం అస్మి = ఆ శివుడను నేను అయియున్నాను (అని తెలియవచ్చును).

**తా :** అద్దములో దృశ్యము ప్రకాశించినట్లు, తనలోనే స్వప్నము ప్రకాశించి, ఆ స్వప్నజగత్తు

మాయ ఉపసంహరింపబడగా, నిద్ర మేల్కొన్నవాడు తనను తానే సమస్తాధారునిగా తెలిసికొన్న వాడైనట్లు, ఆత్మజ్ఞాని '**శివోఽహమ్**' అను జ్ఞానముతో మెలగును. *

**శ్లో॥ ఏవం శ్రద్ధాభక్తియుక్తః సంశయం యో విభావయేత్ ।**
**దేవసద్గురుభక్తోఽస్య కుతోఽయం శిష్యతే భ్రమః ॥ 17**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగా, యః = ఎవడు, శ్రద్ధాభక్తియుక్తః = శ్రద్ధాభక్తులు కలిగిన, దేవసద్గురుభక్తః = దేవసద్గురు భక్తుడు, సంశయమ్ = సంశయమును, విభావయేత్ = మాపు-కొనునో, అస్య = అట్టివానికి, అయం భ్రమః = ఈ లోకభ్రమ, కుతః శిష్యతే = ఎందులకు మిగిలియుండును?

**తా :** ఈ విధముగా దేవ గురువులయందు శ్రద్ధాభక్తులు గలిగి సంశయమును మాపుకొనునో అట్టివానికి ఈ లోకము సత్యమను భ్రమ ఎందుకు మిగిలియుండును. అనగా, మిగిలియుండదు, అని భావము.

**శ్లో॥ అనాదిస్వప్నభ్రమోఽయం న స్వయం వినివర్తతే ।**
**కిన్తు స్వదైవయోగాప్తదేవాచార్యప్రసాదతః ॥ 18**

**ప్ర :** అయం = ఈ, అనాది = మొదలెఱుగరాని, స్వప్న భ్రమః = కల నిజమని భావించు భ్రాంతి, స్వయం = తనంత తాను, న వినివర్తతే = తొలగిపోదు, కిన్తు = కాని, స్వ = తన యొక్క, దైవయోగ+ఆప్త = దైవానుగ్రహముచే పొందబడిన, దేవ+ఆచార్య = దైవము యొక్కయు, గురువు యొక్కయు, ప్రసాదతః = అనుగ్రహము కారణముగా, (వినివర్తతే = తొలగిపోవును).

**తా :** ఈ లోకభ్రాంతికి మొదలెప్పుడో తెలియరాదు. అది తనంత తాను తొలగిపోదు కూడ. కాని దైవమనుగ్రహించినప్పుడు గురువనుగ్రహించగా, ఆ ఇద్దరి అనుగ్రహముల కలయికకు ఫలముగా ఈ లోకభ్రమ తొలగిపోవును. *

**శ్లో॥ శ్రుత్యా యుక్త్యానుభూత్యా చ యత్సత్యం తద్బ్రవీమి తే ।**
**ఆత్మా వా ఇదమగ్రేఽభూన్నాన్యత్కిఞ్చిత్కథఞ్చన ॥ 19**

**ప్ర :** శ్రుత్యా = వేదముచేత, యుక్త్యా = తర్కవాదముచేత, అనుభూత్యా = అనుభవముచేత, చ = కూడ, యత్ సత్యమ్ = ఏది సత్యమో, తత్ = దానిని, తే = నీకు, బ్రవీమి = చెప్పుచున్నాను: ఇదమ్ = ఈ దృశ్యమాన సృష్టికి, అగ్రే = పూర్వము, ఆత్మా వా = ఆత్మయే, అభూత్ = ఉన్నది, కించిత్ = కొంచెమైనను, కథంచన = ఎట్లయినను, అన్యత్ = ఆత్మకానిది, న = లేదు.

**తా :** శ్రుతి ప్రమాణమున, తర్క ప్రమాణమున, అనుభవ ప్రమాణమున కూడ యేది సత్యమో దానిని నీకు చెప్పుదును. ఈ కనబడుచున్న ప్రపంచసృష్టికి పూర్వము ఆత్మమాత్రమే ఉన్నది, ఆత్మకానిదేదైన అల్పముగనైన యేరీతిగనైన లేనే లేదు. *

**శ్లో॥ స ఈక్షణాదినా శుద్ధసత్త్వమాయాముపాశ్రితః ।**
**సర్వజ్ఞత్వాదిలక్ష్మాఽభూన్నిమిత్తం వ్యష్ట్యధీశ్వరః ॥ 20**

**ప్ర :** సః = ఆత్మ, ఈక్షణ+ఆదినా = చూచుట మొదలగు వానిచే, శుద్ధసత్త్వమాయామ్ = రజస్తమోగుణరహితమైన శుద్ధసత్త్వగుణప్రసారితమాయను, ఉపాశ్రితః = ఆశ్రయించినవాడై, సర్వజ్ఞత్వ+ఆది = సర్వజ్ఞత్వము, వ్యాపకత్వము, శక్తిమత్వము అను, లక్ష్మా = లక్షణములు గలవాడుగా, వ్యష్టి+అధీశ్వరః = ప్రత్యగ్ వ్యక్తిగా, నిమిత్తమ్ = కారణభూతుడైన నిమిత్తకర్తగా, అభూత్ = ఆయెను.

**తా :** ఆత్మ శుద్ధసత్త్వమాయనాశ్రయించి ఇంద్రియవ్యాపారములతో, సర్వజ్ఞత్వ, సర్వవ్యాపకత్వ, సర్వశక్తిమత్వాది లక్షణములతో, ప్రత్యగాత్మరూపుడై నిమిత్తకర్తయగుచున్నాడు. *

**శ్లో॥ ఉపాదానం తామసీం చ దధానః పాఞ్చభౌతికమ్ ।**
**అయం తత్పదవాచ్యోఽభూత్పరం బ్రహ్మాత్ర లక్ష్యకమ్ ॥ 21**

**ప్ర :** తత్ పదవాచ్యః = ఉపనిషత్తులచే **తత్** అను పదముచే చెప్పబడిన, అయమ్ = ఈ ఆత్మ, తామసీమ్ = తమోగుణప్రధానమైన, పాంచభౌతికమ్ = పంచ భూతములతో కూడిన, ఉపాదానమ్ = శరీరమును, దధానః చ = ధరించిన వాడు గూడ నగుచు, అత్ర = సృష్టి విషయమున, లక్ష్యకమ్ = లక్ష్యమైన, పరం బ్రహ్మ = పరబ్రహ్మగా, అభూత్ = ఆయెను.

**తా :** ఉపనిషత్తులు **తత్** అను పదముతో యే తత్త్వమును సూచించినవో ఆ అనిర్వాచ్య సత్త ఈ సృష్టికి లక్ష్యరూపమైన పరంబ్రహ్మగా అయినది. అట్లగుటలో తమోగుణాత్మకమైన పంచభూతముల కలయికతో ఒక శరీరమును ధరించినది. *

**శ్లో॥ ధృత్వా మలినసత్త్వాం చ జీవోఽజ్ఞత్వాదిలక్షణః ।**
**అభూత్త్వంపదవాచ్యోఽత్ర కూటస్థబ్రహ్మలక్ష్యకమ్ ॥ 22**

**ప్ర :** మలినసత్త్వామ్ = కామక్రోధాది మలినముల కాలవాలమైన శరీరమును, ధృత్వా = ధరించి, జీవః = జీవుడు, అజ్ఞత్వాదిలక్షణః = అజ్ఞానమువలన అహంకారాది లక్షణములు గలవాడై, అత్ర = సృష్టియందు, త్వం పదవాచ్యః = 'నీవు' అను పదముతో చెప్పదగిన, కూటస్థబ్రహ్మ = ప్రత్యగ్ బ్రహ్మ, లక్ష్యకమ్ = అనదగినవాడుగా, అభూత్ = ఆయెను.

**తా :** కామక్రోధాది మాలిన్యము గల ఉనికిని ఉపాధిగా ధరించి, అహంకారవాచ్యుడగుచు జీవుడు, ప్రత్యగ్ బ్రహ్మభూతుడై **త్వం** (నీవు) పదవాచ్యుడైనాడు. *

**శ్లో॥ శక్తిః పరాఽస్వతన్త్రాఽస్య జగదేవం తతోఽభవత్ ।**
**వివర్తన్యాయత ఇదమవశం రజ్జుసర్పవత్ ॥ 23**

**ప్ర :** అస్య = ఈ ఆత్మయొక్క, అస్వతన్త్రా = తనకు తాను స్వతంత్రవ్యవహారము లేనిదైన,

పరాశక్తిః = పరాశక్తి, వివర్తన్యాయతః = ఒక రూపమునకు హాని లేకుండ వేరొకటిగా కన్పడు వివర్తన్యాయము ననుసరించి, రజ్జుసర్పవత్ = త్రాడు పాముగా కన్పడునట్లు, అవశమ్ = అదుపు దప్పి, ఇదం జగత్ = ఈ జగత్తు, ఏవమ్ = ఆ విధముగ, తతః = దానినుండి, అభవత్ = సంభవించెను.

**తా :** ఆత్మకు గల పరాశక్తి అస్వతంత్రయై, వివర్తన్యాయమున త్రాడు పాముగ తోచునట్లు, ఈ జగత్తు ఈ రీతి కనబడునట్లు చేయును. *

**శ్లో॥ అత్ర గుప్తైశ్వరీ శక్తిః సర్వవస్తునియామికా ।**
**అన్యోన్యధర్మసాఙ్కర్యాద్విప్లవోఽస్య న చేద్ధి సా ॥ 24**

**ప్ర :** అత్ర = ఈ పాంచభౌతికప్రపంచమున, సర్వవస్తునియామికా = అన్ని వస్తువుల స్వరూప స్వభావములను నిర్ణయించునట్టి, ఐశ్వరీ శక్తిః = ప్రభుత్వ సంబంధి శక్తి, గుప్తా = నిక్షిప్తమై యున్నది; సా = ఆ శక్తి, న చేత్ హి = లేనట్లయితే, అన్యోన్య ధర్మసాంకర్యాత్ = వివిధ వస్తు ధర్మముల కలయికవలన, అస్య = దానియొక్క, విప్లవః = సంఘర్షణ, నాశము (కలుగును).

**తా :** ఈ పాంచభౌతికప్రపంచమున ప్రభుతవహించి ఈశ్వరునిశక్తి నిక్షిప్తమై యుండి, సర్వ వస్తువుల స్వరూపస్వభావములను నియంత్రించుచున్నది. ఆ శక్తియే లేకున్నచో, విభిన్న వస్తుధర్మముల మధ్య సాంకర్యము వలన సంఘర్షణ లేర్పడి, ఆ కారణమున ఈ పాంచభౌతిక సృష్టి నశించిపోవును. *

**శ్లో॥ ప్రకృత్యధీనచేష్టస్య జీవస్యాపి పుమర్థతా ।**
**శాస్త్రదృష్ట్యేన్ద్రియార్థోత్థరాగద్వేషావశత్వతః ॥ 25**

**ప్ర :** ప్రకృతి+అధీన = ప్రకృతికి లొంగియుండు, చేష్టస్య = కార్యకలాపములు గల, జీవస్య అపి = జీవునకు గూడ, శాస్త్రదృష్ట్యా = శాస్త్రీయమైన అవగాహనతో, ఇన్ద్రియార్థ = ఇంద్రియముల విషయముల వలన, ఉత్థ = పొడసూపిన, రాగద్వేష = కోరిక, ద్వేషము ఇత్యాది వికారముల చేత, అవశత్వతః = కట్టుబడియుండుట కారణముగా, పుమర్థతా = పురుషార్థముల ప్రసక్తి.

**తా :** జీవుడు ప్రకృతికి బద్ధుడు. కావున ఇంద్రియవిషయములందు ఆసక్తి, కోరిక, అది లభించనప్పుడు దుఃఖము, ద్వేషము ఇత్యాది వికారములకు లోనగుట సహజము. దీనిని శాస్త్రీయమైన పద్ధతిలో విచారించి అర్థము చేసికొని, ఈ వికారములకు నివారణోపాయముగా ధర్మార్థకామమోక్షములు అనబడునవి పురుషార్థములుగా చెప్పబడినవి. *

**శ్లో॥ ప్రపఞ్చస్తదభావోఽస్మిన్నధ్యారోపాపవాదతః ।**
**ప్రపఞ్చోపశమే శాన్తే శివేఽద్వైతే కథం న్విమౌ ॥ 26**

**ప్ర :** అస్మిన్ = ఆత్మయందు, అధ్యారోప+అపవాదతః = లేనిదాని నున్నట్లు చూపుటచేత, అట్లు

చూపబడిన భ్రమ నుపసంహరించి కొనుట వలనను, ప్రపంచః = ప్రపంచపు అస్తిత్వము, తత్+అభావః = ఆ ప్రపంచపు నాస్తిత్వము (కలుగుచున్నవి); ప్రపంచ+ఉపశమే = ప్రపంచము ఉపశమించినది కాగా, శాన్తే = నానాత్వము విలీనమై, అద్వైతే = ఒక్కటేయైన, శివే = శివునియందు, ఇమౌ = ఇవన్నియు, కథం ను = ఎట్లుండును?

**తా :** అధ్యారోపప్రక్రియవలన ఆత్మయందు ఈ ప్రపంచపు నానాత్వవికారము యేర్పడుచున్నది. ఆ భ్రమ తొలగిపోగా ప్రపంచభ్రాంతి లుప్తమగును. ఇట్లే లోకభ్రాంతి ఉపశమించి, నానాత్వము అను వికారము శాంతించగా ఒక్కటిగా యున్న శివుని యందు ఇంక ఈ ప్రపంచమెట్లుండును? *

**శ్లో॥ బన్ధమోక్షౌ తథా జీవసర్వేశ్వరభిదావపి ।**
**కోశోపాధిపరిత్యాగాన్న జీవో నాపి చేశ్వరః ॥ 27**

**ప్ర :** బన్ధమోక్షౌ = సంసార బంధములును మోక్షమున్ను, తథా = అదే రీతి, జీవసర్వేశ్వరభిదౌ అపి = జీవుడు, సర్వేశ్వరుడు అనబడు వారిద్దరును గూడ, కోశ = అన్నమయాది కోశములను, ఉపాధి = వివిధ ప్రాణి శరీరములను, పరిత్యాగాత్ = వదలినందువలన, జీవః = జీవుడు, న = లేదు, ఈశ్వరః అపి న = ఈశ్వరుడున్ను లేదు.

**తా :** ఈ శరీరమును ధరించి, అన్నమయాది కోశముల నాశ్రయించి యున్నంతవరకే సంసార బంధములు, అట్లే జీవుడు, దేవుడు అను రెండు పేర్లు. ఆ ఉపాధిని, కోశమును విడిచినచో జీవుడు లేడు, దేవుడున్నూ లేడు. *

**శ్లో॥ స్వస్వరూపే పరిజ్ఞాతే న బన్ధో నాపి మోక్షణమ్ ।**
**బన్ధమోక్షప్రకారం తే వక్ష్యే సంక్షేపతః శృణు ॥ 28**

**ప్ర :** స్వ స్వరూపే పరిజ్ఞాతే (సతి) = తనదైన ఆత్మరూపదర్శనము కలిగినది కాగా, బన్ధః న = బంధము లేదు, మోక్షనం అపి = ముక్తియును, న = లేదు; తే = నీకు, సంక్షేపతః = క్లుప్తముగా, బన్ధమోక్షప్రకారమ్ = బంధము లేర్పడుట, ముక్తి కలుగుట అను క్రమమును గూర్చి, వక్ష్యే = చెప్పుదును, శృణు = వినుము.

**తా :** ఆత్మజ్ఞానము కలిగినంతనే బంధమోక్షములు అప్రస్తుతములగును. ఆ బంధము లెట్లు కలుగునో, వానినుండి మోక్షమెట్లు కలుగునో వివరింతును, వినుము. *

**శ్లో॥ సచ్చిత్సుఖాత్మకోఽప్యాత్మాఽద్వితీయోఽజోఽజరోఽమరః ।**
**స్వాశ్రయా యా స్వవిషయా స్వమాయాఽసౌ తయా భృశమ్ ॥ 29**

**శ్లో॥ స్వాభావికస్వరూపాత్స ప్రచ్యుతోఽనాత్మతాం గతః ।**
**దేహ్యాద్యనాత్మని ప్రాప్తాశేషానర్థః సుదుఃఖితః ॥ 30**

**ప్ర :** ఆత్మా = ఆత్మ, అద్వితీయః = తానుగాక వేరొకటిలేక తాను మాత్రమే ఉన్నది, అజః =

పుట్టుక (మొదలు) అనునది లేనిది, ఏదేని కారణము వలన కలుగనిది, అజరః = ముసలితనము లేనివాడు, అమరః = నాశము లేనిది, సత్+చిత్+సుఖ+ఆత్మకః అపి = సత్, చిత్, ఆనందము లనునవే తానైనది ఐనను, స్వవిషయా = తనదేయైనది, స్వాశ్రయా = తననే ఆశ్రయించినది, యా స్వమాయా = తన మాయయేదియో, తయా = ఆ మాయచేత, అసౌ = ఆత్మ, భృశమ్ = మిక్కిలి, స్వాభావిక = తనకు స్వభావమైన దానినుండి, స్వరూపాత్ = తన రూపమునుండి, ప్రచ్యుతః = తప్పి జారినవాడై, సః = ఆ ఆత్మ, అనాత్మతాం గతః = ఆత్మకానివాడాయెను, దేహాది = శరీరమాదిగాగల, అనాత్మని = ఆత్మకానివానియందు, ప్రాప్త = పొందబడిన, అశేష = మిగులు లేని, అనర్థః = ప్రయోజనరాహిత్యము గలవాడై, సుదుఃఖితః = ఎంతయో దుఃఖముల పాలాయెను.

**తా :** ఆత్మ అద్వితీయుడు, అజుడు, అమరుడు, వయోవృద్ధుడు కానివాడు, అయినను తనదేయైన మాయచేత తన స్వభావమును రూపమును కోల్పడి అనాత్మగా మారి దేహాది లక్షణధారియై అనర్థములలో చిక్కి దుఃఖముల పాలాయెను. *

**శ్లో॥ అవిద్యాకామకర్మాద్యైరిష్టప్రాప్తిం చ సాధనైః ।**
**కాంక్షన్నరిష్టనాశం చాలభమానోఽమృతం భృశమ్ ॥ 31**

ప్ర : అవిద్యాకామకర్మ+ఆద్యైః = అజ్ఞానమువలన కామకర్మలు మొదలగు, సాధనైః = సాధనములతో, ఇష్టప్రాప్తిం చ = తన కోరికలు తీరుటనున్ను, అరిష్టనాశం చ = తన బాధలు తీరుటనున్ను, కాంక్షన్ = కోరుచు, భృశమ్ = మిక్కిలి, అమృతమ్ = దుఃఖనాశకమైన అమృతానంద స్థితిని, అలభమానః = పొందలేనివాడై,

**శ్లో॥ ఆకృష్యమాణో రాగాద్యైర్మకరాద్యైరివార్ణవే ।**
**మోముహ్యమానో మర్త్యాదినానాయోనిషు సంసరన్ ॥ 32**

ప్ర : అర్ణవే = సముద్రమున, మకర+ఆద్యైః ఇవ = మొసళ్ళు మొదలగు వానిచే వలె, రాగ+ఆద్యైః = రాగద్వేషాది మనోవికారములచేత, ఆకృష్యమాణః = ఆకర్షింపబడినవాడై, మోముహ్యమానః = బాగా మోహము జెందుచున్నవాడై, మర్త్య+ఆది = మనుష్యాది, నానా = అనేకములైన, యోనిషు = మాతృగర్భములందు, సంసరన్ = తిరుగుచు.

**శ్లో॥ కథఞ్చిద్దైవయోగేన లబ్ధ్వా జన్మోత్తమం యదా ।**
**నిత్యనైమిత్తికశ్రౌతకర్మభిః స స్వనుష్ఠితైః ॥ 33**

ప్ర : కథంచిత్ = ఎట్లో, దైవయోగేన = దైవానుగ్రహముచే, సః = ఆతడు, ఉత్తమం జన్మ = ఉత్తమజన్మమును (కర్మార్హమైన జన్మమును), లబ్ధ్వా = పొంది, యదా = ఎప్పుడు, నిత్యనైమిత్తికశ్రౌతకర్మభిః = నిత్యము ప్రాణిమనుగడకై చేయదగిన కర్మలచేత, ఏదేని యొక

ప్రయోజనమునకై చేయు కర్మలచేత, వేదవిహిత కర్మలచేత, సు+అనుష్ఠితైః = చక్కగా అనుష్ఠింప బడిన వీనిచే,

**శ్లో॥ ఈశ్వరార్థం వ్యపగతరాగాద్యన్తర్మలో యతిః ।**
**దోషదృష్ట్యైహికాద్యర్థవిరక్తః సాధనాన్వితః ॥ 34**

ప్ర : సాధన+అన్వితః = ఆ యా సాధనములతో కూడినవాడై, దోషదృష్ట్యా = దోషదృష్టిచే, ఐహిక+ఆది = సాంసారికము మొదలగు, అర్థవిరక్తః = ప్రయోజనముల నాశించక, వ్యపగత = తొలగిపోయిన, రాగ+ఆది+అన్తః మలః = రాగద్వేషాది మనోవికారములు గలవాడైన, యతిః = భిక్షువు, ఈశ్వరార్థమ్ = దేవుని కొరకు,

**తా (శ్లో.31-34):** అజ్ఞానమువలన తన కోరికలు తీరుటకు, బాధలు తొలగుటకు, గూడ కామ్యకర్మలు చేయుచు ఆనందమును పొందలేక, సముద్రములో మొసళ్ళ వంటి రాగద్వేషాదులు గల సంసారసముద్రమున బడి భ్రాంతులలో మునుగుచూ, మరల మరల వివిధ ప్రాణి శరీరములతో జన్మించుచు, ఎట్లో దైవానుగ్రహమున ఉత్తమజన్మనొంది నిత్యనైమిత్తిక శ్రౌతకర్మాచరణతో సంస్కారవంతుడై యతియై, ఈశ్వరసాక్షాత్కారమును కోరును. *

**శ్లో॥ బ్రహ్మాత్మభావం బుభుత్సుః శ్రద్ధాభక్త్యైవ సద్గురుమ్ ।**
**ఉపేత్య విధివత్తస్మాద్వేదాన్త శ్రవణాదినా ॥ 35**

ప్ర : బ్రహ్మాత్మభావమ్ = అహం బ్రహ్మ అను భావమును, బుభుత్సుః = తెలిసికొనగోరినవాడై, శ్రద్ధాభక్త్యా ఏవ = భక్తిశ్రద్ధలతోడనే, సద్గురుమ్ = గురువును, ఉపేత్య = ఆశ్రయించి, విధివత్ = శాస్త్రవిహితముగ, తస్మాత్ = ఆ గురువునుండి, వేదాన్త = ఉపనిషత్తుల విజ్ఞానమును, శ్రవణ+ ఆదినా = వినుట, చదువుట, మననము చేయుట మొదలగు సాధనలచే,

**శ్లో॥ తత్త్వమస్యాదివాక్యార్థమఖణ్డైకరసత్వతః ।**
**విజ్ఞాయ లక్షణావృత్త్యా సోఽహమస్మీత్యభేదతః ॥ 36**

ప్ర : తత్త్వమ్ = సర్వమూలక సత్యము, నీవు, అసి = అయి యున్నావు, ఆది = మొదలగు, వాక్య+అర్థమ్ = వాక్యము యొక్క అర్థమును, అఖణ్డ = అవిభాజ్యమైన, ఏకరసత్వతః = పరమానంద రూపమున, లక్షణావృత్త్యా = వాక్యమునకు అర్థము చెప్పునపుడు వాచ్యార్థము పొసగని సందర్భములలో లక్షణావృత్తిచే అర్థము చెప్పు పద్ధతి ననుసరించి, సోఽహమస్మి అభేదతః ఇతి = నేను పరంబ్రహ్మమునే, భేదము లేదు, అని, విజ్ఞాయ = తెలిసికొని,

**శ్లో॥ ప్రతిబన్ధక్షయాన్తే తు విముక్తోఽజ్ఞానబన్ధనాత్ ।**
**నివృత్తాజ్ఞానతత్కార్యో జీవన్ముక్తో భవేద్ధ్రువమ్ ॥ 37**

ప్ర : ప్రతిబన్ధక్షయ+అన్తే = రాగద్వేషాది ఆటంకములు క్షీణించిన తరువాత, అజ్ఞానబన్ధనాత్ =

అజ్ఞానమువలన కట్టివేసిన బంధములనుండి, విముక్తః తు = విడుదల పొందినవాడై, నివృత్త = విడువబడిన, అజ్ఞాన తత్+కార్యః = అజ్ఞానమువలన చేయు కార్యములు గలవాడై, ధృవమ్ = నిశ్చయముగా, జీవన్ముక్తః = జీవించి యుండగనే ముక్తుడు, భవేత్ = అగును.

**తా (శ్లో.35-37):** బ్రహ్మాత్మ భావమును తెలియగోరి శ్రద్ధాభక్తులతో సద్గురువు నాశ్రయించి శాస్త్రోక్తప్రకారము ఆ గురువునుండి ఉపనిషద్విజ్ఞానమును శ్రవణమననాది సాధనలతో, **తత్త్వమసి, సోఽహమస్మి** ఇత్యాది మహావాక్యముల అర్థమును లక్షణావృత్తివలన అఖండానందముగ గ్రహించి, అజ్ఞానము తొలగి పోగా, ఆ యా కార్యముల బంధములను తొలగించుకొని జీవన్ముక్తిని పొందుచున్నాడు. *

**శ్లో॥ కృతకృత్యేన నాప్తవ్యం శ్రోతవ్యం వాఽవశిష్యతే ।**
**వ్యవహారేఽపి తద్దృష్టిః ప్రాప్తా చేత్సా చిదన్వయాత్ ॥ 38**

ప్ర : కృతకృత్యేన = అద్వయదృష్టిని సాధించినవానిచే, తత్ దృష్టిః = ఆ జీవన్ముక్తుని దృష్టి, వ్యవహారే అపి = లోకవ్యవహారమునందు, ప్రాప్తా చేత్ = ప్రసరించినచో, చిత్+అన్వయాత్ = జ్ఞానసంబంధి అన్వయమున, ఆప్తవ్యమ్ = పొందదగినది, శ్రోతవ్యం వా = వినదగినదిగాని, న అవశిష్యతే = మిగిలి యుండదు.

**తా :** అద్వయసిద్ధిని పొందినవానికి, ఒకవేళ లోకవ్యవహారములో ద్వయదృష్టి కలిగినను, అది జ్ఞానానందవిషయమున పొందదగినదిగాని విని తెలియదగినదిగాని మిగిలియుండదు. *

**శ్లో॥ చేష్టతే యావదారబ్ధం తద్దేహః శుష్కపర్ణవత్ ।**
**పరమానన్దపూర్ణోఽసౌ ధర్మకర్మవివర్జితః ॥ 39**

ప్ర : ధర్మకర్మవివర్జితః = తా నాచరించదగిన ధర్మములుగాని, కర్మలుగాని లేనివాడై, పరమానన్ద-పూర్ణః = అఖండానందముతో నిండియున్నవాడైన, అసౌ = ఆతడు, యావత్ ఆరబ్ధమ్ = ఆరబ్ధకర్మముననుసరించి ఎంతలో ప్రవర్తించునో, (తావత్ = అంతలో) తత్ దేహః = వాని దేహము, శుష్కపర్ణవత్ = ఎండుటాకు విధముగ, చేష్టతే = రాలిపోవును (ప్రవర్తించును).

**తా :** అట్టివాడు యే ధర్మములకు, కర్మములకు కట్టుబడువాడు కాడు. ఎప్పుడును తఱుగుబోని ఆనందములో యే లోటు లేకుండువాడు. పుట్టుకతో యే కర్మానుభవము దేహమునకు సిద్ధమైనదో అది ముగియగానే వాని దేహము ఎండుటాకు వలె రాలిపోవును. *

**శ్లో॥ దక్షో జ్ఞోఽప్యన్యదృష్ట్యా తు బాలోన్మత్తజడోపమః ।**
**తిష్ఠత్యేవ స్వరూపే స దివి భిన్న ఘటాభ్రవత్ ॥ 40**

ప్ర : దక్షః = సమర్థుడు, జ్ఞః = జ్ఞాని, అపి తు = అయినప్పటికిని, సః = ఆతడు, అన్యదృష్ట్యా = లోకదృష్టితో చూచినచో, బాలః = బాలుడు, ఉన్మత్తః = పిచ్చివాడు, జడ+ఉపమః = చైతన్యమేలేని

వస్తువును బోలి, భిన్న = పగిలిన, ఘట = కుండలో, అభ్రవత్ = ఆకాశమువలె, స్వరూపే దివి = స్వస్వరూపదర్శనమునందు, తిష్ఠతి ఏవ = నిల్చియే యుండును.

**తా :** ఆతడు సమర్థుడైన జ్ఞానియే యైనను, లౌకికదృష్టికి మాత్రము బాలుని వలె, పిచ్చివాని వలె, ప్రాణము తెలివి లేని పదార్థమువలె కన్పించుచు, పగిలిన కుండలో ఆకాశమున్నట్లు అవిచ్ఛిన్నముగ అభిన్నముగ తనదైన నిజస్వరూపానందమున లీనమై యుండును. *

**శ్లో॥ త్రిధామస్వేక ఆత్మైవ జ్ఞేయః స్మృత్యన్వయాచ్ఛివః ।**
**గుణేశస్తద్వ్యతీతస్య పునర్జన్మ న విద్యతే ॥ 41**

**ప్ర :** త్రిధామసు = స్థూలసూక్ష్మకారణ శరీరములనబడు మూడిటను, ఏకః ఆత్మా ఏవ = ఒక్కడైన ఆత్మయే, జ్ఞేయః = తెలియదగినవాడు, స్మృతి+అన్వయాత్ = జ్ఞాపకము వలన (నిద్రకు ముందున్న నేనే స్వప్నానంతరము జాగృతుడనైతినన్న జ్ఞాపకమువలన), శివః = శివుడు, గుణేశః = గుణముల కధికారి, తత్ వ్యతీతస్య = ఆ గుణస్థితిని గడచిన వానికి, పునర్జన్మ = మరల పుట్టుక, న విద్యతే = కలుగదు.

**తా :** ఒకే ఆత్మ స్థూలసూక్ష్మకారణ శరీరములన్నిట తెలియదగినది. ఈ ఆత్మ స్వప్నవిహారియై ఇన్నిట సంచరించునదైనను, ఆ స్వప్నవిహారమునకు పూర్వము, తదనంతరము గూడ నున్న గుణవర్తియు తదతీత శివమూర్తియునను స్పృహ, చేతన కలిగినవానికి మరల జన్మించవలసిన అవసరము కలుగదు.

**శ్లో॥ ఆదేహపాతమేవం చేత్స్వాత్మరూపం న వేత్తి యః ।**
**తతః సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే ॥ 42**

**ప్ర :** యః = ఎవడు, స్వాత్మరూపమ్ = స్వస్వరూపమును, ఏవమ్ = ఇట్లని, ఆదేహపాతమ్ = మరణించువరకు, న వేత్తి = తెలియకుండునో, తతః = ఆ కారణమున, సర్గేషు = మరల మరల జరుగు సృష్టియందు, అనగా, బ్రహ్మకల్పములందు, లోకేషు = మర్త్యలోక, స్వర్లోక, అధో-లోకములందు, శరీరత్వాయ = ఆ యా భిన్న భిన్న శరీరధారణమునకై, కల్పతే = యోగ్యుడగుచున్నాడు.

**తా :** జననమాది దేహాంతమువరకు గల జీవితములో స్వస్వరూపజ్ఞానము కలుగని వానికి ఆ కారణమున మరల మరల వివిధ లోకములలో వివిధ శరీరములలో ఎన్ని బ్రహ్మకల్పములైనను జన్మింపవలసియుండును.

**శ్లో॥ నోత్క్రామన్త్యసవోజ్ఞస్య సుషుమ్ణామార్గతో ధ్రువమ్ ।**
**సమేతి సోఽమృతత్వం హి తస్యేన్ద్రియమనాంసి తు ॥ 43**

**ప్ర :** జ్ఞస్య = జ్ఞాని యొక్క, అసవః = ప్రాణములు, తస్య ఇంద్రియమనాంసి = వాని ఇంద్రియ

మనస్సులు, న ఉత్క్రామన్తి = నవద్వారముల వెంట శరీరమునుండి నిష్క్రమించవు; సః తు = ఆతడేమో, ధ్రువమ్ = నిశ్చయముగా, సుషుమ్ణామార్గతః = సుషుమ్ణామార్గము ద్వారా, అమృతత్వం హి = మోక్షమునే, సమేతి = పొందును.

**తా :** జ్ఞాని ప్రాణములు, ఇంద్రియములు, మనస్సు, ఇవి వాని నవద్వారముల వెంట శరీరమును వదలిపోవు. ఆతడు నిశ్చయముగా సుషుమ్ణామార్గమున మోక్షమునే పొందును. *

**శ్లో॥ దిగ్వాతార్కప్రచేతోఽశ్వివహ్నీన్ద్రోపేన్ద్రమృత్యుకాన్ ।**
**బ్రహ్మాజ్యేశహరీన్యాన్తి నాన్యేషాం మృత్యుగామినామ్ ॥ 44**

**ప్ర :** దిక్ = దిక్కులు, వాత = గాలి, అర్క = సూర్యుడు, ప్రచేతః = వరుణుడు, అశ్వి = అశ్వినులు, వహ్ని = అగ్నిదేవుడు, ఇన్ద్ర = ఇంద్రుడు, ఉపేన్ద్ర = విష్ణువు, మృత్యుకాన్ = మృత్యుదేవతలను, బ్రహ్మ = బ్రహ్మదేవుడు, జ్యా = భూమి, ఈశ = ఈశ్వరుడు, హరీన్ = విష్ణువును, యాన్తి = చేరుచున్నవి, అన్యేషామ్ = జ్ఞానులు కానివారైన, మృత్యుగామినామ్ = మృత్యుమార్గమున పయనించు వారి యొక్క (ప్రాణములు), న = కాదు. *

**శ్లో॥ కాలచక్రమిదం సృష్టం తదర్థమజరం ధ్రువమ్ ।**
**త్రినేమి ద్వాదశారం చ దామ్పత్యేనార్కపుత్రకాః ॥ 45**

**ప్ర :** తదర్థమ్ = ఆ ప్రయోజనసిద్ధికై, ఇదం కాలచక్రమ్ = ఈ కాలమను చక్రము, త్రినేమి = శీత, ఉష్ణ, మేఘ వలయము లనబడు మూడు వలయములు కలిగినదిగా, ద్వాదశ+ఆరమ్ = పండ్రెండు నెలలు ఆకులుగా, చ = మరియు, అర్కపుత్రకాః = పవలు రాత్రులు అను రెంటియొక్క, దాంపత్యేన = ఆలుమగల జంటతో, అజరమ్ = ప్రాతబడనిది, శక్తినశించనిది, ధృవమ్ = నిశ్చయముగా, సృష్టమ్ = సృష్టించబడినది.

**తా :** జ్ఞానులుకానివారికొరకై ఈ కాలచక్రము నిర్మింపబడినది. దీనికి శీత, ఉష్ణ, మేఘ వలయములు మూడు చుట్లు, పండ్రెండు నెలలు అనబడు ఆకులు, పవలు రాత్రి అను జంట ఆలుమగలై ఈ సంసారమును, కాలమును నిత్యనూతనముగా నిత్యయౌవనముగా నడిపించు చున్నది. *

**శ్లో॥ యత్ర సప్తశతానీమే వింశతిశ్చాస్థితాః ఖలు ।**
**బన్ధమోక్షప్రకారోఽయం సంక్షేపేణోదితో మయా ॥ 46**

**ప్ర :** యత్ర = ఏ కాలచక్రమున, ఇమే = ఈ, సప్తశతాని వింశతిః చ = ఏడువందలపై ఇరువది, అస్థితాః ఖలు = కదలుచుండునో, (తత్ర) అయమ్ = ఈ, బంధమోక్షప్రకారః = జీవుడు బద్ధుడు, ముక్తుడు అగు విధానము, సంక్షిప్తేణ = సంగ్రహముగా, మయా = నా చేత, ఉదితః = చెప్పబడినది.

**తా :** ఈ కాలచక్రమున రేబవళ్లొక దినముగా, ముప్పది దినములు (శుక్లకృష్ణపక్షములు రెండు) ఒక నెలగా, పంద్రెండు నెలలు ఒక సంవత్సరముగా, మొత్తము 720 అంశలు నిరంతరము పరిభ్రమించుచుండగా, జీవుడీ కాలచక్రమున బడి బద్ధుడెట్లగునో, జ్ఞానియై ముక్తుడెట్లగునో, ఈ ప్రకారము సంగ్రహముగా వివరించినాను. *

**శ్లో॥ మోక్షో జ్ఞానం వినా న స్యాన్న జ్ఞానం సద్గురుం వినా ।**
**సద్గురుం నేశకృపయా వినా కోఽపీహ విన్దతి ॥ 47**

**ప్ర :** జ్ఞానం వినా = జ్ఞానములేక, న మోక్షః = మోక్షము లేదు, సద్గురుం వినా = సద్గురువు లేక, న జ్ఞానం స్యాత్ = జ్ఞానము లేదు, ఈశ = ఈశ్వరుని, కృపయా వినా = దయలేక, ఇహ = జగత్తులో, కః అపి = ఎవరైనను, న సద్గురుం విన్దతి = సద్గురువును సేవించుట లేదు.

**తా :** జ్ఞానములేని వానికి మోక్షము లేదు. సద్గురువు లభించని వానికి జ్ఞానము లభించదు. లోకమున నెవ్వరికైన ఈశ్వరకృప లేకున్నచో, ఆ సద్గురు సేవనము, జ్ఞానము, మోక్షము లభించవు. *

**శ్లో॥ ఈశప్రసాదప్రాప్త్యర్థం సత్త్వశుద్ధ్యర్థమేవ చ ।**
**నిత్యనైమిత్తికశ్రౌతస్వధర్మానుష్ఠితిః స్మృతా ॥ 48**

**ప్ర :** ఈశప్రసాదప్రాప్తి+అర్థమ్ = ఈశ్వరానుగ్రహము సిద్ధించుటకై, చ = మరియు, సత్త్వశుద్ధి+అర్థం ఏవ = సత్త్వగుణము శుద్ధియగుట కొరకే, నిత్యనైమిత్తికశ్రౌత = నిత్యకర్మ, నైమిత్తిక కర్మ, వేదవిహితకర్మ అనబడు, స్వధర్మ+అనుష్ఠితిః = తన ధర్మమును అనుష్ఠించుట యనునది, స్మృతా = భావించబడినది.

**తా :** జీవి తనలోని సత్త్వగుణమును శుద్ధి చేసికొనుటకై స్వధర్మాచరణరూపమైన నిత్యనైమిత్తిక శ్రౌతకర్మలు చెప్పబడినవి. సత్త్వశుద్ధికాకున్న, వానికి ఈశ్వరానుగ్రహము లభించదు. *

**శ్లో॥ ద్విపైకదేశమాలబ్ధ్య యథాన్ధా ద్విపవేదినః ।**
**అన్యోన్యం కలహాయన్తే శాస్త్రౌఘోఽయం తథాఽల్పదృక్ ॥ 49**

**ప్ర :** ద్విప+ఏకదేశం+ఆలబ్ధ్య = ఏనుగు యొక్క ఒక్క భాగమునే (పొంది) తడివి చూచి, యథా = యే విధముగా, ద్విపవేదినః = యేనుగు నెఱిగిన వారలగుచున్నారో, తథా = ఆ విధముగా, అల్పదృక్ = సమగ్రదర్శనములేనివారు, అయం శాస్త్ర+ఓఘః = ఈ శాస్త్రప్రవాహ జ్ఞానము గలవారు, అన్యః అన్యమ్ = ఒకరొకరిని, కలహాయన్తే = దోషమెన్నుచూ కలహించుచున్నారు.

**తా :** ఏనుగు రూపమునంతయు ఒకేసారి చూచి తెలియలేని గ్రుడ్డివారు ఆ యేనుగు శరీరభాగములలో నేదియో ఒకదానిని తడివి చూచి ఇదియే యేనుగని ఎవడికి వాడే నమ్మి వాదించినట్లు శాస్త్రములను ప్రవాహవేగమున చదివి ఎవరికి వారే తాము చదివిన శాస్త్రమే

సత్యము చెప్పుచున్నదని తమలో తాము కలహింతురు. కావలసినది సమగ్రశాస్త్రవాక్య సమన్వయము అని భావము. *

**శ్లో॥ విజ్ఞాయ తత్త్వం భవతా మదుక్తేర్బుధ్వా సదైవోపనిషన్మతం సత్ ।**
**స్థేయం తదాలోచన ఏవ తేన ముక్తిః కృతార్థత్వమిహైవ తేఽస్తు ॥ 50**

**ప్ర :** మత్+ఉక్తేః = నా మాటల వలన, సత్ = ఉత్తమమైన, సత్యమైన, ఉపనిషత్+మతం = ఉపనిషత్తు బోధించు వివేకమును, బుధ్వా = బుద్ధియందుంచి, తత్త్వం = సత్యమును, విజ్ఞాయ = తెలిసి, సదా = ఎల్లప్పుడు, భవతా = నీ చేత, తత్+ఆలోచనః ఏవం = ఆ ఆలోచనయే, స్థేయం = స్థిరముకాదగియున్నది, తేన = దానిచే, తే = నీకు, ఇహ ఏవ = ఈ జన్మలోనే, కృతార్థత్వం = ధన్యత, ముక్తిః = మోక్షము, అస్తు = అగుగాక!

**తా :** ఉపనిషన్మతమును నీకు బోధించితిని. దానిని తెలిసికొని, సదా బుద్ధిలో నుంచి, ఆ యోచనలోనే స్థిరుడవై, ధన్యుడవై ముక్తుడవు గమ్ము. *

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ప్రథమాష్టకే తృతీయాధ్యాయః

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## ప్రథమాష్టకము- చతుర్థాధ్యాయము

**శ్లో॥ అయం వాఽఽపీయ భగవదుపదేశసుధారసమ్ ।**
**శ్రుతిద్వారా నాతితృప్తః పప్రచ్ఛ స యతిః పునః ॥ 1**

**ప్రతిపదార్థం :** అయం భగవత్+ఉపదేశసుధారసమ్ = దైవము నుపదేశించు అమృతమును, శ్రుతిద్వారా = వినికిడివలన, ఆపీయ = ఆమూలాగ్రముగ త్రాగి, న అతితృప్తః = బాగుగా తృప్తిపొందనివాడై, సః యతిః = ఆ యతి, పునః = మరల, పప్రచ్ఛ = అడిగెను.

**తాత్పర్యం :** ఈ భగవదుపదేశమను అమృతమును భగవాన్ శ్రీదత్తుడు పలుకగా ఆస్వాదించి పూర్తిగా తృప్తిలేక ఆ సంన్యాసి మరల ప్రశ్నించెను. *

**శ్లో॥ భగవన్కర్మ కిం కార్యముపాస్యశ్చ క ఈశ్వరః ।**
**శ్రుతా హి బహవోఽత్రేశాః కర్మాణి చ తతః పునః ॥ 2**

**ప్ర :** భగవన్ = ఓ భగవాన్ శ్రీదత్త!, ఉపాస్యః= ఉపాసింపదగిన, ఈశ్వరః = ఈశ్వరుడు, కః = ఎవడు? కార్యం కర్మ చ = చేయదగిన కర్మయు, కిం = యేమి?, హి = ఏలన, అత్ర = ఈ విషయమున, బహవః = అనేకములైన, ఈశాః = ఈశ్వరులు, కర్మాణి చ = కర్మలున్ను, శ్రుతాః = వినబడినవి, తతః = అందువలన, పునః = మరల

**తా :** ఓ భగవన్! చాలమంది ఈశ్వరులను గురించి, చాల కర్మలను గురించి చెప్పగా వినుచున్నాము. వీనిలో చేయదగిన కర్మ యేది? ఉపాసింపదగిన ఈశ్వరుడెవడు? *

**శ్లో॥ పఞ్చవింశతి సంస్కారరూపం కర్మోదితం పరైః ।**
**అమృతత్వాయాష్టచత్వారింశత్సంస్కారరూపకమ్ ॥ 3**

**ప్ర :** కర్మ = కర్మయనునది, పంచవింశతి = ఇరువదియైదు, సంస్కారరూపం = సంస్కారముల

రూపము గలదిగా, ఉదితమ్ = చెప్పబడినది; అష్టచత్వారింశత్ = నలుబదిఎనిమిది, సంస్కార–రూపకమ్ = సంస్కారరూపముగా, అమృతత్వాయ = మోక్షమునకై, పరైః = ఇతరులచే, (ఉదితం).

**తా :** కొందరు మోక్షమును సాధించుటకై ఇరువదియైదు కర్మల నాచరించి సంస్కారము పొందవలెనని కొందరనగా, మరికొందరు నలుబదియెన్మిది కర్మల సంస్కారమున మాత్రమే ముక్తి సాధ్యమందురు. *

**శ్లో॥ వ్రతతీర్థార్చనజపతపోదానాది రూపకమ్ ।**
**సాపేక్షమశ్వవద్యజ్ఞాది శ్రుతేరితి కేచన ॥ 4**

**ప్ర :** కేచన = కొందరు, వ్రత = వ్రతదీక్షలు, తీర్థ = తీర్థ సేవనము, అర్చన = దేవతామూర్తి పూజ, జప = దేవతాకమంత్రజపము, తపః = దేహేంద్రియములను నియమించుట, దాన = యోగ్యులకు దానము చేయుట, ఆది = మొదలుగా, రూపకమ్ = రూపముగా గల కర్మలు, శ్రుతేః = వేదము శాసించినట్లు, సాపేక్షమ్ = కామ్యముతో, అశ్వవత్ = అశ్వమేధాది, యజ్ఞ+ఆది = యజ్ఞములు మొదలగునవి, చేయదగును, ఇతి = అని (అందురు).

**తా :** కొందరు వ్రతములు చేయుట, తీర్థయాత్రలు సేవించుట, మంత్రజపము, తపస్సు, దానము, అశ్వమేధాది కామ్యకర్మలు చేయుట వేదవిహితమందురు. *

**శ్లో॥ నిర్విఘ్నార్థం హరీశాద్యా దేవా అపి భజన్తి యమ్ ।**
**మర్త్యైః స వక్రతుణ్డోఽర్చ్య ఇతి గాణేశసంమతమ్ ॥ 5**

**ప్ర :** నిర్విఘ్నార్థమ్ = విఘ్నము లేకుండుటకు, హరి+ఈశ+ఆద్యాః = విష్ణువు, శివుడు, మొదలుగాగల, దేవాః అపి = దేవతలు గూడ, యమ్ = ఎవనిని, భజన్తి = పూజించుచున్నారో, సః వక్రతుణ్డః = ఆ వక్రతుండగణపతి, మర్త్యైః = మానవులచే, అర్చ్యః = పూజింపదగినవాడు, ఇతి = అని, గాణేశసంమతమ్ = గణేశుని నమ్మి కొల్చువారి కిష్టమైన మతము.

**తా :** చేయు పనులు ఆటంకములు లేక సాగుటకు మానవులు గణేశుని పూజింపవలెనని ఆ గణేశభక్తులందురు. ఏలన, బ్రహ్మ, విష్ణు, శివులును, దేవతలుగూడ వానినే పూజింతురని వారి నమ్మిక. *

**శ్లో॥ జగత్స్రష్టాదిహేతుః సా వరా శ్రుత్యుక్తదేవతా ।**
**గణానాం త్వేతి మన్త్రేణ స్తుతా గృత్సమదర్షిణా ॥ 6**

**ప్ర :** గృత్సమదర్షిణా = గృత్సమదుడు అను పేరుగల మహర్షి చేత, **గణానాం త్వా** ఇతి మన్త్రేణ = గణానాం త్వా అని ఆరంభమగు మంత్రముతో, శ్రుతి+ఉక్తదేవతా = వేదముచే చెప్పబడిన దేవత, స్తుతా = స్తుతింపబడినది, వరా సా = శ్రేష్ఠురాలైన ఆమె, జగత్ = జగత్తుయొక్క, సృష్టి = సృష్టికి, ఆది హేతుః = తొలి కారణము.

**తా :** యే దేవతను గృత్సమదమహర్షి **గణానాం త్వా** అను మంత్రముతో స్తుతించినాడో ఆ శ్రేష్ఠదేవత జగత్ సృష్టికి మూలకారణము. *

**శ్లో॥ ఇత్యుక్తం తత్పురాణేఽతో గణేశో బ్రహ్మణస్పతిః ।**
**మహాకవిర్జ్యేష్ఠరాజః శ్రూయతే మన్త్రకృచ్చ సః ॥ 7**

**ప్ర :** తత్ పురాణే = ఆ పురాణమునందు, గణేశః = గణపతి, బ్రహ్మణస్పతిః = మంత్రాధిపతి, ఇతి = అని, ఉక్తమ్ = చెప్పబడినది, అతః = అందువలన, సః = ఆతడు, మహాకవిః = మహాకవిగా, జ్యేష్ఠరాజః = జ్యేష్ఠరాజుగా, మన్త్రకృత్ చ = మంత్రకర్తగాను, శ్రూయతే = ప్రసిద్ధిగా చెప్పబడుచున్నాడు.

**తా :** గణేశుడే మంత్రాధిపతిగా పురాణమున చెప్పబడినది. అందువలన ఆతడు మంత్రకృత్, మహాకవి, జ్యేష్ఠరాజు అనబడుచున్నాడు. *

**శ్లో॥ మన్త్రం వదత్యుక్థ్యమేష ప్ర నూనం బ్రహ్మణస్పతిః ।**
**యస్మిన్నిన్ద్రాదయః సర్వే దేవా ఓకాంసి చక్రిరే ॥ 8**

**ప్ర :** ఏష బ్రహ్మణస్పతిః = ఈ బ్రహ్మణస్పతి, మంత్రకర్తయైన గణేశుడు, నూనమ్ = నిశ్చయముగా, ఉక్థ్యం మన్త్రమ్ = స్తోత్రపరమైన మంత్రమును, ప్రవదతి = ప్రవచించుచున్నాడు, యస్మిన్ = యే మంత్రము నందు, సర్వేదేవాః = దేవతలందరు, నిద్రా+ఆదయః = నిద్ర మొదలగు, ఓకాంసి = గృహములను, చక్రిరే = ఏర్పరచుకొనిరి.

**తా :** ఈ మంత్రాధిపతియైన గణపతి నిశ్చయముగా స్తోత్రపరమైన మంత్రమును ప్రవచించు చున్నాడు. ఆ మంత్రమున సర్వదేవతలు గృహముల నేర్పరచుకొని అందు నిద్రాణముగ నున్నారు.

**శ్లో॥ స ప్రభుః సర్వతః పాతా యో రేవాన్యో అమీవహా ।**
**అతోఽర్చ్యోఽసౌ యశ్చతురో వసువిత్పుష్టివర్ధనః ॥ 9**

**ప్ర :** యః = ఎవడు, రేవాన్ = ధనదాతయో, యః =ఎవడు, అమీవహా = రోగనివారకుడో, యః చ = ఎవడున్ను, తురః = వేగముగ ఫలమునిచ్చువాడో, వసువిత్ = నిధులెఱిగినవాడో, పుష్టివర్ధనః = పుష్టిని వృద్ధిచేయువాడో, సః = ఆతడు, ప్రభుః = అధికారి, శాసకుడు, సర్వతః పాతా = సర్వవ్యాపి, అతః = అందువలన, అసౌ = ఆతడు, అర్చ్యః = పూజింప దగినవాడు.

**తా :** ఆ గణపతి ధనదాత, రోగనివారకుడు, వేగముగ ఫలమిచ్చువాడు, నవనిధి జ్ఞానము గలవాడు, పుష్టివర్ధనుడు, ప్రభువు, సర్వవ్యాపి, అందువలన పూజింపదగినవాడు.

**శ్లో॥ వక్రతుణ్డోఽపి సుముఖః సాధోగన్తాపి చోర్ధ్వగః ।**
**యేఽముం నార్చన్తి తే విఘ్నైః పరాభూతా భవన్తి హి ॥ 10**

**ప్ర :** సః = ఆ గణేశుడు, వక్రతుండః అపి = వంకరయైన తొండము గలవాడైనను, సుముఖః

= చక్కని మోము గలవాడు, అధః గన్తా అపి = ఎలుకపై నెక్కి తిరుగువాడైనను, ఊర్ధ్వగః చ = బ్రహ్మజ్ఞాని కూడ, యే = ఎవరెవరు, అముమ్ = ఈ గణపతిని, న అర్చన్తి = పూజింపకుందురో, తే = వారు, విఘ్నైః = ఆటంకములతో, పరాభూతాః = అవమానింపబడువారు, భవన్తి హి = అగుచునే యున్నారు.

**తా :** గణపతి వక్రతుండుడని, మూషకవాహనుడని చెప్పబడినాడు. నిజమునకు, వక్రతుండుడనగా **కుటిలతను ఖండించువాడు** అనియు, అధోగన్తా (మూషకవాహనుడు) అనగా ఈ లోకమున అధోగతి గలవానిగా కన్పించుచున్నను, **ఆత్మసత్యత్వమున విహరించువాడని** అర్థము. ఈ సదర్థమును స్వీకరించి ఆ దేవుని అర్చించని వారికి చేపట్టిన కార్యములకు విఘ్నములు కలిగి, అవమానింప బడుదురు. *

**శ్లో॥ యే దూర్వాఙ్కురలాజాద్యైః పూజయన్తి శివాత్మజమ్ ।**
**ఐహికాముష్మికాన్ భోగాన్ కృత్వా ముక్తిం వ్రజన్తి తే ॥ 11**

**ప్ర :** యే = ఎవరు, దూర్వా+అంకుర = లేతగరికతో, లాజ = పేలాలతో, ఆద్యైః = మొదలగు వానితో, శివ+ఆత్మజమ్ = శివుని కుమారుడైన గణపతిని, పూజయన్తి = పూజించుచున్నారో, తే = వారు, ఐహిక = ఈ లోకసంబంధి, ఆముష్మికాన్ = పరలోకసంబంధి, భోగాన్ = భోగములను, కృత్వా = అనుభవించి, ముక్తిమ్ = ముక్తిని, వ్రజన్తి = పొందుచున్నారు.

**తా :** లేతగరికతో, పేలాలు మొదలైన వానితో శివపుత్రుడైన గణేశుని పూజించిన వారికి ఇహపరములు రెండిటను భోగములు చేకూరి, ముక్తిని గూడ పొందును.

**శ్లో॥ యస్యోదయాస్తమయసమయే శివాద్యా అపి చాఞ్జలిమ్ ।**
**బధ్నన్తి విశ్వసాక్షీ స ప్రత్యక్షః శ్రూయతే రవిః ॥ 12**

**ప్ర :** యస్య = ఏ సూర్యునియొక్క, ఉదయ+అస్తమయ సమయే = ఉదయాస్తమయముల వేళలో, శివ+ఆద్యాః అపి చ = శివుడు మొదలగు దేవతలు గూడ, అంజలిమ్ = అంజలిని, బధ్నన్తి = ఘటించుచున్నారో, సః రవిః = ఆ సూర్యుడు, ప్రత్యక్షః = కట్టెదురనున్న, విశ్వసాక్షీ = విశ్వసాక్షి (యని), శ్రూయతే = వినబడుచున్నది.

**తా :** సూర్యుడు లోకమునకు సాక్షాత్ సాక్షియని చెప్పుదురు. అందుమూలమున శివాది దేవతలు గూడ సూర్యోదయ, సూర్యాస్తమయ వేళలందు చేతులు జోడించి నమస్కరింతురు. *

**శ్లో॥ యదధీనా కాలగతిర్యదధీనాః క్రియాః సమాః ।**
**యన్మన్త్రేణ ద్విజత్వాప్తిర్యన్మన్త్రేణ కృతార్థతా ॥ 13**

**శ్లో॥ లౌకికాఽపి వ్యవహృతిర్యత్ప్రసాదాత్ప్రవర్తతే ।**
**స్మర్యతేఽస్మాద్విశ్వసృష్టిః సవితుః శ్రూయతేఽపి చ ॥ 14**

**ప్ర :** కాలగతిః = కాలము నడత, యత్+అధీనా = దేని వశమైనదో, సమాః క్రియాః =

సాంవత్సరిక కార్యకలాపములు, యత్+అధీనాః = దేనికి వశమై యున్నవో, యత్+మన్త్రేణ = ఏ మంత్రముతో, ద్విజత్వ+ఆప్తిః = బ్రాహ్మణత్వము లభించునో, యత్+మన్త్రేణ = ఏ మంత్రముతో, కృతార్థతా = ధన్యత్వమో, లౌకికా = లోకసంబంధమైన, వ్యవహృతిః అపి = వ్యవహారము గూడ, యత్ = యే మంత్రముయొక్క ప్రసాదాత్ = అనుగ్రహమువలన, వర్తతే = కలగుచున్నదో, అస్మాత్ సవితుః = ఆ **సావిత్రి లేక గాయత్రి** యనబడు సూర్యమంత్రమునుండి, విశ్వసృష్టిః = లోకసృష్టి, శ్రూయతే = వేదోక్తమై వినబడుచున్నది, అపి చ = మరియును, స్మర్యతే = స్మరింప బడుచున్నది.

**తా :** సావిత్రి లేక గాయత్రి అనబడు మంత్రము సూర్యమంత్రము. ఇది **అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్యముపతిష్ఠతే। ఆదిత్యాజ్జాయతే వృష్టిర్వృష్టేరన్నం తతః ప్రజాః॥** అని వేదమంత్ర స్మృతి ప్రమాణమున సృష్టి మూలకమంత్రమని చెప్పబడుచున్నది. సంవత్సరాధీనమగు కార్యములు, ఋతువులు, సమస్తముగా గల కాలగతి ఆ సూర్యుని అధీనమున నున్నది. ఆ మంత్రోపాసన మూలముననే బ్రాహ్మణత్వము కలిగి మానవుడు ధన్యుడగుచున్నాడు.

**శ్లో॥ జగతస్తస్థుషశ్చాత్మా సూర్యస్తం బహుధా జగుః ।**
**మూర్తామూర్తం జగత్సర్వం ప్రాణాపానాత్మకం శ్రుతమ్ ॥ 15**

**ప్ర :** జగతః = కదలుచున్న వానియొక్క (జంగమములయొక్క), తస్థుషః చ = కదలనివాని (స్థావరముల) యొక్కయు, ఆత్మా = ఆత్మ, సూర్యః = సూర్యుడు; తమ్ = వానిని, బహుధా = అనేక విధములుగా 'ఇంద్ర, మిత్ర, వరుణ' ఇత్యాది నామములతో, జగుః = తెలియుదురు; మూర్త+అమూర్తమ్ = సాకార నిరాకారమైన, జగత్ సర్వం = జగత్తు అంతయు, ప్రాణ+అపాన+ఆత్మకమ్ = ప్రాణము, అపానము అను రెండు ప్రధానాంగములు గలదిగా, శ్రుతమ్ = (ప్రశ్నోపనిషత్తు) చెప్పుచున్నది.

**తా :** సూర్యుడు స్థావరజంగమరూపమైన ఈ విశ్వమునకు మూలము. సాకారము నిరాకారము నైన ఈ సమస్త జగత్తు ప్రాణ అపానములనబడు వాని ఆధారమున నడచుచున్నదని ప్రశ్నోపనిషత్తు వివరించును. అట్టి సూర్యుని ఇంద్రుడని, వరుణుడని, మిత్రుడని, ఇట్లనేక నామములతో తెలియుచున్నారు.

*

**శ్లో॥ ప్రాణః సూర్యోఽఽపరశ్చన్ద్రస్తయోః సర్వం ప్రతిష్ఠితమ్ ।**
**శ్రీసూర్యకిరణావేశాచ్చన్ద్రస్యాపి చ చన్ద్రతా ॥ 16**

**ప్ర :** సూర్యః = సూర్యుడు, ప్రాణః = ప్రాణము, చన్ద్రః = చంద్రుడు, అపరః = ఆ రెండవది, అనగా అపానము; తయోః = ఆ ఇద్దరి యందు లేక ప్రాణాపానములు రెండిటియందు, సర్వం = విశ్వము, ప్రతిష్ఠితమ్ = నిలుపబడి యున్నది; శ్రీసూర్యకిరణ+ఆవేశాత్ = సూర్యభగవానుని కిరణములు ఆవేశించినందువలన, చన్ద్రస్య = చంద్రునియొక్క, చన్ద్రతా అపి చ =చంద్రత్వము గూడ.

**తా :** ఈ విశ్వమునకు సూర్యుడు ప్రాణము, చంద్రుడు అపానము. వారిద్దరి యందు ఈ జగత్తు నిలుపబడినది. సూక్ష్మమెఱిగిన, చంద్రుని చంద్రత్వమునకు సూర్యకిరణము లాతనిలో చేరుటయే కారణము. కాగా ప్రాణప్రసారము ద్వారముననే అపాన మేర్పడుచున్నదని తెలియదగును. *

**శ్లో॥ అతశ్చన్ద్రో న భిన్నోఽస్మాత్స సూర్యః సకలాత్మకః ।**
**యం వినా జగదాన్ధ్యం హి స దేవః కైర్న పూజ్యతే ॥ 17**

**ప్ర :** అతః = ఆ కారణమున, చన్ద్రః = చంద్రుడు, అస్మాత్ = సూర్యునికంటె, న భిన్నః = వేరైన వాడు కాడు; సూర్యః = సూర్యుడు, సకలాత్మకః = అన్నిటికి మూలమైన వాడు, యం వినా = ఎవడు లేక, జగత్ = లోకము, ఆన్ధ్యం హి = చిమ్మచీకటియో, సః దేవః = ఆ సూర్యదేవుడు, కైః = ఎవరిచేత, న పూజ్యతే = పూజింపబడడు?

**తా :** అందువలన సూర్యచంద్రులు ఒక్కరే, వేర్వేరు కారు. సూర్యుడు విశ్వమునకు మూలము. ఆతడు లేనిచో జగత్తంతయు అంధకారమే. అట్టి సూర్యుని పూజింపని వారెవరు?

**శ్లో॥ తమోఽముం గ్రసతీత్యేష దృష్టవాదో న తాత్త్వికః ।**
**తస్మాద్భక్తేష్టదో దేవో వరోకశ్చాపరాజితః ॥ 18**

**ప్ర :** అముమ్ = ఈ సూర్యుని, తమః = తమస్సు, చీకటి, గ్రసతి = మ్రింగును, ఇతి = అని, ఏష = ఈ, దృష్టవాదః = దృష్టవాదము, న తాత్త్వికః = తత్త్వసత్యము కాదు, తస్మాత్ = అందువలన, భక్త+ఇష్టదః = భక్తుల కోరికల నిచ్చు, దేవః = సూర్యదేవుడు, వర = శ్రేష్ఠుడైన, ఓకః = నివాసము, అపరాజితః చ = అపజయమెఱుగనివాడు.

**తా :** సూర్యుని చీకటి కబళించుట కన్పడుచున్నది కనుక అది సత్యమను వారు దృష్టవాదులు. కాని ఈ కన్పడునది సూక్ష్మపరిశీలనలో అసత్యమని తెలియును. కావున అది తత్త్వసత్యము కాదు. కావున సూర్యదేవుడు భక్తులకు కోరినదిచ్చు ఆశ్రయము, వానిని నమ్మినవారికి ఆశాభంగము లేదు. *

**శ్లో॥ ఈశావాస్యమిదం సర్వం చక్షోః సూర్యో అజాయత ।**
**ఇతి శ్రుతిరువాచాతో మహాదేవః పరావరః ॥ 19**

**ప్ర :** ఈశావాస్యమ్ = ఈశ్వరునిచే ఆచ్ఛాద్యము, ఇదం సర్వమ్ = ఇదంతయు, చక్షోః =కంటినుండి, సూర్యః = సూర్యుడు, అజాయత = జన్మించెను, ఇతి = అని, శ్రుతిః = వేదము, ఉవాచ = చెప్పెను, అతః = ఆ కారణమున, మహాదేవః = శివుడు, పరావరః = బ్రహ్మాది పరదేవతలలో శ్రేష్ఠుడు.

**తా :** సృష్టియంతయు ఈశునిచే వ్యాప్తమై యున్నది. వాని కంటినుండి సూర్యుడుద్భవించెను, అని వేదము చెప్పుటచే మహాదేవుడు శివుడు పరదేవతలైన బ్రహ్మాదులలో శ్రేష్ఠుడు. *

**శ్లో॥ అష్టమూర్తిరసౌ సూర్యో మూర్తిత్వే పరికల్పితః ।**
**నేత్రం త్రిలోచనస్యైకమసౌ సూర్యస్తదాశ్రితః ॥ 20**

ప్ర : అసౌ సూర్యః = ఈ సూర్యుడు, మూర్తిత్వే = సాకారరూపమున, అష్టమూర్తిః = ఎన్మిది మూర్తులు గల, త్రిలోచనస్య = ముక్కంటియొక్క, ఏకం నేత్రమ్ = ఒక కన్నుగా, పరికల్పితః = చేయబడెను; అసౌ సూర్యః = ఈ సూర్యుడు, తత్ = దానిని, ఆశ్రితః = ఆశ్రయించిన వాడాయెను.

**తా :** ఈశ్వరుడు అష్టమూర్తి : పృథివి, ఆపః, తేజః, వాయుః, ఆకాశము, అను పంచభూతములున్ను, సూర్యుడు, చంద్రుడు, పురుషుడు అనునవి వాని అష్టమూర్తులు. ఈశ్వరుడు ముక్కంటి. వాని కన్నులలో ఒకదానిని సూర్యుడాశ్రయించినాడు. *

**శ్లో॥ యస్య భాసా సర్వమిదం విభాతీతి శ్రుతేరిమే ।**
**తమేవ భాన్తమీశానమనుభాన్తి ఖగాదయః ॥ 21**

ప్ర : యస్య = ఎవనియొక్క, భాసా = కాంతిచేత, ఇదం సర్వమ్ = ఈ విశ్వమంతయు, విభాతి = విశేషించి ప్రకాశించుచున్నది, ఇతి = అని, శ్రుతేః = శ్రుతివలన, వేదము వలన (వినుచున్నామొ); తం భాన్తం ఈశానమ్ = ఆ ప్రకాశమానుడైన ఈశ్వరుని, ఖగ+ఆదయః = సూర్యుడు మొదలగు వారు, అనుభాన్తి ఏవ = అనుసరించియే ప్రకాశించుచున్నారు.

**తా :** ఈశ్వరుడు స్వయంప్రకాశుడు; ఆ ఈశ్వరుని కాంతితోనే యీ జగత్తు వెలుగుచున్నది; సూర్యుడాదిగా సమస్తము ఆ స్వప్రకాశుడైన ఈశ్వరుననుసరించియే వెలుగొందుచున్నారు. *

**శ్లో॥ ఈశానః సర్వవిద్యానాం భూతానాం చేతి చ శ్రుతేః ।**
**వేదాదీనామప్యధీశః స బ్రహ్మా కైర్న పూజ్యతే ॥ 22**

ప్ర : సర్వవిద్యానామ్ = అన్ని విద్యలకు, భూతానామ్ = భూతములకు, జీవులకు, వేద+ఆదీనామ్ అపి చ = వేదాది శాస్త్రములకు గూడ, సః ఈశానః బ్రహ్మా = మూలమై ఆ ఈశ్వరుడు, కైః = ఎవరి చేత, న పూజ్యతే = పూజింపబడడు?, ఇతి = అని, శ్రుతేః = వేదము వలన (తెలియును).

**తా :** అన్ని విద్యలకు, ప్రాణులకు, వేదాది శాస్త్రములకు గూడ మూలమైన వాడు ఈశ్వరుడు. ఆతడే పరబ్రహ్మ. ఆ ఈశ్వరుని పూజించని వారుండరు కదా. *

**శ్లో॥ యస్య సంహారకాలే తు న కిఞ్చిదవశిష్యతే ।**
**సృష్టికాలే పునః సర్వం స ఏకః సృజతి ప్రభుః ॥ 23**

ప్ర : యస్య = ఏ దేవుని, సంహారకాలే తు = ప్రలయకాలమున నేమో, న కించిత్ = ఏ కొంచెమైనను, అవశిష్యతే = మిగిలి యుండదో; పునః = మరల, సృష్టికాలే = సృష్టి చేయు కాలమున, సర్వమ్ = సమస్తమును, సః ప్రభుః = ఆ స్వామి, ఏకః = ఒక్కడే, సృజతి = సృష్టిచేయుచున్నాడో.

**తా :** ప్రలయకాలము రాగా, ఆ దేవుడే సృష్టినంతయు నాశము చేయుచున్నాడు. మరల సృష్టికాలములో తానొక్కడే సమస్తమును సృష్టించుచున్నాడు. *

**శ్లో॥ సూర్యచన్ద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్ ।**
**ఇతి శ్రుతేర్మహాదేవః శ్రేష్ఠోఽర్చ్యః సకలార్చితః ॥ 24**

**ప్ర :** యథాపూర్వమ్ = అంతకు ముందెట్లుండెనో అట్లే, ధాతా = బ్రహ్మ, సూర్యచంద్రమసౌ = సూర్యచంద్రులిద్దరను, అకల్పయత్ =సృష్టించెను, ఇతి = అని, శ్రుతేః = వేదవాక్యమువలన తెలియగా, సకల+అర్చితః = అందరిచే అర్చింపబడిన, శ్రేష్ఠః = ఉత్తముడైన, మహాదేవః = ఈశ్వరుడు, అర్చ్యః = పూజ్యుడు.

**తా :** బ్రహ్మ పూర్వమున్నట్లే సూర్యచంద్రులను కల్పించెనను వేదోక్తివలన మహాదేవుడు సర్వపూజితుడని, పూజ్యులలో శ్రేష్ఠుడని తెలియవచ్చును. *

**శ్లో॥ విశ్వం భూతం భవద్భవ్యం సర్వం రుద్రాత్మకం శ్రుతమ్ ।**
**మృత్యుఞ్జయస్తారకోఽతః స యజ్ఞస్య ప్రసాధనః ॥ 25**

**ప్ర :** భూతమ్ = పూర్వము యేర్పడినది, భవత్ = ఇప్పుడు ప్రవర్తించునది, భవ్యమ్ = ఇకముందు కాలమున యేర్పడబోవునది యగు, విశ్వమ్ = ఈ సృష్టి, సర్వమ్ = అంతయు, రుద్ర+ఆత్మకమ్ = రుద్రుని మూలము గలది, అతః = అందువలన, సః = ఆ రుద్రుడు, యజ్ఞస్య = యజ్ఞమునకు, ప్రసాధనః = తొలి సాధనము, మృత్యుంజయః = మృత్యువిజేతయైన ఈశ్వరుడు, తారకః = దాటించువాడు.

**తా :** విశ్వము సృష్టి స్థితి లయల ఆవృతితో మరల మరల రూపుదాల్చి వృద్ధియై రూపుమాసి పోవునది. ఇట్టి విశ్వము భూతభవిష్యత్‌వర్తమానములలో ఆవృతమగుచుండును. ఇది ఇట్లు రుద్రాత్మకము, మృత్యుంజయము. ఇట్టి రుద్రుడు, మృత్యుంజయుడు యజ్ఞమునకు మూలసాధనమై తరింపజేయువాడగుచున్నాడు. *

**శ్లో॥ విషమాక్షోఽపి సమదృక్సాఽశివోఽపి శివః స చ ।**
**వృషసంస్థోఽప్యతివృషో గుణాత్మాప్యగుణోఽమలః ॥ 26**

**ప్ర :** విషమ+అక్షః = బేసి కన్నులవాడు, అపి = అయినను, సమదృక్సా = అందరియందు హెచ్చు తగ్గులు లేని సమానదృష్టి కలిగినవాడు; అశివః అపి = వేషధారణలోను నివాసమందును అమంగళముగ తోచినను, సః = ఆతడు, శివః చ = శివుడు, అనగా, శుభంకరుడు గూడ; వృషసంస్థః అపి = వృషభవాహనుడైనను, అతివృషః = విధి నిషేధముల కతీతుడు; గుణాత్మా అపి = గుణలక్షణము కలవాడైనను (తమోగుణప్రధానమూర్తియైనను), అగుణః = గుణము లేనివాడు, అమలః = గుణవికార మాలిన్యము లేనివాడు.

**తా :** శివుడు మూడు కన్నులవాడే. కాని వాని దృష్టి అందరి యందు సమానము. వాని నివాసము శ్మశానము, వాని భూషలు సర్పములు, వాని మైపూత బూది. ఇట్లు వాని రూపము శివేతరముగా తోచినను, ఆతడు శివంకరుడే, సుఖస్వరూపుడే. వాని వాహనము వృషభమే కాని తాను మాత్రము విధినిషేధముల కతీతుడు. తన మూర్తి తమోగుణప్రధానమైనదే, కాని గుణవికారములు లేనివాడు కనుక గుణసంబంధము లేనివాడే. *

**శ్లో॥ యదాజ్ఞాముద్వహన్త్యత్ర శిరసా సాసురాః సురాః ।**
**అన్నం వాతో వర్ష ఇతీషవో యస్యాస్య విశ్వపాః ॥ 27**

**ప్ర :** అత్ర = ఈ విషయమున, సురాః = దేవతలు, స+అసురాః = రాక్షసులతో కూడి, యత్+ఆజ్ఞామ్ = యే ఆజ్ఞను, శిరసా = శిరస్సు వంచి, ఉద్వహన్తి = ధరించు చున్నారో, అస్య విశ్వపాః = అట్టి విశ్వరక్షకుడు, యస్య = వానియొక్క, అన్నమ్ = అన్నము, వాతః = వాయువు, వర్షః = వర్షము, ఇతి = అని, ఇషవః = బాణములు.

**తా :** ఈ విషయమున దేవతలు రాక్షసులు గూడ యే విశ్వరక్షకుని ఆజ్ఞను శిరసావహింతురో, ఆ దేవుని రక్షకాస్త్రములు అన్నము, వాయువు, వర్షము అనునవి. *

**శ్లో॥ భిషక్తమం త్వా భిషజాం శృణోమీతి శ్రుతేరయమ్ ।**
**స్వభక్తసంసారమహారోగహర్తాఽపి శఙ్కరః ॥ 28**

**ప్ర :** భిషజామ్ = వైద్యులకు, భిషక్తమమ్ = ఉత్తమవైద్యుడైన, స్వభక్త = తన భక్తులయొక్క, సంసారమహారోగహర్తా అపి = సంసారమహారోగమును మాన్పువాడవు కూడ, శంకరః = శివుడు, ఇతి = అని, త్వా = నిన్ను గూర్చి, అయమ్ = ఈ విషయమును, శ్రుతేః = వేదమువలన, శృణోమి = వినుచున్నాను.

**తా :** వైద్యులకే ఉత్తమవైద్యుడు, తన భక్తులను సంసారరోగబాధలనుండి కాపాడు వైద్యుడు శివుడు అని నిన్ను గురించి వేదమువలన వినుచున్నాను. *

**శ్లో॥ శివోఽపి శక్తియుక్తశ్చేత్ప్రభుః కార్యాయ నాన్యథా ।**
**స్వమాయయా వినేశస్య పరస్యానుభవాత్మనః ॥ 29**

**ప్ర :** శివః అపి = శివుడైనను, కార్యాయ = కార్యనిర్వహణవిషయమున, శక్తియుక్తః చేత్ = శక్తితో కూడియున్న వాడైనచో, ప్రభుః = సమర్థుడు, అన్యథా = వేరు విధముగా, న = కాదు; స్వమాయయా వినా = తన మాయ లేకుండ, అనుభవాత్మనః = అనుభవమూర్తియైన, పరస్య ఈశస్య = పరుడైన ఈశ్వరునకు,

**శ్లో॥ న ఘటేతార్థసమ్బన్ధస్తతో మాయా పరావరా ।**
**యస్యాః ప్రభావం ప్రవక్తుం శివాద్యా అప్యలం బలమ్ ॥ 30**

**ప్ర :** అర్థసంబంధః = క్రియారూప సంబంధము, న ఘటేత = యేర్పడదు; తతః = అందువలన, మాయా = మాయ, పరావరా = పరమశ్రేష్ఠము, యస్యాః = యే మాయయొక్క ప్రభావమ్ = ప్రభావమును, ప్రవక్తుమ్ = చెప్పుటకు, శివాద్యాః అపి = శివాదులైనను, అలం బలమ్ = శక్తిచాలనివారే.

**తా :** శక్తితో గూడి యున్నప్పుడే శివుడు సృష్టికార్యనిర్వహణకై సమర్థుడగును, లేనిచో కాడు. తన మాయలేనివాడైతే, శివునకు సృష్టితో క్రియారూపసంబంధము కలుగదు. అప్పుడాతడు ఆత్మకేవలుడు. *

**శ్లో॥ వైష్ణవీయం మహామాయా సురాసురమునిస్తుతా ।**
**శయ్యాం దేవమయీం కృత్వా శేతేఽసావితి గీయతే ॥ 31**

**ప్ర :** సురాసురమునిస్తుతా = దేవతలు, రాక్షసులు, మునులు వీరిచేత నుతింపబడిన, వైష్ణవీయమ్ = విష్ణువునకు చెందిన, మహామాయా = గొప్ప మాయ, దేవమయీమ్ = దేవతలతో నిండిన, శయ్యాం కృత్వా = పడక నేర్పరచికొని, అసౌ = ఈమె, శేతే = పవళించును, ఇతి = అని, గీయతే = చెప్పబడునది.

**తా :** వైష్ణవమహామాయను దేవతలు, రాక్షసులు, మునులు అందరును స్తుతింతురు. ఈ దేవి దేవతలనే శయ్యగా చేసికొని, శయనించి యుండునని చెప్పబడినది.

**శ్లో॥ సర్వే దేవాశ్చ మునయో విషమే యాం స్తువన్తి హి ।**
**సృష్టిస్థితివినాశానాం హేతురేకా సనాతనీ ॥ 32**

**ప్ర :** సర్వే దేవాః మునయః చ = అందరు దేవతలు మునులు కూడ, విషమే = అననుకూల పరిస్థితులలో, యాం హి = యే దేవినే, స్తువన్తి = స్తుతింతురో, (సా = ఆమె), సనాతనీ = ఆదినెఱుగరానిదైనను నిత్యనూతనమైన, సృష్టిస్థితివినాశానామ్ = సృష్టిస్థితిలయలకు, ఏకా హేతుః = ఒక్కటైన కారణము.

**తా :** ఆ మాయను దేవదానవులు మునులు అందరునూ ప్రార్థింతురు. సృష్టి స్థితి లయలకు ఆమె అనాదియైన ఒకే ఒక్క కారణరూపిణి.

**శ్లో॥ విదుషోఽపి హఠాచ్చేతో మహామోహాయ యచ్ఛతి ।**
**అభక్తానాం బన్ధహేతుర్భక్తానాం ముక్తిదా చ సా ॥ 33**

**ప్ర :** విదుషః అపి = విద్వాంసుడైనను, హఠాత్ = అప్రయత్నముగ, తటాలున, చేతః = మనోవికారముగలవాడై, మహామోహాయ = ఊహించరాని భ్రాంతిని, యచ్ఛతి = పొందుచున్నాడు; సా = ఆ మాయాదేవి, అభక్తానామ్ = తనయందు భక్తిలేని వారికి, బంధహేతుః = సంసారబంధములకు కారణమగును, చ = మరియు, భక్తానామ్ = తనయందు భక్తి గలవారికి, ముక్తిదా = మోక్షదాత్రియగును.

**తా :** ఆ మాయాదేవి తన భక్తులకు మోక్షప్రదాయిని కాగా భక్తిలేని వారికి సంసారబంధ కారణమగును: మహాపండితుడైనను, జ్ఞానియైనను హఠాత్తుగా మనోవికారమును పొంది భ్రమలలో మునిగి పోవును.

**శ్లో॥ సర్వేష్వపి హి భూతేషు చేతనేత్యుచ్యతే తతః ।**
**స్వాత్మారామః శివోఽప్యేతాం రత్యర్థమనుధావతి ॥ 34**

**ప్ర :** సర్వేషు భూతేషు అపి = అన్ని ప్రాణులందును కూడ, చేతనా = చైతన్యము, ఇతి = అని, తతః హి = ఆ కారణముననే, ఉచ్యతే = చెప్పబడుచున్నది; స్వ+ఆత్మారామః అపి = ఆత్మానందముతో విహరించువాడైనను, శివః = శివుడు, రతి+అర్థమ్ = రతికొరకై, అనగా ఆనందముకొరకై, తామ్ = ఆమెను, ఆ మాయను, అనుధావతి = అనుసరించి పరుగెత్తును.

**తా :** ఆ మాయాదేవియే అన్ని ప్రాణులలోని చైతన్యశక్తిగా గుర్తింపబడినది. శివుడు ఆత్మానంద కేవలుడే యైనను ఆనందానుభూతికై (రత్యర్థం) ఆమె వెంట పరుగెత్తును. *

**శ్లో॥ మాయా చతుష్కపర్దాఽసౌ యువతిర్నిత్యనూతనా ।**
**సుపేశాశ్చ ఘృతాస్యాఽదౌ వస్తేఽస్య వయునాన్యపి ॥ 35**

**ప్ర :** అసౌ మాయా = ఈ మాయాదేవి, చతుష్కపర్దా = నాలుగు జడలు గలది, నిత్య నూతనా యువతిః = ఎల్లవేళల క్రొత్తగా తోచు యౌవనవతి, సుపేశాః = స్ఫురద్రూపము గలది, చ = మరియు, ఆదౌ = మొదట, ఘృత+ఆస్యా = నేయివంటి ముఖము గలది; అస్య = జీవుని యొక్క, వయునాని అపి = జ్ఞానములను కూడ, వస్తే = కప్పివేయును.

**తా :** ఈ మాయ నాలుగు జడచుట్టలు గలది, క్రొత్త మాయని యౌవనవతి, స్ఫురద్రూపి, ఘృతమువలె సుగంధము, మెఱుగు కలిగిన ముఖము గలది. ఈ మాయ జీవుని జ్ఞానమును కప్పివేసి భ్రమలో ముంచివేయును.

**శ్లో॥ భక్తిః శ్రద్ధా ధృతి హ్రీ శ్రీధీమేధాద్యైశ్చ సత్సు యా ।**
**తృష్ణాఽలక్ష్మ్యార్తిభీనిద్రాతన్ద్రారూపైరసత్సు చ ॥ 36**

**ప్ర :** యా = యే మాయాదేవి, భక్తిః = భక్తి, శ్రద్ధా = శ్రద్ధ, ధృతి = నిలుకడ, హ్రీ = లజ్జ, శ్రీ = భాగ్యము, ధీ = వివేకబుద్ధి, మేధా = అవగాహన, ఆద్యైః = మొదలగు రూపములతో, సత్సు చ = సత్పురుషులందును, తృష్ణా = అతి కామము, అలక్ష్య = లెక్కలేనితనము, ఆర్తి = దుఃఖము, భీ = భయము, నిద్రా = నిద్ర, తన్ద్రారూపైః = అలసట, బద్ధకము రూపములతో, అసత్సు చ = దుర్మార్గులయందును,

**శ్లో॥ క్షణే క్షణే విముహ్యన్తి వశినోఽప్యత్ర యోగినః ।**
**సైషాఽనిర్వచనీయార్చ్యా యా హ్యనాదిరజా శ్రుతా ॥ 37**

**ప్ర :** అత్ర = ఈ మాయవిషయమున, వశినః అపి = జితేంద్రియులైనప్పటికిని, యోగినః = యోగులు, క్షణే క్షణే = ప్రతినిమిషము, విముహ్యన్తి = మోహము జెందుచున్నారు, యా ఏషా అనిర్వచనీయా = వర్ణించి చెప్పరాని యే మాయ, అనాదిః = మొదలెఱుగరానిదో, అజా = పుట్టుక లేనిదో, సా = ఆమె, అర్చ్యా హి శ్రుతా = పూజింపదగినదిగా చెప్పబడినది.

**తా :** జితేంద్రియులైన యోగులు గూడ యీ మాయ విషయమున మాటిమాటికి భ్రమలకు లోనగుచునే యున్నారు. ఈ మాయ ఇట్టిదని వర్ణించి చెప్పనలవి కానిది. ఆమెకు పుట్టుక లేదు, మొదలు లేదు. పూజ్యురాలని చెప్పబడినది. *

**శ్లో॥ విష్ణోర్హాస్యమసౌ మాయా తదాధారా జడాఽధమా ।**
**ప్రధ్వంసోఽస్యా అనాదేశ్చ విష్ణోః పదవిలోచనాత్ ॥ 38**

**ప్ర :** అసౌ మాయా = ఈ మాయ, విష్ణోః = విష్ణువుయొక్క, హాస్యమ్ = సమ్మోహనశక్తి; జడాః = తమోగుణావిష్టులు, అధమాః = ఆసురీమార్గమును అనుసరించువారు, తత్+ఆధారాః = ఆ మాయను ఆశ్రయించువారు; అనాదేః = అనాదియైన, విష్ణోః = విష్ణువుయొక్క, పదవిలోచనాత్ = పాదదర్శనమువలన, అస్యాః చ = ఆ మాయయొక్కయు, ప్రధ్వంసః = నాశము.

**తా :** ఈ మాయ విష్ణుసమ్మోహనశక్తి. అసురలక్షణము గల తమోగుణప్రధానులు ఈ మాయనాశ్రయించి మోహితులగుచున్నారు. ఈ విష్ణుమాయ విష్ణుపాదాశ్రయము వలననే తొలగిపోవును.

**శ్లో॥ దేవానాం పరమో విష్ణురవమోఽగ్నిరితి శ్రుతేః ।**
**అయం విష్ణురజోఽనాదిరనన్తో విశ్వకారణః ॥ 39**

**ప్ర :** దేవానామ్ = దేవతలకు, పరమః = శ్రేష్ఠుడు, విష్ణుః = విష్ణువు, అవమః = రక్షకుడు, అగ్నిః =అగ్ని, ఇతి = అని, శ్రుతేః = వేదోక్తి; అయం విష్ణుః = ఈ విష్ణువు, అజః = జననము లేనివాడు, అనాదిః = కాలపరిమితి లేనివాడు, అనన్తః = అంతము లేనివాడు, విశ్వకారణః = జగత్తునకు కారణమైనవాడు

**తా :** విష్ణువు అగ్నియని దేవతల రక్షకుడని, శ్రేష్ఠుడని, ఆద్యంతములు తెలియరాని విశ్వకర్తయని, తనకొక కర్తయెవ్వరును లేనివాడని వేదోక్తి. *

**శ్లో॥ సూరయస్తత్పదం శ్రేష్ఠం సదా పశ్యన్తి నేతరే ।**
**వీర్యాణి తస్య కోఽప్యత్ర న వేదోరుక్రమస్య చ ॥ 40**

**ప్ర :** తత్ పదం శ్రేష్ఠమ్ = శ్రేష్ఠమైన వాని స్థానమును, సూరయః = పండితులు, సదా = ఎల్లప్పుడు, పశ్యన్తి = చూచుచున్నారు, న ఇతరే = అపండితులు చూడలేరు; ఉరుక్రమస్య తస్య = విస్తారమైన పాదక్షేపముగల ఆ విష్ణువుయొక్క (వామనమూర్తియైన త్రివిక్రమపాదక్షేపము),

వీర్యాణి = పరాక్రమములను, కః అపి చ = ఎవ్వరును, అత్ర = లోకమున, న వేద = తెలియలేరు.

**తా :** పండితులు విష్ణుపదమును మరువకుందురు, పామరులు దానిని గుర్తించలేరు. ఆ త్రివిక్రమ విష్ణుపాదక్షేపమును తెలిసిన వారు జగత్తులో నెవరును లేరు. *

**శ్లో॥ ప్రాగుత్పాద్య విధిం నాభేర్వేదాన్దత్వా తతో జగత్ ।**
**ఉత్పాదయత్యసావేవ బుద్ధిదీపో ముముక్షురాట్ ॥ 41**

**ప్ర :** అసౌ ఏవ బుద్ధిదీపః ముముక్షురాట్ = బుద్ధిని దీపించు ఈ ముక్తిని కోరువారి ప్రభువగు ఈ విష్ణువే, నాభేః = తన బొడ్డునుండి, విధిమ్ = బ్రహ్మను, ప్రాక్ = ముందుగా, ఉత్పాద్య = సృజించి, వేదాన్ = వానికి వేదములను, దత్వా = ఇచ్చి, తతః = వాని వలన, జగత్ = జగత్తును, ఉత్పాదయతి = సృష్టింప జేయుచున్నాడు.

**తా :** ఈ విష్ణువు సృష్టికి వివేకదీపము. సంసారబంధమోక్షమును కోరువారికి ప్రభువు. ఆతడే తొలుత బ్రహ్మను తన బొడ్డునుండి సృష్టించి, వానికి వేదముల నిచ్చి, వానిద్వారా విశ్వసృష్టి చేయించినాడు.

**శ్లో॥ భీతాఽప్యధికృతా అస్మా ఉద్వహన్తి బలిం సురాః ।**
**మాయయాశ్నన్త్యన్యదత్తం సమ్రాజ ఇవ భూమిపాః ॥ 42**

**ప్ర :** సురాః = దేవతలు, భీతా+అపి = భయము జెందిన వారైనను, అధికృతాః = అధికారము నందు నిల్పబడినవారై, అస్మా = ఆ విష్ణువునకు, బలిమ్ = ఆజ్ఞాపాలనరూపమైన విధేయతను, ఉద్వహన్తి = నిర్వహించుచున్నారు; భూమిపాః = రాజులు, మాయయా = మాయకు లోబడి, అన్యదత్తమ్ = ఇతరులచే ఇవ్వబడిన దానిని, సమ్రాజ ఇవ = సామ్రాట్టులవలె, అశ్నన్తి = అనుభవించుచున్నారు.

**తా :** విష్ణుభయమువలన దేవతలు తమ తమ అధికారములు నిర్వహించుచు విధేయులై యున్నారు. మాయకు లోనై రాజులు తమకు వేరెవరో ఇచ్చిన అధికారమును చక్రవర్తులమనుచు అనుభవించుచున్నారు.

**శ్లో॥ యస్య భ్రూభఙ్గమాత్రేణ త్రిలోకీ నశ్యతి క్షణాత్ ।**
**ఇచ్ఛామాత్రే పునర్జాతే సేశ్వరోత్పద్యతే చ సా ॥ 43**

**ప్ర :** యస్య = యే విష్ణువు యొక్క, భ్రూ భంగ మాత్రేణ = బొమముడి మాత్రము చేత, త్రిలోకీ = మూడు లోకముల జగత్తు, క్షణాత్ = క్షణములో, నశ్యతి = నశించును; ఇచ్ఛామాత్రే జాతే = సంకల్పమాత్రము చేత, సా = ఆ త్రిలోకజగత్తు, పునః = మరల, స+ఈశ్వర = ఈశ్వరునితో కూడ, ఉత్పద్యతే = సృజింపబడుచున్నది.

**తా :** ఆ విష్ణుదేవుని కనుబొమలు ముడివడినచో ముల్లోకములును క్షణములో అంతరించును. మరల వాని సంకల్పమాత్రమున ముల్లోకములు ఈశ్వరసహితములై సృజింపబడుచున్నవి. *

**శ్లో॥ య ఆత్మభూతతచ్ఛత్రుః స క్రూరో యాత్యధోగతిమ్ ।**
**దురత్యయామపి ఘ్నన్తి మాయాం యద్రూపచిన్తకాః ॥ 44**

**ప్ర :** యః = ఎవడు, ఆత్మభూత తత్+శత్రుః = ఆత్మయే తానైన విష్ణువునకు శత్రువగునో, సః క్రూరః = ఆ క్రూరుడు, అధోగతిమ్ = క్రింది దిక్కుగా, యాతి = పతనము చెందును; యత్+రూపచిన్తకాః = ఆ విష్ణురూపమును (అనగా ఆత్మరూపమును) చింతించువారు, దురత్యయాం మాయాం అపి = దాటరాని మాయను కూడ, ఘ్నన్తి = నశింపజేయుచున్నారు.

**తా :** విష్ణుదేవుని ద్వేషించి వానికి శత్రువులైన వారు క్రూరమైన ప్రవర్తన కలిగి అధోలోకములకు పతనమగుచున్నారు. ఆత్మస్వరూపుడైన ఆ విష్ణువును ధ్యానించువారు దాటరాని మాయనుగూడ జయించుచున్నారు. *

**శ్లో॥ అర్వాచీనాః సురాః కేఽపి న విదుర్యం తదుద్భవాః ।**
**స సర్వజ్ఞోఽపి చాత్మానం కార్యాన్నో వేద వేద వా ॥ 45**

**ప్ర :** తత్+ఉద్భవాః అర్వాచీనాః సురాః = వాని నుండి జనించిన, తర్వాతి వారైన దేవతలు, కే అపి = ఎవరైనను, యమ్ = ఎవనిని, న విదుః = తెలియరో, సః = ఆతడు, సర్వజ్ఞః అపి = సమస్తమెఱిగిన వాడైనను, ఆత్మానం చ = ఆత్మ స్వరూపమును గూడ, కార్యాత్ = కార్యమగ్నత్వము కారణముగా, వేద వా = తెలియునో, నో వేద = తెలియడో.

**తా :** ఆ విష్ణువునుండి తరువాత జన్మించిన దేవతలలో యే కొందరైనను ఆ దేవుని తత్త్వ స్వరూపము నెఱుగరు. ఆ దేవుడైనను సర్వజ్ఞుడైనప్పటికి, కార్యభారమువలన, తన ఆత్మ-స్వరూపమును యెఱుగునో, యెఱుగడో! *

**శ్లో॥ యస్యైకపాదియం మాయా త్రిపాదస్యామృతం దివి ।**
**స దేవదేవదేవేశః కథం నార్చ్యస్త్రివిక్రమః ॥ 46**

**ప్ర :** ఇయం మాయా = ఈ మాయ, యస్య = యే దేవునియొక్క, ఏకపాత్= ఒక్క పాదమో, అస్య = వానియొక్క, త్రిపాత్ = మూడు పాదములు, దివి = ప్రకాశ్యమైన, అమృతమ్ = అమర్త్యము; సః = ఆ దేవుడు, దేవ = ఇంద్రియములయొక్క, దేవ = అధిష్ఠానదేవతలయొక్క, దేవ = హిరణ్యగర్భునియొక్క, ఈశః = ప్రభువు; అట్టివాడు, త్రివిక్రమః = ముల్లోకములాక్రమించిన విష్ణువు, కథమ్ = ఎట్లు, న అర్చ్యః = పూజింపదగడు?

**తా :** ఈ లోకమాయ ఆ విష్ణుదేవుని ఒక్క పాదము. మిగత త్రివిక్రమరూపమైన మూడు పాదములు

అమృతమయమైనవి. ఆతడు ఇంద్రియాధిష్ఠాతలైన దేవతలకు, వారికి మూలమైన హిరణ్యగర్భునకు ప్రభువు. అట్టి విష్ణువు పూజ్యుడు కాకుండుటెట్లు? *

**శ్లో॥ ఇతరేఽప్యగ్నివాయ్విన్ద్రముఖాన్దేవాన్వదన్తి హి ।**
**శ్రౌతీకుర్వన్తి తే స్వస్వపక్షం సర్వేఽపి యత్నతః ॥ 47**

ప్ర : ఇతరే అపి = ఇతరులను గూడ, అగ్ని–వాయు+ఇన్ద్ర–ముఖాన్ = అగ్ని, వాయువు, ఇంద్రుడు మొదలైన, దేవాన్ = దేవతలను, వదన్తి హి = చెప్పుచునే యున్నారు; తే సర్వే అపి = వారందరును, యత్నతః = ప్రయత్నపూర్వకముగా, స్వస్వపక్షమ్ = తమ తమ పక్షమును, శ్రౌతీకుర్వన్తి = వేదవిహితము చేయుచున్నారు.

**తా :** అగ్ని, వాయువు, ఇంద్రుడు మొదలైన ఇతర దేవతలను గూడ ప్రముఖముగా చెప్పుచునే యున్నారు. ఆ యా దేవతల నారాధించువారు తమ తమ వాదములకు ప్రయత్నపూర్వకముగా వేదప్రామాణ్యమును కల్పించుచున్నారు. *

**శ్లో॥ విరాడాది స్థావరాన్తా ఈశ్వరా బహవః శ్రుతాః ।**
**ఏతేషు కతమోఽర్చ్యోఽత్ర మోక్షసిద్ధిప్రదశ్చ కః ॥ 48**

ప్ర : విరాట్+ఆది = విరాట్ మొదలు, స్థావరాన్తాః ఈశ్వరాః = కదలని వస్తువులతో సహ ఈశ్వరులు, బహవః = చాలామంది, శ్రుతాః = వినికిడి యందున్నారు; ఏతేషు = వీరియందు, కతమః = ఎవరు, అర్చ్యః = పూజింపదగినవాడు, అత్ర = ఈ విషయమున, మోక్షసిద్ధిప్రదః చ = మోక్షమును సిద్ధింపజేయువారున్ను, కః =ఎవరు?

**తా :** విరాట్ మొదలు, **సన్త్యశ్వత్థ అర్క వంశాదేః కులదైవతదర్శనాత్** అను శాస్త్రోక్తి ననుసరించి, స్థావరవస్తుజాలముతో సహ, ఎందరో ఈశ్వరులుగా చెప్పబడుచున్నారు. వీరిలో పూజింపదగిన మోక్షదాతయైన దేవత ఎవరు? అనునది ప్రశ్న. *

**శ్లో॥ ప్రతిమాపట్టయన్త్రేషు జలాగ్న్యాదిషు వా పునః ।**
**ఏతేషు కథమీశానో దేవః సాంనిధ్యమృచ్ఛతి ॥ 49**

ప్ర : ప్రతిమా పట్టయన్త్రేషు = విగ్రహములలోను, చిత్రములలోను, యంత్రములలోను, వా = లేక, జల = నీరు, అగ్ని = నిప్పు, ఆదిషు పునః = నీరు, నిప్పు మొదలైన వానిలోనైనను, ఏతేషు = వీనియందు, ఈశానః దేవః = ఈశ్వరుడు, కథమ్ = ఎట్లు, సాంనిధ్యమ్ = చేరికను, ఋచ్ఛతి = పొందుచున్నాడు?

**తా :** దేవుడైన ఈశ్వరుడు ఋాతి, లోహాది విగ్రహములలోను, వస్త్రము కాగితము మొదలైన వాటిపై నద్దిన ఛాయాచిత్రాదులలోను, బీజాక్షరములు పొదిగిన త్రిభుజి, చతుర్భుజి షడ్భుజి మొదలగు యన్త్రాకారములలోను యే రీతిగా వచ్చి చేరును? *

**శ్లో॥ ఏహ్యేహీత్యస్య చాహ్వానం గచ్ఛేతి చ విసర్జనమ్ ।**
**ప్రతిమాదౌ స భగవాన్ కథమాయాతి గచ్ఛతి ॥ 50**

**ప్ర :** ఏహి ఏహి ఇతి = రమ్ము రమ్ము అని, అస్య = ఆ దేవునకు, ఆహ్వానమ్ = స్వాగతము పలుకుట, గచ్ఛ ఇతి = పొమ్ము అని, విసర్జనం చ = వీడ్కోల్పుటయును (ఆచారమున కన్పడును), ప్రతిమా ఆదౌ = విగ్రహము మొదలగు వానియందు, సః భగవాన్ = ఆ భగవంతుడు, కథమ్ = ఎట్లు, ఆయాతి = వచ్చుచున్నాడు, గచ్ఛతి = వెడలిపోవుచున్నాడు?

**తా :** ఆచారములో ఆ స్వామికి ఆహ్వానము పలికి విగ్రహము మొదలగు వానిలో ఆవేశించుమని, మరల పూజావసానమున వీడ్కొల్పుచున్నాము కదా, విగ్రహాదులలో ఆ భగవంతుడెట్లు ఆవేశించును? ఎట్లు తిరిగి విడచి పోవును? *

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ప్రథమాష్టకే చతుర్థాధ్యాయః

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

ప్రథమాష్టకము - పంచమాధ్యాయము

**శ్లో॥ ప్రమన్మహేఽనుగృహ్ణాతు భవానిత్యర్థితః ప్రభుః ।**
**ప్రత్యువాచాప్యశేషజ్ఞ ఆత్మతత్త్వప్రసిద్ధయే ॥ 1**

**ప్రతిపదార్థం :** ప్రమన్మహే = యాచించుచున్నాను, భవాన్ = తమరు, అనుగృహ్ణాతు = అనుగ్రహింతురు గాక, ఇతి = అని, అర్థితః = ప్రార్థితుడైన, ప్రభుః = దత్తాత్రేయస్వామి, అశేషజ్ఞః = సర్వజ్ఞుడైన ప్రభువు, ఆత్మతత్త్వప్రసిద్ధయే = ఆత్మసత్యస్వరూపజ్ఞానసిద్ధికై, ప్రత్యువాచ అపి = బదులాడెను.

**తాత్పర్యం :** ప్రభూ! అనుగ్రహించుడని ప్రార్థించిన ఆ బ్రాహ్మణునకు ఆత్మతత్త్వబోధసేయుటకై సర్వజ్ఞుడైన దత్తాత్రేయ స్వామి ఇట్లనెను. *

**శ్లో॥ యథా కాలత్రయే నాస్తి గుణే సర్పస్తథాఽప్యహేః ॥**
**గుణ ఏవాస్త్యధిష్ఠానం తథాహం జగతః ఖలు ॥ 2**

**ప్ర :** కాలత్రయే = మూడు కాలములలోను, గుణే = త్రాడులో, సర్పః = పాము, యథా = ఎట్లు, న అస్తి = లేదో, తథా అపి = అట్లే, అహేః = పామునకు, గుణ ఏవ = త్రాడే, అధిష్ఠానమ్ = ఆధారమైన మూలపదార్థము, అస్తి = అయియున్నది; తథా = ఆ విధముగ, జగతః = జగత్తునకు, అహం ఖలు = నేనగుదును కదా, (**అహంకారమే అధిష్ఠానము**).

**తా :** భూతభవిష్యద్వర్తమానాలలో ఎప్పుడు గాని త్రాడులో పాము లేదు. ఆ రెండు వేర్వేరుగనే యున్నవి. ఐనను త్రాడును చూచి పాము అను భ్రమ కలుగుచున్నది. అనగా, ఉన్న త్రాడులో లేనిపాము కనబడుచున్నది. అట్లే, ఉన్న నాలో (అహంకారభావములో) జగత్తు ఉన్నట్లే కనబడుచున్నది. కనుక ఇది భ్రాంతి. *

**శ్లో॥ రూపం రూపం బభూవాయం ప్రతిరూపః స్వమాయయా ।**
**ఉపమా సూర్యకేత్యాది యం సూత్రకృదవర్ణయత్ ॥ 3**

**ప్ర :** రూపం రూపమ్ = త్రాడు రూపమున్నూ, పాము రూపమున్నూ, స్వ–మాయయా = తన మాయచేత, అయం ప్రతిరూపః =త్రాడే పాముగా మారిన రూపముగా, బభూవ = అయినది; యమ్ = యే క్రమమును, సూత్రకృత్ = సూత్రీకరించినవారు, ఉపమా సూర్యక+ఇత్యాది = సూర్యుడు, ప్రతిబింబములు అను ఉపమానముతో, అవర్ణయత్ = వర్ణించెను.

**తా :** త్రాడు కొక రూపము, పాము కొక రూపము, ఈ రూపముల సామ్యము ఉన్నవి. కాగా, ఆ సామ్యమే మాయాధారముగా త్రాడే పాము అను భ్రాంతరూపము కలిగినది. సూర్యుడు ఆకాశమున నుండగా, భూమిపై నీటిలో లేక అద్దములో ప్రతిబింబము సూర్యునివలెనే ఉన్నట్లు, అని పోలిక చెప్పినారు సూత్రకారులు. *

**శ్లో॥ ఏకం సద్విప్రా బహుధా వదన్తీతి శ్రుతిః పునః ।**
**ఇన్ద్రో మాయాభిః పురురూపశ్చేతి ప్రాహ సోఽస్మ్యహమ్ ॥ 4**

**ప్ర :** ఏకం సత్ = ఒక్కటి యున్నది (సత్యమొక్కటి), విప్రాః = పండితులు, బహుధా = అనేక విధములుగా, వదన్తి = చెప్పుచున్నారు. ఇతి = అని, శ్రుతిః = వేదోక్తి, పునః = మరల, ఇంద్రః = ఇంద్రుడు, మాయాభిః = మాయలతో, పురురూపః = బహురూపి, ఇతి చ = అని కూడ, ప్రాహ = చెప్పెను. సః = ఆతడు, అహం అస్మి = నేనై యున్నాను.

**తా :** సర్వమూలకసత్యమొక్కటే యనియు, మరల ఇంద్రుడు మాయలతో బహురూపిగా నున్నాడనియు, అది నేనే ననియు వేదము చెప్పినది. *

**శ్లో॥ సృష్ట్వోర్ణనాభివదిదం తదనుప్రవిశ్యామ్యహమ్ ।**
**స ఏవ మాయయా భ్రాన్తో జీవః సంసరతీహ హి ॥ 5**

**ప్ర :** ఊర్ణనాభివత్ = సాలీడు వలె, ఇదమ్ = ఈ విశ్వమును, సృష్ట్వా = సృష్టించి, అను = ఆ సృష్టి తరువాత, అహమ్ = నేను, తత్ = ఆ సృష్టిని, ప్రవిశ్యామి = ప్రవేశించుచున్నాను; సః జీవః ఏవ = ఆ జీవుడే, మాయయా = మాయచేత, భ్రాన్తః = భ్రమకు లోనై, ఇహ = ఈ సంసారమున, సంసరతి హి = సంచరించుచునే ఉన్నాడు.

**తా :** సాలీడు తనలో నుండియే పదార్థమును సృష్టించి, దానితో గూడును అల్లుకొని, ఆ గూటిలో నివసించురీతి నేను నాలోనుండియే యీ సృష్టిని నిర్మించి, ఆ సృష్టిలోనే ప్రవేశించి జీవుడనై యున్నాను. ఇట్లు జీవాహంకారరూపినై యీ ఇంద్రియవమోహితుడనై సంసారమందే పరిభ్రమిచుచున్నాను. (జీవుడు – దేవుడు అను ద్వంద్వభ్రాంతిలో పడి తిరుగుచున్నాడు జీవుడు.)*

**శ్లో॥ సత్సంసారార్తి నాశార్థం ధర్మసేతూన్ బిభర్మ్యహమ్ ।**
**భూతేశ్వరోఽవ్యయాత్మాపి నిర్మలోఽజోఽపి సన్నహమ్ ॥ 6**

**ప్ర :** అహమ్ = నేను, భూతేశ్వరః = చరాచరభూతప్రకృతికి ప్రభువునై, అవ్యయ+ఆత్మా అపి = కుంటుపడని ఆత్మనై యుండియు, నిర్మలః = వికారములేనివాడనై, అజః అపి సన్ = పుట్టుకలేని వాడనై యుండి కూడ, సత్ = సత్పురుషులయొక్క, సంసార+ఆర్తి = మోహభ్రాంతివలని దుఃఖమును, నాశ+అర్థమ్ = తొలగించుటకై, ధర్మసేతూన్ = ధర్మములనబడు వంతెనలను, బిభర్మి = నిర్మించుచున్నాను.

**తా :** నేను ఈ భూతప్రకృతికి ప్రభువును, సృష్టిక్రియలో శక్తిక్షీణతలేని వాడను, నిర్వికారుడను, పుట్టుకయే లేనివాడను. అట్లయినను, జీవులలోని సత్పురుషుల దుఃఖభ్రాంతిని నశింపజేయుటకు వంతెనలవంటి వివిధధర్మములను నిర్మించుచున్నాను. *

**శ్లో॥ ధర్మగ్లాన్యోదితేఽధర్మే తన్నివృత్త్యై సతామపి ।**
**గుప్త్యై స్వప్రకృతిం స్థిత్వా సమ్భవామ్యాత్మమాయయా ॥ 7**

**ప్ర :** ధర్మగ్లానీ+ఉదితే = ధర్మగ్లానిగా చెప్పబడిన, అధర్మే = అధర్మమునందు, తత్+నివృత్త్యై = ఆ అధర్మనివృత్తికై, సతామ్ = సాధుపురుషుల, గుప్త్యై అపి = రక్షణ కొరకు గూడ, స్వప్రకృతిమ్ = నాదైన ప్రకృతియందు, స్థిత్వా = నిలిచి యుండి, ఆత్మమాయయా = నా మాయచేత, సంభవామి = ఉద్భవించుచున్నాను.

**తా :** ధర్మగ్లాని యని చెప్పబడిన అధర్మమును తొలగించుటకై, సాధుపురుషుల సంరక్షణకొరకు గూడ నా ప్రకృతిని నే నధిష్ఠించి నా మాయచేతనే నేను అవతరించుచున్నాను. *

**శ్లో॥ విరజో విశదోఽశోకో విశుద్ధః సర్వకారణః ।**
**అవ్యక్తోఽహమచిన్త్యోఽహమనన్తోఽహం శివోఽమలః ॥ 8**

**ప్ర :** విరజః = మలినము లేనివాడను, అహమ్ = నేను, విశదః = ప్రకాశమానుడను, అశోకః = దుఃఖములేనివాడను, విశుద్ధః = సమగ్రముగ పరిశుద్ధుడను, సర్వకారణః = అన్నిటికి కారణమైనవాడను, అహమ్ = నేను, అవ్యక్తః = నామరూపగుణాది లక్షణములతో తెలియరాని వాడను, అచిన్త్యః అహమ్ = నేను ఊహకందనివాడను, అహమ్ = నేను, అనన్తః = శాశ్వతుడను, అమలః శివః = అమలినసుఖస్వరూపుడను.

**తా :** నేను మలినములేని ప్రకాశమానుడను కనుక దుఃఖమెఱుగను, వికారమెఱుగను. నేను కారణరూపుడను, వ్యక్తమైన ప్రకృతి లక్షణములు లేనివాడను, కనుక భావమునకైనను స్పష్టపడను, శాశ్వతుడను, కారణమలినములేని సుఖస్వరూపుడను.

**శ్లో॥ ఆదిమధ్యాన్తహీనోఽహం విభుః సాక్షీ తమః పరః ।**
**పరమాత్మాహమేవేయం మాయా బ్రహ్మాదయోఽమరాః ॥ 9**

ప్ర : అహమ్ = నేను, ఆది-మధ్య+అన్తహీనః = సృష్టిస్థితిలయలు లేనివాడను, విభుః = విభుడను, సాక్షీ = సాక్షి, తమఃపరః = తమోగుణమునకు దూరుడు, అహం ఏవ = నేనే, పరమాత్మా = పరమమైన ఆత్మను, బ్రహ్మ+ఆదయః అమరాః = బ్రహ్మ మొదలగు దేవతలు, ఇయం మాయా = ఈ మాయ.

**తా :** బ్రహ్మ మొదలు, కొనసాగింపు, ముగింపులేనివాడను, విభుడను, సాక్షిని, తమస్సునకంటె వేరైన వాడను. నేనే పరమాత్మను. బ్రహ్మాది దేవతలు మాయలోని వారే.

**శ్లో॥ భూతం భవ్యం భవచ్చాపి మత్తోఽన్యన్నేహ కిఞ్చన ।**
**పూజ్యోఽస్మ్యుత్తమదేహస్థః పూజకోఽధమదేహగః ॥ 10**

ప్ర : భూతమ్ = పూర్వమున్నది, భవ్యమ్ = ముందు రాబోవు కాలమున జరుగునది, భవత్+చ+అపి = ప్రస్తుతము జరుగుచున్నది, ఇహ = ఈ జగత్తులో, మత్తః = నాకంటె, అన్యత్ = వేరైనది, న కించిత్ (అస్తి) = కొంచెమైనను లేదు; (అహం = నేను), ఉత్తమదేహస్థః = ఉత్తమదేహములో ఉన్నవాడనై, పూజ్యః అస్మి = పూజింపదగినవాడను అగుచున్నాను; అధమదేహగః = అధమ దేహమున ఉన్నవాడనై, పూజకః = పూజించువాడను, (అస్మి = అగుచున్నాను.)

**తా :** భూత భవిష్యత్ వర్తమాన కాలములలో ఎప్పుడైనను ఈ సృష్టిలో నేను కానిది మరియొకటియే కొంచెమైనను లేదు. నేనే ఉత్తమదేహములలో పూజలందు కొనుచున్నాను. అధమదేహములలో పూజించువాడుగ ఉన్నాను. *

**శ్లో॥ కార్యకారణతా పూజ్యపూజకత్వాది మాయయా ।**
**మయీదం తాత్త్వికం నైవం కేవలానుభవాత్మని ॥ 11**

ప్ర : కార్యకారణతా = కార్యము దాని కారణము, పూజ్యపూజకత్వాది = పూజింపబడుట పూజచేయుట అను ఈ విధమైన, మాయయా = భ్రాంతిచేత, మయి = నా యందు, ఇదమ్ = ఈ జగత్తు; కేవల+అనుభవాత్మని = అనుభవము మాత్రమే తప్ప మరేమియులేని నా యందు, ఏవమ్ = ఈ విధముగా, న తాత్త్వికమ్ = తత్త్వసత్యము కాదు.

**తా :** కార్యకారణసంబంధము, పూజ్యపూజకసంబంధము ఇత్యాదులు మాయాభ్రాంతి. ఈ భ్రాంతియే నాలోని జగత్తు. కాని నేను కేవలము శుద్ధానుభూతిస్వరూపమైన వాడను. ఇది తాత్త్వికసత్యము.

**శ్లో॥ నిర్మలోఽజోఽప్యసఙ్గోఽయం మాయయా పరిమోహితః ।**
**స్వయంప్రకాశో భూమాఽపి దేహాద్యాస్థాయ తన్మయః ॥ 12**

ప్ర : నిర్మలః = మాలిన్యములేని వాడను, అజః = పుట్టుకలేని వాడను, అసంగః అపి = తగులములేని వాడను అయినను, స్వయంప్రకాశః అపి = నాకు నేనే వేరు భూమిక లేకుండ ప్రకాశింపగలవాడను అయినను, దేహాది = దేహము, ఇంద్రియములు, ఇత్యాదిని, ఆస్థాయ = స్వీకరించి, తన్మయః = అవియే నేనగుచు, భూమా = అనేకముగా నైతిని.

**తా :** నేను నిర్వికారిని, అపరిమితుడను, బంధములు లేనివాడను, స్వయంప్రకాశుడను అయినను, దేహేంద్రియమనోధర్మముల నావేశించి అనేకరూపినై అవియే నేనుగా మనుచున్నాను. *

**శ్లో॥ స్వాత్మన్యనాత్మధర్మాన్ స్వజ్ఞానావృత్త్యా వహత్యతః ।**
**కర్తృత్వాది బిభర్తీచ్ఛత్యత్ర భోగాన్ పరత్ర చ ॥ 13**

ప్ర : స్వాత్మని = ఆత్మపై, అనాత్మధర్మాన్ = అనాత్మధర్మములను, స్వజ్ఞానావృత్త్యా = ఆత్మజ్ఞాన ఆవృత్తిచే, వహతి = వహించు చున్నాను, అతః = అందువలన, కర్తృత్వాది = కర్తృత్వాదులను, బిభర్తీ = భరించుచు, అత్ర = ఇచట, పరత్ర చ = పరమున గూడ, భోగాన్ = భోగములను, ఇచ్ఛతి = కోరుచున్నది.

**తా :** ఆత్మ పై అనాత్మధర్మముల అధ్యాసవలన కర్త తానేయని భావించుచు, ఈ లోకమున, పరలోకమున గూడ భోగములను కోరుచున్నది.

**శ్లో॥ జాగరే పరితృప్తోఽయం స్వప్నం తద్వాసనార్దితః ।**
**స్వాపే తమోఽభిభూతశ్చ ప్రలయే వాసనామయః ॥ 14**

ప్ర : జాగరే = జాగ్రదవస్థలో (మేల్కొని యుండగా), పరితృప్తః = సంతృప్తిగలవాడనై, తత్+వాసనా+ఆర్దితః = ఆ వాసనలచే ప్రభావితుడనై, అయం స్వప్నమ్ = ఈ స్వప్నమును (కనుచున్నాను), స్వాపే = స్వప్నమున, తమః = తమోగుణముచే, అభిభూతః = ఆక్రమించబడిన వాడనై, చ = మరియు, ప్రలయే = ప్రళయకాలమున, వాసనామయః = వాసనలతో నిండినవాడనై (యున్నాను.)

**తా :** జాగ్రదవస్థలో తృప్తిగా సుఖించి, ఆ వాసనల ప్రభావముతో ఈ స్వప్నమున బడి తమోగుణాధిక్యమున ప్రవర్తింతును. ప్రళయకాలమున వాసనల రూపమున ఈ జగత్తు నా యందుండును.

**శ్లో॥ కదాచిద్దైవయోగేన వ్యతిరిక్తం పురత్రయాత్ ।**
**అఖణ్డం సచ్చిదానన్దమాత్మానం తమసః పరమ్ ॥ 15**

ప్ర : కదాచిత్ = ఒకప్పుడు, దైవయోగేన = అదృష్టవశాత్తు, పురత్రయాత్ = స్థూలసూక్ష్మకారణ శరీరములు మూడిటికంటె, వ్యతిరిక్తమ్ = వేరయిన, అఖణ్డమ్ = ఏకరూపమైన, తమసః పరమ్

= తమోగుణమున కంటె వేరైన, సత్+చిత్+ఆనన్దమ్ = ఉనికి, జ్ఞానము, ఆనందము ఒక్కటే రూపమైన, ఆత్మానమ్ = ఆత్మను

**శ్లో|| అహఙ్కారాదిదేహాన్తసాక్షిణం సంస్మరత్యయమ్ ।**
**పరిత్యక్తాఖిలానర్థో భూమా స్వస్థో భవేత్తతః ॥ 16**

ప్ర : అహంకారాది = అహంకారము మొదలు, దేహాన్త = దేహము వరకు గల, అన్నిటికి, సాక్షిణమ్ = సాక్షిని, అయమ్ = ఈ ప్రలయకాలస్థితి, సంస్మరతి = వాసనల రూపమున గుర్తించుచున్నది, పరిత్యక్త = విసర్జించిన, అఖిల+అనర్థః = కర్తృత్వాది అనర్థములను గలవాడనై, భూమా = అఖండరూపుడనై, తతః = ఆ కారణముగా, స్వస్థః = నాలో నేను రమించువాడనై, భవేత్ = అగును.

**తా :** దైవవశాన స్థూలసూక్ష్మకారణశరీరముల కతీతమైన, తమోగుణములేని, సచ్చిదానంద రూపమైన ఆత్మను, దేహేంద్రియమన-అహంకారాదులకు సాక్షియైన దానిని కర్తృత్వాదులులేని అఖండరూపుని ప్రలయస్థితిలో సంస్మరించును. *

**శ్లో|| ఏవం మాయావశాదేతౌ బన్ధమోక్షావతాత్త్వికౌ ।**
**బన్ధోఽపి కల్పితో బద్ధదశాయాం భాతి సత్యవత్ ॥ 17**

ప్ర : ఏవమ్ = ఈ విధముగా, బంధః అపి = బంధము కూడ, కల్పితః = కల్పింపబడినది, ఏతౌ = ఈ రెండు, అతాత్త్వికౌ = తత్త్వసత్యముగాని, బంధమోక్షౌ = బంధము, మోక్షము అనునవి, మాయావశాత్ = మాయకు లోబడి, బద్ధదశాయామ్ = జీవుడు సంసారబద్ధుడై యున్న కాలమున, సత్యవత్ = సత్యమువలె, భాతి = ప్రకాశించుచున్నది.

**తా :** ఈ రీతిగా బంధము కల్పితమే, బద్ధుడై జీవుడున్న దశలో సంసారబంధము, దానినుండి మోక్షము, రెండును సత్యమువలెనే కన్పించును. కాని ఆ రెండును శాశ్వతసత్యములు కావు.

**శ్లో|| విజ్ఞానేనైవ తన్నాశశ్చిత్తస్థైర్యాచ్చ తద్భవేత్ ।**
**తదప్యుపాసనాయోగాత్సోఽపి సత్కర్మభిర్భవేత్ ॥ 18**

ప్ర : తత్ = ఈ బంధము యొక్క, నాశః = నాశము, విజ్ఞానేన+ఏవ = విజ్ఞానము చేతనే, తత్ = ఆ విజ్ఞానము, చిత్తస్థైర్యాత్ = దృఢమైన మనోనిశ్చయము వలన, భవేత్ = అగును, తత్ అపి చ = అది కూడ, ఉపాసనాయోగాత్ = దేవతోపాసన అను యోగసాధనవలన, సః అపి = అదియును, సత్కర్మభిః = సత్కర్మలచేత, భవేత్ = అగును.

**తా :** బంధము నశించుట విజ్ఞానమువలన సాధ్యము. విజ్ఞానము దృఢనిశ్చయ సాధ్యము. అది ఉపాసనవలన సాధ్యము. ఉపాసన సత్కర్మలచే సాధ్యము. *

**శ్లో॥ కర్మావశ్యకమత్రైవ గ్రాహ్యం కామ్యాది నైవ చ ।**
**పునః పాతశ్రుతేశ్చిత్తశుద్ధ్యభావాచ్చ నేతరత్ ॥ 19**

**ప్ర :** అత్ర+ఏవ = బంధనాశము విషయమునను, కర్మ+ఆవశ్యకమ్ = కర్మయొక్క అవసరము, గ్రాహ్యమ్ = గ్రహింపదగినది, కామ్య+ఆది = కోర్కెలసిద్ధికై కామ్యకర్మలు మొదలైనవి, న ఏవ చ = కానే కాదు; పునః పాత = పునర్జన్మము గూర్చిన, శ్రుతేః = వేదోక్తివలన, చిత్తశుద్ధి+అభావాత్ చ = చిత్తశుద్ధిలేమివలన గూడ, న ఇతరత్ = మరియొకటి కాదు.

**తా :** బంధనాశమునకు సత్కర్మ చెప్పబడినందున కర్మ ఆవశ్యకత తెలియును. కాని కామ్యకర్మలు బంధహేతువులే. పునర్జన్మఫలము చెప్పబడినది కాగా చిత్తశుద్ధికి కామ్యకర్మలు ఉపకరించవు. కావున సత్కర్మలనగా కామ్యకర్మలు కానివి. *

**శ్లో॥ హోమావుభౌ పార్వణేష్టీ పఞ్చయజ్ఞా యథావిధి ।**
**చాతుర్మాస్యం చాగ్రయణం దైవం పిత్ర్యం చ కర్మయత్ ॥ 20**

**ప్ర :** ఉభౌ హోమౌ = ప్రాతఃకాలమున సాయంకాలమున చేయదగునని చెప్పబడిన హోమములు రెండు, పార్వణ+ఇష్టీ = పర్వదినములలో చేయదగిన పితృయాగము, పంచయజ్ఞాః = శ్రుతి, స్మృతి, సంప్రదాయోక్తములైన అగ్నిహోత్ర, దర్శపూర్ణమాస, చాతుర్మాస్య, పశు, సోమములనబడు శ్రుత్యుక్తములు, దేవపితృబ్రహ్మభూతమనుష్యయజ్ఞము లయిదు స్మృత్యుక్తములు, అభిగమన, ఉపాదాన, ఇజ్య, స్వాధ్యాయ యోగములు అనబడు పంచరాత్రాగమప్రకారసాంప్రదాయిక యజ్ఞములు, చాతుర్మాస్యం చ = చాతుర్మాస్యవ్రతమున్ను, అగ్రయణమ్ = అన్నగారికి సంబంధించి నది, దైవమ్ = దేవతలకు సంబంధించినది, పిత్ర్యమ్ = పితృదేవతలకు సంబంధించినది, యత్ కర్మ చ = ఏ కర్మయో

**శ్లో॥ పోష్యాణాం పోషణం జాతేష్ట్యాది నైమిత్తికం తథా ।**
**స్నానసన్ధ్యావన్దనాద్య ఆచరేత్ గృహవాన్ ద్విజః ॥ 21**

**ప్ర :** పోష్యాణామ్ = పోషింపదగినవారికి, పోషణమ్ = పోషణరూపమైన, జాత+ఇష్టి+ఆది = పుట్టిన బిడ్డకు విధిగా చేయదగిన జాతకర్మ మొదలగు, నైమిత్తికమ్ = యేదేని యొక నిమిత్తముగా చేయు కర్మను, తథా = అట్లే, స్నానసంధ్యావందన+ఆధ్యః = స్నానసంధ్యావందనములచే ప్రముఖుడైన, గృహవాన్ ద్విజః = గృహస్థబ్రాహ్మణుడు, ఆచరేత్ = ఆచరించును.

**తా :** ఉభయహోమములు, పర్వదినములలో చేయదగిన పితృయాగము, పంచయజ్ఞములు, చాతుర్మాస్యాది వ్రతములు అగ్రజసంబంధి, దైవసంబంధి, పితృసంబంధి కర్మలను, జాతకర్మాది నిమిత్తకర్మలను, స్నానసంధ్యావందనాది నిత్యకర్మలను శాస్త్రోక్తప్రకారమున గృహస్థబ్రాహ్మణుడు చేయవలెను.

**శ్లో॥ స్వవ్రతాచరణాగన్తుసాధనం చ వనీ పునః ।**
**వర్ణీ తు గుర్వగ్నిసేవావేదాభ్యాసాదికం స్వకమ్ ॥ 22**

ప్ర : పునః చ = మరియు, వనీ = వానప్రస్థాశ్రమము నందున్నవాడు, స్వ = తనదైన, వ్రత+ఆచరణ+ఆగన్తుసాధనమ్ = వ్రతమునాచరించుట అతిథి, అభ్యాగతసేవయు సాధనములుగా గలవాడు; వర్ణీ తు = బ్రహ్మచారియైతే, గురు+అగ్నిసేవా = గురువుల సేవ చేయుట, అగ్ని నారాధించుట, వేద+అభ్యాస+ఆదికమ్ = వేదమును సాధన చేయుట మొదలుగా గల, స్వకమ్ = తనకు యోగ్యాచారకర్మలు.

**తా :** మరియు వానప్రస్థుడైనవాడు తన వ్రతమును విడువక నియమపాలన చేయుచు వానినే సాధనములుగ చేసికొనవలె. బ్రహ్మచారి గురుశుశ్రూష చేయుచు, అగ్నిహోత్రము నారాధించుచు వేదము నభ్యసించుచు అనుబంధకర్మలు తనవిగా భావించి నిర్వర్తించవలె. *

**శ్లో॥ శౌచం భిక్షాం జపం దణ్డీ నిత్యమేకాన్తసేవనమ్ ।**
**పాతివ్రత్యం చిరణ్టీ తు భర్తృచిత్తానుసారిణీ ॥ 23**

ప్ర : దణ్డీ = భిక్షువు లేక యతి, శౌచమ్ = అంతర్బహిఃశుచిని పాటించుట, భిక్షామ్ = భిక్షాటన చేయుట, జపమ్ = జపము చేయుట, నిత్యమ్ = ఎల్లవేళల, ఏకాన్తసేవనమ్ = ఏకాంతముగా నుండుట; చిరణ్టీ తు = ముత్తయిదువ యైతే, భర్తచిత్త+అనుసారిణీ = భర్త మనసు తెలిసి ప్రవర్తించునది, పాతివ్రత్యమ్ = పతిసేవ వ్రతముగా గలది.

**తా :** ఒక యతి దైహికమానసికశుచిని పాటిస్తూ, భిక్షాటనచేసి జీవిస్తూ, జపము చేయుచూ ఏకాంతాన్ని కోరుకుని జీవించవలె. ఒక ముత్తయిదువ తన భర్తమనసు తెలిసి మసులుకుంటూ పతిసేవ వ్రతముగా జీవించవలె. *

**శ్లో॥ విధవా పాలయేచ్ఛీలం బ్రహ్మచర్యం వ్యవస్థితా ।**
**సర్వాశ్రమాధికారస్య బ్రాహ్మణస్య శమాదికమ్ ॥ 24**

ప్ర : వ్యవస్థితా = కృతనిశ్చయముతో, విధవా = భర్తను కోల్పోయిన స్త్రీ, బ్రహ్మచర్యమ్ = బ్రహ్మచర్యమును, శీలమ్ = తన శీలమును, పాలయేత్ = కాపాడుకొనవలెను; సర్వ+ఆశ్రమ+ అధికారస్య = అన్ని ఆశ్రమము లందున్న, బ్రాహ్మణస్య = బ్రాహ్మణునకు, శమ+ఆదికమ్ = శమము, దమము ఇత్యాది వానిని (సాధించవలెను).

**తా :** విధవ దృఢనిశ్చయముతో బ్రహ్మచర్యమును పాటించుచూ శీలమును కాపాడుకొన వలయును. బ్రాహ్మణుడు, ఏ ఆశ్రమంలో ఉన్నవాడైనను, శమదమతితీక్షాదులను సాధించవలెను. *

**శ్లో॥ త్ర్యాశ్రమాధికృతస్యోక్తం శౌర్యాది క్షత్రియస్య చ ।**
**కృష్యాది ద్వ్యాశ్రమవిశః కర్మాన్యస్య తు సేవనమ్ ॥ 25**

**ప్ర :** త్రి+ఆశ్రమ+అధికృతస్య = మూడు ఆశ్రమములను (బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థములను) ఆశ్రయించిన వానికి, ఉక్తమ్ = చెప్పబడినది; క్షత్రియస్య చ = క్షత్రియునకేమో, శౌర్య+ఆది = శౌర్యము మొదలగునవి; ద్వ్యాశ్రమ = రెండు ఆశ్రమముల, విశః = వైశ్యునకు, కృషి+ఆది = వ్యవసాయము మొదలైన, కర్మ = కర్మ; అన్యస్య తు = శూద్రునకు, సేవనమ్ = సేవకవృత్తి.

**తా :** బ్రాహ్మణులకు మూడు ఆశ్రమములందును (సంన్యాసము తప్ప) పై శ్లోకమున చెప్పబడిన విధులను నిర్వహించుట చెప్పబడినది. క్షత్రియులకు శౌర్యాది ప్రవర్తన కర్తవ్యము. వైశ్యునకు వ్యవసాయము, వ్యాపారము ఇత్యాదులు కర్తవ్యములు. శూద్రులకు సేవకధర్మము శాస్త్రోక్తము. *

**శ్లో॥ కార్యం వర్ణైః స్వకర్మైవం స్వవర్ణాశ్రమచోదితమ్ ।**
**కేవలం సత్త్వశుద్ధ్యర్థమీశప్రీత్యై మహావ్రతైః ॥ 26**

**ప్ర :** కార్యమ్ = ఏదైన ఒక పని, వర్ణైః = నాలుగు వర్ణముల వారిచేతను, స్వకర్మ = తన జీవకర్మ, ఏవమ్ = అదే విధముగ, స్వవర్ణ+ఆశ్రమ = తన వర్ణము బ్రహ్మచర్యాది ఆశ్రమము అను వీనిచే, చోదితమ్ = నడుపబడునది; మహావ్రతైః = కర్మను ఒక మహాప్రయోజనము కొరకు దీక్షగా చేయువారిచే, కేవలం సత్త్వశుద్ధ్యర్థమ్ = సత్త్వగుణము మలినము లేనిదిగా చేసికొనుటకై మాత్రమే, ఈశప్రీత్యై = ఈశ్వరప్రీతిగాను చేయబడుచున్నది.

**తా :** మానవుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణముల నాల్గింట ఒక దానికి చెందినవాడై యుండును కావున వాని పనులు (కర్మ) వాని వర్ణము, బ్రహ్మచర్యాది నాలుగాశ్రమములో వాడున్న ఆశ్రమము, వీనికి సంబంధించి సమాజమున యే కట్టుబాట్లు, నియమములున్నవో అవియే మార్గదర్శకములై వానిని నడిపించును, వానిచే ఆ యా కర్మలు చేయించును. *

**శ్లో॥ యస్యాగ్నిహోత్రాదిలుప్తం విధిహీనమథాపి వా ।**
**ఆసప్తమాంస్తస్య లోకాన్ హినస్తీతీరితే యతః ॥ 27**

**ప్ర :** యస్య = ఎవనికి, అగ్నిహోత్ర+ఆది = నిత్యాగ్నిహోత్రము మొదలైనవి, లుప్తం = లోపించినదో, వా = లేక, అథ+అపి = ఉన్నను, విధిహీనమ్ = వేదవిహితముగ చేయబడనిదో, తస్య = వానికి, ఆసప్తమాన్ లోకాన్ = ఏడు లోకములను, హినస్తి = క్షీణింపజేయుచున్నాడు, ఇతి ఈరితే యతః = అని చెప్పబడినందువలన.

**తా :** అగ్నిహోత్రాది కార్యములు చేయనివాడు, లేక, చేసినను శాస్త్రోక్తప్రకారముగకాక లాంఛనముగ చేసిన వాడు, వీరికి ఏడు లోకములలోనూ గతులుండవని చెప్పబడినది కావున (పై శ్లోకమున చెప్పబడినట్లు) ప్రతియొక్కడు కార్యకర్తయగుచున్నాడు. *

**శ్లో॥ కర్మవైగుణ్యాదిదోషే లోపాదౌ విధివచ్చ తత్ ।**
**ప్రాయశ్చిత్తం చరేద్విద్వాన్యథావన్నాన్యథా శుచిః ॥ 28**

ప్ర : కర్మవైగుణ్యాదిదోషే = చేయు కర్మగుణములేనిదై సర్వాంగసమగ్రతలేని దోషము గలది, చ = మరియు, లోప+ఆదౌ = కర్మచేయుటే లేనిదై, ఇట్టి సందర్భములలో, తత్ = ఆ కర్మ, విధివత్ = దైవికముగ, ప్రాయః+చిత్తమ్ = నివారణోపాయములను, యథావత్ = శాస్త్రోక్తముగ, విద్వాన్ = పండితుడు, చరేత్ = చేయును, అన్యథా = ప్రాయశ్చిత్తము చేసికొననిచో, న శుచిః = శుద్ధుడు కాదు.

**తా :** చేయు కర్మలో దోషములుండవచ్చును. దైవికముగ అసలు కర్మయే చేయకపోవచ్చును. అట్టితరి పండితుడు శాస్త్రవిధిననుసరించి ప్రాయశ్చిత్తము చేసికొనును.కాకున్న పరిశుద్ధుడు కాదు. *

**శ్లో॥ ప్రాయో వినష్టిః సన్ధానం చిత్తిర్విధ్యపరాధకే ।**
**ప్రోక్తా వినష్టిసన్ధానం ప్రాయశ్చిత్తిరితీహ హి ॥ 29**

ప్ర : విధి+అపరాధకే = అనుసరించవలసిన విధానమున దోషములు కలిగినపుడు, ప్రాయశ్చిత్తిః = ప్రాయశ్చిత్తము, ఇతి = అనగా, ప్రాయః = ప్రాయః అను శబ్దము, వినష్టిః = నాశము అను అర్థము గలది, కాగా ప్రాయశ్చిత్తము అనుట కర్థము విధినిర్వహణలో భంగమైన అంశమును ఆ విధితో కలుపుట అని అర్థము, ఇహ = లోకవ్యవహారమున, ప్రోక్తా హి = చెప్పబడినది కదా.

**తా :** శాస్త్రోక్తవిధినిర్వహణములో భంగమేర్పబడినపుడు ప్రాయశ్చిత్తము చెప్పబడినది. ప్రాయః అనగా నశింపు, చిత్తి అనగా కలుపుట. ఇట్లు ప్రాయశ్చిత్తమనగా భంగమైనదానిని మరల ఆ విధిక్రమముతో కలుపుటకొరకు చేయునది. *

**శ్లో॥ కర్మప్లవో దృఢో యస్తన్మన్యతే శ్రేయ ఉత్తమః ।**
**పర్యేతి స పునర్మృత్యుమిత్యుక్తిం సంస్మరేద్బుధః ॥ 30**

ప్ర : యత్ కర్మప్లవః దృఢః = యే కర్మప్లవము దృఢమైనదో, తత్ = అది, ఉత్తమః శ్రేయః = ఉత్తమమైన శ్రేయస్సుగా, మన్యతే = తలంచబడుచున్నది; సః బుధః = ఆ వివేకవంతుడు, పునః = మరల, మృత్యుమ్ = మృత్యువును, పరి+ఏతి (పర్యేతి) = తిరిగి చేరును, ఇతి = అని, ఉక్తిమ్ = చెప్పబడినదానిని, సంస్మరేత్ = స్మరింపదగును.

**తా :** కుండ పగిలిపోగా, లోని పెరుగు బైటకు పొర్లినట్లు కర్మ ఫలము ఎవనికి దృఢముగా పొర్లిపోవునో వాని కర్మ ఉత్తమకర్మ, శ్రేయః కర్మ అనబడును. వివేకవంతుడు కర్మఫలము పొర్లిపోకుండ మిగిలినచో మరల మృత్యుమార్గమున ప్రయాణించుచునన్న శాస్త్రోక్తిని స్మరించికొనును.

**శ్లో॥ అగ్నిహోత్రాది హృచ్ఛుద్ధిద్వారా ముక్త్యై ప్రచోదితమ్ ।**
**శమాదీన్ సాధయే ద్విద్వాంస్తదనుష్ఠానపూర్వకమ్ ॥ 31**

ప్ర : అగ్నిహోత్రాది = అగ్నిహోత్రాదులచే, హృత్+శుద్ధిద్వారా = హృదయమును శుద్ధి చేసికొనుట వలన, ముక్త్యై = ముక్తి కొరకు, ప్రచోదితమ్ = (కర్మ) నడిపించబడును; విద్వాన్ = పండితుడు,

తత్ = ఆ కారణమున, అనుష్ఠానపూర్వకమ్ = అనుష్ఠానముతో కూడ, అనగా ఆచరణతో కూడ, శమ+ఆదీన్ = శమము, దమము, తితిక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము అనబడు షడ్గుణ సంపత్తిని, సాధయేత్ = సాధించవలెను.

**తా :** హృదయశుద్ధికొరకు, నిత్యాగ్నిహోత్రవిధులు, తద్ద్వారా మోక్షము; అట్లే శమాది షడ్గుణ సంపత్తిసాధన, ఆచరణపూర్వకముగా విద్వాంసునికి విధి నిర్దేశించినది. *

**శ్లో॥ సాధనావధి తత్కార్యముపాత్తపరసాధనః ।**
**తతః సంన్యస్య శమవాన్ భవేన్నైష్కర్మ్యసిద్ధిభాక్ ॥ 32**

**ప్ర :** సాధనావధి = సాధన చేయునంత కాలము, ఉపాత్త = పొందిన, పరసాధనః = ఆంతరంగిక సాధనలు గలవాడై, తత్ = ఆ విధి, కార్యమ్ = చేయదగినది; శమవాన్ = శమాదులను సాధించినవాడు, తతః = అటు తరువాత, సంన్యస్య = సంన్యసించి, నైష్కర్మసిద్ధిభాక్ = కర్మరాహిత్యమునకు యోగ్యుడుగా, భవేత్ = అగును.

**తా :** శమాది షట్సంపత్తిని సాధించువరకును ఆంతరంగికసాధనలు చేయుచు, శమాదులను సాధించిన పిదప సంన్యసించి (పండితుడు) కర్మరాహిత్యమునకు సంసిద్ధత గలవాడగును.

**శ్లో॥ ఉపాత్తసాధనో భక్త్యా సమాసాదితశుద్ధధీః ।**
**దేవో భూత్వా యజేద్దేవం మాం ప్రత్యగ్జ్యోతిరాస్థితమ్ ॥ 33**

**ప్ర :** భక్త్యా = భక్తితో, ఉపాత్త = సంపాదింపబడిన, సాధనః = సాధన సంపత్తిగలవాడై, సమాసాదిత = చక్కగా పొందిన, శుద్ధధీః = నిర్మలబుద్ధియై, దేవః భూత్వా = దైవీసంపత్తిగలవాడై, దేవం మాం ప్రత్యగ్జ్యోతిరాస్థితమ్ = దత్తాత్రేయుడను వ్యక్తి నామరూపాదులచే గోచరించు దైవ స్వరూపుడనైన నన్ను, యజేత్ = ధ్యానించును.

**తా :** భక్తితో సాధనద్వారా పొందిన నిర్మలబుద్ధియై దైవీసంపద గలిగి **దత్తాత్రేయ** నామరూపములతో ప్రకటమగుచున్న జ్యోతిఃస్వరూపుడనైన నన్ను ధ్యానించును.

**శ్లో॥ సకామాయ గణేశాద్యాః పృథగ్దృష్ట్యా చ భావితాః ।**
**దదాత్యశాశ్వతాన్ కామాన్ సంసరన్తః క్షుధాదినా ॥ 34**

**ప్ర :** సకామాయ = కోరికలు దీరుటకై దేవునాశ్రయించువారికొరకు, పృథక్+దృష్ట్యా = ద్వయభావముతో, గణేశ+ఆద్యాః చ = గణపతి మొదలగు వారున్ను, భావితాః = భావములో రూపమీయబడిరి; క్షుధాదినా = ఆకలి మొదలగు ధర్మములతో, సంసరన్తః = ప్రవర్తించువారగుచు, అశాశ్వతాన్ కామాన్ = శాశ్వతసుఖమును ఇవ్వలేని కోరికలను, దదాతి = తీర్చుచుందురు.

**తా :** లోకములో అత్యధికసంఖ్యాకులు తాత్కాలికసుఖములను పొందగోరువారు. వారి కోరికలు

తీర్చుటకై ప్రత్యేకనామరూపములతో గణేశునివంటి దేవతామూర్తులు భావింపబడినారు. వారిని పూజించుటవలన లౌకికమైన కోరికలు తీరునేగాని శాశ్వతానందము లభించదు. ఆ దేవతా-మూర్తులకును మనవలెనే ఆకలిదప్పులు, భార్యాబిడ్డలు భావింపబడిరి. *

**శ్లో॥ అర్చకస్య తపోయోగాదర్చనస్యాతిశాయనాత్ ।**
**ఆభిరూప్యాచ్చ బిమ్బానాం సాన్నిధ్యం కల్పయన్తి తే ॥ 35**

**ప్ర :** అర్చకస్య = పూజించువానియొక్క, తపోయోగాత్ = తపోనిష్ఠవలన, అర్చనస్య = పూజయొక్క, అతిశాయనాత్ = ఆధిక్యమువలన, చ = మరియు, బింబానామ్ = దేవతామూర్తులయొక్క, ఆభిరూప్యాత్ = సౌందర్యమువలన, తే = ఆ దేవతాప్రతిమలు, సాన్నిధ్యమ్ = సన్నిధిని, కల్పయన్తి = చేయుచున్నారు.

**తా :** అర్చకుని నిష్ఠ, అర్చన ఆధిక్యము, దేవతాప్రతిమ సౌందర్యము, ఈ మూడు అంశముల ప్రభావమున ఆ ప్రతిమలో ఆ దేవతాశక్తి నిలిచి ఫలమిచ్చును.

**శ్లో॥ మచ్చిదంశయుతాస్తే తు ఫలదా స్వాధికారతః ।**
**త ఆయాన్తి పరిచ్ఛిన్నా గచ్ఛన్తి చ తతః పునః ॥ 36**

**ప్ర :** తే తు = ఆ దేవతామూర్తులేమో, మత్ = నా యొక్క, చిత్+అంశయుతాః = చైతన్య జ్ఞానాంశగలవారై, స్వ+అధికారతః = తన అధికారమునకు తగిన, ఫలదాః = ఫలమునిచ్చువారై, త (తే) = వారు, పరిచ్ఛిన్నాః = విడిబడినవారై, ఆయాన్తి = వచ్చుచున్నారు, చ = మరియు, తతః = అటనుండి, పునః = మరల, గచ్ఛన్తి = పోవుచున్నారు.

**తా :** ఆ దేవతామూర్తులు నా చిదంశలు. తమ తమ పరిమితాధికారమునకు లోబడి వారు భక్తులకు వారి వారి పూజాఫలములను ప్రసాదింతురు. మరియు, నా నుండి నా అంశలుగా భిన్న భిన్న రూపనామగుణములతో వేరుగా వెలువడి భక్తుల ఆహ్వానము మేరకు వచ్చి, మరల వారి విసర్జన లేక ఉద్వాసన మేరకు తరలిపోవుచున్నారు.

**శ్లో॥ గతిస్థిత్యాసనస్వప్న వర్జితోఽహం న తాదృశః ।**
**ఆత్మాఽజః సర్వసంసారధర్మకర్మవివర్జితః ॥ 37**

**ప్ర :** అహమ్ = నేను, సర్వసంసారధర్మకర్మవివర్జితః = అన్ని జగద్ధర్మకర్మలను విడచినవాడనై, గతిస్థితి+ఆసన-స్వప్న-వర్జితః = చలనము, నిలుకడ, కూర్చొనుట, కలగనుట ఇత్యాది యేమియు లేనివాడను, ఆత్మా = ఆత్మను, అజః = పుట్టనివాడను, న తాదృశః = ఆ దేవతామూర్తులను పోలినవాడను కాను.

**తా :** నేను దేవతామూర్తులకంటె భిన్నమైన వాడను. నాకు పుట్టుకలేదు. కేవలాత్మను. ప్రాకృతికమైన

ధర్మములు నాకు లేవు, కర్మాచరణవిధినిషేధములు లేవు, నేను చలనముగాని, నిలుకడగాని, కూర్చొనుట, లేచుట, కలగనుట అను ఇట్టి క్రియలుగాని లేనివాడను. *

**శ్లో॥ ప్రపఞ్చోపశమః శాన్తః శివోఽద్వైతోఽజరోఽమరః ।**
**సర్వం సంన్యస్య నిఃసంగైరుపాస్యోఽహం మహార్థదః ॥ 38**

ప్ర : అహమ్ = నేను, ప్రపంచ+ఉపశమః = భౌతికవికారములు తొలగినవాడను, శాన్తః = వికారములు లేని, అద్వైతః = ఒక్కడనైన, శివః = సుఖస్వరూపుడను, అజరః = వృద్ధిలేనివాడను, అమరః = క్షయములేనివాడను; సర్వం సంన్యస్య = అన్నిటిని విడిచి, నిఃసంగైః = అహంకారాదులతో పొత్తులేనివారిచే, ఉపాస్యః = ఉపాసింపదగుదును, మహార్థదః = మోక్షదాతను.

**తా :** నాకు పాంచభౌతికవికారములు లేవు. వృద్ధిక్షయములు లేవు. నీవు నేను అను ద్వయబుద్ధి లేదు. సుఖస్వరూపుడను. అన్నిటిని విడచి, అహంకారాదుల పొత్తులేని సంన్యాసులకు ఉపాసింపదగినవాడను. మోక్షమిచ్చువాడను.

**శ్లో॥ విముఖాయ క్రియా ప్రోక్తాఽచరాయేశ్వరపూజనమ్ ।**
**ముముక్షవే కేవలం మదుపాస్తిస్తూత్తమోత్తమా ॥ 39**

ప్ర : విముఖాయ = పరాకుగా నుండువానికొరకు, క్రియా = శరీరముతో చేయు పనులు, అచరాయ = స్థిరమైన చిత్తముగల వానికొరకు, ఈశ్వరపూజనమ్ = ఈశ్వరపూజ, ప్రోక్తా = చెప్పబడినది; ముముక్షవే =మోక్షమును కోరువానికై, ఉత్తమ+ఉత్తమా తు = అన్నిటికంటె యోగ్యమైనది, కేవలం మత్+ఉపాస్తిః = నన్ను ఉపాసించుట మాత్రమే.

**తా :** పరాకుగా నుండు వానికి పరిచర్యలుగా దైహిక సేవ మేలు చేయును. స్థిరచిత్తునకు పూజావిధానము ననుసరించుట మేలు. మోక్షకామి మాత్రము నన్ను ఉపాసించుటే ఉత్తమమార్గముగా శాస్త్రోక్తి. *

**శ్లో॥ అనుష్ఠానప్రకారోఽస్యాః శ్రవణాదివిధానతః ।**
**బాహ్యోపచారైరన్యస్యాః క్రియాయాః కారకాదిభిః ॥ 40**

ప్ర : అస్యాః = వానికి, శ్రవణాదివిధానతః = శ్రవణ మనన పఠన ఇత్యాది విధానముల ననుసరించి, అనుష్ఠానప్రకారః = ఉపాసనాపద్ధతి; అన్యస్యాః = ఇతరులకు, బాహ్యోపచారైః = ఆవాహన–స్నాన–నివేదనాది ఉపచారములచేత, కారకాదిభిః = మంత్రతంత్రాదులచేత, క్రియాయాః = దైహికకర్మలచేత,

**శ్లో॥ కిఞ్చిత్పక్వకషాయాణాం హఠయోగాదియోజనా ।**
**తదభావేఽపి పరయా మద్భక్త్యా సద్గతిర్నృణామ్ ॥ 41**

ప్ర : కించిత్ పక్వకషాయాణామ్ = రాగద్వేషాదులు కొంతగా పండినవారికి, హఠయోగాది

యోజనా = ఇడా పింగళా లేక సూర్య (హ) చంద్ర(ఠ) నాడుల వెంట ప్రాణప్రసారమును నిరోధించుట అనబడు హఠయోగాది యోగములను సూచించుట, తత్+అభావే అపి = అవి లేకున్నను, మద్భక్త్యా పరయా = నా యందలి పరమభక్తిచే, నృణామ్ = నరులకు, సద్గతిః = ఆత్మజ్ఞానము దిశగా ప్రయాణము సాగును.

**తా :** నన్నుపాసించువారికి శ్రవణమననాది విధానముల ద్వారా ఉపాసన చేయుట, ఇతరులకు మంత్రతంత్రాదులు ఆహ్వానవిసర్జనాది ఉపచారములు ద్వారా సేవించుట, రాగద్వేషాది వికారనిరోధములో కొంత ప్రగతి గలవారికి హఠయోగాదుల సాధన, ఇవి కూడ లేనప్పుడు నా యందలి అకుంఠితభక్తిద్వారా నరులకు సద్గతి కల్గునని చెప్పబడినది.

**శ్లో॥ ఏవం కర్మాణి చోపాస్తిః సంక్షేపేణ ప్రదర్శితా ।**
**నిర్గుణోపాస్తితః సర్వాన్ కామానాప్త్వాఽమృతో భవేత్ ॥ 42**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగా, కర్మాణి = కర్మములు, చ+ఉపాస్తిః = ఉపాసన కూడ, సంక్షేపేణ = సంగ్రహముగా, ప్రదర్శితా = వివరింపబడినది; నిర్గుణ+ఉపాస్తితః = నిర్గుణపరబ్రహ్మోపాసన ద్వారా, సర్వాన్ కామాన్ = అన్ని కోరికలను, ఆప్త్వా = పొంది, అమృతః భవేత్ = అమృతమయు డగును.

**తా :** ఈ రీతి కర్మ, ఉపాసనవిషయములను సంగ్రహరూపమున వివరించినాను. నిర్గుణ-బ్రహ్మోపాసన చేయువారు కోరికలను తరించి అమృతమయులగుచున్నారు.

**శ్లో॥ మయ్యాసక్తమనా నిత్యయుక్తో మాం య ఉపాస్త ఇత్ ।**
**శ్రద్ధావాన్ సోఽపి మామేతి పునరావర్తతే న సః ॥ 43**

**ప్ర :** మయి = నా యందు, ఆసక్తమనాః = ఆసక్తమైన మనస్సు గలిగిన, నిత్యయుక్తః = నాకై చేయు కర్మలతో నిత్యము నాతో కూడియుండువాడు, మామ్ = నన్ను, ఉపాస్త ఇత్ = ఉపాసించు వాని వలె, శ్రద్ధావాన్ = శ్రద్ధాళువై, సః అపి = ఆతడును, మాం ఏతి = నన్ను చేరుచున్నాడు, సః = ఆతడు, న పునః ఆవర్తతే = మరల జన్మించబోడు.

**తా :** నా యందు ఆసక్తితో నన్నారాధించుచు, కర్మలాచరించుచు, నిత్యము దేహమానసములతో నాతోనే ఉండువాడు, నన్ను శాస్త్రోక్తముగా ఉపాసించు వానివలెనే నన్ను చేరుచున్నాడు. వానికి పునర్జన్మ కలుగదు.

*

**శ్లో॥ స్థూలాక్షరాల్లిపిజ్ఞానం శిశోరివ పరాత్మనః ।**
**గురూక్తార్చాకల్పనయా హృత్‌స్థైర్యాద్బోధ ఉద్భవేత్ ॥ 44**

**ప్ర :** శిశోః = బాలునకు, స్థూల+అక్షరాత్ = పెద్ద అక్షరములవలన, లిపిజ్ఞానం ఇవ = అక్షర రూపము తెలియునట్లు, గురు+ఉక్త = గురువుచే చెప్పబడిన, అర్చా కల్పనయా = పూజా

విధానముచేత, హృత్ = హృదయముయొక్క, స్థైర్యాత్ = నిశ్చలత్వమువలన, బోధః = జ్ఞానము, ఉద్భవేత్ = కలుగును.

**తా :** బాలునకు మొదట పెద్ద అక్షరములు దిద్దబెట్టినందువలన అక్షరరూపము వాని మనసులో స్పష్టముగా ముద్ర పడును. అట్లే, గురువు చెప్పిన పూజావిధానమును అనుసరించుట ద్వారా హృదయమున దైవరూపభావన స్థిరమై జ్ఞానము కలుగును. *

**శ్లో॥ సతోఽమ్బ్వాద్యేఽపి బిమ్బస్య ప్రతీతిర్న మలాన్వితే ।**
**తథాత్మనో న మలినే ప్రతీతిః సా తు నిర్మలా ॥ 45**

**ప్ర :** సతః = స్వచ్ఛమైన, అంబు+ఆద్యే అపి = నీరు మొదలగు వానియందు, బింబస్య = ప్రతిబింబముయొక్క, ప్రతీతిః = స్పష్టత, మల+అన్వితే = మలినముతో కూడిన దానియందు, న = కాదు; తథా = అదే రీతి, ఆత్మనః = ఆత్మయొక్క, ప్రతీతిః = స్పష్టత, న మలినే = మలిన మంటిన మనసునందు లేదు; సా తు = ఆ సాక్షాత్కారము, నిర్మలా = మలినము లేనిది.

**తా :** నీరు మొదలగు వానియందు మలినము లేకున్న చూచువాని ముఖము సాక్షాత్కరించి ప్రతిబింబము స్పష్టముగ దర్శనీయమగును. కాని ఆ నీరు మలినముతో కూడియున్నచో, ముఖము ప్రతిబింబసాక్షాత్కారము నొందదు. బింబము నిర్మలమే అట్లే, ఆత్మసాక్షాత్కారము విషయము గూడ మలినమనస్కులకు కలుగదు. *

**శ్లో॥ అతో మద్భజనాత్కామక్రోధాద్యన్తర్మలక్షతిః ।**
**మత్ప్రసాదాత్తతశ్చాన్తస్తమోనాశస్తతోఽమృతమ్ ॥ 46**

**ప్ర :** అతః = ఆ కారణమున, మత్ = నా యొక్క, భజనాత్ = పూజ వలన, కామ క్రోధ+ఆది = కోరిక, కోపము మొదలగు, అన్తః+మల = మనసులోపలి మలినముయొక్క, క్షతిః = నాశము; మత్ ప్రసాదాత్ = నా అనుగ్రహమువలన, తతః చ = అక్కడి నుండియు, అన్తః+తమః = లోపలి తమోగుణము అనుచీకటి, నాశః = నశింపు, తతః = దానినుండి, అమృతమ్ = అమరత్వము, మోక్షము.

**తా :** అందువలన కోరిక దానినుండి కలుగు కోపము మొదలగు మనోమాలిన్యము నా సేవ వలన తొలుగును. నా అనుగ్రహము వలన తమోగుణము నశించి, శుద్ధసత్త్వస్థితి కలిగి మోక్షము లభించును. *

**శ్లో॥ ప్రతిష్ఠాం విన్దతే యోఽస్మిన్ సోఽభయో యోఽన్తరం మయి ।**
**కరోతి తస్య భీః పూర్వే దేవా అపి భయం యయుః ॥ 47**

**ప్ర :** యః = ఎవడు, అస్మిన్ = ఈ అమృతస్థితియందు, ప్రతిష్ఠాం విన్దతే = స్థిరత్వమును

పొందుచున్నాడో, సః = వాడు, అభయః = భయములేనివాడు; యః = ఎవడు, మయి = నా యందు, అన్తరం కరోతి = భేద బుద్ధిని కలిగి యుండునో, తస్య = వానికి, భీః = భయము, పూర్వే = పూర్వకాలమున, దేవాః అపి = దేవతలు కూడ, భయం యయుః = భయమును పొందిరి.

**తా :** ఆ అమృతస్థితి యందు స్థిరుడైన వానికి భయము లేదు. అట్లు కాక నాకును తదితర దేవతామూర్తులకును భేదమెంచువాడు భయమునకు లోనగును. పూర్వము దేవతలు సైతము ఇట్లే భేదమెంచి భయమందిరి. *

**శ్లో॥ తస్మాత్ త్యక్త్వాఖిలాన్ధర్మాన్మామేహి శరణం యతే ।**
**మత్ప్రసాదాద్విశుద్ధోఽతో మోక్ష్యసే శాన్తిమృచ్ఛసి ॥ 48**

**ప్ర :** తస్మాత్ = ఆ కారణమున, అఖిలాన్ ధర్మాన్ = అన్ని ధర్మములను, త్యక్త్వా = విడచి, మామ్ = నన్ను, శరణం ఏహి = శరణు పొందుము, యతే = ఓ యతీ!, మత్ ప్రసాదాత్ = నా అనుగ్రహమువలన, విశుద్ధః = పరిశుద్ధుడవై, అతః = అందువలన, శాన్తిమ్ = సర్వవికారములు శాంతిని, ఋచ్ఛసి = పొందుచున్నావు, మోక్ష్యసే = ముక్తుడవగుచున్నావు.

**తా :** అందువలన అన్ని ధర్మములను త్యజించి నన్ను శరణు పొందుము. ఓ యతీ! నా అనుగ్రహము వలన పరిశుద్ధుడవై నిర్వికారుడవై ముక్తుడవగుచున్నావు. *

**శ్లో॥ స్వస్త్యస్తు తే మదుక్తేస్త్వం సారమాధత్స్వ శోధితమ్ ।**
**మద్భక్తేష్వపి యోగోఽయం ప్రకాశ్యో యత్నతస్త్వయా ॥ 49**

**ప్ర :** తే = నీకు, స్వస్తి అస్తు = శుభమగు గాక!, త్వమ్ = నీవు, మదుక్తేః = నా మాటలయొక్క, శోధితం సారమ్ = శుద్ధమైన సారమును, ఆధత్స్వ = స్వీకరింపుము; త్వయా = నీ చేత, అయం యోగః = ఈ యోగము, యత్నతః = ప్రయత్నపూర్వకముగా, మద్భక్తేషు అపి = నా భక్తులలో గూడ, ప్రకాశ్యః = ప్రకాశింపజేయదగినది.

**తా :** నా మాటల శుద్ధ సారమును గ్రహించి నీ వీ యోగమును ప్రయత్నపూర్వకముగా నా భక్తులలో గూడ ప్రకాశింపజేయుము. నీకు శుభమగు గాక! *

**శ్లో॥ ఇత్యుక్త్వా భగవాన్ దత్తో లీలయా ద్రాక్ తిరోదధే ।**
**స యతిః కృతకృత్యోఽభూత్తదుక్త్యర్థవిలోచనాత్ ॥ 50**

**ప్ర :** ఇతి ఉక్త్వా = ఇట్లు పలికి, భగవాన్ దత్తః = దత్త భగవానుడు, ద్రాక్ = వెంటనే, లీలయా = అప్రయత్నముగ, తిరోదధే = కనరాక పోయెను; తత్ = వానియొక్క, ఉక్తి+అర్థ = మాటల అర్థమును, విలోచనాత్ = ప్రత్యక్షము జేసికొనుటవలన, సః యతిః = ఆ యతి, కృతకృత్యః అభూత్ = ధన్యుడాయెను.

**తా :** ఇట్లని తెలిపి భగవాన్ శ్రీదత్తుడు వెంటనే తటాలున అదృశ్యుడాయెను. ఆ యతి ఆ స్వామి మాటల అర్థమును తఱచి చూచి తెలిసికొని ధన్యుడాయెను. *

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ప్రథమాష్టకే పఞ్చమోఽధ్యాయః
ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

ప్రథమాష్టకము - షష్ఠాధ్యాయము

శ్లో॥ ఇన్ద్రోఽమదాయ గుర్వీశవేదాన్తభజనే స్థితః ।
స్వర్గేఽద్యాపీతరేషాం తు కథా కా దభ్రవేదినామ్ ॥ 1

**ప్రతిపదార్థం :** ఇన్ద్రః = ఇంద్రుడు, గురు+ఈశ వేదాన్త భజనే = గురువు, ఈశ్వరుడు, జ్ఞానమును సేవించుటయందు, అమదాయ = మదమును తొలగించుటకై, స్థితః = ఉన్నవాడు, ఇతరేషామ్ = ఇతరులకైతే, స్వర్గే = సర్గమున, కా కథా = ఏమి ప్రస్తావన?

**తాత్పర్యం :** గురువును, ఈశ్వరుని, వేదాన్తులను సేవించు వారిని ఇంద్రుడు సమర్థించును. కాని అట్టివారుకాని అల్పజ్ఞుల ప్రసంగము నేటికిని స్వర్గమున కలుగదు. *

శ్లో॥ ఆజీవితం త్రయః సేవ్యా వేదాన్తో గురురీశ్వరః ।
పూర్వం జ్ఞానాప్తయే పశ్చాత్ కృతఘ్నత్వనివృత్తయే ॥ 2

**ప్ర :** ఆజీవితమ్ = జీవించి యున్నంతవరకు, వేదాన్తః = వేదాంతము, అనగా జ్ఞానము, గురుః = గురువు, ఈశ్వరః = దైవము, అను, త్రయః = ముగ్గురు, సేవ్యాః = సేవింపదగినవారు; పూర్వమ్ = తొలుత, జ్ఞాన+ఆప్తయే = జ్ఞానమును పొందుటకై, పశ్చాత్ = తరువాత, కృతఘ్నత్వ-నివృత్తయే = కృతఘ్నత లేకుండుటకు

**తా :** వేదాంతవిజ్ఞానమును, గురువును, ఈశ్వరుని జీవించునంత కాలము సేవించవలెను: మొదట జ్ఞానసంపాదన కొరకును, ఆపై తనకు లభించిన జ్ఞానమునకు కారణభూతులైనందున వారు చేసిన మేలు మరువకుండుటకును. *

శ్లో॥ మహానుశాసనం చేత్థం మనస్యానీయ తత్త్రయమ్ ।
సిద్ధ్యేదనేనేతి మత్వా సన్మాహాత్మ్యం యతిర్జగౌ ॥ 3

**ప్ర :** ఇత్థమ్ = ఈ విధముగా, మహానుశాసనమ్ = మహాత్ముల ఆజ్ఞ, తత్ త్రయమ్ = ఆ

మూడిటిని, మనసి = మనస్సునందు, ఆనీయ = చేర్చి, అనేన = దీనిచే, సిద్ధ్యేత్=సిద్ధి లభించును, ఇతి మత్వా = అని తలచి, యతిః = యతి, సన్మాహాత్మ్యమ్ = **శ్రీ దత్తమాహాత్మ్యమును**, జగౌ = తెలిసికొనెను.

**తా :** ఈ మూడిటిని (వేదాన్త, గురు, ఈశ్వర), మనసునందుంచి, వానివలన సిద్ధి లభించునని తలచి, మహాశాసనముగా భావించి యతి శ్రీదత్తమహిమను తెలిసికొనును. *

**శ్లో॥ సృష్ట్వేదం మాయయాస్యాన్తర్బహిఃస్థోఽభవదత్రిజః ।**
**గూఢః సాక్షీ జ్ఞానగమ్యః సోఽవ్యాత్సచ్చిత్సుఖాత్మకః ॥ 4**

**ప్ర :** మాయయా = మాయచేత, ఇదమ్ = జగత్తును, సృష్ట్వా = సృష్టించి, అస్య = జగత్తుయొక్క, అన్తః = లోపల, బహిః = బయట, స్థః = ఉన్నవాడుగా, అత్రిజః = అత్రి మహాముని కుమారుడైన దత్తభగవానుడు, అభవత్ = ఆయెను; సః = ఆతడు, గూఢః = తెలియని రహస్యముగా, సాక్షీ = అన్నిటిని చూచువాడుగా, జ్ఞానగమ్యః = జ్ఞానమార్గమున తెలియదగిన వాడుగా, చిత్ సుఖ+ఆత్మకః = చైతన్యసుఖస్వరూపుడుగా, అవ్యాత్ = అయినాడు.

**తా :** అత్రిమహర్షికుమారుడైన శ్రీ దత్తుడు మాయచేత జగత్తును సృష్టించి, దాని లోపల బయట తానే ఉన్నవాడై గూఢముగా సాక్షిగా జ్ఞానమయుడుగా చైతన్యసుఖస్వరూపుడుగా సృష్టిలో ప్రత్యగ్రూపిగా మారెను. *

**శ్లో॥ లీలాత్మనా యోఽత్రిగృహేఽవతీర్ణో దత్తాఖ్య ఉన్మత్తపిశాచవద్యః ।**
**బాలో యువా క్వాపి జరన్ జటాభృత్ క్వచిదృషిర్వ్యక్తపరీక్షితశ్చ ॥ 5**

**ప్ర :** లీలాత్మనా = లీలామానుషవిగ్రహుడుగా, యః దత్తాఖ్యః = యే **దత్తాత్రేయ** నామధేయుడు, అత్రిగృహే = అత్రిమహర్షిగృహమున, అవతీర్ణః = అవతరించెనో, యః = ఎవడు, ఉన్మత్తః = పిచ్చివాడు, పిశాచవత్ = పిశాచము, బాలః = బాలుడు, యువా = యువకుడు, జరన్ = వృద్ధుడు, వీరివలె, క్వ+అపి = ఎప్పుడైన ఎక్కడైన, క్వచిత్ = ఒకానొక, జటాభృత్ = జడలు ధరించిన, ఋషిః = ఋషి, వ్యక్తపరీక్షితః = వ్యక్తి లక్షణములలో పరీక్షలో ఉత్తీర్ణుడైన వాడు,

**శ్లో॥ త్యాగీ సుభోగీ క్వచిదస్తి సంగీ యోగీ సువాసాః క్వచిదస్తి నగ్నః ।**
**తుష్టః కృశః పుష్ట ఇహ క్వచిద్యోదణ్డీ చ భిక్షుః క్వచిదస్తి వర్ణీ ॥ 6**

**ప్ర :** త్యాగీ = సర్వము త్యజించువా వాడు, సుభోగీ = భోగములు చక్కగా అనుభవించువాడు, సంగీ = అన్నిటితో సంబంధమున్నవాడు, క్వచిత్+అస్తి = ఒకడున్నాడు; యోగీ = ఆత్మానుభవము గలవాడు, సువాసాః = చక్కని వస్త్రధారణ గలవాడు, నగ్నః = దిగంబరుడు, క్వచిత్+అస్తి = ఒకడున్నాడు; తుష్టః = నిత్యతృప్తుడు, కృశః = బక్కచిక్కినవాడు, పుష్టః = బలిసిన వాడు, క్వచిత్ = ఒకడు, యః = ఎవడు, ఇహ = లోకమున, దణ్డీ = సంన్యాసి, భిక్షుః చ = యతియు, వర్ణీ = బ్రహ్మచారి, క్వచిత్+అస్తి = ఒకడు ఉన్నాడు.

**శ్లో॥ గృహీ వనీ వర్ణవిరుద్ధచేష్టః క్వచిచ్చ వర్ణాశ్రమధర్మయుక్తః ।**
**ఇత్యాదయో యస్య విచిత్రచేష్టా దేవర్షిహృద్వాగయనం వ్యతీతాః ॥ 7**

ప్ర : గృహీ = గృహస్థు, వనీ = వానప్రస్థుడు, వర్ణవిరుద్ధచేష్టః = వర్ణాశ్రమధర్మములకు వ్యతిరేకముగ ప్రవర్తించువాడు, వర్ణాశ్రమధర్మయుక్తః = వర్ణాశ్రమధర్మముల నాచరించువాడు, క్వచిత్ చ = ఒకడున్నాడు, ఇతి+ఆదయః = అనునిట్టి, విచిత్ర–చేష్టాః = విచిత్రచర్యలు, దేవ+ఋషి = దేవతలయొక్క, ఋషులయొక్క, హృత్+వాక్+ఆయనం = హృదయములయొక్కయు వాక్కులయొక్కయు గమనమును, వ్యతీతాః = దాటినవి, యస్య = ఎవనివో,

**శ్లో॥యో భక్తారక్షాక్షణ ఏవ యస్య వై – సేవా స్మృతిర్భోజ్య నివేదనం ధియా ।**
**పూజాఫలం యోఽర్పయతీహ దుర్లభం – భక్తస్మృతౌ సన్నిధికృత్ క్షణే క్షణే ॥8**

ప్ర : యః = ఎవడు, భక్తరక్షాక్షణః ఏవ = భక్తులరక్షించుటకుత్సహించునో, యస్య = ఎవని యొక్క, సేవా వై = సేవయే, స్మృతిః = తలంపు, భోజ్య–నివేదనమ్ = తినదగిన పదార్థములను నివేదించుట, ధియా = బుద్ధిచే, యః = ఎవడు, దుర్లభం పూజాఫలమ్ = కష్టసాధ్యమైన పూజాఫలమును, అర్పయతి = అర్పించునో, ఇహ = ఈ లోకమున, (తస్య = వానియొక్క), భక్తస్మృతౌ= భక్తుని స్మరణయందు, క్షణే క్షణే = ప్రతి నిమిషము, సన్నిధికృత్ = ప్రత్యక్షమగు వాడు.

**శ్లో॥ యస్యాస్తి మాహురే నిద్రా నివాసః సహ్యపర్వతే ।**
**భాగీరథ్యాం సదా స్నానం ధ్యానం గన్ధర్వపత్తనే ॥ 9**

ప్ర : యస్య = ఎవనికి, నిద్రా = నిద్ర, మాహురే = మాహుర్ అనే పల్లెయందు; నివాసః = నివాసము, సహ్యపర్వతే = సహ్యాద్రిపైన, భాగీరథ్యామ్ = గంగలో, సదా = ఎల్లవేళల, స్నానమ్ = స్నానము, గన్ధర్వపత్తనే = గంధర్వపట్టణంలో, ధ్యానమ్ = ధ్యానము.

**శ్లో॥ కురుక్షేత్రే చాచమనం ధూతపాపేశ్వరే తథా ।**
**విభూతిధారణం సంధ్యా కరహాటే శ్రియఃపురే ॥ 10**

ప్ర : కురుక్షేత్రే = కురుక్షేత్రమున, ఆచమనమ్ = ఆచమనమున్ను, తథా = అట్లే, ధూతపాపేశ్వరే = ధూతపాపేశ్వరమున, విభూతిధారణమ్ = విభూతిని ధరించుటయు, శ్రియః పురే = శ్రీపురమున, కరహటే = సతారాలోని కరహాడాలో, సంధ్యా = సంధ్యావందనము

**శ్లో॥ భిక్షా విఠ్ఠలపుర్యస్య సుగన్ధిద్రవ్యధారణమ్ ।**
**భుక్తిః సారపురే సాయం సన్ధ్యా పశ్చిమసాగరే ॥ 11**

ప్ర : అస్య = వానియొక్క, భిక్షా = భిక్షాటనము, విఠ్ఠలపురి = విఠ్ఠలపురిలో, సుగంధిద్రవ్యధారణమ్

= కస్తూరిగంధమును ధరించుట, భుక్తిః = భోజనము, సారపురే = సారపురమున, పశ్చిమ సాగరే = పడమటి సముద్రమున, సాయం సంధ్యా = సాయంకాలపు సంధ్యావందనము.

**శ్లో॥ స ఏష భగవాన్ దత్తః సదా వసతు మే హృది ।**
**హృద్ధీన్ద్రియాది వ్యాపారే సదా తత్స్మృతిరస్తు మే ॥ 12**

**ప్ర :** సః ఏష భగవాన్ దత్తః = అట్టి యీ దత్తభగవానుడు, సదా = ఎల్లప్పుడు, మే హృది = నా హృదయమున, వసతు = నెలకొను గాక!, హృత్ = హృదయము, ధీ = బుద్ధి, ఇన్ద్రియ+ఆది = ఇంద్రియములు మొదలగు వాని, వ్యాపారే = కార్యకలాపమునందు, సదా = ఎల్లపుడు, తత్ = ఆ దత్తునియొక్క, స్మృతిః = స్మరణ, మే అస్తు = నాకు కలుగు గాక!

**తా (శ్లో.5-12):** దత్తాత్రేయుడు అత్రిమహర్షి పుత్రుడుగా లీలామానుషవిగ్రహుడై జన్మించినాడు. ఆ దత్తభగవానుడు పిచ్చివానివలె, పిశాచము సోకిన వానివలె, బాలునివలె, యువకుని వలె, వృద్ధునివలె, జడలు ధరించిన ఋషిగా ఎప్పుడైన ఎక్కడైన సంచరించుచుండును. ఆతడు సర్వసంగ పరిత్యాగి, దేనితోను సంబంధము లేనివాడు, ఆత్మానుభవముగల అవధూత, దిగంబరుడు, యోగి, నిత్యతృప్తుడు, సంన్యాసి, యతి, బ్రహ్మచారి, వర్ణాశ్రమధర్మముల కతీతుడు, దేవర్షి హృదయములకు సైతము అందరాని వాడు, అట్టి మహనీయుడైనను ఆతడు భోగివలె చక్కని వస్త్రధారణ చేయును, దృఢశరీరుడు, వర్ణాశ్రమధర్మిగా వ్యవహరించును, భక్తుల రక్షించువాడు, వాని నిత్యకృత్యములు వివిధ పుణ్యక్షేత్రములలో సాగించును. వానిని పూజించిన వారికి దుర్లభఫలము లభించును. సర్వపూజాఫలమును ఆ దత్తప్రభువుకు అర్పించిన భక్తుడు ధన్యుడు. అట్టిస్వామి నా హృదయమున సదా వసించి నా దైహిక ఇంద్రియవ్యాపారములన్నిటిలో ఆ ప్రభువు స్మరణ నిల్చుగాక. *

**శ్లో॥విజయ! తేఽజ యతే! జయ! తే యతేరిహ తమో హతమోహతమో నమః ।**
**హృది కదాయ పదాయ సదా యదా తదుదయో న దయో న వియోనయః ॥13**

**ప్ర :** (హే) యతే! = ఓ యతీ!, (హే) అజ! = ఓ అజ!, (హే) విజయ! = ఓ విజయా!, (హే) హతమోహతమః = ఓ నశించిన తమోభ్రాంతిగలవాడా!, యతేః = యతి యొక్క, తమః = తమస్సును, తమోగుణమును, అజ్ఞానమును, జయతే = నశింపజేయు శ్రీదత్తప్రభూ!, కదాయ = శాశ్వతసుఖప్రదాలగు, తే = నీ యొక్క, పదాయ = పదములకు, సదా = ఎల్లపుడు, నమః = నమస్కారము; యదా = ఎప్పుడు, హృది = హృదయములో, తత్ = ఆ పాదముల, ఉదయః = సాక్షాత్కారము కలుగునో, (తదా = అప్పుడు), న వియోనయః = వివిధయోనులందు జన్మ కలుగదు, న దయః =

**తా :** ఓ యతీ! ఓ పుట్టుకలేనివాడా! ఓ జగజ్జేతా! ఓ అజ్ఞానవిభ్రాంతి లేనివాడా! నీ భక్తులగు యతుల మనస్సుల నావరించు తమోగుణ మాలిన్యమును తొలగించువాడా! శాశ్వతమైన పరమ

పదమును ప్రసాదించు నీ పాదములకు సదా నమస్కారము. నా హృదయమున నీ పాదములు సాక్షాత్కరించి నంతనే నాకు పునర్జన్మరాహిత్యము కలుగుచున్నది.

**శ్లో॥ ఉదయతేఽనయతేర్న యతేర్యదా - మనసి కామనికామగతిస్తదా ।**
**యదుదయో హృదయౌకసి తే సితే - భవతి యోఽవతి యోగివరావరాన్ ॥14**

**ప్ర :** యోగివర! = ఓ యోగిశ్రేష్ఠా!, అనయతే = శిథిలాభ్యాసికానట్టి, యతేః = యతియొక్క, మనసి = మనస్సున, యదా = ఎప్పుడు, కామ = కోరికలయొక్క, నికామగతిః = స్వేచ్ఛావిహారము, న ఉదయతే = కలుగదో, తదా = అప్పుడు, సితే = సత్త్వగుణాధిక్యముగల, హృదయ+ఓకసి = హృదయము అను ఇంటియందు, తే = నీ యొక్క, యత్+ఉదయః = సాక్షాత్కారమేదియో, (తత్ = అది), భవతి = సంభవించును; అవరాన్ = మందప్రజ్ఞులను, యః = యే సాక్షాత్కారము, అవతి = రక్షించునో (అది సంభవించును).

**తా :** ఓ యోగివరా! దృఢమైన అభ్యాసము గల యతి మనస్సున స్వేచ్ఛాకామవిహారము కలుగనప్పుడు, ఆ సత్త్వప్రధానహృదయములో నీ సాక్షాత్కారము సంభవము. అది మందప్రజ్ఞులను గూడ రక్షించును.

**శ్లో॥ భవతి భావభవోఽవభవో యదా - భవతి కామనికామహతిస్తదా ।**
**భవతి మానవమానవదుత్తమే - భవతిరోధిరతో విరతోత్తమే ॥ 15**

**ప్ర :** యదా = ఎప్పుడు, భావ = అష్టలక్షణసాత్త్వికభావభక్తియొక్క, భవః = ఉదయము, భవతి = కలుగునో, (సః = ఆ భక్తుడు), అవభవః = భవమును తరించిన వాడు; తదా = అప్పుడు, కామనికామహతిః = కోరికల పుట్టయగు హృదయగ్రంథియొక్క, నికామ = తీవ్రతకు, హతిః = చావుదెబ్బ, భవతి = సంభవించును; మానవ = మానవుడైన, మానవత్ = మానవంతులలో, ఉత్తమే = ఉత్తముడైన, విరత+ఉత్తమే = సర్వోత్తమమైన బ్రహ్మలోకమును తృణీకరించిన, భవ = సంసారమును, తిరోధి = తిరస్కరించుటలో, రతః = ఆనందించువాడు, భవతి = అగుచున్నాడు.

**తా :** భక్తిలో ఎప్పుడు సాత్త్వికభావానుభవము కలుగునో అప్పుడా భక్తునకు హృదయగ్రంథి భేదింపబడినదై, ఆతడు మానవులలో ఉత్తముడై, బ్రహ్మలోకమును సైతము తృణీకరించు నంతటి ఆత్మానంది యగును.

**శ్లో॥ తవ సతాం వసతాం మనసాఽనసా - ప్రపదయోః పదయోరజసాఙ్గసా ।**
**సుసహితః స హితస్తవ తావతా - యదవతారవతా జనతాఽవతా ॥ 16**

**ప్ర :** అనసా = శకటమును బోలు వేగవంతమైన, మనసా = అభ్యాసవశీకృతమైన మనస్సుచేత, తవ = నీ యొక్క, సతామ్ = సత్పురుషులకు, ప్రపదయోః = ఆశ్రయమైన, పదయోః = పాదద్వయమందు, వసతామ్ = ఉండునట్టి, రజసా = ధూళిచేత, సుసహితః = కూడినవాడైన,

సః = ఆ భక్తుడు, తవ = నీకు, హితః = ప్రియుడు, యత్ = యేది, అవతారవతా = దశావతారధారియైన నీచే, తావతా = అట్టి, జనతా = జన్మాది భయములనుండి, అంజసా = సత్యమైన, అవతా = రక్షణయో.

**తా :** మనస్సు శకటమువలె వేగవంతమైనది. నిరంతరాభ్యాసముతో దానిని అదుపు జేసి సత్పురుషులు నీ పాదరజమునందు నిల్పి ధ్యానింతురు. అట్టి భక్తులు నీకు ప్రియులు. వారిని జన్మాది భయములనుండి సత్యముగా రక్షించుట నీ అవతారలక్ష్యము. *

**శ్లో॥ కృతఫలం తు విహాయ విహాయసా - సమభజం భజతామజ! తామసాత్ ।**
**మిలతి తారకమత్ర కమత్ర స-త్పదరజో భ్రమహారి మహారి సత్ ॥ 17**

**ప్ర :** కృతఫలం తు = కర్మఫలమునేమో, విహాయ = విడచి, (హే) అజ = ఓ జన్మరహితా!, విహాయసా సమభజమ్ = ఆకాశము వలె సర్వత్ర వ్యాప్తిగలవాడవగు, (త్వాం = నిన్ను), భజతాం = భజించు వారికి, తామసాత్ = సంసారతమస్సునుండి, తారకమ్ = తరింపజేయువాడైన, అత్ర సత్ = స్థితప్రజ్ఞులయొక్క, భ్రమహారి = మోహనాశకమైన, మహారి సత్ = అవిద్యాశత్రువైన, పదరజః = పాదధూళి, మిలతి = లభించును.

**తా :** కర్మ ఫలమును విడచి, నిష్కామకర్మ చేయుచు, సర్వవ్యాపివగు నిన్ను సేవించువారికి, ఓ జన్మరహితా! దత్తప్రభూ! సంసారతమస్సును తరింపజేయు స్థితప్రజ్ఞులయొక్క పాదధూళి లభించును. ఆ ధూళియే వారిని దేహాత్మమోహమునుండి రక్షించి, అవిద్యకు శత్రువై విద్యార్థతను కలిగించును.

**శ్లో॥ తదజరామరకోశవిలక్షణం - సదజ! ధీగుణవేత్తృకలక్షణమ్ ।**
**భువనహేత్వఘహృత్త్రిపురాధికం - తవ న జాతు పదం కుపురాధికమ్ ॥18**

**ప్ర :** (హే) అజ = ఓ జన్మరహిత!, అజర+అమర = వార్ధక్యము, మరణము (వృద్ధిక్షయనాశములు) లేని, కోశవిలక్షణమ్ = అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశము లైదింటితో కూడిన విశేషలక్షణము గలదానిని, సత్ = త్రికాలాబాధమై శాశ్వతమై, ధీగుణవేత్తృ = జాగ్రత్ స్వప్నాది బుద్ధి విశేషములకు సాక్షియైన, కలక్షణమ్ = ఆనందరూపియైన, భువనహేతు = జగత్కారణు, అఘహృత్ = పాపనాశకు, త్రిపురాధికమ్ = స్థూల, సూక్ష్మ, కారణదేహములు మూడిటికి అతీతమైన, తవ తత్ పదమ్ = నీయొక్క ఆ పాదము, జాతు = ఎప్పుడును, కుపురాధికమ్ = దేహాద్యభిమానాధిక్యము గలది, న = కాదు.

**తా :** ఓ జన్మరహిత! శ్రీదత్తా! నీవు జన్మజరామరణాది రహితుడవు. పంచకోశాతీతమై త్రికాలాబాధమై బుద్ధివికారములకు సాక్షిమాత్రమై జగత్కారణమై పాపనాశకమై దేహత్రయాబాధ్యమైన నీ పదము ఒకప్పుడైనను దేహత్రయాభిమాని కాదు. *

**శ్లో॥ వివిధభేదపరం సమ! దృశ్యతే వివిధవేదపరం కమదృశ్య! తే ।**
**పదమిదం సదు చిద్ఘనముద్ధియాఽసదనిదం ప్రజహాత్యఘనుద్ధి యా ॥19**

**ప్ర :** (హే) సమ! = ఓ వైషమ్యాది దోషరహితా!, (హే) అదృశ్య = ఓ ఇంద్రియాతీతా!, వివిధ భేదపరం ఇదమ్ = స్వప్రకాశమైన ఈ అపరోక్షరూప ఆత్మ, కమ్ = ఆనందరూపమైనది, సదు (సత్) = కాలాతీతమైన సత్పదార్థము, చిత్+ఘనమ్ = జ్ఞానానంద ఘనమైనది, తే పదమ్ = నీ పదము, అఘనుత్ హి = పాపనాశకమైనదే, యా = ఏది, ఉద్ధియా = ఉత్కృష్టబుద్ధితో, అసత్ = దేహాది అసత్పదార్థము, అనిదమ్ = అనాత్మను, ప్రజహాతి = నిరాకరించుచున్నది, దృశ్యతే = అనుభవించుచున్నది.

**తా :** ఓ సమదృష్టిగల మహాత్మా! ఓ ఇంద్రియాగోచరా! వివిధవిషయజ్ఞానమునకును వాని విభేదములకును అతీతమైన స్వప్రకాశమైన అపరోక్షాత్మానందరూపమైన కాలాతీతమైన సత్పదార్థము జ్ఞానానందవిశిష్టమైన నీ పదము పాపనాశకము; అనాత్మను నిరాకరించు ఉత్తమబుద్ధి దానిని అనుభవించుచున్నది. *

**శ్లో॥ అజ! నమోఽజనమోహనమోహ నః - ప్రియ! నియోజయ తేన యతేన! తే ।**
**య ఇహ వేదనివేదని వేద వే-త్త్యజపదం జపదన్తపదం పదమ్ ॥ 20**

**ప్ర :** (హే) ప్రియ! = ఓ ప్రియుడా!, (హే) అజ! = ఓ పుట్టుక లేనివాడా!, అజన మోహనమోహ = జనమును మోహింపజేయు మోహము లేనివాడా!, యత+ఇన = నియమింపబడిన ఇంద్రియములకు ప్రభువైన వాడా!, నః = మమ్ములను, నియోజయ = నియోగింపుము (అనగా, విదేహ కౌవల్య మిమ్ము); యః = ఎవడు, వేదనివేదని = కర్మ, జ్ఞాన, వైరాగ్యములను త్రికాండలతో కూడి వేదాత్మకమైన స్తోత్రమును, వేద = తెలిసెనో, (సః = ఆతడు), ఇహ = లోకమున, జపదన్తపదమ్ = జపించువారి హృదయస్థానీయమైన, పదమ్ = పరమపదమైన, అజపదమ్ =బ్రహ్మ పదమును, వేత్తి = తెలియును.

**తా :** ఓ ప్రియమైన నిత్యసత్యస్వరూపా! లౌకికజనులను భ్రమలలో ముంచు మోహమునకు లొంగనివాడా!, జితేంద్రియా! ముందే ముచ్చటించబడిన నీ పదమున మమ్ము నియోగించి విదేహ కైవల్యము నిమ్ము. కర్మజ్ఞానవైరాగ్యమండితమైన వేదమహాజ్ఞానముతో కూడిన ఈ స్తోత్రము నెవరు తెలియుచున్నారో వారు ధ్యానించువారి హృదయములలో నెలకొన్న పరమపదమైన బ్రహ్మపదమును తెలిసినవారగుచున్నారు.

**శ్లో॥ ఏవం స్తుత్వా నిజప్రజ్ఞాపరిణామావధీశ్వరమ్ ।**
**మాహాత్మ్యం వక్తుమాజహ్రే శ్రీదత్తస్య తదీరితః ॥ 21**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగ, నిజ = నాదైన, ప్రజ్ఞా = బుద్ధివిశేషముయొక్క, పరిణామ = వికాసమునకు, అవధి = పొలిమెరయైన, ఈశ్వరమ్ = ఈశ్వరుని, స్తుత్వా = స్తోత్రము చేసి, శ్రీదత్తస్య = శ్రీ దత్తాత్రేయునియొక్క, మాహాత్మ్యమ్ = మహిమను, వక్తుమ్ = చెప్పుటకు, తత్+ ఈరితః = ఆ ప్రభువు ప్రేరణగలవాడనై, ఆజహ్రే = ప్రయత్నింతును.

**తా :** ఈ రీతి నా బుద్ధి వికసించినంతమేరకు ఈశ్వరుని నుతించి, శ్రీదత్తాత్రేయుని మహిమను ప్రవచించుటకు ఆ ప్రభువు ప్రేరణతో ప్రయత్నింతును.

**శ్లో॥ అథ శాణ్డిల్యనామాసీద్బ్రహ్మర్షిర్వై మహామునిః ।**
**వేదవేదాఙ్గశాస్త్రజ్ఞః స్వాశ్రమోచితకర్మకృత్ ॥ 22**

**ప్ర :** అథ = కథాక్రమము ఈ రీతి, శాండిల్య నామ = శాండిల్యుడను పేరుగల, బ్రహ్మర్షిః వై = బ్రహ్మర్షియేయైన, మహామునిః = మహాముని, వేదవేదాంగశాస్త్రజ్ఞః = వేదములను వాని వాని ఉపాంగశాస్త్రముతో కూడ అధ్యయనము చేసి తెలిసికొనిన వాడగు, స్వ+ఆశ్రమ+ఉచితకర్మకృత్ = తానున్న వర్ణాశ్రమధర్మములకు తగిన కర్మనాచరించువాడు, ఆసీత్ = ఉండెను.

**తా :** కథారంభ మీరీతి - శాండిల్యుడను మహాముని కలడు. ఆతడు బ్రహ్మర్షియే. ఆతడు వేదములను, వాని అంగ-ఉపాంగశాస్త్రములను చక్కగ తెలిసినవాడు, తన ఆశ్రమోచిత కర్మానుష్ఠానమున నున్నాడు. *

**శ్లో॥ భక్త్యా పరమయోపాస్తశ్రీదత్తపదపఙ్కజః ।**
**సజ్ఞానగర్భవైరాగ్యోరత్యాఢ్యోఽపి దైవతః ॥ 23**

**ప్ర :** పరమయా భక్త్యా = చెదరనిభక్తితో, ఉపాస్త = ఉపాసింపబడిన, శ్రీదత్తపదపంకజః = శ్రీదత్తాత్రేయుని పాదపద్మములు గలవాడు, సజ్ఞాన-గర్భవైరాగ్య = శుద్ధజ్ఞానమూలమైన విరాగముతోడి, ఉపరతి+ఆఢ్యః అపి = సంన్యాసబుద్ధిగలవాడు అయినను, దైవతః = దైవవశమున,

**శ్లో॥ విద్యామలభమానోఽసౌ చతుర్వేదేషు తర్కతః ।**
**భూత్వా భిన్నమతిః స్మృత్వా గురుద్వారా శ్రుతీరితామ్ ॥ 24**

**ప్ర :** అసౌ = అతడు, విద్యామ్ = అపరోక్షసాక్షాత్కారమున కలిగిన జ్ఞానమును, తర్కతః చతుర్వేదేషు = నాలుగు వేదములందును తర్కబుద్ధితో, అలభమానః = పొందలేనివాడుగా, భిన్నమతిః భూత్వా = చంచలమతియై, శ్రుతి+ఈరితామ్ = వేదోక్తమైన, గురుద్వారా = గురువు నాశ్రయించియే,

**శ్లో॥ విద్యాప్రాప్తిమథర్వాణముపసన్నో మహామతిమ్ ।**
**సోఽభివాద్యాహ భగవన్! బ్రహ్మవిద్యామధీహి మే ॥ 25**

**ప్ర :** విద్యాప్రాప్తిమ్ = విద్యాలాభమును, అథర్వాణమ్ = అధర్వవేదమును, ఉపపన్న = ఉపాసించిన, మహామతిమ్ = మహాజ్ఞానిని, సః = ఆతడు, అభివాద్య = నమస్కరించి, ఆహ = పలికెను, భగవన్! = ఓ భగవత్పాదా!, మే = నాకు, బ్రహ్మవిద్యామ్ = బ్రహ్మజ్ఞానమును, అధీహి = ఉపదేశింపుదు;

**శ్లో॥ వరాం నిగూఢాం శ్రేయోఽవాప్స్యామ్యహం యయా ।**
**శాస్తి స్నిగ్ధం వినీతం హి శ్రీగురుగుహ్యమప్యుత ॥ 26**

**ప్ర :** వరామ్ = శ్రేష్ఠమైనదానిని, నిగూఢామ్ = అతిరహస్యమైన దానిని, శాస్తి = ఉపదేశించు చున్నదో, స్నిగ్ధం వినీతం హి = స్నేహాదిగుణోపేతమై వినయమైనది, శ్రీగురుగుహ్యం అపి ఉత = నిశ్చయముగా శ్రీ గురువులుపదేశించదగిన రహస్యవిద్య, యయా = యే విద్యచేత, అహం = నేను, శ్రేయః = మోక్షమును, అవాప్స్యామి = పొందుదునో (ఆ మహావిద్యను)

**శ్లో॥ ఇతి శిష్యేణ సోఽథర్వా సంపృష్టః ప్రాహ సోమ్య! తామ్ ।**
**శ్రద్ధాభక్తిధ్యానయోగాదవేహి త్యాగపూర్వకమ్ ॥ 27**

**ప్ర :** ఇతి = ఇట్లని, శిష్యేణ = శిష్యునిచే, సంపృష్టః = చక్కగ అడుగబడినవాడై, సః అథర్వా = ఆ అథర్వవేదపండితుడు, ప్రాహ = ఇట్లనెను, సోమ్య! = ఓ శాంతుడా!, త్యాగపూర్వకమ్ = సర్వసంగపరిత్యాగముచేసిన పిదప, శ్రద్ధాభక్తిధ్యానయోగాత్ = శ్రద్ధతో భక్తితో ధ్యానయోగము వలన, తామ్ = ఆత్మవిద్యను, అవేహి = తెలిసికొనుము.

**తా (శ్లో.23-27):** ఆతడు చెదరని భక్తితో శ్రీదత్తాత్రేయుని పాదపద్మముల నారాధించి జ్ఞానవైరాగ్యమోక్షములందు ఆసక్తియున్నవాడే యైనను దైవవశమున వేదవిజ్ఞానమువలన చంచలమతియై గురువు నాశ్రయించిమాత్రమే ఆత్మసాక్షాత్కారము సాధ్యమన్న వేదవాక్యమును స్మరించి, అథర్వణ వేదజ్ఞానవేత్తయగు మహానుభావుని ఆశ్రయించి, నమస్కరించి, భగవన్! నాకు బ్రహ్మవిద్యనుపదేశింపుడు; అది సర్వశ్రేష్ఠము, అతిరహస్యము అయినను, దానివలన నాలో వినయాది సుహృల్లక్షణములు కలిగి నేను మోక్షమును పొందునట్లు చేయునది కదా; అని వేడుకొనగా, ఆ అథర్వణవేదవేత్త ఆ శిష్యునకిట్లనెను: సాధించి ఆత్మవిద్యను గ్రహింపుము, అని. *

**శ్లో॥ త్రికాలం బాధరాహిత్యం జగద్బాధైకసాక్షికమ్ ।**
**సత్యత్వమస్య విజ్ఞేయం బ్రహ్మణోఽవిక్రియస్య హి ॥ 28**

**ప్ర :** త్రికాలమ్ = మూడు కాలములందును, బాధరాహిత్యమ్ = బాధ లేకుండుట, జగత్ = లోకముయొక్క, బాధ+ఏకసాక్షికమ్ = బాధకు ఏకైక సాక్షియగుట, అస్య అవిక్రియస్య బ్రహ్మణః = మార్పునకు గురికానిదైన ఆ బ్రహ్మముయొక్క, సత్యత్వం హి = సత్యత్వమే, విజ్ఞేయమ్ = తెలియదగినది.

**తా :** బ్రహ్మము కాలగమనమునకు కట్టుబడినది కాదు. కాని అది జగత్తులో కాలగమనము కలిగించు బాధలకు (మార్పులకు) ఏకైక సాక్షి. ఏ మార్పులేని బ్రహ్మముయొక్క సత్యత్వము విశేషముగ తెలియదగినది. *

**శ్లో॥ విదితావిదితాన్యత్వం త్రిపుటీపరివర్జితమ్ ।**
**స్వయంప్రకాశరూపం తద్జ్ఞానలక్ష్మాస్య కేవలమ్ ॥ 29**

**ప్ర :** విదిత = ఇంద్రియములు అంతఃకరణము అనువానిచే తెలియబడునది, అవిదిత = జాగ్రత్

స్వప్నావస్థల వలన తెలియరానిది, అన్యత్వమ్ = ఈ జ్ఞాతాజ్ఞాతములు రెండును కానిది, అను, త్రిపుటీ = మూడింటివలన, పరివర్జితమ్ = విడువబడినది, స్వయంప్రకాశరూపమ్ = తనకుతానై వెలుగురూపముగలది, అస్య = వాని, తద్జ్ఞానలక్ష్మా = ఆ జ్ఞాన లక్షణము, కేవలమ్ = మాత్రము.

**తా :** ఇంద్రియములకు తెలిసినట్లుండి, జాగ్రత్స్వప్నావస్థలలోనూ తెలియరాకుండి, ఈ రెండిట తెలిసి తెలియనట్లుండే ఈ మూడు లక్షణములు లేక స్వయంప్రకాశరూపమై అద్వితీయకేవలమై యుండుటే ఆ **ఆత్మజ్ఞానలక్షణము.** *

**శ్లో॥ దేశతః కాలవస్తుభ్యాం పరిచ్ఛేదో యతోఽస్య నో ।**
**విభోరేకస్య చానన్తలక్ష్మ సర్వాత్మకస్య చ ॥ 30**

**ప్ర :** అస్య = వానికి, దేశతః = దేశము వలన, కాలవస్తుభ్యాం = కాలము వలనను, వస్తువులను బట్టి, పరిచ్ఛేదః = విభాగము, నో = లేదు; యతః = ఏ కారణమున, ఏకస్య విభోః = ఒక్కడేయైన, ప్రభుత వలన, చ = మరియు, అనన్తలక్ష్మ = అనంత నామరూపములు గల, సర్వాత్మకస్య చ = సమస్తమునకు తానే ఆత్మయగుటవలన, (నో = కలుగదో).

**తా :** ఆత్మయే జగత్ప్రభువు, కావున వానికి దేశభేదవిభజన లేదు. అనంతత్వము ఆత్మలక్షణము, కావున ఆత్మకు భూతభవిష్యద్వర్తమానములని గాని లేక రేబవళ్ళని గాని కాలవిభాగము లేదు. అట్లే, ఆత్మ సర్వచరాచరజగద్వ్యాపి యైనది, కావున వస్తుప్రమాణగుణాదిలక్షణములచే పరిచ్ఛిన్నము కాదు.

**శ్లో॥ సత్యం జ్ఞానమనన్తం చేత్యుక్తం తద్బ్రహ్మలక్షణమ్ ।**
**ఇదమేకం చాద్వితీయం యత్సదా భేదవర్జితమ్ ॥ 31**

**ప్ర :** బ్రహ్మలక్షణమ్ = ఆ బ్రహ్మలక్షణముగా, సత్యమ్ = సత్యము, జ్ఞానమ్ = జ్ఞానము, అనన్తమ్ = అంతములేనిది, ఇత్యుక్తమ్ = అని చెప్పబడినది; ఏకమ్ = ఒక్కటి, అద్వితీయమ్ = రెండవదాని సంగము లేనిది, యత్ = యేది, సదా = ఎల్లప్పుడు, భేదవర్జితం చ = భేదమెఱుగనిదియు, తత్ = అది, ఇదమ్ = ఇది (ఈ ఆత్మ)

**తా : బ్రహ్మ సత్యము, జ్ఞానము, అనంతము, అద్వయైకము, అభేద్యము అయినది, అదియే ఆత్మ.** *

**శ్లో॥ తచ్ఛబ్దలక్ష్యేఽస్మిన్నోతం ప్రోతం చైతత్తదాశ్రయమ్ ।**
**యస్మిన్ జ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి ధ్రువమ్ ॥ 32**

**ప్ర :** తత్ శబ్దలక్ష్యే = "తత్త్వమసి" అను మహావాక్యమున **తత్** పదమునకు అంతర్గతమైన లక్ష్యార్థము, అస్మిన్ = ఈ బ్రహ్మమునందు, ఓతం ప్రోతం చ = పడుగుపేకలుగ కలిసియున్నదియు, ఏతత్ = ఈ జగత్తునకు, తత్ = ఆ బ్రహ్మము, ఆశ్రయమ్ = ఆధారమైనది; యస్మిన్ జ్ఞాతే =

ఏది తెలియబడగా, ఇదం సర్వమ్ = ఈ జగత్తు అంతయు, ధ్రువమ్ = నిశ్చయముగా, విజ్ఞాతం భవతి = విశేషముగ తెలిసినదే అగుచున్నది.

**తా :** ఉపనిషత్తు **తత్ త్వం అసి** అన్నప్పుడు **తత్** అనుదానికి యే అర్థము ఉద్దేశింపబడినదో, ఆ అర్థమైన బ్రహ్మమునందు ఈ జగత్తు పడుగుపేకలుగా అల్లుకొని యున్నది. కావున యీ జగత్తున కా బ్రహ్మము ఆధారమైన ఆత్మ. ఇట్టి బ్రహ్మమును గురించిన జ్ఞానము ప్రత్యక్షానుభవమైనప్పుడు బాహ్యప్రపంచమంతయు సవిశేషముగ తెలియవచ్చును.

**శ్లో॥ అస్యాభిన్ననిమిత్తోపాదానత్వం చైక్యసిద్ధయే ।**
**ప్రకృత్యధిష్ఠాత్రైక్యం చ ప్రతిజ్ఞాతమనేన హి ॥ 33**

**ప్ర :** అస్య = బ్రహ్మముయొక్క, ఐక్యసిద్ధయే = ఏకత్వము సిద్ధించుటకై, అభిన్న నిమిత్త+ ఉపాదానత్వమ్ = తనదైన ప్రాధాన్యమువలన, తనదైన ఉపాధిప్రాధాన్యమువలనను కారణభూతమైన దేహభావన చెప్పబడినందున, ప్రకృతి+అధిష్ఠాతృ+ఐక్యం చ = ప్రకృతి అధిష్ఠానమున ఐక్యమై యున్నదనియును, అనేన హి = దానిచేతనే, ప్రతిజ్ఞాతమ్ = తెలియబడుచున్నది.

**తా :** ఆత్మ ప్రాధాన్యము, ఉపాధి ప్రాధాన్యము రెంటికి కూడలి దేహభావన. ఇట్లు ప్రకృతియు దానికధిష్ఠానమైన ఆత్మయు ఏకత్వమున నున్నవని గ్రాహ్యము.

**శ్లో॥ అన్యథా సర్వవిజ్ఞానమేకవిజ్ఞానతః కథమ్ ।**
**సూత్రే ప్రతిజ్ఞాదృష్టాన్తానుపరోధాదితీరితమ్ ॥ 34**

**ప్ర :** అన్యథా = వేరొక విధముగా, సర్వవిజ్ఞానమ్ = విజ్ఞానమంతయు, ఏకవిజ్ఞానతః = ఒకే విజ్ఞానమువలన, ప్రతిజ్ఞాదృష్టాన్త అనుపరోధాత్ ఇతి = ప్రతిజ్ఞాదృష్టాన్త అనుపరోధాత్ అని, సూత్రే = సూత్రమునందు, కథం ఈరితమ్ = ఎట్లు చెప్పబడినది?

**తా :** పై శ్లోకమున చెప్పినట్లు కాక వేరొక విధముగా **ప్రతిజ్ఞాదృష్టాన్త-అనుపరోధాత్** అను సూత్రమునకు అర్థాన్వయము లోపించును. అది అంగీకారయోగ్యము కావలె ననిన సమస్తవిజ్ఞానమునకు నొకే కేంద్రస్థానము ఉండి తీరవలె. *

**శ్లో॥ సచ్చిదానన్దైకరసం పరం బ్రహ్మామృతం తు తత్ ।**
**ఆత్మశక్తిప్రధానః సన్ సర్వజ్ఞో నిఖిలేశ్వరః ॥ 35**

**ప్ర :** తత్ తు బ్రహ్మ = ఆ తత్ అనబడు బ్రహ్మమేమో, సత్+చిత్+ఆనంద+ఏకరసమ్ = సత్యము జ్ఞానము ఆనందము అను మూడు ఒక్కటేయైన ఆనందము, పరమ్ = ఈ సృష్టి-లక్షణములేనిది, అమృతమ్ = శాశ్వతము నిర్వికారము అయినది, ఆత్మశక్తిప్రధానః సన్ = ఆత్మశక్తియే లేక తన శక్తియే ప్రధానమైన దగుచు, సర్వజ్ఞః = సమస్తజ్ఞానాధికారియైన, నిఖిలేశ్వరః అఖండప్రభుత గలది.

**తా : తత్** అని ఉపనిషత్తుచే నిర్దేశింపబడిన ఆ బ్రహ్మము ఈ సృష్టికంటె వేరయినది; నిర్వికార సత్యస్వరూపమైనది; సత్ చిత్ ఆనందములు మూడును ఒక్కటే సుఖస్వరూపమైనది; సర్వశక్తిమంతము, సర్వజ్ఞానవంతము, సర్వైశ్వర్యవంతము అయినది.

**శ్లో॥ దేవః సర్వాన్తరాత్మైకో భూతావాసో నిగూఢకః ।**
**యోగైకగమ్యో యో విశ్వం సృజత్యవతి హన్తి చ ॥ 36**

**ప్ర :** దేవః = దేవుడు, సర్వ+అన్తరాత్మ+ఏకః = అన్నిటియందు ఒకే ఆత్మయై యున్నవాడు, భూత+ఆవాసః = సమస్త సృష్టికి ఆశ్రయమైనవాడు, నిగూఢకః = రహస్యముగా ప్రకాశింపక యున్నవాడు, యోగ+ఏక గమ్యః = ఒక్క యోగమార్గమున మాత్రమే చేరదగిన వాడు, యః = ఎవడు, విశ్వం = జగత్తును, సృజతి = సృష్టించుచున్నాడో, అవతి = రక్షించుచున్నాడో, హన్తి చ = సంహరించుచున్నాడు కూడ, (సః = అతడు).

**తా :** ద్యోతకత్వమువలన దేవుడు, అన్నింటికి కేంద్రమైన వాడు, సృష్టికి ఆశ్రయమైనవాడు, రహస్యముగ నుండి మహిః ప్రకాశము లేకున్నవాడు, యోగమార్గమున మాత్రమే చేరదగిన వాడు, జగత్తును సృష్టించి, రక్షించి, సంహరించువాడు ఆ బ్రహ్మము.

**శ్లో॥ అన్తర్యామీ చ మాయావీ స తు తచ్ఛబ్దవాచకః ।**
**యోఽస్మత్ప్రత్యయశబ్దాభ్యాలమ్బః కామాదిదూషకః ॥ 37**

**ప్ర :** తత్+శబ్దవాచకః సః తు = **తత్** శబ్దముచే నిర్దేశించబడు ఆ బ్రహ్మమైతే, అన్తర్యామీ = సృష్టియందంతట వ్యాపించియున్నవాడు, మాయావీ చ = మాయతో వర్తించువాడు గూడ, యః = ఎవడు, అస్మత్ ప్రత్యయశబ్ద = 'అహం'అను శబ్దమునకు, అభ్యాలంబః = ఆధారమైనది, కామ+అది = కామక్రోధలోభమోహమదమాత్సర్యములకు, దూషకః = దూరముగ నుండు వాడు, నిరాకరించువాడు.

**తా :** ఆ బ్రహ్మము సర్వవ్యాపి, మాయగైకొని మసలు వాడు, అహం అను జీవార్థవాచకశబ్దమునకు ఆధారమైనవాడు, కామాది షడ్వర్గము లేనివాడు. *

**శ్లో॥ తద్వ్యోమవత్సర్వగతమద్వితీయం నిరఞ్జనమ్ ।**
**సన్మాత్రం నిష్కలం శాన్తమప్రమేయమజం శివమ్ ॥ 38**

**ప్ర : తత్** = ఆ బ్రహ్మము, వ్యోమవత్ = ఆకాశము వలె, సర్వగతమ్ = అంతట వ్యాపించినది, అద్వితీయమ్ = ఒకే ఒక్కటైనది, నిరంజనమ్ = మాయకు లోబడనిది, సత్+మాత్రమ్ = సత్తాకేవలమైనది, నిష్కలమ్ = అవిభాజ్యమైనది, శాన్తమ్ = యే వికారము లేనిది, అప్రమేయమ్ = జన్మాది వికారము లేనిది, అజమ్ = జననము లేనిది, శివమ్ = సుఖస్వరూపమైనది.

**తా :** **బ్రహ్మము** ఆకాశమువలె సర్వత్ర వ్యాపించి యేకైకమైనది, మాయకు లోనుగానిది, సత్తామాత్రమైనది, అవిభాజ్యము, నిర్వికారము, సుఖస్వరూపమైనది.

**శ్లో॥ అయం త్వం పదవాచ్యోఽన్తఃకరణచ్ఛిన్నబోధకః ।**
**దేహేన్ద్రియమనఃప్రాణాహంకారేభ్యో విలక్షణః ॥ 39**

**ప్ర :** అయం **త్వం** పదవాచ్యః = ఈ త్వం (నీవు) అను మాటచే సూచింపబడినవాడు, అన్తః-కరణచ్ఛిన్నబోధకః = అన్తఃకరణముయొక్క అంశను సూచించువాడు, దేహ+ఇంద్రియ-మనః ప్రాణ+అహంకారేభ్యః = శరీరము, జ్ఞానేంద్రియములు, మనస్సు, ప్రాణము, అహంకారము అనువానితో, విలక్షణః = విశేషలక్షణములు కలిగిన వాడు.

**తా :** త్వం (నీవు) అను మాటచే గుర్తింపబడువాడు అన్తఃకరణపు ఒక పరిమితాంశగలవాడు, కర్మజ్ఞానేంద్రియములు పదియును, మనస్సు, ప్రాణము, అహంకారము అనబడు లక్షణములతో కూడినవాడు.
*

**శ్లో॥ సాక్షీ విశుద్ధః కూటస్థః ప్రత్యక్త్వంపదలక్ష్యకః ।**
**ధీదీపో నిర్వికారో ధీవృత్తివ్యాప్యోఽపి కేవలః ॥ 40**

**ప్ర :** సాక్షీ = సాక్షి, ప్రత్యక్ = వేరుగా, **త్వం**పదలక్ష్యకః = త్వం (నీవు) అనబడు మాటచే సూచింపబడువాడు, విశుద్ధః = విశేషముగ శుద్ధమైనవాడు, కూటస్థః = శుద్ధసత్వ ఆవరణముగల నిర్వికారజీవాహంకారసాక్షి, ధీదీపః = బుద్ధిగా మార్గదర్శియగు వాడు, నిర్వికారః = వికారములు లేనివాడు, ధీవృత్తివ్యాప్యః అపి = బుద్ధివ్యాపారములవలన వ్యాప్తమైయున్నవాడే యైనను, కేవలః = ఏకమాత్రుడు.

**తా :** త్వం (నీవు) అనబడు నాతడు సాక్షి, శుద్ధుడు, బుద్ధిరూపమున మార్గదర్శియగువాడు, నిర్వికారుడు, బుద్ధివృత్తులలో అనేకరూపిగా ఉన్నను ఏకమాత్రుడైన వాడు.

**శ్లో॥ ప్రత్యక్పరోక్షాదివైరం తయోర్హిత్వా చిదాత్మతామ్ ।**
**గృహీత్వా లక్షితాం శుద్ధాం భూమైక్యజ్ఞానతో భవేత్ ॥ 41**

**ప్ర :** ప్రత్యక్ = ప్రత్యక్షము, పరోక్ష = పరోక్షము, ఆది = మొదలగు, వైరమ్ = పరస్పర విరోధము, తయోః = వాని మధ్య, హిత్వా = విడిచి, చిత్+ఆత్మతామ్ = జ్ఞానకేంద్రతను, గృహీత్వా = గ్రహించి, భూమ = అపరిచ్ఛిన్న, అవిభక్త, ఐక్యజ్ఞానతః = ఏకమైన జ్ఞానమువలన, లక్షితామ్ = లక్షింపబడిన, శుద్ధామ్ = శుద్ధమైనదిగా, భవేత్ = అగును.

**తా :** వానియొక్క ప్రత్యక్ష-పరోక్ష-ప్రమాణవైరమును వదలి, వానికి కేంద్రమైన జ్ఞానమును గ్రహించి, అఖండజ్ఞానమువలన శుద్ధమగును.

శ్లో॥ వాగ్ధీనివృత్త్యానాప్త్యా చ ఫలవ్యాప్తిర్నివారితా ।
ఏవమాత్మస్థమాత్మానం యోగేన శ్రవణాదినా ॥ 42

శ్లో॥ జానాత్యైక్యం స ముక్తః సన్ కృతకృత్యోభవేద్ధ్రువమ్ ।
ఆత్మ విజ్ఞానేన సోమ్య! శోకస్యాన్తం గమిష్యసి ॥ 43

ప్ర : వాక్ = వాక్కు, ధీ = బుద్ధి, నివృత్త్యా = నివారించుట చేత, అనాప్త్యా చ = పొందకుండుట చేతగూడ, ఫలవ్యాప్తిః = వాని వాని ప్రవృత్తి ఫలముల వ్యాప్తి, నివారితా = నివారింపబడినది, ఏవమ్ = ఈ విధముగ, ఆత్మస్థమ్ = ఆత్మయందున్న లేక తనలోనున్న, ఆత్మానమ్ = తనను, ఆత్మను, యోగేన = ఏకాగ్రతతో, శ్రవణాదినా = శ్రవణ పఠన మనన కథనములచేత, ఐక్యమ్ = ఐక్యతను, ఏకతను; జానాతి = తెలియుచున్నాడు, సోమ్య! = ఓ సౌమ్యుడా!, సః = అతడు, ధ్రువమ్ = నిశ్చయముగా, ముక్తః సన్ = ముక్తుడగుచు, ఆత్మవిజ్ఞానేన = ఆత్మను గురించి విశేషజ్ఞానముచేత, కృతకృత్యః = కృతార్థుడు, ధన్యుడు, భవేత్ = అగును, శోకస్య అన్తమ్ = దుఃఖనాశమును, గమిష్యసి = పొందుచున్నావు.

**తా :** వాక్కును బుద్ధిని పొందకున్నను, నివారించినను, దాని ఫలమును నివారించుట సంభవము. ఇట్లు తనలోని ఆత్మను ఏకాగ్రతతో శ్రవణాది సాధనలతో **ఏకమేవాద్వితీయం** అని తెలిసినవాడు ధన్యుడు. ఆతడు దుఃఖమును పొందడు. *

శ్లో॥ ఇదం శ్రద్ధత్స్వ మా శోచీః శోకస్యాన్తం గమిష్యసి ।
అత్ర యోగం ప్రవక్ష్యామి యేనాత్మాఽఽశు ప్రసీదతి ॥ 44

ప్ర : ఇదమ్ = దీనిని, శ్రద్ధత్స్వ = శ్రద్ధతో తెలియుము, మా శోచీః = విచారించకుము, శోకస్య అన్తమ్ = దుఃఖనాశమును, గమిష్యసి = పొందుచున్నావు; అత్ర = ఈ సందర్భమున, యోగమ్ = యోగమును గూర్చి, ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను, యేన = దేనిచేత, ఆత్మా = మనస్సు, ఆశు = వెంటనే, ప్రసీదతి = శాంతిని పొందుచున్నది.

**తా :** ఈ చెప్పిన దానిని శ్రద్ధగా తెలిసికొనుము. దీనివలన నీకు మనశ్శాంతి కలుగును, దుఃఖము తొలగిపోవును. అందుకు సాధనగా నీకు యోగము నుపదేశింతును. *

శ్లో॥ యోగః స్యాత్ప్రత్యగాత్మైక్యమష్టాఙ్గాని తస్య తు ।
దేహేన్ద్రియాదౌ విరక్తిర్యమో మిథ్యాత్వవీక్షణాత్ ॥ 45

ప్ర : యోగః = యోగము, ప్రత్యక్ = జీవుడు, ఆత్మా = ఆత్మ లేక బ్రహ్మము అను ఈ రెండిటి, ఐక్యమ్ = కలసి ఒకటేయైన స్థితి, స్యాత్ = అగును; తస్య = యోగమునకు, అష్ట+అంగాని = ఎనిమిది అవయవములు; దేహ = శరీరము, ఇంద్రియ ఆదౌ = ఇంద్రియములు అను ఈ మొదలగు వానియందు, విరక్తిః = ఆసక్తిని విడచుట, యమః = యమము అనగా అహింస,

అస్తేయము, బ్రహ్మచర్యము, దయ ఆర్జవము, క్షమ, ధృతి, మితాహారము, శౌచము అను వీనిని పాటించుట, మిథ్యాత్వవీక్షణాత్ = జగత్తునందున్న అశాశ్వతత్వమును పరిశీలించుటవలన,

**శ్లో॥ స్వాత్మతత్త్వేఽనురక్తిర్నియమః సత్యత్వనిశ్చయాత్ ।**
**బాహ్యార్థౌదాసీన్యతోఽన్తర్దృష్టిస్థాపనమాసనమ్ ॥ 46**

**ప్ర :** స్వ = తనదైన, ఆత్మతత్త్వే = ఆత్మసత్యత్వమున, అనురక్తిః =అనురాగము, నియమః = నియమము, సత్యత్వనిశ్చయాత్ = ఆత్మసత్యత్వము నిశ్చయముగ తెలియుటవలన, బాహ్య+అర్థ = లౌకికమైన, ఇంద్రియసంబంధమైన విషయములందు, ఔదాసీన్యతః = ఉదాసీనత, అనాసక్తి కలుగుటవలన, అన్తర్+దృష్టి–స్థాపనమ్ = అంతర్ముఖత్వము, లోచూపును సాధించుట, ఆసనమ్ = ఆసనము, కూర్చొను భంగిమ

**తా :** యోగమనగా జీవుడు బ్రహ్మము లేక ఆత్మ కలిసిన స్థితి. ఈ యోగసాధనలో ఎనిమిది అంశములున్నవి : దేహేంద్రియ విరక్తి, యమము, ఆత్మసత్యత్వనిశ్చయము, ప్రాపంచిక సుఖ–దుఃఖముల పట్ల ఉదాసీనత, స్థిరాసనమున కూర్చుండి దృష్టిని అంతర్ముఖము గావించుట. *

**శ్లో॥ పూరశ్చిదన్వయాదానం కుమ్భకస్తత్ స్థిరీకృతిః ।**
**రేచకో మాయికత్యాగః ప్రాణాయామస్త్రిధోదితః ॥ 47**

**ప్ర :** పూరః = పూరము లేక పూరకము అనబడు, చిదన్వయాదానమ్ = జ్ఞానాన్వయగ్రహణము (కేవలము ఊపిరి పీల్చుట కాదు); కుంభకః = కుంభకము అనబడునది, తత్ = దానియొక్క, స్థిరీకృతిః = ఆ జ్ఞానాన్వయస్వీకారమును సుస్థిరమగునట్లు చేయుట (కేవలము పీల్చుకొన్న గాలిని ఊపిరితిత్తులలో నిలిపి యుంచుట కాదు); రేచకః = రేచకము అనబడునది, మాయికత్యాగః = నామరూపములను వదలివేయుట, (అని యిట్లు) ప్రాణాయామః = ప్రాణాయామము అనబడునది, త్రిధా = మూడు విధములుగా, ఉదితః =చెప్పబడినది.

**తా :** ప్రాణాయామము అనునది మూడు అంశముల సమన్వయము : ఊపిరి పీల్చుట, పీల్చిన గాలిని కొంతవ్యవధివరకు నిలిపి యుంచుట, మరల ఆపై ఆ గాలిని మెల్లగా వదలివేయుట అను ప్రక్రియలను పూరక, కుంభక, రేచకములుగా చెప్పుదురు. అయితే, పూరకమనగా ప్రాణముతో బాటు జ్ఞానమును లోనికి స్వీకరించుట, ఆ స్వీకరింపబడిన జ్ఞానమును లోన అట్లే నిలిపి యుంచుట, ఆ జ్ఞానమాధారముగ నామరూపాది వ్యక్తిగతలక్షణములను వదలివేయుట. ఒకటి, భౌతిక ప్రక్రియ; రెండవది బౌద్ధికప్రక్రియ. రెండును యోగాంగము. *

**శ్లో॥ ప్రత్యాహారో గోస్వభావదృష్ట్యార్థాసక్త్యభావదృక్ ।**
**ధారణా స్వాత్మనిష్ఠా స్యాద్వీతదుర్భావనం దృఢా ॥ 48**

**ప్ర :** ప్రత్యాహారః = ప్రత్యాహారము అనబడు యోగాంగము, గోస్వభావ దృష్ట్యార్థ+ఆసక్తి+ అభావదృక్ = ఇంద్రియముల స్వాభావికవిషయాసక్తిలేని దృష్టి; ధారణా = ధారణ యనబడు

యోగాంగము, దృఢా స్వ+ఆత్మ = తన ఆత్మయందు దృఢమైన, వీతదుర్భావనమ్ = వీడిపోయిన దుర్భావనలతోడి, నిష్ఠా = నిష్ఠ, విశ్వాసము, స్యాత్ =అగును.

**తా :** **ప్రత్యాహార**మనబడు యోగాంగము ఇంద్రియవిషయములలో స్వాభావికమైన ఆసక్తి లేకుండుట; **ధారణ** యనగా, తన ఆత్మ విషయమున గల అపోహలు సంశయములు తొలగిపోగా కలిగిన దృఢవిశ్వాసము, అంతియే తప్ప నాభిదేశమున గాని ఇతరత్ర శరీరభాగములందుగాని చిత్తము నేకాగ్రముగ నిలుపుట మాత్రమే కాదు. *

**శ్లో॥ ధ్యానం బ్రహ్మాహమస్మీతి దృక్ప్రవాహోఽన్యవర్జనాత్ ।**
**దేహాత్మవత్పరాత్మత్వదృక్ సమాధిర్హి సుస్థిరా ॥ 49**

**ప్ర :** ధ్యానమ్ = ధ్యానము అనబడు యోగాంగము, అన్యవర్జనాత్ = వేరొక భావమునకు తావులేని, బ్రహ్మ+అహం+అస్మి+ఇతి = బ్రహ్మము నేను అయి యున్నాను అను, దృక్+ప్రవాహః = దర్శనపు వెల్లువ; దేహ+ఆత్మవత్ = దేహమిహలోక కేంద్రకమయిన రీతి, పర+ఆత్మత్వ దృక్ = దేహాతీతమైన ఆత్మయొక్క ఉనికిని దర్శించుట, సుస్థిరా హి = అచంచలమైనదే, సమాధిః = సమాధియనబడు కడపటి యోగాంగము.

**తా :** ధ్యానమను యోగాంగమున, **నేనే బ్రహ్మస్వరూపుడను** అను ఒకే భావము, వేరొక భావమునకు తావులేకుండ, ప్రవహించుచుండును. లోకవర్తనమునకు కేంద్రము దేహమైనట్లే, పారలౌకిక జీవనమునకు కేంద్రము ఆత్మ అను దర్శనము ప్రత్యక్షమగుట, అది నిశ్చలమగుట అను ప్రక్రియకు **సమాధి** యని పేరు. *

**శ్లో॥ పరిపక్వకషాయాణాం యోగోఽయం శీఘ్రముక్తిదః ।**
**కిఞ్చిత్పక్వకషాయాణాం యోగోఽయం శీఘ్రముక్తిదః ॥ 50**

**ప్ర :** అయం యోగః = ఈ యోగము, పరిపక్వ = బాగుగా పండిన, కషాయాణామ్ = విరాగులకు, శీఘ్రముక్తిదః = వేగముగ మోక్షమిచ్చునది; అయం యోగః = ఈ యోగము, కించిత్ = కొంచెము, పక్వ = పండిన, కషాయాణామ్ = విరాగులకు, శీఘ్రముక్తిదః = వేగమే ముక్తినిచ్చునది.

**తా :** ఈ అష్టాంగయోగము చిక్కని వైరాగ్యముగల సాధకులకు అనతికాలములోనే ముక్తిని ప్రసాదించగా, వైరాగ్యమింకను చక్కగ పండక, వృద్ధిలో నున్న వారికి సైతము త్వరలోనే ముక్తిని ప్రసాదించును. *

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ప్రథమాష్టకే షష్ఠోఽధ్యాయః
ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

ప్రథమాష్టకము - సప్తమాధ్యాయము

**శ్లో॥ ద్వే విరూపే విభోరత్రాక్లేశోత్పాదనమాత్మనా ।**
**అహింసా సత్యం యథార్థసద్వాగన్యార్థనిస్పృహా ॥ 1**

**ప్రతిపదార్థం :** విభోః = ప్రభువైన ఆత్మకు, విరూపే = పోలికలేనిదైన (స్థావరజంగమాత్మక), అత్ర = ఈ జగత్తున, ద్వే = రెండు, ఆత్మనా = తనచేత, స్వయముగ, అక్లేశ+ఉత్పాదనమ్ = కష్టమును కలిగించకుండుట, (అనునది), అహింసా = అహింస యనబడును; యథార్థ సత్+వాక్ = ఉన్నదున్నట్లు ప్రసన్నముగా చెప్పుట, అన్య+అర్థనిస్పృహా = యథార్థమునకు భిన్నమగు విషయమును గుర్తించకుండుట, (అనునది), సత్యమ్ = సత్యము అనబడును.

**తాత్పర్యం :** ఈ జగత్తు స్థావరజంగమనామరూపలక్షణములతో విభక్తమైనది. కావున ఇది అఖండమైన ఆత్మకు పోలిక లేనిది. అట్టి ఆత్మకు వికారము కలిగించునదేదిగాని **హింస** యనబడును. అట్టి హింసను కలిగించకుండుటే **అహింస.** అట్లే, ఆత్మస్వరూపమే సత్, చిత్, ఆనందముల సమైక్యము, అనగా ఉనికి, జ్ఞానము, ఆనందము అనువాని ఏకత. ఇదియే ఆత్మ సత్యత్వము. ఈ సత్యత్వమును చాటి చెప్పు వాక్కు **సద్వాక్.** అది ప్రసన్నమైనది. దానికి విపరీత భావనయందాసక్తి ఉండదు. ఇట్టిది **సత్యము** అనబడునది. *

**శ్లో॥ అస్తేయం బ్రహ్మచర్యం స్యాత్ సదా మైథునవర్జనమ్ ।**
**దయా భూతానుగ్రహోఽత్రైకరూపత్వం సదార్జవమ్ ॥ 2**

**ప్ర :** అస్తేయమ్ = దొంగిలించకుండుట, సదా = ఎల్లప్పుడు, మైథున = స్త్రీ సంభోగం, వర్జనమ్ = లేకుండుట, బ్రహ్మచర్యమ్ = బ్రహ్మచర్యము; దయా = దయ, భూత+అనుగ్రహః = సమస్తమున అనుగ్రహము; అత్ర = వానియందు, ఏకరూపత్వమ్ = సమదృష్టి, (అనునది), ఆర్జవమ్ = ఆర్జవము, స్యాత్ = అగును.

**తా : అస్తేయ**మనగా దొంగిలించకుండుట; స్త్రీ సాంగత్యమును పూర్తిగా విడచుట యను **బ్రహ్మచర్యము;** సమస్తభూతములందును అనుగ్రహముంచుట యను **దయ;** వాని అన్నిటి విషయమున కల్మషములేని వైఖరి యను **ఆర్జవము;** *

**శ్లో॥ క్షమాఽప్రియాదిసహనం ధృతిర్నాశేఽప్యవిక్రియా ।**
**మితాహారో హితస్నిగ్ధచతుర్థాంశోన భోజనమ్ ॥ 3**

**ప్ర :** అప్రియా+ఆది–సహనమ్ = తనకు సుఖసంతోషముల నివ్వని విషయముల పట్ల ఓర్పువహించుట, క్షమా = క్షమా అనబడు గుణము; నాశే అపి = భార్యాబిడ్డలవియోగములో గాని ధననష్టము సందర్భములోగాని, అవిక్రియా = శోకము లేకుండుట, ధృతిః = ధృతి; చతుర్థాంశోన– హిత–భోజనమ్ = నాలుగు ముద్దలు మాత్రము భుజించుట, మితాహారః = మితాహార మనబడును.

**తా :** తనకిష్టములేని వాని పట్ల, ఓర్చియుండుటకు **క్షమ** యని పేరు. భార్యబిడ్డలు గతించినను, ధననష్టము జరిగినను దుఃఖపడక నిర్వికారుడై యుండుట **ధృతి** యనబడును. నాలుగు ముద్దలు మాత్రమే తినియుండుట **మితాహారము.** *

**శ్లో॥ మృజ్జలాభ్యాం బహిఃశౌచం ధ్యానమన్తర్యమా ఇమే ।**
**తపః కృచ్ఛ్రైర్దేహశుద్ధిస్తోషో దైవాప్తతోషణమ్ ॥ 4**

**ప్ర :** మృత్ జలాభ్యామ్ = మట్టితో నీటితో, బహిః (శౌచం) = వెలుపలి శుచి; ధ్యానమ్ = ధ్యానము (శ్రీదత్తధ్యానము), అన్తః–యమా = అన్తఃకరణశుద్ధి, అను, ఇమే = ఇవి, శౌచమ్ = శౌచమనునవి; కృచ్ఛ్రైః = బాధకలిగించువానితో, దేహశుద్ధిః = శరీరమును శుద్ధిచేయుట యనునది, తపః = తపస్సు; దైవ+ఆప్త = దైవానుగ్రహమున పొందిన దానితో, తోషణమ్ = సంతోషించుట, తోషః = సంతోషము.

**తా :** మట్టితో నీటితో దేహమును పైపైన శుభ్రము చేసికొనుట అనునది **బహిఃశౌచము** అనబడును; అట్లే, శరీరమును కష్టపెట్టు భంగిమలలో ఏకాగ్రదైవధ్యానము **తపస్సు;** అట్లుకాక, సుఖాసనమున మనశ్చాంచల్యమును కట్టడి చేయుట **ధ్యానము;** దైవానుగ్రహము వలన తనకు లభించిన దానిని మహాప్రసాదముగ తృప్తితో స్వీకరించుటకు పేరు **తోషము.** *

**శ్లో॥ ఆస్తిక్యం వేదవిశ్వాసో విచారః శ్రవణం శ్రుతేః ।**
**దానం స్వార్థార్పణం పాత్రే పూజా విష్ణౌ కృతార్పణమ్ ॥ 5**

**ప్ర :** వేదవిశ్వాసః = వేదమునందు నమ్మకము, ఆస్తిక్యమ్ = ఆస్తిక్యము; శ్రుతేః = వేదము యొక్క, శ్రవణమ్ = వినుట, విచారః = విచారమనబడును; స్వ+అర్థ =తన ధనమును, లేక స్వార్థభావమును, పాత్రే = యోగ్యునియందు, అర్పణమ్ = అర్పించుట, దానం = దానము; విష్ణౌ = విష్ణువునందు, కృత+అర్పణమ్ = అర్పించుట, పూజా = పూజ.

**తా :** వేదమును నమ్ముటే **ఆస్తికత్వము.** వేదమును వినుటయే **వేదవిచారము.** తనది అను భావమును, అట్టి భావముతో సంపాదించిన ధనమును యోగ్యునకు ఇచ్చివేయుటయే **దానము.** విష్ణువునకు కర్మ అర్పించునదే **పూజ.**

**శ్లో॥ కుకర్మలజ్జాహ్రీర్బుద్ధిః శ్రద్ధా వేదోక్తకర్మసు ।**
**విధివద్విష్ణుపర్వైకాదశ్యుపోషణకం వ్రతమ్ ॥ 6**

**ప్ర :** కుకర్మ = చెట్టపనులు చేయుటయందు, లజ్జా = సిగ్గుపడుటయే, హ్రీః = హ్రీ యనబడునది; వేదోక్తకర్మసు = వేదవిహితకర్మలందు, శ్రద్ధా = ఆసక్తియే, బుద్ధిః = వివేకము; విధివత్ = శాస్త్రోక్తముగా, విష్ణుపర్వ+ఏకాదశీ = విష్ణుదేవుని పవిత్రకాలమైన ఏకాదశినాడు, ఉపోషణకమ్ = నిరాహారముగ విష్ణువు నుపాసించుట అనునది, వ్రతమ్ = వ్రతమనబడును.

**తా :** చెడ్డపనులకు దూరముగ నుండుట **హ్రీ** లేక సిగ్గు; వేదకర్మలలో ఆసక్తియే **బుద్ధి** లేక వివేకము; ఏకాదశి వంటి తిథులను పుణ్యదినములుగ పరిగణించి నిరాహారముగ విష్ణువును-పాసించుటయే **వ్రతము.**

**శ్లో॥ వేదావిరుద్ధగుర్వాప్తమన్త్రాభ్యాసో జపస్త్రిధా ।**
**వాచికోఽసన్మానసః సన్ రహస్యో మధ్యమో జపః ॥ 7**

**ప్ర :** వేద+అవిరుద్ధ = వేదమునకు విరుద్ధము కానిది, గురు+ఆప్త = గురువునుండి పొందబడిన, మన్త్ర+అభ్యాసః = మంత్రమును అభ్యసించుట అనునది, జపః = జపము అనబడునది, అది, త్రిధా =మూడు విధములు; వాచికః = ఇతరులకు వినబడునట్లు పలుకబడిన జపవిధానము, అసత్ = అధమఫలము నిచ్చునది; మానసః = మనస్సులోనే మౌనముగ చేయు జపము, సన్ = ఉత్తమఫలమిచ్చునది; రహస్యః = మంత్రము స్పష్టముగ వినరాకుండ అస్పష్టముగ ఉచ్చరించునది, మధ్యమః జపః = మధ్యమ ఫలమిచ్చు జపము.

**తా :** గురువునుండి ఉపదేశము పొందిన వేదవిరుద్ధము కాని మంత్రమును జపించుట మూడు విధములు : బిగ్గరగా అందరకూ వినబడునట్లు జపించటం అధమ పద్ధతి. దీని ఫలము గూడ అధమమే. పెదవుల కదలికయైన లేకుండ మనసులో జపించుట ఉత్తమపద్ధతి. ఫలము గూడ ఉత్తమమే. పెదవులు కదలించుచు మంత్రము నస్పష్టముగ ఉచ్చరించుచు రహస్యము జెప్పుచున్నట్లు జపించుట మధ్యస్థం, ఫలమున్నూ.

**శ్లో॥ దశైతే నియమా అష్టాసనాని స్వస్తికం త్విదమ్ ।**
**జానూర్వన్తః పదౌ కృత్వా సమాఙ్గేనోపవేశనమ్ ॥ 8**

**ప్ర :** ఏతే దశ = ఈ పదియును, నియమాః = నియమములు; ఆసనాని = ఆసనములు, అష్ట = ఎనిమిది, ఇదమ్ = ఇది, స్వస్తికమ్ = స్వస్తికాసనము, జాను+ఊరు+అన్తః = మోకాళ్ళ

తొడలు మధ్య, పదౌ కృత్వా = పాదాగ్రములనుంచి, సమ+అంగేన = శరీరము సమముగ నుండునట్లు, ఉపవేశనమ్ = కూర్చుండుట.

**తా :** ఈ పై శ్లోకములలో చెప్పబడిన పదియును నియమములనబడును. ఆసనములు ఎనిమిది విధములు. మోకాళ్ళకు తొడలకు మధ్య పాదాగ్రముల నుంచి, శరీరము నిటారుగ నుండునట్లు కూర్చుండుటకు **స్వస్తికాసన** మని పేరు.

**శ్లో॥ గోముఖం దక్షగుల్ఫోఽన్యపృష్ఠపార్శ్వే పరోఽన్యథా ।**
**స్వాన్యోరుపాదవిన్యాసాద్వీరాఖ్యం చాథ పద్మకమ్ ॥ 9**

**ప్ర :** దక్షగుల్ఫః = కుడిపాదపు చీలమండను, అన్యపృష్ఠపార్శ్వే = రెండవదైన ఎడమ పాదపు మడమ ప్రక్కన, పరః = రెండవదానిని, అన్యథా = మొదటిదాని పార్శ్వమున, (ఉంచినచో) గోముఖమ్ = **గోముఖాసన**మేర్పడును; స్వాని = తమవైన, కుడి ఎడమ, ఊరు = తొడల సన్నిధిలో, పాదవిన్యాసాత్ = పాదముల నుంచుటవలన, వీర+ఆఖ్యమ్ = **వీరాసనము** అనబడునది; అథ చ = అటుపైనను, పద్మకమ్ = పద్మాసనము.

**తా :** కుడి చీలమండను ఎడమపాదము ప్రక్కన, ఎడమదానిని కుడిదాని ప్రక్కన ఉంచినచో అది **గోముఖాసన** మగును. కుడి ఎడమ తొడల సన్నిధిలో ఎడమ కుడి పాదముల నుంచుట **వీరాసన** మనబడును. ఇక **పద్మాసన** విధానము:

**శ్లో॥ పృష్ఠతో వ్యస్తపాణిభ్యాం వ్యస్తోరుస్థాంఘ్రిధారణమ్ ।**
**అన్యోన్యగుల్ఫయోగేన జానుస్థకరపల్లవైః ॥ 10**

**ప్ర :** పృష్ఠతః = వెనుకనుండి, వ్యస్తపాణిభ్యామ్ = చాచిన రెండు చేతులతో, ఊరుస్థామ్ = తొడలపై, వ్యస్త = ఉంచబడిన, అంఘ్రి = పాదములను, ధారణమ్ = పట్టుకొనుట; అన్య+అన్య గుల్ఫ = ఒండొరులు కలసిన చీలమండలు, జానుస్థ = మోకాళ్ళపైనున్న, కరపల్లవైః = చేతులతో, యోగేన = కలయుటచేత (పద్మాసనము).

**తా :** పై శ్లోకముతో అన్వయమున, పద్మాసన విధానము : వెనుకకు చాచిన రెండు చేతులతో తొడలపై పెట్టబడియున్న పాదములను పట్టుకొని, మోకాళ్ళపై నున్న చేతులతో పెనసిన పాదాగ్రములను కలుపుట పద్మాసనము.

**శ్లో॥ సింహాసనం వ్యాత్తవక్త్రం పూజ్యం నాసాగ్రదృష్టికమ్ ।**
**యోనిమేఢ్రోర్ధ్వస్థగుల్ఫం సిద్ధం భ్రూమధ్యదృగ్వరమ్ ॥ 11**

**ప్ర :** వ్యాత్తవక్త్రమ్ = తెరువబడిన నోరు, నాసా+అగ్ర దృష్టికమ్ = ముక్కుచివర నిలుపబడిన దృష్టి గలది, పూజ్యమ్ = గౌరవనీయమైనది, సింహాసనమ్ = సింహాసనము; యోని మేఢ్ర+ఊర్ధ్వస్థ = బీర్జములకు క్రిందుగ రెండంగుళములు స్థానమున నొకటియు, లింగమునకు పైభాగమున

వేరొకటియు, గుల్ఫమ్ = రెండు చీలమండలను లేక మడమలను (నిల్పి), భ్రూమధ్య = రెండు కనుబొమల మధ్య, దృక్+వరం = దృష్టిని (నిల్పుట), సిద్ధమ్ = సిద్ధాసనము.

**తా :** నోరు తెరచి, దృష్టిని నాసాగ్రమున నిలిపి యుంచిన, అది **సింహాసనము.** బీర్జములకు క్రిందుగ యోనిదేశమున ఒక కాలి మడమను, లింగమునకు పైగా వేరొక మడమను ఉంచి, కనుబొమల నడుమ దృష్టిని కేంద్రీకరించుట **సిద్ధాసనము.**

**శ్లో॥ మాయూరం దండవద్వ్యోమ్ని భూహస్తం నాభికూర్పరమ్ ।**
**భద్రం స్యాత్సీవనీపార్శ్వయుక్కరాత్తాంఘ్రిగుల్ఫకమ్ ॥ 12**

**ప్ర :** భూహస్తమ్ = చేతులను భూమిపై నాన్చి, నాభికూర్పరమ్ = బొడ్డును తాకుచున్న మోచేతులతో, దండవత్ = కర్రవలె, వ్యోమ్ని = గాలిలో శరీరమును నిల్పిన, మాయూరమ్ = మయూరాసన మగును; సీవనీపార్శ్వయుక్ = శిశ్నముపై చర్మమునకు ప్రక్కన తగిలియున్న, కర+ఆత్త = చేతితో పట్టుకొనిన, అంఘ్రి = పాదముయొక్క, గుల్ఫకమ్ = మడమగలది, **భద్రమ్** = భద్రాసనము, స్యాత్ = అగును.

**తా :** భూమిపై చేతుల నాన్చి, మోచేతులు బొడ్డును తాకునట్లుంచి, శరీరమును కర్రవలె నిటారుగా గాలిలో నిల్పినచో, అది **మయూరాసన** మగును. లింగమును తాకుచున్న పాదము మడమను వెనుక నుండి చాచిన చేతులతో పట్టుకొని యున్నచో, అది **భద్రాసనము.** *

**శ్లో॥ స్యాదాసనజయాత్సర్వజయోऽశక్తౌ శవాసనమ్ ।**
**సార్ధత్రిహస్తో దేహోऽయం గుదమేఢ్రాన్తమధ్యకః ॥ 13**

**ప్ర :** అశక్తౌ = కదలిక లేకుండుటయందు, శవాసనమ్ = శవాసనము; అయం దేహః = ఈ శరీరము, సార్ధత్రిహస్తః = మూడున్నర హస్తములు అనగా మోచేతి నుండి మధ్యవేలి వరకు గల కొలత (18 అంగుళములు లేక 24 అంగుళులు) ఒక హస్తముగా 63 అంగుళముల పరిమాణము గలది, గుదమేఢ్ర+అన్తమధ్యకః = గుదమునుండి మేఢ్రమూలమువరకు గల ప్రదేశము మధ్యభాగమైనది; ఆసనజయాత్ = సుఖాసనమున దీర్ఘకాలముండుటవలన, సర్వజయః = అంతయు జయము, స్యాత్ = అగును.

**తా :** దేహమును కదలిక లేకుండుట యుంచుట **శవాసనము.** ఈ దేహము మూడున్నర హస్తముల ప్రమాణము. దీనికి గుదము లింగము మధ్యభాగమే కేంద్రకము. ఆసనమున దీర్ఘకాలము సుఖముగ నుండుటను సాధించిన వానికి ఇక ఆ పై ప్రయత్నమంతయు విజయవంతమే అగును.

**శ్లో॥ తతో నవాఙ్గులం కన్ద ఆనాభేరుద్గతా అతః ।**
**ద్వాసప్తతిసహస్రాణి ముఖ్యా నాడ్యశ్చతుర్దశ ॥ 14**

**ప్ర :** తతః = అటనుండి, నవ+అంగులమ్ = తొమ్మిదంగుళములు, ఆనాభేః+ఉద్గతా = బొడ్డు

పర్యంతముపైన, కన్దః = బొడ్డుత్రాడు, అతః = అటనుండి, ద్వాసప్తతిసహస్రాణి = డెబ్బది రెండు వేలు, ముఖ్యాః =ముఖ్యమైన, నాడ్యః = నాడులు, చతుర్దశ =పదియు నాలుగు.

**తా :** పై శ్లోకమున చెప్పబడిన గుదమేఢ్ర మధ్యప్రదేశమునుండి తొమ్మిదంగులములు నాభిపర్యంతము పైకి బొడ్డుత్రాడు (కంద); అక్కడనుండి డెబ్బదిరెండువేలు నాడులు. అందు ముఖ్యమైనవి పదునాలుగు.

**శ్లో॥ ఏతాసాముత్తమాస్తిస్ర ఆసామేకాప్యనుత్తమా ।**
**పిఙ్గలా దక్షనాసాన్తా సూర్యేశా దినసంజ్ఞితా ॥ 15**

**ప్ర :** ఏతాసామ్ = వానిలో, ఉత్తమాః = ఉత్తమ నాడులు, తిస్ర = మూడు, ఆసాం అపి = ఆ మూడిటిలో కూడ, ఏకా = ఒకటి, అనుత్తమా = సర్వోత్తమము, దక్షనాసాన్తా = కుడి ముక్కుపుటము వరకు గల, దినసంజ్ఞితా = దినము అను సంజ్ఞగల, సూర్య+ఈశా = సూర్యుడు అధిష్ఠాన దేవతయైన, పింగలా = పింగళ యను పేరుగల నాడి.

**తా :** ఆ పదునాలుగు నాడులలో ఉత్తమములు మూడు. ఆ మూడిటిలో గూడ, ఒకటి సర్వోత్తమము. అది కుడిముక్కుపుటము వరకు వ్యాప్తమైనది. దానికి **దినము** అని సంకేతనామము. దాని కధిష్ఠానదేవత సూర్యుడు. ఈ నాడి పేరు **పింగళ**.

**శ్లో॥ ఇడాపి వామనాసాన్తా నిట్సంజ్ఞా చన్ద్రపా సుఖా ।**
**సుషుమ్నా బ్రహ్మరంధ్రాన్తా కాలభోక్త్ర్యమృతత్వదా ॥ 16**

**ప్ర :** ఇడా+అపి = ఇడా యను నాడి కూడ, వామనాసాన్తా = ఎడమముక్కుపుటమువరకు వ్యాపించిన, నిట్ సంజ్ఞా = రాత్రి సంకేతమైన, చంద్రపా = చంద్రుడు అధిష్ఠానదేవతగా గల, సుఖా = సుఖమిచ్చునాడి; బ్రహ్మరంధ్రాన్తా = బ్రహ్మరంధ్రమువరకు గల, సుషుమ్నా = సుషుమ్నా యను నాడి, కాలభోక్త్రీ = కాలమును భోగించు (భుజించు), అమృతత్వదా = అమరత్వము నిచ్చునది.

**తా :** ఎడమముక్కుపుటమువరకు వ్యాపించి యున్న నాడి **ఇడా**. దీనికి సంకేతము **రాత్రి**, అధిష్ఠానదేవత చంద్రుడు. ఇది సుఖదము. బ్రహ్మరంధ్రము వరకు వ్యాపించియున్న నాడి పేరు **సుషుమ్నా**. ఇది రేబవళ్ళ సంకేతరూపమైన కాలమును భోగించునది లేక భుజించునది. కావున ఈ నాడి అమృతత్వమును ప్రసాదించునది. *

**శ్లో॥ తన్మూలే కుటిలా శక్తిర్మోక్షవిఘ్నప్రదాఽసతామ్ ।**
**నాభ్యూర్ధ్వం ప్రాణోఽధోఽపానః సమానో నాభిమణ్డలే ॥ 17**

**ప్ర :** తత్+మూలే = సుషుమ్నానాడియొక్క పాదులో, అసతామ్ = అభ్యాసములేని వారికి, మోక్షవిఘ్నప్రదా = మోక్షసాధనలో విఘ్నమును కలిగించు, కుటిలా–శక్తిః = కుండలినీశక్తి

(యున్నది), నాభి+ఊర్ధ్వమ్ = బొడ్డు పైగా, ప్రాణః = ప్రాణవాయువు, అధః = క్రిందుగా, అపానః = అపానవాయువు, నాభిమండలే = బొడ్డు పరిసరములందు, సమానః = సమాన వాయువు,

**శ్లో॥ చరత్యుదానః కణ్ఠే చ వ్యానః సర్వశరీరగః ।**
**త్వగాదిషు చ నాగాద్యాస్త్ర్యస్రోఽగ్నిర్నాభిమధ్యగః ॥ 18**

**ప్ర :** కంఠే చ = కంఠభాగమున నేమో, ఉదానః = ఉదానవాయువు, సర్వశరీరగః = శరీరమంతట వ్యాపించి, వ్యానః = వ్యానమనబడు వాయువు, త్వక్+ఆదిషు చ = చర్మము మొదలగు వానియందు, నాగ+ఆద్యాః = నాగము మొదలుగా గల వాయువులు, త్రి+అస్రః = త్రిభుజాకారముగల, అగ్నిః = అగ్ని, నాభిమధ్యగః = నాభిమధ్యకేంద్రమున, చరతి = ఉన్నవి.

**తా :** సుషుమ్ణా నాడి పాదులో కుండలినీశక్తి చుట్టగా చుట్టుకొని యున్నది. ఈ శక్తి మోక్షమును కోరు వారికి, అభ్యాసము లోపించినందువలన, విఘ్నకారకమగును. నాభికి పైపైన ప్రాణవాయువు, కంఠభాగమున ఉదానవాయువు, శరీరమంతటను వ్యాపించి వ్యానవాయువు అను యీ పంచప్రాణములు కాక, చర్మము మొదలగు అవయవములలో, అనగా రక్తము, మాంసము, ఎముక, శిరలు అనబడు రక్తనాళములలో నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము అనబడు ఉపప్రాణములును చరించుచుండును. నాభీకేంద్రమున త్రిభుజాకారముగా అగ్ని యున్నది. *

**శ్లో॥ నృణాం వృత్తో విహఙ్గానాం చతురస్రచతుష్పదమ్ ।**
**కృత్వాగ్నేరూర్ధ్వమమ్భోఽన్నం ప్రాణోఽధస్థో ధమత్యముమ్ ॥ 19**

**ప్ర :** నృణామ్ = నరులకు, విహంగానాం వృత్తః = పక్షులయొక్క వర్తనము, చతురస్రః చతుష్పదమ్ = సమముగా నాలుగు పాదములు గలది, కృత్వా = చేసి, అగ్నేః ఊర్ధ్వమ్ = నాభీమధ్య త్రికోణాగ్నికి పైగా, అంభః = నీరు, అన్నమ్ = అన్నం, అధస్థః = క్రిందుగా, ప్రాణః = ప్రాణవాయువు, అముమ్ = దానిని, ధమతి = ఊదును, జ్వలింపజేయును.

**తా :** నాలుగు పాదములు సమముగా చేసి పక్షులకువలె ఊర్ధ్వగమనముతో నాభీ మధ్యగత త్రికోణాగ్నికి పైగా అన్నము నీరు ఉండగా, క్రిందనుండి ప్రాణవాయువు దానిని ప్రజ్వలింపజేయుచు ఊదును. ఇది జఠరాగ్ని అన్నమును పచనము చేయు విధానము. *

**శ్లో॥ స దీప్తోఽన్నం పచేదఙ్గే వ్యానం సారస్య యచ్ఛతి ।**
**నిఃశ్వాసోచ్ఛ్వాసకృత్ప్రాణోఽపానో విణ్మూత్రహాపకః ॥ 20**

**ప్ర :** సః = ఆ జఠరాగ్ని, దీప్తః = రగిలినదై, అన్నమ్ = అన్నమును, అంగే = దేహమున, పచేత్ = పక్వము చేయును; వ్యానమ్ = వ్యానము అను వాయువు, సారస్య = ఆ పక్వాన్నసారమును, యచ్ఛతి = సర్వాంగములకు చేర్చును; నిఃశ్వాస = బైటకు వదలు గాలి, ఉత్+శ్వాస = లోపలకు

పీల్చు గాలి, వీనిచే, కృత్ = చేయబడినది, ప్రాణః = ప్రాణము, విణ్+మూత్రహాపకః = మూత్రాది విసర్జనక్రియలో తోడ్పడునది, అపానః = అపానవాయువు.

**తా :** జఠరాగ్ని రగిలి అన్నమును పచనము చేయగా, వ్యానము అనబడు వాయువు ఆ పక్వాన్న సారమును సర్వాంగములకు చేర్చును. శ్వాసరూపమున శరీరము లోనికి బైటకు ప్రసరించు చుండునది ప్రాణవాయువు. శరీరము నందలి విసర్జనములను బైటకు నెట్టివేయునది అపాన వాయువు.

**శ్లో॥ ఉదానోఽఙ్గోన్నయనకృత్సమానః శోషణాదికృత్ ।**
**తథోద్గారోన్మీలనక్షుత్తన్ద్రావ్యాప్తికరాః పరే ॥ 21**

**ప్ర :** ఉదానః = ఉదానవాయువు, అంగ+ఉత్+నయనకృత్ = వాక్కు మొదలైన వానిని శరీరములో పైకి వ్యాపించునట్లు ఎగద్రోయు వాయువు; సమానః = సమాన వాయువు, శోషణ+ఆది కృత్ = లోపలకు పీల్చుట మొదలగు క్రియలు, ఉన్మీలన = విప్పారుట, క్షుత్ = తుమ్ముట, తన్ద్రా = అలసటతో ఆవులించుట, వ్యాప్తి = శరీరమును సమోష్ణముగ, కరాః = చేయు వాయువులు, పరే = ఇతర నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ వాయువులు.

**తా : ఉదానవాయువు** వాక్కు మొదలగు వానిని శరీరమున పైకి వ్యాపించునట్లు ఎగద్రోయునది; **సమానవాయువు** లోపలకు పీల్చుట వాంతులు మొదలగువానియందుపకరించగా, **కూర్మ**మను వాయువు కనుఱెప్పలు మూయుట తెఱచుట చేయుట కుపకరించును; **కృకర**మను వాయువు తుమ్ముటలోను, **దేవదత్త**మను వాయువు ఆవులించుటకును, **ధనంజయ**మను వాయువు శరీరమును తగినంత ఉష్ణముగా సమముగా ఉంచుటకు సహకరించును.

**శ్లో॥ చలే ప్రాణే చలం చిత్తం నిశ్చలే నిశ్చలం తయోః ।**
**నష్ట ఏకతరే నాశో ద్వయోరపి స యోగతః ॥ 22**

**ప్ర :** చలే ప్రాణే = ప్రాణవాయువు (శ్వాస) సాగుచుండగా, చలం చిత్తమ్ = మనస్సు చంచలముగ నిలుకడ లేనిదిగా (నుండును); తయోః = ఉచ్ఛ్వాసనిఃశ్వాసలు, నిశ్చలే = నిలిచిపోగా, నిశ్చలమ్ = మనస్సు కదలక నిలచును; యోగతః = యోగమువలన, సః = ఆ శ్వాసప్రక్రియ, ఏకతరే = ఉచ్ఛ్వాసగాని నిఃశ్వాసగాని రెండింటికిని, నాశః = నశింపు కలుగును.

**తా :** ఉచ్ఛ్వాసనిఃశ్వాసలు శరీరంలో సాగుచుండగా, మనస్సు చంచలంగా ఉంటుంది; అవి నిల్చిపోతే మనస్సు నిశ్చలమవుతుంది. ఈ రెండు శ్వాసలలో యే ఒక్కటి ఆగిపోయిననూ, రెండున్నూ ఆగిపోవును. ఈ ప్రక్రియ యోగంలో సాధించవచ్చు. *

**శ్లో॥ న జ్ఞానం జీవతి ప్రాణే మనస్యపి లయం నయేత్ ।**
**ద్వయం గచ్ఛతి మోక్షం స యోగీ నాన్యః కథఞ్చన ॥ 23**

**ప్ర :** ప్రాణే = ప్రాణమునందు, జ్ఞానమ్ = జ్ఞానము (చేతన), న జీవతి = క్రియాశీలము కాదు; మనసి అపి = మనస్సునందు కూడ, లయం నయేత్ = (జ్ఞానము) నిష్క్రియమై నశించును; ద్వయమ్ = ప్రాణము, మనస్సు, రెండును, మోక్షం గచ్ఛతి = మోక్షమును పొందును; సః = ఈ స్థితిని సాధించినవాడు, యోగీ = యోగియే, కథంచన = యే విధముననను, న అన్యః = యోగి కానివాడు కాడు.

**తా :** ప్రాణమున జ్ఞానము, గుర్తింపు కొనసాగదు. మనస్సునందు కూడా జ్ఞానము అణగిపోవును. మనఃప్రాణములు రెండును మోక్షము నొందును. దీనిని సాధించినవాడే **యోగి** యనబడును. మరెట్లయినను యోగి కానివాడు దీనిని సాధించలేడు; దీనిని సాధించనివాడు యోగియు కాలేడు.

**శ్లో॥ నాత్యశ్నతోఽనశ్నతోఽపి సుప్తస్యైష న జాగ్రతః ।**
**యుక్తచేష్టాహారనిద్రాగతేర్యోగో భవేత్సుఖః ॥ 24**

**ప్ర :** అతి+అశ్నతః = అధికముగా ఆహారమును తీసికొనుట వలన, అనశ్నతః అపి = ఆహారమును తీసికొనకుండుటవలన గూడ, న = కాదు, సుప్తస్య = నిద్రాళువునకు, ఏషః = ఈ యోగము, న = కాదు; జాగ్రతః= మెలకువ గలిగిన వాడై, యుక్త = తగిన, చేష్టా = కార్యములు, ఆహార = ఆహారస్వీకారము, నిద్రా = నిద్ర, వీనిని, గతేః = కలిగియున్న వానికి, యోగః = యోగము, సుఖః = సుఖము, భవేత్ = అగును.

**తా :** మితమెఱుగని తిండిపోతునకు, పూర్తిగా నిరాహారియైన వానికి, నిద్రాళువునకు ఈ యోగము పొసగదు. జాగరూకుడై తగినంత ఆహారము తీసికొనుచు, (అనగా కుక్షిలో సగభాగమును అన్నముతోను, ఒక నాల్గవ భాగమును నీటితోను, మరియొక నాల్గవ భాగమును గాలితోను నింపునది యుక్తాహారము), తగుమాత్రపు నిద్రతోను, తగిన చేష్టలతోను (సద్విషయ శ్రవణ పఠన మననాదులతో) ప్రవర్తించువాడు యోగమును సుఖముగ సాధించును.

**శ్లో॥ క్షారామ్లతిక్తకటురూక్షకదన్నశాక-**
**స్త్ర్యగ్న్యధ్వభాజ్ న లభతేఽకుశలోఽస్య సిద్ధమ్ ।**
**శుణ్ఠీసితాసుమనశాలిసదన్నముద్గ-**
**చక్షుష్యశాకఘృతదుగ్ధసదమ్బు పథ్యమ్ ॥ 25**

**ప్ర :** క్షార = ఉప్పు, ఆమ్ల = పులుపు, తిక్త = చేదు, కటు = కారము, రూక్ష = ఒగరు, కదన్న = పాసిన అన్నము, శాక = పాడైన కూర, స్త్రీ+అగ్ని+అధ్వభాక్ = మైథునమున వీర్యస్ఖలనమైన వాడు, అకుశలః = అభ్యాసము తెలియని వాడు, అస్య = యోగముయొక్క, సిద్ధిమ్ = సిద్ధిని, న లభతే = పొందడు; శుంఠీ = సొంటి, సితా = చక్కెర, సుమన = గోధుమ, శాలి = వరి, సదన్న = నివ్వరి, యవలు, చామలు మొదలగు ధాన్యముల అన్నము, ముద్గ = పెసలు, చక్షుష్యశాక = హితవైన కూరలు, ఘృత = నెయ్యి, దుగ్ధ = పాలు, సదంబు = మంచి నీరు, ఇవి, పథ్యమ్ = ఆరోగ్యకరమైన ఆహారము.

**తా :** ఉప్పు. పులుపు, చేదు, కారము, ఒగరు రుచులు గల ఆహారమున్నూ, పాసిన అన్నము కూరలున్నూ, మైథున ప్రియత్వమున్నూ కలిగి, అభ్యాసకుశలుడు కాని వానికి యోగము సిద్ధించదు. యోగ సిద్ధిని పొందగోరువాని ఆహారమున సొంటి, చేక్కెర, గోదుమ, వరి, నివ్వరి, యవలు, చేమలు ఇత్యాది ధాన్యముల అన్నము, పెసరపప్పు, హితవైన కూరలు, నెయ్యి, పాలు, మంచినీరు, ఇవి ఉపయోగించవలె. ఇవి ఆరోగ్యకరము.

**శ్లో॥ దైవీసమ్పత్స్వధర్మస్థో నిశ్చిన్తో గురుసేవకః ।**
**సద్దేశే మఠికామధ్యే రక్షితే నిరుపద్రవే ॥ 26**

**శ్లో॥ భక్త్యేష్టదేవం నత్వాఽఽదౌ సూపవిష్టః సుదిఙ్ముఖః ।**
**కుశాజినాంశుకేష్వేవ ప్రాణాయామాన్ సమభ్యసేత్ ॥ 27**

**ప్ర :** దైవీసంపత్ = దైవీసంపదతో గూడి, స్వధర్మస్థః = స్వధర్మపాలనచేయువాడై, నిశ్చిన్తః = యే విచారము లేనివాడై, గురుసేవకః = గురువును సేవించువాడై, సత్+దేశే = సమతలప్రదేశమున, మఠికామధ్యే = చిన్నకుటీరమధ్యమున, రక్షితే నిరుపద్రవే = యే భయంకర విషయములు లేని నిర్జనప్రదేశమున, భక్త్యా = భక్తితో, ఇష్టదేవమ్ = ఇష్టదేవతను, ఆదౌ = మొదట, నత్వా = నమస్కరించి, సు+ఉపవిష్టః = సుఖాసనమున కూర్చుండి, సుదిఙ్ముఖః = తూరుపు దిక్కును చూచుచు, కుశ = దర్భాసనమున, అజిన = చర్మము, అంశుకేషు ఏవ = వస్త్రములపైన మాత్రమే, ప్రాణాయామాన్ = ప్రాణాయామములను, సమభ్యసేత్ = చక్కగా సాధన చేయవలెను.

**తా :** శమము, దమము, తితిక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము అను ఈ యారు దైవీగుణములతో గూడి, తనదైన వర్ణాశ్రమధర్మములను పాలించుచు, చింతలేనివాడై, గురువును సేవించువాడై, ప్రశాంతమైన పరిసరములలో యేర్పరచుకొనిన చిన్నికుటీరమున, సమతలప్రదేశమున దర్భలను పరచి దానిపై జంతుచర్మమును వస్త్రమును పరచి, ఆ ఆసనముపై తూరుపుదిక్కుగా మరలి సుఖాసీనుడై, తన ఇష్టదేవతను తొలుత నమస్కరించి, పూరక కుంభక రేచకములను మూడు విధములైన ప్రాణాయామప్రక్రియలను అభ్యసించవలెను. *

**శ్లో॥ చాన్ద్రేణాపూర్య వాయుం షట్దశమాత్రం హనుం హృది ।**
**కృత్వా చతుఃషష్టిమాత్రం కుమ్భయిత్వా విరేచయేత్ ॥ 28**

**శ్లో॥ శనైః కుంభార్ధకాలేన పశ్చాదాకర్షితోదరః ।**
**త్యజేత్సూర్యేణాథ తేన పీత్వాన్యేన తథా పునః ॥ 29**

**ప్ర :** వాయుమ్ = గాలిని, షట్దశమాత్రమ్ = పదునారుమాత్రల కాలము, చంద్రేణ = ఎడమ ముక్కుపుటముతో, ఆపూర్య = నింపి (పీల్చి), హనుమ్ = ఆ అగ్నిప్రేరకవాయువును, హృది కృత్వా = హృదయమున నుంచి, చతుఃషష్టిమాత్రమ్ = అరువది నాలుగు మాత్రల కాలము,

కుంభయిత్వా = వదలక పూరించి యుంచి, శనైః = మెల్లగా, కుంభార్ధకాలేన = కుంభించి యుంచిన అరువది నాలుగు మాత్రలలో సగమైన ముప్పదిరెండు మాత్రల కాలమున, పశ్చాత్ = ఆ తరువాత, ఆకర్షిత+ఉదరః = కడుపును లోనికి లాగి పట్టినవాడై, సూర్యేణ = కుడిముక్కుపుటము నుండి, విరేచయేత్ = వదలవలెను; అథ = ఆ తరువాత, తేన = ఆ కుడిముక్కుపుటము నుండి, పీత్వా = గాలిని పీల్చి, పునః = మరల, తథా = అట్లే, అన్యేన = రెండవదానితో, త్యజేత్ = విడువవలెను.

**తా :** ఎడమముక్కునుండి పదునారు క్షణముల కాలము ప్రాణవాయువును హృదయము నిండ పీల్చి, అరువది నాలుగు క్షణముల కాలము అట్టే పట్టియుంచి, ముప్పది రెండు క్షణముల కాలములో మెల్లగా ఆ గాలిని కుడిముక్కునుండి వదలవలెను. అట్లే మరల కుడిముక్కుతో పీల్చి, పట్టియుంచి, మరల మెల్లగా ఎడమముక్కుతో వదలవలెను. ఇట్లు పూరక, కుంభక, రేచకములు అనబడు మూడు ప్రాణాయామక్రియలు సాధన చేయవలెను. *

**శ్లో॥ పఞ్చర్ద్ధ్యాహన్యహన్యశీత్యన్తైస్త్రిసన్ధ్యమసుయామకైః ।**
**త్రిమాసోర్ధ్వం ప్రాణజయః సిద్ధ్యేత్కేవలకుమ్భకః ॥ 30**

**ప్ర :** పంచర్ద్ధ్యా = అయిదు అయిదుగా పెంచుతూ, అహని అహని = దినదినము, అశీతి+అన్తైః = ఎనుబది పర్యంతము, త్రిసంధ్యమ్ = ఉదయ, మధ్యాహ్న, సాయం సంధ్యలలో, అసుయామకైః = ప్రాణాయామములతో, త్రిమాస+ఊర్ధ్వమ్ = మూడు మాసములకు పైబడిన కాలములో, కేవలకుంభకః = కుంభకక్రియ యొక్కటి, ప్రాణజయః = ప్రాణమును వశము జేసికొనుట, సిద్ధ్యేత్ = సిద్ధించును.

**తా :** ప్రతిదినము అయిదయిదు క్షణముల వ్యవధిని పెంచుకొనుచు ఎనుబది క్షణముల పర్యంతము ఉదయ, మధ్యాహ్న, సాయంకాల సంధ్యల మూడిటను ప్రాణాయామక్రియలను మూడు మాసములకు పైబడిన కాలము సాధన చేసినచో **కుంభకప్రక్రియ** యొక్కటి వశమగును.

**శ్లో॥ ధ్యేయోఽత్ర తారో హృదీక్ష్యం భ్రూమధ్యే చేన్దుమణ్డలమ్ ।**
**దార్ఢ్యా లాఘవాయాఙ్గముత్థస్వేదేన మర్దయేత్ ॥ 31**

**ప్ర :** అత్ర = కుంభకక్రియలో, తారః = ప్రణవము, హృది+ఈక్ష్యమ్ = హృదయములో చూడదగినదై, ధ్యేయః = ధ్యానించదగినది; చ = మరియును, భ్రూమధ్యే = కనుబొమల నడుమ, ఇందుమండలమ్ = చంద్రమండలము, (ఈక్ష్యం = చూడదగినది). దార్ఢ్యాయ = దేహపటుత్వమునకై, లాఘవాయ = లఘుత్వమునకై, అంగమ్ = శరీరమును, ఉత్థ = బైటకు వచ్చిన, స్వేదేన = చెమటతో, మర్దయేత్ = మర్దించవలెను.

**తా :** ఈ కుంభక క్రియలో హృదయములో సాధకుడు ప్రణవమును దర్శించవలెను, భ్రూమధ్యమున చంద్రమండలమును దర్శించవలెను. దేహము లావెక్కకుండ నుండుటకును, బలముగ

నుండుటకును, సాధకుని శరీరమునుండి స్రవించిన చెమటను ఆ శరీరమునందే ఇంకిపోవునట్లు మర్దన చేయవలెను. *

**శ్లో॥ శుద్ధ్యై క్రియాశ్చిత్రకుమ్భాః సిద్ధ్యై ముద్రాశ్చ కీర్తితాః ।**
**ప్రాణాయామైరుభే తేపి సాధ్య ఆరోగ్యమప్యుత ॥ 32**

ప్ర : శుద్ధ్యై = దేహము కఫవాతపిత్తవిపరిణామములనుండి శుద్ధి యగుటకై, క్రియాః = ధౌతి మొదలగు క్రియలు, చిత్రకుంభాః = అష్టవిధ కుంభకప్రక్రియలు, సిద్ధ్యై = సిద్ధి లభించుటకై, ముద్రాః చ = త్రిఖండా, సర్వసంక్షోభిణీ, సర్వాకర్షిణీ, సర్వఖేచరీ ఇత్యాది దశముద్రలు, కీర్తితాః = ప్రశంసించబడినవి, ఉభే తేఽపి = శుద్ధి, సిద్ధి అను రెండును, ప్రాణాయామైః = మూడు ప్రాణాయామప్రక్రియలచేత, ఉత = మరియు, ఆరోగ్యం అపి = ఆరోగ్యము కూడ, సాధ్యః = సాధింపనగును.

**తా :** శరీరమున గల కఫము, వాతము, పిత్తము ఇత్యాది తత్త్వముల ప్రకోపము కలుగకుండి శుద్ధిని సాధించుటకు సాధనలుగా ధౌతి మొదలగు క్రియలు, వివిధరీతుల కుంభకములు చెప్పబడినవి. ప్రాణాయామమువలన మంచి ఆరోగ్యము కలుగును. ప్రాణాయామమువలన శుద్ధి, సిద్ధి రెండును కలుగుటకై దశముద్రలు కూడ సాధనలో ముఖ్యములని ప్రశంసింపబడినవి.

**శ్లో॥ సమాసీనో యతాస్యోఽన్తః ప్రాణం దక్షిణయా త్యజేత్ ।**
**సారం లగతి హృత్కణ్ఠకపోలావధ్యసౌ యథా ॥ 33**

ప్ర : సమాసీనః = సుఖాసనమున గూర్చున్నవాడై, యత+ఆస్యః = నోటిని మూసియుంచిన వాడై, అన్తః ప్రాణమ్ = లోనున్న, ఊపిరిని, దక్షిణయా = కుడిముక్కుపుటముచేత, త్యజేత్ = విడువవలెను, యథా = యే విధముగా, అసౌ = ఆ వాయువు, హృత్ కంఠ కపోల+అవధి = హృదయము, కంఠము, కపోలముల వరకు, సారమ్ = శబ్దముతో, లగతి = వచ్చి చేరునో (తథా = అట్లు).

**తా :** సుఖాసనమున కూర్చుండి, నోరు మూసియుంచి, లోనున్న ఊపిరిని కుడి ముక్కుద్వారా విడువవలెను. ఈ క్రమములో ఆ వాయువును హృదయము, కంఠము, కపోలముల నిండుగా సశబ్దముగా పూరించవలెను.

**శ్లో॥ లోహకారస్య భస్త్రావచ్ఛక్త్యాశ్వాపూర్య రేచయేత్ ।**
**వామాం మధ్యానామికాభ్యాం ధృత్వా జాతే శ్రమే విధేః ॥ 34**

ప్ర : లోహకారస్య = కమ్మరివాని, భస్త్రావత్ = కొలిమితిత్తిని వలె, శక్త్యా = బలముగా, ఆశు = త్వరత్వరగా, ఆపూర్య = నిండించి, రేచయేత్ = విడువవలెను; వామామ్ = ఎడమ ముక్కుపుటమును, మధ్య+అనామికాభ్యామ్ = నడిమి వేలు, ఉంగరపు వేలు, ఈ రెండిటితో, ధృత్వా = నొక్కిపట్టి, విధేః = ప్రాణాయామ విధియొక్క శ్రమే జాతే = శ్రమ తొలగిపోగా,

**శ్లో॥ పీత్వా ప్రాణం కుమ్భయిత్వా ధృత్వాఙ్గుష్ఠేన దక్షిణామ్ ।**
**వామయా రేచయేన్మన్దం తథాఽథ ప్రాగ్వదాచరేత్ ॥ 35**

ప్ర : ప్రాణం = గాలిని, పీత్వా = పీల్చి, కుంభయిత్వా = పూరించి, దక్షిణాం = కుడిముక్కు పుటమును, అంగుష్ఠేన = బొటనవ్రేలితో, ధృత్వా = నొక్కి పట్టి, మన్దం = మెల్లగా, వామయా = ఎడమ ముక్కుపుటముతో, రేచయేత్ = వదలవలెను; అథ = పిమ్మట, తథా = అదేరీతి, ప్రాగ్వత్ = ముందటివలెనే, ఆచరేత్ = చేయవలెను.

**తా :** కమ్మరివాని కొలిమితిత్తిని ఆతడెట్లు వేగముగా ఆడించి దానిలో గాలిని నిండించి విడచునో అదేరీతి విడువవలెను. ఎడమముక్కును నడిమివ్రేలు, ఉంగరపువ్రేలు రెండిటితో నొక్కిపట్టి ప్రాణాయామవిధిలో గాలిని పూరించి, బొటనవ్రేలితో కుడిముక్కును నొక్కిపట్టి మెల్లగా గాలిని వదలవలెను. మరల అదేరీతి ముందటి వలెనే చేయవలెను.

**శ్లో॥ ద్వినాడ్యభ్యాసాద్యామార్థం శక్తిమార్గం దదాత్యరమ్ ।**
**భస్త్రేయం సర్వదోషఘ్నీ రుక్పాపఘ్న్యపి సిద్ధిదా ॥ 36**

ప్ర : ద్వినాడీ = ఇడా పింగళా నాడులు రెండిటనూ ప్రాణాయామమును, యామ+అర్ధమ్ = యామములో, అనగా మూడు గంటల కాలములో సగమును, అనగా ఒకటిన్నర గంటసేపు, అభ్యాసాత్ = సాధనచేయుటవలన, అరమ్ = వేగముగ, శక్తిమార్గమ్ = శక్తికి మార్గమును, దదాతి = ఇచ్చుచున్నది; ఇయం భస్త్రా = ఈ భస్త్రియను ప్రక్రియ, సర్వదోషఘ్నీ = అన్ని దోషములను హరించునది, రుక్ పాపఘ్నీ = రోగమును పాపమును పోగొట్టునది, సిద్ధిదా అపి = సిద్ధిని ప్రసాదించునది కూడ.

**తా :** ఇడా పింగళ యను రెండు నాడుల ద్వారా ప్రతిదినము ఒక గంటన్నర కాలము ప్రాణాయామమును సాధన చేయుటకు ఫలముగా **కుండలినీశక్తి**కి వేగముగ ప్రవహించుటకు మార్గమేర్పడుచున్నది. ఈ భస్త్రియను ప్రక్రియ అన్ని దోషములను, రోగమును, పాపమును హరించి, సిద్ధిని ప్రసాదించును.

**శ్లో॥ శిశ్ననాభ్యన్తస్థకన్దం సతి వజ్రాసనే పదౌ ।**
**ధృత్వా దృఢం ప్రపీడ్యారం భస్త్రాం సిద్ధాసనస్థితః ॥ 37**

ప్ర : శిశ్న నాభి+అంతస్థ = లింగమునకును నాభికిని మధ్యగల, కందమ్ = కందమును, వజ్రాసనే సతి = వజ్రాసనమున నుండగా, పదౌ = పాదములను, దృఢమ్ = గట్టిగా, ధృత్వా = పట్టి, ప్రపీడ్య = నొక్కి, అరమ్ = వేగముగా, భస్త్రామ్ = భస్త్రియను క్రియను, సిద్ధాసనస్థితః = సిద్ధాసనమున కూర్చుండి,

**శ్లో॥ సమాకుఞ్చితనాభిర్ద్రాక్కుర్యాచ్ఛక్తిశ్చలత్యతః ।**
**యామార్ధాభ్యాసతో ధైర్యాన్మధ్యనాడ్యా సముద్గతా ॥ 38**

**ప్ర :** సమాకుంచితనాభిః = బొడ్డును చక్కగా లోనికి ముడుచుకొని, ద్రాక్ = వెంటనే, కుర్యాత్ = చేయవలెను; అతః = అందుమూలమున, శక్తిః = కుండలిని, చలతి = కదలును; ధైర్యాత్ = ధైర్యము బట్టి, యామార్థ = ఒకటిన్నర గంటసేపు, అభ్యాసతః = సాధనచేయుటవలన, మధ్యనాడ్యా = సుషుమ్ణానాడితో, సముద్గతా = పైకి బాగుగా లేచిన దగును.

**తా :** లింగమునకు నాభికి మధ్యగల కందము అను భాగమును, సాధకుడు వజ్రాసనములో నుండి, పాదములు గట్టిగా పట్టి నొక్కి, వేగముగ భస్త్రియను క్రియను చేయవలెను. సిద్ధాసనమున కూర్చుండి, నాభిని బాగుగ కుంచించి, వెంటనే భస్త్రిని చేయవలెను. దానివలన కుండలిని కదలును. ధైర్యముగా ఒక గంటన్నర కాలము ఇట్లు సాధన చేసినచో, ఇడా పింగళ నాడుల మధ్యగల సుషుమ్ణా నాడి మార్గమున ఊర్ధ్వగమనముతో కుండలినీ ప్రసారము జరుగును.

**శ్లో॥ ఊర్ధ్వాకృష్టా భవేత్కిఞ్చిచ్ఛక్తిర్నాడీముఖం త్యజేత్ ।**
**తతః స్వతో వ్రజత్యూర్ధ్వం ప్రాణోఽతస్తాం విచాలయేత్ ॥ 39**

**ప్ర :** శక్తిః = కుండలిని, ఊర్ధ్వ+ఆకృష్టా = పైకి లాగబడినదిగా, కించిత్ = కొంచెము, భవేత్ = అగును, నాడీముఖమ్ = నాడీద్వారమును, త్యజేత్ = విడచును; తతః = అటనుండి, స్వతః = తనంత తానుగా, ఊర్ధ్వమ్ = పై దిక్కుగా, వ్రజతి = సాగును; అతః = ఆ కారణమున, ప్రాణః = ప్రాణము, ఊపిరి, తామ్ = ఆ కుండలినీశక్తిని, విచాలయేత్ = కదలించవలెను.

**తా :** కొంచెముగా పైకిలాగబడిన కుండలినీశక్తి నాడీద్వారమును విడిచిపెట్టును. ఇక అక్కడనుండి తనకు తానుగా పైకి సాగును. అందువలన సాధకుడు ప్రాణాయమప్రక్రియతో కుండలినిని కదిలించవలెను. *

**శ్లో॥ చాలనాత్సర్వసిద్ధ్యాప్తిర్మణ్డలాద్యోగినో న తు ।**
**రుగ్భ్యో భయం యమాచ్చాపి నేతోఽన్యన్నాడిశోధనమ్ ॥ 40**

**ప్ర :** యోగినః = యోగికి, మణ్డలాత్ చాలనాత్ = నలుబది దినముల పర్యంతము కుండలినీ శక్తిని కదిలించినందువలన, సర్వసిద్ధి ఆప్తిః = అన్ని సిద్ధులు లభించును, రుగ్భ్యః = రోగముల వలని, భయమ్ = భయము, న తు = లేదు; యమాత్ చ అపి = యమమువలన కూడా, ఇతః = ఇక్కడనుండి, అన్యత్+నాడి–శోధనమ్ = మరియొక నాడీశుద్ధి, న = లేదు.

**తా :** యోగి నలుబది దినములు కుండలినీశక్తిని కదలించుటను సాధనచేసినచో, రోగభయముండదు; అన్ని సిద్ధులు లభించగలవు. ఇక ఇక్కడినుండి మరియొక నాడీశుద్ధి అనునది యమమువలన గూడ కలుగదు.

**శ్లో॥ చాలితాయామపి ప్రాణో బద్ధా చేద్రసనా సుఖమ్ ।**
**వ్రజత్యూర్ధ్వం సిద్ధిపూర్వం రాజయోగపదప్రదః ॥ 41**

**ప్ర :** చాలితాయాం అపి = కదలించబడిన కుండలినీశక్తియందైనను, ప్రాణః = శ్వాస, బద్ధా చేత్ = కట్టుబడియున్నదైనచో, రసనా = ఆనందమయమైన, సుఖమ్ = సుఖమును, సిద్ధిపూర్వమ్ = సిద్ధికి ముందుగా, రాజయోగపదప్రదః = రాజయోగపదవిని ప్రసాదించునదై, ఊర్ధ్వమ్ = పైకి, వ్రజతి = కదలుచున్నది.

**తా :** కుండలినీశక్తిని కదలించినదైనను, శ్వాస దానియందు కట్టుబడి యున్నచో, సిద్ధికి మునుపే రాజయోగస్థితిని ప్రసాదించునదై పైకి బ్రహ్మానందము దిక్కుగా సాగును.

**శ్లో॥ జిహ్వామూలశిరాం ఛిత్వా రోమమాత్రం ప్రవర్ధయేత్ ।**
**పథ్యాసైన్ధవచూర్ణైర్గాం చాలయేద్దోహయేత్పునః ॥ 42**

**ప్ర :** జిహ్వామూల = నాలుక మొదలులో గల, శిరామ్ = నరమును, ఛిత్వా = కోసి, రోమమాత్రమ్ = వెంట్రుకవాసిగా, ప్రవర్ధయేత్ = ముందుకు చాచవలెను; పథ్యా = హరీతకీ (దానిమ్మ), సైన్ధవచూర్ణైః = సైంధవలవణపు పొడి, వీనితో, గామ్ = నాలుకను, పునః = మరల, దోహయేత్ = పిండవలెను, సాగదీయవలెను, చాలయేత్ = కదిలించవలెను, ఆడించవలెను.

**తా :** నాలుక మొదలులో అతికియున్న నరమును కోసి, వెంట్రుకవాసిగా ముందుకు చాచవలెను; అటుపై దానిమ్మ సైంధవలవణపు పొడి కలిపి ఆ నాలుకపై పూసి మెల్లగా సాగదీసి, కదలించవలెను.

**శ్లో॥ దినే దినే ఛేదనాద్యైస్త్ర్యధ్వగా వర్ధతే కలా ।**
**షణ్మాసాదితి జిహ్వాధః శిరాబన్ధో వినశ్యతి ॥ 43**

**ప్ర :** దినే దినే = ప్రతిదినము, ఛేదన+ఆద్యైః = కోయుటయు, ఆపై దానిమ్మ సైంధవలవణ చూర్ణములు పూసి నాలుకను సాగదీయుటయు అను క్రియలచేత, త్రి+అధ్వగా = భ్రూ మధ్యమునకు, కలా = నాలుక, వర్ధతే = సాగును; షట్+మాసాత్ = ఆరునెలలలో, జిహ్వా+అధః = నాలుక మొదలులో గల, శిరాబన్ధః = నరముతో బంధము, వినశ్యతి = పూర్తిగా తెగిపోవును, ఇతి = అని

**తా :** ప్రతిదినము పై జెప్పినట్లు స్వల్పమాత్రముగా కోయుచు, నాల్కను దానిమ్మ సైంధవలణచూర్ణములతో దోహదముచేయుచు మెల్లగా చాచుటవలన, నాలుక మొదలులో నరముతోగల అతుకు పూర్తిగా ఆరునెలలలో తెగిపోయి, నాలుక పొడవుగా చాచుటకు వీలగుచు భ్రూమధ్యమునందుకొనును. (ఈ నాల్కను చాచుట నోటి లోపలనే కాని బైటకు కాదు.) *

**శ్లో॥ ముద్రా స్యాత్ ఖేచరీ త్ర్యధ్వే యోజితా వాఙ్ముఖీ కలా ।**
**రసాస్వాదోఽమృతప్రాప్తి స్తతః ప్రాణమనోజయః ॥ 44**

**ప్ర :** త్ర్యధ్వే = భ్రూమధ్యమున, యోజితా = చేర్చబడిన, వాఙ్ముఖీ కలా = వాగ్దిశాప్రసారియైన జిహ్వ, ఖేచరీ = ఆజ్ఞాచక్రమునందు సంచరించు, ముద్రా = ముద్రగలది, స్యాత్ = అగును;

తతః = అందువలన, అమృతప్రాప్తిః = అమృతము లభించుట, రస+ఆస్వాదః = సుఖానుభవము కలుగుట, ప్రాణ–మనః–జయః = ప్రాణము మనస్సుల జయము.

**తా :** వాగ్దిశగా ప్రసరించు జిహ్వ ఆజ్ఞాచక్రసంచారియగు ఖేచరీముద్ర గలది. అందువలన అటనుండి అమృతప్రాప్తియు, ఆనందానుభవమున్ను కలిగి ప్రాణముపైన, మనస్సుపైన జయము కలుగును. *

**శ్లో॥ సహృజ్జిహ్వా చరత్యస్య ఖే కదాపి స్పృశన్తి నో ।**
**విషార్తిరుగ్జరాక్షుత్తృణ్ణిద్రాతన్ద్రామృతిక్రియాః ॥ 45**

**ప్ర :** అస్య సహృత్ జిహ్వా = ఈ దయగల జిహ్వా, ఖే = ఆజ్ఞాచక్రమున, చరతి = సంచరించును, కదా అపి = ఒకప్పుడైనను, విష+ఆర్తి = విషమువలన భీతి, రుక్ = రోగము, జరా = ముదుసలితనము, క్షుత్ = ఆకలి, తృట్ = దప్పి, నిద్రా = నిద్ర, తన్ద్రా = అలసట, మృతి = మరణము, క్రియాః = అను ఇట్టి కార్యములు, నో స్పృశన్తి = తాకవు.

**తా :** ఈ జిహ్వ సహృదయముతో ఆజ్ఞాచక్రమునందు సంచరించును. విషమువలన భయము, రోగము, వార్ధక్యము, ఆకలిదప్పులు, అలసట, నిద్ర మృత్యువు అను ప్రకృతిసహజక్రియలు ఎప్పటికిని తాకనైన తాకవు.

**శ్లో॥ బిన్దుః స్త్ర్యాశ్లేషితస్యాపి న క్షరత్యూర్ధ్వమేతి సః ।**
**చలితశ్చేద్యోనిముద్రాబద్ధో ముక్తః స భోగ్యపి ॥ 46**

**ప్ర :** స్త్రీ+ఆశ్లేషితస్య+అపి = స్త్రీచేత కౌగిలింపబడిన వానికైనను, బిన్దుః = ఒక చుక్కయైన, న క్షరతి = స్ఖలనము కాదు; సః = ఆతడు, యోనిముద్రాబద్ధః = యోనిముద్రను పట్టినవాడు, భోగీ+అపి = భోగియైనను, చలితశ్చేత్ = రేతస్సు చలించినను, ఊర్ధ్వం ఏతి = పైకి బ్రహ్మరంధ్రమునకు చేరును.

**తా :** యోనిముద్రను బట్టి స్త్రీకౌగిలిలో ఉన్న భోగికైనను (పై శ్లోకమున చెప్పబడినట్టి వాని విషయమున), కొంచెమైన రేతస్సు స్ఖలనము కాదు, వాని రేతస్సు చలించినను, అంతర్ముఖమై ఊర్ధ్వగతితో బ్రహ్మరంధ్రమునకు చేరును. *

**శ్లో॥ సుధాన్తః స్రవతీన్దోస్తాం గ్రసత్యర్కస్తతో జరా ।**
**అధఃశీర్ష్వోర్ధ్వపాత్తిష్ఠేద్బహ్వాహారః శనైః శనైః ॥ 47**

**ప్ర :** శనైః శనైః = మెల్ల మెల్లగా, సుధా = అమృతము, ఇన్దోః అన్తః = అంగిలినుండి లోపలకు, స్రవతి = స్రవించును; తామ్ = దానిని, అర్కః = అగ్ని, తతః = అక్కడనుండి, గ్రసతి = తినును; జరా = జీర్ణక్రియ, అధః శీర్ష = తలక్రిందుగ, ఊర్ధ్వపాత్ = పాదములు పైగ, బహు+ఆహారః = అమితాహారియై, తిష్ఠేత్ = నిలచును.

**తా :** అమృతము బ్రహ్మరంధ్రమునుండి మెల్లమెల్లగా అంగిలి లోపలకు ప్రవహించును. దానిని అటనుండి జఠరాగ్ని భుజించును. జీర్ణక్రియ తలక్రిందులు, పాదములు పైకి కాగా అమితాహారి యగును. *

**శ్లో॥ యామమాత్రం తతః సిద్ధిర్వ్యస్తేయం కరణీష్టదా ।**
**వలీపలితవేపఘ్నీ మృత్యుహన్త్రీ సుధాప్రదా ॥ 48**

**ప్ర :** తతః = ఆ కారణమున, యామమాత్రమ్ = మూడు గంటల కాలము, ఇయమ్ = ఈ ప్రక్రియ, కరణీ = చేయబడినది కాగా, సిద్ధిః = సిద్ధి, వ్యస్తా = విపరీతము; ఇష్టదా = ఇష్టము లిచ్చును; వలీపలితవేపఘ్నీ = జుత్తు నెఱుపును, శరీరకంపమును తొలగించునది, మృత్యుహన్త్రీ = మృత్యువును నశింప జేయునది. సుధాప్రదా = అమృతత్వమును ప్రసాదించునది (అగును).

**తా :** ఊర్ధ్వరేతస్కమగు యీ ప్రక్రియను మూడుగంటల కాలము ప్రతిదినము సాధన చేయగా, ఆ కారణమున విపరీతసిద్ధి లభించును: ఇష్టకామ్యసిద్ధి కలుగును, జుత్తు తెల్లబడదు, శరీరములో ఒణుకు పుట్టదు, మృత్యువే ఉండదు, అమృతత్వము లభించును. *

**శ్లో॥ యోనిస్థవామగుల్ఫో నా కరాత్తప్రసృతాన్యపాత్ ।**
**కుమ్భం కుర్యాత్పునర్వ్యస్తం క్షయగుల్మాదిరుగ్లయః ॥ 49**

**ప్ర :** యోనిస్థ = యోనిప్రదేశమున నుంచబడిన, వామగుల్ఫః = ఎడమమడమ గలవాడై, కర+ఆత్త = చేతపట్టుకొని, ప్రసృత = చాచబడిన, అన్యపాత్ = కుడిపాదముగల, నా = పురుషుడు, పునః = మరల, వ్యస్తమ్ = విపరీతమైన, కుంభమ్ = కుంభకప్రక్రియను, కుర్యాత్ = చేయదగును; (తద్వారా), క్షయ = క్షయరోగము, గుల్మ = గుల్మము, ఆది = మొదలగు, రుక్ = రోగముల, లయః = నశింపు (జరుగును).

**తా :** తన యోనిప్రదేశమున పురుషుడు తన ఎడమమడమను పట్టి, కుడిపాదమును చేతబట్టి చాచి పట్టి, మరల విపరీతస్థితిలో కుంభకప్రక్రియను చేసినచో, క్షయ, గుల్మము మొదలగు రోగములు తొలగిపోవును. *

**శ్లో॥ పూర్వవత్ప్రసృతం పాదం కృత్వోరౌ కృతకుమ్భకః ।**
**క్లేశహీనో జ్ఞానవాన్ చ నాభౌ ప్రాణధృతేరరుక్ ॥ 50**

**ప్ర :** పూర్వవత్ = ముందటివలెనే, ఊరౌ = తొడపై, ప్రసృతం పాదం కృత్వా = పాదమును చాచియుంచి, కృతకుంభకః = కుంభక ప్రక్రియను చేసినవాడు కాగా, క్లేశహీనః = బాధలు లేనివాడు, జ్ఞానవాన్ = జ్ఞానము గలవాడు, చ = మరియు, నాభౌ = నాభియందు, ప్రాణధృతేః = ప్రాణమును ధరించినందువలన, అరుక్ = రోగము లేనివాడు (కాగలడు).

**తా :** ముందటి వలెనే, పాదమును తొడపై చాచి యుంచి, కుంభకప్రక్రియను సాధించిన వానికి

బాధలుండవు, రోగములుండవు, జ్ఞానము కలుగును. ఈ కుంభకమున ప్రాణవాయువును నాభియందు నిల్పవలె.

**శ్లో॥ మనోజయశ్చ నాసాగ్రే పాదాఙ్గుష్ఠేఽఙ్గలాఘవమ్ ।**
**భ్రూమధ్యే చామృతప్రాప్తిరారోగ్యం తున్దపార్శ్వయోః ॥ 51**

**ప్ర :** నాసాగ్రే = ప్రాణమును నాసాగ్రమున నిల్పినచో, మనోజయః = మనస్సు నిశ్చలమగును; చ = మరియు, పాద+అంగుష్ఠే = కాలి బొటనవ్రేలిపై (నిల్పినచో), అంగలాఘవమ్ = శరీరము తేలికయగును; భ్రూమధ్యే = కనుబొమల మధ్య నిల్పిన, అమృతప్రాప్తిః = అమృతలాభము, చ = మరియు, తున్దపార్శ్వయోః = ఉదరమునను, ఇరుడొక్కలయందును (నిల్పిన), ఆరోగ్యమ్ = ఆరోగ్యము.

**తా :** ప్రాణమును నాసాగ్రమున నిల్పిన, మనస్సు నిశ్చలమగును; కాలిబొటన వ్రేలిపై నిల్పిన, శరీరము తేలికపడును; కనుబొమలమధ్య నిల్పిన అమృతము లభించును; పొట్టపై, డొక్కలపై నిల్పిన ఆరోగ్యము లభించును.

**శ్లో॥ విషజ్వరాన్తస్తు దన్తే వాయుపానాచ్చ జిహ్వయా ।**
**శ్రమతృడ్వ్యాధిదాహాన్తః కల్యాణీవాక్సుధాశనమ్ ॥ 52**

**ప్ర :** దన్తే = ప్రాణమును దంతమున నిల్పిన, విషజ్వరాన్తః = విషజ్వరము తొలగును, జిహ్వయా = నోటితో, వాయుపానాత్ చ = గాలిని పీల్చుటవలన గూడ, శ్రమ = అలసట, తృట్ = కోరిక, వ్యాధి = రోగము, దాహ = దప్పి, అన్తః = నశించును; కల్యాణీవాక్ తు = మంగళకరమైన వాక్కున్ను, సుధా+అశనమ్ = అమృతపానము.

**తా :** ప్రాణమును కుంభకసమయమున, దన్తములలో మనస్సు నేకాగ్రము చేసినచో విషజ్వరము శమించును. నోటితో గాలిని పీల్చినచో, శ్రమ, కోరిక, వ్యాధి, దప్పి తొలగిపోవును. అమృతపానము కలిగి, మంగళకరమైన వాక్కు కలుగును.

**శ్లో॥ స్వాస్యేగ్నౌ దీప్తేఽఙ్గసాదే నాడీశుద్ధావనామయే ।**
**నాదః స్ఫుటత్వే సుదృష్ట్యోః సిద్ధిర్బిన్దౌ జితే సతి ॥ 53**

**ప్ర :** స్వ+ఆస్యే = తన ముఖమందు, అగ్నౌ = అగ్ని, దీప్తే (సతి) = వెలిగినది కాగా, నాడీశుద్ధౌ = నాడీశుద్ధియందు, అఙ్గసాదే = శరీరపు అలసట, అనామయే = ఆరోగ్యవంతముకాగా, నాదః = నాదము, స్ఫుటత్వే = స్పష్టమై, సుదృష్ట్యోః = చక్కని కంటి చూపు, బిన్దౌ జితే సతి = రేతస్సు జయింపబడగా, సిద్ధిః = సిద్ధి కలుగును.

**తా :** తన ముఖమున అగ్ని వెలుగగా, నాడీశుద్ధితో శరీరము అలుపులేక ఆరోగ్యవంతమై, నాదము స్పష్టమై, చూపు చక్కబడి, రేతస్సు జయించి సిద్ధి కలుగును.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ప్రథమాష్టకే సప్తమోధ్యాయః ।

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## ప్రథమాష్టకము - అష్టమాధ్యాయము

**శ్లో॥ ఇదం శ్రేష్ఠం భజేత్తస్య సిద్ధ్యేత్కేవలకుమ్భకః ।**
**న తస్య దుర్లభం కిఞ్చిత్సోఽజేయః కైరపీహ హి ॥ 1**

**ప్రతిపదార్థం :** ఇదం శ్రేష్ఠమ్ = ఈ శ్రీదత్తస్వరూపమును, (యః = ఎవడు), భజేత్ = ధ్యానించునో, తస్య = వానికి, కేవలకుంభకః = కుంభకము మాత్రము, సిద్ధ్యేత్ = సిద్ధించును; తస్య = వానికి, దుర్లభమ్ = అసాధ్యమైనది, కించిత్ = కొంచెమును, న = లేదు, సః = ఆతడు, ఇహ = లోకమున, కైః అపి = ఎవరిచేతనైనను, అజేయః హి = జయింపరానివాడే.

**తాత్పర్యం :** ఈ శ్రీదత్తరూపము ఆరాధనకు ఉత్తమము. దీనిని ధ్యానించిన వానికి కుంభకము సంపూర్ణముగ సిద్ధించును. వానికి అసాధ్యమేదియు కాదు. ఆతడు లోకమున అందఱకును అజేయుడే యగును. *

**శ్లో॥ దేహే పాదాది మూర్ధాన్తే స్థితా లోకాశ్చతుర్దశ ।**
**హృత్సంయమాత్తత్ర తత్ర తత్తల్లోకవిదీరితా ॥ 2**

**ప్ర :** పాద+ఆది = పాదములు మొదలు, మూర్ధ+అన్తే = శిరస్సు వరకు గల, దేహే = దేహమున, చతుః+దశ = పదునాలుగు, లోకాః = లోకములు, స్థితాః = నిలచియున్నవి; హృత్+సంయమాత్ = హృదయమున సంయమమును సాధించినందువలన, తత్ర తత్ర = ఎడనెడ, తత్+తత్+లోకవిత్ = ఆ యా లోకములను గురించిన జ్ఞానము, ఈరితా = చెప్పబడినది.

**తా :** పాదాది శీర్షపర్యంతము గల సమస్తదేహమున పదునాలుగు లోకములు నిలచి యున్నవి. హృదయమున ఏకాగ్రధ్యానము చేయుటచే, అట్టి సాధకునకు కొండొకచో ఆ యా లోకముల జ్ఞానము కలుగును. *

**శ్లో॥ అర్ధజ్ఞానం తారకాయాం నాసాగ్రే చేన్ద్రలోకవిత్ ।**
**తదధో వహ్నిలోకస్య చక్షుషోః సర్వలోకవిత్ ॥ 3**

**ప్ర :** తారకాయామ్ = కంటికనీనికయందు, అర్థజ్ఞానమ్ = అర్థజ్ఞానము, చ = మరియు, నాసా+అగ్రే = ముక్కుకొసన, ఇన్ద్రలోకవిత్ = ఇంద్రలోకజ్ఞత; చక్షుషోః = కన్నులయందు, వహ్నిలోకస్య తత్ అధః = వహ్నిలోకమునకు క్రిందుగా, సర్వలోకవిత్ = సర్వలోకముల జ్ఞానము కలుగును.

**తా :** కంటికనీనికయందు ఏకాగ్రదృష్టితో ధ్యానము చేసినచో, అర్థజ్ఞానము కలుగును; నాసాగ్రమునందైనచో, ఇంద్రలోకజ్ఞత కలుగును. కన్నులయందలి వహ్నిలోకమునందైనచో, ఆ ఇంద్రలోకమునకు క్రిందుగ ఉన్న అన్ని లోకముల జ్ఞానము కలుగును. *

**శ్లో॥ శ్రోత్రే చ యమలోకస్య తత్పార్శ్వే నైర్ఋతస్య విత్ ।**
**పృష్ఠే వరుణలోకస్య వాయులోకస్య చ శ్రుతౌ ॥ 4**

**ప్ర :** శ్రోత్రే = చెవియందు, యమలోకస్య = యమలోకజ్ఞానము, చ = మరియు, తత్ పార్శ్వే = దాని ప్రక్కన, నైర్ఋతస్య విత్ = నిరృతిలోకపు జ్ఞానము; పృష్ఠే = వీపునందు, వరుణలోకస్య = వరుణలోకజ్ఞానము, చ = మరియు, శ్రుతౌ = వినికిడియందు, వాయులోకస్య = వాయులోక జ్ఞానము.

**తా :** చెవియందేకాగ్రధ్యానదృష్టి నిల్పినచో యమలోకజ్ఞానమున్నూ, దాని ప్రక్కన నిల్పినచో నిరృతిలోకజ్ఞానము, వీపున నిల్పినచో వరుణలోకజ్ఞానమున్నూ, వినికిడియందు నిల్పినచో వాయులోకజ్ఞానము కలుగును. *

**శ్లో॥ కణ్ఠే కుబేరలోకస్య వామేక్ష్ణి శివలోకవిత్ ।**
**దక్షే పరమలోకస్య బ్రహ్మలోకస్య మూర్ధ్ని విత్ ॥ 5**

**ప్ర :** కణ్ఠే = కంఠమునందు, కుబేరలోకస్య = కుబేరలోకజ్ఞానము, వామేక్ష్ణి = ఎడమకంటి-చూపునందు, శివలోకవిత్ = శివలోకజ్ఞానము, దక్షే = కుడికంటిచూపునందు, పరమలోకస్య = విష్ణులోకజ్ఞానము, మూర్ధ్ని = శిరస్సునందు, బ్రహ్మలోకస్య విత్ = బ్రహ్మలోకజ్ఞానము కలుగును.

**తా :** కంఠమున ధ్యానదృష్టి నేకాగ్రము చేసిన వానికి కుబేరలోకజ్ఞాత, ఎడమకంటిచూపునందు శివలోకజ్ఞత, కుడికంటిచూపునందు విష్ణులోకజ్ఞత, శిరస్సునందు బ్రహ్మలోకజ్ఞత కలుగును.

**శ్లో॥ తత్తజ్జన్తుధ్వనౌ తత్తద్భూతజ్ఞానం చ కర్మణి ।**
**ప్రాగ్జాతివిచ్చాన్యచిత్తే స్ఫుటం తచ్చిత్తవృత్తివిత్ ॥ 6**

**ప్ర :** తత్ తత్ జన్తుధ్వనౌ = ఆ యా జంతువులుచేయు ధ్వనులయందు, కర్మణి చ = కర్మలయందును, తత్ తత్ భూతజ్ఞానమ్ = ఆ యా ప్రాణుల జ్ఞానము, ప్రాక్ జాతి విత్ = రాబోవు జన్మల జ్ఞానము, అన్యచిత్తే = ఇతరుని మనస్సునందు, స్ఫుటమ్ = స్పష్టముగా, తత్ చిత్తవృత్తివిత్ = ఇతరుని మనోవృత్తుల జ్ఞానము.

**తా :** ఆ యా జన్తుధ్వనులయందు ఏకాగ్రధ్యానముచేత ఆ యా ప్రాణుల గురించి తెలియును, వాని కర్మలయందైనచో, వాని రాబోవు జన్మలజ్ఞానము కలుగును. ఇతరుని మనస్సునందు నిల్పినచో, స్పష్టముగా వాని మనస్సు పోకడలు తెలియును.

**శ్లో॥ సూర్యేన్ద్వోర్లోకభజ్ఞానం ధ్రువే తద్గతిదర్శనమ్ ।**
**స్వార్థే పురుషవీర్యే మారుత్యాదిబలస్య విత్ ॥ 7**

**ప్ర :** సూర్య+ఇన్ద్వోః = సూర్యచంద్రులయందు, లోకభజ్ఞానం = లోకముల దోషజ్ఞత, ధ్రువే = ధ్రువునియందు, తత్+గతిదర్శనమ్ = లోకగతి దర్శనము, స్వార్థే = తనదైన, పురుషవీర్యే = రేతస్సునందు, మారుతి+ఆది బలస్య = మారుతి మొదలగు వారి బలముయొక్క, విత్ = జ్ఞానము

**శ్లో॥ కాయరూపేఽప్యదృశ్యస్య కాయవ్యూహస్య నాభితః ।**
**అతీతానాగతజ్ఞానం స్యాద్ధర్మాధర్మయోర్గలే ॥ 8**

**ప్ర :** కాయరూపే = శరీరరూపము నందు, అదృశ్యస్య అపి = కనరానిదైన, కాయవ్యూహస్య = శరీరనిర్మాణజ్ఞానము, నాభితః = నాభియందైనచో, అతీత+అనాగతజ్ఞానమ్ = గడిచిపోయిన కాలము, రానున్న కాలము, వీని జ్ఞానము, గలే = మెడయందు, ధర్మ+అధర్మయోః = ధర్మ అధర్మముల జ్ఞానము, స్యాత్ = కలుగును.

**తా :** అదృశ్యముగ నున్న శరీరనిర్మాణమును గురించి కూడ శరీరరూపమునందు ధ్యానదృష్టి నేకాగ్రము చేయుటచే తెలియవచ్చును. నాభియంద్రు దృష్టి నిల్పిన భూతభవిష్యత్కాలముల జ్ఞానము కలుగును. మెడపై దృష్టి నిల్పిన ధర్మాధర్మములు తెలియవచ్చును.

**శ్లో॥ క్షుత్తృణ్ణాశః కూర్మనాడ్యాం స్థైర్యే తారే చ సిద్ధిదృక్ ।**
**కాయఖే ఖగతిస్తత్త త్సిద్ధయస్తత్ర తత్ర చ ॥ 9**

**ప్ర :** కూర్మనాడ్యామ్ = కూర్మనాడియందు, క్షుత్ తృట్ నాశః = ఆకలిదప్పుల నాశము; స్థైర్యే = స్థిరత్వమునందు, చ = మరియు, తారే = కంటికనీనికయందు, సిద్ధిదృక్ = సిద్ధిదృష్టిని, కాయఖే = శరీరము నందుంచిన, ఖగతిః = ఆకాశగమనము, తత్ తత్ సిద్ధయః = ఆ యా సిద్ధులు, తత్ర తత్ర చ = అణువు మొదలగు వాని యందును.

**తా :** కూర్మనాడియందు ఏకాగ్రము చేసిన, ఆకలిదప్పులు మాయును; కంటికనీనికయందును స్థైర్యము నందును అయినచో, సిద్ధిదృష్టి; శరీరమునందు ఆకాశగమనము; అణువాదుల యందైనచో, అణిమాది సిద్ధులు కలుగును.

**శ్లో॥ ప్రత్యాహారస్త్వాహరణమర్థచారీ గవాం బలాత్ ।**
**ఆత్మాన్వయేన దృష్టిశ్చ ఫలత్యాగశ్చ కర్మణః ॥ 10**

**ప్ర :** ప్రత్యాహారః తు = ప్రత్యాహారము అనబడు యోగాంగమనగా, అర్థచారీ గవామ్ =

విషయములందు సంచరించు ఇంద్రియములను, బలాత్ = బలవంతముగా, ఆత్మాన్వయేన = ఆత్మకనుసంధానముతో, కర్మణః = కర్మయొక్క దృష్టిః చ = ఆచరణవైఖరియున్ను, ఫలత్యాగః చ = ఆ కర్మఫలమును నిరాకరించుటయు.

**తా :** **ప్రత్యాహార**మనగా విషయములలో పరిభ్రమించు ఇంద్రియములను బలవంతముగా ఆత్మతో అనుసంధానము చేయుటయున్ను, ఇంద్రియకర్మలను నిష్కామవైఖరితో ధర్మాచరణదృష్టితో నిర్వహించుటయున్నూ, కర్మఫలమును తా ననుభవించుటకు నిరాకరించుటయు.

**శ్లో॥ వైరస్యం చేన్ద్రియార్థేషు ప్రతిమర్మ చ హృత్స్థితిః ।**
**ప్రత్యాహారః పఞ్చధైవం ధారణాపి చ పఞ్చధా ॥ 11**

**ప్ర :** ఇన్ద్రియ+అర్థేషు = ఇంద్రియవిషయములలో, వైరస్యమ్ = అనాసక్తత, చ = మరియు, హృత్ స్థితిః = హృదయ స్థితి, ప్రతిమర్మ చ = పటిష్ఠమైనదియున్నూ, ప్రత్యాహారః = ప్రత్యాహారము, పంచధా = ఐదు రీతులు, ఏవమ్ = ఇట్లే, ధారణా అపి చ = ధారణ యున్ను, పంచధా = ఐదు విధములు.

**తా :** ఇంద్రియవిషయములలో అనాసక్తత, పటిష్ఠమైన హృదయస్థితియు, ప్రత్యాహారము అనబడును. ఇది ఐదు విధములు. ఇట్లే ధారణ యను నదియు ఐదు విధములు.

**శ్లో॥ హృత్ప్రాణధారణా హృద్ధీధారణాఽధ్యాత్మధారణా ।**
**తన్మూర్తిధారణా క్ష్మాదౌ హార్దఖేఽన్యఖధారణా ॥ 12**

**ప్ర :** హృత్ ప్రాణధారణా = హృదయమున ప్రాణమును నిల్పుట, హృత్+ధీ ధారణా = హృదయమున బుద్ధిని నిల్పుట, అధ్యాత్మధారణా = శ్రోత్రాది ఇంద్రియముల నిల్పుట, తత్మూర్తిధారణా = ఆ శ్రీదత్తుని రూపమును నిల్పుట, క్ష్మా+ఆదౌ = భూమి మొదలుగా గల పంచభూతములందు, హార్దఖే = హృదయాకాశమున, అన్యఖధారణా = ఇతర తత్త్వములను నిల్పుట.

**తా :** ఐదు విధముల ధారణ : హృదయమున ప్రాణధారణ, బుద్ధిధారణ, ఇంద్రియధారణ, శ్రీదత్తుని మూర్తిధారణ, పంచభూతధారణ. *

**శ్లో॥ వజ్రాఙ్కుశధ్వజాబ్జాఙ్కయుగ్రక్తాబ్జాభపత్తలమ్ ।**
**నఖమాణిక్యభాధ్వస్తభక్తహార్దతమస్తతిమ్ ॥ 13**

**ప్ర :** వజ్ర+అంకుశ ధ్వజ+అబ్జ+అంకయుక్ = వజ్రాయుధము, అంకుశము, ధ్వజము, పద్మము, ఈ గుర్తులతో కూడిన, రక్త+అబ్జాభ = ఎఱ్ఱతామరకాంతిగల, పద్+తలమ్ = పాదముల ప్రదేశము గల, నఖమాణిక్యభా = కాలిగోళ్ళమాణిక్యకాంతితో, ధ్వస్త = తొలగించబడిన, భక్తహార్దతమః +తతిమ్ = భక్తుల హృదయమందలి తమోగుణసమూహము గలవానిని,

**శ్లో॥ గూఢగుల్ఫం కూర్మపృష్ఠోల్లసత్పాదోపరిస్థలమ్ ।**
**పరిపుష్టసుజఙ్ఘోరుం విశాలజఘన స్థలమ్ ॥ 14**

ప్ర : గూఢగుల్ఫమ్ = దాచి యుంచిన మడమలు గలవానిని, కూర్మపృష్ఠ+ఉల్లసత్ = తాబేలు మూపువలె ప్రకాశించు, పాదోపరిస్థలమ్ = పాదపు పై ప్రదేశముగలవానిని, పరిపుష్ట = బొద్దుగా బలముగా గల, సుజంఘ+ఊరుమ్ = చక్కని క్రీగాళ్ళును, తొడలును గలవానిని, విశాలజఘనస్థలం = విశాలమైన కటిప్రదేశము గలవానిని

**శ్లో॥ పృథుశ్రోణిం చ కాకుత్స్థం చారునాభిం దలోదరమ్ ।**
**కపాటవక్షసం దీర్ఘమాంసలోరగవద్భుజమ్ ॥ 15**

**శ్లో॥ సుచిహ్నచిహ్నితకరం కమ్బుకణ్ఠం స్మితాననమ్ ।**
**స్నైగ్ధ్యధావల్యయుక్తాక్షం చలత్పిఙ్గజటాధరమ్ ॥ 16**

**శ్లో॥ చన్ద్రకాన్తం ప్రభం కృష్ణభ్రూరశ్మశ్రుకనీనికమ్ ।**
**భావశుద్ధద్విజాకీర్ణం ప్రసన్నముఖపఙ్కజమ్ ॥ 17**

**శ్లో॥ సిద్ధాసనసమాసీనం వరాభయదసత్కరమ్ ।**
**క్షణేక్షణేఽపి సద్భక్తస్మృతిగామినమీశ్వరమ్ ॥ 18**

**శ్లో॥ అనుగ్రహాఖ్యహృత్స్థేన్దుజ్ఞాపితస్మితచన్ద్రికమ్ ।**
**సదాఽఖణ్డసమాధిస్థం దత్తాత్రేయం దిగమ్బరమ్ ॥ 19**

**శ్లో॥ ఆసేచనకమూర్తిం తం సదాఽఽపాదాద్ధృదాముఖమ్ ।**
**ధ్యాయేత్సమాహితో యోగీ నివృత్తాఖిలవృత్తికః ॥ 20**

ప్ర : పృథుశ్రోణిమ్ = విశాలమైన నడుముప్రదేశము గలవానిని, చ = మరియు, కాకుత్స్థమ్ = సూర్యవంశపువాడును, చారునాభిమ్ = అందమైన నాభిగలవానిని, దల+ఉదరమ్ = పలుచని పొట్టగలవాడును, కపాటవక్షసమ్ = కపాటమువలె విశాలమైన వక్షముగలవానిని, దీర్ఘమాంసల+ఉరగవత్+భుజమ్ = పొడవైన, బలిసిన, పామువలె నున్న భుజములు గలవానిని, సుచిహ్నచిహ్నితకరమ్ = మంచి సాముద్రికచిహ్నములు గల అరచేతులు గలవానిని, కంబుకంఠమ్ = శంఖమును బోలిన మెడగలవానిని, స్మితాననమ్ = నగుమోము గలవానిని, స్నైగ్ధ్యధావల్యయుక్త+అక్షమ్ = నిర్మలమైన తెల్లనికన్నులుగలవానిని, చలత్ పింగజటాధరమ్ = కదలుచున్న పసుపుడాలు ఎఱుపురంగుగల జడలను ధరించిన వానిని, చన్ద్రకాన్తమ్ = చంద్రునివలె ఆకర్షణగల, ప్రభమ్ = కాంతిగల వానిని, కృష్ణభ్రూః = నల్లని కనుబొమలు గలవాడును, అశ్మశ్రు = మసకగాని, కనీనికమ్ = కనుగ్రుడ్డు గలవానిని, భావశుద్ధద్విజాకీర్ణమ్ = హృదయమువలె మాలిన్యములేని పలువరుసను చిక్కగ గలవానిని, ప్రసన్నముఖపంకజమ్ = ప్రశాంతమైన పద్మమువలె శోభగల

ముఖముగలవానిని, సిద్ధాసనసమాసీనమ్ = సిద్ధాసనమున సుఖముగ కూర్చున్నవానిని, వర+అభయద = వరములను అభయమును ప్రసాదించు, సత్ కరమ్ = శుభమైన చేయి గలవానిని, క్షణే క్షణే అపి = ప్రతిక్షణమును, సత్+భక్తస్మృతిగామినమ్ = నిజమైన భక్తుల మనస్సులలో నిల్చియుండువానిని, ఈశ్వరమ్ = ప్రభువైన వానిని, అనుగ్రహ+ఆఖ్య = అనుగ్రహము అని పేరుగల, హృత్స్థ = హృదయమందున్న, ఇందుజ్ఞాపిత = చంద్రుని తలపించు, స్మితచన్ద్రికమ్ = నవ్వు వెన్నెల గురియు వానిని, సదా = ఎల్లప్పుడు, అఖణ్డసమాధిస్థమ్ = చెదరని (నిర్వికల్ప) సమాధి యందుండు వానిని, దత్తాత్రేయం దిగంబరమ్ = దిగంబరుడైన దత్తాత్రేయుని, సదా = ఎల్లప్పుడును, తమ్ = వానిని, ఆ ప్రభువును, ఆపాదాద్ధ్రుదాముఖమ్ = పాదముల నుండి శీర్షము వరకును గల, ఆసేచనకమూర్తిమ్ = నిత్యతృప్తుడైన ఆనందమూర్తిగలవానిని, నివృత్త+అఖిల వృత్తికః = తొలగింపబడిన సమస్తవ్యాపారములుగలవాడైన, యోగీ = యోగి, సమాహితః = ఏకాగ్రత గలవాడై, ధ్యాయేత్ = ధ్యానింపదగును.

**తా (శ్లో.13-20):** శ్రీదత్తప్రభువు నిత్యతృప్తుడు, దిగంబరుడు, నగుమోముతో ప్రసన్నరూపము గలవాడు. మడమలు కనరాకుండ సిద్ధాసనమున కూర్చున్నవాడు. వాని పాదములపై భాగము తాబేలుమూపువలె నుండగా, వాని పిక్కలు తొడలు పుష్టిగా నుండును. వాని నడుము, విశాలమైనది. వాని నాభి అందమైనది, పొట్ట పలుచనైనది, ఱొమ్ము విశాలమైనది, వాని భుజములు పొడవుగా బలిసిన పాములవలె నున్నవి. వాని అరచేతులలో మహాపురుషసాముద్రిక చిహ్నములున్నవి. అందమైన వాని మెడ శంఖము వంటిది. వాని కన్నులు తెల్లగ నిర్మలమై యున్నవి. కదులుచున్న పసుపు ఎఱుపు కలిసిన రంగుతో నున్న జడలు గట్టి శిరోజములు గలవాడు. వెన్నెలవలె తెల్లనివాడు. నల్లని కనుబొమలు, తెల్లని కనుగ్రుడ్లు, మలినములేని పలువరుసతో, ప్రసన్నమైన ముఖవర్చస్సుతో, వరదముద్రను, అభయముద్రను పట్టిన హస్తములు గలవాడు. భక్తుల మనస్సులలో అనుక్షణము నిల్చియుండువాడు. ఈ ప్రసన్నప్రభుమూర్తిని సర్వసంగ పరిత్యాగియైన యోగి ఏకాగ్రతతో ధ్యానింపదగును.

**శ్లో॥ ఇదం తు సగుణధ్యానం స్వేచ్ఛోపాత్తచిదాత్మనః ।**
**నిర్గుణం కేవలం హాస్యం సచ్చిత్సుఖమయం పరమ్ ॥ 21**

**ప్ర :** ఇదం తు = ఇదియేమో, స్వేచ్ఛా+ఉపాత్త = ఇష్టపూర్వకముగా సంపాదించబడిన, చిత్+ఆత్మనః = ఆత్మజ్ఞానముగల వానియొక్క, సగుణధ్యానమ్ = గుణము, నామరూపములు గల మూర్తిధ్యానమునకు సంబంధించినది; నిర్గుణమ్ = నామరూపగుణమూర్తిమత్త్వములేని దాని ధ్యానము, పరమ్ = నామరూపగుణాతీతమైనది, సత్+చిత్+సుఖమయమ్ = ఉనికి, జ్ఞానము, సుఖము ఒకే ఒక్కటియైన, కేవలమ్ = కేవలాత్మధ్యానము, హాస్యమ్ = ఆనందమయము.

**తా :** ఇష్టపూర్వకముగా ఆత్మజ్ఞానమును పొందిన భక్తుడు ఆ ఆత్మను సగుణసరూపమూర్తిగా

భావించి ధ్యానించుట **సగుణధ్యానము**. కేవలాత్మను, లోకాతీతమైన దానిని, ఆనందమే ఉనికి, జ్ఞానముగా పరిణమించిన దానిని యే మూర్తిని భావించక ధ్యానించుట **నిర్గుణధ్యానము**.

**శ్లో॥ ధ్యాతృధ్యానధ్యేయరూపః సమాధిః సవికల్పకః ।**
**జీవాత్మపరమాత్మైక్యావస్థా త్రిపుటీవర్జితా ॥ 22**

**ప్ర :** ధ్యాతృధ్యానధ్యేయరూపః = ధ్యానము, ధ్యానయోగ్యమైన వస్తువు లేక లక్ష్యము, ధ్యానము చేయువాడు అను మూడు వేర్వేరుగా గుర్తింపబడు స్థితిలోనిది, సవికల్పకః సమాధిః = సవికల్ప సమాధి, జీవాత్మపరమాత్మైక్య+అవస్థా = జీవుడు దేవుడు ఒక్కటేయైన స్థితి, త్రిపుటీవర్జితా = ధాతృధ్యానధ్యేయములు మూడు వేర్వేరు రూపములతో ఉండనిది, అనగా, ఒకే రూపమైన నిర్వికల్పసమాధి.

**తా :** ధ్యానము చేయువాడు, ధ్యానము అను క్రియారూప ప్రయత్నము, ధ్యానమునకు యోగ్య లక్ష్యము అను మూడును వేర్వేరుగా అనుభవమునకు వచ్చు స్థితి **సవికల్పసమాధి** యనబడును. దీనికి విపరీతముగా ఈ మూడును కలిసి ఒకే ఒక్క రూపముగా అనుభవమునకు వచ్చు స్థితిలో ధ్యేయపరమాత్మ, ధ్యాతజీవాత్మ కలిసిపోయిన ధ్యానరూపము **నిర్వికల్పసమాధి** యగును. *

**శ్లో॥ పరిపూర్ణానన్దరూపా శుద్ధచిద్రూపికా పరా ।**
**పశ్చాత్ స్మృత్యనుమేయాత్మార్థవృత్తయ ఇహానుగాః ॥ 23**

**ప్ర :** పశ్చాత్ = సమాధి తరువాత, స్మృతి+అనుమేయ+ఆత్మార్థవృత్తయః = జ్ఞప్తినుండి తెలియదగిన ఆత్మసంబంధి వృత్తులు, పరిపూర్ణానందరూపాః = పూర్తిగా ఆనందరూపమైనవి, శుద్ధచిత్+రూపికాః = నిర్మలమైన జ్ఞానరూపమైనవి, పరాః = అతీంద్రియములైనవి, ఇహ+అనుగాః = ప్రస్తుతమునకు, జాగ్రత్స్థితిలోని లోకానుభవములలో అనుసరించి వచ్చును.

**తా :** సమాధి చాలించిన తరువాత, సాధకుడు మరల వాస్తవ ప్రపంచపు జాగ్రదావస్థలో కూడ, సమాధిస్థితిలో పొందిన అతీంద్రియానందానుభూతి నిర్మలజ్ఞానరూపమున, ఆత్మజ్ఞానస్మృతిగా అనుభవమునకు వచ్చును.

**శ్లో॥ అన్తర్లీనసహృత్ప్రాణోఽపశ్యన్నచలదృగ్బహిః ।**
**ముద్రేయం వైష్ణవీ శూన్యా శూన్యలక్ష్మపదప్రదా ॥ 24**

**ప్ర :** అన్తర్లీన = లోలోపల, సహృత్+ప్రాణః = హృదయముతో కూడిన ప్రాణము గలవాడై, అచలదృక్ = చలించని దృష్టిగలవాడై, బహిః = వెలుపల, అపశ్యన్ = చూచుచు, ఇయమ్ = ఇది, వైష్ణవీముద్రా = వైష్ణవీముద్ర, శూన్యా = శూన్యమైనది, శూన్యలక్ష్మపదప్రదా = శూన్య నిర్వచనపదమును ప్రసాదించునది.

**తా :** లోలోపల హృదయమునందు ప్రాణమునిల్పి చలించక ఱెప్పవాల్చక లోకమును చూచు చుండుట వైష్ణవీముద్ర. ఇది అలోకము, అనిర్వచనీయస్థితి.

**శ్లో॥ తద్వాన్ దృఢాసనో దక్షకర్ణే రుద్ధబిలో ధ్వనిమ్ ।**
**త్రిగ్రన్థిభేదం శృణుయాత్సుసూక్ష్మం స సమాధిభాక్ ॥ 25**

ప్ర : తత్+వాన్ = పై జెప్పబడిన వైష్ణవీముద్రయందున్న వాడై, దృఢాసనః = స్థిరముగ కూర్చున్నవాడై, దక్షకర్ణే = కుడి చెవియందు, రుద్ధబిలో = కర్ణరంధ్రమును మూసినవాడై, ధ్వనిం త్రిగన్థిభేదమ్ = బ్రహ్మవిష్ణురుద్రగ్రంథుల మూడిటిని భేదించు ధ్వనిని, సుసూక్ష్మమ్ = చాలా సూక్ష్మమైన దానిని, శృణుయాత్ = వినదగును; సః = అట్టివాడు, సమాధిభాక్ = సమాధియందున్న వాడగును.

**తా :** వైష్ణవీముద్రయందు స్థిరాసనముననుండి షణ్ముఖీముద్ర యనబడు స్థితిలో కుడిచెవి రంధ్రమును మూసి త్రిమూర్తుల పేరున గల గ్రంథులను భేదించు సూక్ష్మధ్వనిని వినువాడు సమాధియందున్నవాడే యగును.

**శ్లో॥ అర్ధోన్మీలితదృక్ స్వస్థో నాసాగ్రాక్షో వశీ భజేత్ ।**
**లీనార్కేన్దుః పరం తత్త్వం తద్బాహ్యాన్తరవర్జితమ్ ॥ 26**

ప్ర : అర్ధ+ఉన్మీలితదృక్ = సగము తెఱచియున్న కన్నులుగలవాడై, స్వస్థః = ఆత్మారాముడై, నాసాగ్ర+అక్షః = ముక్కుకొసపై చూపు, నిల్పినవాడైన, వశీ = యోగి, లీన+అర్క+ఇన్దుః = ఉచ్ఛ్వాస నిఃశ్వాసలు లేనివాడై, పరం తత్త్వమ్ = పరతత్త్వమును, తత్ = దానికి, బాహ్య+ అన్తరవర్జితమ్ = లోపల వెలుపల అనునవిలేని సర్వవ్యాపియగు దానిని, భజేత్ = ధ్యానించును.

**తా :** సగము తెఱచియున్న కన్నులతో తన ముక్కుకొసన చూపు నిల్పి, శ్వాసలేనివాడై, యోగి పరతత్త్వమును అనంతాత్మచైతన్యముగా ధ్యానించును.

**శ్లో॥ ఏవమభ్యాసయోగేన ఖేచరీముద్రయాపి చ ।**
**మనః స్థిరీభావరూపాఽవస్థా సిద్ధ్యేన్మనోన్మనీ ॥ 27**

ప్ర : ఏవమ్ = ఈ విధముగా, ఖేచరీముద్రయా అపి చ = ఖేచరీముద్రతో గూడ, అభ్యాస యోగేన = అభ్యాసపూర్వకయోగముచేత, మన+ఉన్మనీ = చలించు మనస్సు వేగమును, మనః స్థిరీభావ = మనస్సును నిశ్చలము చేయు, రూప = లక్షణము గల, అవస్థా = స్థితి (కలుగును).

**తా :** ఈ విధముగా అభ్యాసముతో **యోగముద్వారా**, **ఖేచరీముద్ర**ద్వారా కూడ, చంచలమైన మనస్సును నిశ్చలము జేయు స్థితి సాధ్యమగును. *

**శ్లో॥ శక్తిమధ్యే మనః కృత్వా శక్తిం చాపి మనోగతామ్ ।**
**మనసా మన ఆలోక్య యోగీ నిత్యం సుఖీభవేత్ ॥ 28**

ప్ర : శక్తిమధ్యే = శక్తికేంద్రమున, మనః కృత్వా = మనస్సును నిల్పి, శక్తిం చ+అపి = శక్తిని గూడ, మనోగతామ్ = మనస్సునందున్న దానిని జేసి, మనసా = మనస్సుచేత, మనః = మనస్సును, ఆలోక్య = చూచుచు, యోగీ = యోగి, నిత్యమ్ = ఎల్లప్పుడు, సుఖీభవేత్ = సుఖముగ నుండును.

**తా :** శక్తి కేంద్రమున మనసును నిల్పి, మనసులో శక్తిని నిల్పి, మనస్సుతో మనస్సును చూచి, యోగియైన వాడు సదా సుఖించును.

**శ్లో॥ ఆకాశమధ్య ఆత్మానమాత్మన్యాకాశమేవ చ ।**
**కృత్వాఽఽకాశమయం సర్వం చిన్తయేన్న కిమప్యతః ॥ 29**

**ప్ర :** ఆకాశమధ్యః = ఆకాశమధ్యమందున్న వాడై, ఆత్మని = తనలో, ఆత్మానమ్ = తనను, ఆత్మను, చ = మరియు, ఆకాశమ్ = ఆకాశమును, ఏవ = మాత్రము, కృత్వా = నిల్పి, సర్వమ్ = సమస్తమును, ఆకాశమయమ్ = ఆకాశమైయున్నదానిగ, చిన్తయేత్ = ధ్యానింపదగును, న కిం+అపి+అతః = అంతకుమించి మరేమియు కాదు.

**తా :** ఆకాశముమధ్య తానుండి, యోగి తనలో తనను ఆకాశమును మాత్రమే నిల్పి, సర్వము ఆకాశమే యని ధ్యానింపవలెను. ఆకాశముకంటె మరిదేనినైన కాదు. *

**శ్లో॥ బాహ్యచిన్తా న కర్తవ్యా తథైవాన్తరచిన్తనమ్ ।**
**పరిత్యజ్యాఖిలాం చిన్తాం చిన్మయం భావయేత్పరమ్ ॥ 30**

**ప్ర :** బాహ్యచిన్తా = వెలుపలి విషయముల గురించిన ఆలోచన, న కర్తవ్యా = చేయరాదు; తథా+ఏవ = అట్లే, అన్తరచిన్తనమ్ = లోని ధ్యానమును, పరిత్యజ్య = విడిచిపెట్టి, అఖిలాం చిన్తామ్ = చిన్తనంతయు, చిన్మయం పరం = జ్ఞానమయుడైన పరాత్పరుని, భావయేత్ = ధ్యానించవలెను.

**తా :** వెలుపలి విషయముల గురించి గాని, లోపలి మనోవృత్తుల గురించి గాని, చింతించుట పూర్తిగ మాని, జ్ఞానమయుడైన పరముని ధ్యానించవలెను.

**శ్లో॥ యోగేనేత్థం లీయమానం మనో బ్రహ్మణి లీయతే ।**
**కర్పూరోఽగ్నావివాబ్ధౌ చ లవణం ఖ ఇవాన్యఖే ॥ 31**

**ప్ర :** ఇత్థమ్ = ఈ రీతి, యోగేన = యోగముచే, లీయమానం మనః = లయమగు మనస్సు, బ్రహ్మణి = బ్రహ్మమునందు, లీయతే = లయమగును, కర్పూరః = కర్పూరము, అగ్నౌ = అగ్నియందు, అబ్ధౌ = నీటియందు (సముద్రము నందు), లవణమ్ = ఉప్పు, ఇవ = వలె, చ = మరియు, ఖః =ఆనందము, అన్యఖే = బ్రహ్మానందమున, ఇవ = వలె

**తా : కర్పూరము అగ్నియందు కరిగినట్లు, నీటియందు ఉప్పు కరిగినట్లు, లౌకికసంతోషము బ్రహ్మానందమున కలిసినట్లు, యోగముచే పై జెప్పిన రీతిలో లయమైన మనస్సు బ్రహ్మము నందు లయమగును.** *

**శ్లో॥ జ్ఞేయం సర్వప్రతీతం చ తజ్జ్ఞానం మన ఉచ్యతే ।**
**మనోలయో జ్ఞానవస్తుపరిత్యాగాత్తతోఽమృతమ్ ॥ 32**

**ప్ర :** జ్ఞేయమ్ = తెలియదగిన, సర్వప్రతీతం = సర్వప్రసిద్ధమైన, తజ్జ్ఞానమ్ = ఆ జ్ఞానము, మనః ఉచ్యతే = మనస్సు అనబడినది, చ = మరియు, జ్ఞానవస్తుపరిత్యాగాత్ = జ్ఞానమున కాధారమైన వస్తువును త్రోసివేసినపుడు, మనోలయః = మనస్సు నశింపు, తతః = దానివలన, అమృతమ్ = అమరత్వము.

**తా :** మనస్సు అనునదే సర్వవిషయములలో సిద్ధమగు జ్ఞానరూపమని తెలియదగినది. మనస్సునుండి ఆ జ్ఞానవస్తువులను త్రోసివేసినచో మనస్సు నిశ్చలమై నశించును. ఆ మనోలయము వలన అమరత్వ మబ్బును.

**శ్లో॥ యోగో జ్ఞానం చ మనసో నాశస్య ద్వౌ క్రమౌ పరౌ ।**
**యోగో హృద్ధృత్తిరోధోఽత్ర జ్ఞానం సమ్యగవేక్షణమ్ ॥ 33**

**ప్ర :** యోగః = యోగము, జ్ఞానం చ = జ్ఞానమున్నూ, మనసః = మనస్సుయొక్క, నాశస్య = నాశముయొక్కయు, ద్వౌ = రెండు, క్రమౌ = పద్ధతులు, పరౌ = ఒకదానికొకటి విరుద్ధమైనవి; యోగః = యోగము, హృత్+ధృత్+తిరోధః = హృదయపు ధృతి అంతర్ధానమగుట, అత్ర = ఆ స్థానమున, జ్ఞానమ్ = జ్ఞానము, సమ్యక్ ఆవేక్షణమ్ = చక్కగా, సమగ్రముగా, ప్రత్యక్షమగుట.

**తా :** యోగములో పరస్పరవిరుద్ధమైన రెండు పద్ధతులున్నవి. మనస్సు నశించుట, అనగా మనసుకెక్కిన లౌకికఇంద్రియబద్ధత లేకుండుట, అందువలన జ్ఞానము ప్రత్యక్షసత్యమగుట.

**శ్లో॥ చిత్తవృత్తినిరోధస్తు మనఃస్పన్దోపశాన్తిదః ।**
**మనఃస్పన్దోపశాన్త్యాఽయం సంసారః ప్రవిలీయతే ॥ 34**

**ప్ర :** చిత్తవృత్తినిరోధః తు = మనస్సుయొక్క వ్యాపారములను నిలువరించుటయేమో, మనః స్పంద+ఉపశాన్తిదః = మనస్సుయొక్క స్పందనలను శాంతపరచును; మనఃస్పంద+ఉపశాన్త్యా = మనస్పందనలు శాంతించుట చేత, అయం సంసారః = ఈ సంసారము, ప్రపంచము, ప్రవిలీయతే = అంతర్ధానమగును.

**తా :** చిత్తవృత్తులను నిలువరించుట అనగా మనస్సు ఇంద్రియవ్యాపారములకు ప్రతిస్పందించక శాంతముగ నుండుట. మనస్సు ప్రశాంతమగుటచేత ఇంద్రియజ్ఞానరూపమైన ప్రపంచము రూపు మాసిపోవును.

**శ్లో॥ శాస్త్రసజ్జనసమ్పర్కవైరాగ్యాభ్యాసయోగతః ।**
**ధైర్యేణ చాస్యయా పూర్వవాసనాతానవాద్ధతాత్ ॥ 35**

**శ్లో॥ సద్భక్త్యా భగవద్ధ్యానాచ్చిరమేకాన్తమోదితాత్ ।**
**అఖేదమనిలాభ్యాసాత్పరతత్త్వైకచిన్తనాత్ ॥ 36**

**శ్లో॥ ఓఙ్కారోచ్చారణాద్దీర్ఘం ఘణ్టికాక్రమణాద్ధవా ।**
**శక్తిసఞ్చాలనాత్ప్రాణమనఃస్పన్దోనిరుధ్యతే ॥ 37**

**ప్ర :** శాస్త్రసజ్జనసంపర్క = శాస్త్రములు చదివినందువలన, సజ్జనులతో స్నేహమువలన, వైరాగ్య = రాగద్వేషములు లేకుండుటవలన, అభ్యాసయోగతః = సాధనవలన, యోగమువలన, ధైర్యేణ చ = ధైర్యముచేతనున్నూ, ఆస్యయా = ఆసనస్థితిచేత, పూర్వవాసనాతానవాత్ = పూర్వవాసనలు సన్నగిల్లుటవలన, హఠాత్ = సూచనలేకుండ, సద్భక్త్యా = శుద్ధమైన భక్తిచేత, భగవత్+ధ్యానాత్ = భగవంతుని ధ్యానించుటవలన, చిరమ్ = చాలకాలము, ఏకాన్తమోదితాత్ = ఏకాన్తము నాస్వాదించుటవలన, అఖేదమ్ = చింతలేకుండ, అనిలాభ్యాసాత్ = ప్రాణాయామమును సాధన చేయుటవలన, పరతత్త్వ+ఏకచిన్తనాత్ = పరతత్త్వమును ఏకాగ్రముగ ధ్యానించుటవలన, గవా దీర్ఘం ఓంకార+ఉచ్చారణాత్ = నోటితో ఓంకారమును చాలాసేపు ఉచ్చరించుటవలన, ఘణ్టికా క్రమణాత్ = ఘంటానాదమును వినుటవలన, శక్తి సంచాలనాత్ = కుండలినీశక్తిని కదలించుట వలన, ప్రాణ = ప్రాణముయొక్కయు, మనః = మనస్సు యొక్కయు, స్పందః = ప్రతిస్పందన, కదలిక, నిరుధ్యతే = నిలువరింపబడును.

**తా :** శాస్త్రపఠనంవలన, సజ్జనసాంగత్యంవలన, రాగద్వేషములను త్యజించుటవలన, యోగము వలన, ధైర్యముతో, ఆసనస్థితి వలన, పూర్వవాసనలు సన్నగిల్లుటవలన, యే సూచన లేకుండ, భక్తిచేత, దైవధ్యానంవలన, చిరకాలము ఏకాన్తము నానందించుటవలన, యే క్లేశములు లేకుండ ప్రాణాయామమును సాధన చేయుటవలన, పరతత్త్వమును ఏకాగ్రబుద్ధితో ధ్యానించుట వలన, చాలకాలము ఓంకారమును పలుకుటవలన, ఘంటానాదమును వినుటవలన, కుండలినీ శక్తిని కదలించుటవలన, **ప్రాణముయొక్క, మనస్సుయొక్క స్పందనలు నిలిచిపోవును.**

**శ్లో॥ ఇతరత్ర న కర్తవ్యా మనోవృత్తిర్మనీషిణా ।**
**ఉక్తాభ్యాసేన విజ్ఞేయం తద్విష్ణోః పరమం పదమ్ ॥ 38**

**ప్ర :** మనీషిణా = పండితునిచేత, ఉక్త+అభ్యాసేన = చెప్పబడిన సాధనతో, తత్ విష్ణోః =ఆ విష్ణుదేవునియొక్క, పరమం పదమ్ = శ్రేష్ఠతమమైన స్థానము, విజ్ఞేయమ్ = తెలియదగినది; మనోవృత్తిః = మనోవ్యాపారము, ఇతరత్ర = వేరు విషయములలో, న కర్తవ్యా = చేయరాదు.

**తా :** మనస్సును వేరు ప్రాపంచికవిషయములలో చొరబడ నివ్వరాదు. పండితులు సూచించిన సాధనలతో ఆ విష్ణుని సర్వోత్తమానుభవమును తెలియదగియున్నది.

**శ్లో॥ ద్వాదశాఙ్గులపర్యన్తం నాసాగ్రే విమలామ్బరే ।**
**సంవిద్దృశి ప్రశామ్యన్త్యాం హృత్ప్రాణస్పన్దరోధనమ్ ॥ 39**

**ప్ర :** నాసాగ్రే = నాసాగ్రమున, విమలాంబరే = నిర్మలాకాశమున, ద్వాదశాంగులపర్యన్తమ్ = పన్నెండంగులములవరకు, సంవిత్+దృశి = పరమాత్మ దర్శనములో, ప్రశామ్యన్త్యామ్ = పూర్తిగా లగ్నమై యున్నదానియందు, హృత్ ప్రాణస్పందరోధనమ్ = హృదయస్పందన, ప్రాణస్పందన నిలువరించుట.

**తా :** నాసాగ్రమున, ద్వాదశాంగులపర్యన్తము గల దహరాకాశమున పరమాత్మ దర్శనములో లగ్నమై యున్న దృష్టియందు హృదయ ప్రాణముల స్పందనను నిలువరించుట.

**శ్లో॥ భ్రూమధ్యే తారకాలోకనాదశాన్త ఉపాగతే ।**
**కేతనే చేతనే బద్ధే హృత్ప్రాణస్పన్దరోధనమ్ ॥ 40**

**ప్ర :** భ్రూమధ్యే = కనుబొమల మధ్య, తారకా+ఆలోకనాదశ+అన్తే = తారకను చూచుదశలో, ఉపాగతే = వచ్చి చేరినదైన, చేతనే బద్ధే = చైతన్యమునందు కట్టుబడియున్న, కేతనే = భ్రూమధ్యభాగమున, హృత్+ప్రాణస్పందరోధనమ్ = హృదయప్రాణముల కదలికలను నిలువరించుట.

**తా :** కనుబొమల మధ్య భాగమున కనీనికలను నిల్పి చూచు స్థితిలో పొందిన చైతన్యమునందు నిల్చి యున్న భ్రూమధ్యభాగమున హృదయ ప్రాణముల కదలికలను నిలువరించుట.

**శ్లో॥ ఓమిత్యేవ యదుద్భూతం జ్ఞానజ్ఞేయాత్మకం శివమ్ ।**
**విభావయేన్నిర్వికల్పస్తేన ప్రాణో నిరుధ్యతే ॥ 41**

**ప్ర :** ఓం+ఇతి+ఏవ = ఓం అని మాత్రమే, యత్+ఉద్భూతమ్ = ఉద్భవించినదైన, జ్ఞానజ్ఞేయాత్మకమ్ = తెలిసినది, తెలియదగినది అనువాని సారమైన, శివమ్ = శివుని, నిర్వికల్పః =నిర్వికల్ప సమాధిలో నున్నవాడై, విభావయేత్ = ధ్యానించవలెను, తేన = దానిచే, ప్రాణః = ప్రాణము, నిరుధ్యతే = నిలువరింపబడును.

**తా :** శివుడు తెలియదగిన జ్ఞానస్వరూపుడు, ఓంకారము వాని సంకేతము. అట్టి శివుని నిర్వికల్ప సమాధిలో ధ్యానించుటచేత ప్రాణము నిలువరింపబడును. *

**శ్లో॥ చిరకాలం ధియైకాన్తం వ్యోమసంవేదనాద్దృఢమ్ ।**
**నిర్వాసనమనోధృత్యా సుఖాత్ప్రాణో నిరుధ్యతే ॥ 42**

**ప్ర :** చిరకాలమ్ = చాలకాలము, ధియా = బుద్ధిచే, ఏకాన్తమ్ = ఏకాన్తమున, వ్యోమసంవేదనాత్ = దహరాకాశజ్ఞానమువలన, దృఢమ్ = నిశ్చలమైన, నిర్వాసన = వాసనలు, సంస్కారములు లేని, మనోధృత్యా = మనస్సుయొక్క బలముచే, సుఖాత్ = సుఖముగా, ప్రాణః = ప్రాణము, నిరుధ్యతే = నిలువరింపబడును.

**తా :** ఏకాన్తములో చిరకాలము దహరాకాశజ్ఞానమును బుద్ధి నుంచుటచేత పూర్వజన్మల వాసనలు లేకుండ నిశ్చలమైన మనోబలముచే సుఖముగా ప్రాణమును నిలువరించదగును.

**శ్లో॥ ఇత్యథర్వోదితో యోగః సంక్షేపేణాత్ర దర్శితః ।**
**విశేషాభ్యాసాపేక్షాయాం మూలే సమ్యగ్విలోక్యతామ్ ॥ 43**

**ప్ర :** ఇతి = ఇట్లని, అథర్వ+ఉదితః = అథర్వవేదముచే చెప్పబడిన, యోగః = యోగము,

సంక్షేపేణ = క్లుప్తముగా, అత్ర = ఇక్కడ, దర్శితః = వివరించబడినది; విశేష+అభ్యాస+అపేక్షాయాం = విశేషముగా అభ్యసించుట ద్వారా, మూలే = మూలమునందు, సమ్యక్ = బాగుగా, విలోక్యతామ్ = దర్శింతురు గాక!

**తా :** ఇంతవరకు **అథర్వవేదమున** చెప్పబడిన యోగమును క్లుప్తముగా వివరించితిని. అభ్యాసవిశేషముచే మూలమున చక్కగ దర్శింపగలరు.

**శ్లో॥ లీనః సపఞ్చవిపలద్విపలం బ్రహ్మరన్ధ్రగః ।**
**ప్రాణః ప్రాణాయామ ఏష వర్ధమానస్తతః పరః ॥ 44**

**ప్ర :** ప్రాణః = ప్రాణము, సపంచ విపలత్+విపలమ్ = ఐదు క్షణముల, లీనః = కలిసిపోయినదై, బ్రహ్మరంధ్రగః = బ్రహ్మరంధ్రమును చేరినది కాగా, ఏషః వర్ధమానః ప్రాణాయామః = ఇది వృద్ధియగుచున్న ప్రాణాయామము, తతః = అటనుండి, పరః = వేరైనది.

**శ్లో॥ ప్రత్యాహారః పలైః పఞ్చవింశత్యాఽనిన్ద్రియార్థవిత్ ।**
**ధారణా పఞ్చనాడీభిర్ధ్యానం షష్టిఘటీమితమ్ ॥ 45**

**ప్ర :** ప్రత్యాహారః = ప్రత్యాహారము, పఞ్చవింశత్యా పలైః = ఇరువదియైదు క్షణముల కాలము, అనిన్ద్రియ+అర్థవిత్ = ఇంద్రియవిషయముల జ్ఞానములేనిది; ధారణా = ధారణ, పంచనాడీభిః = పంచనాడులతో; ధ్యానమ్ = ధ్యానము, షష్టిఘటీమితమ్ = అరువది గడియల కాలము ప్రమాణము.

**శ్లో॥ సమాధిర్ద్వాదశదినసాధ్యః పరమదుర్లభః ।**
**వాసనాజాలహా ధర్మమేఘః సర్వకృతాన్తకృత్ ॥ 46**

**ప్ర :** సమాధిః = సమాధి, ద్వాదశదినసాధ్యః = పండ్రెండు దినములు సాధన చేయదగినది; పరమ దుర్లభః = సాఫల్యము కష్టసాధ్యము, వాసనాజాలహా = పూర్వజన్మసంస్కారములను హరించునది, ధర్మమేఘః = ధర్మమేఘము, సర్వకృతాన్తకృత్ = అన్ని కర్మల ఫలమును నశింపజేయునది.

**తా (శ్లో.44-46):** ప్రాణవాయువును ఐదు క్షణములు బ్రహ్మరంధ్రమున లీనము జేసిన, అది వర్ధమానప్రాణాయామము; దానికంటె వేరైన ప్రత్యాహారమున ఇరువదియైదు క్షణములు ఇంద్రియ విషయజ్ఞానము కలుగదు; ఐదు నాడులతో ధారణ, అరువది గడియలు ధ్యానము, పండ్రెండు దినముల సాధన **సమాధికి ప్రమాణము**. సమాధి కష్టసాధ్యమే కాని దానిచే పూర్వవాసనలు నశించును, కర్మఫలము లన్నియు నశించును, అమృతము జాలువారును. *

**శ్లో॥ యమేన దశధా నూనం దశధా నియమేన చ ।**
**ఆసనాద్యేన షట్కేన యోగోఽష్టాంగోఽయముచ్యతే ॥ 47**

**ప్ర :** యమేన = యమముచే, దశధా = పది విధములుగా, నూనమ్ = నిశ్చయముగా, నియమేన చ = నియమముచే, దశధా = పది విధములుగాను, ఆసన+ఆద్యేన = ఆసనము మొదలగునవి, షట్కేన = ఆరింటితోను, యోగః = యోగము, అష్టాంగః = ఎనిమిది అంగములుగలదిగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా :** పది రీతుల యమము, పది రీతుల నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి అను ఎనిమిది అంగములతో కూడినది యోగము అని చెప్ప బడుచున్నది.

**శ్లో॥ ఏతేనాష్టాఙ్గయోగేన మనోనాశేన యోగిరాట్ ।**
**వాసనాతానవేనాశు తత్త్వజ్ఞానేన ముచ్యతే ॥ 48**

**ప్ర :** ఏతేన అష్టాంగయోగేన = ఈ అష్టాంగయోగముతో, మనోనాశేన = మనస్సు నశించగా, యోగిరాట్ = యోగిరాజు, వాసనాతానవేన = వాసనలు క్షీణించుటచేత, ఆశు = వెంటనే (కలిగిన), తత్త్వజ్ఞానేన = పరతత్త్వజ్ఞానముచేత, ముచ్యతే = ముక్తుడగుచున్నాడు.

**తా :** ఈ అష్టాంగయోగసాధనవలన మనస్సు నశించును, వాసనలు క్షీణించును. కావున యోగిరాజు తక్షణమే పరతత్త్వజ్ఞానము కలిగి ముక్తి నందును. *

**శ్లో॥ యోగో హృద్వృత్తిరోధో హీత్యుక్తమత్ర మహర్షిణా ।**
**పాతఞ్జలాభిధో యోగః సుఖస్తేనాత్ర సూచితః ॥ 49**

**ప్ర :** యోగః = యోగము, హృత్+వృత్తి = హృదయ లేక మనోవ్యాపారములను, రోధః హి = నిలిపివేయుటయే, ఇతి = అని, మహర్షిణా ఉక్తమ్ = మహర్షిచేత చెప్పబడినది; అత్ర = ఈ విషయమున పాతంజలాభిధః యోగః = పతంజలి ప్రతిపాదించిన యోగము, సుఖః = సుఖమైనది, అని, తేన = ఆ మహర్షిచే, అత్ర = ఈ విషయమున, సూచితః = సూచింపబడినది.

**తా :** చిత్తవృత్తినిరోధమే యోగము అని మహర్షిప్రోక్తము. ఈ యోగవిషయమున పతంజలి పేరున కీర్తిగాంచిన యోగము సుఖకరమని సూచింపబడినది. *

**శ్లో॥ స హృద్వృత్తినిరోధాఖ్యః సుఖోఽపి బహుసమ్మతః ।**
**ప్రసఙ్గేనేహ సంక్షేపాజ్జ్ఞాన సిద్ధ్యర్థముచ్యతే ॥ 50**

**ప్ర :** సః హృద్+వృత్తినిరోధ+ఆఖ్యః = ఆ చిత్తవృత్తినిరోధమని చెప్పబడినది, సుఖః = సుఖమైనది, అపి = మరియు, బహుసమ్మతః = చాలమంది అంగీకరించినది; ప్రసంగేన = ప్రసంగవశాత్తు, ఇహ = ఇప్పుడు, జ్ఞానసిద్ధి+అర్థమ్ = జ్ఞానము సిద్ధించుకొరకు, సంక్షేపాత్ = క్లుప్తముగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా :** చిత్తవృత్తినిరోధమని చెప్పబడిన ఆ యోగము సుఖముగా సాధన చేయదగినది, పైగా

అధికసంఖ్యాకులైన సాధకులు అంగీకరించినది. కావున ప్రసంగవశమున ఇక్కడ క్లుప్తముగా జ్ఞానలబ్ధికై చెప్పబడినది. *

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ప్రథమాష్టకే అష్టమోఽధ్యాయః ।

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## ద్వితీయాష్టకము - ప్రథమాధ్యాయము

**శ్లో॥ ప్రవరేతరహృద్వృత్తినిరోధో యోగ ఉచ్యతే ।**
**సంప్రజ్ఞాతేతరౌ యోగౌ ధర్మౌ చిత్తస్య పఞ్చ చ ॥ 1**

**ప్రతిపదార్థం :** ప్రవర+ఇతర = సాత్త్వికములుకాని, హృద్+వృత్తి = మనస్సులయొక్క వ్యాపారములను, నిరోధః = నిలువరించుట, యోగః = యోగముగ, ఉచ్యతే = చెప్పబడుచున్నది; యోగౌ = రెండు యోగములు, సంప్రజ్ఞాత+ఇతరౌ = సంప్రజ్ఞాతయోగము, అసంప్రజ్ఞాతయోగము (అని), చిత్తస్య = మనస్సుయొక్క, ధర్మౌ = రెండు ధర్మములు; పంచ చ = అయిదేమో

**శ్లో॥ భువో మూఢక్షిప్తవిక్షిప్తైకాగ్ర్య వినిరుద్ధకాః ।**
**తిస్రో బన్ధాయ ముక్త్యై ద్వే యోగినామీశసేవినామ్ ॥ 2**

**ప్ర :** భువః (పై శ్లోకములోని చివరి **పంచ చ** అనుదానితో అన్వయము) = భూములయి యున్నవి, అవి, మూఢక్షిప్తవిక్షిప్త+ఏకాగ్ర్య వినిరుద్ధకాః = మూఢము, క్షిప్తము, విక్షిప్తము, ఏకాగ్ర్యము, వినిరుద్ధకము (అనబడు అయిదు); వీనిలో, తిస్రః = మూడు, బంధాయ = బంధము కలిగించునవి, ద్వే = రెండు, ఈశ సేవినామ్ = ఈశ్వరుని సేవించు, యోగినామ్ = యోగులకు, ముక్త్యై = ముక్తి నిచ్చునవి.

**తా :** సాత్త్వికములు గాని మనోవృత్తులను నిలువరించుట యోగమనబడు చున్నది. సంప్రజ్ఞాతము, అసంప్రజ్ఞాతము అను యోగములు మనోధర్మములతో 1. మూఢము, 2. క్షిప్తము, 3. విక్షిప్తము, 4. ఏకాగ్ర్యము, 5. వినిరుద్ధకము అనబడు అయిదు రీతులు. వీనిలో మూడు బంధమును కలిగించునవి, రెండు ఈశ్వరభక్తులైన యోగులకు ముక్తినిచ్చునవి. *

**శ్లో॥ శాన్తోగ్రమూఢవృత్త్యానే చిత్తే నిత్యైకరూపిణః ।**
**స్వరూపేఽవస్థితిర్ద్రష్టుర్వృత్తిసారూప్యమన్యతః ॥ 3**

**ప్ర :** శాన్త+ఉగ్ర మూఢ వృత్తి+ఊనే చిత్తే = శాన్తము, ఉగ్రము, మూఢము అనబడు మూడు విధముల మనోవ్యాపారములులేని చిత్తమునందు, నిత్య+ఏక రూపిణః = సర్వకాలసర్వావస్థలలో నిర్వికారముగ ఒకే విధముగ నుండువానియొక్క, స్వరూపే = తనదైన రూపమున, అవస్థితిః = నిలిచి యుండుట, అన్యతః = అన్యవిధమున, ద్రష్టుః = చూచువానియొక్క, వృత్తి సారూప్యమ్ = మనో వ్యాపారముల రూపము గలది.

**తా :** వైరాగ్యము, క్షమ, ఔదర్యము మొదలగునవి శాన్తమనోవృత్తులు. ఆలస్యము, నిద్రాభ్రాన్తులు మొదలగా గలవి మూఢ మనోవృత్తులు. కామక్రోధలోభము లాది మనోవృత్తులు ఉగ్రములు. ఈ మూడు విధముల మనోవృత్తులునులేని చిత్తమున సర్వదా నిర్వికారమైన స్వస్వరూపజ్ఞాన దర్శన మందు నిల్చినది, అన్యతః చూచువాని వైఖరి శాన్తమైన దాని ననుసరించి, ఉగ్రమైన ఆ మనోవృత్తుల ననుసరించి, మూఢమైన మూఢమనోవృత్తుల కనుగుణముగ స్వరూపజ్ఞానము దర్శనము కలుగును.

**శ్లో॥ క్లిష్టాక్లిష్టభిదా పఞ్చవృత్తయోఽత్ర ప్రమాణకాః ।**
**వేదానుమానప్రత్యక్షరూపాద్యథ విపర్యయః ॥ 4**

**ప్ర :** క్లిష్ట+అక్లిష్టభిదా = క్లిష్టములు, అక్లిష్టములు అను భేదములతో, అత్ర = ఈ మనోవృత్తుల విషయమున, ప్రమాణకాః = ప్రమాణములు, పంచవృత్తయః = అయిదు వృత్తులు; వేద = శబ్ద ప్రమాణము, అనుమాన = అనుమానప్రమాణము, ప్రత్యక్ష = ప్రత్యక్షప్రమాణము, రూప+ఆది = అను రూపమున గలవియు, అథ = ఆ పై, విపర్యయః = విపర్యయమను పేరుగల క్లిష్టత లేక క్లేశము గల,

**శ్లో॥ మిథ్యాజ్ఞానమతద్రూపప్రతిష్ఠం క్లేశయుక్తథా ।**
**శబ్దజ్ఞానానుపాతీ తు వస్తుశూన్యో వికల్పకః ॥ 5**

**ప్ర :** మిథ్యాజ్ఞానమ్ = లేని దాని గురించిన జ్ఞానము, అతత్+రూపప్రతిష్ఠమ్ = అహంకారమును ప్రతిష్ఠించునది. క్లేశయుక్ = క్లేశముతో కూడినది, తథా = అట్లే, శబ్దజ్ఞాన+అనుపాతీ = వేదజ్ఞానము ననుసరించునదైన, వికల్పకః తు వస్తుశూన్యః = వస్తువు ఆధారముగలేని జ్ఞానము.

**తా :** అహంకారము ప్రతిష్ఠించునది లేనిది ఉన్నట్లు తోచు జ్ఞానము, క్లేశయుక్తము, వస్తువు నాధారముగా చేసికొననిదేమో శబ్దము ఆధారముగా తోచునది. మొదటిదాని కుదాహరణ రజ్జుసర్ప భ్రాంతి, అనగా ఉన్న త్రాడుపై లేని పాము రూపము భ్రాంతియై తోచుట. ఇచట, లేని పాముని కాధారము యథార్థముగ ఉన్న త్రాడు. రెండవ దాని కుదాహరణ, శశవిషాణము, అనగా కుందేటికొమ్ము. ఇచట, కొమ్ములున్న కుందేలు లేనే లేదు. ఐనను వస్తువు ఆధారము లేకుండ కుందేటి కొమ్ము భావింపబడినది. ఈ రెండును భ్రాంతులే. ఇదియును ఒక రీతి జ్ఞానమే. *

**శ్లో॥ అభావప్రత్యయాలమ్బా నిద్రా సా తు తమోమయీ ।**
**అనుభూతాఽసంప్రమోషః స్మృతిస్తాసాం నిరోధనమ్ ॥ 6**

ప్ర : అభావప్రత్యయ+ఆలంబా = అవిశ్వాసమాధారముగా గలది, తమోమయీ = తమోగుణ పూర్ణమైనది, సా తు = అదియేమో, నిద్రా = నిద్ర యనబడునది; అనుభూతా = అనుభవింపబడినది, అసంప్రమోషః = నష్టము కానిది, స్మృతిః = జ్ఞప్తి; తాసామ్ = వాని యొక్క, ఆ పంచవృత్తులను నిరోధించుట,

**శ్లో॥ వైరాగ్యాభ్యాసతస్తత్ర విరజోవృత్తిహృత్స్థితౌ ।**
**యమాద్యనుష్ఠానరూపో యత్నోఽభ్యాసశ్చిరం స తు ॥ 7**

ప్ర : వైరాగ్య+అభ్యాసతః = వైరాగ్యము, అభ్యాసము అనువాని వలన; తత్ర = వైరాగ్య అభ్యాసముల మధ్య, విరజోవృత్తిహృత్ స్థితౌ = రజోగుణవృత్తిలేని, ఉపలక్షణమైన తామసీవృత్తియు లేని, హృత్ స్థితౌ = హృదయమందు నెలకొన్న, యమ+ఆది+అనుష్ఠానరూపః = యమము మొదలగు అష్టాంగయోగానుష్ఠానరూపమైన, యత్నః = ప్రయత్నము, అభ్యాసః = అభ్యాసము అనబడునది. సః తు = ఆ అభ్యాసమేమో, చిరమ్ = చాలకాలము,

**శ్లో॥ సత్కారసేవితో నిత్యం దృఢః స్యాచ్చాపరాజితః ।**
**సత్కారాః స్యుర్బ్రహ్మచర్యశ్రద్ధావిద్యాతపోముఖాః ॥ 8**

ప్ర : సత్కారసేవితః నిత్యమ్ = నిత్యము, సత్కార్యములను సేవించినవాడు, దృఢః = స్థిరుడై, అపరాజితః = ఓటమి నెఱుగని వాడై, స్యాత్ = ఉండును; సత్కారాః = సత్కార్యములు, బ్రహ్మచర్య = బ్రహ్మచర్యము, శ్రద్ధా = శ్రద్ధకలిగియుండుట, విద్యా = ఉపనిషద్విజ్ఞానము కలిగి యుండుట, తపః = తపస్సు, ముఖాః = ముఖ్యముగా చెప్పబడునవి.

**తా (శ్లో.6-8):** అవిశ్వాసముపై ఆధారపడినది తమోగుణావిష్టమైనది నిద్ర. అనుభవములోనికి వచ్చినది, నష్టముకాక నిల్చినది **స్మృతి**. పై జెప్పిన పంచవృత్తులను నిలువరించుట వైరాగ్యము, అభ్యాసము అనువాని వలన సాధ్యము. ఈ వైరాగ్య అభ్యాసములు రెండిటిలో రజోగుణవృత్తియు, దాని ఉపలక్షణమైన తమోగుణవృత్తియులేని హృదయమందు స్థిరమైన అనుష్ఠానరూపమైన ప్రయత్నము **అభ్యాసము** అనబడునది. ఆ అభ్యాసము యమనియమాది అష్టాంగయోగ రూపమైనది. ఇది చిరకాలము సత్కార్యములు సేవించిన వానికి స్థిరత్వమును, ఓటమి నెఱుగని జయమును కలిగించును. సత్కార్యములు అనగా, బ్రహ్మచర్యము, శ్రద్ధ, విద్య, తపస్సు ముఖ్యముగా చెప్పబడునవి. *

**శ్లో॥ యాతమానం హృన్మలాన్తో గతైష్యమలనిశ్చయః ।**
**వ్యతిరేకో హృది లయోత్కణ్ఠైకేన్ద్రియసంజ్ఞకమ్ ॥ 9**

ప్ర : యతమానమ్ = మనస్సును నిగ్రహించునది, హృత్+మల+అన్తః = చిత్తమలము నశించుట, అనగా రాగద్వేషాదులులేక నిర్మలమగుట, గత+ఏష్య మల నిశ్చయః = సమసిపోయిన కోర్కెల మాలిన్యము నిశ్చయముగ తెలియవచ్చుట, ఇది, వ్యతిరేకః = వ్యతిరేకచిహ్నము, హృది =

మనస్సునందు, లయ+ఉత్కంఠా = లయించిన తీవ్రవ్యాకులత, ఏక+ఇన్ద్రియ సంజ్ఞకమ్ =ఏకాగ్రతా సంకేతము.

**తా :** వైరాగ్యమున మొదటి భేదము : రాగద్వేషాది చిత్తమలమును నశింపు జేయునది; రెండవది : వ్యతిరేకసంజ్ఞకమైనది : ఇంద్రియలాలసాతీవ్రత నశింపు; మూడవది : మనసున దేనిని గురించియైన వ్యాకులపాటు లేకుండుట.

**శ్లో॥ వశీకారో దృష్టాదృష్టార్థవైతృష్యం చతుర్విధమ్ ।**
**వైరాగ్యమాద్యం పుంజ్ఞప్తేర్గుణవైతృష్యముత్తమమ్ ॥ 10**

**ప్ర :** దృష్ట+అదృష్ట+అర్థవైతృష్యమ్ = ఐహిక, ఆముష్మిక విషయములలో సంపూర్ణతృప్తి, అని, వశీకారః = వైరాగ్యము, చతుర్విధమ్ = నాలుగు రీతులు; పుంజ్ఞప్తేః = పురుషుని అవబోధము యొక్క, గుణవైతృష్యమ్ = గుణములలో అనాసక్తత, ఉత్తమమ్ = ఉత్తమమైన, ఆద్యం వైరాగ్యమ్ = ప్రధానవైరాగ్యము.

**తా :** ఐహికవిషయములలోను, ఆముష్మికవిషయముననూ విశేషతృప్తి, అనునది నాల్గవ భేదము. ఇట్లు వైరాగ్యము నాలుగు విధములు. పురుషావబోధ ప్రక్రియలో గుణరూపభేదముల వితర్కము ఉత్తమము. *

**శ్లో॥ స్థూలస్యైకాగ్ర్యం వితర్కో విచారోఽల్పస్య చిన్తనమ్ ।**
**ఆనన్దః స్థూలవిషయిసత్త్వప్రత్యక్షవిన్మతేః ॥ 11**

**ప్ర :** మతేః = బుద్ధియొక్క, స్థూలస్య = స్థూలబాహ్యవస్తులక్షణముల గురించి, ఏకాగ్ర్యమ్ = నిల్కడతో గూడిన జ్ఞానము, వితర్కః = వితర్కము, విశేషపరిశీలన; అల్పస్య = సూక్ష్మము, ఆంతరంగికసత్యముల గూర్చిన, చిన్తనమ్ = పరిశీలన, విచారః = విచారము; స్థూలవిషయిసత్త్వ ప్రత్యక్షవిత్ = స్థూలవిషయముల కాధారమైన సత్త్వగుణాత్మకశక్తిని గురించిన జ్ఞానము, ఆనందః = ఆనందము.

**తా :** బుద్ధి స్థూలవిషయములలో ప్రవేశించి ఏకాగ్రముగా పరిశీలించి సంపాదించినది **వితర్క జ్ఞానము**. అల్పవిషయములలో సూక్ష్మముగా ప్రసరించి పొందినది **విచారజ్ఞానము**. స్థూలవిషయములు అంగముగా గలిగిన సత్త్వశక్తిని ప్రత్యక్షముగా చూచి పొందిన జ్ఞానము **ఆనందము**. *

**శ్లో॥ పుంస్యైక్యాదస్మితాయోగాత్సాక్షాత్తద్ధ్యానజం త్వితి ।**
**పరిపక్వాస్త్రిపుట్యైతే సంప్రజ్ఞాతస్తదన్వయాత్ ॥ 12**

**ప్ర :** పుంస్య+ఐక్యాత్ = పురుషునితో (బుద్ధి) ఐక్యమగుటవలన, అస్మితా యోగాత్ = అస్మిత అను పేరుగల యోగమువలన, సాక్షాత్ ధ్యానజమ్ = అపరోక్షధ్యానజనితమైన యీ అస్మితయను యోగము, ఏతే = ఈ వితర్కాది జ్ఞానరూపములు, పరిపక్వాః = పక్వమైనవి కాగా, త్రిపుట్యా =

త్రిపుటితో, తత్ అన్వయాత్ = ఆ జ్ఞానమును అన్వయించుట వలన, సంప్రజ్ఞాతః = సంప్రజ్ఞాత సమాధి గల వాడగును.

**తా :** వ్యక్తిలోని బుద్ధి ఆ వైయక్తిక పురుషనితో అనుసంధానమైనచో, ఆ యోగము పేరు **అస్మితా యోగము**. ఇది అపరోక్షధ్యానజనితము. పైన చెప్పబడిన వితర్కాది జ్ఞానములు పరిపక్వములు కాగా, జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అను త్రిపుటితో ఆ పరిపక్వజ్ఞానసముదాయమును అన్వయించుట వలన సంప్రజ్ఞాతసమాధి సిద్ధించును, అనగా ఆ స్థితిలో కలుగు ఆనందమును తా నాస్వాదించు చున్నానను ఎఱుక గూడ ఆ యానందముననే లీనము కాగా, గ్రాహ్యగ్రాహక భేదము సమసి పోవును. *

**శ్లో॥ వృత్త్యభావే విరామస్తత్ప్రత్యయో విరతిః పరా ।**
**తదభ్యాసాదిః సంస్కారవిశేషః సాత్త్వికోఽపరః 13**

**ప్ర :** వృత్తి+అభావే = మనోవృత్తులు లేకుండుట, విరామః = విరామము; తత్ = ఆ విరామము యొక్క, ప్రత్యయః = నిశ్చితి, స్థిరత్వము; పరా విరతిః = పరమమైన విరతి (అనాసక్తత); తత్ = ఆ విరామముయొక్క, అభ్యాస+ఆదిః సంస్కారవిశేషః = అభ్యాసము మొదలగు సంస్కారవిశేషము, అపరః సాత్త్వికః = సాత్త్వికమైన దొకటి, అసంప్రజ్ఞాతసమాధి.

**తా :** చిత్తవృత్తులులేకుండుట **విరామ** మనబడును. ఆ విరామము స్థిరమైన స్థితి పరమమైన విరతి యనబడును. ఆ విరామాభ్యాసముయొక్క ఒకానొక సాత్త్వికసంస్కారవిశేషమే **అసంప్రజ్ఞాత సమాధి** యనునది, అనగా శాస్త్రజ్ఞానవాసనాదులు గూడ నశించి, ఇంద్రియముల సంబంధమును తెగగోసి, మనస్సు బ్రహ్మమున, స్వస్వరూపమును పొందును. *

**శ్లో॥ అయం విదేహప్రకృతిలయానాం భవహేతుకః ।**
**గోభూతాహఙ్కృతిమహత్ప్రకృత్యాత్మాత్మచిన్తకః ॥ 14**

**శ్లో॥ మన్వన్తరాణాం దశకమారభ్యాత్ర విలీయతే ।**
**దశోత్తరే గుణం నైతి లీనో యో నిర్గుణే పునః ॥ 15**

**ప్ర :** అయమ్ = ఈ, విదేహప్రకృతిలయానామ్ = దేహమును విడచి ప్రకృతిలో లీనమైన వారికి, భవహేతుకః = పునర్జన్మ హేతువగునది, గోభూత+అహంకృతి = ఇంద్రియాది పాంచభౌతిక ప్రకృతి అహంకారము అను, మహత్ ప్రకృత్యా = మహత్తు అనబడు ప్రకృతితో, ఆత్మచిన్తకః = ఆత్మవిచారముజేసిన, ఆత్మా = ఆత్మ, మన్వన్తరాణాం దశకం ఆరభ్య = మన్వంతరములు పదింటిని మొదలుకొని, అత్ర = ఆ మహత్ప్రకృతియొక్క మహదహంకారములో, దశోత్తరే గుణమ్ = ఉత్తరోత్తరము దశగుణముగా, విలీయతే = లీనమగును; యః = ఎవడు, నిర్గుణే = బ్రహ్మమునందు, లీనః = లీనమైయున్నవాడో, (సః = ఆతడు), పునః = మరల, న ఏతి = ఈ లోకమునకు వచ్చుట లేదు.

**తా :** పై శ్లోకమున చెప్పబడిన రీతి నిర్గుణపరబ్రహ్మమున లీనమైన వాడు మరల ఈ లోకమున జన్మించుటకు భవహేతువు లేనివాడగును. కాని దేహమును విడచి ప్రకృతిలో లయమైన వారికి, ఇంద్రియాహంకారము మహదహంకారమున లయము కాగా, అట్లు మన్వన్తరదశకముల పర్యంతము ఆత్మచింతన చేయుచు ఆత్మసాక్షాత్కారసాధనలో సాగును. *

**శ్లో॥ శ్రద్ధాయత్నక్రమధ్యానసమాధిప్రజ్ఞకాదికాః ।**
**ఉపాయప్రత్యయోఽసంప్రజ్ఞాతోఽన్యేషాం తు యోగినామ్ ॥ 16**

**ప్ర :** అన్యేషాం తు యోగినామ్ = ఇతరులైన యోగులకేమో, శ్రద్ధాయత్నక్రమధ్యానసమాధి ప్రజ్ఞక+ఆదికాః = శ్రద్ధతో కూడిన ప్రయత్నము, పరిణామఫలక్రమమున ధ్యానము, సమాధి, సత్త్వము మొదలగు, ఉపాయప్రత్యయః = ఉపాయములను ఆశ్రయించి పొందిన, అసంప్రజ్ఞాతః = అసంప్రజ్ఞాతసమాధి (లభించును).

**తా :** నిర్గుణోపాసనద్వారా లభించు అసంప్రజ్ఞాతసమాధి చెప్పబడినది కదా. ఆ మార్గము ననుసరించని తదితర యోగులకు శ్రద్ధతో ప్రయత్నము చేయగా క్రమముగా అష్టాంగయోగ సాధనఫలముగా అసంప్రజ్ఞాతసమాధి లభించును. *

**శ్లో॥ మృదుమధ్యాద్యుపాయాస్తే నవ తత్సిద్ధయేఽపి చ ।**
**ఆసన్నతీవ్రవిరతేస్తారతమ్యాత్తథాన్యతః ॥ 17**

**ప్ర :** తే చ ఉపాయాః = (పై జెప్పబడిన) ఉపాయములున్ను, మృదు-మధ్య+ఆది = మృదు, మధ్యమ, తీవ్రములను భేదములతో, తత్ సిద్ధయే అపి = ఆ సాధనసిద్ధికై గూడ, తీవ్ర విరతేః = తీవ్రవైరాగ్యమునకు, ఆసన్న = లభించునవి, నవ = తొమ్మిది; అన్యతః = వేరువాని విషయమున, తారతమ్యాత్ = తర-తమ భేదములను బట్టి, తథా = అట్లే (భావించనగును)

**తా :** ఆ ఉపాయములు మృదు, మధ్య, తీవ్ర అను భేదములతో తొమ్మిద విధములు కాగా, వైరాగ్యతీవ్రత లోని యీ హెచ్చుతగ్గుల కనుగుణముగా వాని సిద్ధియందును భేదములుండునని భావింపవలయును. *

**శ్లో॥ ఈశ్వరప్రణిధానాద్వా పుంవిశేషః స ఈశ్వరః ।**
**అవిద్యాక్లేశకర్మఫలాశయ వివర్జితః ॥ 18**

**ప్ర :** ఈశ్వరప్రణిధానాత్ వా = ఈశ్వరప్రణిధానమువలనను, సః ఈశ్వరః = ఆ ఈశ్వరుడు, అవిద్యాక్లేశకర్మఫలాశయవివర్జితః పుంవిశేషః = అవిద్య, క్లేశము, కర్మఫలాశయము అను లక్షణములు లేని పురుషుడు.

**తా :** ఈశ్వరునకు సర్వకర్మలను సమర్పించుటచేత గూడ ఆ అసంప్రజ్ఞాతసమాధిసిద్ధి లభించును. ఈశ్వరుడనగా, అవిద్యకు లోనుగాక, దుఃఖము నెఱుగక, కర్మఫలమునందు అపేక్ష లేకుండు విశేషపురుషుడు. ఈతడు జీవాహంకారపురుషుడు కాడు. *

శ్లో॥ సర్వజ్ఞబీజం నిఃశేషమనవచ్ఛిన్నసద్గురౌ ।
ప్రణవస్తద్వాచకస్తజ్జపస్తదర్థస్య భావనమ్ ॥ 19

ప్ర : అనవచ్ఛిన్నసద్గురౌ = అఖండరూపుడైన సద్గురునియందు, నిఃశేషమ్ = ఏమియు మిగిలిపోక సమస్తము చేరియున్న, సర్వజ్ఞబీజమ్ = సర్వజ్ఞుని బీజము, తత్ వాచకః = వానిని చెప్పునది, ప్రణవః = ఓంకారము, తత్ = ఆ ఓంకారముయొక్క, జపః = జపము చేయుట, తత్ అర్థస్య = దాని అర్థముయొక్క, భావనమ్ = గ్రహణము,

శ్లో॥ తతః ప్రత్యక్చైతన్యజ్ఞానం విఘ్నాత్యయస్తతః ।
వ్యాధిస్త్యానభ్రాన్తిదృష్టిప్రమాదాలస్య సంశయాః ॥ 20

ప్ర : తతః = ఆ జపమువలన, ప్రత్యక్చైతన్యజ్ఞానం = ప్రత్యగ్రూపము, దాని శక్తిని గూర్చిన జ్ఞానము, తతః = దానివలన, వ్యాధిః = రోగము, త్యానభ్రాన్తిదృష్టిప్రమాద = భ్రాంతి కలుగుటచే దృష్టి కేర్పడిన పొరబాటు, ఆలస్య = ఆలస్యము, సంశయాః = అనిశ్చితి అనబడు, విఘ్నాత్యయః = విఘ్నములు లేకుండుట,

**తా :** అఖండరూపుడైన సద్గురునియందు బ్రహ్మాది సమస్తదేవతలు నిశ్శేషముగా చేరి యుందురు. అట్టి సర్వజ్ఞసూచకబీజాక్షరము ఓంకారము. **ఓమిత్యేకాక్షరం బ్రహ్మ** యని అది బ్రహ్మావాచకము. ఆ యక్షరభావమును తెలిసి, జపించుటవలన ఒక ఉపాస్యదేవతదైన ప్రత్యగ్రూపము, ఆ దేవతాశక్తి, వీనిని గూర్చిన జ్ఞానము కలిగి, రోగము, భ్రమ, ప్రమాదము లేక పొరబాటు, ఆలస్యము, అనిశ్చితి అనబడు విఘ్నములు లేకుండును. *

శ్లో॥ భూమ్యలాభమనోస్థైర్యేఽవిరతిర్యోగఘాతకాః ।
తన్మూలాశ్చిత్తవిక్షేపే దౌర్మనస్య వ్యథాదయః ॥ 21

ప్ర : భూమ్యలాభమనోస్థైర్యే = గొప్ప లాభమైన మనః స్థిరత్వము నందు, అవిరతిః = వైరాగ్యము కలుగకుండుట, యోగఘాతకాః = యోగసాధనలోని విఘ్నములు, తత్+మూలాః = ఆ అవిరతికి మూలములు, చిత్తవిక్షేపే = మనస్సునకు గల విక్షేపశక్తి, అనగా బైటకు త్రోసివేయు శక్తి, దౌర్మనస్య = చెడ్డతలంపులు కలుగుట, వ్యథా = దుఃఖము, ఆదయః = మొదలగునవి.

**తా :** మనస్సు స్థిరమగుట గొప్ప లాభము. విఘ్నముల కారణముగా వైరాగ్యము కలుగదు. దానికి మూలము చిత్తముయొక్క విక్షేపశక్తి. ఇది వైరాగ్యభావనలను త్రోసి వేయును. దీనికి బలము చెడుతలంపులతో దుర్బలమైన మనస్సు. దానికి కారణము మనోవ్యథ మొదలగునవి. *

శ్లో॥ తన్నాశ ఈశభక్త్యైవ సుఖ్యకిక్షేమిపాపిషు ।
మైత్రీదయా ప్రీత్యుపేక్షాభావనాద్ధృత్ప్రసాదనమ్ ॥ 22

ప్ర : తత్+నాశః = వైరాగ్యనాశకమైన వాని నశింపు, ఈశభక్త్యా+ఏవ = ఈశ్వరునియందు భక్తి

వలననే; సుఖ్యకిక్షేమిపాపిషు = సుఖముగ నున్న వారియందు, క్షేమముగ నున్నవారియందు, పాపులయందు, ఈ క్రమమున, మైత్రీ = సుఖులందు మైత్రి, దయా = దుఃఖితులందు దయ, ప్రీతి = క్షేమమున్నచో ప్రీతి, ఉపేక్షా = పాపులందు ఉపేక్షా, ఈ యీ, భావనాత్ = భావనలు కలిగి యుండుటవలన, హృత్ = చిత్తముయొక్క ప్రసాదనమ్ = శాంతి లభించును.

**తా :** వైరాగ్యనాశకవిఘ్నములు నశించుట ఈశ్వరునియందలి భక్తిచేత మాత్రమే సాధ్యము. తన చుట్టు గల వారిలోని సుఖులపట్ల స్నేహభావన కలిగియుండుట; దుఃఖితుల యెడ దయగలిగి యుండుట; క్షేమముగ నున్నవారి యందు ప్రేమగ నుండుట; పాపులగు వారిపట్ల చూచి చూడనట్లు ఉపేక్షాభావముతో నుండుట; అను ఈ వైఖరివలన చిత్తశాంతి లభించును. *

**శ్లో॥ ప్రాణరేచనధృత్యా వా ప్రవృత్తిర్వాఽర్థవత్యపి ।**
**యద్యశోకా వా హృత్పద్మే జ్యోతిష్మత్యథవా హృది ॥ 23**

**శ్లో॥ వీతరాగస్థితే నిద్రాస్వప్నజ్ఞానావలమ్బితే ।**
**బాఢం ధ్యాయత్యభీష్టం వా స్థూలాద్యణ్వన్తవస్తు వా ॥ 24**

**ప్ర :** వా = లేక, ప్రాణరేచన ధృత్యా = ప్రాణాయామముచేత; వా = లేక, అర్థవతి+అపి ప్రవృత్తిః = అర్థవంతమైన ప్రవృత్తి, యది అశోకా వా = శోకరహితమైనదైనచో, హృత్ పద్మే = హృదయ పద్మమున, జ్యోతిష్మతీ = ప్రకటమైన జ్యోతిష్మతి, అథవా = కానిచో, వీతరాగస్థితే = రాగద్వేషాదులు లేని, నిద్రాస్వప్నజ్ఞాన+అవలంబితే = నిద్ర, స్వప్న దశలందు జ్ఞానమును బూనియున్న, హృది = మనసులో, అభీష్టమ్ = ఇష్టదేవతామూర్తిని, వా = లేక, స్థూలాది+అణు+అన్తవస్తు = స్థూలపదార్థమునుగాని, అణువుగా సూక్ష్మమైన వస్తువు పర్యంతము, బాఢమ్ = గాఢముగా, ధ్యాయతి వా = ధ్యానించు వానిలో గాని,

**తా :** సర్వదేవతారూపమైన ఓంకారమును ధ్యానించుట గూర్చి తెల్పిన తర్వాత, విఘ్నములను ప్రస్తావించి, వైరాగ్యసాధన, చిత్తశాంతి సాధనలను ప్రస్తావించి, సాకార సగుణాత్మక బ్రహ్మమును ధ్యానించుటను గూర్చి వివరింపబడినది. సగుణధ్యానము ఇష్టదేవతామూర్తి భావనతోగాని లేక సూక్ష్మస్థూల భేదములతో వస్తుధ్యానము గాని కావచ్చును. అప్పుడు ఆ సాధకుని మనస్సు నిర్మలమై యుండవలెను, అందు ధ్యానమూర్తి ప్రకటమై యుండవలెను. ఇది ప్రాణాయామముతో కూడ సాధ్యము. దీనిచే చిత్తశాంతి లభించును. *

**శ్లో॥ మణివద్గ్రాహ్యగ్రహణగ్రహీతృస్థవివృత్తిహృత్ ।**
**యా తదఞ్జనతా ప్రోక్తా సమాపత్తిశ్చతుర్విధా ॥ 25**

**ప్ర :** గ్రాహ్య-గ్రహణ-గ్రహీతృస్థ = గ్రహింపదగిన దానియందు, గ్రహించు కార్యమునందు, గ్రహించువానియందు ఉన్నటువంటి, మణివత్ = మణిని పోలిన, వివృత్తిహృత్ = ప్రకట

వ్యాపారములుగల మనస్సు, యా ప్రోక్తా = యేది చెప్పబడినదో, తత్ అంజనతా = దాని అభివ్యక్తి, చతుర్విధా = నాలుగు విధములగు, సమాపత్తిః = సమగ్రత గలది.

**తా :** మనస్సు మణిని పోలినది. అది గ్రహీత, దానికి గ్రహణక్రియాశక్తి యున్నది, అది గ్రాహ్యత గల దానిని గ్రహించును. అట్టి మనస్సున చిత్తవృత్తులు ప్రకటమగును. ఇట్టి ప్రకటనము నాలుగు రీతులై యుండును. *

**శ్లో॥ సవితర్కాత్ర శబ్దార్థవిద్వికల్పైర్విమిశ్రితా ।**
**స్మృతిశుద్ధౌ విరూపే వార్థైకభాసాపరానయా ॥ 26**

**శ్లో॥ సవిచారాన్యా చ సూక్ష్మార్థోక్తాస్యాః సూక్ష్మకార్థతా ।**
**అప్రధానం తు తా ఏవ సమాధిః స్యాత్సబీజకః ॥ 27**

**ప్ర :** అత్ర = ఈ నాల్గురీతుల సమాధిలో, సవితర్క = సవితర్కసమాధి అనునది, శబ్దార్థవిత్ = శబ్దార్థములను వేర్వేరుగా తెలిసినది, వికల్పైః విమిశ్రితా = సంశయములతో కలగలసినది; వా = లేక, స్మృతి శుద్ధౌ = శుద్ధమై, ధ్యేయవస్తుజ్ఞానములేని, విరూపే = స్వస్వరూపజ్ఞానములేని దానియందు, అర్థ+ఏకభాసా = ధ్యేయముతో లీనమైన స్థితి, అపరా = మరియొకటి, అనగా, నిర్వితర్కసమాధి; అనయా = ఆ నిర్వితర్కముచేత, అన్యా చ = మరియొకటియేమో, సవిచారా = సవిచారసమాధి అనునది, సూక్ష్మ+అర్థ+ఉక్తా = సూక్ష్మవిషయపరిజ్ఞానము కలిగియుండునది; అస్యాః = దానియొక్క, సూక్ష్మకార్థతా = సూక్ష్మవిషయత్వము, అప్రధానమ్ = ప్రధానము అనబడు ఆద్యాప్రకృతిమూలమైన నిర్విచారసమాధిస్థితి; తా ఏవ సమాధిః తు = అదియే సమాధిస్థితి, సబీజకః = సబీజసమాధి, స్యాత్ = అగును.

**తా :** సమాధిస్థితి నాల్గు విధములు: 1. సవితర్క, 2. నిర్వితర్క, 3. సవిచార, 4. నిర్విచార స్థితులు. ఈ నాల్గును సబీజసమాధివిశేషములే, అనగా సాధకుని ప్రాపంచికత స్థూలానుభవ సేంద్రియస్థాయినుండి నిద్రాణబీజస్థితికి చేరినవి కాని నశించినవి కావు. ఈ స్థితిలో వానికి తాను జ్ఞాతననియు, జ్ఞేయవస్తువిదియనియు, దాని జ్ఞానము తనకు కలదనియు స్థూలప్రకృతి స్థాయిలో స్పృహ యుండదు, కాని సూక్ష్మస్థితిలో ఉండవచ్చును. దానిని ప్రాకృతికలక్షణములతో గుర్తించుట సాధ్యము కాదు. అయినను, అది లేనే లేదని చెప్పరాదు. అట్టిది ఈ **సబీజసమాధి స్థితి**. *

**శ్లో॥ నిరూహస్వాస్థ్యే త్వయ్యాత్మప్రసాదోఽత్ర ఋతంభరా ।**
**ప్రజ్ఞా శ్రుతానుమానాన్యార్థశేషార్థత్వతో భృశమ్ ॥ 28**

**ప్ర :** నిరూహస్వాస్థ్యే = నిర్విచారసమాధిలో, త్వయి = నీ యందు, ఆత్మప్రసాదః = చిత్తశాంతి, అత్ర ప్రజ్ఞా = దానియందు జ్ఞానము, శ్రుత అనుమాన+అన్యార్థ–శేష+అర్థత్వతః = శ్రుత,

అనుమాన, అన్యార్థ, శేషార్థ ప్రమాణములు ఆవశ్యకముకాని, ఋతంభరా భృశమ్ = మిక్కిలిగా విశ్వజనీనసార్వకాలికసత్యము.

**తా : నిర్విచారసమాధిలో చిత్తశాంతి కలుగును**. దానియందు యెట్టి బాహ్యతార్కికప్రమాణములు నిమిత్తముగా అక్కరలేని విశుద్ధవిశ్వజనీనసార్వకాలికజ్ఞానము కలుగును. *

**శ్లో॥ సంస్కారస్తద్భవో హ్యన్యబాధకస్తన్నిరోధనే ।**
**సర్వప్రజ్ఞానిరోధాద్ధి స్యాన్నిర్బీజః సమాధిరుత్ ॥ 29**

**ప్ర :** తత్ భవః సంస్కారః = నిర్విచారసమాధివలన కలిగిన సంస్కారము, అన్యబాధకః హి = అన్యసంస్కారములకు బాధకము, అనగా, తత్ నిరోధనే = ఆ సంస్కారములను అడ్డుకొనుటలో, హి = ఏలన, సర్వప్రజ్ఞానిరోధాత్ = సర్వవిధముల జ్ఞానమును నిరోధించుటవలన, నిర్బీజః ఉత్ సమాధిః స్యాత్ = నిర్బీజమైన సర్వోత్తమసమాధి యగును.

**తా :** నిర్విచారసమాధివలన కలిగిన సంస్కారము, ఇంద్రియసంస్కారము, బుద్ధిసంస్కారము, ఇత్యాది అంతఃసంస్కారములను నిరోధించును. ఇది మేలే. ఏలయన, సర్వోత్తమసమాధిస్థితియైన నిర్బీజసమాధిస్థితి అన్ని విధముల బాహ్యాంతర్నిమిత్తజ్ఞానముల నిరోధమువలన మాత్రమే సాధ్యము. *

**శ్లో॥ క్రియా తపోజపేశార్చాః సిద్ధ్యై క్లేశహరాశ్చ తే ।**
**పఞ్చావిద్యాస్మితా రాగోద్వేషశ్చాభినివేశకః ॥ 30**

**ప్ర :** సిద్ధ్యై = ఆ సమాధి సిద్ధించుటకై, అవిద్యా = అవిద్య, అస్మితా = అహంకృతి, రాగః = కోరిక, ద్వేషః = ద్వేషము, అభినివేశకః చ = అభినివేశమున్ను, పంచ = ఐదు, తే = దాని యొక్క, క్లేశహరాః చ = క్లేశములను పోగొట్టునవియును, క్రియా = కార్యరూపమున, తపః = తపస్సు, జప = మంత్రజపము, ఈశ+అర్చాః = ఈశ్వరార్పణం.

**తా :** ఆ సమాధి సిద్ధించుటలో పంచ క్లేశములున్నవి : 1. అవిద్య, 2. అస్మిత, 3. రాగము, 4. ద్వేషము, 5. అభినివేశము. వీనికి క్రియారూపమున పరిహారములున్నవి : 1. తపస్సు, 2. మంత్రజపము, 3. ఈశ్వరార్పణము జేయుట. *

**శ్లో॥ ఆద్యాన్యహేతుర్విచ్ఛిన్నసుప్తోదారకృశాః పరే ।**
**అనిత్యాశుచిదుఃఖానాత్మస్వవిద్యాన్యభావనా ॥ 31**

**ప్ర :** ఆద్యా = అవిద్య, అన్య = అస్మితాది ఇతర క్లేశములకు, హేతుః = కారణము, విచ్ఛిన్న = విచ్ఛిన్నస్థితి, సుప్త = నిద్రాణస్థితి, ఉదార = ఉదారస్థితి, కృశాః = క్షీణస్థితి, పరే = వేరైనవి, అనిత్య = అశాశ్వతము, అశుచి = అపవిత్రము, దుఃఖ = దుఃఖము, అనాత్మసు = ఆత్మకాని వాని యందు, అన్యభావనా = వాని విరుద్ధభావము కలుగుటయే, అవిద్యా = అవిద్య.

**తా :** పై శ్లోకమున చెప్పబడిన అహంకార, రాగ, ద్వేష, అభినివేశములకు అవిద్యయే భూమిక, కారణము. ఇవి విచ్ఛిన్న, సుప్త, ఉదార, కృశ స్థితులలో నుండును. పూర్తిగా తొలగిపోయిన దనుకొన్న విషయము ఇంకను మిగిలియే యుండు స్థితి విచ్ఛిన్నస్థితి; నేలలో విత్తనంవలె అనుకూలతకై వేచియుండేది సుప్తస్థితి; అదుపు చేయకుంటే, ఎగసిపడే స్థితి, ఉదారస్థితి; విత్తనం దుర్బలమే, కానీ సజీవమే అయినది కృశస్థితి. అశాశ్వతమైన దానిని శాశ్వతమనియు, అపవిత్రమైన దానిని పవిత్రమనియు, దుఃఖమును సుఖమనియు, స్వస్వరూపముకాని దానిని, అనగా శరీరాదులను ఆత్మయనియు భ్రమించుట అవిద్య. *

**శ్లో॥ యద్దృగ్దర్శనశక్త్యోసు తాదాత్మ్యమివ సాఽస్మితా ।**
**స్యాత్సుఖానుశయీ రాగో ద్వేషో దుఃఖానుశయ్యథ ॥ 32**

**ప్ర :** యత్ తు = యేదయితే, దృక్+దర్శన–శక్త్యోః = దృక్‌శక్తి, దర్శనశక్తి అను ఈ రెండిటి యొక్క, తాదాత్మ్యం ఇవ = ఒక్కటిగా కలయికవలె (యేర్పడునో), సా = అది, అస్మితా = అహంకారము; (ఇది) సుఖ+అనుశయీ = సుఖము నాశ్రయించినదై, రాగః = రాగమగును; అథ = పిమ్మట, దుఃఖానుశయీ = దుఃఖమునాశ్రయించినదై, ద్వేషః = ద్వేషము, స్యాత్ = అగును.

**తా :** క్లేశాలలో మొదటిది, సర్వప్రధానమైనది **అహంకారం**. దీని నిర్వచనం : దృక్‌శక్తి, దర్శనశక్తి అను రెండింటి ఏకీభావం. ఇది సుఖంకర వస్తువుల నాశ్రయించి రాగముగను, దుఃఖకారకమైన వాని వలన ద్వేషముగను పరిణమిస్తుంది. *

**శ్లో॥ స్వారస్యవాహీ జ్ఞస్యాపి తథారూఢస్తు పశ్చిమః ।**
**ప్రతిప్రసవహేయాస్తే సూక్ష్మాస్తద్వృత్తయః పునః ॥ 33**

**ప్ర :** జ్ఞస్య+అపి = పండితునకైనను, స్వారస్యవాహీ = సంస్కారప్రవాహము, తథారూఢః తు = ఆ రీతివ్రేళ్ళూనినదేమో, పశ్చిమః = అభినివేశమనబడు క్లేశము; ప్రతిప్రసవహేయాః సూక్ష్మాః = సూక్ష్మమై, జన్మజన్మలకు వెంటదగిలి, పునః = మరల మరల వచ్చునవి, తత్ వృత్తయః = ఆ అభినివేశక్లేశవ్యాపారములు.

**తా :** జన్మజన్మలకు వెంటబడి వచ్చిన సూక్ష్మప్రవృత్తుల సమాహారమే సంస్కారముల ప్రవాహమై అభినివేశమను క్లేశమును కలిగించును. అనగా, జీవించియే ఉండవలెనను బలమైన కోరికగా, తదనుసారి మరణభయముగా కలుగు అనుభవము. *

**శ్లో॥ ధ్యానహేయా మలసమాః క్లేశమూలః క్రియాశయః ।**
**స్వదృష్టాదృష్టజననవేదనీయో యథాయథమ్ ॥ 34**

**ప్ర :** (పై శ్లోకములోని తత్ వృత్తయః = ఆ వ్యాపారములు), ధ్యానహేయాః = ధ్యానముచే తొలగింపదగిన, మలసమాః = మాలిన్యముతో సమానమైనవి; క్లేశమూలః = క్లేశములకు

మూలమైన, క్రియాశయః = కర్మ, యథాయథమ్ = క్రమముగా, స్వదృష్ట = తనకు తెలిసిన ప్రస్తుతపుది, అదృష్ట = తానెఱుగని పూర్వపు, జనన = జన్మలదిగా, వేదనీయా = తెలియదగినది.

**తా :** అభినివేశమను క్లేశమునకు మూలము కర్మ. ఈ కర్మ జీవి తానెఱిగిన ప్రస్తుతపు జన్మ సంబంధియు, తానిప్పుడెఱుగని పూర్వజన్మానుభవసంబంధియు, అని తెలియవచ్చును. ఈ క్లేశవ్యాపారములను ధ్యానముచే తొలగించుకొనవచ్చును. *

**శ్లో॥ సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగజోఽత్ర సః ।**
**పుణ్యాపుణ్యనిదానత్వాద్ధర్షతాపఫలః స్మృతః ॥ 35**

**ప్ర :** మూలే సతి = (క్లేశరూపమైన) మూలము ఉన్నదగుచుండగా, తత్ విపాకః = దాని పరిపక్వత, జాతి+ఆయుః+భోగజః = జన్మ, ఆయుర్దాయము, వీని అనుభవమువలన కలుగునది; అత్ర = ఈ విషయమున, సః = ఆ పరిపక్వత, పుణ్య+అపుణ్యనిదానత్వాత్ = పుణ్యపాపముల విచక్షణవలన, హర్షతాపఫలః = సుఖదుఃఖఫలములు కలదిగా, స్మృతః = తలంచబడినది.

**తా :** క్లేశమూలము ఉండనే ఉండగా, ఆ కర్మపరిపాకము జన్మకు, ఆయువునకు, జీవితాను-భవమునకు సంబంధించినదై యుండును. ఈ కర్మపరిపాకము పుణ్యకర్మ, పాపకర్మ అను విచక్షణ వలన వాని వాని ఫలములుగా సుఖములు, దుఃఖములు కలుగునని తలంచబడినది. *

**శ్లో॥ పరిణామతాపసంస్కృతిదుఃఖైర్గుణదోషవైరాచ్చ ।**
**సర్వం వివేకినామకమేవ హి హేయం త్వనాగతం దుఃఖమ్ ॥ 36**

**ప్ర :** పరిణామతాపసంస్కృతిదుఃఖైః = ఫలస్వరూపముగ లభించు సంస్కారమైన తాపము, దుఃఖము అను వీనిచే, గుణదోషవైరాత్ చ = గుణమునకు దోషమునకు మధ్య విరోధము వలన గూడ, సర్వం తు = సమస్తమును, అనాగతం హి = ఇప్పటికి రానిదైన, దుఃఖమ్ = దుఃఖము, వివేకినామ్ = వివేకముగల వారికి, హేయమ్ = సహించరాని, అకం ఏవ = దుఃఖమే.

**తా :** పుణ్యపాపకర్మల పర్యవసానముగ లభించు సంస్కారరూపమైన తాపము, దుఃఖము అను వాని వలనను, గుణదోషముల పరస్పరవిరోధమువలనను, ఇప్పటికి రానిదైనను, జీవితానుభవ-సర్వస్వము దుఃఖమయమేయని వివేకము గలవారికి తెలియును. *

**శ్లో॥ ద్రష్టదృశ్యోర్హేయహేతుః సంయోగో దృశ్యమత్ర తు ।**
**క్రియాప్రకాశసమ్బన్ధశీలం భూతేన్ద్రియాత్మకమ్ ॥ 37**

**ప్ర :** ద్రష్ట = అనుభవించువాడు, దృశ్యోః = అనుభవవస్తువు అను ఈ రెండిటియొక్క, సంయోగః = కలయిక, ఏకీభవనము, హేయహేతుః దృశ్యం తు = విడువదగిన కారణమైన దృశ్యము లేక అనుభవము అనునది,భూత+ఇన్ద్రియ+ఆత్మకమ్ = పంచభూతములు, కర్మజ్ఞానేంద్రియములు వీనితో కూడినదగు, క్రియాప్రకాశ-సంబంధ-శీలమ్ = వాని కార్యరూపసంబంధమైన శీలము గలది.

**తా :** ప్రపంచంలో చుట్టూ గల దృశ్యవస్తువులతో ద్రష్టయైన పురుషునకు తాదాత్మ్యం కలిగినప్పుడు, అది వాని అనుభవంగా మారుతుంది. ఈ అనుభవస్థితికి కారణమైనవి పంచభూతాత్మకమైన ఇంద్రియముల వ్యాపారములు. *

**శ్లో॥ క్రమాద్భోగాపవర్గార్థం గుణపర్వచతుష్టయమ్ ।**
**విశేషసామాన్యలింగమాత్రాలింగాని చేతి హి ॥ 38**

**ప్ర :** క్రమాత్ = క్రమముగ, భోగ+అవపర్గ+అర్థమ్ = భోగమునకు పర్యవసాయి పరమార్థము, గుణపర్వచతుష్టయమ్ = నాలుగు దశల గుణముల అతుకులు, విశేష = విశేషము, సామాన్య = సామాన్యము లేక అవిశేషము, లింగమాత్ర = లింగమాత్రము, చ = మరియు, అలింగాని = అలింగము, అనునవి, ఇతి హి = అనియే.

**తా :** జీవితపు అనుభవాలకొక పరమార్థం ఉన్నది. ఆ దిశగా గుణములు నాలుగు దశలలో ఉండును. ఇవి : 1. **విశేషము**, అనగా గుణములకు ప్రత్యేకము గుర్తింపు లక్షనాలుండి వ్యక్తి జీవితాన్ని నిర్వచించే స్థితిలో ఉండే దశ; 2. సామాన్య లేక అవిశేష దశ, అను సూక్ష్మదశ, ప్రత్యేకం గుర్తింపు అసాధ్యమయ్యే దశ; 3. లింగమాత్రదశ, గుణములు ఉండిలేనట్లుండే దశ; 4. అలింగదశ, అనగా గుణములు సమతూకంగా ఉండి ప్రత్యేకం నామరూపాలులేని దశ. *

**శ్లో॥ ద్రష్టా చిన్మాత్రః శుద్ధోఽపి ప్రత్యయేనానుపశ్యవత్ ।**
**దృశ్యం తు ద్రష్టృభోగార్థం కృతార్థస్యాప్యదృశ్యకమ్ ॥ 39**

**ప్ర :** ద్రష్టా = ద్రష్ట, చిత్+మాత్రః = బుద్ధి (జ్ఞాన) మాత్రుడు, శుద్ధః అపి = శుద్ధుడే, నిర్మలుడే, ప్రత్యయేన = కర్తృత్వభావన వలన కలిగిన అభిమానము చేత, అనుపశ్యవత్ = దృష్టిభేదము గలవాడు, దృశ్యం తు = దృశ్యము లేక అనుభవమేమో, ద్రష్టృభోగార్థమ్ = ద్రష్టయొక్క భోగము స్వరూపమైనది, కృతార్థస్య = దృశ్యమువలని పొందదగిన పరిణామలాభమును పొందిన వానికి, అదృశ్యకం అపి = ఆ దృశ్యానుభవము అదృశ్యమైనదే.

**తా :** ద్రష్ట అనుభవించువాడు. ఆతడు జ్ఞానమాత్రుడు కావున పరిశుద్ధుడే. అట్లయినను వానియందు కర్తృత్వభావన యున్నందువలన దృష్టిభేదమేర్పడి తదనుగుణముగా దృశ్యానుభవము కలుగుచున్నది. ఈ దృశ్యానుభవమునకు మహాప్రయోజనము ద్రష్టయొక్క క్రమపరిణామము. ఈ ప్రయోజనము సిద్ధించిన వానికి దృశ్యము, అనగా అనుభవరూపసంసారము అదృశ్యమై పోవును. *

**శ్లో॥ దృశ్యం తదన్యసామాన్యత్తత్ప్రత్యేకే మృతం స్వతః ।**
**సంయోగః స్వస్వామిశక్తిస్వరూపప్రాప్తిహేతుకః ॥ 40**

**ప్ర :** దృశ్యమ్ = దృశ్యము, అనగా ప్రాకృతికవస్తుభోగము, తత్ అన్య = అతడుకాని మిగత వారికి, సామాన్యాత్ = సాధారణానుభవంలో ఉన్నందున, తత్ప్రత్యేకే = ఆ ఒక్కనిలో మాత్రమే, స్వతః = ఆత్మానుభవమువలన, మృతమ్ = నశించినది; స్వ = ఆ ప్రకృతియొక్కయు, స్వామి =

ఆత్మయొక్కయు, శక్తిసంయోగః = శక్తులు రెండిటి కలయిక, స్వరూపప్రాప్తిహేతుకః = ఆత్మరూపజ్ఞానము కలుగుటకు కారణము.

**తా :** ప్రకృతి–పురుషుల కలయికయే విశ్వం. ప్రకృతియే దృశ్యం, అనగా అనుభవవస్తువు. పురుషుడే ద్రష్ట, అనగా అనుభవించువాడు. ఈ రెండు శక్తుల కలయికయే అనుభవం, అదే విశ్వం, నేను వేరు నేననుభవించు వస్తువు వేరు అన్న భావనాదృష్టితో కలయికవలన అనుభవం విశ్వరూపందాల్చి కనబడుతుంది. అట్లాకాక, ప్రకృతి–పురుషుల సంయోగం సంపూర్ణమై ఏకాకృతి యేర్పడినప్పుడు ఆత్మ లేక పురుషుడే శేషించి ప్రకృతి (దృశ్యం) మాయమైపోతుంది. ఇది ఆ యోగికి ప్రత్యేకంగా సిద్ధించిన స్థితి. మిగతవారి కందఱకు విశ్వం లేక దృశ్యం లేక ప్రకృతి పురుషుల ద్వైతసిద్ధియే. *

**శ్లో॥ అవిద్యా సంయోగహేతుస్తదభావే న సంయుజిః ।**
**తతో ముక్తదృశేర్మోక్ష ఉపచారోఽయమాత్మని ॥ 41**

**ప్ర :** సంయోగహేతుః = ప్రకృతి పురుషుల శక్తులు వేరుబడి కలయికయే, అవిద్యా = అవిద్య అనబడునది; తత్+అభావే = ఆ అవిద్య లోపించినప్పుడు, న సంయుజః = కలయిక లేదు; తతః = ఆ కారణమున, ముక్తదృశేః = దృశ్యమును, అనగా ప్రాకృతికానుభవమును విడచిన వానికి, మోక్షః = మోక్షము అనునది, అయం ఆత్మని = ఈ ఆత్మలో, ఉపచారః = మాటమాత్రపు గుర్తింపు.

**తా :** ప్రకృతిపురుషుల ద్వయీభావంలో జీవుడున్నంతకాలము వానికి యీ పాంచభౌతిక విశ్వం ప్రత్యేకముగా అనుభూతమగుచున్నది. ఇందుకేమి కారణమనగా, అవిద్య యని సమాధానము. ఈ అవిద్య నష్టమైతే, విద్య ప్రకాశిస్తుంది, ఆత్మసత్యత్వం గోచరమై అనాత్మరూపప్రకృతి అదృశ్యం అవుతుంది. ఆ స్థితిని చేరిన యోగికి మోక్షమనునది ఉత్తమాట. అనగా, ఆతడున్న స్థితికి పెట్టుకున్న ఒక పేరు మాత్రమే: ఆతడు ఆత్మసత్యత్వాన్నే ఆనందరూపుడై పొందియున్నాడు కదా! *

**శ్లో॥ హానోపాయోఽవిప్లవా యా వివేకఖ్యాతిరుత్తమా ।**
**యోగినస్తస్య తు ప్రజ్ఞా సప్తధా ప్రాన్తభూమికా ॥ 42**

**ప్ర :** అవిప్లవా = అవిచ్ఛిన్నమైన, ఉత్తమా = ఉత్తమమైన, వివేకఖ్యాతిః = వివేకముదయించుట, యా = యేదియో, సా = అది, హానోపాయః = అవిద్యను తొలగించు ఉపాయము; తస్య తు యోగినః ప్రజ్ఞా = అట్టి యోగియొక్క జ్ఞానము, సప్తధా = ఏడు విధములయిన, ప్రాన్తభూమికా = పరిసరక్షేత్రముగలది.

**తా :** ఉత్తమమైన, అవిచ్ఛిన్నమైన, వివేకముదయించుటచేతనే అవిద్య తొలగిపోవును. యోగులకీ ఉత్తమవివేకోదయము ఏడు అంచెలలో కలుగును. అవి ఇవి. 1. ఆధ్యాత్మికజ్ఞానం ఆంతరంగిక మను గుర్తింపు; 2. దుఃఖానుభవం కలుగకుండుట; 3. సమాధిస్థితిలో ఆత్మసమస్తత్వమును

అనుభవించుట; 4. సమాధినుండి వెలువడినప్పుడు గూడ బాహ్యప్రపంచం పూర్వమునకంటె భిన్నంగా తోచుట; 5. తనపై ఇంద్రియానుభవాలు, మనస్సు ప్రభావం చూపుటలేదని గుర్తింపు; 6. సత్త్వరజస్తమో గుణములు, జన్మసంస్కారములు తననుండి దూరమైనవని తెలియుట; 7. సాధకుడు తాను ఆత్మచైతన్యంలో లీనమై అద్వైతస్థితిలోని ఆనందమే తానైన అనుభవాన్ని పొందుట. *

**శ్లో॥ అవివేకాత్ జ్ఞానదీప్తిర్యోగాంగైరశుచిక్షయే ।**
**యమా అహింసాసద్బ్రహ్మచర్యాస్తేయాపరిగ్రహాః ॥ 43**

**ప్ర :** యోగాంగైః = యోగాంగములచేత, అశుచిక్షయే = మలినము నశించుటలో, అవివేకాత్ = వివేకరాహిత్యమునుండి, జ్ఞానదీప్తిః = జ్ఞానము ప్రకాశించుట; అహింసా = అహింస, సత్ = సత్యవాక్కు, బ్రహ్మచర్య = బ్రహ్మచర్యము, అస్తేయ = దొంగిలించకుండుట, అపరిగ్రహాః = అపరిగ్రహము, అనునవి, యమాః = యమములు.

**తా :** యోగమునకు అంగములైన 1. యమ, 2. నియమ, 3. ఆసన, 4. ప్రాణాయామ, 5. ప్రత్యాహార, 6. ధ్యాన, 7. ధారణ, 8. సమాధి, అను ఎన్మిదిని సాధన చేయుటచే మాలిన్యము నశించి జ్ఞానము ప్రకాశించును. మాలిన్య మనునది మనస్సును గ్రమ్మిన అవిద్య, అజ్ఞానము. ఈ యోగాంగము లెన్మిదిలో మొదటిదైన యమమునకు అంగము లయిదు : 1. అహింస, 2. సత్యము, 3. బ్రహ్మచర్యము, 4. అస్తేయము, 5. అపరిగ్రహము. *

**శ్లో॥ తే దేశకాలసమయజాత్యచ్ఛిన్నా మహావ్రతాః ।**
**లోభకృణ్మోహజాస్తే తు కృతానుమతమోదితాః ॥ 44**

**ప్ర :** తే = అవి (పైశ్లోకమున వివరించబడిన యమాది అష్టాంగములు, యమములుగా చెప్పబడిన అహింసా పంచకము), దేశకాలసమయజాతి+అచ్ఛిన్నాః = దేశముచేత, కాలముచేత, సమయము చేత, జాతిచేత, ఖండింపబడని, మహావ్రతాః = మహావ్రతములు; తే తు = అవియేమో, కృత+అనుమత = అనుమతి గలిగి, మోదితాః = ఆనందింపబడిన, లోభకృత్ = లోభమువలన కల్గిన, మోహజాః = మోహమువలన యేర్పడినవి.

**తా :** యమాదులు దేశకాలసమయజాతిభేదమువలన బాధింపబడవు. అనగా, పుణ్యతీర్థములలో మాత్రమే అహింసను పాటించవలె అన్యత్ర హింస నిషిద్ధము కాదు; శ్రాద్ధాది సమయములలో మాత్రము హింసవర్జ్యము; ఒక జాతివారు హింసచేయవచ్చును. వేరొకరు కూడదు; అను నిట్టి పరిమితులకు యమాదులు లోబడునవి కావు. అవి సర్వదా సర్వత్ర సర్వులు పాటించవలసిన మహావ్రతములు. లోభమోహాదులతో సంబంధమున, సాధకుని అనుమతితో మాత్రమే యీ యమములు సాధ్యము. *

**శ్లో॥ దుఃఖజ్ఞానానన్తఫలా మృదుమధ్యాధిమాత్రకాః ।**
**నియమాః శౌచసంతోషదేవభక్తితపాంసి తు ॥ 45**

ప్ర : దుఃఖజ్ఞాన = దుఃఖమును తెలియుట యను, అనన్తఫలాః =అంతులేని ఫలములు గలవి, మృదు మధ్య+ఆధి మాత్రకాః = అల్పములు, మధ్యస్థములు, తీవ్రములు అను భేదముగలవి, నియమాః తు = నియమములేమో, శౌచసంతోషదేవభక్తితపాంసి = శౌచము, సంతోషము, దైవము, భక్తి, తపస్సు అనునవి.

**తా :** దుఃఖజ్ఞానము అను అనంతఫలములనిచ్చునవి, అల్పమధ్యమతీవ్రభేదములతో నుండు నియమములు అయిదు : 1. శౌచము, 2. సంతోషము, 3. స్వాధ్యాయము, 4. ఈశ్వర–ప్రణిధానము, 5. తపస్సు. *

**శ్లో॥ వితర్కభావనే చిన్త్యం ప్రతిపక్షవిభావనమ్ ।**
**స్వాగ్రేఽవైరం త్వహింసాయాం సత్యే సిద్ధే ఫలాగమః ॥ 46**

ప్ర : వితర్కభావనే = వితర్క లేక విరుద్ధ భావము కలిగినప్పుడు, చిన్త్యమ్ = మనసున కలిగించ దగినది, ప్రతిపక్షవిభావనమ్ = ఆ భావమునకు విరుద్ధమైన భావమును విశేషముగ ప్రతిష్ఠించుట; స్వాగ్రే = తన సన్నిధిలో, అహింసాయామ్ = అహింసయందు, అవైరమ్ = విరోధభావము లేకుండుట, సత్యే సిద్ధే = సత్యము సిద్ధించినప్పుడు, ఫలాగమః = దాని ఫలము లభించుట.

**తా :** హింస భావమున మెదిలినప్పుడు, ఆ వితర్క భావమునకు విరుద్ధముగ అహింసభావమును ప్రతిష్ఠించవలెను. ఇట్లే మిగత వితర్కభావనల విషయము. ఇట్లు వితర్క విరుద్ధ భావములను బలముగ నిల్పుట ఫలవంతమగును, మనసులో రాదగిన భావములే ఉదయించును. **అహింసను పాటించుటవలన తన ముంగిట ప్రాణులు వైరముతో ప్రవర్తించవు**; సత్యవాక్పాలనవలన వాక్శుద్ధి లభించి ఆతని మాట సత్యమగును. *

**శ్లో॥ వీర్యం వర్ణిత్వేఽస్తేయేఽర్థాగమోఽన్యే జన్మవేదనమ్ ।**
**శౌచాత్స్వాఙ్గజుగుప్సాన్యాసంసర్గస్వాన్తరాల్లఘు ॥ 47**

ప్ర : వర్ణిత్వే = బ్రహ్మచర్యమునందు, వీర్యమ్ = వీర్యము సిద్ధించును, అస్తేయే = పరుల సొమ్మున కాసపడనప్పుడు, అర్థాగమః = ధనలాభము, అన్యే = అపరిగ్రహమును పాటించుట వలన, జన్మవేదనమ్ = జన్మకారణము తెలియవచ్చును, శౌచాత్ = శౌచమువలన, స్వాంగజుగుప్సా = తన దేహావయవముల పట్ల ఏహ్యాభావము, అన్య+సంసర్గను+అన్తరాత్ లఘు = ఇతరులతో దైహికసంబంధమునకు మనసులో అల్పత్వభావన.

**తా :** బ్రహ్మచర్యనిష్ఠవలన వీర్యసిద్ధి, అస్తేయమువలన ధనలాభము, అపరిగ్రహము వలన జన్మకారణము గూర్చి జ్ఞానము, శౌచమువలన తన శరీరముపై చుల్కన భావము, ఇతరులతో దేహసంబంధము అల్పమను తలంపు కలుగును. *

**శ్లో॥ సౌమనస్యేన్ద్రియజయహృత్‌స్థైర్యాత్మదృగర్హతా ।**
**సంతోషాద్వరసౌఖ్యాప్తిస్తపసోఽఙ్గాఙ్గిసిద్ధిరుత్ ॥** 48

**ప్ర :** సౌమనస్య = చిత్తశుద్ధి, ఇన్ద్రియజయ = ఇంద్రియప్రలోభములకు లొంగకుండుట, హృత్‌స్థైర్య = స్థిరచిత్తము, ఆత్మదృక్+అర్హతా = ఆత్మదర్శన యోగ్యత, సంతోషాత్ = సంతోషమువలన, వరసౌఖ్య+ఆప్తిః = శ్రేష్ఠమైన సుఖము కలుగుట, తపః = తపస్సువలన, అంగ+అంగిసిద్ధిః+ఉత్ = దేహసిద్ధి, ఇంద్రియసిద్ధియు.

**తా :** చిత్తశుద్ధి, ఇంద్రియములపై జయము, స్థిరచిత్తము, ఆత్మదర్శనయోగ్యత అనునవి కూడ అంతఃశౌచమునకు ఫలముగా కలుగును. సంతోషము సిద్ధించినందువలన ఉత్తమసుఖము, తపఃఫలముగా దేహసిద్ధి ఇంద్రియసిద్ధి లభించును. *

**శ్లో॥ స్వాధ్యాయాదిష్టదేవాప్తిః సమాధిర్దేవభక్తితః ।**
**ఆస్యా స్థిరసుఖం యత్నావిరామాచ్ఛేషచిన్తయా ॥** 49

**ప్ర :** స్వాధ్యాయాత్ = స్వాధ్యాయమువలన, ఇష్టదేవ+ఆప్తిః = ఇష్టదేవతానుగ్రహప్రాప్తి, దేవభక్తితః = దేవతాభక్తివలన, సమాధిః = సమాధిస్థితి, ఆస్యా = ఆసనము, స్థిరసుఖమ్ = స్థిరమున్ను, యత్న+అవిరామాత్ = ఎడతెగని సాధనవలన, శేషచిన్తయా = అవిరళచిన్తనముచేత,

**తా :** స్వాధ్యాయనిష్ఠవలన ఇష్టదేవతానుగ్రహం, దైవభక్తివలన సమాధి, విడువని సాధనవలన, నిత్యచింతనవలన ఆసనసిద్ధి స్థిరసుఖముగా కలుగును. *

**శ్లో॥ ద్వన్ద్వాభావస్తతోఽథాస్వాయామో వాయుగతిక్షతిః ।**
**రేచకైః పూరకైః కుమ్భైర్దేశకాలప్రమాణతః ॥** 50

**ప్ర :** తతః = దానివలన, ద్వన్ద్వ+అభావః = ద్వయభావము లోపించుట, అథ = అంతట, దేశకాలప్రమాణతః = దేశకాలప్రమాణముల ననుసరించి, రేచకైః = రేచకములతో, పూరకైః = పూరకములతో, కుంభైః = కుంభకములతో, వాయుగతిక్షతిః = వాయువుయొక్క చలనమును నిలుపుటను, ఆస్వాయామః = ప్రాణాయామము నాస్వాదింతుము.

**తా :** ఆ కారణమున నేను–నీవు, జీవుడు–దేవుడు, ప్రకృతి–పురుషుడు అను ఇట్టి ద్వయభావము లోపించును. అంతట దేశకాలప్రమాణముల ననుసరించి పూరక, కుంభక, రేచక ప్రక్రియలతో కూడిన ప్రాణాయామసాధనవలన వాయువుయొక్క, శ్వాసయొక్క చలనమును నియంత్రించ గలుగుదుము. *

**శ్లో॥ దీర్ఘః పరివృఢః సూక్ష్మస్త్రయ ఏతే చతుర్థకః ।**
**బాహ్యాన్తర్విషయాక్షేపీ తతః సత్త్వావృతిక్షతిః ॥** 51

**ప్ర :** త్రయః ఏతే = రేచక పూరక కుంభకములనబడు యీ మూడున్నూ, దీర్ఘః = చాలకాలము

నిల్పబడినది, పరివృఢః = నియంత్రించబడినది, సూక్ష్మః = అల్పకాలికము; బాహ్య+అన్తః +విషయ+ఆక్షేపీ = దేహము వెలుపలను, లోపలను, ఏవిషయము లేక వస్తువుపైన గాని నిల్పబడునది, తతః = దానివలన, సత్త్వ+ఆవృతిక్షతిః = జీవునియొక్క ఆవరణము క్షీణించుట, చతుర్థకః = నాలుగవది.

**తా :** రేచక పూరక కుంభక క్రియలు సుదీర్ఘకాలము సాగవచ్చును, నిలుపవచ్చును. ఇట్లు సాధకునకు తన ప్రాణముపై నియంత్రణ కలుగును. ఇది కాక, నాల్గవది : తనలోని యే వస్తువుపైన గాని, తన వెలుపల యే వస్తువుపైగాని తన ప్రాణమును తాను కోరినంతకాలము నిల్పగల్గును. ఇందువలన సాధకుని జీవావరణము క్షీణించును. *

**శ్లో॥ తతో హృద్ధారణాయోగ్యం చిత్తవృత్తానుకారవత్ ।**
**ప్రత్యాహారః స్వార్థాయోగే తత ఇన్ద్రియవశ్యతా ॥ 52**

**ప్ర :** తతః = ఆవరణ క్షయమైన తరువాత, హృత్ = మనస్సు, ధారణాయోగ్యమ్ = ధారణ యను యోగప్రక్రియకు అర్హత గలదగును. చిత్తవృత్త+అనుకారవత్ = చిత్తవృత్తిననుసరించి, తతః = ఆపై, స్వార్థయోగే = తనదైన విషయచింతలేకుండుటలో, ఇన్ద్రియవశ్యతా = ఇంద్రియములు స్వాధీనమగుట, ప్రత్యాహారః = ప్రత్యాహారము.

**తా :** ఆవరణక్షయము తరువాత మనస్సు **ధారణ** అను యోగసాధనకు సిద్ధమగును. ఆపై, ఇంద్రియములకు తమదైన విషయము లేవియు లేకుండుటవలన చిత్తవృత్తి ననుసరించి ఇంద్రియములు వశవర్తులగును. ఈ యోగాంగమునకు **ప్రత్యాహార**మని పేరు. *

**శ్లో॥ నాభ్యాదిదేశే హృత్స్థైర్యం ధారణాభీష్టచిన్తయా ।**
**ప్రత్యయైకాగ్రతా తత్ర ధ్యానం జ్ఞేయం తదేవ తు ॥ 53**

**ప్ర :** నాభి+ఆది-దేశే = నాభి మొదలగు యేదేని యొక ప్రదేశమున, హృత్ స్థైర్యమ్ = చిత్తమును స్థిరముగ నుంచుట, అభీష్టచిన్తయా = కోరినదాని గూర్చి లేక ఇష్టదైవమును గూర్చి చింతతో, ధారణా = ధారణ యనబడును; తత్ర = అక్కడ, ప్రత్యయ+ఏకాగ్రతా = చింతన ఏకోన్ముఖమగుట, తత్+ఏవ = అనునదియే, ధ్యానమ్ = ధ్యానముగా, జ్ఞేయం తు = తెలియదగినది.

**తా :** శరీరములో నాభి మొదలగు ఒక ప్రదేశమున మనస్సును నిశ్చలముగ నుంచి ఇష్టదైవమునో వేరొక ఇష్టవస్తువునో తలచుటకు **ధారణ** యని పేరు. ధారణలో ఈ అభీష్టచిన్తనము ఏకాగ్రమైనచో దానికి **ధ్యాన**మని పేరు. *

**శ్లో॥ రూపశూన్యమివార్థైకభాసమజ్ఞసమాధికః ।**
**సంయమస్త్రయమేకత్ర ప్రజ్ఞాలోకస్తు తజ్జయాత్ ॥ 54**

**ప్ర :** రూపశూన్యం ఇవ = రూపమే లేని దానివలె, అర్థ+ఏకభాసమ్ = అర్థమొక్కటే ప్రకాశించునది,

అంగసమాధికః = యోగాంగమైన సమాధి; త్రయమ్ = ధారణ, ధ్యానము, సమాధి అను మూడున్ను, ఏకత్ర = కలిసినది, సంయమః = సంయమము అనబడునది; తత్+జయాత్ తు = ఆ సంయమ స్థితిని పొందుట వలననే, ప్రజ్ఞా+ఆలోకః = సత్యజ్ఞాన దర్శనం.

**తా :** నామరూపాలుగల వస్తువు ఆశ్రయం లేకుండ అర్థం, అనగా సత్యం, తనకు తానుగా ప్రకాశించినప్పుడు సమాధిస్థితి కలుగుతుంది. ఇది యోగాంగములెన్మిదిలో నొకటి. కాగా, పై జెప్పబడిన యోగాంగములు ధారణ, ధ్యాన, సమాధులు మూటిని కలిపి **సంయమము** అందురు. ఈ సంయమసాధనవలన మాత్రమే స్వస్వరూపజ్ఞానం ప్రత్యక్షమగుట. *

**శ్లో॥ వినియోగస్తస్య భూమిష్వన్తరఙ్గమిదం త్రయమ్ ।**
**బహిరఙ్గం త్వబీజస్య సిద్ధిదః క్లేశహృత్ స చ॥ 55**

**ప్ర :** భూమిషు = ఆ యా క్షేత్రములందు, తస్య వినియోగః = దానిని ప్రయోగించుట లేక సాధనచేయుట, ఇదం త్రయమ్ = ఈ మూడు, అబీజస్య = నిర్బీజసమాధికి, అంతరంగమ్ = అంతరంగము; బహిరంగం తు = బహిరంగమేమో, క్లేశహృత్ = క్లేశమును హరించునది; సః చ = అదియును, సిద్ధిదః = సిద్ధిప్రదము.

**తా :** ఈ మూడున్నూ నిర్బీజసమాధికి బహిరంగము; సంయమము అంతరంగము. ఈ యోగాంగములను ఆ యా క్షేత్రములలో నొకటొకటిగ సాధించి క్లేశమును హరించికొని సిద్ధి నొందదగును. *

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ద్వితీయాష్టకే ప్రథమోఽధ్యాయః ॥

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## ద్వితీయాష్టకము - ద్వితీయాధ్యాయము

**శ్లో॥ సుషుమ్ణాజ్ఞో నరః స్త్రీ వా యువా బాలో జరన్నపి ।**
**యోగాభ్యాసేఽధికారీ స్యాదభ్యాసాత్సిద్ధిభాగపి ॥ 1**

**ప్రతిపదార్థం :** స్త్రీ = స్త్రీ, వా = లేక, యువా = యువకుడు, బాలః = బాలుడు, జరన్+అపి = ముదుసలి యైనను, నరః = మానవుడు, సుషుమ్ణాజ్ఞః = సుషుమ్ణా నాడి సరణిని తెలిసిన వాడు, యోగ+అభ్యాసే = యోగసాధనయందు, అధికారీ స్యాత్ = అధికారి యగును, అభ్యాసాత్ = సాధనవలన, సిద్ధిభాక్ అపి = సిద్ధిని గూడ పొందును.

**తాత్పర్యం :** స్త్రీయైనను, యువకుడైనను, బాలుడైనను, వృద్ధుడైనను, ఈ జాతి, దశ, స్థితి భేదములకు లోబడక సుషుమ్ణా నాడిని గుర్తించి దాని సరళిని తెలిసినవాడు ఎవడైనను యోగసాధన చేయుటకు అర్హుడగును. అట్లే సాధనవలన సిద్ధిని పొందుటకు గూడ అర్హుడే యగును. *

**శ్లో॥ సర్వేఽప్యాశ్రమిణో వర్ణా యోగాభ్యాసేఽధికారిణః ।**
**భిక్షుర్విశేషాన్నియతం బ్రహ్మచర్యాది తస్య యత్ ॥ 2**

ప్ర : సర్వే ఆశ్రమిణః అపి = అన్ని ఆశ్రమముల వారున్ను, వర్ణాః = వర్ణముల వారున్ను, యోగాభ్యాసే = యోగసాధనయందు, అధికారిణః = అర్హులు, విశేషాత్ = విశేషముగా, భిక్షుః = సంన్యాసి, బ్రహ్మచర్యాది = బ్రహ్మచర్యము మొదలగు, యత్ నియతమ్ = ఏది శాస్త్రబద్ధమో, (తత్ = అది), తస్య = వానికి,

**శ్లో॥ యతేర్యస్యోదరే భిక్షోర్యోగాభ్యాసేన జీర్యతే ।**
**గృహిణా దత్తమన్నం స తం తారయతి నేతరః ॥ 3**

ప్ర : గృహిణా = గృహస్థుని చేత, దత్తమ్ = ఇవ్వబడిన, అన్నమ్ = అన్నము, యస్య యతేః భిక్షోః = భిక్షగైకొన్న యే యతియొక్క, ఉదరే = కడుపులో, యోగ+అభ్యాసేన = యోగసాధనతో,

జీర్యతే = జీర్ణించుకొనబడునో, సః = ఆ అన్నము, తమ్ = ఆ గృహస్థును, తారయతి = తరింపజేయును, న ఇతరః = వేరొకటి కాదు.

**తా :** అన్ని వర్ణములవారు, ఆశ్రమముల వారు, యోగసాధన కర్హులే. విశేషముగా, బ్రహ్మచర్యాది నియమములను పాటించుచు భిక్షకుడైన సంన్యాసికిచ్చిన అన్నము యేది వానికి భుక్తమగునో, ఆ అన్నమిచ్చిన గృహస్థుని ఆ అన్నమే సంసారబాధలనుండి ముక్తుని చేయును. వేరు దానముల చేత కాదు. *

**శ్లో॥ యోగీ యస్య గృహే భిక్షుర్యాతి ధన్యస్తదాశ్రమః ।**
**స భిక్షుర్యద్గృహే భుఙ్క్తే తత్ర భుఙ్క్తే హరిః స్వయమ్ ॥ 4**

**ప్ర :** యస్య గృహే = ఎవని ఇంటిలో, యోగీ = యోగి, భిక్షుః = భిక్షకై, యాతి = వచ్చునో, తత్+ఆశ్రమః = వానియొక్క గృహస్థాశ్రమము, ధన్యః = ధన్యము, యత్ గృహే = యే ఇంటి యందు, సః భిక్షుః = అట్టి భిక్షువు, భుంక్తే = భుజించునో, తత్ర = ఆ ఇంటిలో, స్వయం హరిః = స్వయముగా విష్ణువే, భుంక్తే = భుజించును.

**తా :** యే గృహస్థు యింట భిక్షను స్వీకరించి యోగి భుజించునో, ఆ గృహస్థుని ఆశ్రమము ధన్యము. ఆ భిక్షువు భుజించిన చోట స్వయముగ విష్ణువే భుజించిన ఫలము లభించును. *

**శ్లో॥ యతః పరాఙ్ముఖో భిక్షుస్తతో దేవాః పరాఙ్ముఖాః ।**
**తస్మాద్దేయం కిమప్యస్మై దేవర్షిపితృతృప్తిదమ్ ॥ 5**

**ప్ర :** భిక్షుః = భిక్షువు, యతః = దేనినుండి, పరాఙ్ముఖః = విముఖుడగునో, తతః = దాని నుండి, దేవాః = దేవతలు, పరాఙ్ముఖాః = విముఖులు, తస్మాత్ = ఆ కారణమున, తస్మై = వానికి, దేవర్షిపితృతృప్తిదం కిం అపి = దేవతలకు, ఋషులకు, పితరులకు, సంతోషము కలిగించునదేదైనను, దేయం = ఇవ్వదగినది.

**తా :** భిక్షువు దేనినుండి పెడమొగమై వెడలునో దానినుండి దేవతలు పెడమొగమగుదురు. కావున దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు తృప్తిని కలిగించునదేదియైన ఆ యోగిభిక్షువునకు సమర్పించవలెను.

**శ్లో॥ యతయేఽన్నం గ్రాసమాత్రమాద్యన్తజలదానయుక్ ।**
**దత్తం చేన్మేరుజలధితుల్యం తదితి హి స్మృతమ్ ॥ 6**

**ప్ర :** గ్రాసమాత్రం అన్నమ్ = ఒక్క ముద్ద అన్నము, ఆద్యన్త-జలదానయుక్ = నీటితో కూడి సమగ్రముగ, యతయే = యతికి, దత్తం చేత్ = ఇవ్వడినట్లయిన, తత్ = అది, మేరుజలధితుల్యం = మేరుపర్వతమంత, సముద్రమంత, ఇతి హి = అని యే, స్మృతమ్ = తలంచబడినది.

**తా :** యతికి సమర్పించబడిన అన్నము ఒక్క ముద్దయైనను, నీరు ఒక గ్రుక్కెడైనను, అది మేరుపర్వతమంతగా, సముద్రమంతగా భావింపబడును.

**శ్లో॥ వాసోఽన్నం చ మితం దేయం యతయే సోఽధికం యది ।**
**ఆదత్తే స్తేన ఏవ స్యాత్పాపోఽన్నరసలోలుపః ॥ 7**

**ప్ర :** యతయే = యతికి, వాసః = వస్త్రము, అన్నం చ = అన్నమున్ను, మితమ్ = మితముగా, దేయమ్ = ఇవ్వదగును, యది అధికం ఆదత్తే = ఒకవేళ అధికముగా స్వీకరించినట్లయిన, సః = ఆ యతి, అన్నరసలోలుపః = భోజన లంపటుడైన, పాపః స్తేనః = పాపియగు దొంగ, స్యాత్ ఏవ = కానే యగును.

**తా :** యతికి సమర్పించువారు అన్నవస్త్రములను శరీరధారణకవసరమైన మాత్రము సమర్పించ వలెను. ఒకవేళ ఆ యతి వానిని అధికముగా స్వీకరించినచో, ఆతడు భోజనప్రియత్వము వలన పాపియై దొంగ యగును. అస్తేయమనునది యతి కాచరణీయమైన యమములలో నొకటి కదా.

**శ్లో॥ ధూర్తః శఠో యతిర్భోగీ శౌచం ధ్యానం విహాయ యః ।**
**వ్రాత్యవద్వర్తతే సోఽజ్ఞో దుఃఖభాగుభయత్ర హి ॥ 8**

**ప్ర :** శౌచమ్ = బహిరంతః శుచిత్వమును, ధ్యానమ్ = ధ్యానమును, విహాయ = విడచి, వ్రాత్యవత్ = హీనునివలె, యః యతిః = యే యోగి, ధూర్తః = ధూర్తుడై, శఠః = మూర్ఖుడై, భోగీ = భోగియై, వర్తతే = ప్రవర్తించునో, సః = ఆ, అజ్ఞః = అజ్ఞాని, ఉభయత్ర = ఇహపరములందు రెండిటను, దుఃఖభాక్ హి = దుఃఖమును పొందువాడే.

**తా :** అంతరంగబహిరంగములలో శుచికాక, ధ్యానమును విడచి, తనవర్ణాశ్రమధర్మములనుండి పతితుడై, దుర్జనుడు, మూర్ఖుడు, భోగపరాయణుడుగా ప్రవర్తించు యతి అజ్ఞాని, ఇహపరములు రెండిట చెడినవాడై దుఃఖమును పొందును.

**శ్లో॥ సంన్యాసిత్వం లోకే సుదుర్లభం ప్రాప్య తద్యోఽత్ర చ ।**
**తస్మాత్ప్రచ్యవతే చేద్యాతి చిరం దుర్గతిం స చాన్యత్ర ॥ 9**

**ప్ర :** లోకే = లోకములో, సుదుర్లభమ్ = అతికష్టసాధ్యమైన, సంన్యాసిత్వమ్ = సంన్యాసమును, ప్రాప్య = పొంది, తస్మాత్ = ఆ కారణమువలన, యః = ఎవడు, అత్ర = లోకమున, ప్రచ్యవతే చేత్ = పతనమైనచో, సః = ఆతడు, అన్యత్ర = పరలోకమున, చిరమ్ = చాలకాలము, దుర్గతిమ్ = పొందరాని గతిని, యాతి = పొందును.

**తా :** కష్టసాధ్యమైన సంన్యాసస్థితిని పొంది కూడ, ఆ కారణమువలననే యెవడు లోకవ్యవహారములో పతనము చెందునో, అట్టివాడు పరమునుండి కూడ పతనమునే చెందును. దీనిని గడచుటకు చాలకాలము అనుభవించవలెను.

**శ్లో॥ విశేషాద్యతినా తస్మాద్యోగాభ్యాసేన చాత్మనః ।**
**ప్రాక్సిద్ధరూపమాప్తవ్యమధఃపాతోఽన్యథాఽస్య హి ॥ 10**

**ప్ర :** తస్మాత్ = అందువలన, యతినా = యతిచేత, యోగాభ్యాసేన = యోగాభ్యాసముచేత, ఆత్మనః = ఆత్మయొక్క, ప్రాక్ సిద్ధరూపమ్ = బ్రహ్మరూపమును, విశేషాత్ = విశేషముగా, ఆప్తవ్యమ్ = పొందదగి యున్నది, అన్యథా = అట్లుకానిచో, అస్య = వానికి, అధఃపాతః హి = అధఃపతనమే.

**తా :** పై జెప్పబడిన కారణమువలన యతియైన వాడు యోగాభ్యాసమువలన ఆత్మస్వరూప జ్ఞానమును పొందవలెను. కానిచో వానికి అధోగతి తప్పదు.

**శ్లో॥ సత్యోఽద్వైతోఽపి జీవోఽయమాత్మాంశోఽజోఽప్యవిక్రయః ।**
**అప్రమేయోఽవ్యయోఽచ్ఛేద్యోఽదాహ్యోఽక్లేద్యో హ్యశోషకః ॥ 11**

**ప్ర :** అద్వైతః = అద్వైతము, సత్యః అపి = సత్యమే, అయం జీవః = ఈ జీవుడు, ఆత్మ+అంశః = ఆత్మయొక్క అంశము, అజః = జననరహితుడు, అపి విక్రయః = క్రియాశూన్యుడు కూడ, అప్రమేయః = శబ్దాది ప్రమాణరహితుడు, అవ్యయః = అవినాశి, అచ్ఛేద్యః = అఖండైక స్వరూపుడు, అదాహ్యః = దహింపరాని వాడు, అక్లేద్యః = తడుపరానివాడు, అశోషకః హి = క్షీణించని వాడున్ను.

**తా :** ఆత్మ, జీవుడు అనునవి వేర్వేరుగ రెండు లేవు అనునది నిజమే. ఆత్మలో జీవుడొక అంశమే. ఆత్మవలెనే జీవుడు కూడ పుట్టుక లేనివాడు, క్రియాశూన్యుడు, తర్కప్రమాణములకు లొంగనివాడు, నాశములేని శాశ్వతుడు, అఖండస్వరూపుడు, దహింపబడడు, తడుపబడడు, క్షీణించడు.

**శ్లో॥ స్వాత్మావబోధః స్వారామో ధ్రువోఽసఙ్గోఽపి కేవలః ।**
**మలినోఽభూదవిద్యాంశైర్మలచ్ఛన్నసువర్ణవత్ ॥ 12**

**ప్ర :** స్వ+ఆత్మ+అవబోధః = తన ఆత్మయందే జ్ఞానము గలుగువాడు, స్వ+ఆరామో = తనయందే తాను విశ్రమించి రమించువాడు, ధ్రువః = శాశ్వతుడు, అసంగః = తగులము లేనివాడు, అపి = మరియు, కేవలః = కేవలుడు, అవిద్యాంశైః = అవిద్యలక్షణములచేత, మలచ్ఛన్న = మట్టితో కలసి మురికియైన, సువర్ణవత్ = బంగారమువలె, మలినః అభూత్ = మలినము గలవాడాయెను.

**తా :** ఉదయించిన ఆత్మజ్ఞానము గలవాడై, ఆత్మదర్శనమందే ఆనందించువాడై, శాశ్వతుడై, దేని ప్రభావమునకు లోబడనివాడై కేవలుడే ఐనను ఆ జీవుడు అవిద్య యను మలినము కప్పియున్నందున, మట్టితో కలిసియున్న బంగారమువలె, మలినుడై యున్నాడు. *

**శ్లో॥ యోగోజ్జ్వలితవిద్వహ్నౌ దగ్ధ్వాఽఽత్మానం స పూర్వవత్ ।**
**స్వరూపం శుద్ధమాప్నోతి హేమాగ్నావివలోహయుక్ ॥ 13**

**ప్ర :** అగ్నౌ = అగ్నిలో, లోహయుక్ = లోహముతో కలిసియున్న, హేమ ఇవ = బంగారము వలె, యోగ = యోగముచేత, ఉత్+జ్వలిత = బాగుగ మండించబడిన, విద్+వహ్నౌ = జ్ఞానాగ్నిలో, ఆత్మానమ్ = తననుతాను, దగ్ధ్వా = పుటము బెట్టి, సః = ఆ జీవుడు, పూర్వవత్ = ముందటివలె, శుద్ధం స్వరూపమ్ = మలినములేని తన రూపమును, ఆప్నోతి = పొందును.

**తా :** అన్య లోహముతో కలిసియున్న బంగారమును నిప్పులో కరిగించి శుద్ధమైన బంగారమును వేరుజేసి పొందినట్లు, యోగాగ్నిలో పుటము బెట్టి అవిద్యను తొలగించి జీవుడు తనను తాను శుద్ధిచేసికొని స్వస్వరూపాత్మజ్ఞానమును పొందును.

**శ్లో॥ ఆత్మాస్మీత్యుపగన్తవ్యం న ప్రతీకం యతో న సః ।**
**కార్యోత్కర్షాదాత్మదృష్టిః ప్రతీకేఽఙ్కే తు తన్మతిః ॥ 14**

**ప్ర :** ఆత్మా = ఆత్మ, (అహం) అస్మి = (నేను) అయియున్నాను, ఇతి = అని, ఉపగన్తవ్యమ్ = లక్ష్యముగా చేసికొనవలెను. ప్రతీకమ్ = సంకేతమును, న = కాదు, యతః = ఎందువలన, సః = ఉపాసకుడు, న = (ప్రతీకము) కాడో, (తతః = అందువలన), ఉత్కర్షాత్ = ప్రాభవమువలన, ఆత్మదృష్టిః = ఆత్మభావన, ప్రతీకే అంకే తు = సంకేతముగా నున్న గురుతు నందేమో, తత్+మతిః = ఆత్మయను బుద్ధి, కార్యా = చేయదగినది.

**తా :** నేను ఆత్మను అన్నది లక్ష్యముగా ఉపాసకుడు సాధన చేయవలెను. దేహము, ఇంద్రియములు ఇత్యాది పరిమితులు ప్రాపంచికముగ అనుభవములో నున్నను, ప్రాభవములో తాను ఆత్మయే తప్ప ఇవేవియు కాను, అనియు, ఉపాసనకై యే దేవతామూర్తి ఎదురుగా నుండునో, ఆ మూర్తి సాక్షాత్ తాను ఉపాసించు దేవతయే కేవల మొక గుర్తు కాదు, అనియు బుద్ధి నుంచవలె. తన దేహేంద్రియాదులు తాను కాక, ఆత్మయే తానైనట్లు, తన ముందున్న ఉపాస్యదేవతాప్రతిమ, ఒక సంకేతము కాక సాక్షాత్ ఆ దేవతయే అను భావము బుద్ధినుంచవలె.

**శ్లో॥ ఇత్యాత్మాధిగమాభ్యాసాత్సర్వకర్మవిదో బుధః ।**
**ఆదేహపాతమారబ్ధభోగ ఏవాధికారిణః ॥ 15**

**ప్ర :** ఇతి = ఇట్లని, ఆత్మ+అధిగమ+అభ్యాసాత్ = ఆత్మజ్ఞానమును సాధన చేయుట వలన, సర్వకర్మవిదః = అన్ని కర్మల నాచరించువాడు, బుధః = పండితుడు. (**సర్వకర్మక్షయో విదః** అని పాఠాంతరము. అనగా అన్ని కర్మలు నిర్బాధకములైన వాడు పండితుడు, అని అర్థము). అధికారిణః = అనుభవించువానికి, కర్తకు, ఆదేహపాతమ్ = జన్మించునది మొదలు, ఆరబ్ధ = ఆరంభమైన, భోగః ఏవ = కర్మఫలానుభవమే.

**తా :** ఆత్మజ్ఞానసాధకుడు ఈ విధముగా (తాను ఆత్మయే అను ఎఱుకతో) కర్మలన్నిటిని చేయును కావున ఆతడు పండితుడు. వాని కర్మలు అకర్మలుగా మారును. కాగా, వాని జన్మతో అనుభవము మొదలైన కర్మఫలము మాత్రము ఆతడనుభవించవలసి యుండును.

**శ్లో॥ చిత్తే గోవృత్తివిలయస్తస్య ప్రాణేఽస్య చాత్మని ।**
**విద్యాప్రకాశితహృదా స యాత్యాద్యం సుషుమ్ణయా ॥** 16

**ప్ర :** చిత్తే = మనసునందు, గో వృత్తి విలయః = ఇంద్రియవ్యాపారములయొక్క విశేషనష్టము, తస్య = ఆ చిత్తముయొక్క (విలయః = లీనమగుట), ప్రాణే = ప్రాణమునందు, చ = మరియు, అస్య = ఆ ప్రాణముయొక్క, (విలయః = లీనమగుట), ఆత్మని = ఆత్మయందు; విద్యా = జ్ఞానముచే, ప్రకాశిత = వెలుగు నింపబడిన, హృదా = మనస్సుతో, సః = ఆతడు, సుషుమ్ణయా = సుషుమ్ణానాడివెంట, ఆద్యమ్ = బ్రహ్మమును, యాతి = చేరును.

**తా :** ఆ సాధకుని ఇంద్రియవ్యాపారములు చిత్తమున లీనమగును; ఆ చిత్తము ప్రాణమున లీనమగును; ఆ ప్రాణము ఆత్మలో లీనమగును. జ్ఞానసందీప్తమగు మనస్సుతో నతడు సుషుమ్ణా నాడి వెంట ప్రయాణించి బ్రహ్మమును చేరును.

**శ్లో॥ న శుక్లగత్యపేక్షాఽస్య విదో రశ్మ్యనుసారిణః ।**
**నేదం లభ్యం సంసరతోఽజ్ఞస్య కర్మానుయాయినః ॥** 17

**ప్ర :** అస్య విదః = ఆ జ్ఞానికి, శుక్లగతి+అపేక్షా = శుక్లపక్షమున ప్రాణోత్క్రమణమనియు, శుక్లమార్గమున జీవుని ప్రయాణమనియు కోరిక, న = లేదు, (ఎందువలన? అనగా) రశ్మి+అనుసారిణః = ఆతడు సుషుమ్ణామార్గమును అనుసరించు వాడు; కర్మ+అనుయాయినః = కర్మమార్గమునుసరించు, సంసరతః = అవిద్యతో ప్రయాణించు, అజ్ఞస్య = అజ్ఞానికి, ఇదమ్ = సర్వకారణమైన ఆద్య బ్రహ్మము, న లభ్యమ్ = లభించదు.

**తా :** అట్టి జ్ఞానికి శుక్లమార్గగమనము కలుగదు. ఏలన, అతడు సుషుమ్ణామార్గమున సాగును. అట్లుకాక, కర్మబద్ధుడై అవిద్యమార్గమున సాగు అజ్ఞానికి ఈ సర్వకారణమైన ఆద్యబ్రహ్మము లభించదు.

**శ్లో॥ కృతినో యాన్త్యర్చిరాద్యైరస్వతన్త్రాః పరే త్వధః ।**
**తద్భ్రమో మాయికే పాదే దత్తలోకే విదో గతిః ॥** 18

**ప్ర :** కృతినః = శాస్త్రోక్తవిధానము ననుసరించి జీవించిన వారు, అస్వతన్త్రాః = కర్మబద్ధులై, అర్చిః+ఆద్యైః = అగ్నికార్యము మొదలగువానిచే, యాన్తి = సాగుచున్నారు; పరే తు = అన్యులేమో, అధః = అధోలోకముల దిశగా (సాగుచున్నారు), తత్ = వారియొక్క, భ్రమః = చలనము, గతి, మాయికే పాదే = మాయామయస్థానములలో, విదః గతిః = జ్ఞానియొక్క గమ్యము, దత్తలోకే = దత్తలోకమునందు.

**తా :** శాస్త్రోక్తవిధిని కర్మాచరణముతో జీవించు నైష్ఠికులు క్రమముక్తిమార్గమున సాగుచుండగా, శాస్త్రవిరుద్ధముగ జీవించు వారు మాయామయమైన అధోలోకములలో మరల మరల పుట్టుచు, చచ్చుచు, సుడిబడుచున్నారు. **జ్ఞానిమాత్రము శ్రీదత్తలోకమునకు చేరును.**

**శ్లో॥ పూర్వసిద్ధం చిదానన్దైకరసం భూమ నిష్కలమ్ ।**
**స్వరూపం జ్ఞానయోగేన గతో నావర్తతే పునః ॥ 19**

ప్ర : పూర్వసిద్ధమ్ = క్రొత్తగా పుట్టినది కాక స్వయం సిద్ధమైయున్న, చిత్+ఆనన్ద+ఏకరసమ్ = జ్ఞానానందనుభవమొక్కటియేయై, భూమ = అఖండమై, నిష్కలమ్ = అవిభాజ్యమైన, స్వరూపమ్ = (తనదైన) ఆత్మరూపమును, జ్ఞానయోగేన = జ్ఞానయోగము చేత, గతః = పొందినవాడు, పునః = మరల, న ఆవర్తతే = జనన మరణ చక్రమున బడి తిరుగాడడు.

**తా :** స్వయంసిద్ధమైన అఖండ, అవిభాజ్య, జ్ఞానానంద కేవలమైన ఆత్మదర్శనమును జ్ఞానయోగముచే పొందిన వాడు మరల జననమరణచక్రమున పరిభ్రమించడు.

**శ్లో॥ సత్యవైకుణ్ఠకైలాసలోకానామప్యుపర్యయమ్ ।**
**దత్తాత్రేయలోకోఽస్తి ప్రసిద్ధోఽమృతసంజ్ఞితః ॥ 20**

ప్ర : సత్యవైకుణ్ఠకైలాసలోకానాం అపి = సత్యలోకము, వైకుంఠము, కైలాసము, అని వీనికంటెను, ఉపర్యయమ్ = పైనున్న లోకము, దత్తాత్రేయలోకః = దత్తాత్రేయలోకము, అమృతసంజ్ఞితః = అమృతలోకమను పేరుతో, ప్రసిద్ధః = ప్రసిద్ధమై, అస్తి = ఉన్నది.

**తా :** బ్రహ్మలోకము, విష్ణులోకము, శివుని లోకము, వీని అన్నిటికి మీదుగా దత్తాత్రేయ లోకమున్నది. దానికి ప్రసిద్ధముగా అమృతలోకమని పేరు.

**శ్లో॥ న యత్ర రుగ్జరామృత్యుః క్రియాభోగోఽపి యత్ర నో ।**
**మోహావస్థా న చ ద్వైతమగమ్యోఽయం సురైరపి ॥ 21**

ప్ర : యత్ర = ఆ అమృతలోకమున, రుక్ = రోగము, జరా = ముదుసలితనము, మృత్యుః = మరణము, న = లేవు, క్రియాభోగః అపి = కర్మఫలానుభవమున్ను, యత్ర = ఎక్కడ, నో = లేదో, మోహ+అవస్థా = భ్రమలకు లోనగుట, చ = మరియు, ద్వైతమ్ = ద్వయభావము, న = లేదు, అయమ్ = ఈ లోకము, సురైః అపి = దేవతలకున్ను, అగమ్యః = చేరరానిది.

**తా :** ఆ అమృతలోకమున రోగము, వార్ధక్యము, మరణము లేవు, కర్మఫలమును అనుభవించుట లేదు, భ్రమపడుట లేదు, ద్వయభావము లేదు. దేవతలు గూడ ఆ లోకమునకు తమ ఇష్టానుసారము రాకపోకలు జరుపలేరు.

**శ్లో॥ అధ్యాత్మయోగమార్గేణ లభ్యోఽయం బ్రాహ్మణేన హి ।**
**శ్రుత్యామృతం దివీత్యుక్తో దత్తలోకోఽయమేవ సః ॥ 22**

ప్ర : అధ్యాత్మయోగమార్గేణ = ఆత్మ అధిష్ఠానముగా గల యోగమును మార్గముగా స్వీకరించిన, బ్రాహ్మణేన హి = బ్రహ్మజ్ఞానిచేత మాత్రమే, అయమ్ = ఈ అమృతలోకము, లభ్యః = పొందదగినది,

శ్రుత్యా = వేదముచే, అమృతం దివి = అమృతలోకము, ఇతి = అని, ఉక్తః = చెప్పబడిన, సః = ఆ లోకము, అయం ఏవ దత్తలోకః = ఆ దత్తలోకమే.

**తా :** ఈ అమృతలోకము అధ్యాత్మయోగమార్గముననుసరించి బ్రహ్మజ్ఞానమును పొందినవానికి మాత్రమే లభించును. ఈ దత్తలోకమునే వేదము అమృతలోకముగా పేర్కొనినది. *

**శ్లో॥ తల్లోకప్రాప్తయేఽథర్వా కృపయా దీనవత్సలః ।**
**శాణ్డిల్యాయ జగౌ జ్ఞానం పూర్వోక్తం సుగమం స్ఫుటమ్ ॥ 23**

**ప్ర :** దీనవత్సలః = దయామయుడైన శ్రీ దత్తుడు, అథర్వా శాండిల్యాయ = బ్రాహ్మణుడైన శాండిల్యునికై, కృపయా = దయతో, తత్ లోకప్రాప్తయే = ఆ అమృతలోకప్రాప్తికొరకు, సుగమమ్ = సులభార్థముగలదై, స్ఫుటమ్ = స్పష్టమైన, పూర్వ+ఉక్తం–జ్ఞానమ్ = ముందే చెప్పబడిన జ్ఞానమును, జగౌ = బోధించెను.

**తా :** దీనులయందు ప్రేమగల శ్రీదత్తుడు శాండిల్యునకు దయతో ఆ అమృతలోకప్రాప్తికై సులభగ్రాహ్యమై, స్పష్టమైన పూర్వోక్తజ్ఞానమును బోధించెను.

**శ్లో॥ పునః పప్రచ్ఛ శాణ్డిల్యో భగవన్నక్షరం త్విదమ్ ।**
**అవిక్రియం పరం బ్రహ్మ సన్మాత్రం నిష్కలం శివమ్ ॥ 24**

**ప్ర :** శాణ్డిల్యః = శాండిల్యుడు, పునః = మరల, పప్రచ్ఛ = అడిగెను, భగవన్ = ఓ స్వామీ!, ఇదమ్ = ఈ, అక్షరమ్ = క్షీణించని, అవిక్రియం = కర్మసంగములేని, నిష్కలమ్ = అఖండమైన, శివమ్ = ఆనందమైన, సత్+మాత్రమ్ = సత్తామాత్రమైన, పరం బ్రహ్మ = పరమమైన బ్రహ్మము,

**శ్లో॥ జాయతేఽస్మాత్కథమిదం రక్ష్యతే లీయతే చ తత్ ।**
**సోఽబ్రవీచ్ఛృణు శాణ్డిల్యారూపస్య బ్రహ్మణోఽస్య తు ॥ 25**

**ప్ర :** అస్మాత్ = ఆ బ్రహ్మమునుండి, ఇదమ్ = ఈ జగత్తు, కథమ్ = ఎట్లు, జాయతే = పుట్టుచున్నది, రక్ష్యతే = రక్షింపబడుచున్నది, చ = మరియు, లీయతే = లయమగుచున్నది?, సః = శ్రీ దత్తుడు, అబ్రవీత్ = ఇట్లనెను, శాణ్డిల్య! = ఓ శాండిల్య!, శృణు = వినుము, అరూపస్య = రూపము లేని, అస్య బ్రాహ్మణః తు = ఆ బ్రహ్మమున కేమో

**శ్లో॥ నిష్కలం సకలం మిశ్రం త్రీణి రూపాణ్యుపాధితః ।**
**అఖణ్డం సచ్చిదానన్దం నిష్కలం యన్నిరంజనమ్ ॥ 26**

**ప్ర :** నిష్కలమ్ = విభాగము లేనిది, సకలమ్ = విభాగము కలది, మిశ్రమ్ = విభాగముండియు లేనిది, (అని), త్రీణి = మూడు, ఉపాధితః = వ్యక్త శరీరమును అనుసరించి, రూపాణి = రూపములు, యత్ =ఏది, అఖణ్డమ్ = అవిభాజ్యమో, సత్+చిత్+ఆనన్దమ్ = ఉనికి, జ్ఞానము, ఆనందములైనదో, నిష్కలమ్ = అంశలు లేనిదో, నిరంజనమ్ = పై తొడుగులు లేనిదో,

శ్లో॥ శివం సూక్ష్మం సర్వగతమనన్తం విశ్వతోముఖమ్ ।
అనిర్దేశ్యం నిష్కలాఖ్యం రూపమస్యోత్తమోత్తమమ్ ॥ 27

ప్ర : శివమ్ = శుభకరమైనది, సుఖస్వరూపమైనది, సూక్ష్మమ్ = గ్రహించుటకు ఇంద్రియములకు అందనిది, సర్వగతమ్ = అంతట వ్యాపించినది, అనన్తమ్ = ఎల్లలు లేనిది, విశ్వతః ముఖమ్ = అన్ని దిక్కులను ముఖము గలది, అన్నిటిని చూచునది, విశ్వము ద్వారా ప్రకటమైనది, అనిర్దేశ్యమ్ = ఇది 'ఇది', 'ఇట్టిది' అని వర్ణించరానిది, నిష్కల+ఆఖ్యమ్ = నిష్కలముగా చెప్పబడినది, అస్య = ఆ బ్రహ్మముయొక్క ఉత్తమోత్తమం రూపమ్ = సర్వోత్తమమైన రూపము.

**తా (శ్లో.24-27):** శాండిల్యుడు మరల ఇట్లడిగినాడు : భగవన్ శ్రీదత్త! ఈ పరబ్రహ్మము క్షీణించనిది, కర్మతో సంబంధములేనిది, అఖండమైనది, సుఖస్వరూపమైనది, సత్తమాత్రమైనది కదా, అట్టి ఈ బ్రహ్మమునుండి ఈ జగత్తు పుట్టుక యెట్లు జరిగినది? దాని రక్షణ యెట్లు నిర్వహించబడుచున్నది? మరల అదెట్లు నశించుచున్నది? ఈ ప్రశ్నలకు శ్రీదత్తప్రభువు ఇట్లు సమాధానము పలికినాడు : ఓ శాండిల్యా! విను. రూపములేని బ్రహ్మమునకు, అది స్వీకరించు శరీరమునుబట్టి (స్థితిని బట్టి) మూడు రూపములున్నవి : 1. నిష్కలరూపము, 2. సకలరూపము, 3. మిశ్రరూపము. ఏది అవిభాజ్యమైన నిష్కల, నిరంజన, సచ్చిదానంద స్వరూపమో అది శివము. సూక్ష్మము, సర్వవాప్తి, అంతములేక విశ్వరూపమై, గుర్తింపరానిదైన నిష్కలమనబడునది ఉత్తమ రూపము.

*

శ్లో॥ త్రిగుణా మూలప్రకృతిర్మాయావిద్యేతి చోచ్యతే ।
శక్తిః సహోత్థా తద్యుక్తో దేహోఽసౌ కృష్ణపిఙ్గలః ॥ 28

ప్ర : త్రిగుణా = మూడుగుణములు గలది, మూలప్రకృతిః = వ్యక్తప్రకృతికి ఆధారమైన మూలప్రకృతి, మాయా = మాయ, అవిద్య = అవిద్య, శక్తిః = శక్తి, సహోత్థా = సహోత్థా (సహ+ఉత్థా) ఇతి చ = అని కూడ, ఉచ్యతే = చెప్పబడుచున్నది, తత్+యుక్తః దేవః= దానితో కూడియున్న దేవతయగు, అసౌ = అతడు, కృష్ణపింగలః = కృష్ణపింగలుడు.

**తా :** మూడు గుణముల (సత్త్వరజస్తమస్సుల) సమాహారమైన మూలప్రకృతికే మాయ, అవిద్య, శక్తి సహోత్థా యని కూడ పేర్లు. ఆ మూలప్రకృతితో కూడియున్న దేవత కృష్ణపింగళుడు, అనగా, నలుపు, ఎఱుపు, గోధుమ వన్నెలు కలసిన రంగు గలవాడు.

శ్లో॥ మహేశ్వరో య ఈష్టే తన్మిశ్రరూపం ప్రకీర్తితమ్ ।
స తు జ్ఞానేన తపసా తప్యమానో హ్యకామయత్ ॥ 29

ప్ర : తత్+మిశ్రరూపమ్ = ఆ కృష్ణపింగళవర్ణములు కలసిన రూపము, మహేశ్వరః = మహేశ్వరుడుగా, ప్రకీర్తితమ్ = కొనియాడబడినది, సః తు = ఆ మహేశ్వరుడేమో, జ్ఞానేన =

జ్ఞానముతో, తపసా = తపస్సుతో, తప్యమానః = తపించుచున్నవాడై, ఈష్టే = యజ్ఞము చేసెను, ఆకామయత్ హి = సంకల్పించెను కూడ.

**తా :** ఆ కృష్ణపింగళరూపము మహేశ్వరుడుగా కీర్తింపబడినది. ఆతడు జ్ఞానముతో, తపస్సుతో, తపించుచున్నవాడై యజ్ఞము చేసి ఇట్లు సంకల్పించినాడు. *

**శ్లో॥ బహు స్యాం చ ప్రజాయేయమిత్యస్మాత్తపసోఽభవత్ ।**
**ఓంకారోఽస్య తిస్రో మాత్రా ఋషిచ్ఛన్దాంసి దేవతాః ॥ 30**

**ప్ర :** బహు స్యాం చ ప్రజాయేయమ్ = అనేకముగా అగుదును, పునరుత్పత్తి చేయుదును, ఇతి = అని (పై శ్లోకములోని, అకామయత్ = సంకల్పించెను, అను దానితో అన్వయము); అస్మాత్ = వానినుండి, తపసా = తపస్సుచేత, ఓంకారః = ఓం అను ప్రణవనాదము, అభవత్ = ప్రభవించెను; అస్య = ఆ ఓంకారమునకు, మాత్రాః = మాత్రలు, అంగములు, తిస్రః = (అ,ఉ,మ్ అనునవి) మూడు; ఋషిచ్ఛన్దాంసి = గాయత్రీ, జగతీ, త్రిష్టుప్ మొదలగు ఛందస్సులు, ఋషులు, దేవతాః = దేవతలు బ్రహ్మవిష్ణురుద్రాదులు.

**తా :** నేను అనేకముగా అగుదును, పునరుత్పత్తి చేయుదును, అని సంకల్పించగా, ఆ కృష్ణపింగళ మహేశ్వరునినుండి తపస్సుచేత **ఓం** అను త్రిమాత్రాయుత ఏకాక్షర ముద్భవించెను. ఆ ఓంకారమునకు ఛందస్సులు, ఋషులు, దేవతలు ఒనగూడిరి.

**శ్లో॥ బీజాని శక్తయో వర్ణావస్థాస్థానాని చ స్వరాః ।**
**గుణాగ్నివేదసవనతత్త్వాత్మానస్త్రయస్త్రయః ॥ 31**

**ప్ర :** బీజాని = బీజములు, శక్తయః = శక్తులు, వర్ణా–అవస్థా–స్థానాని : వర్ణా = వర్ణములు, అవస్థా = అవస్థలు, స్థానాని = స్థానములు, స్వరాః = స్వరములు, చ = మరియు, గుణ–అగ్ని–వేదసవన–తత్త్వా–ఆత్మనః : గుణ = గుణములు, అగ్ని = అగ్నులు, వేద–సవన = వైదికయజ్ఞములు, తత్త్వా = తత్త్వములు, ఆత్మనః = ఆత్మలు, త్రయః త్రయః = అన్నియు మూడు మూడైనవి.

**తా :** ఓంకారమున గల మూడు మాత్రలయిన **అ,ఉ,మ్** అనువాని విస్తృతమైన ప్రస్తారరూపము ఇట్లు చెప్పబడినది – **బీజములు** శ్రీం హ్రీం క్లీం అను మూడు; **శక్తులు** ద్రవ్య, జ్ఞాన, క్రియ అనునవి మూడు; **వర్ణములు** రక్త, శ్వేత, కృష్ణ అను మూడు; **అవస్థలు** జాగ్రత్, స్వప్న, నిద్ర అను మూడు; **స్థానములు** నేత్ర, కంఠ, హృదయ మనునవి మూడు; **స్వరములు** ఉదాత్త, అనుదాత్త, స్వరితములు మూడు; సత్త్వ, రజ, స్తమో **గుణములు** మూడు; **అగ్నులు** దక్షిణ, గార్హపత్య, ఆహవనీయములు మూడు; **యజ్ఞములు** ఉదయ, మధ్యాహ్న, సాయంకాలముల కార్యములు; **తత్త్వములు** భూ, భువ, స్వ అను మూడు; **ఆత్మలు** విశ్వ, తైజస, ప్రాజ్ఞ అను మూడు. *

**శ్లో॥ తదాఢ్యోఽయం జగద్బీజం యత్పరాపరసంజ్ఞకమ్ ।**
**తద్వాచకోఽసౌ భగవాన్మాయావీ వ్యాపకః పరః ॥ 32**

**ప్ర :** అయం జగత్+బీజమ్ = ఈ జగత్తు యొక్క విత్తనము, యత్ = ఏది, పర+అపర సంజ్ఞకమ్ = పరము ఇహము అని గుర్తింపుగలదో, తత్ = అది, ఆఢ్యః = ఇంతటి సంపన్నమైనది; తత్+వాచకః = దానిచే చెప్పబడువాడైన, భగవాన్ = భగవంతుడు, మాయావీ = మాయతో గూడిన వాడు, వ్యాపకః = వ్యాప్తిగలవాడు, పరః = పరుడు, ఇహమునకు అతీతుడు.

**తా :** ఈ జగత్తునకు బీజభూతమైనది ఇంతటి సుసంపన్నమైనది. దానినే ఇహము పరము అని రెండుగా వ్యవహరించుట. అది భగవంతుని ఉనికిని, లక్షణమును ఉపదేశించును. అట్టి భగవంతుడు మాయతోకూడి సర్వవ్యాపకుడైయున్న పరుడు, పరముడు.

**శ్లో॥ సర్వభూతహృదావిష్టో మాయయా క్రీడతీహ సః ।**
**సృజత్యవతి హన్తీశః స బ్రహ్మా స హరిః శివః ॥ 33**

**ప్ర :** సః ఈశః = ఆ భగవంతుడు, సర్వభూతహృత్+ఆవిష్టః = సర్వసృష్టిలో అంతరాత్మ నధిష్ఠించిన వాడై, ఇహ = ఈ లోకమున, జగత్తులో, మాయయా = మాయతో, క్రీడతి = ఆడుచున్నాడు, సః = ఆతడు, బ్రహ్మా = బ్రహ్మమై, సృజతి = సృష్టిచేయుచున్నాడు, సః = ఆతడు, హరిః = విష్ణువై, అవతి = రక్షించుచున్నాడు, శివః= శివుడై, హన్తి = చంపుచున్నాడు.

**తా :** ఆ ఈశ్వరుడు సృష్టియంతట అంతరంగనిలయుడై యుండి, జగత్తులో మాయతో క్రీడించుచు, బ్రహ్మయై సృష్టించుచు, విష్ణువై రక్షించుచు, తానే శివుడై నాశము జేయుచు ఆడుచున్నాడు.

**శ్లో॥ దేవా ఇన్ద్రాదయో భావాః సర్వభూతాని పఞ్చ చ ।**
**స్థూలాన్యపి చ సూక్ష్మాణి భౌతికాని స ఏవ హి ॥ 34**

**ప్ర :** దేవాః = దేవతలు, ఇన్ద్రాదయః = ఇంద్రుడు మొదలగు వారు, భావాః = భావములు, సర్వభూతాని = అన్ని భూతములు, పృథివ్యాదులు, పంచ చ = అయిదున్ను, స్థూలాని = పెద్దవి, అపి చ = మరియు, సూక్ష్మాణి = చిన్నవి, సః ఏవ హి = ఆతడే, ఆ ఈశ్వరుడే, భౌతికాని = భౌతికవస్తుప్రాణిజాలమంతయు.

**తా :** ఇంద్రుడు మొదలగు దేవతలును, పంచభూతములును, సర్వభావములును, చిన్నవి పెద్దవి, ఇంద్రియజ్ఞానమునకు అందునవి అందనివి కూడ, స్థావరజంగము లన్నియు ఆ ఈశ్వరుడే.

**శ్లో॥ తత్త్వాని జన్తవః సర్వే పురస్తాదచ్యుతః స చ ।**
**పశ్చాద్దక్షిణతశ్చాపి స ఏవోత్తరతో విభుః ॥ 35**

**ప్ర :** తత్త్వాని = తత్త్వములు, జన్తవః = జంతువులు, సర్వే = సమస్తమును, పురస్తాత్ = ఎదుట,

అచ్యుతః = అచ్యుతుడు, విష్ణువు, సః చ = ఆతడున్ను, పశ్చాత్ దక్షిణతః ఉత్తరతః అపి చ = పశ్చిమ దక్షిణ ఉత్తర దిక్కులందును కూడ, సః ఏవ = ఆతడే, విభుః = వ్యాపించినవాడు.

**తా :** తత్త్వము లిరువది యైదు చతుర్విధ శరీరధారులైన జంతువులు, తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము అను నాలుగు దిక్కుల వ్యాపించియున్నవాడు అతడే.

తత్త్వములు ఇరువది యైదు : పంచభూతములు, జ్ఞానేంద్రియములు ఐదు, కర్మేంద్రియములు ఐదు, విషయములు శబ్దస్పర్శాదులైదు, మాయ, శుద్ధవిద్య, మహేశ్వర, సదాశివుడు వెరశి ఐదు. మతాంతరమున, ప్రధానము, మహత్తు, అహంకారము, పంచభూతములు, జ్ఞానకర్మేంద్రియములు, శబ్దాది విషయములు, మనస్సు, పురుషుడు.

జన్తువులు (శరీరధారులు) : అండజములు, పిండజములు, స్వేదజములు, ఉద్భిజ్యములు అను నాలుగు విధములు.

**శ్లో॥ ఉపరిష్టాదధస్తాచ్చ స ఏవ కిల సర్వతః ।**
**భూతం భవ్యం భవచ్చాపి స ఏవేదం న చేతరత్ ॥ 36**

**ప్ర :** ఉపరిష్టాత్ = పై దిక్కున, అధస్తాత్ చ = క్రింది దిక్కున గూడ, సర్వతః = అన్ని దిక్కుల, సః ఏవ కిల = ఆతడే, భూతమ్ = జరిగిపోయినది, భవ్యం = జరుగనున్నది, భవత్ అపి చ = జరుగుచున్నది కూడ, ఇదమ్ = ఈ జగత్తు, సః ఏవ = ఆతడే, ఇతరత్ = మరియొకటి, న చ = కానే కాదు.

**తా :** అన్ని దిక్కులను వ్యాప్తమైన దేశస్వరూపమున (Space) ఉన్నది కూడ ఆ పరముడే. భూతభవిష్యద్వర్తమాన రూపమైన కాలస్వరూపమున ఉన్నది కూడ ఆ పరముడే. దేశకాలద్వయ రూపమున ఉన్న ఈ జగత్తు ఆ పరముడే తప్ప వేరు కాదు.

**శ్లో॥ దేవస్యాస్యాత్మక్రీడస్య విభోర్భక్తానుకమ్పినః ।**
**దత్తాత్రేయాభిధా మూర్తిః సురూపా యా దిగంబరా ॥ 37**

**ప్ర :** ఆత్మక్రీడస్య = సర్వాత్మయైన, భక్తానుకంపినః = భక్తుల దయజూచువాడైన, విభోః = సర్వవ్యాపియైన, అస్య దేవస్య = ఈ దేవునియొక్క, దత్తాత్రేయ+అభిధామూర్తిః = దత్తాత్రేయుడను పేరుగల మూర్తి, యా = ఏది, దిగంబరా = దిగంబరమైనదో, (సా = అది), సురూపా = సుందరమైనది.

**తా :** దత్తాత్రేయుని మూర్తి సురూపము, దిగంబరము. ఆ స్వామి సర్వవ్యాపి, సర్వాత్మ, భక్తులయందు దయగలవాడు.

**శ్లో॥ ఇన్దీవరదలప్రఖ్యా చతుర్బాహురఘాపహా ।**
**సైషాఽస్య సకలం రూపమాసేచనకగాత్రయుక్ ॥ 38**

**ప్ర :** అస్య = ఆ దత్తాత్రేయునియొక్క, సా ఏషా సకలం రూపమ్ = సర్వావయవపూర్ణమైన ఈ రూపము, ఇన్దీవరదలప్రఖ్యా = పద్మదళముల బోలినది, చతుర్బాహుః = నాలుగు భుజములు గలది, అఘ+అపహా = పాపమును నశింపజేయునది, ఆసేచనక-గాత్రయుక్ = తనివి తీరని దర్శనము గలది.

**తా :** దత్తాత్రేయుని పాపహరమైన ఆ రూపము చతుర్భుజములు గలది, పద్మదళములవలె అందమైనది, పొందికైన అవయవములు గలది, ఎంత చూచినను తనివి తీరనిది.

**శ్లో॥ శాణ్డిల్యః ప్రాహ భగవన్సన్మాత్రమిదముత్తమమ్ ।**
**పరం బ్రహ్మాత్మా మహేశో దత్తాత్రేయ ఇతి ప్రభో ॥ 39**

**శ్లో॥ కస్మాదుచ్యత ఆఖ్యాహి కృపయా దీనవత్సల! ।**
**అథర్వోవాచ సోమ్యేదం బృహత్సర్వం చరాచరమ్ ॥ 40**

**శ్లో॥ బృంహయత్యుత్తమం తస్మాత్పరం బ్రహ్మేతి గీయతే ।**
**మహ్యతే చేశశబ్దేన శక్త్యేష్టేఽఖిలమేవ యత్ ॥ 41**

**శ్లో॥ సర్వాధీశోఽఖిలాత్మా చ మహేశ ఇతి గీయతే ।**
**మయాఽహం తేఽత్రయే దత్త ఇత్యుక్తేః స తథోచ్యతే ॥ 42**

**ప్ర :** శాణ్డిల్యః = శాండిల్యుడు, ప్రాహ = ఇట్లనెను, భగవన్ = ఓ స్వామీ!, ఇదమ్ = ఈ జగత్తు, సత్+మాత్రమ్ = సత్పదార్థమైనది, ఉత్తమమ్ = శ్రేష్ఠమైనది, పరం బ్రహ్మ = పరబ్రహ్మ, ఆత్మా = ఆత్మ, మహేశః =మహేశుడు, దత్తాత్రేయః = దత్తాత్రేయుడు, ఇతి = అని, ప్రభో = ఓ స్వామి!, కస్మాత్ = ఎందువలన, ఉచ్యతే = చెప్పబడుచున్నది, దీనవత్సల = దీనులను దయజూచువాడా!, కృపయా = దయతో, ఆఖ్యాహి = చెప్పుము.

అథర్వన్ = జ్ఞాని, ఉవాచ = చెప్పెను, బృహత్ = గొప్పదైన, చరాచరమ్ = చరములు, అచరములు గల, ఇదం సర్వమ్ = జగత్తు అంతయు, సోమ్య = సౌమ్యమైనది, ఉత్తమమ్ = శ్రేష్ఠమైనదానిని, బృంహయతి = పెంచుచున్నది, తస్మాత్ = అందువలన, పరం బ్రహ్మ ఇతి = పరంబ్రహ్మ యని, గీయతే = కీర్తింపబడుచున్నది, ఈశ శబ్దేన = ఈశ్వరుడను పేరున, మహ్యతే = గొప్ప చేయబడుచున్నది, యత్ అఖిలమ్ = సర్వమును, శక్త్యా = శక్తిచేత, ఈష్టే = నిర్వహించ బడుచున్నదో, సర్వాధీశః = సర్వేశ్వరుడు, అఖిలాత్మా = సర్వాత్మ, మహేశః చ = మహేశ్వరుడున్ను, ఇతి గీయతే = అని కీర్తించబడుచున్నదో, అహమ్ = నేను, తే = నీకై, అత్రయే = మూడు కాని (త్రిమూర్త్యైక తత్త్వమైన) దానియందు, మయా = నాచే, దత్తః = ఇవ్వబడినది, ఇతి ఉక్తేః = అను భావమున, సః = ఆ పరాత్పరుడు, తథా = అట్లే (దత్తాత్రేయుడని), ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

**తా :** శాండిల్యుడిట్లడిగెను : ఓ స్వామీ! శ్రేష్ఠమైన సత్పదార్థమీ జగత్తు. అట్టి దానిని పరంబ్రహ్మ,

ఆత్మ, మహేశుడు, దత్తాత్రేయుడు అని ఇట్లెందువలన వేర్వేరు పేర్లతో చెప్పుచున్నారు? వివరింపుడు. దానికి జ్ఞాని ఇట్లని సమాధాన మిచ్చినాడు :

(శ్లో. 40 **అథర్వోవాచ** అనగా, అథర్వముని చెప్పెను, అనికూడ చెప్పవచ్చు. దత్తాత్రేయునిగూర్చి చెప్పినవాడాతడే కదా.)

ఈ చరాచరజగత్తు ఉత్తమమైనది, సౌమ్యమైనది, సువిశాలమైనది. దాని వ్యాప్తికి సాకారతకు కారణమై ఆ తత్త్వమే బ్రహ్మయనబడుచున్నది. శక్తిచేత నిర్వహించబడుచున్నది కావున మహేశ్వరుడన బడుచున్నది. బ్రహ్మ విష్ణు మహేశ్వర త్రయీ రూపమున కాధారమైన అత్రయమైన తత్త్వమును బోధించుచున్నందున ఆ రూపము దత్త+అత్రయార్థము దత్తాత్రేయుడని తెలియబడుచున్నది. ఇన్ని వ్యవహారనామములును ఆ పరంబ్రహ్మమునకే అన్వయించును.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ద్వితీయాష్టకే ద్వితీయోఽధ్యాయః ।

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## ద్వితీయాష్టకము - తృతీయాధ్యాయము

**శ్లో॥ వసూత్సుకేన మునినా సామాన్యేనోదితోఽప్యయమ్ ।**
**దత్తాత్రేయావతారోఽత్ర విశేషాద్వర్ణ్యతే స్మృతః ॥ 1**

**ప్రతిపదార్థం :** వసూత్సుకేన = వాసుదేవతత్పరుడైన, మునినా = అథర్వమునిచేత, స్మృతః = స్మరింపబడిన, దత్తాత్రేయ+అవతారః = దత్తాత్రేయుని అవతారము, అయం సామాన్యేన అపి = ఈ సామాన్యునిచేతనే యైనను, ఉదితః = చెప్పబడినదై, విశేషాత్ = విశేషముగా, వర్ణ్యతే = వర్ణింపబడుచున్నది.

**తాత్పర్యం :** విశేషముగా అవతారము వాసుదేవతత్పరుడైన అథర్వమునిచేత తొలుత స్మరింపబడినది. దానినిప్పుడు ఒక సామాన్యుడు విశేషముగా వర్ణించి చెప్పుచున్నాడు. *

**శ్లో॥ సచ్చిదానన్దరూపో యః పరాశక్తిః సర్వవిత్ ।**
**మాయాఽభూత్తస్మాదేతస్మాదాత్మనోఽస్యా మహాంస్తతః ॥ 2**

**ప్ర :** సచ్చిదానన్దరూపః సర్వవిత్ యః పరాశక్తిః = సత్ చిత్ ఆనందరూపమైన సర్వమెఱిగిన యే పరాశక్తి కలదో, సః = ఆ పరాశక్తి, మాయా అభూత్ = మాయగానైనది, తస్మాత్ = అందువలన, ఏతస్మాత్ ఆత్మనః= ఈ ఆత్మయొక్క, అస్యాః = మహాశక్తియొక్క, మహాన్ = మహత్తు, తతః = దానినుండి,

**తా :** సత్ చిత్ ఆనందమయమై సర్వమెఱిగిన పరాశక్తి మాయగానైనది. ఆ మాయ ఆత్మయొక్క మహత్త్వమై, ఆత్మాభేదముగా, వ్యాప్తమై యున్నది.

**శ్లో॥ అహఙ్కారోఽస్మాత్తన్మాత్రాణ్యతోఽభూద్భూతపఞ్చకమ్ ।**
**ఆకాశవాతదహనపానీయవసుధాభిధమ్ ॥ 3**

**ప్ర :** అహంకారః = అహంకారము, అస్మాత్ = దానినుండి, తన్మాత్రాణి = తన్మాత్రలైదును, అతః = వానినుండి, భూతపంచకమ్ = పంచభూతములు, ఆకాశ = ఆకాశము, వాత =

వాయువు, దహన = అగ్ని, పానీయ = నీరు, వసుధా+అభిధమ్ = భూమి అను పేర్లు గలవి, అభూత్ = అయినవి.

**తా :** ఆ మహత్తునుండి అహంకారము, దానినుండి పంచతన్మాత్రలు, వానినుండి పంచభూతములు యేర్పడినవి. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనునవి తన్మాత్రలు. భూమి, ఆపః, వాయువు, తేజస్సు, ఆకాశము అనునవి పంచభూతములు. *

**శ్లో॥ ఏకోత్తరర్ద్ధి శబ్దాదిగుణాఢ్యం చ పృథక్ పృథక్ ।**
**తేషాం సత్త్వగుణాంశేభ్యః పఞ్చ జ్ఞానేన్ద్రియాణి చ ॥ 4**

**ప్ర :** పృథక్ పృథక్ చ = వేరు వేరుగా నేమో, శబ్ద+ఆది గుణ ఆఢ్యమ్ = శబ్దము మొదలగు గుణములతో సంపన్నమైన, ఏక+ఉత్తర వృద్ధి = ఒక్కొక్కటిగా పెరుగుచూ, తేషామ్ = వానివైన, సత్త్వగుణ+అంశేభ్యః = సత్త్వ-ఆది గుణముల అంశలతో, పఞ్చ = అయిదు, ఇన్ద్రియాణి చ = ఇంద్రియములును.

**తా :** వార్తికకర్తలు చెప్పినట్లుగా, ఆకాశమునకు శబ్దమొక్కటే గుణము, వాయువునకు శబ్దస్పర్శములు రెండు గుణములును, అగ్నికి శబ్ద,స్పర్శ, రూపములు మూడు గుణములున్ను, నీటికి శబ్దస్పర్శరూప రసములు నాలుగు గుణములున్ను, భూమికి శబ్దస్పర్శరూపరసగంధములు అయిదు గుణములున్ను, ఇట్లు పంచభూతములున్ను పంచతన్మాత్రలతో ఒకటికొక్కొకటి వృద్ధిగా యేర్పడినవి. *

**శ్లో॥ శ్రోత్రత్వఙ్నేత్రరసనఘ్రాణాఖ్యాన్యభవన్క్రమాత్ ।**
**మనోధీచిత్తాహఙ్కారాస్తత్సత్త్వగుణసంహతేః ॥ 5**

**ప్ర :** క్రమాత్ = క్రమముగ, ఒక వరుసలో, మనః = మనస్సు, ధీ = బుద్ధి, చిత్త = చిత్తము, అహంకారాః = అహంకారములు, తత్ = ఆ, సత్త్వగణసంహతేః = సత్త్వగుణాంశములనుండి, శ్రోత్ర = చెవి, వినికిడి, త్వక్ = చర్మము, నేత్ర = కన్ను, రసన = నాలుక, రుచి, ఘ్రాణ = వాసన, ముక్కు, ఆఖ్యాని = అనబడునవి, అభవన్ = యేర్పడెను.

**తా :** క్రమముగ సత్త్వగుణాంశలనుండి చెవి, చర్మము, కన్ను, నాల్క, ముక్కు అను జ్ఞానేంద్రియము లైదును, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనువానితో అంతరంగమున్ను యేర్పడెను.

**శ్లో॥ మనో విమర్శరూపం ధీర్నిశ్చయాత్మాభిమానకః ।**
**అహఙ్కారోఽనుసన్ధాయి చిత్తమన్తఃకృతిస్త్వయమ్ ॥ 6**

**ప్ర :** మనః = మనస్సు, విమర్శరూపమ్ = విమర్శించి చూచునది, ధీః = బుద్ధి, నిశ్చయ+ఆత్మ+ అభిమానకః = తనకేది సరిపడునో నిశ్చయించి చెప్పు వివేకము, అహంకారః = అహంకారము, 'నేను' అనునది, అనుసంధాయి = అన్నిటినీ కలుపునట్టి సూత్రము, చిత్తం తు = చిత్తమేమో, అయం అన్తఃకృతిః = ఈ అన్తఃకరణము.

**తా :** మనస్సు, ఇంద్రియజ్ఞానమును సవివరముగ సేకరించునది; బుద్ధి, ఆ వ్యక్తికేది సరిపడునో నిశ్చయించి చెప్పగల వివేకము; అహంకారము, అన్నిటినీ కలుపు సూత్రము; చిత్తము, ఈ అన్తః కరణము.

**శ్లో॥ వాక్పాణిపత్పాయులిఙ్గాఖ్యం క్రియేన్ద్రియపఞ్చకమ్ ।**
**తేషాం రజోగుణాంశేభ్యః క్రమాత్తేషాం తథా పునః ॥ 7**

**శ్లో॥ సంహత్యా చాభవత్ప్రాణో వృత్తిభేదాత్స పఞ్చధా ।**
**ప్రాణోఽపానః సమానశ్చోదానో వ్యానః క్రియాత్మకః ॥ 8**

**ప్ర :** తేషామ్ = వాని యొక్క, రజోగుణాంశేభ్యః = రజోగుణాంశములనుండి, వాక్పాణిపత్పాయు-లింగాఖ్యమ్ = ముఖము, చేతులు, కాళ్ళు, గుదము, లింగము అనబడు, క్రియేంద్రియపంచకమ్ = కర్మేంద్రియములైదు, తథా = అట్లే, పునః = మరల, క్రమాత్ = వరుసగా, తేషాం సంహత్యా = వాని అంశలచేత, ప్రాణః చ = ప్రాణము గూడ, సః = అది, వృత్తిభేదాత్ = వ్యాపారభేదమువలన, పంచధా = అయిదు విధములుగా, ప్రాణః = ప్రాణవాయువు, అపానః = అపానవాయువు, సమానః = సమానవాయువు, ఉదానః = ఉదానవాయువు, చ = మరియు, వ్యానః = వ్యానవాయువు, క్రియాత్మకః = కర్మప్రధానమై, అభవత్ = ఆయెను.

**తా :** వాని రజోగుణాంశలనుండి కర్మేంద్రియములైదు, వాక్పాణిపాదవాయులింగములనబడునవియున్ను, అట్లే, వాని అంశలచేత, కర్మప్రధానములై, ప్రాణాపానవ్యానోదానసమానములనబడు పంచప్రాణములున్ను యేర్పడినవి.

**శ్లో॥ కర్మజ్ఞానేన్ద్రియప్రాణపఞ్చకైర్మనసా ధియా ।**
**దేహో లిఙ్గాభిధోఽజ్ఞానవృత్తికారణకార్యకః ॥ 9**

**ప్ర :** కర్మజ్ఞాన+ఇన్ద్రియప్రాణపఞ్చకైః = కర్మేంద్రియములైదింటిచేతను, జ్ఞానేంద్రియములైదింటిచేతను, ప్రాణములైదింటిచేతను, మనసా = మనస్సుచేత, ధియా = బుద్ధిచేత, లింగ+అభిధః = లింగము అని పిలువబడు, దేహః = శరీరము, అజ్ఞానవృత్తి = అజ్ఞానవ్యాపారమైన, కారణకార్యకః = కారణకార్యరూపమైనది.

**తా :** కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, ప్రాణవాయువులు, మనస్సు, బుద్ధి అను వీనిచేత దేహము అజ్ఞానవ్యాపారమునకు కారణమును కల్పించి, దానికి కార్యరూపమగుచు, లింగశరీరమనబడుచున్నది.

**శ్లో॥ ద్విధా కృత్వైకైకభూతం చతుర్ధైకార్ధమస్య చ ।**
**స్వస్వేతరార్ధసంయోగాత్పఞ్చీకరణముచ్యతే ॥ 10**

**ప్ర :** ఏక+ఏక భూతమ్ = ప్రతియొక్క భూతమును, అనగా, భూమి, నీరు, నిప్పు. గాలి, ఆకాశము అనువానిలో ఒక్కొక్క దానిని, ద్విధా కృత్వా = రెండుగా చేసి, అస్య = దానియొక్క

ఏక+అర్ధమ్ = ఒక్క సగమును, చతుర్ధా చ = నాల్గుగను (విభజించి), స్వ = తనదైనదియు, స్వ+ఇతర = తనదికాని అన్యభూతముల, అర్ధ = సగముతో, సంయోగాత్ = కలుపుటవలన, పఞ్చీకరణమ్ = పంచీకరణము, ఉచ్యతే = అనబడును.

**తా :** పంచభూతములలో ఒక్కొక్క దానిని రెండు సగములుగ విభజించి, అందు ప్రతియొక్క భూతములోని ఒక్క సగభాగమును మరల నాలుగు భాగములు చేసి, అందు ప్రతిభూతముయొక్క సగముతో మిగత భూతముల నాల్గింటనొక భాగమును కలుపగా పంచీకరణప్రక్రియ యగును. ఇట్లు స్థూలప్రకృతిలోని పంచభూతముల కూర్పు ఈ రూపమున సిద్ధమైనది :-

భూమి 1/2 + నీరు 1/8, నిప్పు 1/8, గాలి 1/8, ఆకాశము 1/8 = 1

నీరు 1/2 + నిప్పు 1/8, గాలి 1/8, ఆకాశము 1/8, భూమి 1/8 = 1

నిప్పు 1/2 + గాలి 1/8, నీరు 1/8, ఆకాశము 1/8, భూమి 1/8 = 1

గాలి 1/2 + నీరు 1/8, నిప్పు 1/8, ఆకాశము 1/8, భూమి 1/8 = 1

ఆకాశము 1/2 + నీరు 1/8, నిప్పు 1/8, గాలి 1/8, భూమి 1/8 = 1

----

మొత్తము స్థూలభూతములు = 5

----

**శ్లో॥ తద్భోగాయతనం స్థూలం శరీరం గుణతస్త్రిధా ।**
**దైవం సత్త్వాధికం మర్త్యం రాజసం తిర్యగన్యకమ్ ॥ 11**

**ప్ర :** భోగ+ఆయతనమ్ = భోగపాత్రమైన, తత్ స్థూలం శరీరమ్ = ఆ భౌతిక శరీరము, గుణతః = గుణమువలన, త్రిధా = మూడు విధములు, సత్త్వ+అధికమ్ = సత్త్వగుణాధిక్యము గలది, దైవమ్ = దైవయోని, రాజసమ్ = రజోగుణాధిక్యము గలది, మర్త్యమ్ = మర్త్యయోని, అన్యకమ్ = వేరైనదగు తమోగుణాధిక్యము గలది, తిర్యక్ = జంతుయోని.

**తా :** ఈ స్థూలశరీరము భోగపాత్రమైనది. ఇది పంచభూతములచే నిర్మింపబడినది. గుణాధిక్యము వలన మూడు విధములైనది : సత్త్వగుణాధిక్యము గలది దైవయోని; రజోగుణాధిక్యము గలది మర్త్యయోని; తమోగుణాధిక్యతగలది జంతు లేక తిర్యగ్యోని.

**శ్లో॥ రోమత్వఙ్మాంసనాడ్యస్థిభువోఽద్భ్యో మూత్రరేతసీ ।**
**స్వేదోఽస్రలాలేఽగ్నేః క్షుత్తృణ్నిద్రా తన్ద్రారతిర్గతిః ॥ 12**

**ప్ర :** రోమత్వఙ్మాంసనాడ్యస్థి = రోమములు, చర్మము, మాంసము, నరములు, ఎముక అనునవి, భువః = భూమినుండి, మూత్రరేతసీ = మూత్రము, వీర్యము అనునవి, అద్భ్యః = నీటినుండి,

స్వేదః = చెమట, అస్ర = కన్నీరు, లాలే = ఉమ్మి, అగ్నేః = అగ్నినుండి, క్షుత్ = ఆకలి, నిద్రా = నిద్ర, తంద్రా = అలసట, రతిః = కామవాంఛ, గతిః= చలనము.

**శ్లో॥ లౌల్యం నిరోధః ప్రసారాకుఞ్చే మరుతోఽథ ఖాత్ ।**
**కామకృల్లోభమోహౌ భీస్తదాఢ్యేయం జడా తనుః ॥ 13**

ప్ర : లౌల్యమ్ = చంచలత్వము, నిరోధః = అడ్డుకొనుట, ప్రసార+ఆకుంచనే = వికసించుట, ముకుళించుట, (చాచుట, ముడుచుట) అను రెండును, మరుతః = వాయువునుండి, అథ = పిమ్మట, ఖాత్ = ఆకాశమునుండి, కామకృత్ = కామమువలన కలిగెడు, లోభమోహౌ = లోభము, మోహము, భీః = భయము అను, తత్+ఆఢ్యా = వీనిచే సంపన్నమైనది, ఇయం జడా తనుః = ఈ జడమైన శరీరము.

**తా :** రోమములు, చర్మము, మాంసము, నరములు, ఎముకలు అనునవి భూతత్త్వము నుండియు; మూత్ర వీర్యములు జలతత్త్వము నుండియు; చెమట, కన్నీరు, లాలాజలము అనునవి అగ్నితత్త్వము నుండియు; ఆకలి, నిద్ర, అలసట, కామవాంఛ, చలనము చంచలత్వము, అడ్డుకొనుట, చాచుట ముడుచుట, అనునవి వాయుతత్త్వమునుండియు; కామమువలన కలుగు లోభమోహభయములు ఆకాశతత్త్వమునుండియు; ఇట్లు ఈ వికారములతో గూడినదై ఈ జడశరీరమేర్పడినది. *

**శ్లో॥ సూక్ష్మా సప్తదశాఙ్గాపి సుఖదుఃఖగమాదియుక్ ।**
**తథాఽజ్ఞానం కారణాఖ్యం శరీరత్రయమస్య పూః ॥ 14**

ప్ర : సప్తదశ+అంగా+అపి = పదియునేడు అంగములు కలదియును, సూక్ష్మా = సూక్ష్మమైనది, సుఖదుఃఖగమాదియుక్ = సుఖమును దుఃఖమును అనుభవించు లక్షణము గలది, అజ్ఞానమ్ = అజ్ఞానము, తథా = అట్లే, అస్య = దానికి, పూః = పురము, నివాసము, కారణాఖ్యం శరీరత్రయమ్ = కారణము అను మూడు శరీరములు గలది.

**తా :** పదునేడు అవయవములు (శ్లో.9) గలది స్థూలశరీరమే యైనను, దానితోడి సంపర్కము వలన సుఖదుఃఖములను అనుభవించునది సూక్ష్మశరీరము. అట్లే, కారణశరీరమనుదానితో గూడ మూడు శరీరములు. ఇవి అజ్ఞాననివాసములు.

**శ్లో॥ శుద్ధసత్త్వప్రకృత్యాం యో బిమ్బితః స మహేశ్వరః ।**
**జీవో మలినసత్త్వాయాం తామస్యాం భూతపఞ్చకమ్ ॥ 15**

ప్ర : యః = ఎవడు, శుద్ధసత్త్వప్రకృత్యామ్ = శుద్ధసత్త్వప్రకృతియందు, బింబితః = ప్రతిఫలించు చున్నాడో, సః = ఆతడు, మహేశ్వరః = మహేశ్వరుడు, మలినసత్త్వాయామ్ = మలినసత్త్వ-ప్రకృతియందు, జీవః = జీవుడు (బింబితః), తామస్యామ్ = తమస్సునందు, భూతపఞ్చకమ్ = పంచభూతములు.

**తా :** శుద్ధసత్త్వప్రకృతియందు ప్రతిబింబము (నీడ)గా కన్పించునది మహేశ్వరుడు. రజోగుణ సంబంధమున మలినప్రకృతియందు, ప్రతిబింబముగా కన్పించునది జీవుడు. తమఃప్రకృతియందు ప్రతిబింబముగా కన్పించునది భూతపంచకము.

**శ్లో॥ సర్వజ్ఞ ఈశః సమష్టిజీవోఽజ్ఞో వ్యష్టిసంజ్ఞితః ।**
**ఏవం విక్షేపకార్యాఖ్యా సృష్టిర్జాతేశ్వరాజ్ఞయా ॥ 16**

**ప్ర :** సర్వజ్ఞః ఈశః = సర్వమెఱిగిన ఈశ్వరుడు, సమష్టిజీవః = సమష్టి(విశ్వ)జీవుడు, వ్యష్టిసంజ్ఞితః = జీవుడని ప్రతివ్యక్తియందు వేర్వేరుగా గుర్తించబడువాడు, అజ్ఞః = అజ్ఞాని; ఏవమ్ = అట్లు, ఈశ్వర+ఆజ్ఞయా = ఈశ్వరుని ఆజ్ఞచేత, విక్షేపకార్య+ఆఖ్యా = విక్షేపక్రియగా చెప్పబడు, సృష్టిః = సృష్టి, జాతా = యేర్పడినది.

**తా :** సర్వజ్ఞుడైన ఈశ్వరుడు సమష్టిజీవుడైనాడు. వైయక్తికమైన జీవుడు అజ్ఞాని యైనాడు. ఇట్లు విక్షేపక్రియారూపముగా, ఈశ్వరాజ్ఞచే, సృష్టియైనది.

**శ్లో॥ బ్రహ్మాణ్డం పఞ్చభూతేభ్యస్తత్ర లోకాశ్చతుర్దశ ।**
**యథా స్వం ప్రాణినోఽత్రాయం స్థూలదేహో విరాడ్విభోః ॥ 17**

**ప్ర :** పఞ్చభూతేభ్యః = పంచభూతములతో, బ్రహ్మాణ్డమ్ = విశ్వము, తత్ర = అందు, లోకాః = లోకములు, చతుర్దశ = పదునాలుగు, యథా = ఎట్లు, స్వమ్ = స్వర్గమో, అత్ర = అందు, ప్రాణినః = ప్రాణులు, అయం విభోః = ఈ సర్వవ్యాపియైన, విరాట్ స్థూలదేహః = పురుషుని స్థూలశరీరము.

**తా :** పంచభూతములతో పదునాలుగు లోకములు గల బ్రహ్మాండము యేర్పడినది. స్వర్గము నందువలె, ఆ బ్రహ్మాండమున ప్రాణులు, ఇవి యన్నియు ఆ సర్వవ్యాపియైన పురుషుని స్థూల శరీరము.

**శ్లో॥ పాదాధోఽతలమస్యోర్ధ్వం వితలం సుతలం తథా ।**
**గుల్ఫే మహాతలం జఙ్ఘాదేశే జాన్వోస్తలాతలమ్ ॥ 18**

**శ్లో॥ ఊర్వో రసాతలం కట్యాం పాతాలం భూశ్చ నాభిగా ।**
**కుక్షౌ భువోర్హృదూర్ధ్వం స్వర్మహః కణ్ఠే జనో ముఖే ॥ 19**

**శ్లో॥ భ్రువోస్తపో మూర్ధ్ని సత్యం ప్రాణో వాయుస్తనుర్మహీ ।**
**లోకాఙ్గస్య రదాస్తారా మాయా హాస్యం నిశాదినే ॥ 20**

**ప్ర :** పాద+అధః = పాదముల క్రిందుగా, అతలమ్ = అతలము, అస్య = పాదములకు, ఊర్ధ్వమ్ = పైగా, వితలమ్ = వితలము, తథా = అట్లే, సుతలమ్ = సుతలము, గుల్ఫే = మడమయందు, జంఘాదేశే = పిక్కలయందు, మహాతలమ్ = మహాతలము, జాన్వోః =

మోకాళ్ళలో, తలాతలమ్ = తలాతలము, ఊర్వోః = తొడలలో, రసాతలమ్ = రసాతలము, కట్యాం = నడుమున, పాతాలమ్ = పాతాళము, నాభిగా = నాభియందు, భూః = భూమి, చ = మరియు, కుక్షౌ = పొట్టయందు, భువః = భువర్లోకము, హృద్+ఊర్ధ్వమ్ = హృదయమునకు పైన, స్వః = స్వర్గము, కణ్ఠే = కంఠమున, మహః = మహర్లోకము, ముఖే = ముఖమున, జనః = జనర్లోకము, భ్రువోః = కనుబొమలందు, తపః = తపోలోకము, మూర్ధ్ని = శిరస్సున, సత్యమ్ = సత్యలోకము, ప్రాణః = ప్రాణము, వాయుః = వాయువు, తనుః = శరీరము, మహీ = భూమి, లోక+అఙ్గస్య = లోకములు అంగములు గలవానికి, రదాః = దంతములు, తారాః = నక్షత్రములు; మాయా = మాయ, హాస్యం = నవ్వు, నిశాదినే = రేబవళ్ళు,

**శ్లో॥ నిమేషోన్మేషౌ కటాక్షః సృష్టిః కుక్షిరపాం పతిః ।**
**నాడ్యో నద్యో ద్రుమాః కేశా వృష్టీ రేతోఽస్థి పర్వతః ॥ 21**

**శ్లో॥ విరాజః స్థూలదేహోఽయం చరాచరజగన్మయః ।**
**దిగ్వాతార్కప్రచేతోశ్వివహ్నీన్ద్రోపేన్ద్రమృత్యుకాః ॥ 22**

ప్ర : నిమేష+ఉన్మేషౌ = కనులు మూయుట, తెరచుట యనునవి; కటాక్షః =కడగంటి చూపు, సృష్టిః = సృష్టి, కుక్షిః = ఉదరము, అపాం పతిః = సముద్రము, నాడ్యః = నాడులు, నద్యః = నదులు, ద్రుమాః = వృక్షములు, కేశాః = కేశములు, వృష్టీ = వర్షము, రేతః = వీర్యము, అస్థి = ఎముక, పర్వతః = పర్వతము, విరాజః = విరాట్ స్వరూపుని, స్థూలదేహః = బాహ్యశరీరము, అయం చరాచరజగన్మయః = ఈ చరాచరజగద్రూపమైన, దిగ్వాతార్కప్రచేతోశ్వి వహ్నీన్ద్రోపేన్ద్ర-మృత్యుకాః = దిక్కులు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినులు, అగ్ని, ఇంద్రుడు, విష్ణువు, మృత్యువులు.

**తా (శ్లో.18-22) :** విరాట్పురుషుని విశ్వరూపమిది-

| | |
|---|---|
| పాదముల క్రింది భాగము | - అతలము |
| పాదముల పై భాగము | - వితలము |
| మడమ | - సుతలము |
| పిక్కలు | - మహాతలము |
| మోకాళ్ళు | - తలాతలము |
| తొడలు | - రసాతలము |
| నడుము | - పాతాళము |
| నాభి | - భూలోకము |
| కుక్షి | - భువర్లోకము |
| హృదయము పై భాగము | - స్వర్లోకము |
| కంఠము | - మహర్లోకము |

| | |
|---|---|
| ముఖము | – జనర్లోకము |
| కనుబొమలు | – తపోలోకము |
| శిరస్సు | – సత్యలోకము |
| ప్రాణము | – వాయువు |
| దంతములు | – నక్షత్రములు |
| నవ్వు | – మాయ |
| కనులు మూయుట, తెరచుట | – రాత్రి, పగలు |
| కడగంటి చూపు | – సృష్టి |
| కుక్షి | – సముద్రము |
| నాడులు | – నదులు |
| కేశములు | – వృక్షములు |
| వీర్యము | – వర్షము |
| ఎముక | – పర్వతము |

ఈ జగద్రూపముతో కూడియున్న దిక్కులు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినీదేవతలు, అగ్ని ఇంద్రుడు, విష్ణువు, మృత్యువు. *

**శ్లో॥ జ్ఞానకర్మేన్ద్రియాణ్యన్తఃకరణాని శశీ గురుః ।**
**హరోఽజశ్చేతి లిఙ్గాత్మాఽవ్యాకృతం కారణఞ్చ తత్ ॥ 23**

ప్ర : జ్ఞానకర్మేన్ద్రియాణి = జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములున్ను, అన్తఃకరణాని = అంతః కరణములు (లోపలి సాధనములు), శశీ = చంద్రుడు, గురుః = గురువు, హరః = హరుడు, అజః = బ్రహ్మ, ఇతి చ = అనియున్ను, లింగాత్మా = లింగశరీరము, అవ్యాకృతమ్ = నామ–రూపములు స్పష్టముకానిది, తత్ కారణం చ = దానికి కారణమున్ను

**తా :** జ్ఞానకర్మేంద్రియములు, అంతఃకరణములు, చంద్రుడు, గురువు, హరుడు, బ్రహ్మ అనియున్ను లింగశరీరము. నామరూపములు స్పష్టము కానిది అవ్యాకృతమనబడు కారణశరీరము.

**శ్లో॥ యద్యదఙ్గభిదా యేఽత్ర వ్యష్టౌ తే తత్తదఙ్గపాః ।**
**దృష్ట్వోభయత్రాప్యావిష్టేష్వేషు కార్యాక్షమావుభౌ ॥ 24**

ప్ర : యత్+యత్+అంగభిదా = యేది యేది అంగముల విభాగముచేత, అత్ర వ్యష్టౌ = ఆ వ్యష్టి (ఉమ్మడి) శరీరమున, యే = ఎవరో, తే = వారు, తత్+తత్+అంగపాః = ఆ యా అంగముల నధిష్ఠించిన దేవతలు, ఉభయత్ర+అపి = వ్యష్టి సమష్టి రెండిటను, ఆవిష్టేషు = ఆవహించిన, ఏషు = వానియందు, ఉభౌ = రెండును, కార్య+అక్షమౌ = కార్య కారణాది దూషితులు.

**తా :** సమష్టి విరాట్పురుషుని అంగభూతములైన తావుల నే యే దేవతలు కలరో వారు తమ

తమ నెలవుల అధిష్ఠానదేవతలై యున్నారు. కాగా, వారే వ్యష్టి పురుషుని అంగములందును అధిష్ఠాతలు. ఐనను, ఆ యా దేవతలందఱును వ్యష్టిలోను సమష్టిలోను కూడ, జీవమాత్రులై సకామకర్మలు చేయుచు, ఫలానుభవమును పొందుచు, కారణకార్యములకు లోబడియే ఉందురు.

**శ్లో॥ స్వాంశేనావిశదాత్మాతో జాతౌ కార్యక్షమావుభౌ ।**
**మాయావశాత్స సర్వజ్ఞో జీవోఽవిద్యావశాత్స చ ॥ 25**

ప్ర : ఉభౌ = వ్యష్టి, సమష్టి, రెండిటను, ఆత్మతః = ఆత్మవలన, స్వ+అంశేన = తన అంశతో, ఆవిశత్ = ఆవేశించిన, జాతౌ = పుట్టుక గలవారు, కార్యక్షమౌ = క్రియాదక్షులు, సః సర్వజ్ఞః = ఆ సర్వజ్ఞుడైన, జీవః = జీవుడు, అవిద్యావశాత్ = అవిద్య ప్రభావమువలన, మాయావశాత్ చ = మాయ ప్రభావమువలనను,

**శ్లో॥ సృష్ట్వైవం కర్మణోఽజ్ఞానాం భోగార్థం శశ్వదీశ్వరః ।**
**స్రష్టృవిష్ణుహరాత్మా స సృష్టిస్థిత్యన్తకారణః ॥ 26**

ప్ర : సః ఈశ్వరః = ఆ ఈశ్వరుడు, అజ్ఞానాం భోగార్థమ్ = అజ్ఞానుల అనుభవానందము కొరకు, ఏవం సృష్ట్వా = ఈ విధముగా సృష్టించి, కర్మణః = కర్మవలన, స్రష్టృ = బ్రహ్మ, విష్ణు = విష్ణువు, హరః = హరుడు, ఆత్మా = మూర్తులై, సృష్టి = సృజన, స్థితి = పోషణ, రక్షణ, అన్త = నాశము, అనువానికి, కారణః = కారణమగువాడు.

**తా :** సమష్టి, వ్యష్టి అను సృష్టియొక్క రెండు విభాగములను తన అంశతో ఆవేశించిన సర్వజ్ఞుడైన పరమాత్మ, ఆ రెండు దశలందును ప్రత్యేకము మూర్తిమంతులైన జీవులు కార్యదక్షులే యైనను, అవిద్యాప్రభావమువలనను, మాయాప్రభావమువలనను అవశులై అస్వతంత్రులగుచున్నారు. ఈశ్వరుడు అజ్ఞానుల భోగముకొరకై ఈ సృష్టి నిట్లు నిర్మించి, కర్మను బట్టి సృజనములో బ్రహ్మగను, పాలన పోషణములలో విష్ణువుగను, సంహారములో హరుడుగను మూడు మూర్తులై ఆ యా క్రియలకు కారణులగుచున్నారు.

**శ్లో॥ విశ్వోఽధ్యాత్మం విరాట్ చాధిభూతం కృష్ణోఽధిదైవతమ్ ।**
**జాగ్రదధ్యాత్మం రక్షాధిదైవం సత్త్వం చ భౌతికమ్ ॥ 27**

**శ్లో॥ హిరణ్యగర్భోఽధిభూతం కో దైవం తైజసోఽపరమ్ ।**
**రజోఽధిభూతం చాధ్యాత్మం స్వప్నః సర్గోఽధిదైవతమ్ ॥ 28**

**శ్లో॥ ప్రాజ్ఞోఽధ్యాత్మం దైవమీశో వ్యాకృతం చాధిభూతకమ్ ।**
**నిద్రాధ్యాత్మం క్షయో దైవమధిభూతం తమోగుణః ॥ 29**

**శ్లో॥ అధిదైవతమధ్యాత్మమధిభూతమితి త్రిధా ।**
**భ్రమాద్భాత్యేకమేవేదమిత్యూహ్యం శ్రవణాదిషు ॥ 30**

ప్ర : విశ్వః = విశ్వము, అధ్యాత్మమ్ = అధ్యాత్మము, విరాట్ చ = విరాట్పురుషుడు, అధిభూతమ్ = అధిభూతము, కృష్ణః = కృష్ణుడు, అధిదైవతమ్ = అధిదైవతము, జాగ్రత్ = జాగ్రదవస్థ (మెలకువ), అధ్యాత్మమ్ = అధ్యాత్మము, రక్షా = రక్షణ, అధిదైవమ్ = అధిదైవము, సత్త్వం చ = సత్త్వగుణమేమో, భౌతికమ్ = భౌతికము, హిరణ్యగర్భః = హిరణ్యగర్భుడు, అధిభూతమ్ = అధిభూతం, కః దైవమ్ = ఏ దైవము, తైజసః = తైజసునకు, అపరమ్ = వేరుకాడో, (ఆతడు), రజః = రజస్సు, అధిభూతమ్ = అధిభూతము, స్వప్నః = స్వప్నము, అధ్యాత్మమ్ = అధ్యాత్మము, చ = మరియు, స్వర్గః = స్వర్గము, అధిదైవతమ్ = అధిదైవతము, ప్రాజ్ఞః = ప్రాజ్ఞుడు, అధ్యాత్మమ్ = అధ్యాత్మము, ఈశః = ఈశ్వరుడు, దైవమ్ = అధిదైవతము, చ = మరియు, వ్యాకృతమ్ = వ్యాకృతము, అధిభూతకమ్ = అధిభౌతికము, నిద్రా = నిద్ర, అధ్యాత్మమ్ = అధ్యాత్మము, క్షయః = క్షీణత, దైవమ్ = అధిదైవతము, తమోగుణః = తమోగుణము, అధిభూతమ్ = అధిభూతము, ఇట్లు, అధిదైవతమ్ = అధిదైవతము, అధ్యాత్మమ్ = అధ్యాత్మము, అధిభూతమ్ = అధిభూతము, ఇతి = అని, త్రిధా = మూడు విధములుగా, భ్రమాత్ = భ్రాంతివలన, ఇదమ్ = ఈ, ఏకం+ఏవ = ఒక్కటియే, శ్రవణ+ఆదిషు = శ్రవణము మొదలగు ఇంద్రియములందు, భాతి = ప్రకాశించు చున్నది, ఇతి = అని, ఊహ్యమ్ = భావింపనగును.

**తా (శ్లో.27-30):** ఒకే బ్రహ్మపదార్థము శ్రవణాది ఇంద్రియముల మాధ్యమమున అధిభౌతికము, అధిదైవతము, అధ్యాత్మము అని మూడు విధములుగా ప్రకాశించుచున్నది. ఆ వైనమిట్లు-

| అధిభౌతికము | అధిదైవతము | అధ్యాత్మము |
|---|---|---|
| 1. విరాట్పురుషుడు | 1. కృష్ణుడు | 1. అధ్యాత్మము |
| 2. సత్త్వగుణము | 2. రక్షణ | 2. జాగ్రదవస్థ |
| 3. హిరణ్యగర్భుడు | 3. స్వర్గము | 3. స్వప్నము |
| 4. రజోగుణము | 4. ఈశ్వరుడు | 4. ప్రాజ్ఞుడు |
| 5. వ్యాకృతము | 5. క్షయము | 5. నిద్ర |
| 6. తమోగుణము. | | |

**శ్లో॥ తారాఙ్గానీమాన్యేతేషాం వ్యస్తోపాస్త్యా పృథగ్గతిః ।**
**సమస్తోపాస్తితో దత్తలోకప్రాప్తిర్హి సుస్థిరా ॥** 31

ప్ర : తారా = ప్రణవము, అంగాని ఇమాని = దాని యీ అంగములు, ఏతేషామ్ = వీనికి, వ్యస్త+ఉపాస్త్యా = వేర్వేరుగా ఉపాసించుటవలన, పృథక్ = వేర్వేరుగా, గతిః = ఫలము; సమస్త+ఉపాస్తితః = మొత్తముగ ఉపాసించుటవలన, సుస్థిరా = స్థిరమైన, మార్పులేని, దత్తలోకప్రాప్తిః హి = దత్తలోకప్రాప్తియే.

**తా :** ప్రణవములోని అంగములను విడివిడిగా ఉపాసించుట వలన ఫలము గూడ వేర్వేరుగా

కలుగును. అనగా, అ,ఉ,మ్ అను ప్రణవాంగముల ప్రత్యేక ఉపాసనములు కలుగును. కాని ఓంకారముగా అంగముల సమష్టి ఉపాసన వలన శాశ్వతమైన దత్తలోకప్రాప్తి కలుగును. *

**శ్లో॥ సుమఙ్గలం విరాడ్రూపం చరాచరజగన్మయమ్ ।**
**యోగినో యదుపాస్త్యా తు కైవల్యం ధామ యాన్తి తత్ ॥ 32**

**ప్ర :** యోగినః = యోగులు, యత్ ఉపాస్త్యా తు = యే ఉపాసన వలననైతే, కైవల్యం ధామ = కైవల్యధామమును, యాన్తి = పొందుచున్నారో, తత్ = అది, ఆ ఉపాసన స్వరూపము, చరాచర జగన్మయమ్ = చరాచర జగత్తంతయు కూడిన, విరాట్+రూపమ్ = విరాజమానమైన రూపము, సుమంగలమ్ = శుభప్రదమైనది.

**తా :** యోగులు ఉపాసించి కైవల్యమును పొందుచున్న ఆ రూపము చరాచరజగత్తు నిండి వెలుగుచున్న విరాడ్రూపము. ఆ రూపము సర్వశుభములను ప్రసాదించునది.

**శ్లో॥ బ్రహ్మాఽఽస్యం బాహుతః క్షత్రమూర్వోర్విడ్ వృషలః పదః ।**
**విష్ణోర్జజ్ఞే నిజగుణకర్మవృత్తివిభాగశః ॥ 33**

**ప్ర :** బ్రహ్మ = బ్రాహ్మణత్వము, ఆస్యమ్ = ఆ విరాట్పురుషుని ముఖము, బాహుతః = బాహువుల నుండి, క్షత్రమ్ = క్షత్రియత్వము, ఊర్వోః = తొడలనుండి, విడ్ (విట్) = వైశ్యత్వము, పదః = పాదము, వృషలః = శూద్రత్వము, విష్ణోః = విష్ణువుయొక్క, నిజ = తనదైన, గుణకర్మ = కర్మ స్వభావ, వృత్తి = వ్యాపార, విభాగశః = విభాగము ననుసరించి, జజ్ఞే = తెలిసెను.

**తా :** ఆ విష్ణువు విరాట్టు. వాని శరీరాంగముల గుణ, కర్మ, వ్యాపారములను అనుసరించి, ముఖము బ్రహ్మత్వమనియు, బాహువులు క్షాత్రమనియు, తొడలు వైశ్యత్వమనియు, పాదములు శూద్రత్వమనియు యేర్పడినవి. (మానవసమాజమునకు గూడ గుణకర్మవృత్తి స్వభావముల ననుసరించి యీ విభాగము అన్వయించినది.)

**శ్లో॥ ఉద్భిత్సర్గః పురా షోఢా చాష్టావింశతిధా పరః ।**
**తిర్యక్సర్గో నృసర్గోఽథ దైవసర్గస్తతోఽష్టధా ॥ 34**

**ప్ర :** పురా = పూర్వము, మొదట, షోఢా = ఆరు విధములుగా, ఉద్భిత్సర్గః = వన, పర్వత, ఓషధి, లతా, త్వక్, సార, వీరుద్ద్రుమ సర్గము, చ = మరియు, అష్టావింశతిధా = ఇరువది ఎనిమిది విధములుగా, తిర్యక్ సర్గః పరః = జంతుజాతులు వేరొకటియు, అష్టధా = ఎనిమిది విధములుగా, నృసర్గః = మానవజాతులు, అథ = ఆ పై, దైవసర్గః = దేవయోనులు,

**శ్లో॥ విరాడ్రూపస్య నాభ్యబ్జాద్విష్ణోరాస విధిః స చ ।**
**పుత్రాన్లబ్ధశ్రుతిః సృష్ట్యై మానసాంశ్చతురోఽసృజత్ ॥ 35**

**ప్ర :** విష్ణోః విరాడ్రూపస్య = విరాడ్రూపుడైన విష్ణువుయొక్క, నాభి అబ్జాత్ తతః = నాభి కమలము-

నందుండి, విధిః = బ్రహ్మ, ఆస = యేర్పడెను, సః చ = ఆతడున్ను, లబ్ధశ్రుతిః = వేదమును పొందినవాడై, సృష్ట్యై = సృజించుకొరకు, మానసాన్ పుత్రాన్ = మానసపుత్రులను, చతురః = నల్గురను, అసృజత్ = సృజించెను.

**తా :** పూర్వము తొలుత ఆరు విధములుగా వన, పర్వత, ఓషధి, లతా, త్వక్సార, వీరుద్ద్రుమములను; గోవు, అజము, మహిషము, జింక, వరాహము, గవయ, రురురవి, ఉష్ట్రము లనబడు ఎన్మిది ద్విశఫజాతులను (రెండు గిట్టలు గలవానిని), గాడిద, గుఱ్ఱము, అశ్వతర, గౌర, శరభ, చమరీ అను ఒక గిట్టగల జాతులను; నక్క, తోడేలు, పెద్దపులి, పిల్లి, కుందేలు, ముళ్ళపంది, సింహము, కోతి, ఏనుగు, తాబేలు, మొసలి అను అయిదు గోళ్ళుగల జాతులను, జలచరములు, గగనచరములు అను ఇరువది ఎనిమిది జాతులను, పితృ, సుర, గంధర్వ, దేవ, సిద్ధ, యక్ష, రక్షశ్చారణులను ఎన్మిది జాతులను, విరాడ్రూపవిష్ణువు నాభినుండి బ్రహ్మను సృష్టించగా, ఆ బ్రహ్మ విష్ణువునుండి వేదమును గ్రహించి, ఆ విజ్ఞానముతో నలుగురు మానసపుత్రులను సృజించెను. ఆ మానసపుత్రుల ద్వారా సృష్టికార్యనిర్వహణము జరుగవలెనని భావించెను.

**శ్లో॥ సనత్కుమారసనకసనన్దనసనాతనాః ।**
**కుమారా బ్రహ్మనిష్ఠాః స్యుస్తేఽతోభూత్కుపితో విధిః ॥ 36**

**ప్ర :** సనత్కుమార = సనత్కుమారుడు, సనక = సనకుడు, సనందన = సనందనుడు, సనాతనాః = సనాతనులు, అను, తే కుమారాః = ఆ మానసపుత్రులు, బ్రహ్మనిష్ఠాః స్యుః = బ్రహ్మజ్ఞానము నందు నిష్ఠగలవారైరి, అతః = ఆ కారణమున, విధిః = బ్రహ్మ, కుపితః = కోపించినవాడాయెను.

**తా :** సనత్కుమారుడు, సనకుడు, సనందనుడు, సనాతనుడు అను ఆ నల్వురు బ్రహ్మమానస పుత్రలున్నూ బ్రహ్మనిష్ఠగలవారై, సంసారవిముఖులైన కారణమున బ్రహ్మ కోపించెను.

**శ్లో॥ కుపితస్యాభవద్రుద్రో లలాటదుగ్రసృష్టికృత్ ।**
**తస్మై దేవా వరం ధాత్రా తపసేఽథ స యోజితః ॥ 37**

**ప్ర :** కుపితస్య = కోపించినవాడైన వానియొక్క, లలాటాత్ = లలాటమునుండి, ఉగ్రసృష్టికృత్ = భయంకరమైన కార్యములు చేయువాడైన, రుద్రః = రుద్రుడు, అభవత్ = ఉద్భవించెను; తస్మై = ఆ రుద్రునికొరకు, దేవాః = దేవతలు, ధాత్రా = బ్రహ్మచేత, అథ = అంతట, వరమ్ = వరదానముగా, తపసే = తపస్సులో, సః యోజితః = ఆ రుద్రుడు నియోగించబడినాడు.

**తా :** కోపించిన బ్రహ్మలలాటమునుండి ఉగ్రకార్యములాచరించు రుద్రుడుద్భవించినాడు. ఆ రుద్రునికై దేవతలు బ్రహ్మనుండి వరమును పొంది, వానిని తపస్సు చేయుటలో నియోగించిరి.

**శ్లో॥ శాన్తస్యాన్తస్య కస్యాథో మనసో దేహతోఽప్యమీ ।**
**పుత్త్రాః సుతపసో జాతా మరీచ్యత్ర్యఙ్గిరః క్రతుః ॥ 38**

శ్లో॥ భృగుః పులస్త్యః పులహోరుచిర్దక్షో వసిష్ఠకః ।
నారదశ్చోరసో ధర్మః పృష్ఠతోఽన్యో హృదో భ్రువోః ॥ 39

ప్ర : అథో = అంతట, కస్య శాన్తస్వాన్తస్య = యే శాంతించిన చిత్తముగలవానియొక్క, మనసః = మనస్సునుండి, దేహతః అపి = దేహమునుండియును, అమీ పుత్రాః = ఈ పుత్రులు, సుతపసః = మంచి తపస్సువలన, జాతాః = జన్మించిరి, మరీచి, అత్రి, అంగిర, క్రతు, భృగు, పులస్త్య, పులహ, రుచి, దక్ష, వసిష్ఠకః, నారదః = ఆ యా పేర్లు గల వారు, ఉరసః = ఉరము నుండి, చ = మరియు, ధర్మః = ధర్మము, పృష్ఠతః = వెనుకభాగమునుండి, అన్యః = అధర్మము, హృదః = హృదయమునుండి, భ్రువోః = కనుబొమలనుండి

శ్లో॥ కామః క్రోధోఽధరాల్లోభశ్ఛాయాయాః కర్దమో ముఖాత్ ।
వాగ్వేదాశ్చతురాస్యేభ్యః సాఙ్గోపాఙ్గాః స విద్యకాః ॥ 40

ప్ర : కామః = కామము, క్రోధః = క్రోధము, అధరాత్ = పెదవినుండి, లోభః = లోభము, ఛాయాయాః = నీడనుండి, కర్దమః = పాపము, ముఖాత్ = ముఖమునుండి, వాక్ = వాక్కు, చతుః ఆస్యేభ్యః = నాలుగు ముఖములనుండి, సాంగ+ఉపాంగాః = అంగములు, ఉపాంగములతో కూడిన, సవిద్యకాః = విద్యతో (జ్ఞానముతో, మంత్రముతో) కూడిన, వేదాః = వేదములు.

శ్లో॥ సర్గర్ద్ధిం ధ్యాయతో యుగ్మం కస్యాఙ్గాదభవత్స్వరాట్ ।
ఆద్యో మనుః స మహిషీ శతరూపేతి దమ్పతీ ॥ 41

ప్ర : సర్గ+ఋద్ధిమ్ = సృష్టియొక్క వృద్ధిని, ధ్యాయతః = ధ్యానించువాడైన, కస్య అఙ్గాత్ = యెవని అంగమునుండి, స్వరాట్ = స్వయంభువైన, ఆద్యః మనుః = మొదటి మనువు, అభవత్ = కలిగెనో, సః = ఆతడున్ను, శతరూపా = శతరూపయను పేరుగల, మహిషీ = పట్టపుదేవి, యుగ్మమ్ = ఇద్దరును, దంపతీ ఇతి = దంపతులని (అభవత్ = ఆయెను.)

**తా (శ్లో.38-41) :** అంతట శాంతించిన బ్రహ్మ దేహము నుండి మనస్సు నుండియును తపఃఫలముగా మరీచి, అత్రి, అంగిరుడు, క్రతువు, భృగువు, పులస్త్యుడు, పులహుడు, రుచి, దక్షుడు, వసిష్ఠుడు, నారదుడు అను పేర్లుగల పుత్రులు, ధర్మము, వాని ఉరః స్థలమునుండి జన్మించగా, వాని వెనుక భాగమునుండి అధర్మము, హృదయమునుండి కనుబొమలనుండి కామము, క్రోధము అనునవియును, అధరమునుండి లోభము, నీడనుండి పాపము, ముఖమునుండి వాక్కు, నాలుగు ముఖముల నుండి అంగములతో, ఉపాంగములతో బ్రహ్మవిద్యతో కూడిన వేదములు కలిగినవి.

ఆ బ్రహ్మ తన సృష్టి నిరాతంకముగ కొనసాగవలెనను కోరికతో తపించగా, మొదటి మనువు స్వయంభువుడు (స్వాయంభువ మనువు) అవతరించినాడు. శతరూప అనునామె వాని భార్యయైనది. వారు **ఆది మానుష దంపతులు**.

**శ్లో॥ జనయామాసతుః పుత్రౌ పుత్రీశ్చ గ్రామ్యధర్మతః ।**
**ప్రియవ్రతోత్తానపాదౌ భూపౌ తవాసతుః సుతౌ ॥ 42**

**శ్లో॥ ఆకూతిర్దేవహూతిశ్చ ప్రసూతిశ్చేతి కన్యకాః ।**
**ధీరూపశీలలక్ష్మాఢ్యాః సర్గోఽయం వవృతే తతః ॥ 43**

**ప్ర :** గ్రామ్యధర్మతః = మైథున ధర్మము ననుసరించి, పుత్రః పుత్రీః చ = పుత్రులను, పుత్రికలను గూడ, జనయామాసతుః = జనింపజేసిరి; ప్రియవ్రత+ఉత్తానపాదౌ భూపౌ తౌ సుతౌ = ఆ కుమారులైన ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అను రాజులను, అకూతిః = ఆకూతి, దేవహూతిః చ = దేవహూతియును, ప్రసూతిః చ = ప్రసూతియును, ఇతి కన్యకాః = అను పేర్లుగల కన్యలను, ధీ = బుద్ధి, రూప = శరీరసౌందర్యము, శీల = నడవడిక, లక్ష్మ+ఆఢ్యాః = లక్షణములతో సంపన్నులైనవారు, ఆసతుః = పెండ్లియాడిరి, తతః = వారి నుండి, అయం సర్గః = ఈ సృష్టి, వవృతే = ప్రవర్తిల్లుచున్నది.

**తా :** స్వాయంభువమనువు, శతరూప అను దంపతులవలన మైథునధర్మము ననుసరించి ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అను రాజకుమారులను కనిరి. ఆ కుమారులు ఆకూతి, దేవహూతి, ప్రసూతి అను కన్యలను వివాహమైరి. ఆ కన్యలు రూపవతులు, శీలవతులు, వివేకవతులు. వారి దాంపత్యములో సృష్టి వృద్ధియైనది.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ద్వితీయాష్టకే తృతీయోఽధ్యాయః ।

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీ దత్తపురాణమ్

## ద్వితీయాష్టకము - చతుర్థాధ్యాయము

**శ్లో॥ తం ను ప్రాప్య సోఽదాదాకూతిం కర్దమాయ చ ।**
**దేవహూతిం ప్రసూతిం చ మనుర్దక్షాయ కర్మిణే ॥ 1**

**ప్రతిపదార్థం :** సః = స్వాయంభువ మనువు, తం ను ప్రాప్య = రుచిని చేరి, దేవహూతిమ్ = దేవహూతిని, కర్దమాయ = కర్దమునికొరకు, ఆకూతిమ్ = ఆకూతిని, అదాత్ = కన్యాదానము చేసెను. చ = మరియును, ప్రసూతిం చ = ప్రసూతిని కూడ, కర్మిణే దక్షాయ = కర్మిష్ఠియైన దక్షునకై, మనుః = ఆ మనువు, (ఆదాత్ = ఇచ్చెను.)

**తాత్పర్యం :** ఆ స్వాయంభువమనువు కర్దమునకు తనకుమార్తె యైన ఆకూతిని, రుచికి దేవహూతిని, కర్మనిష్ఠగల దక్షునకు ప్రసూతిని కూడ కన్యాదానము చేసెను. *

**శ్లో॥ ఆకూత్యాం దక్షిణాయజ్ఞౌ శ్రీయజాంశౌ దమ్పతీ రుచేః ।**
**దక్షాత్ప్రసూత్యాం పుత్ర్యోఽదాత్కశ్యపాయ త్రయోదశ ॥ 2**

**ప్ర :** ఆకూత్యామ్ = ఆకూతియందు, రుచేః = రుచికి, శ్రీయజాంశౌ = లక్ష్మీవిష్ణువుల అంశలైన, దక్షిణాయజ్ఞౌ = దక్షిణ, యజ్ఞుడు అను, దంపతీ = భార్య, భర్తలు, ప్రసూత్యామ్ = ప్రసూతియందు, దక్షాత్ = దక్షునివలన, త్రయోదశ = పదియు ముప్వురు, పుత్ర్యః = కుమార్తెలు, కశ్యపాయ ఆదాత్ = కశ్యపున కిచ్చెను.

**శ్లో॥ ధర్మాయ చాగ్నయే స్వాహాం తారేశే సప్తవింశతిమ్ ।**
**స్వధాం పితృభ్యః స సతీం శంకరాయ విధీరితః ॥ 3**

**ప్ర :** ధర్మాయ అగ్నయే = ధర్మమునకగు అగ్నికి, స్వాహామ్ = స్వాహాదేవిని, తారేశే = చంద్రునికి, సప్తవింశతిమ్ = ఇరువది యేడ్గురను, పితృభ్యః = పితరులకు, స్వధామ్ = స్వధాదేవిని, సః =

ఆతడు, విధి+ఈరితః = బ్రహ్మచే ప్రేరితుడై, శంకరాయ = శంకరునకు, సతీమ్ = సతీదేవిని, (ఆదాత్ = ఇచ్చెను.)

**తా :** ఆకూతియందు రుచికి దక్షిణ, యజ్ఞుడు అనువారు జన్మించిరి. వీరు లక్ష్మీనారాయణాంశ గలవారు. వీరిద్దరు దంపతులైరి. ప్రసూతియందు దక్షునివలన పదియుమువ్వురు కుమార్తెలు కలుగగా వారిని కశ్యపునకు భార్యలుగా నిచ్చెను. అట్లే, ధర్మాచరణనిమిత్తదేవతయగు అగ్నికి స్వాహాదేవిని, ఇరువదియేడ్గురు తారలను వారికీశుడగు చంద్రునకు, పితృదేవతలకు స్వధాదేవిని, అట్లే విధిప్రేరితుడై ఆతడు సతీదేవిని శంకరునకిచ్చెను. *

**శ్లో॥ స్వరూపానన్దసన్తుష్టాదపి భోగపరాఙ్ముఖాత్ ।**
**అలబ్ధకామయా పత్న్యా స్వవ్రతక్షామయార్థితాత్ ॥ 4**

**శ్లో॥ యోగాఞ్చితమహైశ్వర్యాత్కృతలీలాచ్చ కర్దమాత్ ।**
**నవ కన్యా దేవహూత్యాం కపిలాఖ్యోఽభవత్సుతః ॥ 5**

**ప్ర :** స్వరూపానందసంతుష్టాత్ అపి = తన సౌందర్యసంతోష సంతృప్తుడైనప్పటికిని, భోగపరాఙ్ముఖాత్ = భోగమునకు విముఖుడైయున్న, కర్దమాత్ = కర్దముని వలన, అలబ్ధకామయా = తీరని కోరిక గలదైన, స్వవ్రతక్షామయా = పాతివ్రత్యమువలన కృశించియున్నదైన, పత్న్యా = భార్యచేత, అర్థితాత్ = కోరబడినవాడైన, కర్దమాత్ = కర్దమునివలన, దేవహూత్యామ్ = దేవహూతియందు, యోగాఞ్చితమహైశ్వర్యాత్ కృతలీలాత్ చ = యోగశక్తిచేత చేయబడిన లీలవలనను, నవ కన్యాః = తొమ్మండుగురు కన్యలు, కపిల+ఆఖ్యః = కపిలుడను పేరుగల కుమారుడు, అభవత్ = కలిగెను.

**తా :** కర్దముడు పతివ్రతయైన భార్యయొక్క రూపలావణ్యములకు సంతుష్టుడైనను సంసారవిముఖుడై నందువలన వాని భార్య వ్రతదీక్షలో కృశాంగియైనది కాని ఆమె సంతానకామన తీరనిదై తనకు సంతానప్రాప్తి కలుగుటకై భర్తను ప్రార్థించగా, ఆతడు యోగశక్తివలన నొక లీలను కల్పించి, భార్యయైన దేవహూతికి తొమ్మండుగురు కుమార్తెలను, కపిలుడను పేరుగల కుమారుని ప్రసాదించెను.

**శ్లో॥ మరీచయే కర్దమోఽదాత్కలాఖ్యాం కశ్యపో యతః ।**
**అత్రయే చానసూయాయాం యత్పుత్రాః శ్రీభగవన్ముఖాః ॥ 6**

**ప్ర :** కర్దమః = కర్దముడు, కలా+ఆఖ్యామ్ = కల యను పేరుగల దానిని, మరీచయే = మరీచికై, అదాత్ = ఇచ్చెను, యతః = ఆమెనుండి, కశ్యపః = కశ్యపుడు (జన్మించెను), అత్రయే = అత్రికై (ఇచ్చిన), అనసూయాయాం చ = అనసూయయందేమో, శ్రీభగవన్ముఖాః = శ్రీ దత్తుమొదలగు వారు, యత్+పుత్రాః = పుత్రులెవరో (వారు)

**తా :** కర్దముడు కలయను కుమార్తెను మరీచికిచ్చెను. ఆమెవలన మరీచికి కశ్యపుడు కలిగెను. అత్రికి అనసూయ నిచ్చెను. ఆ దంపతులకు **శ్రీదత్త** ప్రముఖులు పుత్రులైరి.

**శ్లో॥ శ్రద్ధాం చాఙ్గిరసో యస్యా జీవౌతథ్యముఖాః ప్రజాః ।**
**హవిర్భువం పులస్త్యాయ హ్యగస్త్యాద్యాశ్చ యత్ప్రజాః ॥ 7**

**ప్ర :** శ్రద్ధాం చ = శ్రద్ధయను కుమార్తెనేమో, అంగిరసోః = అంగిరసునికి, యస్యాః = ఆమె వలన, జీవ+ఓతథ్యముఖాః = జీవుడు, ఓతథ్యుడు ఆదిగాగల, ప్రజాః = సంతానము, హవిర్భువమ్ = హవిర్భువ యను కన్యను, పులస్త్యాయ = పులస్త్యునకు, అగస్త్యాద్యాశ్చ హి = అగస్త్యుడు మొదలగువారేమో, యత్ ప్రజాః = ఎవరికి సంతానమో,

**తా :** శ్రద్ధయను కన్యను అంగిరసునకివ్వగా, వారికి జీవుడు, ఓతథ్యుడు మొదలగువారు సంతానమైరి. హవిర్భువ యను కన్యను పులస్త్యునకివ్వగా, వారికి అగస్త్యుడు మొదలగు వారు సంతతిగా కలిగిరి.

**శ్లో॥ పులహాయ గతిం చాస్యాః కర్మశ్రేష్ఠాదయః ప్రజాః ।**
**క్రియాం చ క్రతవే యస్యా వాలఖిల్యాభిధాః ప్రజాః ॥ 8**

**శ్లో॥ వసిష్ఠాయోర్జాం చ చిత్రకేత్వాద్యా యత్ప్రజాస్తథా ।**
**చితిం చాథర్వణే సోదాదృస్యా దధ్యఙ్ముఖాః ప్రజాః ॥ 9**

**శ్లో॥ ఖ్యాతిం చ భృగవే యస్యాః ప్రజా ధాతృముఖా ఇతి ।**
**పుత్రీర్విధీరితోఽదాత్స బ్రహ్మర్షిభ్యో విధానతః ॥ 10**

**ప్ర :** పులహాయ గతిం చ = పులహునకు గతియను కన్యనున్ను, అస్యాః = ఆమెకు, కర్మశ్రేష్ఠాదయః ప్రజాః = కర్ముడు, శ్రేష్ఠుడు మొదలగు సంతానము, క్రియాం చ క్రతవే = క్రియను క్రతువునకు, యస్యాః = ఆమెకు, వాలఖిల్యాభిధాః = వాలఖిల్యులను, ప్రజాః = సంతానము, వసిష్ఠాయ ఊర్జాం చ = వసిష్ఠునకు ఊర్జను, చిత్రకేతు+ఆద్యాః యత్ ప్రజాః = చిత్రకేతు మొదలగు సంతానము, తథా = అట్లే, చితిం చ అథర్వణే = చితిని అథర్వునకును, సః ఆదాత్ = ఆతడిచ్చెను, యస్యాః = ఆమెకు, దధ్యఙ్ముఖాః ప్రజాః = దధ్యఙ్ముఖులు అను సంతానము, ఖ్యాతిం చ భృగవే = ఖ్యాతిని భృగువునకున్ను, యస్యాః = ఆమెకు, ధాతృముఖాః ఇతి ప్రజాః = ధాతృముఖులను సంతానము, పుత్రీః = కుమార్తెలను, విధి+ఈరితః = బ్రహ్మ ప్రేరణచేత, విధానతః = శాస్త్రము ననుసరించి, సః = ఆతడు, బ్రహ్మర్షులకిచ్చి శాస్త్రోక్తముగా వివాహము జరిపించగా వారి కిట్లు సంతానము కలిగినది :-

| | |
|---|---|
| పులహుడు - గతి | : కర్మ, శ్రేష్ఠ ఇత్యాది సంతతి |
| క్రతువు - క్రియ | : వాలఖిల్యాదులు సంతతి |
| వసిష్ఠుడు - ఊర్జ | : చిత్రకేతు ఆది సంతతి |

అథర్వణుడు - చితి : ధధ్యఙ్ముఖులు సంతతి
భృగువు - ఖ్యాతి : ధాతృముఖులు సంతతి.

**శ్లో॥ కర్దమః కృతకృత్యోఽథ ప్రాప్య వీతైషణో ద్రుతమ్ ।**
**సల్లిఙ్గం వైష్ణవం స్వస్థో విజహార పరాత్మదృక్ ॥ 11**

ప్ర : అథ = అంతట, కృతకృత్యః = ధన్యుడై, కర్దమః = కర్దముడు, వీత+ఏషణః = వీడిన కోరికగలవాడై, ద్రుతమ్ = వేగముగ, సల్లింగం వైష్ణవమ్ = సంన్యాసముతో కూడిన వైష్ణవమును, ప్రాప్య = పొంది, స్వస్థః = స్వస్థత పొంది, పరాత్మదృక్ = పరమాత్మ దర్శనాపేక్ష గలవాడై, విజహార = సమస్తమును విడిచెను.

**తా :** కర్దము డంతట కృతకృత్యుడై, కోర్కెలు లేనివాడై, వెంటనే సన్యసించి, వైష్ణవమును స్వీకరించి స్వస్థుడై, సమస్తమును విడచి, పరమాత్మయందే దృష్టిని సారించెను.

**శ్లో॥ తద్వియోగాతురామంబామృషిసేవాహతాశుభామ్ ।**
**సర్వసాధన సంపన్నాం సాంఖ్యాచార్య ఉపాదిశత్ ॥ 12**

ప్ర : తత్ వియోగ+ఆతురామ్ = భర్తృవియోగము వలన బాధితురాలైన, ఋషిసేవా = ఋషి సేవవలన, హత+అశుభామ్ = అమంగళము నావల ద్రోచిన, సర్వసాధనసంపన్నామ్ = అన్ని సాధనములతో కూడిన, అంబామ్ = తల్లిని, సాంఖ్య+ఆచార్యః = సాంఖ్యదర్శనకర్తయైన కపిలుడు, ఉపాదిశత్ = ఉపదేశించెను.

**తా :** తనను విడచి వెళ్ళిన భర్తను గూర్చి కొంతగా మనస్సు ఆతురత చెందినను, దేవహూతి ఆ ఋషిసేవలో అశుభభావనకు దూరముగనుండు జ్ఞానమును పొంది, జ్ఞానమార్గమున సాధకురాలై యున్నది కావున, అట్టి తల్లికి సాంఖ్యదర్శనద్రష్టయైన కపిలుడు విధిగా ఉపదేశము చేసినాడు.

**శ్లో॥ విష్ణ్వంశః కపిలస్తత్త్వజ్ఞానం యన్ముక్తిదం లఘు ।**
**యేనాత్మా పఞ్చవింశాఖ్యో గమ్యతే పురుషః పరః ॥ 13**

ప్ర : విష్ణు+అంశః కపిలః = విష్ణు అంశగల కపిలుడు, యత్ = యేది, లఘు = సులభసాధ్యమై, ముక్తిదమ్ = ముక్తినిచ్చునదియో, యేన = దేనిచేత, ఆత్మా = ఆత్మ, పంచవింశ+ఆఖ్యః = ఇరువది యైదు పేర్లను, గమ్యతే = పొందుచున్నదో, పరః పురుషః = పరమపురుషుడు, ఆ తత్త్వజ్ఞానమును

**శ్లో॥ నిత్యముక్తోఽపి సిద్ధేశస్త్రైలోక్యేఽన్తర్బహిర్మునిః ।**
**అవ్యాహతగతైశ్వర్యశ్చరత్యద్యాపి సూరతః ॥ 14**

ప్ర : నిత్యముక్తః అపి = సదా ముక్తుడే యైనను, సిద్ధ+ఈశః = ఈశత్వము సిద్ధించినవాడై, త్రైలోక్యే = మూడు లోకములందు, అన్తః+బహిః+మునిః = లోపల, వెలుపల పవిత్రుడై,

అవ్యాహతగత+ఐశ్వర్యః = ఎదురులేక వ్యాప్తమైన ఈశ్వరత్వము గలవాడై, అద్య+అపి = నేడు కూడ, సూరతః = సూర్యునిద్వారా, చరతి = సంచరించుచున్నాడు.

**తా :** విష్ణు అంశగల కపిలుడు సులభసాధ్యమై ముక్తిప్రదమైన తత్త్వజ్ఞానమును ఉపదేశించినాడు. ఈ తత్త్వము ఇరువది యైదు తత్త్వములతో ఆత్మ పరమపురుషుని పొందు విధానమును బోధించు సాంఖ్యదర్శనము. పరమాత్మ నిత్యముక్తుడు. త్రిలోకాధిపతి. సర్వత్ర లోపల, వెలుపల కూడ ఎదురులేని ప్రభుత గలవాడు. సూర్యరూపియై సంచరించుచున్నాడు.

**శ్లో॥ దేవహూతిస్తదాదేశాద్గతా బ్రాహ్మీం స్థితిం ధ్రువామ్ ।**
**తత్పుత్ర్యోఽపి మహాభాగా ఋషిపత్న్యోఽభవన్హి యాః ॥ 15**

**ప్ర :** తత్+ఆదేశాత్ = వాని (కపిలుని) ఆదేశమువలన, దేవహూతిః = దేవహూతి, ధ్రువామ్ = శాశ్వతమైన, బ్రాహ్మీం స్థితిమ్ = బ్రాహ్మీ స్థితిని, గతా = పొందినదాయెను; తత్ పుత్ర్యః అపి = ఆమె కుమార్తెలు గూడ, యాః మహాభాగాః = యే యే మహాభాగ్యవతులైన, ఋషిపత్న్యః = ఋషిపత్నులుగా, అభవన్ హి = అయిరో వారు

**తా :** ఆ కపిలుని ఉపదేశానుసారము దేవహూతి నిశ్చితమైన విదేహముక్తిని పొందినది. ఆమె కుమార్తెలు గూడ ఋషిపత్నులై, మహాభాగ్యవతులైరి.

**శ్లో॥ జాయాయుతా మరీచ్యాద్యాః పితృశాసనతత్పరాః ।**
**సృష్టిప్రవర్తకా ఆసన్సర్వే సుతపసోఽమలాః ॥ 16**

**ప్ర :** మరీచి+ఆద్యాః = మరీచి మొదలగువారు, జాయాయుతాః = భార్యలతో గూడి, పితృశాసనతత్పరాః = తండ్రి ఆజ్ఞానువర్తులగుచు, సర్వే = అందరు, సుతపసః = గాఢతపస్సుచే, అమలాః = మలినము లేనివారై, సృష్టిప్రవర్తకాః ఆసన్ = సృష్టిని కొనసాగించువారైరి.

**తా :** మరీచి మొదలగు వారు తమతమ భార్యలతో గూడి తండ్రి ఆజ్ఞానుసారము సృష్టిని కొనసాగించిరి. ఐనను వారు గాఢతపోనిష్ఠులై సంసారమాలిన్యము నంటని వారైరి.

**శ్లో॥ ఏతేభ్య ఏవ సర్గోఽత్ర విస్తృతోఽయం సనాతనః ।**
**ధర్మోఽపి యదనుష్ఠానాత్ప్రీణాతి పురుషం పరమ్ ॥ 17**

**శ్లో॥ అజ్ఞానేనావృతజ్ఞానా మోహాత్సమ్భోగతత్పరాః ।**
**ధర్మతత్త్వమవిజ్ఞాయ శశ్వద్యాన్తి గతాగతమ్ ॥ 18**

**ప్ర :** ఏతేభ్యః సర్గ ఏవ = వీరి సృష్టియే, అత్ర = ఇచట, విస్తృతః = విస్తారమైనది; అయం ధర్మః = ఈ ధర్మము, యత్ = యేది, అనుష్ఠానాత్ = ఆచరణవలన, పరం పురుషమ్ = పరమ పురుషుని, ప్రీణాతి = సంతోషపెట్టునో (తత్) సనాతనః = అది సనాతనధర్మము; అజ్ఞానేన = అజ్ఞానముచేత, ఆవృతజ్ఞానాః = కప్పబడిన జ్ఞానము గలవారై, మోహాత్ = మోహమువలన,

సంభోగతత్పరాః = సంభోగపరాయణులై, ధర్మతత్త్వమ్ = ధర్మసూక్ష్మమును, అవిజ్ఞాయ = ఎఱుగక, శశ్వత్ = ఎల్లప్పుడు, ఎడతెగక, గతాగతమ్ = ఉపాధిని కలిగించు జననమరణములను, యాన్తి = పొందుచున్నారు.

**తా :** వీరి సృష్టియే సనాతనమై, విస్తరించినది. ఈ ధర్మము నాచరించుట పరమపురుషునకు ప్రీతికరము. అజ్ఞానముచే కప్పబడి జ్ఞానము ప్రకాశించని వారు మోహమునకులోనై సంభోగపరులై ధర్మసూక్ష్మమును తెలియక ఎడతెగని జననమరణచక్రభ్రమణమున బడుచున్నారు.

**శ్లో॥ అసత్త్వాభానరూపస్య ద్వివిధావరణస్య చ ।**
**నాశ ఆత్మైక్యబోధేన విక్షేపాన్తస్తతోఽమృతమ్ ॥ 19**

**ప్ర :** అసత్త్వ+అభానరూపస్య = అసత్వరూపము, అభానరూపము అను, ద్వివిధ = రెండు విధముల, ఆవరణస్య చ = ఆవరణము గల దానియొక్కయు, ఆత్మైక్యబోధేన = ప్రత్యగాత్మ పరాత్మల ఐక్యతాజ్ఞానము చేత, నాశః = నాశము, విక్షేప+అన్తః = ఆత్మయొక్క రజోగుణాత్మకమైన రాగద్వేషాది కల్పనాశక్తియగు విక్షేపశక్తియొక్క నాశము, తతః = దానివలన, అమృతమ్ = అమృతత్వము.

**శ్లో॥ ఇతి నిశ్చిత్యోపదేష్టుమజోఽద్వైతోఽప్యవాతరత్ ।**
**యోగపూర్వాత్మవిజ్ఞానం కృపణేభ్యో దయాలురాట్ ॥ 20**

**ప్ర :** అవాతరత్ = అవతరించెను, ఇతి = అని, యోగపూర్వ+ఆత్మవిజ్ఞానమ్ = యోగముతో కూడిన ఆత్మవిజ్ఞానమును, కృపణేభ్యః = మందబుద్ధులకు, ఉపదేష్టుమ్ = ఉపదేశించుటకు, నిశ్చిత్య = నిశ్చయించి, అద్వైతః అపి = జననమరణాదులులేనివాడైనను, అజః = పరబ్రహ్మము, దయాలురాట్ = దయగల ప్రభువై, అవాతరత్ = అవతారమెత్తెను.

**తా :**ఆత్మకు అసత్త్వరూపము, అభానరూపము అని రెండు రూపములున్నవి. ఇవి విక్షేపశక్తియొక్క రెండు విధములైన ఆవరణ రూపములు. ఆత్మయే లేదనిపించునట్లు జ్ఞానమును నెట్టివేయునది అసత్త్వరూపము; ఉన్న ఆత్మ ప్రకాశింపదనిపించునది అభానరూపము. ఈ రెండు ఆవరణములు తొలగినగాని ఆత్మజ్ఞానము కలుగదు. అనగా, ఆత్మసాక్షాత్కారమువలనగాని అమృతత్వము సిద్ధించదు. ఈ విషయమును నిశ్చయించి యోగపూర్వకముగా ఆత్మవిజ్ఞానమును మందబుద్ధులకు ఉపదేశింపనెంచి దయాలువైన దత్తప్రభువు, తాను జననమరణాది ద్వంద్వములేని శాశ్వతుడైనను, లోకమున అవతరించెను.

**శ్లో॥ అన్వర్థకోఽత్రిర్భగవాన్ద్వితీయో– విధేః సుతో బ్రహ్మవిదస్య పత్నీ ।**
**పుత్రీ ద్వితీయా ఖలు కర్దమస్య – పుత్రస్తయోర్దత్త ఇహాద్వితీయః ॥ 21**

**ప్ర :** అన్వర్థకః = సార్థకనాముడైన, భగవాన్ అత్రి = భగవాన్ అత్రి, విధేః = బ్రహ్మయొక్క,

ద్వితీయః సుతః = రెండవ కుమారుడు, బ్రహ్మవిద్ = బ్రహ్మజ్ఞాని, అస్య = వానియొక్క, పత్నీ = భార్య, కర్దమస్య = కర్దమునియొక్క, ద్వితీయా పుత్రీ ఖలు = రెండవ కుమార్తెకదా, తయోః పుత్రః = వారిద్దరి కుమారుడు, **దత్తః = దత్తప్రభువు**, ఇహ = లోకమున, అద్వితీయః = అద్వితీయుడు, సాటిలేని వాడు.

**తా :** అత్రి మహర్షి బ్రహ్మజ్ఞాని. బ్రహ్మకు రెండవ కుమారుడు. వాని భార్య కర్దమునకు రెండవ కుమార్తె. వారిద్దరి కుమారుడు **శ్రీదత్తప్రభువు** సాటిలేని వాడు.

**శ్లో॥ నిష్కల్మషం చిత్తగతం తపస్త-దత్ర్యాహ్వయం మూర్తమివాస్య ధాతుః ।**
**ఆవిర్బభూవోత్తమమీక్షణాద్యం - జ్ఞానీశ్వరం చేతి జగాద వేదః ॥ 22**

**ప్ర :** అస్య ధాతుః = ఆ బ్రహ్మయొక్క, నిష్కల్మషమ్ = శుద్ధమైన, సాత్త్విక, చిత్తగతమ్ = మనస్సునందున్న, తపః = తపస్సు, తత్+అత్రి+ఆహ్వయమ్ = ఆ అత్రి అనబడు పేరు గలది, మూర్తం ఇవ = సాకారమైనట్లు, ఉత్తమం ఈక్షణ+ఆద్యమ్ = శ్రేష్ఠమైన తొలిచూపు, జ్ఞాని+ఈశ్వరమ్ = జ్ఞాని ఈశ్వరత్వముగా, వేదః = వేదము, జగాద ఇతి చ = చెప్పెను అనియును, ఆవిః +బభూవ = ఆవిర్భవించెను.

**తా :** బ్రహ్మయొక్క సాత్త్వికమైన తపస్సు వాని చిత్తగతమై అత్రి అను పేరుగల జ్ఞాని ఈశ్వరత్వపు ఆద్యము, ఉత్తమమునైన ఈక్షణమై వేదము చెప్పిన ప్రభువు ఆవిర్భవించెను. *

**శ్లో॥ యదాసురః సూర్యమపి ప్రకాశ-మావిధ్యదేతం తమసాత్మశక్త్యా ।**
**బ్రహ్మేవ మాయా తమవిన్దదత్రి-ర్నాన్యే తమర్థా ఇతి విశ్రుతం హి ॥ 23**

**ప్ర :** యత్+ఆసురః = యే అసురజాతి వాడు, సూర్యమపి ప్రకాశమ్ = సూర్యుని ప్రకాశమును గూడ, తమసాత్మశక్త్యా = తనదైన తమోగుణశక్తిచేత, మాయా బ్రహ్మేవ = మాయాబ్రహ్మవలె, ఆవిధ్యత్ = శాసించెనో, ఏతమ్ = వానిని, అత్రిః = అత్రి, తమ్ = వానిని, న అన్యే = ఇతరుని కాదు, తమర్థాః = వానికై, అవిన్దత్ ఇతి = ఉద్ధరించెను అని, విశ్రుతం హి = ప్రసిద్ధమే.

**తా :** అసురుడైన రాహువు, సూర్యుని ప్రకాశమును సైతము తన తమోగుణశక్తి (తమస్సు) చే శాసించగా, వానిని వానికొరకే ఉద్ధరించిన మహాత్ముడు అత్రి యని ప్రసిద్ధి.

**శ్లో॥ శ్రీశాకలామ్నాయఋచో మహర్షి-ర్యః పఞ్చమం మణ్డలమభ్యపశ్యత్ ।**
**యత్రాత్మభూతాగ్నిముఖామరేన్ద్రాః - ప్రశంసితా యే హ్యుభయర్ద్ధిమూలాః ॥24**

**ప్ర :** శ్రీశాకల+ఆమ్నాయ = శ్రీశాకలశాఖ యనుపేరుగల, ఋచః = ఋగ్వేదమునకు, యః మహర్షిః = యే మహర్షి, పంచమం మండలమ్ = ఐదవ మండలమును, అభి+అపశ్యత్ = దర్శించెనో, యత్ర = దేనియందు, ఆత్మభూత = ఆత్మనుండి జనించిన, అగ్నిముఖ = అగ్నిని ముఖముగా గలిగిన, అమర+ఇన్ద్రాః = దేవతలు, ఇంద్రుడు, ప్రశంసితాః = ప్రశంసిపబడిరో, యే హి = ఎవరైతే, ఉభయ+వృద్ధిమూలాః = ఇరువురు వృద్ధి జెందుటకు కారణమైనవారో,

**తా :** యే మహర్షి ఋగ్వేదమున శాకలశాఖయనుదాని పంచమమండలద్రష్టయో, ఆ మహర్షి అత్రి. అగ్నిముఖులైన దేవతలు ఇంద్రుడు ఉభయుల వృద్ధికి హేతువులని ఈ పంచమమండలమున ప్రశంసింపబడిరి.

**శ్లో॥ రుగ్ణాన్విలోక్యాద్యయుగేఽత్ర జన్తూం-స్తప్త్వా తపో యస్త్వృచ ఆయురాఖ్యమ్ ।**
**లబ్ధ్వోపవేదం సమగాద్భిషగ్రా-డత్రిః కృతే వైద్య ఇతి ప్రసిద్ధమ్ ॥ 25**

**ప్ర :** ఆద్యయుగే = కృతయుగమునందు, రుగ్ణాన్ జన్తూన్ = వ్యాధిగ్రస్తములైన ప్రాణులను, విలోక్య = చూచి, అత్ర = అచట, యః = ఎవడు, తప్త్వా తు తపః = తపస్సు చేసి, వృచః = సూర్యునినుండి, ఆయురాఖ్యమ్ = ఆయువను పేరుగల, ఉపవేదమ్ = ఉపవేదమును (అనగా, ఆయుర్వేదమును), లబ్ధ్వా = పొంది, అత్రిః= అత్రి మహర్షి, భిషగ్రాట్ = వైద్యరాజు, కృతే = (ఆతని) క్రియ, కార్యము, వైద్యః = వైద్యము, ఇతి = అని, ప్రసిద్ధిమ్ = ప్రసిద్ధిని, సమగాత్ = పొందెను.

**తా :** కృతయుగమున ప్రాణులు రోగబాధితులగుటను చూచి, ఆ అత్రిమహర్షి తపస్సు చేసి, సూర్యునినుండి ఉపవేదమైన ఆయుర్వేదమును పొంది, తాను వైద్యరాజుగను వాని కృతి వైద్యముగను ప్రసిద్ధిని పొందెను.

**శ్లో॥ యో మన్దబోధాయ మనుప్రణీతాం - జ్ఞాత్వా స్మృతిం వేదమతాం నిగూఢామ్ ।**
**చక్రే పరామ్ స్పష్టతరాం సుధర్మాం - త్రయీరితార్థానుసృతాం దయాలుః ॥26**

**ప్ర :** యః = ఎవడు, వేదమతామ్ = వేదసమ్మతమైన, నిగూఢామ్ = దురవగాహ్యమైన, స్మృతిమ్ = స్మృతిని, మనుప్రణీతామ్ = మనువుచే వ్రాయబడిన దానినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, మన్దబోధాయ = మందమతి గలవానికొరకు, సుధర్మామ్ = మంచి ధర్మములు గలదానిని, త్రయీ = వేదముచే, ఈరిత+అర్థ+అనుసృతామ్ = చెప్పబడిన అర్థమును అనుసరించిన దానిని, దయాలుః = దయగలవాడై, పరామ్ = లోకాతీతమైనదానిని, స్పష్టతరాం చక్రే = సులభముగ స్పష్టముగ బోధపడునట్లు చేసెను.

**తా :** ఆ అత్రి మహర్షి మనువు రచించిన స్మృతి వేదసమ్మతమై, వేదార్థమును ప్రతిపాదించుచు, ధర్మమును బోధించునదై, మందమతులకు బోధపడకుండనున్నదని గ్రహించి, దయతో దానిని స్పష్టమగునట్లు వ్యాఖ్యానించెను.

**శ్లో॥ స్వయం నిరీహోఽపి ముదోపయేమే**
**విధీరితో బ్రహ్మవిదాం వరీయాన్ ।**
**బుధోఽనసూయాం సుధియం సుశీలం**
**సులక్షణాం భ్రాతృమతీం సురూపామ్ ॥ 27**

**ప్ర :** బుధః = పండితుడు, బ్రహ్మవిదామ్ = బ్రహ్మవేత్తలలో, వరీయాన్ = శ్రేష్ఠుడు, స్వయమ్ =

తనకు తాను, నిరీహః అపి = కోరికలేని వాడైనను, విధి+ఈరితః = బ్రహ్మచే ప్రేరణపొంది, సుధియమ్ = బుద్ధిమంతురాలు, సుశీలామ్ = మంచి నడవడి కలిగినది, సులక్షణామ్ = శుభమైన సాముద్రిక లక్షణములు గలది, సురూపామ్ = సౌందర్యవతి, భ్రాతృమతీమ్ = సోదరులు కలదియైన, అనసూయామ్ = అనసూయను, ముదా = సంతోషముతో, ఉపయేమే = వివాహము చేసికొనెను.

**తా :** ఆ అత్రిమహర్షి పండితుడు, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు, తనకై యే కోరికయు లేనివాడు. అట్టివాడు బ్రహ్మచే ప్రేరణ పొంది అనసూయను వివాహము చేసికొనినాడు. ఆమె అతనికి తగినదే. బుద్ధిమంతురాలు, సత్ప్రవర్తనగలది, అందమైనది, శుభమైన సాముద్రిక లక్షణములు గలది. సోదరులు గలది. అందుచేత ఆమె నా బ్రహ్మర్షి సంతోషముతో పెండ్లియాడెను.

**శ్లో॥ శ్రీకర్దమాఖ్యేన మహర్షిణేదం**
**సాధ్వ్యాం స్వపత్న్యాం ఖలు దేవహూత్యామ్ ।**
**ఉత్పాదితం తత్తపసోఽతిధన్యం**
**కన్యాస్వరూపేణ మహాఫలం సత్ ॥ 28**

**ప్ర :** శ్రీకర్దమాఖ్యేన = శ్రీకర్దముడను పేరుగల, మహర్షిణా = మహర్షిచే, సాధ్వ్యామ్ = పతివ్రతయైన, స్వపత్న్యామ్ = తన భార్యయైన, దేవహూత్యామ్ = దేవహూతియందు, కన్యాస్వరూపేణ = కన్యరూపమున, ఉత్పాదితమ్ = ప్రసవించబడిన, తత్ = వానియొక్క, తపసః = తపస్సునకు, అతిధన్యమ్ = అతిధన్యమైన, సత్ = ఉత్తమమైన, మహాఫలమ్ = మహిమాన్వితఫలము, ఇదం ఖలు = ఇదియే.

**తా :** శ్రీ కర్దమ మహర్షి పతివ్రతయైన తన భార్య దేవహూతియందు అతిధన్యమైన, ఉత్తమమైన వాని తపస్సునకు కన్యారూపమైన మహిమాన్విత ఫలము ఇదియే కదా.

**శ్లో॥ యాం వై విధేః సూనురయం మహర్షి-ర్నిష్కల్మషస్వీయతపఃప్రభావాత్ ।**
**అత్రిస్తపోర్ధః ఖలు వేదవేత్తా -సముద్వహే బ్రహ్మపరో మహాత్మా 29**

**ప్ర :** విధేః సూనుః = బ్రహ్మమానసపుత్రుడైన, అయం మహర్షిః అత్రిః = ఈ అత్రి మహర్షి, నిష్కల్మషస్వీయతపఃప్రభావాత్ = తనదైన కల్మషములేని తపఃశక్తివలన, బ్రహ్మపరః మహాత్మా = బ్రహ్మపరుడైన మహాత్ముడు, వేదవేత్తా = వేదవిజ్ఞాని, తపోర్ధః = తపోధనుడు, యాం వై = ఎవరినైతే, సముద్వహే ఖలు = వివాహమాడెను కదా!

**తా :** బ్రహ్మపుత్రుడు, మహర్షి, బ్రహ్మచింతనలో లగ్నమైయుండువాడు, తపోధనుడు, వేదవేత్తయైన మహాత్ముడు అత్రి నిర్మలమైన తన తపశ్శక్తిచే ఆమెను వివాహమాడెను.

**శ్లో॥ పరాఙ్ముఖత్వం న కదాపి యస్యాః**
**స్వప్నేఽపి కశ్చిన్న గతోఽతిథిర్హి ।**

**భూత్వాపి నగ్నాన్నమదాత్సురేభ్య**
**ఆతిథ్యమస్యాః కిము వాచ్యమగ్ర్యమ్ ॥ 30**

ప్ర : యస్యాః = ఎవరికి, స్వప్నే అపి = కలలో నైనను, కదా అపి = ఒకనాడైనను, పరాఙ్ముఖత్వమ్ = పెడమొగము, అనాదరణ, న గతః = పొందలేదు, హి = ఏలన, అతిథిః భూత్వా = అతిథియైన, సురేభ్యః = దేవతలకు, కశ్చిత్ = ఒకానొక, నగ్న+అన్నం అపి = నగ్నముగనే అన్నమును, అదాత్ = ఇచ్చెను. అస్యాః = ఆమెయొక్క, ఆతిథ్యమ్ = ఆతిథ్యము, అగ్ర్యం వాచ్యం కిము = ముందుగా చెప్పదగును కదా?

**తా :** కలలోనైన ఎప్పుడైన ఆమె అతిథుల పట్ల విముఖత్వమును ప్రదర్శింపలేదు : బ్రహ్మవిష్ణుమహేశ్వరులు అతిథులై వచ్చి కోరగా ఆమె నగ్నముగనే వారికి అన్నమిడెను కదా, ఆమె ఆతిథ్యము ప్రథమపూజ్యము కాదా?

**శ్లో॥ దేవీభిరుత్కర్షభిర్యాతిసాధ్వ్యా**
**యస్యాః సురేన్ద్రా విధివిష్ణుశర్వాః ।**
**వ్రతస్య భఙ్గాయ సమీరితాస్తే**
**పుత్రీకృతా ధర్మబలాద్యయాఽమీ ॥ 31**

ప్ర : యస్యాః అతిసాధ్వ్యాః = యే సాధ్వియొక్క, వ్రతస్య భంగాయ= వ్రతమును భంగ పరచుటకై, విధివిష్ణుశర్వాః = బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, సురేన్ద్రాః = దేవతలు, ఉత్కర్షభిః దేవీభిః = గర్వితులైన దేవేరులచేత, సమీరితాః = ప్రోత్సహించబడినవారైరో, తే = వారు, అమీ ధర్మబలాత్ = అదే పాతివ్రత్యధర్మబలమువలన, పుత్రీకృతాః = బాలురుగా చేయబడిరి.

**తా :** ఆ అనసూయా సాధ్వి పాతివ్రత్యమును భంగపరచుటకు త్రిమూర్తులు, వారి భార్యలు గర్వాతిశయమున ప్రోత్సహించగా, వచ్చి ఆమెను వివస్త్రగా తమకు ఆహారము నివ్వవలెనని కోరగా, వారిని పసిబిడ్డలుగా తన పాతివ్రత్యధర్మబలమువలన మార్చి, వారి కోరిక తీర్చినది. *

**శ్లో॥ పతివ్రతాధర్మపరా వయం స్మ – ఏవం సగర్వాః సురవర్యనార్యః ।**
**సావిత్ర్యుమామాః స్వసమీపమాప్తా – యయా స్వదీప్త్యా కలుషీకృతాః ॥32**

ప్ర : వయమ్ = మేము, పతివ్రతాధర్మపరాః స్మ = పతివ్రతాధర్మపరాయణలము అయి యున్నాము, ఏవమ్ = అని ఇట్లు, సగర్వాః = గర్వితులైన, సురవర్యనార్యః = దేవతలలో శ్రేష్ఠులైన త్రిమూర్తుల దేవేరులు, సావిత్రీ+ఉమా– మాః = బ్రహ్మదేవునిభార్య సావిత్రి, మహేశ్వరునిభార్య ఉమాదేవి, విష్ణువుభార్య లక్ష్మీదేవీ, స్వ = తనయొక్క, సమీపమ్ = సాన్నిధ్యమును, ఆప్తాః = పొందినవారు కాగా, యయా = యే అనసూయచేత, స్వదీప్త్యా = తన కాంతిచే, కలుషీకృతాః = కలుషితులుగా చేయబడినారో,

**తా :** మేము సాటిలేని పతివ్రతలమని గర్వితులైన త్రిమూర్తుల భార్యలు సావిత్రి, పార్వతి, లక్ష్మి అనువారు తమ భర్తల కొరకై అనసూయను జేరి వారిని తమ కిమ్మనగా ఊయెలలోని ముగ్గురు శిశువులను చూపి, మీ మీ భర్తలను గుర్తించి కొనిపొండు, అనినదట. అంతట వారు తమ పాతివ్రత్యముపై ఆనబెట్టినను తమ భర్తలు స్వస్వరూపమును పొందకుండుటతో, అనసూయాసాధ్వినే వారు గర్వము వీడి ఆశ్రయించి తిరిగి తమ భర్తలను పొందిరని కథ. కాగా త్రిమూర్తుల దేవేరుల అహంకారములు మలినములైనవని భావము.

**శ్లో॥ పతివ్రతాయాః ఖలు విప్రపత్న్యాః - శాపేన నష్టం బహుకాలమర్కమ్ ।**
**దేవేడితాయాః ఖలు జీవగుప్త్యై - సముద్గతిం ప్రాపయదేవ భూయః ॥33**

**ప్ర :** పతివ్రతాయాః విప్రపత్న్యాః = పతివ్రతయైన బ్రాహ్మణుడు కౌశికుని భార్యయైన సుమతియొక్క, శాపేన ఖలు = శాపముచేత కదా, బహుకాలమ్ = చాలకాలము, నష్టం అర్కమ్ = ఉదయించని సూర్యుని, దేవ+ఈడితాయాః = దేవతలచేత ప్రార్థింపబడినదానివలన, జీవగుప్త్యై = ప్రాణుల రక్షణకొరకై, భూయః = మరల, సముద్గతిమ్ = ఉదయమును, ప్రాపయత్ ఏవ ఖలు = పొందింపబడెను కదా.

**తా :** పతివ్రతయగు కౌశిక బ్రాహ్మణుని భార్య సుమతి శాపమువలన సూర్యోదయము నిల్చిపోగా, దేవతలామెకు వరమిచ్చి, ఆమె భర్తను రక్షించి, ప్రాణికోటిని రక్షించుమని ప్రార్థించగా, ఆ సుమతి మరల సూర్యుడుదయించునట్లు అనుగ్రహించినది కదా.

**శ్లో॥ మాణ్డవ్యశాపేన మృతం రుజార్తం**
**యా కౌశికం తత్సహధర్మిణీడ్యా ।**
**పశ్యత్సు దేవేష్వఖిలేషు భూయో**
**ద్విజం సజీవం వ్యకృణోత్సుసత్త్వా ॥ 34**

**ప్ర :** రుజార్తమ్ = వ్యాధిగ్రస్తుడైన వానిని, మాండవ్యశాపేన = మాండవ్యుని శాపముచే, మృతమ్ = మరణించిన వాడైన, కౌశికమ్ = కౌశికుని, తత్ సహధర్మచారిణీ = వాని భార్య, ఈడ్యా = స్తుతిచే, అఖిలేషు దేవేషు పశ్యత్సు = దేవతలందఱు చూచుచుండగా, భూయః = మరల, యా సుసత్త్వా = యే శక్తివంతురాలు, ద్విజమ్ = బ్రాహ్మణుని, సజీవమ్ = ప్రాణముగలవానిగా, వ్యకృణోత్ = చేసెనో.

**తా :** పతివ్రతయైన సుమతి తన భర్తను వ్యాధిపీడితుని కాలు తగిలి, కొరతవేయబడియున్న మాండవ్యమహర్షి బాధకోర్చలేక శపించగా విగతజీవుడైన ఆ బ్రాహ్మణుని, తన ధర్మబలముచేత సకలదేవతలు చూచుచుండగా, వారి స్తోత్రములకు శాంతించి మరల తన భర్తను సజీవుని చేసికొనినది.

**శ్లో॥ యదీహితాలోచనహృష్టచిత్తాః - కాజేశ్వరాస్తే తనయా భవన్తు ।**
**సాధ్వీతి చాశీర్భిరనుత్తమాభి-రిన్ద్రాదయో యాం యుయుజుస్సురాగ్ర్యాః ॥35**

ప్ర : ఇంద్రాదయః సురాగ్ర్యాః = ఇంద్రుడు మొదలగు ప్రముఖ దేవతలు, యత్+ఈహిత+ఆలోచన హృష్టచిత్తాః = దేనిని కోరినారో దానినే చూచుటవలన సంతోషించిన మనస్సులు గలవారై, సాధ్వి = ఓ సాధ్వీ!, క+అజ+ఈశ్వరాః = విష్ణువు, బ్రహ్మ, ఈశ్వరుడు, తే = నీకు, తనయాః భవన్తు = కుమారులగుదురు గాక!, ఇతి చ = అనియును, అనుత్తమాభిః = సర్వోత్తమములైన, ఆశీర్భిః = ఆశీస్సులతో, యామ్ = యే అనసూయను, యుయుజుః = కూడ జేసిరో.

**తా :** ఇంద్రాది ముఖ్య దేవతలు కోరినట్లే త్రిమూర్తులు అనసూయాదేవిచే శిశువులుగా చేయబడుటను చూచి ఆనందించి, ఆమెను త్రిమూర్తులకు తల్లి యగునట్లు దీవించిరి.

**శ్లో॥ జాతాలం మృదులా యదర్థమచలా లీలావిలోలోఽచలో**
**భీత్యాస్యా అనిలోఽనలోఽపి విమలోఽర్కశ్చాభవచ్ఛీతలః ।**
**కాలః కలయితుం స్వకాలమబలం లోకం న చాలం బలం**
**కః సాధ్వ్యా అమలం విశాలమచలం జ్ఞాతుం ప్రభుర్మఙ్గలమ్ ॥ 36**

ప్ర : యత్+అర్థమ్ = దేనికై, ఏ కారణముగా, అస్యాః భీత్యా = ఆమె భయముచేత, అనిలః = వాయువు, అనలః అపి = అగ్నియున్ను, లీలావిలోలః అచలః = లీలగా కదలుచు, నిశ్చలురుగాను, అర్కః = సూర్యుడు, శీతలః చ = చల్లని వాడుగను, అభవత్ = ఆయెనో, అచలా = భూమి, అలం మృదులా = చాల మృదువుగ, జాతా = అయినదో, కాలః = కాలము, స్వకాలం కలయితుమ్ = తన గమనమును గణించుటకు, అబలమ్ = దుర్బలమో, లోకమ్ = లోకమును, (కలయితుం) న చ అలం బలమ్ = బలము చాలనిదైనది, సాధ్వ్యాః = ఆ పతివ్రతయొక్క, అమలమ్ = నిర్మలము, అచలమ్ = స్థిరము, విశాలమ్ = విస్తారము, మంగలమ్ = శుభమును, జ్ఞాతుమ్ = తెలియుటకు, కః ప్రభుః = ఎవడు సమర్థుడు?

**తా :** యే సాధ్వి శక్తి పుడమి కాఠిన్యమును మాన్పినదో, వాయువును అగ్నిని కదలుటకై భయపడునట్లు చేసినదో, సూర్యుని చల్లబరచినదో, కాలమే తన ధర్మమును విడచి లోకమును ప్రవర్తింపజేయక నిల్చినదో, అట్టి సాధ్వి శక్తిని తెలిసికొనుటకు సమర్థుడెవడు?

**శ్లో॥ యత్సౌన్దర్యం చన్ద్రతుల్యం మతం చే-దధ్వానన్తం సన్తతం భాసమానమ్ ।**
**యత్పుత్రోఽపీన్దుస్తు వృద్ధిక్షయార్తః - సౌన్దర్యాఢ్యోఽపి త్రియామాప్రదీపః ॥37**

ప్ర : యత్ = ఎందువలన, సౌన్దర్యమ్ = అందము, అధ్వానన్తమ్ = సంధ్యాసమయము తరువాత, సన్తతం భాసమానమ్ = ఎప్పుడును వెలుగుచుండు, చన్ద్రతుల్యమ్ = చంద్రునితో సమానమైనదిగా, మతం చేత్ = భావించబడునదైనచో, సౌన్దర్య+ఆఢ్యః అపి = అందముచేత సుసంపన్నుడైన

వాడైనను, త్రియామాప్రదీపః = రాత్రిని దీప్తము చేయువాడైన, యత్ = యే, ఇన్దుః = చంద్రుడు, వృద్ధిక్షయార్తః తు పుత్రః = వృద్ధితోను, క్షీణతతోను బాధింపబడువాడైన, బాలుడే.

**తా :** చంద్రుడు సంధ్యాసమయము తరువాత రాత్రివేళలోనే ఎల్లప్పుడు ప్రకాశించువాడు. అట్టి చంద్రుడే సౌన్దర్యమునకు సంకేతముగా, పోలికగా చెప్పబడుచున్నాడు. కన్నబిడ్డనైనను ఆ చంద్రునితో పోల్చునప్పుడు, ఆతడెంత సుందరబాలుడైనను, వృద్ధిక్షయములచేత బాధింపబడువాడు అను భావము సిద్ధమే కదా!

**శ్లో॥దయాక్షమాశాన్తిముఖైర్గుణైర్యో - యుక్తోఽపి విష్ణుర్భగవాన్పరేశః ।**
**యయాఽనుజత్వం ఖలు పుత్రతాం చ - సంప్రాపితోఽతః కిము వాచ్యమన్యత్ ॥ 38**

**ప్ర :** దయా = దయ, క్షమా = ఓర్పు, శాన్తి = శాంతి, ముఖైః = మొదలగు, గుణైః = గుణములతో, యుక్తః అపి = కూడియున్నవాడయ్యును, యః భగవాన్ విష్ణుః పరేశః = భగవానుడు, పరమాత్ముడు అయిన యే విష్ణువు, యయా = యే పతివ్రతచేత, అనుజత్వమ్ = సోదరభావమును, పుత్రతాం చ = పుత్రభావమును కూడ, సంప్రాపితః = పొందింపబడినాడో, అతః = అందువలన, అన్యత్ = మరియొక మాట, కిము వాచ్యమ్ = చెప్పదగినదేమి?

**తా :** విష్ణుదేవుడు భగవానుడు, పరమాత్మ, దయగలవాడు, సహనశీలి, శాంతుడు ఇత్యాది గుణవంతుడు. అట్టివాడే సాధ్వి అనసూయకు కపిలుని రూపమున తమ్ముడై, శ్రీదత్తాత్రేయుని రూపమున పుత్రుడై అవతరించినాడనగా, ఇంక వేరుగా చెప్పవలసినదేమున్నది?

**శ్లో॥ తేజస్వితార్కస్య చ వర్ణ్యతే చేత్ - సా కౌశికస్త్రీరితశాపకాలే ।**
**యాతా కుతోఽస్తోదయసంయుతస్య - తేజస్వితాస్యా అనిశం తతోఽర్చ్యా ॥39**

**ప్ర :** అర్కస్య = సూర్యునియొక్క, తేజస్వితా = తేజోఽధిక్యము, చ = కూడ, వర్ణ్యతే చేత్ = వర్ణించినట్లయిన, సా = ఆ తేజస్సు, కౌశిక స్త్రీ+ఈరిత శాపకాలే = కౌశికునిభార్య సుమతిచే పలుకబడిన శాపమువేళ, అస్త+ఉదయ సంయుతస్య = అస్తమయము ఉదయము అనువానితో కూడిన సూర్యునియొక్క ఆ తేజస్విత, కుతః యాతా = ఎందు బోయినది? తతః = ఆ కారణమున, అస్యాః = ఆ సుమతియొక్క, తేజస్వితా = తేజస్సు, అనిశమ్ = ఎల్లవేళల, అర్చ్యా = పూజింపదగినది.

**తా :** సూర్యుడెంత తేజోవంతుడైనను వానికి ఉదయాస్తమయములు ఉన్నవి. కాగా, సుమతీ సాధ్వి శపించగా, ఆ ఉదయము కూడ లేకపోయినది. కనుక పోల్చి చూడగా, సాధ్వీశక్తియొక్క తేజస్విత కాలాతీతమై పూజ్యమై నిలచునది, సూర్యతేజస్విత కాదని గ్రాహ్యము.

**శ్లో॥మన్యే ధన్యేయం న యోషా విశేషా - మూర్తా జాతా కేవలా చిత్కలాఽత్ర ।**
**సౌన్దర్యాద్యం సద్గుణాశ్చాన్యథా తు - ప్రాణ్యప్రాప్తాః సర్వతోఽస్యాః కుతోఽమీ ॥40**

**ప్ర :** అత్ర = ఈ సందర్భమున, ఇయం ధన్యా = ఈ ధన్యురాలు, న కేవలా యోషా = కేవలమైన

స్త్రీ కాదని, విశేషా మూర్తా జాతా చిత్కలా = విశేషముగ మూర్తిమంతమైన చిత్కళ యని, మన్యే = తలంతును; సౌన్దర్య+ఆద్యమ్ = అందమునకు మూలమైనది, సద్గుణాః చ = సద్గుణములే, అన్యథా తు = వేరొక విధముగా నైనచో, సర్వతః = అన్ని విధముల, ప్రాణి+అప్రాప్తాః = ప్రాణులకు లభించనివి, అస్యాః = ఆమెకు, అమీ కుతః = ఇవి ఎక్కడివి?

**తా :** ఈ సందర్భమున తోచినది : ఈ ధన్యురాలు సాధ్వి అనసూయ ఒక సాధారణ స్త్రీ కాదు, స్త్రీ రూపమున అవతరించిన చిత్కళా విశేషమే. సౌందర్యము సద్గుణములవలన కలుగునది, కాదన్నచో ప్రాణులన్నియు సుందరములే యనుట ప్రాకృతికము. ఈమెకు మాత్రము సగుణ రూఢమైన సౌందర్యమనవలె.

**శ్లో॥ స్వభక్తివృద్ధ్యా అగుణోఽపి విష్ణుః - సమీహితం వై సగుణం పురస్తాత్ ।**
**స్వాత్మానమేతామజడం స్వయోని-మకల్పయన్మామివ పూర్వమాత్మా ॥ 41**

**ప్ర :** విష్ణుః = విష్ణువు, అగుణః అపి = గుణములు లేనివాడే యైనను, స్వభక్తివృద్ధ్యా = తన భక్తి ఆధిక్యముచేత, పురస్తాత్ = తన ఎదుట, సగుణం వై = గుణముతో కూడియే, సమీహితమ్ = కోరబడినది; పూర్వమ్ = పూర్వము, మొదట, ఆత్మా = ఆత్మ, మాం ఇవ = మాయను వలె, ఏతామ్ = ఈమెను, అజడమ్ = చైతన్యము గలదానిగా, స్వాత్మానమ్ = తన ఆత్మను, స్వయోనిమ్ = తనకు తల్లిగా, అకల్పయత్ = యేర్పరచెను.

**తా :** విష్ణువు గుణవికారము లేనివాడు. ఐనను తన భక్తిచేత ఆ సాధ్వి వానిని సగుణమూర్తిగా తన ముంగిట నిలువ జేసెను. మొదట మాయను చైతన్యవంతురాలిగా తనను తానే తన తల్లిగా యేర్పరచెను.

**శ్లో॥ స్వరూపసామ్రాజ్యవిధాతురత్రే-రేషానసూయా మహిషీ సుపూజ్యా ।**
**యథార్థతో వర్ణయితుం న కోఽపి - సమర్థ ఏతామతులాం త్రిలోక్యామ్ ॥42**

**ప్ర :** స్వరూపసామ్రాజ్యవిధాతుః అత్రేః = తన ఆత్మవిద్యాసామ్రాజ్యమునకు కర్తయైన అత్రికి, ఏషా అనసూయా = ఈ అనసూయ, సుపూజ్యా మహిషీ = పూజ్యురాలైన పట్టపురాణి; త్రిలోక్యామ్ అతులామ్ = మూడు లోకములలో సరితూగువారులేని, ఏతామ్ = ఈమెను, యథార్థతః = సమగ్రముగ, వర్ణయితుమ్ = వర్ణించుటకు, కః అపి = ఎవడైనను, న సమర్థః = సమర్థుడు కాడు.

**తా :** అత్రి ఆత్మవిద్యాసామ్రాట్టు. అనసూయ వానికి పట్టమహిషి, అందువలన మాత్రమే కాక తాను స్వయముగ పూజ్యురాలు. ఆమెను యథార్థముగ వర్ణించి చెప్పగల సమర్థు లెవరును లేరు : ఆమె ముల్లోకములలో సాటిలేని సాధ్వి.

**శ్లో॥ బ్రహ్మేజేశానాం యా జాతా మాతా మహాభాగా ।**
**మన్యే మాన్యేయం సా ప్రత్యక్షా చిత్కలా సాజ్ఞా ॥ 43**

**ప్ర :** బ్రహ్మ+అజ+ఈశానామ్ = బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు, యా = ఎవరు, మహాభాగా = మహా భాగ్యవతి, మాతా జాతా = తల్లియైనదో, సా = ఆమె, సాజ్ఞా = శరీరమును ధరించిన, ప్రత్యక్షా = కన్నుల ముందున్న, చిత్కలా మాన్యా ఇయమ్ = చిత్కలగా గౌరవింపదగినదే ఈమె యని, మన్యే = తలంతును.

**తా :** మాతా అనసూయ మహాభాగ్యవతి కావుననే ఆమెకు బ్రహ్మ విష్ణుమహేశ్వరులు బిడ్డలైనారు. ఆమె దేహధారణచేసి సాక్షాత్కరించిన చిత్కళయే అనుటకు ఇది కారణము.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ద్వితీయాష్టకే చతుర్థోఽధ్యాయః ।

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## ద్వితీయాష్టకము - పంచమాధ్యాయము

**శ్లో॥ తావాలోక్యాదిశన్నమ్రౌ ద్వితీయం పుత్త్రమన్వితమ్ ।**
**ద్వితీయయా మౌనిపుత్ర్యా వినీతమనసూయయా ॥ 1**

**ప్రతిపదార్థం :** మౌనిపుత్ర్యా ద్వితీయయా = మునికి రెండవ కుమార్తెయైన, అనసూయయా= అనసూయతో, వినీతమ్ = నమ్రతగల, పుత్త్రమన్వితమ్ = పుత్రునితో గూడిన, ద్వితీయమ్ = భార్యనున్ను, తౌ నమ్రౌ = వినయముగలవారగు వారిని, ఆలోక్య = చూచి, ఆదిశత్ = ఆదేశించెను.

**తాత్పర్యం :** కుమారునితో కూడియున్న భార్యయగు అనసూయను చూచి, వారిద్దరినుద్దేశించి ఆ మహర్షి అత్రి యిట్లనెను : *

**శ్లో॥ కులాద్రిమృక్షం బ్రహ్మజ్ఞవరీయాంశ్చ విధీరితః ।**
**పత్నీయుతోఽత్రిః పుత్త్రార్థం త్రయీశోపాస్తయే యయౌ ॥ 2**

**ప్ర :** విధి+ఈరితః = బ్రహ్మప్రేరణపొందినవాడై, అత్రిః = అత్రి, పుత్త్రార్థమ్ = పుత్త్రుని కొరకై, త్రయీ ఈశ+ఉపాస్తయే = ముగ్గురు ప్రభువులను (త్రిమూర్తులను) ఉపాసించుటకై, పత్నీయుతః = భార్యతోగూడినవాడై, కుల+అద్రిమ్ = కులపర్వతమైన, ఋక్షమ్ = ఋక్షపర్వతమును, బ్రహ్మజ్ఞవరీయాన్ చ = బ్రహ్మజ్ఞులతో విశిష్టమైన దానిని, యయౌ = చేరబోయెను.

**తా :** అత్రిమహర్షి పుత్త్రకామనతో బ్రహ్మసూచనమేరకు త్రిమూర్తులను గూర్చి తపస్సు చేయుటకై భార్యతో గూడ బ్రహ్మజ్ఞులకు నెలవైన ఋక్షము అనబడు కులపర్వతమునకు బోయెను.

**శ్లో॥ నిర్వైరే శాన్తబాధేఽద్రౌ సర్వకాలసుఖావహే ।**
**నానాసత్ఫలపుష్పాద్రౌ స్వమృతే స తపోఽతపత్ ॥ 3**

**ప్ర :** నిర్వైరే = శత్రుబాధలేనిది, శాన్తబాధే = కార్చిచ్చువంటి బాధలు లేనిది, నానా సత్ఫలపుష్ప+అద్రౌ = వివిధములైన పండ్లు పూలు కలిగిన కొండయైన, స్వమృతే = స్వాదుజలములు కలిగిన,

సర్వకాలసుఖావహే = అన్ని ఋతువులలో సుఖమిచ్చు, అద్రౌ = ఆ ఋక్షపర్వతముపై, సః = ఆ మహర్షి, తపః అతపత్ = తపస్సు చేసెను.

**తా :** ఆ ఋక్షపర్వతముపై అత్రి మహర్షి తపస్సు చేసెను. ఆ ప్రదేశము జంతువుల బాధగాని, కార్చిచ్చు బాధగానిలేక స్వాదుజలములతో వివిధఫలపుష్పములతో అన్ని ఋతువులలోను సుఖముగ నుండునది కావున తాపసులకు అనుకూలమైనది. *

**శ్లో॥ తార్క్ష్యాసనస్థోఽబ్దశతం సంయతాత్మాఽనిలాశనః ।**
**నిర్ద్వన్ద్వః సుతరాం దధ్యావేకం తాదృక్ప్రజాప్తయే ॥ 4**

**ప్ర :** తార్క్ష్యాసనస్థః = ఒంటికాలిపై నిల్చి గరుడాసనములో నుండి, అనిల+ఆశనః = గాలిని మాత్రమే ఆహారముగ చేసికొన్నవాడై, సంయతాత్మా = ఆత్మను నిగ్రహించి, నిర్ద్వన్ద్వః = ఏకాగ్రచిత్తుడై, సుతరామ్ = సర్వధా, ఏకమ్ = విష్ణువును, తాదృక్ = ఆ విష్ణువును పోలిన, ప్రజా+ఆప్తయే = కుమారుని పొందుటకై, అబ్దశతమ్ = నూరు సంవత్సరములు, దధ్యౌ = ధ్యానించెను.

**తా :** ఆ మహర్షి అత్రి గరుడాసనమున ఒంటికాలిపై నిలిచి, గాలిని ఆహారముగ తీసికొనుచు, ఇంద్రియనిగ్రహముతో, ఏకాగ్రతలో, సర్వధా విష్ణువును ధ్యానించెను. ఆ తపఃఫలముగా పొందగోరినది ఆ విష్ణుడే తనకు కుమారుడు కావలెనని.

**శ్లో॥ ప్రాణాయామైధః సమిద్ధతపోఽగ్న్యుత్తాపితాఖిలమ్ ।**
**ప్రాపురత్రిం కవిష్ణ్వీశాః స్వస్వచిహ్నాన్వితాః శివాః ॥ 5**

**ప్ర :**ప్రాణాయామ+ఏధః = ప్రాణాయామమే కట్టెలుగా, సమిద్ధ = ప్రజ్వలింపబడిన, తపః అగ్ని = తపస్సు అను అగ్నియందు, ఉత్తాపిత+అఖిలమ్ = సమర్పింపబడిన సర్వస్వముగల, అత్రిమ్ = అత్రిని, శివాః = శుభంకరములైన, స్వస్వచిహ్నాన్వితాః = తమ తమ చిహ్నములతో కూడిన వారైన, క = బ్రహ్మ, విష్ణు = విష్ణువు, ఈశాః = ఈశ్వరుడు, ప్రాపుః = సమీపించిరి.

**తా :** ప్రాణాయామమునే సమిధలుగా తపస్సు అను అగ్నిలో వ్రేల్చి, తనదైన సమస్తమును అందు సమర్పించిన అత్రిమహర్షిని బ్రహ్మవిష్ణుమహేశ్వరులు తమ తమ శుభచిహ్నములను (బ్రహ్మ వేదమును, విష్ణువు శ్రీవత్సమును, శంఖచక్రములాదిగాగలవానిని, మహేశ్వరుడు త్రిశూలము, డమరు మొదలగువానిని) ధరించి సాక్షాత్కరించిరి.

**శ్లో॥ తత్ప్రభావహృతధ్యానః స బహిర్గతదృక్ శనైః ।**
**హంసతార్క్ష్యవృషస్థాంస్తాన్దృష్ట్వా ప్రీతో స్తువన్నతః ॥ 6**

**ప్ర :** తత్ = వారి సాక్షాత్కారపు, ప్రభావహృత = ప్రభావముచేత సడలింపబడిన, ధ్యానః = ధ్యానము గలవాడైన, సః = ఆ అత్రి, బహిః+గతదృక్ = వెలుపలి దృష్టిగలవాడై, శనైః =

మెల్లగా, హంసతార్క్ష్యవృషస్థాన్ = హంసపై, గరుడునిపై, నందిపై నున్న, తాన్ = వారిని, దృష్ట్వా = చూచి, ప్రీతః = ఆనందించినవాడై, నతః = వంగి నమస్కరించి, స్తువత్ = స్తోత్రము చేసెను.

**తా :** త్రిమూర్తుల సాక్షాత్కారమువలన బాహ్యదృష్టిగలవాడై అత్రిమహర్షి హంసవాహనముపైనున్న బ్రహ్మను, గరుడునిపైగల విష్ణువును, నందిపై ఈశ్వరుని చూచి సంతోషించి, వంగి నమస్కరించి ఇట్లు స్తోత్రము చేసెను.

**శ్లో॥ అవ్యక్తమచిన్త్యం త్వాం నౌమ్యవికార్యమ్ ।**
**అగ్రాహ్యమతర్క్యం నిత్యం విభుమేకమ్ ॥ 7**

**శ్లో॥ దేవం వరధీరం త్వానన్యమపారమ్ ।**
**సర్గాబ్ధిసుతీరం ధీలభ్యమదూరమ్ ॥ 8**

**శ్లో॥ శ్రీవిష్ణుమనాదిం త్రీశం జగదాదిమ్ ।**
**విశ్వభ్రమసన్ధిం నష్టాప్తజనాధిమ్ ॥ 9**

**శ్లో॥ కూటస్థనిజైకాంశోద్భావితవిశ్వమ్ ।**
**కర్షన్తమనేకాం మాయామహివిశ్వమ్ ॥ 10**

**శ్లో॥ సర్వజ్ఞమనన్తం వ్యస్తం చ సమస్తమ్ ।**
**సర్వం గుణవన్తం సత్యం భగవన్తమ్ ॥ 11**

**ప్ర :** అవ్యక్తమ్ = ఇంద్రియములకు గోచరముగాని వానిని, అచిన్త్యమ్ = ఊహకు అందని వానిని, అవికార్యమ్ = వికారములు లేని వానిని, అగ్రాహ్యమ్ = గ్రహింపరానివానిని, అతర్క్యమ్ = తర్కప్రమాణములకు అందనివానిని, నిత్యమ్ = శాశ్వతుని, ఏకమ్ = సాటిలేని వానిని, విభుమ్ = సర్వవ్యాపకుని, దేవమ్ = ప్రకాశమానుని, వరధీరమ్ = శ్రేష్ఠమైన బుద్ధిప్రేరకుని (ధీ+ఈరం), అనన్యమ్ = మరివేరుకాని వానిని, అపారమ్ = దరి కనరాని వానిని, సర్గాబ్ధి = సృష్టి, సంసారము అనబడు సముద్రమునకు, సుతీరమ్ = ఒడ్డున గలవానిని, ధీలభ్యమ్ = వివేకముచేత పొందదగిన వానిని, అదూరమ్ = దూరముకాని వానిని, శ్రీవిష్ణుమ్ = శ్రీ విష్ణువును, అనాదిమ్ = మొదలు లేని వానిని, త్రీశమ్ = ముల్లోకములకు (ముమ్మూర్తులకు) ప్రభువైన వానిని, జగదాదిమ్ = జగత్తునకు కారణమైన వానిని, విశ్వభ్రమసంధిమ్ = విశ్వము భ్రమించుటకు నెలవైన వానిని, నష్ట+ఆప్తజన+ఆధిమ్ = స్వభక్తుల బాధలను నివారించు వానిని, కూటస్థ నిజ+ఏకాంశ = కూటస్థునియొక్క ఒక్క అంశతో, ఉద్భావిత = సృజింపబడిన, విశ్వమ్ = జగత్తుగల వానిని, అనేకాం మాయామహివిశ్వమ్ = బహుళమైన మాయామహితవిశ్వమును, కర్షన్తమ్ = శాసించుచున్న వానిని, సర్వజ్ఞమ్ = సర్వజ్ఞుని, అనన్తమ్ = అంతము లేనివానిని, వ్యస్తమ్ = ప్రత్యగ్రూపుని, సమస్తమ్ = విరాడ్రూపుని, చ = మరియు, సర్వమ్ = అంతయు తానైన వానిని, గుణవన్తమ్ = సగుణమూర్తిని, సత్యమ్ = సత్యస్వరూపుని, భగవన్తమ్ = భగము అనబడు షడ్గుణములు గలవానిని, త్వామ్ = నిన్ను, నౌమి = నమస్కరింతును.

**తా :** దేహరహితుడైనందున యే వికారములు లేనివాడును, ఇంద్రియమనస్సులకు గ్రహింపరానివాడును, తర్కమునకు లోబడనివాడును, బుద్ధిని ప్రేరేపించు వాడును, తాను తానేయైనవాడును, సృష్టికావలనుండువాడును, బుద్ధిగమ్యుడు కావున దూరములేక చేరువైనవాడును, ముల్లోకములకు ప్రభువైన జగత్కారణుడై అనంతుడై, విశ్వమును తనలో నిమిడించిన వాడును, కూటస్థుడై తన ఏకాంశతో జగన్నిర్మాణమును చేసినవాడును, స్వజనబాధానివారకుడును, మాయావిశిష్టమైన విశ్వమంతయు వ్యాపించినవాడును, శాసించువాడును, సర్వజ్ఞుడును, ప్రత్యగ్రూపుని, విరాడ్రూపుని, సగుణమూర్తిని, సత్యరూపుని, షడ్గుణవిరాజితుని, మూర్తిత్రయమున విష్ణుడనబడు వానిని నిన్ను నమస్కరించుచున్నాను.

**శ్లో॥ సంస్తే గుణభేదాత్కాద్యాత్మవిభేదాః ।**
**సృష్ట్యాదినిదానస్త్వం చానభిమానః ॥ 12**

**ప్ర :** (హే) సన్ = ఓ విష్ణు!, తే = నీయొక్క, గుణభేదాత్ = గుణముల భిన్నత్వమువలన, క+ఆది = బ్రహ్మ మొదలగు, ఆత్మవిభేదాః = ఆత్మలోని విశేషభేదరూపములు; త్వమ్ = నీవు, సృష్టి+ఆది నిదానః = సృష్టికి మొదటి కారణమవు, చ = మరియు, అనభిమానః = ప్రత్యేక రాగద్వేషాది వికారము లేనివాడవు.

**తా :** ఓ విష్ణుదేవా! నీవైన సత్త్వరజస్తమోగుణభేదమువలన, వానినుండి యేర్పడిన బ్రహ్మాది సాకారమూర్తులు నీయొక్క రూపాంతరవిశేషములే. నీవు సృష్టికి తొల్లింటి కారణరూపుడవు. నీకు దేనియందును రాగద్వేషములు లేవు.

**శ్లో॥ లీలాతను! సేవాశీలానుయుగం వా ।**
**పాతాపి న లిప్తో జ్ఞాతాస్య న లిప్తః ॥ 13**

**ప్ర :** (హే) లీలాతను! = ఓ లీలావిగ్రహ!, అనుయుగమ్ = ప్రతియుగమునను, సేవాశీలా = నిను సేవించు శీలముగలవాడు, పాతా అపి = లోకమును పొందుచున్న వాడైనను, న లిప్తః = మలినుడు కాడు; జ్ఞాతా = నిన్ను గుర్తెఱిగినవాడు, అస్య = కర్మకు, న లిప్తః = కట్టుబడడు.

**తా :** ఓ లీలావిగ్రహా! ప్రతియుగములోను నిన్ను సేవించువారు లోకమున నిర్మలులై యుందురు. నిన్ను గూర్చిన జ్ఞానము గలవారు కర్మకు బద్ధులు కారు.

**శ్లో॥ వాక్చిత్తపరేకో ధ్యాతోఽత్ర మయైకః ।**
**యూయం త్రయ ఆప్తాః కో వోఽత్ర స ఆప్తః ॥ 14**

**ప్ర :** (హే) వాక్చిత్తపర! = ఓ అవాఙ్మానసగోచర!, ఏకః = కేవలాత్మా!, అత్ర = ఇప్పుడు, మయైకః ధ్యాతః = ఒక్కడుగా నా చేత ధ్యానింపబడిన వాడవై, యూయమ్ = మీరు, త్రయ = ముగ్గురు, ఆప్తాః = వచ్చి చేరినారు, అత్ర = ఈ విషయమున, వః = మీకు ముప్పురకు, ఆప్తః = ఆప్తుడైన, సః = ఆతడు, కః = ఎవ్వడు?

**తా :** ఓ స్వామీ! నీవు వాక్కులకు గాని మనస్సునకు గాని గోచరించు వాడవు కావు, కేవలాత్మవు. నే నీ సందర్భమున నిన్ను ఒక్కనిగనే విష్ణురూపమున ధ్యానించినాను. ఐనను నీ మూడు మూర్తులతో నాకు ప్రత్యక్షమైతివి కదా, మీ ముప్వరకు ప్రీతిపాత్రమై నాకు ఆప్తరూపమైన ఆ రూపము గలవారెవరు?

**శ్లో॥ ఊచుస్తే ఋషే! సత్సఙ్కల్పో న తేఽసత్ ।**
**హృద్యం హి య ఏకో ధ్యాతః స ఇతః కః ॥ 15**

**శ్లో॥ మాదృక్సుతలబ్ధ్యై వృత్తశ్రమసిద్ధ్యై ।**
**దత్తోఽద్య మయాత్మాఽయం తే సకలాత్మా ॥ 16**

**ప్ర :** తే = వారు ముప్వరును, ఊచుః = ఇట్లనిరి; ఋషే = ఓ మహర్షీ!, తే సంకల్పః = నీ సంకల్పము, సత్ = మంచిది, సత్ అనబడు బ్రహ్మసంబంధి, న అసత్ = అసత్ అనబడు లోకసంబంధి కాదు, హి = ఏలయన, హృద్యమ్ = హృదయమునందున్న, య ఏకః = యే ఒక్కడు, ధ్యాతః = ధ్యానింపబడినవాడో, సః = ఆ ఒక్కడు, ఇతః = ఇప్పుడు, కః = ఎవడు?, మాదృక్ = నన్నుబోలిన, సుతలబ్ధ్యై = కుమారుని పొందుటకై, వృత్తశ్రమసిద్ధ్యై = నీ తపస్సు సిద్ధికై, అద్య = నేడు, అయం ఆత్మా = ఈ ఆత్మ, మయా = నీ చేత, సకలాత్మా = సమస్త కళావిలసితమైన ఆత్మగా, తే = నీకు, దత్తః = ఈయబడినది.

**తా :** త్రిమూర్తులు ముప్వరును ఇట్లనిరి : ఓ మహర్షీ! నీవు సంకల్పించినది బ్రహ్మపదార్థము గాని లౌకికవస్తువు కాదు. నీ హృదయమున మా ముప్వరలో యే యొక్కడో ధ్యానింపబడక, నావంటి కుమారుని గోరి తపించితివి. కావున నా ఆత్మాంశయైన ఒక్క మూర్తిని కాక నా సకలకళాత్మకమైన ఆత్మరూపమునే నీకు ప్రసాదించుచున్నాను.

**శ్లో॥ ఏవం దత్వా వరం సద్యో దేవా అన్తర్హితాస్త్రయః ।**
**అథావతరదగ్రేఽత్రేర్దత్తాత్రేయశ్చతుర్భుజః ॥ 17**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగా, వరం దత్వా = వరమిచ్చి, సద్యః = వెంటనే, త్రయః దేవాః = ముగ్గురు దేవతామూర్తులు, అన్తర్హితాః = అదృశ్యులైరి, అథ = అంతట, అత్రేః అగ్రే = అత్రిమహర్షిముంగిట, చతుర్భుజః = నాలుగు భుజములు గలవాడై, దత్తాత్రేయః = దత్తాత్రేయుడు, అవతరత్ = అవతరించెను.

**తా :** ఈ రీతిగా వరమిచ్చి త్రిమూర్తులు అదృశ్యులైరి. అంతట అత్రి మహర్షి ముంగిట నాలుగు భుజములతో దత్తాత్రేయుడవతరించెను.

**శ్లో॥ ఆద్యోఽవతారోఽజస్యాయం విభోర్లీలావిహారిణః ।**
**యద్ధ్యానాత్పాపముక్తః సన్ యాతి శ్రేయ ఇతి శ్రుతమ్ ॥ 18**

ప్ర : లీలా విహారిణః విభోః = లీలావిహారియగు విష్ణువునకు, అజస్య అయం అవతారః = ఈ దత్తాత్రేయుని అవతారము, ఆద్యః = మొదటిది, యత్ = దేనిని, ధ్యానాత్ = ధ్యానించుటవలన, పాపముక్తః సన్ = పాపములేనివాడగుచు, శ్రేయః యాతి = మోక్షము నొందును, ఇతి శ్రుతః = అని చెప్పబడినది.

తా : లీలావిహారియైన విష్ణుని మొదటి అవతారముగా దత్తాత్రేయావతారము ధ్యానించువారి పాపమును తొలగించి ముక్తిని ప్రసాదించునని చెప్పబడినది.

**శ్లో॥ దృష్ట్వా స్వం చారుసర్వాఙ్గం ప్రతీతావపి దమ్పతీ ।**
**ఆశఙ్కితాన్తరౌ జ్ఞాత్వా త్ర్యధీశః ప్రాహ సర్వవిత్ ॥ 19**

ప్ర : చారుసర్వాఙ్గమ్ = అందమైన అవయవములన్నిటిని కలిగియున్న, స్వమ్ = తనను, దృష్ట్వా = చూచి, ప్రతీతౌ+అపి = ప్రసిద్ధులైనను, దంపతీ = దంపతులైన అనసూయాత్రులు, ఆశఙ్కత+ అన్తరౌ = అంతరంగములలో శంకగలిగిన వారని, జ్ఞాత్వా = తెలిసికొని, సర్వవిత్ = సర్వజ్ఞుడైన, త్ర్యధీశః = త్రిమూర్తిరూపముగల వాడగు దత్తాత్రేయుడు, ప్రాహ = పలికెను.

తా : అనసూయ అత్రి దంపతులు జ్ఞానవంతులుగా ప్రసిద్ధులే యైనను తమ ముంగిట నిలచిన సర్వాంగసుందరుడైన దత్తాత్రేయుని చూచి శంకితమనస్కులగుటను ఆ ప్రభువు గ్రహించి వారితో నిట్లనినాడు.

**శ్లో॥ ఆదితోఽర్భసుఖాప్తీచ్ఛా విద్యతే వాం హి తద్ద్రుతమ్ ।**
**ప్రభవన్తు మదంశోత్థాః సుపుత్రాః సుయశస్కరాః ॥ 20**

ప్ర : ఆదితః = మొదటినుండియు, అర్భసుఖ+ఆప్తి+ఇచ్ఛా = బాల్యసఖమును పొందు కోరిక, వామ్ = మీ ఇద్దరకు, విద్యతే హి = ఉండియే యున్నది, తత్ = ఆ కోరిక, ద్రుతమ్ = వేగముగ (తీరునట్లు), సుయశస్కరాః = సత్కీర్తిని కలిగించువారగు, సుపుత్రాః = మంచి కుమారులు, మత్+అంశ+ఉత్థాః = నా అంశనుండి వెలువడినవారై, ప్రభవన్తు = జన్మింతురుగాక!

తా : మొదటినుండియు మీకు కుమారుల బాల్యసుఖముపై కోరిక యున్నది. అది వేగమే తీరునట్లు మీకు నా అంశగలవారు సత్కీర్తిని దెచ్చువారు కుమారులై జన్మింతురుగాక!

**శ్లో॥ ఏవం లబ్ధవరః సోఽత్రిస్తం నత్వా జాయయా సహ ।**
**స్వాశ్రమం తదనుజ్ఞాతో యయౌ తద్గతమానసః ॥ 21**

ప్ర : ఏవమ్ = ఈ విధముగా, లబ్ధవరః = వరమును పొందినవాడై, సః అత్రిః = ఆ అత్రి, తం నత్వా = ఆ దత్తాత్రేయునకు నమస్కరించి, తత్+అనుజ్ఞాతః = వాని అంగీకారమును పొంది, తత్+గత మానసః = ఆ స్వామియందే లగ్నమైన మనస్సుతో, జాయయా సహ = భార్యతోగూడ, స్వ+ఆశ్రమమ్ = తన ఆశ్రమమును గూర్చి, యయౌ = వెళ్ళిరి.

**తా :** ఈ విధముగా వరమంది అత్రిమహర్షి ఆ శ్రీదత్తునకు నమస్కరించి, ఆ స్వామి అనుజ్ఞతో భార్యతోగూడి ఆ స్వామియందే మనస్సు లగ్నమై యుండగా తన ఆశ్రమమునకు వెళ్ళినాడు.

**శ్లో॥ చతుర్భుజావతారోఽయం శాణ్డిల్యాద్యా యదర్చకాః ।**
**నిఃశ్రేయసం గతాశ్చాథావతారోఽస్యాన్య ఉచ్యతే ॥ 22**

**ప్ర :** అయం చతుర్భుజ+అవతారః = ఈ చతుర్భుజ దత్తావతారము, యత్ = ఏదియో, (తత్) అర్చకాః = దానిని ఆరాధించిన, శాణ్డిల్య+ఆద్యాః = శాండిల్యుడాదిగా గలవారు, నిఃశ్రేయసం గతాః = మోక్షమును పొందిరో, (వారు), అథ = అంతట, అస్య అవతారః = వాని అవతారము, అన్యః చ = వేరొకటియు అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా :** ఈ చతుర్భుజదత్తావతారమును శాండిల్యాదులు అర్చించి మోక్షము నందిరి. వారు శ్రీదత్తావతారము వేరొకటిగా చెప్పిరి. *

**శ్లో॥ నారదస్త్వేకదాఽఽతిథ్యం పాతివ్రత్యం చ వీక్ష్య సత్ ।**
**అత్రిప్రియాయాః సావిత్రీశ్రీశాభ్యః ప్రశశంస తత్ ॥ 23**

**ప్ర :** ఏకదా = ఒకప్పుడు, నారదః = నారదుడు, సావిత్రీశ్రీశాభ్యః = సరస్వతీ లక్ష్మీపార్వతుల యొక్కయు, అత్రిప్రియాయాః = అనసూయ యొక్కయు, ఆతిథ్యమ్ = ఆతిథ్యమును, పాతివ్రత్యమ్ చ = పాతివ్రత్యమును, వీక్ష్య = చూచి, తత్ తు = దానినేమో (అనసూయ పాతివ్రత్యమును ఆతిథ్యమును), సత్ = చక్కగా, ప్రశశంస = ప్రశంసించెను.

**తా :** ఒకప్పుడు నారదుడు త్రిమూర్తుల భార్యలైన సరస్వతీ లక్ష్మీ పార్వతులను అనసూయను వారి వారి ఆతిథ్యములను పాతివ్రత్యములను ప్రస్తావించుచు అనసూయనేమో ప్రశంసించినాడు.

**శ్లో॥ తదా రుష్టాః ప్రేరయంస్తాః పతీన్స్వాధీనభర్తృకాః ।**
**అనసూయాసత్త్వహృత్యై సాసూయా దేవతా అపి ॥ 24**

**ప్ర :** తదా = అప్పుడు, రుష్టాః = రోషము జెందిన వారై, దేవతాః అపి = దేవతలై యుండియు, స+అసూయాః = అసూయతో, అనసూయా సత్త్వహృత్యై = అనసూయయొక్క శీలమును హరించుటకై, స్వాధీనభర్తృకాః = వశవర్తులగు భర్తలుగల, తాః = వారు, పతీన్ = తమ భర్తలను, ప్రేరయన్ = ప్రేరేపించిరి.

**తా :** అప్పుడు, దేవతలైనను, అసూయజెంది వారు వశవర్తులగు తమ భర్తలను అనసూయ శీలమును హరింపుడని రోషముతో ప్రేరేపించిరి.

**శ్లో॥ భూత్వాఽతిథయోఽత్రేర్వేశ్మైత్య దినాన్తే ।**
**ఈశాః సతి నోఽన్నం దేహీత్యవదంస్తే ॥ 25**

**ప్ర :** అతిథయః భూత్వా = అతిథులై, అత్రేః వేశ్మ = అత్రి యింటికి, ఏత్య = పోయి, దినాన్తే =

సాయం సమయమున, తే ఈశాః = ఆలోకేశులు, (హే) సతి = ఓ సతీ!, నః = మాకు, అన్నం దేహి = అన్నమునిమ్ము, ఇతి = అని, అవదన్ = పలికిరి.

**తా :** ఆ త్రిమూర్తులు అతిథుల రూపమున అత్రిమహర్షి ఆశ్రమమునకు వెడలి సాయం సమయమున, "ఓ పతివ్రతా! మాకు అన్నము నిమ్ము" అనిరి.

**శ్లో॥ నగ్నా యది భూత్వాఽన్నం దాస్యసి హృష్టా ।**
**గృహ్ణీమ ఉ నో చేద్యామస్త్వయి రుష్టాః ॥ 26**

**ప్ర :** నగ్నా భూత్వా = వివస్త్రవై, యది అన్నం దాస్యసి హృష్టా = సంతోషముతో అన్నమిచ్చినట్లయిన, గృహ్ణీమః = స్వీకరింతుము, ఉ నో చేత్ = అట్లు కాదేని, త్వయి రుష్టాః = నీ యందు కోపగించిన వారమై, యామః = పోదుము.

**తా :** వివస్త్రవై మాకు అన్నమిచ్చినచో, అదియును సంతోషముగా, స్వీకరింతుము. కాదేని నీయందు కోపించి వెడలిపోదుము, అనిరి.

**శ్లో॥ సాఽఽశ్రుత్య తదర్థ్యం మత్వాఽర్భవదేతాన్ ।**
**నగ్నాఽభవదైక్షత్తానేవ ను పోతాన్ ॥ 27**

**ప్ర :** సా = ఆమె, తత్+అర్థ్యమ్ = వారు అర్థించిన దానిని, ఆశ్రుత్య = సమగ్రముగ విని, ఏతాన్ = వారిని, అర్భవత్ = శిశువులుగా, మత్వా = తలచి, నగ్నా = వివస్త్రగా, అభవత్ = ఆయెను, తాన్ ఏవ = వారినే, పోతాన్ = శిశువులుగా, ను = యథార్థముగా, ఐక్షత్ = చూచెను.

**తా :** ఆ అనసూయాదేవి వారి మాటలు శ్రద్ధగా విని, వారి భావమును గ్రహించి, వారిని శిశువులుగా భావించి, వివస్త్రయైనది. కాగా, ఆ త్రిమూర్తులు నిజముగనే శిశువులై యుండుట కన్పించినది.

**శ్లో॥ దైవాత్స్నుతదుగ్ధం దత్వేష్టమథో తాన్ ।**
**ప్రాస్వాపదుచ్చైః సుశ్రావితగీతాన్ ॥ 28**

**ప్ర :** దైవాత్ = విధివశమున, స్నుత = స్రవించిన, దుగ్ధమ్ = పాలను, దత్వా ఇష్టమ్ = తృప్తిగా నిచ్చి, అథో = అంతట, తాన్ = వారిని, ఉచ్చైః = బిగ్గరగా సుశ్రావితగీతాన్ = చక్కగా విన్పించుచున్న పాటలతో, ప్రాస్వాపత్ = నిదురబుచ్చెను.

**తా :** విధివశమున ఆ శిశువులను చూచుటతో ఆమెకు స్తన్యము స్రవించినది. దానితో ఆ శిశువులను తృప్తిపరచి, బిగ్గరగా శ్రావ్యముగా పాడుచూ వారిని నిదురబుచ్చినది.

**శ్లో॥ అత్రిః కృతకృత్యోఽప్యేత్యాపి వనాత్తత్ ।**
**శ్రుత్వాఽఖిలమీశాన్ జ్ఞాత్వాఽస్తువదేతాన్ ॥ 29**

**ప్ర :** అత్రిః అపి = అత్రిమహర్షి కూడ, కృతకృత్యః = కోరిక సిద్ధించినవాడై, వనాత్ = అడవినుండి,

ఏత్య = వచ్చి, తత్ అఖిలమ్ = ఆ జరిగినదంతయును, శ్రుత్వా అపి = వినియును, తాన్ = వారిని, ఈశాన్ = త్రిమూర్తులుగా, జ్ఞాత్వా = తెలిసి, అస్తువత్ = స్తోత్రము జేసెను.

**తా :** అత్రిమహర్షి గూడ ఆ సమయమునకు అడవినుండి కృతార్థుడై వచ్చి, జరిగిన దంతయు విని, ఆ శిశువులు త్రిమూర్తులని గ్రహించి వారిని స్తుతించెను.

**శ్లో॥ దేవ్యోఽప్యృషి వాక్యాదాప్తాః పతికామాః ।**
**స్వస్వేదనభిజ్ఞా హ్రీతా హతకామాః ॥ 30**

**ప్ర :** దేవ్యః అపి = త్రిమూర్తుల దేవేరులు సరస్వతీ లక్ష్మీ పార్వతులున్నూ, ఋషివాక్యాత్ = నారదమహర్షి చెప్పగా, పతికామాః = భర్తలను కోరి, ఆప్తాః = వచ్చినవారై, స్వ స్వ = తమ తమ, ఈడనభిజ్ఞాః = పతులను గుర్తించలేక, హ్రీతాః = సిగ్గిలినవారై, హతకామాః = కృతార్థులు కారైరి.

**తా :** త్రిమూర్తుల భార్యలున్నూ నారదమహర్షిద్వారా జరిగినది తెలిసికొని, తమ భర్తలకై దిగివచ్చి శిశువులుగా నున్న వారి ముగ్గురిలో యే శిశువు నిజరూప మే మూర్తియో గుర్తించలేక సిగ్గుపడి హతాశులైరి.

**శ్లో॥ సాఽథాఽస్తువదీశానాసన్నిజరూపైః ।**
**వ్యక్తాః ఖలు తల్పే తేఽప్యర్భకరూపైః ॥ 31**

**ప్ర :** సా = ఆ అనసూయ, ఈశాన్ = త్రిమూర్తులను, అస్తువత్ = స్తుతించెను, అథ = అంతట, తే = వారు, తల్పే = తల్పముపై, అర్భకరూపైః = శిశురూపములతో, ఆసన్ అపి = ఉండియును, నిజరూపైః = యథార్థరూపములతో, వ్యక్తాః ఖలు = ప్రకటితులైరి కదా.

**తా :** అనసూయాదేవి త్రిమూర్తులను ప్రార్థించగా అంతట వారు, తల్పముపై శిశువులుగా నుండియే, తమ తమ యథార్థరూపములతో ప్రకటితులైరి. *

**శ్లో॥ స్త్రీభిః సహ తాభ్యాం దత్వేష్టవరం తే ।**
**స్వం స్వం పదమీయుస్తస్థుస్తు సుతాస్తే ॥ 32**

**ప్ర :** తే = వారు, స్త్రీభిః సహ = భార్యలతో కూడ, తాభ్యామ్ = ఆ అనసూయ అత్రి దంపతులకు, ఇష్టవరమ్ = కోరిన వరమును, దత్వా = ప్రసాదించి, స్వం స్వమ్ = తమ తమ, పదమ్ = స్థానములను గూర్చి, ఈయుః = వెడలిరి, తే = వారు, సుతాః = పుత్రులు, తస్థుః తు = అయి యుండిరి కూడ.

**తా :** త్రిమూర్తులు తమ భార్యలతో కలిసి ఆ ఋషిదంపతులకు కోరిన వరమిచ్చి, తమ తమ నెలవులకు వెడలిరి. కాని ఆ దంపతులకు పుత్రులై యుండిరి కూడ.

**శ్లో॥ సైష ద్విభుజోఽన్యోఽజస్యాప్యవతారః ।**
**యోఽత్రాస్తి దలాదాలార్కాదిసుతారః ॥ 33**

**ప్ర :** స ఏష ద్విభుజః = ఈ రెండు భుజములు గలదైన, అజస్య అవతారః = విష్ణువు అవతారము, అన్యః అపి = మరియొకటియు, యః = ఏది, అత్ర+అస్తి = లోకమున కలదో, (సః = అది), దలాదాలార్కాదిసుతారః = దలాదాల, అర్కాదులను పాపపు లోకములను సుఖముగా దాటించునది.

**తా :** విష్ణువు యొక్క ద్విభుజావతారము వేరొకటి లోకమున కలదు. అది దలాదాల, అర్కాదులను పాపపు లోకములను సుఖముగా దాటించునది.

**శ్లో॥ అన్యోఽప్యవతారః షడ్బాహురుదారః ।**
**వచ్మ్యర్థివిదూరం సద్యోగ్యవిదూరమ్ ॥ 34**

**ప్ర :** అన్యః అవతారః అపి = మరియొక అవతారము గూడ, షడ్బాహుః = ఆరు భుజములు గలది, ఉదారః = దానశీలమైనది, సద్యోగి = మంచి యోగులకు, అవిదూరమ్ = అతిదూరము కానిది, అర్థివిదూరమ్ = లౌకికులైన యాచకులకు విశేషదూరమున గలది, వచ్మి = చెప్పుదును.

**తా :** ఆరు భుజములు గల వేరొక దత్తావతారమున్నది, వరదానశీలమైనది. అది మంచి యోగులకు చేరువైనది, లౌకికులగు బహిర్ముఖులకు దూరమైనది. దాని గురించి చెప్పుదును.

**శ్లో॥ భర్తృనాశమినోద్గత్యా శ్రు(జ్ఞా)త్వా మాణ్డవ్యశాపతః ।**
**కౌశికస్త్రీ శశాపార్కం తదాన్ధ్యాత్పీడితం జగత్ ॥ 35**

**ప్ర :** మాణ్డవ్యశాపతః = మాండవ్యుని శాపము కారణముగా, ఇన+ఉద్గత్యా = సూర్యోదయముతో, భర్తృనాశమ్ = మగని మృతిని, శ్రు (జ్ఞా) త్వా = విని, తెలిసికొని, కౌశిక స్త్రీ = కౌశికుని భార్య, అర్కమ్ = సూర్యుని, శశాప = శపించెను, తత్ = అందువలన, జగత్ = లోకము, ఆన్ధ్యాత్ = చీకటివలన, పీడితమ్ = బాధింపబడినది.

**తా :** మాండవ్యుని శాపఫలముగా సూర్యోదయముతో తన భర్త మరణించునని తెలిసికొని సూర్యుడుదయించకుండునట్లు కౌశిక బ్రాహ్మణుని భార్య సుమతి శపించగా లోకము చీకటిలో మునిగి బాధలపాలైనది.

**శ్లో॥ అత్ర్యాశ్రమం కాదిదేవా గత్వా నత్వా సభార్యకమ్ ।**
**ఆనిన్యుః కౌశికగృహం సతీబోధాయ కాతరాః ॥ 36**

**ప్ర :** కాతరాః కాదిదేవాః = భయపడిన బ్రహ్మాది దేవతలు, అత్రి+ఆశ్రమమ్ = అత్రిమహర్షి ఆశ్రమమునకు, గత్వా = వెళ్ళి, నత్వా = నమస్కరించి, సభార్యకమ్ = భార్యలతో కూడి, సతీబోధాయ = సతీ సుమతికి బోధించు కొరకు, కౌశిక గృహమ్ = కౌశికుని ఇంటికి, ఆనిన్యుః = తీసికొని వచ్చిరి.

**తా :** బ్రహ్మాది దేవతలు జగత్తు నాశమగునని భయపడి, భార్యలతో గూడ అత్రి ఆశ్రమమునకు పోయి, నమస్కరించి, కౌశికుని సతి సుమతికి బోధించుటకై అత్రీ అనసూయలను కౌశికుని యింటికి కొంపోయిరి.

**శ్లో॥ అనసూయోవాచ సాధ్వి! త్వచ్ఛాపాన్నోదితోఽప్యసౌ ।**
**తత్కల్పోఽత్రాస్య మా భీస్తే సూర్యమాశ్వానయోద్గతిమ్ ॥ 37**

**ప్ర :** అనసూయా ఉవాచ = అనసూయ ఇట్లనెను, (హే) సాధ్వి = ఓ సాధ్వీ!, త్వత్ శాపాత్ = నీ శాపమువలన, అసౌ = ఈ సూర్యుడు, న ఉదితః =ఉదయించ లేదు, తత్ = ఆ కారణమున, అస్య = జగత్తుకు, కల్పః = ప్రలయము. తే = నీకు, భీః = భయము, మా= వలదు, సూర్యమ్ = సూర్యుని, అత్ర = జగమున, ఉద్గతిమ్ = ఉదయమును, ఆశు ఆనయ = వెంటనే తీసికొని రమ్ము.

**తా :** అనసూయ ఇట్లనెను: ఓ సాధ్వీ! నీ శాపమువలన సూర్యోదయము కాలేదు. అందువలన లోకమున ప్రలయమగును. కావున వెంటనే సూర్యుడుదయించునట్లు అనుజ్ఞ నిమ్ము. అందు మూలమున నీకు భయము లేదు.

**శ్లో॥ తదాఽప్యుదయమేహీనా! ఇత్యుక్తోఽసౌ తదోదితః ।**
**కౌశికస్తు మృతో ద్రాక్ తదనసూయాప్యజీవయత్ ॥ 38**

**ప్ర :** తదా అపి = అప్పుడు కూడ, ఉదయం ఏహి ఇనా = ఓ సూర్యుడా! ఉదయించుము, ఇతి ఉక్తః = అని చెప్పబడినవాడై, అసౌ = సూర్యుడు, తదా = అప్పుడు, ఉదితః = ఉదయించిన వాడాయెను, కౌశికః తు = కౌశికుడేమో, ద్రాక్ = వెంటనే, మృతః = మరణించినవాడాయెను, తత్ = ఆ మృతుని, అనసూయా అపి = అనసూయయును, అజీవయత్ = బ్రతికించెను.

**తా :** అప్పుడు ఉదయించుము సూర్యుడా, యని అనుజ్ఞాతుడైన సూర్యుడు అంతట ఉదయించెను. వెంటనే కౌశికుడు మరణించెను. అప్పుడనసూయ ఆ మృతుని మరల బ్రతికించెను.

**శ్లో॥ తదా హృష్టాః సురా సాధ్వి! కుక్షౌ తేఽవతరన్త్వజాః ।**
**కవిష్ణీశా ఇతి వరం దత్త్వా తేత్రిదివం యయుః ॥ 39**

**ప్ర :** తదా = అప్పుడు, హృష్టాః సురాః = సంతోషించిన దేవతలు, (హే) సాధ్వి! = ఓ సాధ్వీ!, తే కుక్షౌ = నీ గర్భమందు, అజాః = కవిష్ణు+ఈశాః = జన్మాతీతులైన త్రిమూర్తులు, అవతరన్తు = జన్మింతురు గాక!, ఇతి = అని, వరం దత్త్వా = వరమిచ్చి, తే = వారు, త్రిదివం యయుః = స్వర్గమునకు పోయిరి.

**తా :** అప్పుడు దేవతలు సంతోషించి, ఓ సాధ్వీ! నీ గర్భమున త్రిమూర్తులు జన్మింపగలరని వరమిచ్చి, వారు స్వర్గమునకు వెడలిరి.

**శ్లో॥ స్వధామైత్యాత్రిణాఽప్యూర్ధ్వరేతసా మూర్తిమద్ధృదా ।**
**ధ్యాత్వాఽకర్మాశయా ఈశా న్యస్తా జాయాన్తరే పరే ॥ 40**

ప్ర : స్వధామ+ఏత్య = తన ఆశ్రమమునకు వెడలి, ఊర్ధ్వరేతసా అత్రిణా అపి = బ్రహ్మచారియైన అత్రి మహర్షిచేత, అకర్మాశయా = కర్మయందాసక్తిలేనివాడై, జాయాన్తరే = భార్యయొక్క అంతరంగమున, పరే = పరాత్పరునియందు, న్యస్తా = నిలుపబడిన, ఈశాః = త్రిమూర్తులు, హృదా = మనస్సుతో, మూర్తిమత్ = సాకారులుగా, ధ్యాత్వా = ధ్యానించి,

**శ్లో॥ వరప్రభావాద్ధృత్వాపి గర్భవత్తానసూత సా ।**
**మార్గే ప్రదోషే పూర్ణాయాం బుధేఽజోఽవాతరన్మృగే ॥ 41**

ప్ర : వరప్రభావాత్ = వరప్రభావమువలన, సా = ఆ అనసూయాదేవి, ధృత్వా అపి = ధరించియు, గర్భవత్తాన్ = గర్భమందున్న వారిని, మార్గే = మార్గశిరమాసమున, మృగే = మృగశిర కార్తెలో, పూర్ణాయామ్ = పూర్ణిమ నాడు, ప్రదోషే = ప్రదోషకాలమున, అసూత = ప్రసవించెను, బుధే = బుధవారమున, అజః = విష్ణువు, అవాతరత్ = అవతరించెను.

**తా** : తన ఆశ్రమమునకు చేరి అస్ఖలిత తేజస్వియైన అత్రి మహర్షి భార్యయగు అనసూయ అంతరంగమున నిల్చిన పరాత్పరుడైన త్రిమూర్తులను కర్మయందాసక్తిలేని వాడై ధ్యానించగా, సాధ్వి అనసూయ త్రిమూర్తుల వరప్రభావమున గర్భవతియై మార్గశిరమాసమున మృగశిర కార్తెలోపూర్ణిమ తిథి బుధవారము ప్రదోషకాలమున ప్రసవించెను: విష్ణువవతారమూర్తియై జన్మించెను.

**శ్లో॥ జ్యోతిర్మయ ఆత్మా యోఽజో భగవాన్సః ।**
**స్వం దర్శయితుం ప్రాగుక్త్యైక్యముభాభ్యామ్ ॥ 42**

ప్ర : యః భగవాన్ = యే భగవానుడు షడ్గుణసంపన్నుడో, అజః = జననము లేనివాడో, జ్యోతిర్మయః = జ్యోతిర్మయుడైన, తేజోరూపుడైన, ఆత్మా = ఆత్మయో, సః = ఆతడు, ఉభాభ్యామ్ = ఇద్దరియొక్క, అనసూయ అత్రులకు, ప్రాక్+ఉక్తి = పూర్వము వరదానకాలమున చెప్పబడిన, ఐక్యమ్ = త్రిమూర్తుల ఏకత్వమును, స్వమ్ = తనను, దర్శయితుమ్ = ప్రకటించికొనుటకు,

**శ్లో॥ స్రగ్భాజనవాద్యోచ్ఛూలాబ్జసుచక్రైః ।**
**యుక్ షడ్భుజ ఆస ప్రాదుః స్మితవక్త్రః ॥ 43**

ప్ర : స్రక్ = రుద్రాక్షమాల, భాజన = కమండలువు, వాద్య = డమరు, ఉచ్ఛూల = శ్రేష్ఠమైన శూలము, అబ్జ = పద్మము, సుచక్రైః = సుదర్శనచక్రము, అనువీనితో, యుక్ = కూడిన, షడ్భుజః = ఆరు భుజములు గల, స్మితవక్త్రః = చిఱునవ్వు మోము గలవాడు, ప్రాదుః ఆస = సాక్షాత్కరించెను.

**తా :** షడ్గుణములు గలిగి భగవానుడై, జననము లేనివాడై, జ్యోతిమాత్రస్వరూపుడైన, ఆత్మ తానగు ఆ దేవుడు, అత్రి అనసూయల కిద్దరకును వరదానకాలమున చేసిన వాగ్దానమునసుసరించి తన త్రిమూర్త్యాత్మక రూపముల ఐక్యతను ప్రకటించునట్లు రుద్రాక్షమాలను, కమండలువును, డమరువును, శూలమును, పద్మమును, సుదర్శనచక్రమును ధరించిన ఆరుభుజములతో, నగుమోముతో సాక్షాత్కరించెను.

**శ్లో॥ జ్ఞాత్వా తదభీష్టం భూయోఽర్భక రూపైః ।**
**తస్థావథ హృష్టౌ తౌ తైశ్చ సురూపైః ॥ 44**

**ప్ర :** తత్ అభీష్టమ్ = వారి కోరికను, జ్ఞాత్వా = తెలిసికొని, భూయః = మరల, అర్భకరూపైః = బాల్యరూపములతో, తైః సురూపైః = ఆ చక్కని రూపములతో, హృష్టౌ = సంతోషించినవారై, అథ = అంతట, తస్థౌ = నిలచిరి.

**శ్లో॥ దత్తాఖ్యోఽగ్ర్యః స్వయం విష్ణుః**
**కాంశశ్చన్ద్రోఽన్వయర్ధికృత్ ।**
**చణ్డోఽప్యనుగ్రహపరో**
**దుర్వాసాశ్చ హరాంశజః ॥ 45**

**ప్ర :** అగ్ర్యః = అగ్రజుడై, దత్త+ఆఖ్యః = దత్తుడనబడు, స్వయం విష్ణుః = సాక్షాత్ విష్ణువు, క+అంశః = బ్రహ్మాంశయైన, అన్వయ+వృద్ధికృత్ = వంశమును వర్ధిల్లజేయువాడైన, చన్ద్రః = చంద్రుడు, చ = మరియు, చణ్డః అపి = కోపనుడైనను, అనుగ్రహపరః = అనుగ్రహము గలవాడైన, దుర్వాసాః చ = దుర్వాసుడున్ను, హరాంశజః = హరుని అంశలో జన్మించినవాడై, తస్థుః = నిలచిరి, చ = మరియును, అథ = అంతట, తౌ హృష్టౌ = అనసూయ అత్రి దంపతులు సంతోషించిరి.

**తా :** వారి కోరికను గ్రహించి మరల బాల్యరూపములతో అగ్రజుడై సాక్షాత్ విష్ణువు దత్తుడను పేరునను, బ్రహ్మాంశతో వంశవృద్ధికారకుడగు చంద్రుడును, కోపధారియైనను అనుగ్రహము గలవాడగు దుర్వాసుడు హరుని అంశలోను ప్రభవించగా, ఆ ముప్పురును ఆ అనసూయ అత్రి దంపతుల ముంగిట నిలచిరి. ఆ దంపతులానందించిరి.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ద్వితీయాష్టకే పఞ్చమోఽధ్యాయః ।

ఓమ్ శం

శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

ద్వితీయాష్టకము - షష్ఠాధ్యాయము

**శ్లో॥ నిహోతా యః స్వభక్తేభ్యో - దత్త అన్వీక్షికీం ప్రభుః ।**
**కో జానాతీహ తత్కర్మ-ప్రయోజనగుణాదికమ్ ॥ 1**

**ప్రతిపదార్థం :** యః ప్రభుః = యే ప్రభువు, స్వభక్తేభ్యః = తన భక్తులకొరకై, అన్వీక్షికీమ్ = ఆత్మవిద్యను, దత్తః = ఇచ్చినవాడో, నిహోతా = అగ్నిరూపమున అన్యదేవతలను ఆహ్వానించువాడో, తత్ = వానియొక్క, గుణ = గుణములను, కర్మప్రయోజన+ఆదికమ్ = కార్యములను, వాని ప్రయోజనములను, ఇహ = లోకమున, కః = ఎవడు, జానాతి = తెలియుచున్నాడు?

**తాత్పర్యం :** దత్త ప్రభువు తన భక్తులకొరకై ఆత్మవిద్యను ప్రసాదించెను; ఆతడే అగ్నిరూపమున అన్యదేవతలనాహ్వానించును. అట్టి వాని గుణములను, కార్యములను, ప్రయోజనములను జగత్తులో నెఱిగిన వాడెవడు? *

**శ్లో॥ యోగీన్ద్రవదాన్యః సాక్షాద్భగవాన్యః ।**
**శ్రీదత్త ఇహాన్యః కస్తత్సమమాన్యః ॥ 2**

**ప్ర :** యోగీన్ద్రవదాన్యః = యోగిరాజులలో యెన్నదగినవాడును, సాక్షాత్ భగవాన్ = సాక్షాత్తు షడ్గుణయుతుడైన దైవము, యః = ఎవడు? శ్రీదత్తః = శ్రీదత్తభగవానుడు, ఇహ = లోకమున, అన్యః = వేరొకడు, తత్ సమమాన్యః = వానితో సమముగ ఎన్నదగినవాడు, కః = ఎవడు?

**తా :** షడ్గుణములుగా చెప్పబడు భగము అను దానికి అధిపతియై యోగులలో ఉత్తమోత్తముడుగా ఎన్నదగినవాడు ఎవడు? అనగా, ఈ జగత్తులో శ్రీదత్తాత్రేయుడు కాక వానితో సమానమైనవాడు వేరొకడు లేడు.

**శ్లో॥ సోమో ద్రుహిణాంశో వంశర్ధికృదేషః ।**
**భూత్వాఽత్ర రసాత్మా సర్వౌషధిపోషః ॥ 3**

ప్ర : సోమః = చంద్రుడు, ద్రుహిణ+అంశః = బ్రహ్మయొక్క అంశ, ఏషః = ఈతడు, వంశవృద్ధికృత్ = వంశమును వృద్ధిచేయువాడు, అత్ర = ఇచట, రసాత్మా భూత్వా = రసాధిపతియై, సర్వ+ఓషధిపోషః = అన్ని ఓషధులను పోషించువాడు.

తా : చంద్రుడు బ్రహ్మ అంశగలవాడు, వంశవృద్ధికరుడు. ఆతడు జగత్తులో రసాధిపతియై అన్ని ఓషధులను పోషించుచున్నాడు. *

**శ్లో॥ మత్స్యాద్యవతారా విష్ణోర్జనతారాః ।**
**జాతా య ఇహైశస్తత్కారణమంశః ॥ 4**

ప్ర : మత్స్య+ఆది+అవతారాః = మత్స్యకూర్మవరాహ నారసింహ వామన పరశురామ-రామకృష్ణబుద్ధకల్కి అవతారములు, విష్ణోః = విష్ణువుయొక్క, జనతారాః = భక్తుల నుద్ధరించునవిగా, ఇహ = లోకమున, య జాతాః = ఏది కలిగెనో, తత్కారణమ్ = ఆ కారణముననే, ఐశః అంశః = ఈశ్వరాంశగా దుర్వాసమహర్షి.

తా : విష్ణువుయొక్క దశావతారములు భక్తోద్ధరణకై కలిగినట్లే ఈశ్వరాంశగా దుర్వాసమహర్షియు లోకోద్ధర్తగా జన్మించినాడు.

**శ్లో॥ రాజర్షిరమ్బరీషాఖ్యః సౌరిర్భాగవతోత్తమః ।**
**ఏకాదశీవ్రతపరః సర్వదా విష్ణుచిన్తకః ॥ 5**

**శ్లో॥ తద్గృహం దక్షిణే దేశే దుర్వాసా ద్వాదశీదినే ।**
**ప్రాతరేత్యార్పయాలం మే భోజనం చేత్యువాచ తమ్ ॥ 6**

ప్ర : భాగవతోత్తమః = భగవచ్చింతకులలో ఉత్తముడు, సర్వదా = ఎల్లవేళల, విష్ణుచిన్తకః = విష్ణువును ధ్యానించువాడు, ఏకాదశీవ్రతపరః = ఏకాదశీవ్రతనిష్ఠగలవాడు, రాజర్షిః = రాజైయున్న ఋషి, సౌరిః= సూర్యవంశపువాడు, అంబరీష+ఆఖ్యః = అంబరీషుడను పేరుగలవాడు, దక్షిణే దేశే = దక్షిణభారతదేశమున, (కలడు), తత్ గృహమ్ = వాని గృహమునకు, ద్వాదశీదినే = ద్వాదశీ తిథినాడు, ప్రాతః = ఉదయమున, ఏత్య = వచ్చి, మే = నాకు, భోజనమ్ = భోజనమును, అలమ్ = చాలినంత, అర్పయ = ఇమ్ము, ఇతి = అని, దుర్వాసా = దుర్వాసుడు, తం చ = వానితో, ఉవాచ = పలికెను.

తా : పరమభాగవతుడు, విష్ణుభక్తుడు, ఏకాదశీవ్రతదీక్షితుడు, సూర్యవంశజుడైన రాజర్షి అంబరీషుడు దక్షిణదేశమున గలడు. వాని యింటికి ద్వాదశినాడు ఉదయమున దుర్వాసుడు వచ్చి, "నాకు చాలినంత అన్నమిడుము" అని పలికెను.

**శ్లో॥ రాజర్షిః ప్రాహ తం సిద్ధమన్నమాశ్వద్య పారణా ।**
**అతః కృత్వాఽఽహ్నికం శీఘ్రమేహి మే త్వం ప్రియోఽతిథిః ॥ 7**

**ప్ర :** రాజర్షిః = రాజర్షియైన అంబరీషుడు, తం ప్రాహ = వాని కిట్లు సమాధానమిచ్చెను, అద్య = నేడు, పారణా = ఏకాదశీవ్రతసమాప్తిపారణ (ద్వాదశి యగుటచేత), అన్నమ్ = అన్నము, సిద్ధమ్ = సిద్ధమైయున్నది, ఆశు = త్వరగా, ఆహ్నికం కృత్వా = మధ్యాహ్నవిధులు చేసికొని, అతః = అందువలన, శీఘ్రమ్ = వెంటనే, ఏహి = రమ్ము, త్వమ్ = నీవు, మే = నాకు, ప్రియః అతిథిః = ప్రియమైన అతిథివి.

**తా :** రాజర్షి అంబరీషుడు ఆ దుర్వాసుని కిట్లనెను : "నేడు ద్వాదశి. నాకు ఏకాదశీవ్రతాన్త పారణదినము. కనుక నీవు నాకు ప్రియమైన అతిథివి. అన్నము సిద్ధముగనే యున్నది. వెంటనే నీవు మధ్యాహ్నవిధులు నిర్వహించి రమ్ము."

**శ్లో॥ తథేత్యుక్త్వాపి దుర్వాసా నదీం గత్వా పరీక్షితుమ్ ।**
**చిరం తదాఽతిథేయత్వం చక్రే కర్మ సమాహితః ॥ 8**

**ప్ర :** తథా ఇతి ఉక్త్వా = అట్లేయని పలికి, దుర్వాసా అపి = దుర్వాసుడున్ను, నదీం గత్వా = నదికి వెడలి, తత్ = వాని (అంబరీషుని యొక్క), అతిథేయత్వమ్ = అతిథులయందలి గౌరవమును, పరీక్షితుమ్ = పరీక్షించుటకు, సమాహితః = నిశ్చయించికొని, చిరమ్ = చాలకాలము, కర్మ = ఆహ్నికకర్మను, చక్రే = చేసెను.

**తా :** దుర్వాసు డంబరీషుని మాటలు విని అట్లేయని పలికి నదికి వెడలి, ఆ అంబరీషుని అతిథిగౌరవమును పరీక్షింప నిశ్చయించికొని, చాలకాలము ఆహ్నికకర్మలతో గడిపెను.

**శ్లో॥ నైతావన్తం కాలమాప్తః స యాయాత్పారణాక్షణః ।**
**వ్రతభఙ్గస్తేన శస్తా భుక్తిర్హిత్వా మునిం న మే ॥ 9**

**ప్ర :** ఏతావన్తం కాలమ్ = ఇంతవరకును, సః = దుర్వాసమహర్షి, న ఆప్తః = రాలేదు, పారణాక్షణః = పారణ చేయవలసిన సమయము, యాయాత్ = గడచిపోవునట్లున్నది, తేన = అందువలన, వ్రతభఙ్గః = వ్రతమునకు విఘ్నమగును, మే = నాకు, మునిం హిత్వా = అతిథియైన దుర్వాసమునిని విడచి, భుక్తిః= భుజించుట, న శస్తా = శాస్త్రప్రమాణితము కాదు.

**శ్లో॥ కాఽపి హానిర్నామ్బుపానాదితి మత్వా పపౌ జలమ్ ।**
**తదైత్య పీతం దుర్వాసా దృష్ట్వా తం కుపితోఽబ్రవీత్ ॥ 10**

**ప్ర :** అమ్బుపానాత్ = నీరుత్రాగుటవలన, కా అపి హానిః న = ఏమియు నియమహాని జరుగదు, ఇతి మత్వా = అని భావించి, జలమ్ పపౌ = నీరు త్రాగెను, తదా = అప్పుడు, దుర్వాసాః = దుర్వాసుడు, ఏత్య = వచ్చి, పీతం దృష్ట్వా = నీరు త్రాగుట చూచి, తమ్ = అంబరీషుని, కుపితః = కోపించినవాడై, అబ్రవీత్ = పలికెను.

**తా :** దుర్వాసుడింతవరకు రాలేదు పారణకు సమయము మించిపోవునేమో, వ్రతభంగమగునుగదా, ఐనను మునిని (అతిథిని) విడచి నేను భుజించుట వ్రతనియమమునకు విరుద్ధము; నీరు త్రాగినచో

వ్రతభంగము కాకుండును, అతిథిమర్యాదకును భంగముండదు, అని భావించి, నీరు త్రాగుచుండగా దుర్వాసుడు వచ్చి, చూచి, కోపించి, ఇట్లనెను :

**శ్లో॥ హిత్వా క్షుధితం మాం రాజర్ష్యధమ! త్వమ్ ।**
**పీతం తత ఏహి శ్రేష్ఠోఽప్యధమత్వమ్ ।** 11

**శ్లో॥ రే! త్వం ను కువృత్తః ప్రేష్ఠవ్రతమత్తః ।**
**పాపోఽసి హి వృత్తః శాపం వహ మత్తః ॥** 12

**శ్లో॥ మత్స్యాదివియోనీర్యాహీతి తదుక్తిమ్ ।**
**శ్రుత్వాపి స దధ్యౌ విష్ణుం కృతముక్తిమ్ ॥** 13

**ప్ర :** రాజర్షి+అధమ! = ఓ రాజర్షులలో అధముడైనవాడా!, త్వమ్ = నీవు, క్షుధితం మాం హిత్వా = ఆకలిగొన్న నన్ను విడచి, పీతమ్ = నీరు త్రాగితివి, తతః = ఆ కారణమున, శ్రేష్ఠః అపి = శ్రేష్ఠుడవే యైనను, అధమత్వం ఏహి = అధమత్వమును పొందుము; రే = ఓయీ!, త్వమ్ = నీవు, ను = నిశ్చయముగా, కువృత్తః = చెడునడత గలవాడవు, ప్రేష్ఠవ్రతమత్తః = శ్రేష్ఠమైన వ్రతముచే మదించినవాడవు, పాపః వృత్తః అసి హి = పాపపు ప్రవర్తన కలవాడవు, మత్తః = మత్తుడవు, శాపం వహ = శాపమును గైకొనుము, మత్స్యాది వియోనీః = మత్స్యము వంటి నీచ యోనులను, యాహి = పొందుము, ఇతి = అని, తత్+ఉక్తిమ్ = వాని శాప వచనమును, శ్రుత్వా అపి = వినియును, సః= ఆ అంబరీషుడు, కృతముక్తిం విష్ణుమ్ = మోక్షదాతయగు విష్ణువును, దధ్యౌ = ధ్యానించెను.

**తా :** "ఓ అధముడా! నీవు శ్రేష్ఠుడవై, రాజర్షివై యుండియు, ఆకలిగొన్న అతిథిని నన్ను విడచి నీరు ద్రావితివి కావున అధమజన్ముడవు గమ్ము! నీవు నిశ్చయముగ దుశ్చారము చేసితివి ఉత్తమ వ్రతము చేయుచున్నానని మదించితివి, నీవు పాపివి, మదమత్తుడవు, శాపమును కొమ్ము : మత్స్యాది నీచ యోనులలో జన్మించుము" అని శపించెను. అది విని అంబరీషుడు మోక్షదాతయగు విష్ణువును ధ్యానించెను.

**శ్లో॥ తర్హ్యేత్య ను విష్ణుః ప్రాహాప్యభవిష్ణుః ।**
**తం మేఽర్పయ శాపం భక్తే న చ తాపమ్ ॥** 14

**ప్ర :** తర్హి = అప్పుడు, విష్ణుః = విష్ణువు, ను ఏత్య = నిజముగనే వచ్చి, అభవిష్ణు అపి = జన్మలేని వాడైనను, తం ప్రాహ = దుర్వాసున కిట్లనెను : శాపమ్ = శాపమును, మే అర్పయ = నాకు అర్పింపుము, భక్తే తాపమ్ = భక్తునకు బాధను, న చ = కాదు సుమా!

**శ్లో॥ ప్రేష్ఠా మమ భక్తా యే మద్వ్రతసక్తాః ।**
**నార్హా ఇహ యుక్తా జన్యై య ఉ ముక్తాః ॥** 15

**ప్ర :** యే మమ భక్తాః = నా భక్తులెవరు, మత్ వ్రతసక్తాః = నా వ్రతమునందాసక్తి గలవారో,

(తే= వారు), ప్రేష్ఠాః = (నాకు) ప్రియతములు, యే = ఎవరు, ముక్తాః = ముక్తినొందిరో, (తే), ఇహ = లోకమున, జన్యై యుక్తాః = జననమరణచక్రమునకు, న ఉ అర్హాః = తగినవారు కారు.

**తా (శ్లో.14-15) :** అప్పుడు విష్ణువు సాక్షాత్కరించి, తాను జన్మము లేనివాడైనను, దుర్వాసున కిట్లనెను : "నీవు నీ శాపమును నాకు అర్పింపుము, భక్తునకు తాపమును కాదు. నా వ్రతమునందాసక్తిగల నా భక్తులెవరైనను నాకు ప్రియతములు. వారు ముక్తినొంది మరల ఈ లోకమున జననమరణచక్రమున బడరు.

**శ్లో॥ బ్రహ్మణ్య ఉతాహం యుష్మద్వ్రతవాహమ్ ।**
**మాం యోజయ శక్తం శాపేన న భక్తమ్ ॥ 16**

**ప్ర :** అహమ్ = నేను, యుష్మత్ వ్రతవాహమ్ = మీ యొక్క వ్రతమును వహించునట్టి, బ్రహ్మణ్యః ఉత = బ్రహ్మణ్యుడను కదా, శాపేన = శాపముతో, మాం శక్తం యోజయ = నన్ను శక్తి గలవానిగా కలుపుము, న భక్తమ్ = నా భక్తుని కాదు.

**తా :** మీ వ్రతదేవతను నేను కావున నీ శాపమును భరించు శక్తి నాకున్నది. నా భక్తునకు కాదు.

**శ్లో॥ శ్రుత్వేతి తదుక్తం జ్ఞాత్వాపి స యుక్తమ్ ।**
**శాపం హరయేఽదాత్తం సోఽప్యజ ఆదాత్ ॥ 17**

**ప్ర :** ఇతి = ఇట్లని, తత్+ఉక్తమ్ = ఆతనిచే పలుకబడినదానిని, శ్రుత్వా = విని, సః = ఆతడు, యుక్తమ్ = తగినదిగా, జ్ఞాత్వా = తెలిసికొనియు, హరయే = విష్ణువునకు, శాపమ్ = శాపమును, అదాత్ = ఇచ్చెను, సః అజః అపి = ఆ విష్ణువున్నూ, తమ్ = ఆ శాపమును, ఆదాత్ = స్వీకరించెను.

**తా :** ఇట్లని పలికిన వాని మాటలను విని, అది యుక్తియుక్తమే యని తలచి, శాపమును విష్ణువునకిచ్చెను. విష్ణువున్ను ఆ శాపమును స్వీకరించెను.

**శ్లో॥ మత్స్యోఽబ్ధివిహారః పూర్వోహ్యవతారః ।**
**జాతః శ్రుతిహారః పూజ్యో మనుతారః ॥ 18**

**ప్ర :** అబ్ధివిహారః = సముద్రమున విహరించు, మత్స్యః = మత్స్యము, పూర్వః హి = మొట్టమొదటి, అవతారః = అవతారము, పూజ్యః = పూజింపదగిన, శ్రుతిహారః = వేదములు ఆభరణములుగా గలది, మనుతారః = మనువును తరింపజేసినదిగా, జాతః = కలిగినది.

**తా :** మొదటిదిగా మత్స్యావతారము సముద్రమున కలిగినది. అది మనువును తరింపజేయుచు, వేదములను అలంకారములుగా ధరించినది కావున పూజ్యమైనది.

**శ్లో॥ నష్టామరబాధః కూర్మోఽథ ధరాధః ।**
**గత్వా వహతీశః క్ష్మాం యోఽప్యమృతేశః ॥ 19**

ప్ర : అథ = పిమ్మట, ఈశః = విష్ణువు, కూర్మః = కూర్మరూపుడై, ధరాధః = మందరపర్వతము క్రిందుగా, గత్వా = వెడలి, క్ష్మాం వహతి = భూమిని భరించుచున్నాడో, యః = ఎవడు, అమృత+ఈశః = మోక్షదాతయైన ప్రభుడు, నష్ట = నశించిన, అమరబాధః = దేవతల బాధగలవాడు, అపి = కూడ అగునో.

**తా :** ఆ తరువాత విష్ణువు దేవతల బాధలను తొలగించబూని అమృతాధిపతియై కూర్మరూపమున మందరపర్వతపు క్రిందుభాగమున చేరి దాని భారమును వహించినాడు.

**శ్లో॥ భూభృత్స హిరణ్యాక్షఘ్నోఽత్ర తృతీయః ।**
**భూదార ఉదారో యజ్ఞో భజనీయః ॥ 20**

ప్ర : అత్ర = ఈ సందర్భమున, తృతీయః = మూడవ అవతారము : భూదారః = భూమిని కుళ్ళగించు వరాహము (భూదేవిని భార్యగా గలవాడు అనియు చెప్పవచ్చును), భజనీయః = సేవింపదగినవాడు, యజ్ఞః = యజ్ఞాత్మయైనవాడు, ఉదారః = దయగలవాడు, సః = ఆ విష్ణువు, హిరణ్యాక్షఘ్నః = హిరణ్యాక్షుడను రాక్షసుని చంపినవాడు, భూభృత్ = భూమినుద్ధరించిన వాడు.

**తా :** మూడవదైన విష్ణు అవతారము వరాహము. అది హిరణ్యాక్షుని సంహరించు నెపమున వెలసినది. అట్లు భూమిని తన కోరలపై ఎత్తిపట్టినది. కావున దయగల యజ్ఞరూపమైనది. సేవ్యము.

**శ్లో॥ భృత్యోక్త్యనుసారీ పూర్వాసురవైరీ ।**
**నామ్నాపి నృసింహః సాక్షాచ్చ నృసింహః ॥ 21**

ప్ర : భృత్య+ఉక్తి+అనుసారీ = భక్తుల మాటల ననుసరించువాడు, పూర్వ+అసురవైరీ = పురాణ రాక్షసుల శత్రువు, నామ్నా అపి నృసింహః = పేరిటనూ నృసింహుడే, సాక్షాత్ చ = చూపులకును, నృసింహః = నృసింహుడే.

**తా :** భక్తుల మాటలను సత్యము చేయువాడు, పురాతనరాక్షససంహారియైన నృసింహుడు పేరులోనే కాదు రూపములోనూ నృసింహుడే.

**శ్లో॥ యో వామనవేషః సన్ పఞ్చమ ఏషః ।**
**యాచ్ఞోపధిబద్ధస్తేనో బలిరద్ధా ॥ 22**

ప్ర : యః = ఎవడు, వామనవేషః సన్ = మరుగుజ్జు వేషధారియై, యాచ్ఞా+ఉపధిబద్ధః = యాచకవేషధారియో, ఏషః = ఆతడు, పఞ్చమః = అయిదవ అవతారమైన, బలిః అద్ధా = బలిని బంధించినవాడు.

**తా :** ఏ విష్ణువు వామనుడై యాచకవేషమున బలిచక్రవర్తిని బంధించెనో, ఆతడే అయిదవదైన వామనావతారము.

*

**శ్లో॥ దూరాట్క్షయకామః స్యాద్భార్గవరామః ।**
**క్ష్మాదో గురుదాసః షష్ఠోఽబ్ధినివాసః ॥ 23**

**ప్ర :** అబ్ధినివాసః = క్షీరాబ్ధినివాసియైన విష్ణువు, దూరాట్ = దుర్మార్గులైన రాజులను, క్షయకామః = నశింపజేయగోరినవాడగు, గురుదాసః = పితృభక్తిపరాయణుడగు, క్ష్మాదః = భూదానపరుడైన, భార్గవరామః = పరశురాముడు, షష్ఠః = ఆరవ అవతారమూర్తి, స్యాత్ = అగును.

**తా :** పాల్కడలి నివాసియగు విష్ణువుయొక్క ఆరవ అవతారమూర్తి పరశురాముడు లేక భార్గవరాముడు. ఈతడు పితృభక్తి పరాయణుడు. కావుననే దుర్మార్గులయిన రాజులను నాశము చేయగోరినాడు. కశ్యపునకు భూదానకర్తయైనవాడు.

**శ్లో॥ రాట్ సప్తమ ఆసీద్రామో వనవాసీ ।**
**పిత్రుక్త్యనుసారీ రక్షోలయకారీ ॥ 24**

**ప్ర :** పిత్రుక్తి+అనుసారీ = తండ్రి ఆజ్ఞననుసరించి, వనవాసీ = వనవాసము చేసినవాడు, రక్షోలయకారీ = రాక్షసులను సంహరించినవాడు, రాట్ రామః = రాజా రాముడు, సప్తమః ఆసీత్ = ఏడవ అవతారమూర్తి యాయెను.

**తా :** ఏడవ అవతారమూర్తి రాజారాముడు. ఈతడు తండ్రి ఆజ్ఞమేరకు వనవాసము చేసి రాక్షససంహారము చేసినాడు.

**శ్లో॥ వర్ణ్యష్టమ ఇష్టః కృష్ణో హతదుష్టః ।**
**యః షోడశనారీసాహస్రవిహారీ ॥ 25**

**ప్ర :** అష్టమః = ఎనిమిదవ అవతారమూర్తి, యః = ఎవడు, హతదుష్టః = దుష్టసంహారకుడో, షోడశనారీసాహస్రవిహారీ = పదునారువేల కాంతలతో విహరించువాడైన, కృష్ణః = కృష్ణుడు, ఇష్టః వర్ణీ = భర్తయైన బ్రహ్మచారి.

**తా :** కృష్ణుడు ఎన్మిదవ అవతారమూర్తి. ఆతడు దుష్టసంహారి. పదునారువేల మంది స్త్రీలకు భర్తయైన బ్రహ్మచారి.

**శ్లో॥ బుద్ధో నవమోఽయం విస్తారితమాయమ్ ।**
**యం కోఽపి న వేద సోఽప్యావృతిమర్దః ॥ 26**

**ప్ర :** అయం నవమః = ఈ తొమ్మిదవ అవతారమూర్తి, విస్తారితమాయమ్ = విశేషముగా మాయను తరించిన వానిని, యమ్ = ఎవనిని, కః అపి = ఎవ్వడును, న వేద = ఎఱుగకుండెనో, సః బుద్ధః అపి = ఆ బుద్ధుడు కూడ, ఆవృతిమర్దః = అజ్ఞానమను ఆవరణమును తొలగించువాడు.

**తా :** తొమ్మిదవ అవతారమూర్తి బుద్ధుడు. ఈతడు మాయను తరించినవాడు. అజ్ఞానావరణమును తొలగించు జ్ఞానదాత. వీని తత్త్వము నెవ్వరును ఎఱుగరు.

**శ్లో॥ మ్లేచ్ఛక్షయకర్తా కల్కీ వృషభర్తా ।**
**విప్రో భవితార్థ్యః శూరో దశమోఽర్చ్యః ॥ 27**

**ప్ర :** అర్చ్యః = పూజింపదగిన, దశమః = పదియవ అవతారమూర్తి, కల్కీ = కల్కి, విప్రః = బ్రాహ్మణుడు, శూరః = వీరుడు, వృషభర్తా = ధర్మపాలకుడు, మ్లేచ్ఛక్షయకర్తా = అధర్ములను నశింపజేయువాడు, అర్థ్యః = ప్రార్థనీయుడైనవాడు.

**తా :** పదియవ అవతారమూర్తి కల్కి. ఈతడు బ్రాహ్మణుడు, వీరుడు, ధర్మపాలకుడు, అధర్మనాశకుడు, ప్రార్థనీయుడు, భవిష్యత్తులో రానున్న అవతారమూర్తి.

**శ్లో॥ అన్యేఽప్యవతారాః సద్ధర్మసుతారాః ।**
**తత్కర్మగుణాద్యం కో వేత్త్యనవద్యమ్ ॥ 28**

**ప్ర :** అన్యే అపి అవతారాః = వేరైన అవతారములున్నూ కపిలావతారాదులు, సత్‌ధర్మసుతారాః = ఉత్తమ ధర్మమును ఉద్ధరించునవి, తత్ కర్మగుణ+ఆద్యమ్ = దాని గుణకర్మలు మొదలుగా, అనవద్యమ్ = శ్రేష్ఠమైనది, కః వేత్తి = ఎవడెఱుగును?

**తా :** ఉత్తమ ధర్మబోధన చేయు కపిలుని పోలిన ఇతరములైన అవతారములున్ను కలవు. శ్రేష్ఠమైన ఆ విష్ణువు గుణకర్మలు ఎఱిగిన వాడెవడు?

**శ్లో॥ ఆత్మైవమధీశో యోఽజోఽవ్యయ ఈశః ।**
**మాయావశతోఽర్థ్యాన్ కాయానభజద్యాన్ ॥ 29**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగ, ఆత్మాధీశః = ఆత్మకధిపతియైన, అజః = పుట్టుక లేనివాడగు, అవ్యయః = నశింపులేనివాడగు, యః ఈశః = ఏ ప్రభువు, మాయావశతః = మాయ ప్రభావమున, అర్థ్యాన్ = ప్రార్థింపదగిన, యాన్ కాయాన్ = యే శరీరములను, అభజత్ = స్వీకరించెనో,

**శ్లో॥ తే సాత్వతపుష్ట్యై న స్వీయసుతుష్ట్యై ।**
**పూర్ణో గతకామః కోఽప్యస్య న కామః ॥ 30**

**ప్ర :** తే = అవి, సాత్వతపుష్ట్యై = భక్తులను బలపరచుటకై, న స్వీయసుతుష్ట్యై = తన సంతోషమునకై కాదు, గతకామః = కోర్కెలు లేని, పూర్ణః = పూర్ణుడు, అస్య = వానికి, కః అపి కామః న = ఏ కోరికయు లేదు.

**తా (శ్లో.29-30):** ఈ విధముగా ఆత్మాధీశుడైన, జననమరణరహితుడైన, ప్రభువైన విష్ణువు మాయకు లోబడి ప్రార్థింపదగిన యే యే శరీరములను ధరించెనో, అవి యన్నియు భక్తుల విశ్వాసమును బలపరచుటకేకాని తన సంతోషముకొరకు కాదు. తాను కొర్కెలేమియు లేని పూర్ణరూపుడు.

**శ్లో॥ జన్మాస్య సుదివ్యం కర్మాపి చ భవ్యమ్ ।**
**తత్త్వాదిహ వేత్తా సత్త్వావృతిభేత్తా ॥ 31**

ప్ర : అస్య జన్మా = వాని జన్మ, సుదివ్యమ్ = అలౌకికమైన దైవకార్యము, కర్మ అపి చ = కర్మయును్ను, భవ్యమ్ = మంగళప్రదము, ఇహ = లోకమున, తత్త్వాత్ = సత్యరూపమున, వేత్తా = తెలిసికొన్నవాడు, సత్త్వ+ఆవృతిభేత్తా = జీవావరణమును భేదించినవాడు.

**తా :** ఆ విష్ణుదేవుని అవతారము అలౌకికదైవకార్యము; ఆ అవతారకర్మ మంగళకరము. లోకమున వాని సత్యార్థమును తెలిసిన వాడు జీవుని అజ్ఞానావరణమును ఛేదించినవాడగును. *

**శ్లో॥ రాగాదివిముక్తః సాఙ్గాజనిభక్తః ।**
**జన్యార్తివిముక్తః సన్యాత్యజమాప్తః ॥ 32**

ప్ర : రాగాది = రాగద్వేషములనుండి, విముక్తః = విడుదల పొందినవాడు, స+అఙ్గ+అజని భక్తః = శరీరధారియైన విష్ణువుయొక్క భక్తుడు, జన్య+ఆర్తి = జన్మలేక సంసార బాధలనుండి, విముక్తః సన్ = విడుదల పొందిన వాడగుచు, యాతి+అజమ్ ఆప్తః = విష్ణువును పొందినవాడై పోవుచున్నాడు.

**తా :** అట్టి భక్తుడు రాగద్వేషరహితుడై, సంసారబాధాముక్తుడై, సశరీరుడైన విష్ణువును చేరబోవుచున్నాడు.

**శ్లో॥ ఏవం సులభోఽయం త్యక్త్వాఽముముపాయమ్ ।**
**నారం శ్రితమాయం యాత్యేతదపాయమ్ ॥ 33**

ప్ర : ఏవమ్ = ఈ విధముగా, అయమ్ = స్వప్రకాశమైన సాక్షాదాత్మా, సులభః = సాధ్యుడు, అముమ్ = భజనాదిరూపమైన, ఉపాయమ్ = సాధనమును, త్యక్త్వా = విడచి, శ్రితమాయమ్ = మాయనాశ్రయించినవాడై, నారమ్ = నరుల సమూహమును (జన్మాదిరూపమున), యాతి = పొందుచున్నాడు, ఏతత్ = ఇది అపాయమ్ = క్షేమము కాని విషయము.

**తా :** ఈ విధముగా సాక్షాదాత్మ స్వరూపుడైనవాడు సులభసాధ్యుడైనాడు. భజనాది సాధనములతో వానిని పొందవచ్చును. కాని ఆ సాధనసంపత్తిని విడచి, మాయకు లోనై, జననమరణ పరంపరలను నరుడనుభవించుచున్నాడు. ఇది క్షేమంకరము, శ్రేయస్కరము కాదు.

**శ్లో॥ స్వస్య ప్రకృతిర్యాస్మిన్హేతురవార్యా ।**
**రాగాద్యవశస్తాం జహ్యాచ్చిరమాప్తామ్ ॥ 34**

ప్ర : స్వస్య = తనదైన, ప్రకృతిః = స్వభావము, యా = ఏది, అస్మిన్ = దీనియందు, అవార్యా హేతుః = అడ్డుకొనలేని కారణమో, తాం చిరం ఆప్తామ్ = చాలకాలము నెలకొనియున్న దానిని, రాగాది+అవశః = రాగద్వేషములకు లోనైనవాడు, జహ్యాత్ = విడువవలెను.

**తా :** మానవుని స్వభావములో పాదుకొనియున్న రాగద్వేషాదులు చాలకాలమున్నందున అనివార్యహేతువుగా పరిణమించుచున్నవి. వానిని విడువవలెను.

**శ్లో॥ సూపాయదురాపః శాపాత్స సుఖాపః ।**
**ముక్త్యా అనువేలం యద్భక్తిరిహాలమ్ ॥ 35**

**ప్ర :** సు+ఉపాయదురాపః = శ్రవణమననాది సాధనలచేత కష్టసాధ్యుడైన, సః = ఆ విష్ణువు, శాపాత్ = శాపము కారణముగా, సుఖ+ఆపః = సులభముగా దర్శింపగలవాడాయెను, ముక్త్యాః = ముక్తికి, అనువేలమ్ = నిరంతరమైన, యత్ భక్తిః = భక్తియేదో, (తత్ = దానిని), ఇహ = జగత్తున, అలమ్ = చాలును.

**తా :** సాధనలవలన దర్శింపరాని ఆ స్వామి శాపము కారణమున సుఖదర్శనుడై అవతారమూర్తిగా లోకమునకు దిగివచ్చినాడు. ముక్తి కోరిన వారికి ఆ విష్ణుభక్తి నిరంతరమై యున్న చాలును.

**శ్లో॥ తస్యాంశసుశీలాం వక్ష్యేఽమృతమూలామ్ ।**
**సంక్షేపత ఏషాఽప్యవిద్యకశోషా ॥ 36**

**ప్ర :** తస్య = ఆ విష్ణువుయొక్క, అంశ = అవతారములయొక్క, సుశీలామ్ = శోభన శీలయగు, అమృతమూలామ్ = మోక్షలబ్ధికి మూలకారణమైన దానిని, సంక్షేపతః = సంగ్రహముగ, వక్ష్యే = చెప్పుదును, ఏషా+అపి = ఆ శోభనశక్తియున్ను, అవిద్యకశోషా = అవిద్యయను భ్రమను క్షీణింపజేయునది.

**తా :** విష్ణువు అవతారములందెల్ల శుభక్రియాశక్తియై సహకరించిన ఆ మోక్షలక్ష్మిని గూర్చి సంగ్రహముగ చెప్పుదును. ఆమె గూడ భ్రమరూపమైన అవిద్యను తొలగించగలదు.

**శ్లో॥ ఏకాగ్రహృదం కం శఙ్ఖాసుర ఏత్య ।**
**హృత్వాఽఖిలవేదాన్లీనోఽభవదబ్ధౌ ॥ 37**

**ప్ర :** శంఖాసురః = శంఖాసురుడనువాడు, ఏకాగ్రహృదం కమ్ = ఏకాగ్రచిత్తముతోనున్న బ్రహ్మను, ఏత్య = సమీపించి, అఖిలవేదాన్ = వేదములన్నిటిని, హృత్వా = అపహరించి, అబ్ధౌ = సముద్రమున, లీనః అభవత్ = కలిసిపోయెను.

**తా :** బ్రహ్మ ఏకాగ్రచిత్తముతో నున్న వేళ సమీపించి, నాలుగు వేదములను అపహరించి శంఖాసురుడను వాడు సముద్రగర్భమున కలిసిపోయెను.

**శ్లో॥ తర్హ్యేత్య విధాత్రా సంప్రార్థితవిష్ణుః ।**
**భూత్వాప్యథ మత్స్యోఽబ్ధిం ప్రాప స జిష్ణుః ॥ 38**

**ప్ర :** తర్హి = అప్పుడు, విధాత్రా = బ్రహ్మచేత, సంప్రార్థితవిష్ణుః = ధ్యానింపబడిన విష్ణువు,

మత్స్యః భూత్వా = మత్స్యరూపమును ధరించి, అథ = అంతట, అబ్ధిమ్ = సముద్రమును, సః జిష్ణుః అపి = ఆ విజేత విష్ణువున్ను, ప్రాప = చేరెను.

**తా :** అప్పుడు బ్రహ్మ ప్రార్థించగా విష్ణువు వచ్చి, మత్స్యరూపమును ధరించి సముద్రమున జొచ్చి విజేతయాయెను.

**శ్లో॥ హత్వాఽసురముగ్రం వేదం చ సమగ్రమ్ ।**
**ఉద్ధృత్య చ గాం స స్రష్టేఽర్పయదర్యః ॥ 39**

**ప్ర :** సః = ఆ మత్స్యరూపవిష్ణువు, ఉగ్రం అసురమ్ = హింసకుడైన రాక్షసుని, హత్వా = చంపి, వేదం చ = వేదమునున్ను, సమగ్రమ్ = మొత్తముగా, గాం చ = భూమిని గూడ, అర్యః = శత్రువునుండి, ఉద్ధృత్య = ఉద్ధరించి, స్రష్టే = బ్రహ్మకు, అర్పయత్ = సమర్పించెను.

**తా :** మత్స్యావతారవిష్ణువు ఉగ్రుడైన రాక్షసుని సంహరించి, వానినుండి భూమిని గూడ ఉద్ధరించి, వేదముల నన్నిటిని మొత్తముగా బ్రహ్మకు సమర్పించెను.

**శ్లో॥ లబ్ధాఖిలవేదః స్రష్టా గతఖేదః ।**
**అత్రాసృజదేతత్ప్రాగ్వత్స చ తద్విత్ ॥ 40**

**ప్ర :** స్రష్టా = బ్రహ్మ, లబ్ధాఖిలవేదః = వేదమునంతయు పొంది, గతఖేదః = విచారము లేనివాడై, సః చ = ఆతడున్ను, ప్రాగ్వత్ = తొల్లింటి వలెనే, తత్ విత్ = వేదోక్తినెఱిగిన వాడై, ఏతత్ = విశ్వమును, అత్ర = ఇచట, అస్యజత్ = సృజించెను.

**శ్లో॥ దుర్వాస ఋషేర్యచ్ఛాపాదమరేన్ద్రాః ।**
**రత్నాని పయోబ్ధౌ యాతాని విదిత్వా ॥ 41**

**శ్లో॥ మన్త్రాద్వశదైత్యా దేవా హతకామాః ।**
**క్షీరాబ్ధిమథాస్తే సర్వేఽమృతకామాః ॥ 42**

**శ్లో॥ తే మన్దరమన్థాః సర్పేశగుణా హి ।**
**మన్థేఽథ ఇతేఽజం ప్రోచుర్న ఉ పాహి ॥ 43**

**ప్ర :** దుర్వాస ఋషేః = దుర్వాసర్షియొక్క, యత్ శాపాత్ = యే శాపమువలన, రత్నాని = రత్నములు, పయోబ్ధౌ = సముద్రములోనికి, యాతాని = వెళ్ళినవానిగా, విదిత్వా = తెలిసికొని, అమరేన్ద్రాః = దేవతలును దేవేంద్రుడును, మన్త్రాత్ = మంత్రమువలన, వశపరచుకొనిన, దైత్యాః = రాక్షసులు, హతకామాః = నిరాశపడిన, దేవాః = దేవతలు, అథ = అంతట, సర్వే = అందఱును, అమృతకామాః = అమృతమును కోరినవారై, తే = వారు, క్షీరాబ్ధి = పాలకడలిని, మథాః = మథించినవారైరి, తే = వారు, మన్దర మన్థాః = మందరపర్వతమును కవ్వముగా గలవారై, సర్పేశగుణా హి = సర్పరాజగు వాసుకిని త్రాడుగా గలవారును అగుచు, మన్థే అథః

= మందరము క్రిందుగా, ఇతే = వెళ్ళియున్న, అజమ్ = విష్ణువును, నః = మమ్ములను, పాహి = రక్షించుము, అని, ప్ర+ఊచుః = పలికిరి.

**శ్లో॥ దేవోఽపి వరేణ్యో భూత్వా కమఠోఽధః ।**
**సాద్రిం స దధౌ గాం పృష్ఠే హతబాధః ॥ 44**

**ప్ర :** వరేణ్యః దేవః అపి = వరదాతయగు విష్ణుదేవుడున్నూ, కమఠః భూత్వా = తాబేలు రూపమును ధరించి, స+అద్రిమ్ = పర్వతముతో కూడ, గామ్ = భూమిని, హతబాధః = నిర్బాధముగా, పృష్ఠే = మూపున, అధః = క్రిందనుండి, దధౌ = ధరించెను.

**తా (శ్లో.41-44) :** దుర్వాసర్షి శాపమువలన రత్నములు సముద్రగర్భమునకు చేరగా, దాని నెఱిగి మంత్రమువలన రాక్షసులు దానిని వశపరచుకొనిరి. దేవదానవులందఱును అమృతము నాశించి మందరపర్వతము కవ్వముగా సర్పరాజైన వాసుకి త్రాడుగా పాల్కడలిని చిలుకగోరి దేవతలు విష్ణువును ప్రార్థించగా, ఆ దేవుడు తాబేలుగా మారి ఆ పర్వతము క్రిందకు చేరి దానిని, భూమిని తన మూపున మునుగకుండ మోసినాడు.

**శ్లో॥ రత్నాని తదాబ్ధేర్జాతాని విషం ప్రాక్ ।**
**లోకాన్తకమీశో భేజే దయయా ద్రాక్ ॥ 45**

**ప్ర :** తదా = అప్పుడు, అబ్ధేః = సముద్రమునుండి, రత్నాని జాతాని = రత్నములు వెలువడినవి, ప్రాక్ = ముందుగా, ఈశః = శివుడు, లోకాన్తకం విషమ్ = లోకములను నశింపజేయు విషమును, ద్రాక్ = అది పుట్టిన వెంటనే, దయయా = దయతో, భేజే = సేవించెను.

**తా :** అప్పుడు, సముద్రమునుండి రత్నములు పుట్టినవి. ముందుగా శివుడు లోకాన్తకమైన విషమును దయతో మ్రింగినాడు.

**శ్లో॥ తప్తోఽపి స కేఽధాద్రత్నం పరమిన్దుమ్ ।**
**తేనాపి న శాన్తః కే చామరసిన్ధుమ్ ॥ 46**

**ప్ర :** సః అపి = ఆ శివుడున్నూ, తప్తః = తాపము జెందినవాడై, ఇన్దుమ్ = చంద్రుని, రత్నం పరమ్ = పరమరత్నముగా, కే = మస్తకమున, తేన+అపి = దానితో నైనను, న శాన్తః = తాపము శాంతించనివాడై, కే = సిగపై, అమరసిన్ధుం చ = దేవగంగనున్ను, ఆధాత్ = ధరించెను.

**తా :** విషము మ్రింగుటవలన తాపము జెందిన శివుడు చల్లదనమునకై చంద్రుని తలపై శిరోభూషణముగా ధరించి, తాపము చల్లారక మరల సురగంగను కూడ సిగలో ధరించెను.

**శ్లో॥ శ్రీకౌస్తుభశార్ఙ్గాబ్జాన్విష్ణురినోఽశ్వమ్ ।**
**ధన్వన్తరికల్పద్రూ గోగజవేశ్యాః ॥ 47**

**శ్లో॥ ప్రాపేన్ద్ర ఉ దైత్యైర్లబ్ధోఽమృతకుమ్భః ।**
**తద్వఞ్చితదేవాన్వీక్ష్యామృతనాభః ॥ 48**

**శ్లో॥ మోహిన్యథ భూత్వా లబ్ధ్వామృతమేభ్యః ।**
**మద్యం ప్రదదౌ సా హృద్యం త్వమృతేభ్యః ॥ 49**

**ప్ర :** శ్రీ = లక్ష్మీదేవి, కౌస్తుభ = కౌస్తుభమనబడు మణి, శార్ఙ్గ = శార్ఙ్గమనబడు చాపము, అబ్జాన్ = పాంచజన్యమనబడు శంఖము, వీనిని, విష్ణుః = విష్ణువు, ఇనః = సూర్యుడు, అశ్వమ్ = గుఱ్ఱమును, ధన్వన్తరి = ధన్వన్తరి, కల్పద్రూ = కల్పవృక్షమును, ఇన్ద్రః = ఇంద్రుడు, గో = కామధేనువు, గజ = ఐరావతమను ఏనుగును, వేశ్యాః = రంభా మేనకా తిలోత్తమాది అప్సరసలను, ప్రాప ఉ = పొందెను, అమృతకుమ్భః = అమృతభాండము, దైత్యైః లబ్ధః = రాక్షసులచే పొందబడెను, తత్ వఞ్చితదేవాన్ = రాక్షసులచే వంచింపబడిన దేవతలను, వీక్ష్య = చూచి, అమృతనాభః = అమృతమును నాభియందు ధరించినవాడగు విష్ణువు, అథ = అంతట, మోహినీ భూత్వా = మోహినీ రూపుడై, ఏభ్యః = రాక్షసులనుండి, అమృతమ్ = అమృతమును, లబ్ధ్వా = పొంది, సా = ఆ మోహిని, అమృతేభ్యః = దేవతలకు, హృద్యం తు = అమృతమునున్ను, (రాక్షసులకు) మద్యమ్ = మద్యమును, ప్రదదౌ = ఇచ్చెను.

**తా :** పాలసముద్రమును చిల్కగా పుట్టిన వానిని ఈ విధముగా పంచుకొనిరి: విష్ణువు లక్ష్మీదేవిని, కౌస్తుభమణిని, శార్ఙ్గమును, పాంచజన్యశంఖమును స్వీకరించగా, సూర్యుడు అశ్వమును; ధన్వన్తరి కల్పవృక్షమును; ఇంద్రుడు కామధేనువును, ఐరావతమును, అప్సరసలను స్వీకరించిరి. రాక్షసులు అమృతభాండమును పొందిరి. ఇట్లు దేవతలు మోసపోయిరని విష్ణువు గ్రహించి మోహినీ అవతారమెత్తెను. తాను రాక్షసులను సమ్మోహనపరచి వారినుండి అమృతభాండమును స్వాధీనము చేసికొని దానిని దేవతలకిచ్చి, రాక్షసులకు మద్యము నిచ్చెను.

**శ్లో॥ దేవాలిగరాహోశ్చిచ్ఛేద కమార్యా ।**
**ఖేటోఽమృతపోఽభూత్కేన్ద్వన్తరనార్యః ॥ 50**

**ప్ర :** క+ఇన్దు+అన్తః = సూర్యచంద్రుల మధ్యలో, దేవాలిగ = దేవతల సమూహమందు జొచ్చిన, అమృతపోః = అమృతమును ద్రావుచున్న, రాహోః = రాహువుయొక్క, కం = శిరస్సును, ఆర్యా = మోహిని, చిచ్ఛేద = త్రుంచి వేసెను, అనార్యః = దానవుడు, ఖేటః అభూత్ = గ్రహముగా నాయెను.

**తా :** రాహువను దానవుడు దేవతల సమూహములో సూర్యచంద్రుల మధ్య జేరి అమృతమును త్రాగుచుండగా గుర్తించి మోహినీరూప విష్ణువు వాని తలను త్రుంచివేయగా, వాడు (అమృతము ద్రావియున్న కారణముగా) నశించక, గ్రహముగా రూపాంతరమంది నిల్చియున్నాడు.

**శ్లో॥ మత్తా అసురాస్తేఽన్యోన్యం త్వథ జఘ్నుః ।**
**దేవాః కృతకృత్యా నాకం హ్యనుజగ్ముః ॥ 51**

**ప్ర :** అథ = అంతట, తే అసురాః = ఆ దానవులు మత్తాః = (మద్యపానమువలన) మదించి, అన్యః అన్యమ్ = ఒకరొకరిని, జఘ్నుః = చంపుకొనిరి, దేవాః = దేవతలు, కృతకృత్యాః = కోరిన దానిని సాధించినవారై, నాకం హి = స్వర్గమునకు, అనుజగ్ముః = మరలిపోయిరి.

**తా :** అంతట ఆ రాక్షసులు మద్యము త్రాగి మత్తెక్కి ఒకరినొకరు చంపికొనిరి. దేవతలు కోరినది సాధించి, స్వర్గమునకు మరలి పోయిరి.

**శ్లో॥ రాహుస్తు కుభాగో భాస్వచ్ఛశిమర్దః ।**
**పర్వణ్యముమత్రిర్వేదావృతిమర్దః ॥ 52**

**ప్ర :** రాహుః తు = రాహువేమో, కుభాగః = భూమియొక్క ఛాయయందుండి, భాస్వత్+శశిమర్దః = సూర్యచంద్రులకు బాధకుడాయెను, పర్వణి = పర్వములందు, అముమ్ = ఈ గ్రహమును (రాహువును), ఆవృతిమర్దః = జననమరణపునరావృత్తి నాశకునిగా, అత్రిః = అత్రి మహర్షి, వేద = తెలిసికొనెను.

**తా :** రాహువు భూమి నీడలో లీనమై సూర్యచంద్రులకు బాధకుడాయెను. ఈ గ్రహము పర్వములందు మోక్షకారకుడగునని అత్రి మహర్షి తెలిసికొనెను.

**శ్లో॥ రత్నాని తు యాని శ్రీచన్ద్రముఖాని ।**
**అబ్ధేర్మథనాత్ప్రాక్ స్వర్గే నిహితాని ॥ 53**

**ప్ర :** అబ్ధేః మథనాత్ ప్రాక్ = పాలకడలి చిల్కక ముందు, స్వర్గే = స్వర్గమునందు, నిహితాని = ఉంచబడిన, రత్నాని తు = రత్నములేమో, శ్రీ = లక్ష్మీదేవి, చన్ద్ర =చంద్రుడు, వీని ముఖాని = ముఖములందు, యాని = చేరినవి.

**తా :** పాల్కడలిని చిల్కక ముందు రత్నములు స్వర్గమునందుండెడివి. ఆ తరువాత లక్ష్మీదేవిని, చంద్రుని చేరినవి.

**శ్లో॥ ఇన్ద్రార్పితమాలావజ్ఞాకుపితస్య ।**
**శాపాదతి భీష్మాత్త్వాన్యత్రిసుతస్య ॥ 54**

**ప్ర :** ఇన్ద్ర = ఇంద్రునకు, అర్పిత = (దుర్వాసునిచేత) ప్రసాదించబడిన, మాలా = మాలను, అవజ్ఞా = (తిరస్కరించుటచే కలిగిన) అవమానమువలన, కుపితస్య = కోపించిన, అత్రిసుతస్య = అత్రిమహర్షి కుమారుడగు దుర్వాసునియొక్క, అతిభీష్మాత్ = అతిభయంకరమైన, శాపాత్ = శాపమువలన,

**శ్లో॥ అబ్ధౌ పతితాని ప్రాప్తాన్యృషిసూక్తేః ।**
**నవ్యాని న చాతః పారాశరసూక్తేః ॥ 55**

**ప్ర :** అబ్ధౌ = సముద్రమందు, పతితాని = పడినవి, ఋషిసూక్తేః = ఋషి సూక్తివలన, ప్రాప్తాని = లభించినవి (సముద్రమథనవేళ), పారాశరసూక్తేః = వ్యాసుని సూక్తివలన, అతః = అందువలన, న చ నవ్యాని = నవ్యములు కావు.

**తా :** అత్రి మహర్షి కుమారుడైన దుర్వాసుడు ఇంద్రునకు ప్రసాదించిన రత్నముల నాతడు నిరాకరించగా ఆ మహర్షి శపించగా ఆ రత్నములు సముద్రగర్భమున చేరినవి. అవియే సముద్ర మథన సమయమున బయలు వెడలినవి. క్రొత్తవి కావు. ఈ కథను వ్యాసుడు చెప్పినాడు.

**శ్లో॥ ఆత్రేయ ఉ చన్ద్రోఽప్యబ్ధేర్ముహురాసీత్ ।**
**అబ్జాభిధ ఏవం లక్ష్మ్యాదిరిహాసీత్ ॥ 56**

**ప్ర :** ఆత్రేయ ఉ చన్ద్రః అపి = అత్రి మహర్షి కుమారుడే యైనను చంద్రుడు, అబ్ధేః = సముద్రమునుండి, ముహుః = మరల, ఆసీత్ = కలిగెను, ఏవమ్ = ఇట్లు, లక్ష్మీ+ఆదిః = లక్ష్మీదేవి మొదలైనవి, ఇహ = లోకమున, అబ్జ+అభిధ = సముద్రమున బుట్టినవారు అను పేరు, ఆసీత్ = కలిగెను.

**తా :** చంద్రుడు అత్రిమహర్షి కుమారుడే యైనను, సముద్రమథనవేళ మరల సముద్రమునుండి జన్మించినాడు. అట్లే లక్ష్మీదేవియును. వీరికిట్లు లోకమున పాలసముద్రమున బుట్టినవారని కీర్తి కలిగినది.

**శ్లో॥ అద్యాప్యవతారః కూర్మోఽస్తి హి గోత్ర- ।**
**స్తాదృక్చ వరాహో దంష్ట్రా ధృతగోత్రః ॥ 57**

**ప్ర :** అద్య+అపి = నేడు కూడ, కూర్మః అవతారః = కూర్మావతారము, అస్తి హి = ఉండనే యున్నది, తాదృక్ చ = అట్టిదే, గోత్రః వరాహః = భూమిని రక్షించువాడైన, వరాహః = వరాహము, దంష్ట్రాధృత = కోరల యందు ధరించిన, గోత్రః = భూమిగలవాడు.

**తా :** కూర్మావతారము నేటికిని ఉన్నది. అట్లే భూమిని త్రవ్వునట్టి వరాహమున్నూ అవతారవరాహముగా భూమిని తన కోరలపై నిల్పినదియు ఉన్నది.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ద్వితీయాష్టకే షష్ఠోఽధ్యాయః ।
ఓమ్ శం

శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## ద్వితీయాష్టకము – సప్తమాధ్యాయము

**శ్లో॥ సేమావాత్మసమౌ మత్వా యుయుత్సుః పార్షదౌ ప్రభుః ।**
**శాపం శాన్తకుమారేభ్యః స్వేచ్ఛయాకల్పయద్దివి ॥ 1**

**ప్రతిపదార్థం :** సః ప్రభుః = విష్ణువు, దివి = వైకుంఠమున, యుయుత్సుః = యుద్ధమును కోరినవాడై, ఇమౌ పార్షదౌ = జయవిజయులు అను తన సేవకులను, ఆత్మసమౌ మత్వా = తనతో సమానులుగా తలచి, స్వేచ్ఛయా = తన కోరికచేత, శాన్తకుమారేభ్యః = ప్రకృతిసిద్ధముగ శాంతస్వభావులైనసనక సనందనాదులవలన, శాపమ్ = శాపమును, అకల్పయత్ = కల్పించెను.

**తాత్పర్యం :** ఆ ప్రభువు విష్ణువునకు యుద్ధము చేయవలెనని ఉత్సాహము కలిగి తన సేవకులగు జయవిజయులు తనతో సరితూగు వీరులని భావించి, తానే సంకల్పించి శాంతస్వభావులైన సనక సనందనాది ఋషులవలన ఆ జయవిజయులకు శాపము తగులునట్లు కారణమును కల్పించెను. *

**శ్లో॥ ఏకదాఽవ్యాహతస్వైరగతా విష్ణుం దిదృక్షవః ।**
**సనకాద్యా హి వైకుణ్ఠం ప్రాపుర్భాగవతోత్తమాః ॥ 2**

ప్ర : ఏకదా = ఒకానొకప్పుడు, అవ్యాహత = ఆటంకములేని, స్వైరగతాః = స్వేచ్ఛాసంచారులైన, సనకాద్యాః = సనకసనందనులు, అను, భాగవతోత్తమాః = భగవచ్చింతకులలో ఉత్తములు, విష్ణుమ్ = విష్ణువును, దిదృక్షవః = చూడగోరినవారై, వైకుణ్ఠమ్ =వైకుంఠమునే, ప్రాపుః = వచ్చి చేరిరి.

**తా :** ఒకానొకప్పుడు సనకుడు, సనందనుడు, ఇత్యాది భాగవతశ్రేష్ఠులు విష్ణుదేవుని చూడగోరి వైకుంఠమునకు వచ్చి చేరిరి. వారు స్వేచ్ఛగా, నిరాటంకముగ, ఎక్కడనైన తిరుగ గలవారు.

**శ్లో॥ ప్రవిశన్తో నిషిద్ధాస్తే జయేన విజయేన చ ।**
**క్రుద్ధాః శాపం దదుస్తాభ్యాం భవేతామసురావితి ॥ 3**

**ప్ర :** తే = వారు, ఆ సనకసనందనులు, ప్రవిశన్తః = (వైకుంఠమున) ప్రవేశింపబోవుచుండగా, జయేన విజయేన చ = జయునిచేతను, విజయుని చేతనుకూడ, నిషిద్ధాః = తిరస్కరింపబడినవారై, క్రుద్ధాః = కోపించినవారై, తాభ్యామ్ = జయవిజయులకు, అసురౌ = రాక్షసులు, భవేతామ్ = కండు, ఇతి = అని, శాపమ్ = శాపమును, దదుః = ఇచ్చిరి.

**తా :** ఆ సనకసనందనులు వైకుంఠప్రవేశము చేయుచుండగా, వారిని జయవిజయులు అను ద్వారపాలురు అడ్డగించిరి. దానిచే కోపించి వారు ఆ ద్వారపాలురను రాక్షసులు కండని శపించిరి. *

**శ్లో॥ తాభ్యాం క్షమాపితాస్తే తు విష్ణునా చ పునర్జగుః ।**
**త్రిజన్మాన్తే పునర్విష్ణుప్రసాదాదిహ వాం గతిః ॥ 4**

**ప్ర :** తాభ్యామ్ = జయవిజయులచేత, విష్ణునా చ = విష్ణువు చేతను, తే = ఆ సనకసనందనులు, క్షమాపితాః = క్షమింపబడినవారై, పునః = మరల, జగుః = వెడలిరి; త్రిజన్మ+అన్తే = మూడు జన్మలు గడువగా, విష్ణుప్రసాదాత్ = విష్ణువు అనుగ్రహమువలన, పునః = మరల, ఇహ = ఇక్కడకు (వైకుంఠమునకు), వామ్ =ఆ జయవిజయులకు, గతిః = ప్రవేశము.

**తా :** సనకసనందనుల తొందరపాటును జయవిజయులును విష్ణువును క్షమించగా, వారు మరలిపోయిరి. మూడు జన్మల తరువాత విష్ణువు అనుగ్రహమున ఆ జయవిజయులకు శాపావసానము కాగా మరల వైకుంఠప్రవేశము కల్గును.

**శ్లో॥ తతస్తౌ కశ్యపాద్దిత్యాం క్రూరౌ జాతౌ సురద్విషౌ ।**
**సన్ధ్యాయాం రతియోగాచ్చ హఠాద్దిత్యాః ఫలం త్విదమ్ ॥ 5**

**ప్ర :** తతః = ఆ కారణమున, తౌ = వారిద్దరును, హఠాత్ = అకస్మాత్తుగా, సంధ్యాయామ్ = సంధ్యాసమయమున, దిత్యాః = దితియొక్క, రతియోగాత్ = రతి యందలి ఆసక్తివలన, దిత్యామ్ = దితియందు, కశ్యపాత్ = కశ్యపునివలన, ఇదం ఫలం తు = ఈ ఫలరూపముగా, సురద్విషౌ = దేవతల శత్రువులైన, క్రూరౌ = క్రూరులుగా, జాతౌ చ = జన్మించిరి.

**తా :** ఆ శాపకారణముగా, జయవిజయులు కశ్యపునివలన దితియందు క్రూరులై, రాక్షసులై జన్మించిరి. ఇది దితికి హఠాత్తుగా సంధ్యాసమయమున సంభోగేచ్ఛకలుగుటవలన కలిగిన ఫలము.

**శ్లో॥ దిత్యాఽనుతప్తయాప్యేష సంస్తుతః కశ్యపోఽబ్రవీత్ ।**
**పుత్రౌ విష్ణోః సద్గతిగౌ పౌత్రస్తే వైష్ణవో భవేత్ ॥ 6**

**ప్ర :** అనుతప్తయా అపి దిత్యా = పశ్చాత్తాపము జెందినదియైన దితిచే, సంస్తుతః = ప్రార్థింప బడినవాడగు, ఏషః కశ్యపః = ఆ కశ్యపమహర్షి, అబ్రవీత్ = ఇట్లనెను, తే = నీ యొక్క, పుత్రౌ = కుమారులిద్దరును, విష్ణోః = విష్ణువుదైన, సత్+గతి–గౌ = ఉత్తమపదమును చేరిన వారగుదురు, పౌత్రః = మనుమడు, వైష్ణవః = విష్ణుభక్తుడుగా, భవేత్ = అగును.

**తా :** దితి పశ్చాత్తాపము జెంది ప్రార్థింపగా కశ్యపుడిట్లనినాడు : ఈ చర్య కారణముగా కలిగిన నీ కుమారులిర్వురును విష్ణుపదమును చేరుదురు; నీ మనుమడు విష్ణుభక్తుడగును.

**శ్లో॥ జాతౌ హిరణ్యకశిపుహిరణ్యాక్షాభిధౌ తతః ।**
**త్రిలోకీం లోకపాలాంశ్చ పీడయామాసతుర్భృశమ్ ॥ 7**

**ప్ర :** తతః = ఆ కశ్యపవచనానుసారముగా, హిరణ్యకశిపు-హిరణ్యాక్ష+అభిధౌ = హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు అను పేర్లుగల వారిద్దరు, జాతౌ = జన్మించిరి, త్రిలోకీమ్ = మూడు లోకములను, లోకపాలాన్ చ = లోకపాలకులను, భృశమ్ = మిక్కిలిగా, పీడయామాసతుః = పీడించిరి.

**తా :** ఆ కారణముగా హిరణ్యకశిపుహిరణ్యాక్షులు జన్మించిరి. వారు త్రిలోకవాసులను, పాలకులను మిక్కిలి బాధించిరి.

**శ్లో॥ విధిం పరాజితా దేవాః శరణం జగ్మురాతురాః ।**
**చిన్తావిష్టస్య నాసాతః కస్య పోత్రీ తదాపతత్ ॥ 8**

**ప్ర :** పరాజితాః దేవాః = ఓడిన దేవతలు, ఆతురాః = విచారగ్రస్తులై, విధిమ్ = బ్రహ్మను, శరణం జగ్ముః = శరణు పొందిరి, చిన్తావిష్టస్య కస్య = చింతితుడైన బ్రహ్మయొక్క, నాసాతః = ముక్కురంధ్రములనుండి, తదా = అప్పుడు, పోత్రీ = వరాహము, అపతత్ = బయల్పడెను.

**తా :** హిరణ్యాక్షహిరణ్యకశిపులకు ఓడినవారై దేవతలు బ్రహ్మను శరణు వేడిరి. చిన్తాక్రాంతుడైన బ్రహ్మ ముక్కుపుటమునుండి అప్పుడొక వరాహము బయల్పడెను.

**శ్లో॥ యజ్ఞవారాహమతులం రూపం దృష్ట్వాఽఖిలాః సురాః ।**
**అజోఽయమితి మత్వా తం సూక్తైః సన్తుష్టువుర్భృశమ్ ॥ 9**

**ప్ర :** అఖిలాః సురాః = దేవతలందఱును, అతులం రూపమ్ = అసమానరూపముగల, యజ్ఞవరాహమ్ = యజ్ఞవరాహమూర్తిని, దృష్ట్వా = చూచి, అయమ్ = ఈ వరాహమూర్తి, అజః = విష్ణువు, ఇతి మత్వా = అని తలచి, తమ్ = వానిని, సూక్తైః = సూక్తములతో, భృశమ్ = మిక్కిలిగా, సంతుష్టువుః = సంతోషపెట్టిరి.

**తా :** దేవతలందఱు బ్రహ్మ నాసికనుండి పుట్టిన ఆ వరాహముయొక్క అసమానతేజస్వితను చూచి, విష్ణురూపముగ భావించి, వేదసూక్తములతో మిక్కిలి సంస్తుతించిరి.

**శ్లో॥ ఈశేఽనీశత్వమాపన్నే విముఖే చ చతుర్ముఖే ।**
**మగ్నాస్తౌషీత్క్ష్మా తదాపి స్తబ్ధరోమాభవద్ధరిః ॥ 10**

**ప్ర :** ఈశే అనీశత్వం ఆపన్నే = శంకరుడు తన ప్రభుతను కోల్పడినవాడు కాగా, చతుర్ముఖే విముఖే చ = చతుర్ముఖ బ్రహ్మయు (అసమర్థత వలన), పెడమోమై ఊరకుండగా, క్ష్మా =

భూదేవి, మగ్నా = (తనను ఆధారముగా చేసికొనియున్న జలము నందే) తాను మునిగినదై, అస్తౌషీత్ = స్తుతించెను, తదా అపి = అప్పుడే, హరిః = విష్ణువు, స్తబ్ధరోమా = రోమాంచితముగా, అభవత్ = ఆయెను.

**తా :** శంకరుడును, బ్రహ్మయును అసమర్థులు కాగా, తనను ఆదుకొనువారు లేక భూమి జలమున మున్గుచు, విష్ణువును ప్రార్థించెను. అప్పుడు విష్ణువునకు రోమాంచితమైనది, అనగా, యజ్ఞవరాహరూపునకున్నూ రోమాంచితమైనదని భావము.

**శ్లో॥ దీనానాథపతిస్తుష్టో దీనాం గాం దంష్ట్రయోద్ధరన్ ।**
**తద్దేవతాహరం క్రూరం హిరణ్యాక్షం దదార హ ॥ 11**

**ప్ర :** దీనా నాథపతిః = దీనులకు దిక్కయిన స్వామి, తుష్టః = సంతోషించి, దీనాం గామ్ = దీనయైన భూమిని, దంష్ట్రయా+ఉద్ధరన్ = తన కోరపై పైకెత్తి పట్టుచు, హ = ఔరా!, తత్+దేవతాహరమ్ = భూమి కధిష్ఠానదేవతయైన భూదేవిని హరించువాడైన, క్రూరమ్ = క్రూరుడైన, హిరణ్యాక్షమ్ = హిరణ్యాక్షుడను దానవుని, దదార = చీల్చివేసెను.

**తా :** భూదేవి ప్రార్థనతో సంతోషించి దీనులకు దిక్కయిన దేవుడు దీనురాలైన భూదేవిని తన కోరపై నిల్పి, తదపహర్తయగు క్రూరదైత్యుని హిరణ్యాక్షుని సంహరించెను. వరాహమూర్తి ఉద్ధరించినది జడపదార్థరూపమైన భూగ్రహమును మాత్రమే కాదని, ఆ పదార్థము నధిష్ఠించిన దేవతనని భావము.

**శ్లో॥ సంస్థాప్య పూర్వవద్భూమిం తదాధారో యయౌ శమమ్ ।**
**క్రుద్ధోఽనుజే హతేఽథాన్యో ద్యులోకమజయత్ క్షణాత్ ॥ 12**

**ప్ర :** భూమిమ్ = భూమిని, పూర్వవత్ = పూర్వమువలె, సంస్థాప్య = ప్రతిష్ఠించి, తద్+ఆధారః = దాని ఆధారము, శమం యయౌ = శాంతించెను, అథ = అంతట, అన్యః = మరియొకడైన హిరణ్యకశిపుడు, అనుజే హతే = తమ్ముడైన హిరణ్యాక్షుడు మరణించగా, క్రుద్ధః = కోపించిన వాడై, క్షణాత్ = క్షణములో, ద్యులోకమ్ = స్వర్గలోకమును, అజయత్ = జయించెను.

**తా :** భూమిని రక్షించి, తానే ఆ భూమి కాధారమై శ్రీహరి శాంతించెను. కాని హిరణ్యాక్షుని మరణమువలన కుపితుడైన హిరణ్యకశిపుడు ఱెప్పపాటు కాలములో స్వర్గమును జయించెను.

**శ్లో॥ అన్తర్బహిర్దివా నక్తం దేవాన్న మృగాచ్చ నుః ।**
**సజీవాన్నాపి నిర్జీవాదవధ్యత్వం గతో విధేః ॥ 13**

**ప్ర :** అన్తః బహిః = లోపల వెలుపల, దివా నక్తమ్ = పగలు, రాత్రి, న = కాదు, దేవాత్ = దేవునివలన, మృగాత్ చ = జంతువువలన, న = కాదు, నుః = మనుష్యునివలన, సజీవాత్ = ప్రాణముగలదానివలన, నిర్జీవాత్ = ప్రాణములేని దానివలన, అపి న = కూడ కాదు, (వీని

అన్నింటివలనను) అవధ్యత్వమ్ = మరణము లేకుండుటను, విధేః = బ్రహ్మనుండి (వరముగా), గతః = పొందినవాడాయెను.

**తా :** ఆ హిరణ్యకశిపుడు, లోపలగాని, వెలుపల గాని, పవలుగాని, రాత్రిగాని, దేవతలవలనగాని, జంతువుల వలనగాని, మనుష్యులవలనగాని, ప్రాణుల వలనగాని, జడపదార్థముల వలనగాని, తనకు మరణము లేకుండునట్లుగా బ్రహ్మనుండి వరమును పొందినాడు.

**శ్లో॥ తద్భార్యా గర్భిణీ జాతా కయా ధూర్భాగ్యవత్యథ ।**
**తాం లబ్ధ్వాన్తర ఇన్ద్రోఽపి ధృత్వా హన్తుం సముద్యతః ॥ 14**

**ప్ర :** అథ = అంతట, భాగ్యవతీ తత్+భార్యా = భాగ్యవతియైన ఆ హిరణ్యకశిపుని భార్య, గర్భిణీ జాతా = గర్భిణి యాయెను, ఇన్ద్రః అపి = ఇంద్రుడున్ను, అన్తరః = (హిరణ్యకశిపుడు తపశ్చర్యలో నున్న) ఈ మధ్యకాలమున, కయా ధూః ధృత్వా = ఎవ్వతె చేత గర్భభారము వహింపబడుచున్నదో, తాం లబ్ధ్వా = ఆమెను చేరి, హన్తుమ్ = చంపుటకు, సముద్యతః = సిద్ధమాయెను.

**తా :** అంతట హిరణ్యకశిపుడు తపశ్చర్యలో నున్న సమయమున గర్భవతియైన నిండు చూలాలుగనున్న వాని భార్యను బందీని చేసి, ఇంద్రుడామెను చంపబోయెను.

**శ్లో॥ తదైవ నారదోఽభ్యేత్య గర్భోఽయం వైష్ణవస్త్వయా ।**
**స్వక్షేమకృన్న హన్తవ్య ఇత్యూచే సోఽపి తాం జహౌ ॥ 15**

**ప్ర :** తదా+ఏవ = ఆ సమయముననే, నారదః = నారదుడు, అభ్యేత్య = తనంత తానై వచ్చి, అయం గర్భః = ఈమె గర్భమునందున్న శిశువు, వైష్ణవః = విష్ణుభక్తుడు, స్వక్షేమ కృత్ = నీకు క్షేమమును కలిగించువాడు, త్వయా = నీ చేత, న హన్తవ్యః = చంపబడదగిన వాడు కాడు, ఇతి = అని, ఊచే = పలికెను, సః అపి = ఆ ఇంద్రుడున్నూ, తామ్ = ఆమెను, జహౌ = విడచెను.

**తా :** ఆ సమయమునకు నారదుడు తనంత తా వచ్చి, ఆమె గర్భస్థశిశువు నీకు క్షేమంకరుడైన విష్ణుభక్తుడు, చంపదగడు అని బోధించగా, ఇంద్రుడు ఆమెను విడచి వెడలెను.

**శ్లో॥ వైష్ణవోత్తమసామర్థ్యం కిం వాచ్యం గర్భగోఽప్యహో! ।**
**ఆదదే వైష్ణవీం దీక్షాం గర్భోఽప్యసురవీర్యజః ॥ 16**

**ప్ర :** వైష్ణవోత్తమసామర్థ్యమ్ = ఉత్తమవైష్ణవుని శక్తి, కిం వాచ్యమ్ = ఏమి చెప్పవచ్చును?!, అహో = ఔరా!, గర్భగః అపి = గర్భస్థుడైనను, గర్భః = గర్భము, అసురవీర్యజః అపి = రాక్షసుని వీర్యము వలన కలిగినదైనను, వైష్ణవీం దీక్షామ్ = వైష్ణవదీక్షను, ఆదదే = స్వీకరించెను.

**తా :** అట్లు ఇంద్రుడు విడచి వెళ్లిన హిరణ్యకశిపుని భార్య గర్భమున గల శిశువు, రాక్షస వీర్యమున యేర్పడినదైనను, మాతృగర్భమునుండియే నారదునివలన వైష్ణవదీక్షను స్వీకరించెను. ఉత్తమవైష్ణవపు శక్తి ఎంతయని వర్ణింపవచ్చును! ఔరా! యని పించకుండునా?!

**శ్లో॥ తతః సా సుషువే పుత్త్రం మహాభాగవతం శుభమ్ ।**
**స్వపితుర్జాతమాత్రేణ యేనాస్యం కలుషీకృతమ్ ॥ 17**

**ప్ర :** తతః = అందువలన, సా = ఆమె, హిరణ్యకశిపుని భార్య, శుభమ్ = శుభము కలిగించువాడైన, మహాభాగవతం పుత్రమ్ = మహాభగవద్భక్తుడైన కుమారుని, యేన జాతమాత్రేణ = ఎవని పుట్టుక మాత్రమున, స్వపితుః ఆస్యమ్ = తన తండ్రి ముఖము, కలుషీకృతమ్ = కాంతిహీనమైనదో, (అట్టివానిని), సుషువే = ప్రసవించెను.

**తా :** అందువలన హిరణ్యకశిపుని భార్య గొప్ప భగవద్భక్తుడు, శుభకరుడు అయిన కుమారుని ప్రసవించినది. తన కుమారుడు విష్ణుభక్తుడగుటచే విష్ణుద్వేషియైన హిరణ్యకశిపుని ముఖము నిస్తేజమైనది.

**శ్లో॥ తతః ప్రహ్లాదనామాసౌ వవృధేఽరిభయఙ్కరః ।**
**కాలే కావ్యేనోపనీతః శిక్షితోఽప్యభజద్ధరిమ్ ॥ 18**

**ప్ర :** తతః = అందువలన, అసౌ ప్రహ్లాదనామ = ఈ ప్రహ్లాదుడని పేరుగలవాడు, కాలే = సరియైన సమయమున, కావ్యేన = శుక్రుని కుమారుడగు శణ్డామార్కుడనువానిచే, ఉపనీతః = ఉపనయనసంస్కారము గలవాడై, శిక్షితః అపి = బోధింపబడినవాడైనను, హరిమ్ = విష్ణువును, అభజత్ = సేవించెను, అరిభయంకరః = శత్రుభయంకరుడై, వవృధే = వృద్ధిజెందెను.

**తా :** అందువలన ఈ ప్రహ్లాదకుమారుడు సకాలమున శుక్రపుత్రుడగు శండా(చండా)మార్కుని వలన ఉపనీతుడై శిక్షితుడై కూడ, విష్ణుభక్తుడై, శత్రుభయంకరుడుగా వర్ధిల్లినాడు.

**శ్లో॥ తర్జనాదరణాద్యైః స న బిభేతీతి తత్పితా ।**
**శ్రుత్వా విషీదంశ్చాన్యేషు వైష్ణవాచారశిక్షణాత్ ॥ 19**

**ప్ర :** తర్జన+ఆదరణ+ఆద్యైః = భయపెట్టుట, బుజ్జగించుట మొదలగు ఉపాయముల చేత, సః = ఆ ప్రహ్లాదుడు, న బిభేతి = భయపడడు, ఇతి = అని, తత్ పితా = వాని తండ్రి, హిరణ్యకశిపుడు, శ్రుత్వా = విని, అన్యేషు = ఇతర దైత్యబాలురందు, వైష్ణవ+ఆచార–శిక్షణాత్ = వైష్ణవాచారమున శిక్షణ నిచ్చుటవలన, విషీదన్ చ = విచారము నందు చుండియు,

**శ్లో॥ స్వశత్రుపక్షపాతీతి పుత్త్రం మత్వాఽసురాధమః ।**
**విహాయ పుత్త్రసంబన్ధం తం నిహన్తుం మనో దధౌ ॥ 20**

**ప్ర :** స్వశత్రు పక్షపాతి+ఇతి = తన శత్రువును అభిమానించువాడు అని, అసుర+అధమః = రాక్షసులలో అల్పబుద్ధిగలవాడగు హిరణ్యకశిపుడు, పుత్రమ్ = కుమారుని ప్రహ్లాదుని, మత్వా = తలంచి, పుత్త్రసంబంధమ్ = పుత్రుడన్న వాత్సల్యమును, విహాయ = విడచి, తమ్ = వానిని, నిహన్తుమ్ = చంపుటకు, మనః దధౌ = నిశ్చయించెను.

**తా :** భయపెట్టిన భయపడడు, బుజ్జగించినను మానడు, యే ఉపాయముచేతను ప్రహ్లాదుని బుద్ధి మారకపోగా, ఇతర రాక్షసబాలురకు గూడ వైష్ణవమును బోధించుచుండుట తెలిసి హిరణ్యకశిపుడు చింతాక్రాంతుడై, తనకుమారుడు తన శత్రువగు విష్ణువును భజించుట వలన పుత్త్రునిపై గల వాత్సల్యమును విడచి వానిని చంపుటకు కృతనిశ్చయుడాయెను.

**శ్లో॥ భృగుపాతాగ్నితోయాద్యైర్మృత్యవే కల్పితోఽపి ।**
**సర్వాధీశమహావిష్ణుపదసేవీ మమార నో ॥ 21**

**ప్ర :** భృగుపాత = పర్వతశిఖరమునుండి పడవేసి, అగ్ని = అగ్నివలన, తోయ = జలము, ఆద్యైః = మొదలగువానిచేత, మృత్యవే కల్పితః అపి = మృత్యుముఖమున ద్రోచినను గూడ, సః = ఆ ప్రహ్లాదుడు, సర్వ+అధీశ = సమస్తమునకు ప్రభువైన, మహావిష్ణుపదసేవీ = మహావిష్ణువును సేవించువాడై, నో మమార = మరణించలేదు.

**తా :** పర్వతశిఖరమునుండి పడద్రోచినను, అగ్నిచే, జలముచే, ఇత్యాదులచే మృత్యువును కల్పించినను, ఆ ప్రహ్లాదుడు మరణించక మహావిష్ణుపాదములనే సేవించుచుండెను.

**శ్లో॥ తదా తం ప్రాహ రే! దుష్ట! లోకశాస్తుర్మమాగ్రతః ।**
**కిం బలో నిర్భయోఽస్యేతం ధ్యాయసే స క్వ తిష్ఠతి ॥ 22**

**ప్ర :** తదా = అప్పుడు, తం ప్రాహ = వానికిట్లనెను, రే దుష్ట! = ఓరి దుష్టుడా!, లోకశాస్తుః = లోకనియంతనైన, మమ అగ్రతః = నా సమక్షమున, కిం బలః = ఏ బలము గలవాడవై, నిర్భయః అసి = భయములేనివాడవగుచున్నావు? ఏతమ్ = ఎవ్వానిని, ధ్యాయసే = ధ్యానించుచున్నావో, సః = వాడు, క్వ తిష్ఠతి = ఎక్కడ నున్నవాడు?

**తా :** అప్పుడాతడిట్లనెను : ఓరీ! లోకశాసకుడనైన నా ముంగట యే బలము చూచికొని నిర్భయముగ నున్నావు? నీవు యెవ్వానిని ధ్యానించుచుంటివో వాడు ఎక్కడనున్నాడు? *

**శ్లో॥ శ్రుత్వాపి పరుషం వాక్యం ప్రహ్లాదో భయవర్జితః ।**
**సర్వభూతసమః ప్రాహ పితరం చిన్తయన్ హరిమ్ ॥ 23**

**ప్ర :** పరుషం వాక్యమ్ = కఠినమైన మాటలను, శ్రుత్వా అపి = వినియును, భయవర్జితః = భయములేనివాడై, ప్రహ్లాదః = ప్రహ్లాదుడు, హరిం చిన్తయన్ = విష్ణువును ధ్యానించుచు, సర్వభూతసమః = సమస్తచరాచరములందు సమభావము గలవాడై, పితరం ప్రాహ = తండ్రి కిట్లనెను.

**తా :** తండ్రి కఠినముగా మాట్లాడినను, భయపడక, ప్రహ్లాదుడు విష్ణుధ్యానము చేయుచు, చరాచరములన్నిటిని సమముగ భావించుచు, తండ్రితో నిట్లనెను.

**శ్లో॥ బలం బలవతాం విష్ణుస్తం వినా కస్య కిం బలమ్ ।**
**స సర్వత్ర స్థితోఽధీశో యం లబ్ధ్వాఽస్య కుతో భయమ్ ॥ 24**

**ప్ర :** బలవతాం బలం విష్ణుః = బలవంతుల బలము విష్ణువు, తం వినా = ఆ విష్ణువు లేక, కస్య కిం బలమ్ = ఎవనికైన యేమి బలము? సః = ఆ విష్ణువు, సర్వత్ర స్థితః = అన్నితావుల నున్నాడు, అధీశః = అధిపతి యాతడు, యం లబ్ధ్వా = ఎవనిని పొంది, అస్య = వానికి, కుతః భయమ్ = భయమెందుకు?

**తా :** బలవంతుల బలమే విష్ణువు. ఆతడు లేకున్న బలవంతుడెవడు? ఆతడే సర్వమునకు ప్రభువు. సర్వత్ర ఉన్నాడు. వాని ప్రాపు గలవానికి భయమేముండును?

**శ్లో॥ యది సర్వగతోఽస్త్యేష స్తమ్భేఽస్మిన్విద్యతే న వా ।**
**ఇత్యుక్తో జనకేనాసావత్రాప్యస్తీత్యువాచ తమ్ ॥ 25**

**ప్ర :** యది సర్వగతః = అన్నిట ఉన్నవాడైతే, ఏషః = వాడు, అస్మిన్ స్తమ్భే = ఈ స్తంభములో, విద్యతే న వా = ఉన్నాడా లేదా, ఇతి జనకేన ఉక్తః = అని తండ్రిచే అడుగబడిన వాడై, అసౌ = ఆతడు, అత్ర అపి అస్తి = అక్కడ కూడ ఉన్నాడు, ఇతి = అని, తమ్ = వానితో, ఉవాచ = పలికెను.

**తా :** అన్నిట ఉన్నవాడు ఈ స్తంభమున ఉన్నాడా లేడా అని తండ్రి యడుగగా, ఔను, ఉన్నాడని సమాధానమిచ్చినాడు ప్రహ్లాదుడు.

**శ్లో॥ తతః క్రుద్ధస్తదా దైత్యః పదా స్తమ్భం జఘాన హ! ।**
**తదాఽవిరాస భృత్యోక్తమృతం కర్తుం తతో హరిః ॥ 26**

**ప్ర :** తతః = ఆ సమాధానమువలన, క్రుద్ధః దైత్యః = కోపించిన రక్కసుడు, తదా = అప్పుడు, పదా = పాదముతో, స్తంభమ్ = స్తంభమును, జఘాన = తన్నెను, హ = ఏమి ఆశ్చర్యము!, తదా = అప్పుడు, భృత్య+ఉక్తమ్ = దాసుని పలుకును, ఋతం కర్తుమ్ = నిజము చేయుటకు, తతః = ఆ స్తంభమునుండి, హరిః = విష్ణువు, ఆవిః+ఆస = అవతరించెను.

**శ్లో॥ సింహాస్యం మనుజాకారం కరాలం తం నఖాయుధమ్ ।**
**చిత్రం దృష్ట్వాఽసురస్తద్భా పిహితాక్షోఽప్యయుధ్యత ॥ 27**

**ప్ర :** కరాలం సింహ+ఆస్యమ్ = భయంకరముగ తెరచియున్న సింహపుముఖము, మనుజ+ఆకారమ్ = మనుష్యుని రూపము, నఖ+ఆయుధమ్ = గోళ్ళు ఆయుధములుగా గలవానిని, తమ్ = ఆ, చిత్రమ్ = విచిత్రమూర్తిని, దృష్ట్వా = చూచి, అసురః = రాక్షసుడు హిరణ్యకశిపుడు, తత్ భా పిహిత+అక్షః అపి = వాని కాంతిచే మూతబడిన కన్నులు గలవాడైనను, అయుధ్యత = పోరాడెను.

**తా :** తెఱచియున్న భయంకరమైన సింహపు ముఖము, మానుష రూపము గల ఆ విచిత్ర మూర్తిని, గోళ్ళు ఆయుధములుగా గలవానిని చూచి ఆ రక్కసుడు, తన కన్నులు ఆ నృసింహుని కాంతికి మూతలుబడిన కన్నులతోనే, యుద్ధము చేసెను.

**శ్లో॥ హరిః ఖిన్నానృషీన్దేవాన్ భృత్యం చ ప్రేక్ష్య పీడితమ్ ।**
**వరదోక్త్యవిరోధాత్తం దధౌ హన్తుమపి చ్యుతమ్ ॥ 28**

**ప్ర :** హరిః = విష్ణువు, ఖిన్నాన్ ఋషీన్ దేవాన్ = దుఃఖితులైన ఋషులను, దేవతలను, పీడితం భృత్యం చ = బాధపడుచున్న భక్తుని గూడ, ప్రేక్ష్య = చూచి, చ్యుతం అపి = విడచిపెట్టబడినవాడైనను, వరద+ఉక్తి+అవిరోధ+ఆత్తమ్ = వరమిచ్చిన బ్రహ్మ మాటకు విరోధము కానట్లుగా, హన్తుమ్ = చంపుటకు, దధౌ = ధరించెను, పూనుకొనెను.

**తా :** విష్ణువు నరసింహరూపమున హిరణ్యకశిపుని పట్టెను. కాని చుట్టు గల ఋషులు, దేవతలు దిగులు చెందుటను చూచి, తన భక్తుడు ప్రహ్లాదుడు కూడ బాధతోనుండుట గమనించి, వానిని విడచివైచెను. అంతలో, అది సరికాదని, బ్రహ్మ వరమునకు భంగము కలుగని విధముగ రక్కసుని చంపుటకు పూనుకొనెను.

**శ్లో॥ నఖైర్దదార కృత్వోర్వోస్తద్వక్షో ద్వారమధ్యతః ।**
**సన్ధ్యాయాం స దధౌ చణ్డహస్తదన్త్రం మాల్యవద్గలే ॥ 29**

**ప్ర :** సంధ్యాయామ్ = సంధ్యాసమయమున, ద్వారమధ్యతః = వాకిటి కడపపై, ఊర్వోః కృత్వా = తొడలపై నుంచికొని, నఖైః = గోళ్ళతో, తత్+వక్షః = వాని ఉరమును, దదార = చీల్చివేసెను, సః = ఆ నృసింహమూర్తి, చండహస్తదన్త్రమ్ = భయంకరమైన హస్తములతో చీల్చిన ప్రేవులను, గలే = కంఠమున, మాల్యవత్ = పూదండవలె, దధౌ = ధరించెను.

**తా :** సంధ్యవేల వాకిటి గడపపై కూర్చొని తొడలపై నుంచికొని గోళ్ళతో ఆ రాక్షసుని ఉరమును చీల్చి, నృసింహమూర్తి ఆ ప్రేవులను పూదండవలె తన మెడలో వేసికొనెను.

**శ్లో॥ హాహాకృతం చ తత్సైన్యం జఘాన వవృషుః సురాః ।**
**పుష్పాణ్యప్సరసోఽన్యే చ ననృతుశ్చ జగుస్తదా ॥ 30**

**ప్ర :** హాహాకృతం తత్ సైన్యం చ = హాహాకారములు చేసిన ఆ రాక్షసుని సైన్యమును గూడ, జఘాన = చంపెను, సురాః = దేవతలు, పుష్పాణి వవృషుః = పువ్వులను కురిసిరి, అప్సరసః = అప్సరసలు, ననృతుః = నృత్యము చేసిరి, చ = మరియు, అన్యే = గంధర్వులు, తదా = అప్పుడు, జగుః చ = పాటలున్నూ పాడిరి.

**తా :** హిరణ్యకశిపుని సైన్యము హాహాకారములు చేసిరి. వారినిగూడ నృసింహుడు వధించెను. అప్పుడు దేవతలు పుష్పవృష్టి కురిసిరి, అప్సరసలు నాట్యమాడిరి, గంధర్వులు పాడిరి.

**శ్లో॥ అదృష్టపూర్వచిత్రోగ్రరూపం శేకుర్న వీక్షితుమ్ ।**
**దృష్టకామా అపి సురాః శ్రీశ్చ భీమోచ్చనిఃస్వనమ్ ॥ 31**

**ప్ర :** భీమ+ఉచ్చనిఃస్వనమ్ = భయంకరముగ బిగ్గరగా అరచుచున్న, అదృష్టపూర్వ = ముందెన్నడు చూడబడని, చిత్ర = విచిత్రమైన, ఉగ్రరూపమ్ = క్రోధమూర్తిని, దృష్టకామాః అపి = చూడగోరినవారయ్యును, సురాః = దేవతలు, శ్రీః చ = లక్ష్మీదేవియున్ను, వీక్షితుమ్ = చూచుటకు, న శేకుః = శక్తిలేని వారైరి.

**తా :** భయంకరముగా వికటముగా అరచుచున్న నరసింహుని విచిత్రమైన క్రోధమూర్తిని, చూడవలెనని కోరిక యున్నను, దేవతలు శ్రీదేవియు చూడలేకపోయిరి. *

**శ్లో॥ తైః ప్రోషితోఽథ ప్రహ్లాదః సటాక్షిప్తభముగ్రగమ్ ।**
**దృష్ట్వా కరాలమప్యాహ నిర్భయో నృహరిం నమన్ ॥ 32**

**ప్ర :** తైః = ఆ దేవతలచే, శ్రీదేవిచే, ప్రోషితః ప్రహ్లాదః = దూరము చేయబడిన ప్రహ్లాదుడు, అథ = అంతట, సటాక్షిప్తభమ్ = జటలలో దాచబడిన నక్షత్రములు గల, ఉగ్రగం కరాలం అపి = భయంకరముగ నోరు తెరచియున్న వాడైనను, నృహరిమ్ = నృసింహుని, దృష్ట్వా = చూచి, నిర్భయః = భయములేనివాడై, నమన్ = నమస్కరించుచు, ఆహ = పలికెను.

**తా :** వారిచే దూరముగ నుంచబడిన ప్రహ్లాదుడు అంతట తన జడలలో నక్షత్రములు మెఱయగా భయంకరముగ నోరు తెరచియున్న నృసింహమూర్తిని చూచి నిర్భయముగా నమస్కరించి ఇట్లనెను.

**శ్లో॥ హరే! ప్రశమమేహ్యద్య నాయం కల్ప ఉపస్థితః ।**
**స్వభక్తాఞ్ఛక్రతో గుప్తాన్ కృపయేక్షితుమర్హసి ॥ 33**

**ప్ర :** హరే = ఓ శ్రీహరీ!, అద్య = నేడు, న అయం కల్పః ఉపస్థితః = ఇది ప్రలయసమయము కానిది, ప్రశమమ్ ఏహి = శాంతుడవు కమ్ము, స్వభక్తాన్ = నీ భక్తులను, శక్రతః గుప్తాన్ = ఇంద్రునివలన రక్షింపబడువారిని, కృపయా = దయతో, ఈక్షితుమ్ అర్హసి = చూడదగుదువు.

**తా :** ఓ శ్రీహరీ! శాంతించుము. ఇది ప్రలయవేళ కాదు. ఇంద్రుని రక్షణలోనున్న నీ భక్తులను దయ జూడుము.

**శ్లో॥ త్రిలోకశీర్షరోగోఽయం హతో దిష్ట్యా న తే ప్రభో! ।**
**దుఃసహః సోఽపి పాపోఽద్య సాక్షాన్ముక్తః కరేణ తే ॥ 34**

**ప్ర :** ప్రభో = ఓ స్వామీ!, అద్య = నేడు, అయం త్రిలోకశీర్షరోగః దుస్సహః = సహించరాని యీ ముల్లోకముల శిరోభారమైన వాడు, తే = నీకై, న హతః = చంపబడలేదు, సః పాపః అపి = ఆతడు పాపియే యైనను, దిష్ట్యా = భాగ్యవశమున, తే కరేణ = నీ చేతితో, సాక్షాత్ = అందరు చూచుచుండగా, ముక్తః = మోక్షమును పొందినాడు.

**తా :** ఓ ప్రభూ! ముల్లోకములకు శిరోవేదనగా పరిణమించిన యీ దుర్భరపాపి, నీకై తపించినవాడు కాకున్నను, భాగ్యవశమున నేడు నీచే హతుడై మోక్షమును పొందినాడు.

**శ్లో॥ పామరేఽనుగ్రహే యోఽసౌ మన్యే ప్రాక్పుణ్యరాశిజః ।**
**అన్యథేశాస్య పాపస్య మోక్షశఙ్కా కుతో హరే! ॥ 35**

**ప్ర :** (హే) ఈశ! = ఓ పరమేశ్వరా!, (హే) హరే! = ఓ శ్రీహరీ!, పామరే అసౌ అనుగ్రహే = అజ్ఞానియైన ఈతడు అనుగ్రహింపబడగా, ప్రాక్ పుణ్యరాశిజః = పూర్వపుణ్యరాశి కారణమని, మన్యే = తలతును, అన్యథా = వేరొక విధమున, అస్య పాపస్య = వీని పాపమునకు, మోక్ష శఙ్కా = మోక్షము కలుగు అవకాశము, కుతః = ఏ కారణము వలన (కలుగును?).

**తా :** ఓ ఈశ్వరా! శ్రీహరీ! ఈ అజ్ఞాని నీచే మరణించి ముక్తుడైనాడనగా, దానికి కారణము ఈతని పూర్వపుణ్యము గొప్పదై యుండుటే అనవలెను. కాకున్న వీని పాపమునకు మోక్షప్రసంగ మెట్లు పొసగును?

**శ్లో॥ కృపాలో తే నమోఽద్య త్వం ప్రసన్నో భవ సువ్రత ।**
**దేవాన్పూర్వవదాశ్వాస్య స్వాధికారే నియోజయ ॥ 36**

**ప్ర :** (హే) కృపాలో = ఓ దయామయా!, తే = నీకు, నమః = నమస్కారము, త్వమ్ = నీవు, (హే) సువ్రత = భక్తపాలనవ్రతము గలవాడా!, ప్రసన్నః భవ = ప్రసన్నుడవు కమ్ము, అద్య = నేడు, దేవాన్ = దేవతలను, పూర్వవత్ = మునపటి వలె, స్వ+అధికారే = తమ అధికారమున, నియోజయ = నిల్పుము.

**తా :** ఓ దయామయా! భక్తపాలనదీక్షాదక్షా! నమస్కారము, శాంతించుము. నేడు దేవతలను మునుపటివలె ఆదరించి వారివారి స్థానములలో నిల్పుము.

**శ్లో॥ ఏవం భక్తార్థితో విష్ణుర్యయౌ శాన్తిం తదామరాః ।**
**తస్మై నత్వా తదాజ్ఞప్తాః సర్వే స్వం స్వం పదం యయుః ॥ 37**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగా, భక్త+అర్థితః = భక్తుడైన ప్రహ్లాదునిచే కోరబడిన వాడై, విష్ణుః = విష్ణువు, శాన్తిం యయౌ = శాంతించెను, తదా = అప్పుడు, అమరాః = దేవతలు, తస్మై = ఆ దేవునకు, నత్వా = నమస్కరించి, తత్+ఆజ్ఞప్తాః = వానిచే ఆజ్ఞాపింపబడినవారై, సర్వే = అందఱు, స్వం స్వమ్ = తమదైన తమదైన, పదమ్ = స్థానమును గూర్చి, యయుః = వెడలిరి.

**తా :** ఇట్లు భక్తుదర్థింపగా శాంతించిన విష్ణువునకు దేవతలు నమస్కరించి, అంతట వాని ఆజ్ఞ గొని అందఱు తమ స్థానములకు పోయిరి.

**శ్లో॥ తిరోదధేఽపి భగవాంస్తద్రూపం తారమైచ్ఛికమ్ ।**
**ప్రహ్లాదోఽపి తదాజ్ఞప్తః పిత్ర్యం రాజ్యం శశాస సన్ ॥ 38**

**ప్ర :** భగవాన్ = విష్ణుభగవానుడు, ఐచ్ఛికమ్ = భక్తుని కోరిక ననుసరించి ధరించిన, తారమ్ = ప్రణవమయమైన, తత్ రూపమ్ = ఆ నృసింహరూపమును, తిరోదధే అపి = ఉపసంహరించెను కూడ, ప్రహ్లాదః అపి = ప్రహ్లాదుడున్నూ, తత్ ఆజ్ఞప్తః సన్ = వానిచే ఆజ్ఞాపింపబడినవాడగుచు, పిత్ర్యమ్ = తండ్రి సంపాదించిన, రాజ్యమ్ = రాజ్యమును, శశాస = పరిపాలించెను.

**తా :** విష్ణుభగవానుడు భక్తుని కొరకు ధరించిన ప్రణవమయమైన నృసింహరూపమును ఉపసంహరించి, ప్రహ్లాదుని ఆజ్ఞాపించగా, ఆతడు తన తండ్రియైన హిరణ్యకశిపుని రాజ్యమును పరిపాలించెను.

**శ్లో॥ ఆబాల్యం నారదాదేశాద్ధర్మే భాగవతే రతః ।**
**భూత్వాప్యనాత్మవిత్త్వేన శాన్తిం న పరమాం యయౌ ॥ 39**

**ప్ర :** ఆబాల్యమ్ = బాల్యమునుండియు, నారద+ఆదేశాత్ = నారదుని బోధవలన, భాగవతే ధర్మే = భగవచ్చింతకుల ధర్మమున, రతః = ఆసక్తుడు, భూత్వా అపి = అయి యుండియు, అనాత్మవిత్త్వేన = ఆత్మజ్ఞానరాహిత్యముచేత, పరమాం శాన్తిమ్ = శాశ్వతమైన శాంతిని, న యయౌ = పొందలేదు.

**తా :** బాల్యమునుండి నారదమహర్షి శిక్షణలో భాగవతధర్మమును అనుసరించుచున్నను, ప్రహ్లాదునకు ఆత్మజ్ఞానము కలుగని కారణమున శాశ్వతశాంతిని పొందలేక పోయెను.

**శ్లో॥ ఔదాసీన్యేన స వనం పర్యటన్మృగయామిషాత్ ।**
**భాగ్యాద్దదర్శ సహ్యాద్రౌ కావేర్యాం నిద్రితే భువి ॥ 40**

**ప్ర :** ఔదాసీన్యేన = ఉదాసీనముగా, దేనియందును ఆసక్తిని చూపక, సః = ఆ ప్రహ్లాదుడు, మృగయామిషాత్ = వేటాడు నెపమున, వనం పర్యటన్ = అడవులలో తిరుగుచు, సహ్యాద్రౌ = సహ్యాద్రిపై, కావేర్యామ్ = కావేరీతీరమున, భువి = నేలపై, నిద్రితే = నిదురించి యుండగా, భాగ్యాత్ = భాగ్యవశమున, దదర్శ = దర్శించెను.

**శ్లో॥ కర్మాద్యైర్వర్ణలిఙ్గాద్యైరప్రతర్క్యం రజస్వలమ్ ।**
**నత్వా ప్రాహావధూతం తం నిగూఢామలతేజసమ్ ॥ 41**

**ప్ర :** కర్మ+ఆద్యైః = కర్మ మొదలగు వానిచేత, వర్ణలిఙ్గ+ఆద్యైః = వర్ణము, లింగము మొదలగు వానిచేత, అప్రతర్క్యమ్ = నిర్ణయింపదగని వాడైన, రజస్వలమ్ = దుమ్ముకొట్టుకొనియున్న వాడైన, అవధూతమ్ = అవధూతను, నిగూఢ+అమలతేజసమ్ = కనరాని నిర్మల తేజస్సు గలవానిని, తమ్ = వానిని, నత్వా = నమస్కరించి, ప్రాహ = ఇట్లనెను.

**తా :** కర్మ, వర్ణము, లింగము, ఇత్యాది పరిమితులచే తెలియరాని వాడును, ధూళిదూసరి-తాంగుడును, గూఢతేజోవిరాజితుడును అయిన అవధూతనొకని దర్శించి, నమస్కరించి, వానికిట్లనెను.

**శ్లో॥ కథం భోగీవ ధత్తేఽస్వః పీనాం తనుమనుద్యమః ।**
**ఉద్యోగాత్స్వం తతో భోగో భోగాత్పీనా తనుర్భవేత్ ॥ 42**

**ప్ర :** స్వం ఉద్యోగాత్ = తనదైన శరీరశ్రమవలన, తతః భోగః = ఆ కారణమున భోగము, భోగాత్ = భోగమువలన, తనుః = శరీరము, పీనా భవేత్ = లావెక్కును, అనుద్యమః = యే పనియు శ్రమయు చేయనివాడవు, స్వః = నీదైన, తనుమ్ = తనువును, భోగీ ఇవ = భోగివలె, కథమ్ = ఎట్లు, పీనాం ధత్తే = లావైన దానిగా ధరించుచున్నావు?

**తా :** శరీరవ్యాయామమువలన శ్రమకలిగి సుఖేచ్ఛ కలిగి తద్వారా శరీరము లావగును కదా. మరి నీవు యే శరీరశ్రమయు చేయకుండగనే భోగివలె ఈ లావైన శరీరము నెట్లు పొందితివి?

**శ్లో॥ శయానోఽనుద్యమోఽనీహో భవానిహ తథాప్యసౌ ।**
**పీనా తనుః కథం సిద్ధో భవాన్వదతు చేత్ క్షమమ్ ॥ 43**

**ప్ర :** శయానః = విశ్రాంతుడవు, అనుద్యమః = ఎట్టి కార్యమును చేయనివాడవు, అనీహః= కోరికలేనివాడవు, భవాన్ = నీవు, ఇహ = ఇట్టిచో, అసౌ పీనా తనుః = ఈ బలిసిన శరీరము, కథం సిద్ధః = ఎట్లు లభించినది, క్షమం చేత్ = చెప్పదగినదైనచో, భవాన్ = తమరు, వదతు = చెప్పుదురు కాక!

**తా :** తమరు యే పనియును చేయక విశ్రాంతనిశ్చలజీవనము గడపుచున్నారు. తమకు కోరికయే లేదు కావున దానిని సాధించు శ్రమయు లేదు. ఈ స్థితిలో తమకు ఈ బలిసిన శరీరము సిద్ధించుటెట్లు సంభవము? చెప్పదగినట్లయిన, సెలవిండు.

**శ్లో॥ విద్వాన్ దక్షోఽపి చతురశ్చిత్రప్రియకథో భవాన్ ।**
**దృష్ట్వాపీహ జనాంశ్చిత్రకర్మణో వర్తతే సమః ॥ 44**

**ప్ర :** భవాన్ = తమరు, విద్వాన్ = విద్వాంసులు, దక్షః = కార్యసాధకులు, చతురః = నిపుణులు, చిత్రప్రియకథః అపి = విచిత్రమైన, మనోహరమైన, చరిత్ర గలవారు అయినను, ఇహ = లోకమున, జనాన్ = మనుజులను, చిత్ర కర్మణః = విచిత్రమైన కర్మలు గలవారుగా, దృష్ట్వా అపి = చూచియును, సమః వర్తతే = సమభావముతో ప్రవర్తించుచున్నారు.

**తా :** తమరు నిష్క్రియులై యుండుటకు కారణము అజ్ఞానము కాదు, ఏలన తమరు విద్వాంసులు; చేతగాని తనము కాదు, ఏలన తమరు నిపుణులు; పట్టుదల లేనివారు కారు, ఏలన తమరు కార్యదక్షత గల సమర్థులు; లోకాకర్షణలేనివారు కారు, ఏలన మీ చరిత్ర చిత్రమైనది, లోకప్రియమైనది. అట్టి తమరు నిష్క్రియులగుటయే కాక, లౌకికులు విచిత్రకర్మల మునిగి తేలుటను చూచుచు, రాగద్వేషములులేక, ప్రతిస్పందనలేక, సమదృష్టితో జగత్తు నెట్లు చూడగలుగుచున్నారు?

**శ్లో॥ ఇత్థం శ్రీభగవాంస్తేన ప్రహ్లాదేనాత్రినన్దనః ।**
**సంపృష్టః ప్రాహ సంతుష్టః కృపాలుః ప్రహసన్నివ ॥ 45**

**ప్ర :** ఇత్థమ్ = ఈ రీతిగా, తేన ప్రహ్లాదేన = ఆ ప్రహ్లాదునిచేత, అత్రినన్దనః = అత్రి కుమారుడైన, శ్రీ భగవాన్ = శ్రీ భగవాన్ దత్తప్రభువు; సంపృష్టః = సవినయముగ అడుగబడి, కృపాలుః = దయగలవాడై, సంతుష్టః = సంతోషించినవాడై, ప్రహసన్ ఇవ = నవ్వుచున్న వాని వలె, ప్రాహ = ఇట్లనెను.

**తా :** ఇట్లు ప్రహ్లాదుడడుగగా, అత్రి కుమారుడైన **శ్రీదత్తభగవానుడు** సంతోషించి, దయతో నవ్వుచు ఇట్లనెను.

**శ్లో॥ శ్రీనృసింహోఽవతీర్ణోఽత్ర యదర్థం స త్వమేవ హి ।**
**దైత్యజోఽపి మునిచ్ఛాత్ర! శృణు భాగవతోత్తమ! ॥ 46**

**ప్ర :** అత్ర = భూమిపై, యత్+అర్థమ్ = ఎవని కొరకు, శ్రీనృసింహః = శ్రీనృసింహమూర్తి, అవతర్ణీః = అవతరించినాడో, సః = ఆతడు, త్వం ఏవ హి = నీవే, దైత్యజః = రాక్షసుడుగా పుట్టినప్పటికిని, మునిచ్ఛాత్ర = నారదమహర్షి శిష్యుడవైన, భాగవత+ఉత్తమ! = భక్తవరేణ్యా!, శృణు = వినుము.

**తా :** పుట్టుకచే రాక్షసుడవైనను, నారద శిష్యుడవై విష్ణుభక్తుడవైన ప్రహ్లాదా!, వినుము. విష్ణువు నృసింహావతారుడై పుడమిపై అవతరించుటకు కారణభూతుడవు నీవే.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ద్వితీయాష్టకే సప్తమోఽధ్యాయః ।

ఓమ్ శం

---

**షడక్షరో దత్తాత్రేయమన్త్రః**

**ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం ద్రాం ॥**

శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## ద్వితీయాష్టకము - అష్టమాధ్యాయము

**శ్లో॥ మన్దః స్వజ్ఞో భ్రమంస్తృష్ణానద్యేమం లోకమాగతః ।**
**కర్మయోగేన ముక్తిస్వర్మోక్షద్వారం యదృచ్ఛయా ॥ 1**

**ప్రతిపదార్థం :** మన్దః = తత్త్వజ్ఞానసాధనలో అలసుడును, సు+అజ్ఞః = గాఢమైన అజ్ఞానము గలవాడను, తృష్ణానద్యా = ఇంద్రియవిషయాసక్తియను నదిలోబడి, భ్రమన్ = తిరుగుచు, కర్మయోగేన = కర్మఫలముగా, యదృచ్ఛయా = కాకతాళీయముగా, ముక్తిస్వర్+మోక్షద్వారమ్ = ముక్తికి, స్వర్గనరకములు అను వీనికి ప్రవేశావకాశమునిచ్చు, ఇమం లోకమ్ = ఈ మానవలోకమునకు, ఆగతః = వచ్చినాను.

**తాత్పర్యం :** అజ్ఞానిని, జ్ఞానలబ్ధికై ప్రయత్నించని వాడను అగుట వలన కర్మ ప్రవాహమునబడి తిరుగుచు, ముక్తిని పొందుటకు, స్వర్గనరకలోకానుభవములకు తెఱచిన తలుపు అనదగిన మానవలోకమునకు దైవవశమున వచ్చి చేరినాను. *

**శ్లో॥ నివృత్తోఽస్మ్యత్ర యతతాం వ్యత్యయం వీక్ష్య శర్మణే ।**
**ఆత్మనోఽస్య సుఖం రూపం క్లిష్టే నష్టే స్వయంప్రభుమ్ ॥ 2**

**ప్ర :** అత్ర = లోకమున, శర్మణే = సుఖమునకై, యతతామ్ = ప్రయత్నించువారికి, వ్యత్యయమ్ = ఫలస్వరూపమైన దుఃఖమును, వీక్ష్య = చూచి, నివృత్తః అస్మి = సుఖమునకై చేయు ప్రయత్నమును విరమించినవాడనైతిని, అస్య ఆత్మనః సుఖమ్ = ఈ ఆత్మకు సుఖము స్వస్వరూపముగా, క్లిష్టే నష్టే = అవిద్య, అస్మితా, రాగము, ద్వేషము, అభినివేశము అను పంచక్లేశములు నశించగా, స్వయం ప్రభుమ్ = ఆత్మకు స్వయంసిద్ధముగ ప్రభుత గలదని,

**శ్లో॥ జ్ఞాత్వా సంస్మర్యజాన్ భోగాన్ దుఃఖాన్ స్వప్స్యామి దైవభుక్ ।**
**విస్మృత్యాముం జనః స్వార్థం సన్తం యాత్యుగ్రసంసృతిమ్ ॥ 3**

**ప్ర :** జ్ఞాత్వా = తెలిసికొని, సంస్పర్శజాన్ = ఇంద్రియములవలన కలుగునట్టి, భోగాన్ దుఃఖాన్ = సుఖదుఃఖములన్నిటిని, దైవభుక్ = దైవభుక్తములుగా, స్వప్స్యామి = అనాసక్తుడనై యున్నాను, జనః = లోకము, సన్తం అముమ్ = ఉండియేయున్న ఈ సుఖమును, విస్మృత్య = విస్మరించి, ఉగ్రసంసృతిం స్వార్థమ్ = ఉగ్రరూపముగల స్వార్థమను సంసారమున, యాతి = చొరబడుచున్నది.

**తా :** లోకమున సుఖమునకై ప్రయత్నించువారికి దుఃఖము లభించుట చూచి, ఇంద్రియస్పర్శ వలన కలుగు సుఖదుఃఖములు దైవభుక్తములని తెలిసికొని, ఆత్మ స్వయంసిద్ధసుఖస్వరూపమని తెలిసికొని ప్రత్యేక లౌకిక ప్రయత్నములు మాని శాంతుడనై యున్నాను. నా క్లేశములు నశించినవి. తనదైన ఆత్మస్వరూపసౌఖ్యమును మరచి, స్వార్థప్రేరితసుఖదుఃఖరూపమైన సంసారమున తలమున్కలై యున్నది.

*

**శ్లో॥ స్వార్థం మాయావృతం త్యక్త్వా తదర్థ్యన్యత్ర ధావతి ।**
**శైవాలచ్ఛన్నకం త్యక్త్వా యథాంబ్వర్థీ మరీచికామ్ ॥ 4**

**ప్ర :** మాయావృతమ్ = మాయచే చుట్టుకొనబడిన, స్వార్థమ్ = స్వార్థమును, త్యక్త్వా = విడచి, తత్+అర్థీ = దానిని కోరినవాడై, అన్యత్ర = మరియొక తావునకు, ధావతి = పరుగిడుచున్నాడు, యథా = ఎట్లు, శైవాలచ్ఛన్నకమ్ = నాచుచే కప్పబడిన సరస్సును, త్యక్త్వా = విడచి, అంబు+అర్థీ = నీటిని కోరినవాడు, మరీచికామ్ = ఎండమావికై పరుగిడినట్లు.

**తా :** దప్పికగొన్నవాడు చెంతనున్న సరస్సులో నాచుక్రిందనున్న నీటిని తెలియక విడచిపుచ్చి, ఎండమావిలో నీరున్నదని భ్రమతో పరుగిడినట్లు, తనలోనే ఇంద్రియముల మాయ మూసియున్న ఆత్మ సుఖమును మరచి లోకములో వెదకుచూ పరుగెత్తుచున్నాడు.

**శ్లో॥ అభాగ్యస్య క్రియా మోఘాః సుఖప్రాప్త్యై ప్రయోజితాః ।**
**తత్సాఫల్యేఽప్యసద్భిః కిం కార్యం మర్త్యస్య కృచ్ఛ్రజైః ॥ 5**

**ప్ర :** అభాగ్యస్య = అభాగ్యునకు, సుఖప్రాప్త్యై = సుఖసంపాదనకై, ప్రయోజితాః = పురుషప్రయత్నము గల, క్రియాః = కార్యములు, మోఘాః = వ్యర్థమైనవి కాగా, తత్ సాఫల్యే అపి = వాని సఫలత కలిగిన సందర్భముననను, అసద్భిః = మిథ్యామాత్రమై, కృచ్ఛ్రజైః = క్షణికములైన వానివలన, మర్త్యస్య = మరణశీలుడైన వానికి, కిం కార్యమ్ = ప్రయోజనమేమి?

**తా :** దురదృష్టవంతుడు సుఖప్రాప్తికొరకు తానెంత ప్రయత్నము చేసినను, వాని ప్రయత్నములు ఫలించవు, ఆతడు దురదృష్టవంతుడు కావున. ఒకవేళ ఎప్పుడైన ఫలించినను, ఆ సుఖము మిథ్యామాత్రమై, క్షణికమై యుండును. ఏలన వాని ప్రయత్నము దేహేంద్రియసుఖమునకై యుండును. అట్టిచో, ఈ సాఫల్యమునకు మాత్రము విలువ యేమున్నది? దాని వలన సాధించిన దేమున్నది?

**శ్లో॥ కామార్థేచ్ఛోర్మోహశోకరాగద్వేషశ్రమాదయః ।**
**యతోఽజితాత్మనో నైతి నిద్రాపి భయశఙ్కయా ॥ 6**

**ప్ర :** కామ+అర్థ+ఇచ్ఛోః = కామము, అర్థము, వీనిని అభిలషించువారికి, మోహశోకరాగ ద్వేషశ్రమ+ఆదయః = మోహము, శోకము, రాగము, ద్వేషము, శ్రమము మొదలైనవి, అజితాత్మనః = ఆత్మజ్ఞానములేని వానికి, భయశంకయా = భయముచేత, సంశయముచేత, నిద్రా+అపి = నిద్రకూడా, న+ఇతి = లేదు అని, యతః = ఎందువలన చెప్పబడినదో అందువలన.

**తా :** కామార్థముల నభిలషించువానికి మోహము, శోకము, రాగము, ద్వేషము, శ్రమము ఇత్యాదులు కలుగును. ఆత్మజ్ఞానములేనివానికి భయసంశయములు, అనగా, సంశయము వలన భయము కలుగగా నిద్రకూడ ఉండదు, అని యున్నది.

**శ్లో॥ ప్రాణార్థేచ్ఛాహిమధుకృచ్ఛిక్షితేన మయోజ్ఝితా ।**
**రాజార్థిహింస్రచోరద్విట్కాలేభ్యో న బిభేమ్యతః ॥ 7**

**ప్ర :** ప్రాణ+అర్థ+ఇచ్ఛా+అహి–మధుకృత్+శిక్షితేన మయా = ప్రాణము కొరకైన కోరిక యను (లేక ప్రాణము యొక్క, అర్థము యొక్క కోరిక యను) మధుకృత్ అనుపేరుగల మహాసర్పమునకు శిష్యుడైన నా చేత, ఉజ్ఝితా = విడువబడిన వాడనై, అతః = దానివలన, రాజ+అర్థి+హింస్ర చోరద్విట్+కాలేభ్యః = రాజదండన, ద్రవ్యాభిలాషులగు యాచకులు చోరులు, హింసించువారి ద్వేషము, రోగాదుల భయము కలిగించు కాలము అను వీని వలన, న బిభేమి = భయపడుట లేదు.

**తా :** ప్రాణమును నిల్పుకొనుటకు ధనము కావలెనను కోరిక జీవితముపై తీపి కలుగుటకు మూలము. దానితో జతపడినదే జీవనదుఃఖమంతయు. కాన ఈ మధువును సిద్ధము చేయునది మహాసర్పము. నే నీ విషయమును ఆ మహాహినుండియే నేర్చికొంటిని. కావున ప్రాణార్థ–కామములను త్యజించినాను. అందువలన నాకు రాజదండన భయముగాని, యాచకుల భయముగాని, చోరుల భయముగాని, హింసకుల భయముగాని, కాలగతిలో రోగాదులు పీడించునేమో యను భయము గాని లేదు.

**శ్లో॥ నిరిచ్ఛః పరితుష్టాత్మా యదృచ్ఛాలాభతోఽస్మి సన్ ।**
**బహుకాలం శయే నో చే ద్విద్వాన్ ధైర్యాన్మహాహివత్ ॥ 8**

**ప్ర :** నిరిచ్ఛః = కోరిక లేనివాడను, యదృచ్ఛాలాభతః = లభించిన దానివలన, పరితుష్టాత్మా సన్ = సంతృప్తిచెందినవాడనగుచు, ధైర్యాత్ = ధైర్యముతో, విద్వాన్ నో చేత్ = విద్వాంసుడను కాదేని, మహా+అహివత్ = అజగరము వలె, బహుకాలమ్ = చాల కాలము, శయే అస్మి = విశ్రాంతుడనై యున్నాను.

**తా :** కోరికలేనివాడనై, లభించిన దానితో తృప్తిజెంది, ధైర్యముగా, విద్వాంసునివలె, కాకున్నచో, అజగరము అనబడు మహాసర్పము వలె, చాలకాలము విశ్రాంతజీవనము గడిపినాను.

**శ్లో॥ భూర్యల్పం స్వాదు వాఽస్వాదు కదన్నం మానవర్జితమ్ ।**
**సమానే క్వాపి భుఞ్జేఽహ్ని నిశి భుక్త్వాపి వా న వా ॥ 9**

**ప్ర :** భూరి = అధికమో, అల్పమ్ = అల్పమో, స్వాదు = రుచికరమో, వా = లేక, అస్వాదు = రుచిలేనిదో, కదన్నమ్ = తినదగని అన్నము, మానవర్జితమ్ = అవమానించి యిచ్చినది, క్వా అపి = ఎట్టిదైనను, సమానే = సమభావముతో, అహ్ని = పగటివేళ, భుఞ్జే = తింటిని, నిశి = రాత్రివేళ, భుక్త్వా అపి వా = తినియో, న వా = తినకుండగనో.

**తా :** పగటివేళ లభించినది ఎక్కువో తక్కువో, రుచి యున్నదో లేనిదో, అవమానించి యిచ్చినదైనను, తినుటకు పనికిరానిదైనను, యేదైనగాని, లభించిన ఆహారమును తిని, రాత్రి తినియు తినకుండగను, సమభావముతోనే ఉంటిని.

**శ్లో॥ హరత్యన్యః పతిం హత్వా కృచ్ఛ్రాప్తం మధువద్ధనమ్ ।**
**శిక్షితుం మధుకృత్తోఽతో విరక్తోఽస్మ్యపరిగ్రహః ॥ 10**

**ప్ర :** కృచ్ఛ్ర+ఆప్తం ధనం మధువత్ = తేనెను తేనెటీగవలె కష్టపడి పొందిన ధనమును, పతిమ్ = ఆ సంపాదించిన వానిని, యజమానిని, హత్వా = చంపి, అన్యః = వేరొకడు, హరతి = దొంగిలించుచున్నాడు, అతః = అందువలన, విరక్తః అస్మి = విరక్తుడనైతిని, మధుకృత్తః =తేనెటీగనుండి, శిక్షితమ్ = నేర్వబడినది, అపరిగ్రహః = ఎవరినుండియు దేనినిగాని స్వీకరింపకుండుట.

**తా :** తేనెటీగ కష్టించి కూడబెట్టిన తేనెను వలె, ధనమునుగూడ వేరొకడెవడో సంపాదించిన వానిని చంపి అపహరించుటను చూచి, తేనెటీగనుండి అపరిగ్రహము అను వివేకమును పొంది విరక్తుడనైతిని.

**శ్లో॥ దైవాప్తం చర్మ వల్కం వా వస్త్రం క్షౌమం వసే న వా ।**
**క్వచిచ్ఛయేఽశ్మభస్మాదౌ కశిపౌ వా జనే వనే ॥ 11**

**ప్ర :** దైవ+ఆప్తమ్ = విధి వశమున లభించినది, చర్మ = చర్మమో, వల్కమ్ =చెట్టు పట్టయో, వా = లేక, క్షౌమం వస్త్రమ్ = దుకూలమో, వసే వా న వా = కట్టుకొందునో లేదో, క్వచిత్ = ఒకచో, అశ్మ–భస్మ+ఆదౌ = ఱాతిపై, బూదిపై, ఇత్యాదులపై, కశిపౌ = సెజ్జపై, జనే వా వనే = జనావాసములలోనో లేక అడవులందో, శయే = నిదురింతును.

**తా :** చర్మమో, చెట్టుపట్టయో, పట్టుబట్టయో కట్టుకొనియో లేక దిగంబరముగనో, ఱాతిపైనో, భస్మతలముననో, సెజ్జపైనో, గ్రామముననో వనముననో నిద్రింతును.

**శ్లో॥ క్వచిత్స్నాతోఽలంకృతోఽహం స్రగ్వీ సువసనో న వా ।**
**రథే భాస్వైశ్చరే క్వాపి మునివత్క్వాపి ముగ్ధవత్ ॥ 12**

ప్ర : అహమ్ = నేను, క్వచిత్ = ఒకచో, స్నాతః = స్నానము చేసినవాడనై, అలంకృతః = అలంకారము చేసికొనినవాడనై, స్రగ్వీ = పూదండలు ధరించినవాడనై, సువసనః = మంచి దుస్తులు ధరించిన వాడనై, రథే = రథముపై, భాస్వైః చరే = వెలుగొందుచూ సంచరింతును, న వా = లేదేని, క్వా అపి = ఒకచో, మునివత్ = మునివలె, క్వా అపి = ఒకచో, ముగ్ధవత్ = మూర్ఖునివలె.

**తా :** ఒకచో స్నానముచేసి, అలంకరించికొని, మంచి దుస్తులు ధరించి పూలమాలలు చుట్టుకొని, రథముపై సంచరింతును. వేరొకచో మునివలెను, మరియొకచో మూర్ఖుని వలెను సంచరింతును.

**శ్లో॥ నాహం నిన్దే న చ స్తౌమి స్వభావవిషమం నరమ్ ।**
**ఏతేషాం శ్రేయ ఆశాస ఉతైకాత్మ్యమథాత్మని ॥ 13**

ప్ర : స్వభావవిషమం నరమ్ = స్వభావమునకు సరిపడని నరుని, అహమ్ = నేను, న నిన్దే = నిందించను, న చ స్తౌమి = పొగడను కూడ, ఉత = కాని, ఆత్మని = ఆత్మలో, మనసులో, ఏతేషామ్ = వారికి, ఏక+ఆత్మ్యమ్ = నాతో సరితూగు, అథ శ్రేయః = అట్టి శ్రేయమును, ఆశాస = కోరుదును.

**తా :** నా స్వభావమునకు విరుద్ధమైన స్వభావము గలవారు తారసపడిన, నేను వారిని నిందించను, స్తుతించను, కాని నాకు వలెనే వారికిని శ్రేయము కలుగవలెనని కోరుకొందును.

**శ్లో॥ బ్రహ్మాసక్తో బ్రహ్మనిష్ఠో బ్రహ్మాత్మా బ్రహ్మధీరహమ్ ।**
**సంస్కృతే బ్రాహ్మణేఽన్త్యే వా సమదృగ్గవి శున్యపి ॥ 14**

ప్ర : బ్రహ్మ+ఆసక్తః = బ్రహ్మమునందాసక్తుడనై, బ్రహ్మనిష్ఠః = బ్రహ్మమునందు తత్పరుడనై, బ్రహ్మాత్మా = ఆత్మను బ్రహ్మమునందే నిల్పిన వాడనై, బ్రహ్మధీః = బ్రహ్మయందు బుద్ధిని జొన్పిన వాడనై, అహమ్ = నేను, సంస్కృతే బ్రాహ్మణే = సంస్కారము గల బ్రాహ్మణుని యందు, అన్త్యే వా = లేక అన్త్యకులజుని యందు, గవి = గోవునందు, శుని అపి = కుక్కయందును, సమదృక్ = సమానమైన భావము గలిగి యుంటిని.

**తా :** నేను నా ఆసక్తియు, నిష్ఠయు, బుద్ధియు, ఆత్మయు బ్రహ్మతత్పరతతో నుండగా వేదాధ్యయన సంస్కారముగల బ్రాహ్మణునియందును కడమజాతివాని యందును, గోవునందును, కుక్కయందును సమబుద్ధి గలిగి, ఉచ్చనీచము లెంచక, మసలితిని.

**శ్లో॥ సమాసమాభ్యాం విషమసమే పూజాత ఓదనమ్ ।**
**నాద్యాదిత్యజ్ఞగృహిణో దోషో న సమదృగ్యతేః ॥ 15**

ప్ర : సమ+అసమాభ్యామ్ = బ్రాహ్మణాది వర్ణములను బట్టి, విషమసమే = అయోగ్యము యోగ్యము, న అద్యాత్ ఇతి = తినరాదు అని, అజ్ఞగృహిణః = తెలియని గృహస్థుయొక్క, పూజాత ఓదనమ్ = విభజించబడిన అన్నము, సమదృక్ యతేః = సమదృష్టిగల యతికి, న దోషః= దోషము కాదు.

**తా** : బ్రాహ్మణాది వర్ణముల మధ్యగల ఉచ్చనీచభావభేదములనుబట్టి అన్నము కూడ ఇచ్చిన గృహస్థుని వర్ణమును బట్టి, తినదగినది, తినరానిది, అని అజ్ఞానముతో విభక్తమైనది. అందరిని సమానులుగ చూచు సంన్యాసులకు మాత్రము ఈ దోషము, ఈ భేదము లేదు.

**శ్లో॥ స్వరూపేఽవాసనస్తిష్ఠామ్యాన్వీక్షిక్యాఽనయా దివి ।**
**యోఽముచ్ఛేత్తు తస్యాయముపాయో విదుషః సుఖః ॥ 16**

ప్ర : అనయా అన్వీక్షిక్యా = ఈ అన్వీక్షికీ యనబడు ఆత్మవిద్యచేత, దివి = దివమునందు, అవాసనః = వాసనారహితుడనై, స్వరూపే = ఆత్మరూపమునందే, తిష్ఠామి = నిలచియున్నాను, యః విదుషః = యే విద్వాంసుడు, అముమ్ = దీనిని, ఇచ్ఛేత్ = కోరునో, తస్య తు = వానికైతే, అయం ఉపాయః = ఈ ఉపాయము, సుఖః = సుఖమైనది.

**తా** : అన్వీక్షికీ యనబడు ఈ ఆత్మవిద్యచేత వాసనారహితుడనై ఆత్మరూపమున దివిలో నిల్చియున్నాను. ఈ స్థితిని కోరుకొను విద్వాంసుడెవడైనను వానికి సుఖమైన ఉపాయమిది.

**శ్లో॥ హునేద్వికల్పం చిత్తౌ తాం మనస్యర్థభ్రమే తు తత్ ।**
**వైకారికే తం మాయాయాం తాం స్వస్మిన్విరమేత్తతః ॥ 17**

ప్ర : చిత్తౌ = చిత్తమునందు, అనగా భేదమును గ్రహించు మనోవ్యాపారమున, వికల్పమ్ = సంశయమును, హునేత్ = దహించదగును, తామ్ = ఆ చిత్తమును, అర్థభ్రమే = అర్థరూపమైన భ్రమగల, మనసి = మనస్సునందు (హునేత్), తత్ తు = ఆ మనస్సునేమో, వైకారికే = అహంకారమున (హునేత్), తమ్ = ఆ అహంకారమును, మాయాయామ్ = మాయలో (హునేత్), తామ్ = ఆ మాయను, స్వస్మిన్ = ఆత్మరూపుడగు వాసుదేవునియందు, విరమేత్ = విరమించవలెను, తతః = ఆపై

**శ్లో॥ శుద్ధః సోఽహం పరాత్మైక ఇతి దార్ఢ్యే విముచ్యతే ।**
**హృదయం మే సుగుప్తం తే ప్రోక్తం తత్త్వం విచారయ ॥ 18**

ప్ర : శుద్ధః = శుద్ధుడనై, అనగా స్వరూపమునందున్నవాడనై, సః అహం పరాత్మ+ఏకః = నేను అట్టి అద్వయాత్మనే, అనగా ప్రత్యగాత్మకు భిన్నము గాని పరాత్మనగు కేవలాత్మను, ఇతి = అని, దార్ఢ్యే = అనుభవదృఢత్వమునందు, విముచ్యతే = ముక్తుడగుచున్నాడు, మే = నా యొక్క సుగుప్తం హృదయమ్ = అంతరంగము, తే = నీకై, ప్రోక్తమ్ = చెప్పబడినది, తత్త్వమ్ = సూక్ష్మార్థమును, విచారయ = ఆలోచించి గ్రహించుము.

**తా :** చిత్తమునందు సంశయమును, మనస్సునందు చిత్తమును, అహంకారమున మనస్సును, మాయయందు అహంకారమును, ఆత్మరూపుడగు వాసుదేవుని యందు మాయను హుతము జేసి విరమించవలెను. ఆపై శుద్ధుడై, నేను జీవాభిన్నుడనైన పరముడనే యని అనుభవమున నిశ్చితుడై ముక్తుడగుచున్నాడు. ఇది నా అంతరంగము, నీకు విప్పి చెప్పినాను. దీని సూక్ష్మార్థమును విచారించి తెలిసికొనుము.

**శ్లో॥ ఇతీశేనోపదిష్టః స జ్ఞాత్వాఽఽత్మానం ప్రపూజ్య చ ।**
**తదాజ్ఞప్తో యయౌ రాజ్యం కుర్వన్నపి స దైవభుక్ ॥ 19**

**ప్ర :** ఇతి = అని, ఈశాన+ఉపదిష్టః = శ్రీదత్తప్రభువుచే ఉపదేశింపబడినవాడై, సః = ఆ ప్రహ్లాదుడు, ఆత్మానం జ్ఞాత్వా = తనను తాను (ఆత్మగా) తెలిసికొని, ప్రపూజ్య చ = ఆ ప్రభువును పూజించియును, తత్ ఆజ్ఞప్తః = వానిచే ఆజ్ఞాపించబడినవాడై, సః = ఆతడు, దైవభుక్ = దైవవశమున లభించిన దానిని అనుభవించువాడై, రాజ్యమ్ = రాజ్యమును, కుర్వన్ అపి యయౌ = పాలించుటకై వెడలెను.

**తా :** ఇట్లు శ్రీదత్తప్రభువు ఉపదేశమును విని ఆత్మజ్ఞానము గలవాడై, ఆ గురువును పూజించి, వాని ఆజ్ఞ ననుసరించి విధివశమున లభించిన రాజ్యమును పాలించుటకై వెడలెను.

**శ్లో॥ రాజ్యశ్రీపుత్రదారాఢ్యోఽప్యలిప్తః స్వాత్మదృక్ సదా ।**
**భుక్త్వారబ్ధం చిరం రాజ్యం దత్వా పుత్రే విరోచనే ॥ 20**

**శ్లో॥ ముక్తసఙ్గశ్చచార క్ష్మాం సమదృక్స గురూక్తవత్ ।**
**విరోచనోఽపి పితృవత్పిత్ర్యం రాజ్యం శశాస తత్ ॥ 21**

**ప్ర :** రాజ్యశ్రీపుత్రదారా+ఆఢ్యః అపి = రాజ్యలక్ష్మిని, పుత్రుని, భార్యనుకూడిన భాగ్యశాలియైనను, అలిప్తః = వాని సంగము ఆత్మనంటనీయక, స్వ+ఆత్మదృక్ = తన ఆత్మయందే దృష్టిగలవాడై, సదా = ఎల్లప్పుడు, ఆరబ్ధమ్ = కర్మఫలమగు, రాజ్యమ్ = రాజ్యమును, చిరం భుక్త్వా = చాలకాలమనుభవించి, పుత్రే విరోచనే = పుత్రుడైన విరోచనునకు, దత్వా = ఇచ్చి, ముక్తసఙ్గః = తగులము లేక, గురూక్తవత్ = గురువు చెప్పినట్లు, సమదృక్ = రాగద్వేషరహితుడై, క్ష్మామ్ = భూమిని, చచార = సంచరించెను; సః విరోచనః అపి = ఆ విరోచనుడున్ను, పితృవత్ = తండ్రివలె, తత్ పిత్ర్యం రాజ్యమ్ = ఆపైతృకమైన రాజ్యమును, శశాస = పాలించెను.

**తా :** రాజ్యము, భార్య, పుత్రుడు గల భాగ్యశాలియైనను, ఆ ప్రహ్లాదుడు ఆత్మదృష్టిగలవాడై, కర్మఫలము ననుభవించుచు చిరకాలము రాజ్యము చేసి, ఆపై రాజ్యమును తన కుమారుడైన విరోచనునకిచ్చి సంగములేక భూమిపై సంచరించెను. ఆతని కుమారుడు విరోచనుడు కూడ తండ్రివలె రాజ్యమును విధిగా పాలించెను.

**శ్లో॥ తత్పుత్రో బలినామాభూద్ధృతస్వర్గోఽపి యేన చ ।**
**అదిత్యాం కశ్యపాజ్జాతా దేవా ఇన్ద్రాదయోఽపి తాన్ ॥ 22**

**శ్లో॥ జిత్వా తదధికారాంశ్చ స స్వయం స్మాధితిష్ఠతి ।**
**స్వర్గాన్నిరాకృతా దేవాః శ్రీవిష్ణుం తుష్టువుర్హరిమ్ ॥ 23**

**ప్ర :** బలినామ తత్ పుత్రః = బలి యను పేరుగల వాని కుమారుడు, అభూత్ = ఆయెను, యేన చ = ఎవనిచేతనైతే, అదిత్యామ్ = అదితియందు, కశ్యపాత్ జాతాః = కశ్యపునివలన జన్మించిన, ఇన్ద్రాదయః అపి = ఇంద్రాదులను, దేవాః = దేవతలను, తాన్ జిత్వా = వారిని జయించి, తత్+అధికారాన్ చ = వారి అధికారములను, హృతస్వర్గః అపి = హరించిన స్వర్గమును కలవాడై, సః = ఆ బలి, స్వయం = తానే, అధితిష్ఠతి స్మ = అధిష్ఠించెను, స్వర్గాత్ నిరాకృతాః దేవాః = స్వర్గమునుండి, నిరాకృతాః = వెడలగొట్టబడిన దేవతలు, శ్రీవిష్ణుం హరిమ్ = శ్రీ విష్ణువును శత్రుదమనుని, తుష్టువుః = ప్రార్థించిరి.

**తా :** వాని కుమారుడు బలి యనువాడు ఇంద్రాది దేవతలను జయించి, వారి అధికారములను వశము జేసికొని, వారిని పారద్రోలి స్వర్గమునకు తానే అధిపతి యాయెను. అట్లు పారద్రోలబడిన దేవతలు విష్ణువును ప్రార్థించిరి.

**శ్లో॥ దేవప్రార్థనయా తుష్టో భగవాన్వామనాభిధః ।**
**పయోవ్రతఫలం దాతుం పుత్రోఽదిత్యా అజోఽప్యభూత్ ॥ 24**

**ప్ర :** దేవప్రార్థనయా తుష్టః = దేవతల ప్రార్థనచే సంతోషించిన, భగవాన్ వామన+అభిధః = వామనుడను పేరుగల భగవానుడు, అదిత్యాః = అదితికి, పయోవ్రతఫలం దాతుమ్ = పయోవ్రతఫలము నిచ్చుటకు, అజః అపి = విష్ణువున్ను, పుత్రః అభూత్ = పుత్రుడాయెను.

**తా :** దేవతల ప్రార్థనకు సంతోషించిన భగవాన్ విష్ణువు, అదితికి పయోవ్రతఫలమునిచ్చు నెపమున, వామనుడను పేరుగల పుత్రుడై జన్మించెను.

**శ్లో॥ పిత్రా సంస్కృతో దేవైర్భూషితో వామనో బలిమ్ ।**
**యయాచే త్రిపదక్ష్మాం తం స శుక్రేణాపి వారితః ॥ 25**

**ప్ర :** పిత్రా = తండ్రిచేత, సంస్కృతః = ఉపనయనసంస్కారము చేయబడినవాడై, దేవైః = దేవతలచేత, భూషితః = ప్రశంసింపబడినవాడై, వామనః = వామనుడు, తం బలిమ్ = ఆ బలిని, త్రిపదక్ష్మామ్ = మూడడుగుల భూమిని, శుక్రేణ వారితః అపి = శుక్రాచార్యునిచే నివారింపబడినను, సః = ఆతడు, యయాచే = యాచించెను.

**తా :** వామనుడు తండ్రిచే ఉపనీతుడై, దేవతలు ప్రశంసించగా, బలిచక్రవర్తిని మూడడుగుల భూమికై యాచించెను. శుక్రాచార్యుడు బలిని దానమివ్వవలదని వారించెను.

**శ్లో॥ సఙ్కల్ప్యాదాద్విరాడ్భూత్వా వామనోఽపి తదా భువమ్ ।**
**వ్యాప్యైకేన పదాన్యేన గఙ్గాపిత్రా చ గాం స్తుతః ॥ 26**

**శ్లో॥ తృతీయో బద్ధబలినా సిద్ధ్యై తన్మూర్ధ్న్యధాత్పదమ్ ।**
**నిన్యే తం సుతలం ముక్తం ప్రహ్లాదప్రార్థితో బలిమ్ ॥ 27**

**ప్ర :** సంకల్ప్య = సంకల్పించి, అదాత్ = ఇచ్చెను, వామనః అపి = వామనుడున్ను, తదా = అప్పుడు, విరాడ్ భూత్వా = విరాడ్రూపము ధరించి, ఏకేన పదా = ఒక్క పాదముతో, భువమ్ = భువమును, అన్యేన = రెండవదానితో, గామ్ = స్వర్గమును, గఙ్గాపిత్రా = గంగాదేవి తండ్రిచే, వ్యాప్య = వ్యాపించి, బద్ధబలినా స్తుతః = వచనబద్ధుడైన ప్రార్థింపబడినవాడై, సిద్ధ్యై = సత్యవాక్సిద్ధికొరకు, దానఫలసిద్ధికొరకు, తృతీయః పదమ్ = మూడవ పాదమును, తత్+మూర్ధ్ని = బలియొక్క తలపై, అధాత్ = ఉంచెను, ప్రహ్లాదప్రార్థితః = ప్రహ్లాదునిచే ప్రార్థింపబడినవాడై, తం ముక్తం బలిమ్ = ముక్తుడైన ఆ బలిని, సుతలం నిన్యే = సుతలమునకు వెడలించెను.

**తా :** అయినను బలి తన సంకల్పసిద్ధికై వామనుడు కోరిన దానమిచ్చెను. అంతట వామనుడు విరాడ్రూపుడై ఒక్క పాదమున భూమిని, రెండవ పాదమున స్వర్గమును వ్యాపించి, వచనబద్ధుడైన బలిచే ప్రార్థింపబడి మూడవ పాదమును బలి శిరముపై మోపెను. అట్లు బలికి వాగ్దానఫలము సిద్ధించగా, ప్రహ్లాదుని ప్రార్థన ననుసరించి, ముక్తుడైన బలిని సుతలమునకు వెడలించెను.

**శ్లో॥ రాజ్యం తత్సుతబాణాయ దేవేభ్యోఽదాద్దివం స్వయమ్ ।**
**ద్వారపోఽభూద్బలేస్తస్మై దాస్యత్యైన్ద్రం పదం హరిః ॥ 28**

**ప్ర :** తత్ సుత బాణాయ = బలి సుతుడైన బాణునకు, రాజ్యమ్ = రాజ్యమును, దేవేభ్యః = దేవతలకు, దివమ్ = స్వర్గమును, అదాత్ = ఇచ్చెను, హరిః = విష్ణువు, స్వయమ్ = తనకు తానుగా, బలేః = బలికి, ద్వారపః = ద్వారపాలకుడు, అభూత్ = ఆయెను, తస్మై = వానికి, ఐన్ద్రం పదమ్ = ఇంద్రపదవిని, దాస్యతి = ఇచ్చుచున్నాడు.

**తా :** బలి కుమారుడు బాణుడు. వానికి రాజ్యమిచ్చి, దేవతలకు స్వర్గమిచ్చి, విష్ణువు స్వయముగ బలికి ద్వారపాలకుడాయెను. బలికి ఇంద్రపదవిని ప్రసాదించెను.

**శ్లో॥ ఏవం ప్రభావః శ్రీదత్తో యదాత్మానమనీశ్వరాః ।**
**జ్ఞాతుం సురాసురాహ్యాద్యా మనుష్యాణాం తు కా కథా ॥ 29**

**ప్ర :** ఏవం ప్రభావః = ఇంతటి ప్రభావశాలియైన, శ్రీదత్తః = శ్రీదత్తుడు, ఆత్మానమ్ = ఆత్మను, జ్ఞాతుమ్ = తెలియుటకు, సుర+అసుర+అహి+ఆద్యాః = దేవతలు, దానవులు, నాగులు మొదలగువారు, అనీశ్వరాః యత్ = అసమర్థులను దానిని తెలిసికొనిన, మనుష్యాణాం తు = మనుష్యుల విషయముననైతే, కా కథా = చెప్పవలసినదేమున్నది?

**తా :** ఇంతటి ప్రభావశాలియైన శ్రీదత్తుడును, దేవదానవులును నాగులును ఇత్యాదు లెవ్వరును

ఆత్మను, అనగా స్వస్వరూపమును తెలిసికొనలేకుండిరనగా, మనుష్యుల శక్తిసామర్థ్యముల గూర్చి చెప్పవలెనా?

**శ్లో॥ కదాచిత్పిఙ్గలో నాగో దృష్ట్వాఽముం మాహురస్థితమ్ ।**
**కృష్ణాధాత్రీతలే వేదం పఠన్తం వ్రాత్యవేషతః ॥ 30**

ప్ర : కదాచిత్ = ఒకానొకప్పుడు, పింగళః నాగః = పింగళుడను నాగు, కృష్ణా-ధాత్రీ-తలే = కృష్ణానదీతటమున, వ్రాత్యవేషతః = యెట్టి వర్ణసంస్కారమునులేక, చాతుర్వర్ణ్యగర్హితమైన వేషముతో, వేదం పఠన్తమ్ = వేదమును చదువుచున్న, మాహురస్థితమ్ = 'మాహుర్' అనే బోయపల్లెయందున్న వాడగు, అముమ్ = శ్రీ దత్తుని, దృష్ట్వా = చూచి,

**శ్లో॥ పప్రచ్ఛ భవతః కోఽయమాశ్రమో వర్ణగర్హితః ।**
**వర్ణిత్వం తే న కౌపీనమౌఞ్జీదణ్డాదివర్జిత! ॥ 31**

**శ్లో॥ న గృహిత్వం చాగ్నిహోత్రద్విసూత్రాదివివర్జిత! ।**
**వనిత్వం తే న చాగస్తుసాధనాదివివర్జిత! ॥ 32**

**శ్లో॥ న భిక్షుత్వం శిఖాగ్రామ్యభోగయుక్త! దిగమ్బర! ।**
**కేనోపదిష్టో మార్గోఽయం నగ్న! స్త్రీమద్యలాలస! ॥ 33**

ప్ర : పప్రచ్ఛ = అడిగెను, అయం వర్ణగర్హితః = ఈ వర్ణద్వేషియైన, భవతః ఆశ్రమః కః = మీ ఆశ్రమమేది?, కౌపీనమౌఞ్జీదణ్డ+ఆది-వర్జిత! = గోచిగుడ్డ, మౌంజీ, దండము మొదలగునవి లేనివాడా!, తే = నీది, వర్ణిత్వమ్ = బ్రహ్మచర్యము, న = కాదు; అగ్నిహోత్రద్విసూత్రాదివివర్జిత = ఓ అగ్ని కార్యము, ద్విసూత్రము, ఇత్యాదులు లేనివాడా!, గృహిత్వం చ న = గృహస్థుడవున్ను కాదు; ఆగస్తుసాధనాదివివర్జిత! = శమదమాదిసాధనలేవియు లేనివాడా!, తే = నీది, వనిత్వమ్ = వానప్రస్థము, న = కాదు; శిఖాగ్రామ్యభోగయుక్త = శిఖతో గ్రామములలో భోగములకు తగినవాడా!, భిక్షుత్వం న = బిచ్చగాడవుకాదు, (ఏలన), దిగమ్బర! = ఓ దిగంబరుడా!, నగ్న! = ఓ నగ్నదేహా!, స్త్రీ మద్యలాలస! = స్త్రీల యందు, మద్యమునందు ఆసక్తి గలవాడా!, అయం మార్గః = ఈ మార్గము, కేన ఉపదిష్టః = ఎవనిచే ఉపదేశింపబడినది?

**తా (శ్లో.30-33) :** ఒకానొకప్పుడు పింగళుడను ఒక నాగు కృష్ణానదీతీరమున యే వర్ణమునకు చెందని వేషధారణతో వేదము చదువుచున్న ఈ దత్తప్రభువును చూచి ఇట్లడిగెను : వర్ణగర్హితమైన నీ ఆశ్రమమేది? కౌపీనము, మౌంజి, దండము అను చిహ్నములు లేవు కనుక నీవు బ్రహ్మచారి వనుట చెల్లదు; అగ్నిహోత్రద్విసూత్రాది చిహ్నములు లేవు కనుక గృహస్థుడవనుటయు సరికాదు; శమదమాది సాధనసంపత్తియు నీకు లేదు కావున నిన్ను వానప్రస్థుడనుట కూడ పొసగదు; సిగజుట్టిన బిచ్చగాడవనుటకు నీ దిగంబరత్వము గ్రామీణులకును సరిపడదు; ఓ నగ్నదేహా! నీవు స్త్రీ లోలుడవు, మద్యపానాసక్తుడవువలె ఉన్నావు. ఈ మార్గము నీ కెవరుపదేశించినారు?

**శ్లో॥ ప్రభుః ప్రాహ తముక్తాన్యః పఞ్చమోఽయం మమాశ్రమః ।**
**యో వికల్పేనాత్మరూపం విశ్వం పశ్యేదభేదదృక్ ॥ 34**

**శ్లో॥ వైరాగ్యయుక్తో వీతారిస్తస్యాయం పఞ్చమాశ్రమః ।**
**త్వయా శ్రుతో న వై తం హి జానీయుర్బ్రాహ్మణాః సమాః ॥ 35**

**ప్ర :** ప్రభుః = శ్రీదత్తప్రభువు, తమ్ = వానికి, ప్రాహ = ఇట్లనెను, ఉక్త = నీచే చెప్పబడిన వానికి, అన్యః = భిన్నమైనది, పఞ్చమః = ఐదవది, అయం మమ ఆశ్రమః = ఈ నా ఆశ్రమము, యః = ఎవడు, వికల్పేన = ఐచ్ఛికముగా, విశ్వమ్ = విశ్వమును, అభేదదృక్ = సమదృష్టితో, ఆత్మరూపమ్ = ఆత్మరూపముగా, పశ్యే = దర్శించునో, తస్య = వానిదైన, వైరాగ్యయుక్తః = నిరాసక్తతతో కూడిన, వీత+అరిః = శత్రుత్వము మాసిన, పఞ్చమ+ఆశ్రమః అయమ్ = ఐదవ ఆశ్రమము యిది; త్వయా = నీ చేత, శ్రుతః న వై = వినబడనే లేదా!?, తం హి = అట్టివానినే, బ్రాహ్మణాః = బ్రహ్మవేత్తలు, సమాః = సములుగా, జానీయుః = తెలియుదురు.

**తా :** శ్రీ దత్తప్రభువు వాని కిట్లనెను : నీవు చెప్పిన ఆశ్రమములకు భిన్నమైన ఐదవ ఆశ్రమము నాది. విశ్వమును అభేదదృష్టితో ఆత్మరూపముగా మనసార దర్శించునో వానిదైన పంచమాశ్రమ మిది. వీనికి దేనియందును ఆసక్తియుండదు, శత్రుత్వముండదు. ఈ లక్షణములు గలవానినే బ్రహ్మవేత్తలు సముడుగా గుర్తింతురని నీవు వినవే లేదా?!

**శ్లో॥ ఇత్థం శ్రుత్వా సోఽనసూయాగర్భరత్నమిదం మహః ।**
**ఇతి మత్వాతిఖిన్నస్తం ప్రార్థయామాస దీనవాక్ ॥ 36**

**ప్ర :** ఇత్థం శ్రుత్వా = ఈ మాటలు విని, ఇదం మహః = ఇది గొప్ప విషయము, ఇతి మత్వా = అని తలచి, అతిఖిన్నః = మిక్కిలి విచారగ్రస్తుడై, దీనవాక్ = దీనమైన మాటలతో, సః = ఆతడు, ఆ పింగళుడు, తం అనసూయాగర్భరత్నమ్ = ఆ అనసూయానందనుడైన శ్రీదత్తుని, ప్రార్థయామాస = ప్రార్థించెను.

**తా :** ఈ మాటలు విని, ఇది గొప్ప విషయమని తలచి తన అజ్ఞానమునకు వగచి జాలిగొల్పు మాటలతో ఆ పింగళుడు శ్రీదత్తప్రభువునిట్లు ప్రార్థించెను.

**శ్లో॥ కుత్సితా రుశతీ దార్ఢ్యాద్వాగుక్తా మేఽనయాఽనఘ! ।**
**భర్త్సితోఽసీశ! మాం శాధి దౌరాత్మ్యం మే క్షమస్వ భోః ॥ 37**

**ప్ర :** కుత్సితా = అసహ్యము, రుశతీ = బాధించునది, దార్ఢ్యాత్ = కఠినముగా, ఉక్తా = పలుకబడినది, మే వాక్ = నా వాక్కు, అనయా = దానిచే, భర్త్సితః అసి = దూషింపబడినవాడవైతివి, (హే) అనఘ = ఓ పాపరహితా!, (హే) ఈశ = ఓ ప్రభూ!, మామ్ = నన్ను, శాధి = శాసింపుము, భోః = ఓ స్వామీ!, మే = నా యొక్క, దౌరాత్మ్యమ్ = దుష్టతను, క్షమస్వ = క్షమించుము.

**తా :** ఓ పుణ్యాత్మా! నా వాక్కు సహింపరానిది, బాధించునది, కఠినమైనది. నిన్ను దూషించినాను. ఓ స్వామీ! నా దుష్టత్వమును మన్నింపుము. నన్ను శాసింపుము.

**శ్లో॥ ఇతి క్షమాప్య విశ్వేశం సంప్రాప్తానుగ్రహో విభుమ్ ।**
**అభివాద్య ప్రసన్నాత్మా స్వాశ్రమం పింగలో యయౌ ॥ 38**

**ప్ర :** ఇతి క్షమాప్య = ఇట్లు క్షమాపణ చెప్పి, విశ్వేశమ్ = విశ్వేశ్వరుడైన, విభుమ్ = శ్రీదత్తప్రభువును, అభివాద్య = నమస్కరించి, సంప్రాప్త+అనుగ్రహః= ఆ ప్రభువు అనుగ్రహము పొంది, పింగలః = పింగళుడు, ప్రసన్నాత్మా = శాంతుడై, స్వాశ్రమమ్ = తన ఆశ్రమమును గూర్చి, యయౌ = వెడలెను.

**తా :** ఇట్లు క్షమాపణ వేడుకొని, శ్రీదత్తుని నమస్కరించి, అనుగ్రహము పొంది, పింగళుడు ప్రశాంతచిత్తుడై తన ఆశ్రమమునకు పోయెను.

**శ్లో॥ తథైవ సాధ్యదేవేభ్యో భగవానాహ హృద్ధియా ।**
**ధృతిసత్యశమాద్యైర్హృద్గ్రన్థిం ఛిత్వా శమం నయేత్ ॥ 39**

**ప్ర :** తథా ఏవ = అట్లే, పింగళునకెట్లో అట్లే, సాధ్యదేవేభ్యః = సాధ్యులు అను దేవయోనుల నుద్దేశించి, భగవాన్ = శ్రీ దత్తభగవానుడు, ఆహ = ఇట్లనెను, హృత్ ధియా = హృదయము, బుద్ధియను సాత్త్వికవివేకముచే, ధృతిసత్యశమాద్యైః = ధృతి, సత్యము, శమము, ఇత్యాదుల చేత, గ్రంథిమ్ = గ్రంథిని, ఛిత్వా = ఛేదించి, హృత్ = హృదయమును, అంతఃకరణమును, శమం నయేత్ = శమింపజేయవలెను.

**తా :** సాధ్యులను దేవయోనులడుగగా శ్రీదత్తప్రభువు వారి కిట్లనెను : సాత్త్వికవివేకముచే, ధృతి, సత్యము, శమము, ఇత్యాదులచే ముడిని తెగ గోసి అంతఃకరణమును శమింపజేయవలెను.

**శ్లో॥ గర్వాక్రోశాన్యావమానద్రోహకామాదయోఽర్థహాః ।**
**త్యాజ్యాః క్రూరారున్తుదాసద్వాక్చ సహ్యా తతోఽవ్యథః ॥ 40**

**శ్లో॥ తద్వత్సన్మున్యసచ్చోరసఙ్గీ రఙ్గాత్పటో యథా ।**
**స్వయం సహిష్ణుర్నో కుర్యాన్నిన్దాఘాతాది దైవభాక్ ॥ 41**

**ప్ర :** గర్వ+ఆక్రోశాని = గర్వము, దుఃఖము, అవమానద్రోహకామాదయః = అవమానభావము, ద్రోహభావము, కోరిక మొదలైనవి, అర్థహాః = అనర్థమును కలిగించునవి, త్యాజ్యాః = విడువదగినవి, క్రూర+ఆరున్తుదా = క్రూరమైన, మర్మభేదకమైన, అసత్ వాక్ = చెడు మాటలను, చ = కూడ, సహ్యా = సహించదగును, తతః = అందువలన, అవ్యథః = విచారములేనివాడగును; సన్ముని = మంచిమునితో, తద్వత్ = అట్లే, అసత్ = చెడ్డవారితో, చోర = దొంగలతో, సఙ్గీ = సంగము గలవాడై, రఙ్గాత్ = రంగముతో సంగమువలన, పటః యథా = వస్త్రధారణ యెట్లో

అట్లే; స్వయమ్ = తనకు తానుగా, దైవభాక్ = దైవసముద్రై, సహిష్ణుః = సహనశీలియై, నిన్దాఘాత+ఆది = నిందించుట, కొట్టుట మొదలగువానిని, నో కుర్యాత్ = చేయరాదు.

**తా :** గర్వపడరాదు, దుఃఖించరాదు, అవమానించరాదు, అపకారము చేయరాదు, కోరిక లుండరాదు. ఇవి యన్నియు అనర్థహేతువులు. క్రూరము, మర్మభేదకము అయిన చెడు మాటలను కూడ సహించవలెను. అందువలన విచారము కలుగదు. ఒక మునితో, ఒక చెడ్డవానితో, దొంగతో, రంగస్థలముపై వేషధారివలె, కలిసి యుండవలెను. సహనశీలియై, దైవసముద్రై, ఎవరినైన నిందించుట, కొట్టుట మొదలగు చర్యలకు పాల్పడరాదు.

**శ్లో॥ వాక్సేవ్యా వ్యాహృత్యా సత్యా ప్రియా ధర్మ్యా చ సద్యుజా ।**
**చిన్త్యోఽభావో నాన్యరన్ధ్రం నేక్ష్యం దేయం ప్రతిశ్రుతమ్ ॥ 42**

**ప్ర :** సత్ యుజా = సత్సంగముచేత, సత్యా = సత్యమైన, ప్రియా = ప్రియమైన, ధర్మ్యా చ = ధర్మమైనదియునైన, వ్యాహృత్యా = ప్రకటనయైన, వాక్ = వాక్కుచే, సేవ్యా = సేవింపదగినది; అభావః = ఇతరుల నాశము, న చిన్త్యః = భావింపరానిది, అన్యరన్ధ్రమ్ = ఇతరుల దోషము, న ఈక్ష్యమ్ = ఎన్నరానిది, ప్రతిశ్రుతమ్ = వాగ్దానము, దేయమ్ = నెరవేర్చదగినది.

**తా :** మంచివారితో స్నేహము చేయవలెను; వాక్కు సత్యమైనది, ప్రియమైనది, ధర్మమైనది, ఆస్వాదింపదగినది కావలయును; ఇతరుల నాశము భావించరానిది; ఇతరుల దోషమెన్నరానిది, చేసిన వాగ్దానము నెరవేర్చవలయును.

**శ్లో॥ సుహృత్సేవ్యోఽధమో నైవ శ్రద్ధేయం శ్రేయ ఆత్మనః ।**
**సమో నిన్దాప్రశంసాదౌ తథోత్కర్షాపకర్షయోః ॥ 43**

**ప్ర :** సుహృత్ = మంచి హృదయముల స్నేహితుడు, సేవ్యః = అనుసరించదగినవాడు, అధమః = అధముడు, న = కాదు; ఆత్మనః శ్రేయః ఏవ = తనకు శ్రేయస్సు కలిగించునది మాత్రమే, శ్రద్ధేయమ్ = శ్రద్ధ చూపదగినది; నిన్దా-ప్రశంసా+ఆదౌ = నిందయందును, పొగడ్తలయందును, సమః = సమానభావము గలవాడు, తథా = అట్లే, ఉత్కర్ష+అపకర్షయోః = సంతోషమందు, దుఃఖమందును.

**తా :** మంచి మనస్సుగలవారితో స్నేహము చేయవలె, నీచులతో కాదు. తన ఆత్మకు శ్రేయస్సు కలిగించు దానియందే శ్రద్ధ వహించవలె. నిందలను పొగడ్తలను, సంతోషమును, దుఃఖమును సమభావముతో స్వీకరించవలెను.

**శ్లో॥ ప్రహృష్టం శోకరాహిత్యం దుర్వృత్తాచ్చ నివర్తనమ్ ।**
**శ్రేయోమార్గోఽయమాదేయ ఇతీశః ప్రాహ తేఽభజన్ ॥ 44**

**ప్ర :** ప్రహృష్టమ్ = సంతుష్టి, శోకరాహిత్యమ్ = దుఃఖము లేకుండుట, చ = మరియు, దుర్

వృత్తాత్ = చెడు నడతనుండి, నివర్తనమ్ = మరలుట, అయమ్ = ఇది, ఆదేయః = బోధింపదగిన, శ్రేయోమార్గః = శ్రేయస్కరమైన మార్గము, ఇతి = అని, ఈశః ప్రాహ = శ్రీదత్తప్రభువు పలికెను.

**శ్లో॥ ఏవం సురర్షిప్రముఖా భగవద్భావమద్వయమ్ ।**
**ప్రసాదేనైవ సంప్రాప్తా భక్తిగమ్యస్య చాత్మనః ॥ 45**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగ, సురర్షి–ప్రముఖాః = దేవర్షి నారదాదులు, అభజన్ = సేవించుచు, ప్రసాదేన ఏవ = అనుగ్రహముచేతనే, భక్తిగమ్యస్య = భక్తిచేత పొందదగినదైన, ఆత్మనః = ఆత్మయొక్క, అద్వయం భగవద్భావమ్ = అవిభక్తమైన భగవద్భావమును, తే = వారు, సంప్రాప్తాః = పొందినవారైరి.

**తా :** సంతృప్తి, శోకించకుండుట, చెడు నడవడిక లేకుండుట, అను ఇది బోధింపదగిన శ్రేయోమార్గము, ఈ మార్గమున దేవర్షి నారదాదులు సేవించుచు, భక్తిచేత మాత్రమే పొందదగిన ఆత్మయొక్క అవిభక్తభగవద్భావమును, అనుగ్రహింపబడి, పొందినారు.

**శ్లో॥ పరోఽసౌ పురుషో భూమా భక్త్యా లభ్యోహ్యనన్యయా ।**
**క్రమేణ పుణ్యశీలేన సతా నాన్యేన దుష్కృతా ॥ 46**

**ప్ర :** అసౌ పరః పురుషః = ఈ పరమ పురుషుడు, అనన్యయా = ఏకాగ్రమైన, అన్యచింతనలేని, భూమా భక్త్యా = గొప్పనైన భక్తిచేత, పుణ్యశీలేన సతా = సచ్ఛీలుడైన సత్పురుషునిచే, క్రమేణ హి = పరిణామఫలముగా మాత్రమే, లభ్యః = పొందదగినవాడు, అన్యేన దుష్కృతా = వేరొక దుశ్చర్యలు చేయువాని చేత, న = కాదు.

**తా :** ఈ పరమపురుషుని మంచిప్రవర్తనగలవాడు మాత్రమే గొప్పభక్తిచే కాలక్రమమున పొందును. దుష్ప్రవర్తనగలవాడెన్నడును పొందలేడు.

**శ్లో॥ స్మరణేఽస్యాఽర్జునోఽలర్కో వన్దనే దాస్య ఆయురిత్ ।**
**సఖ్యే రామో విష్ణుదత్తః సేవనే యదురర్చనే ॥ 47**

**ప్ర :** అస్య స్మరణే = వానియొక్క స్మరణలో, అర్జునః = అర్జునుడు, వన్దనే = నమస్కారమునందు, అలర్కః = అలర్కుడు, దాస్యే = దాస్యమున, ఆయురిత్ = యముడు, సఖ్యే = సఖ్యమున, రామః = రాముడు, సేవనే = సేవలో, విష్ణుదత్తః = విష్ణుదత్తుడు, అర్చనే = పూజలో, యదుః = యదువు

**తా :** స్మరణచే అర్జునుడు, వందనచే అలర్కుడు, దాస్యమున యముడు, స్నేహముచే రాముడు, సేవచే విష్ణుదత్తుడు, పూజచే యదువు, ఇట్లే నవవిధ భక్తిమార్గములలో నేదియో యొకదానిని స్వీకరించి వీరు ఆదర్శమూర్తులైనారు.

**శ్లో॥ కీర్తనే వేదధర్మా చ శ్రవణే దీపకో హరేః ।**
**ఏతే చాన్యే చ బహవః సర్వస్వాత్మనివేదనే ॥ 48**

**ప్ర :** కీర్తనే = కీర్తించుటలో, వేదధర్మా = వేదధర్ముడు, చ = మరియు, హరేః శ్రవణే = హరికథలను వినుటలో, దీపకః = దీపకుడు, ఏతే = వీరు, చ = మరియు, అన్యే బహవః చ = ఇతరులు చాలమంది కూడ, సర్వస్వ+ఆత్మనివేదనే = సంపూర్ణశరణాగతిలో

**తా :** కీర్తించుటలో వేదధర్ముడు, హరికథా శ్రవణమున దీపకుడు, అను వీరు ధన్యులైరి. ఇతరులు కూడ చాలమంది సంపూర్ణశరణాగతిలో పరమపురుషుని చేరుకొనిరి.

**శ్లో॥ యో యో యాం యాం కృతీ భక్తిం వృణుతే తస్య తస్య సః ।**
**తాం తాం స్థిరీకృత్య దత్తే హృద్యమర్థం త్రయీశ్వరః ॥ 49**

**ప్ర :** యః యః = ఎవరెవరు, యాం యాం కృతీ భక్తిమ్ = యే యే విధమైన భక్తిని, వృణుతే = స్వీకరించి అనుసరించునో, తస్య తస్య = వాని వానికి, తాం తాం = దాని దానిని, స్థిరీకృత్య = స్థిరము జేసి, సః త్రయీశ్వరః = ఆ త్రిమూర్తిస్వరూపుడైన **శ్రీదత్తప్రభువు**, హృద్యం అర్థమ్ = మనసులో కోరిన దానిని, దత్తే = ప్రసాదించును.

**తా :** ఈ పై జెప్పబడిన భక్తిమార్గములు తొమ్మిదింటిలో ఎవరు దేనిని స్వీకరించి అనుసరించినను, వారికి దానినే స్థిరము జేసి, త్రిమూర్తిస్వరూపుడైన శ్రీదత్తప్రభువు వారి కోరికలను ప్రసాదించును.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం ద్వితీయాష్టకేఽష్టమోఽధ్యాయః ।

ఓమ్ శం

---

## ఏకాక్షరో దత్తాత్రేయమన్త్రః

ఓం ద్రాం ॥

శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## తృతీయాష్టకము - ప్రథమాధ్యాయము

**శ్లో॥ ప్రయతేః సులభో భక్త్యాఽయమాత్మా పురుషః పరః ।**
**ఇతి వేదాదినోక్తం తద్భక్తిర్ముఖ్యాధునోచ్యతే ॥** 1

**ప్రతిపదార్థం :** అయం ఆత్మా పరః పురుషః = పరమపురుషుడైన యీ ఆత్మ, ప్రయతేః = కైవల్యమునకై సర్వప్రయత్నములు చేయు యతికి, భక్త్యా సులభః = భక్తిచే చక్కగా లభించువాడు, ఇతి = అని, వేదాదినా+ఉక్తమ్ = వేదములచే, స్మృతులచే, పురాణగాథలచే చెప్పబడినది, ముఖ్యా తత్ భక్తిః = ముఖ్యమైన ఆ భక్తిని గురించి, అధునా = ఇప్పుడు, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** కైవల్యమును గోరి మనసార ప్రయత్నించు యతికి ఆత్మరూపుడైన పరమపురుష దర్శనము భక్తిచే సులభమని వేదాది శాస్త్రములన్నియు చెప్పుచున్నవి. అంతటి ప్రాముఖ్యము గల భక్తివిషయమిప్పుడు వివరించబడును.

**శ్లో॥ నిర్వికల్పం పరంబ్రహ్మ సాక్షాత్కర్తుమనీశ్వరాః ।**
**యే మన్దాస్తేఽనుకమ్ప్యన్తే సవిశేషనిరూపణైః ॥** 2

**ప్ర :** యే మన్దాః = మందబుద్ధులెవరు, నిర్వికల్పమ్ = అవిభాజ్యమైన, పరంబ్రహ్మ = పరబ్రహ్మమును, సాక్షాత్కర్తుమ్ = సాక్షాత్కరించుకొనుటకు, అనీశ్వరాః = అసమర్థులో, తే = వారు, సవిశేష = విశేషములతో కూడిన, నిరూపణైః = నిరూపణలతో, అనుకమ్ప్యన్తే = అనుగ్రహించబడుచున్నారు.

**తా :** నిర్వికల్పపరబ్రహ్మమును సాక్షాత్కరించికొనుటకు అసమర్థులైన మందబుద్ధులను అనుగ్రహించుకొరకు సవిశేషనిరూపణ లివ్వబడుచున్నవి. *

**శ్లో॥ వశీకృతే మనస్యేషాం సగుణబ్రహ్మశీలనాత్ ।**
**తదేవావిర్భవేత్సాక్షాదపేతోపాధికల్పనమ్ ॥** 3

ప్ర : ఏషామ్ = ఎవరికి, వశీకృతే మనసి = నియంత్రింపబడిన మనస్సులో, సగుణబ్రహ్మశీలనాత్ = సగుణబ్రహ్మను భావించుటచేత, తత్ ఏవ = ఆ భావనయే, సాక్షాత్ = కంటియెదుట, అపేత+ఉపాధి కల్పనమ్ = కనరాని రూపకల్పన, ఆవిర్భవేత్ = అవతరించును.

**తా :** నియంత్రించబడిన మనస్సులో సగుణబ్రహ్మను భావించుటచేత, ఆ సగుణబ్రహ్మ సరూపమూర్తియై సాక్షాత్కరించును. యే గుణమూర్తి భావములో నిల్చునో ఆ గుణాకృతియే సాకారమగును. కావున పరబ్రహ్మయొక్క నిర్గుణనిరాకారతత్త్వమే భక్తుని మనోధర్మమున కనుగుణముగ సగుణసాకారమూర్తియగుట వలన, సాకారనిరాకారములకు భేదమెన్నరాదు. *

**శ్లో॥ ఇత్యుక్తేర్నవధా భక్తిర్వాచ్యాత్ర స్మరణాత్మికా ।**
**శ్రేష్ఠాఽర్థ్యాఽన్యత్ర చ వ్యాప్తా హృచ్ఛుద్ధ్యాఽస్య పదప్రదా ॥ 4**

ప్ర : ఇతి ఉక్తేః = అను ప్రసంగమువలన, నవధా భక్తిః వాచ్యా = తొమ్మిది విధములుగా భక్తి చెప్పబడినది, అత్ర = వానిలో, స్మరణాత్మికా = స్మరణప్రధానమైన భక్తి, శ్రేష్ఠా = శ్రేష్ఠమైనది, అర్థ్యా = సత్యముగా, అన్యత్ర చ = కీర్తనాది భక్తివిధానములలో, కూడ, వ్యాప్తా = వ్యాపించినదై, హృత్+శుద్ధ్యా = హృదయ శుద్ధిచేత, అస్య = భక్తునకు, పద = పరమపదమును, ప్రదా = ఇచ్చునది యగును.

**తా :** ఈ ప్రసంగమువలన భక్తి తొమ్మిది విధములని తెలియును. కాగా, వానిలో శ్రేష్ఠమైన విధానము స్మరణభక్తి. మనశ్శుద్ధివలన కీర్తనభక్తి మొదలగునవి కూడా నిజముగ పరమపద ప్రాప్తిని కలిగించును.

**శ్లో॥ సహస్రాఙ్గాత్మకర్మాఖ్యభగవత్స్మరణాత్సదా ।**
**కృతం కర్మాప్యకర్మైవ యేనైష ద్రాగ్విముచ్యతే ॥ 5**

ప్ర : సహస్ర+అఙ్గ+ఆత్మకర్మ+ఆఖ్య = సహస్రాంగములుగల ఆత్మయొక్క కర్మ అను పేరుగల, భగవత్+స్మరణాత్ = భగవంతుని స్మరణవలన, సదా = ఎల్లప్పుడు, కృతమ్ = చేయబడిన, కర్మ+అపి = కర్మ కూడ, అకర్మ+ఏవ = అకర్మయే, యేన = అట్టి అకర్మయైన కర్మచే, ద్రాక్ = వెంటనే, విముచ్యతే = ముక్తిని పొందును.

**తా :** ఆత్మ స్వయముగ అవిభక్తమైనను, సగుణసరూపవ్యక్తిగా భావించినప్పుడు దాని అంగములు అసంఖ్యాకములు. అట్లే కర్మలును, నామములును. వీని స్మరణవలన మానవుడు తాను నిత్యము చేయు కర్మఫలములు తన నంటవు, కావున అవి అకర్మలై పోవును. తాను కర్మ చేయనివాడే యగును కావున అప్పటికప్పుడే కర్మబంధమునుండి ముక్తుడగును. *

**శ్లో॥ కృత్వేశ్వరే పరాం భక్తిం భగవత్కీర్తనాదపి ।**
**సద్భక్తో మాయికాం పాశం ఛిత్వా యాతి స సద్గతిమ్ ॥ 6**

**ప్ర :** ఈశ్వరే = భగవంతునియందు, పరాం భక్తిం కృత్వా = పరమభక్తిని నిల్పి, భగవత్ కీర్తనాత్ అపి = భగవంతుని కీర్తించుటవలన కూడ, సః సద్భక్తః = అట్టి సద్భక్తుడు, మాయికాం పాశమ్ = మాయాపాశమును, ఛిత్వా = త్రెంచి, సద్గతిం యాతి = మంచిగతులను పొందును.

**తా :** ఈశ్వరునియందు పరమభక్తిని నిల్పి కీర్తించుటవలన కూడ, ఆ కీర్తనభక్తితత్పరుడు మాయాపాశమును త్రెంచి వేసి సద్గతిని పొందును.

**శ్లో॥ తద్గుణశ్రవణాచ్చాపి శ్రద్ధావానబహిర్ముఖః ।**
**సమాహితోఽనసూయుర్నా క్షిప్రం నైష్కర్మ్యసిద్ధిభాక్ ॥ 7**

**ప్ర :** తత్ గుణశ్రవణాత్ చ అపి = ఆ భగవానుని గుణములను వినుట వలన కూడ, అబహిర్ముఖః = లోకదృష్టిగలవాడు కాక, అనగా, అంతర్దృష్టితో ఆత్మను దర్శించువాడైన, శ్రద్ధావాన్ = శ్రద్ధగలవాడు, సమాహితః = ఏకాగ్రచిత్తుడై, అనసూయుః = అసూయలేనివాడై, నైష్కర్మ్యసిద్ధిభాక్ = అకర్మగా తన కర్మలన్నియు మారి తత్ఫలముగా విజ్ఞానము సిద్ధించినవాడు, నా = నరుడు, క్షిప్రమ్ = సత్వరమే (యగును).

**తా :** భగవానునిగుణశ్రవణము వలన గూడ శ్రద్ధగలవాడై నరుడు అంతర్ముఖుడై, ఏకాగ్రచిత్తుడై, అసూయలేనివాడై, విశేషముగ దైవజ్ఞానము కలిగి కర్మమాలిన్యము తొలగినవాడగును.

**శ్లో॥ వజ్రాఙ్కుశధ్వజాబ్జాఙ్కభగవత్పాదసేవనాత్ ।**
**భిత్త్వా మాయావృతిం సత్త్వశుద్ధో యాతి పరం పదమ్ ॥ 8**

**ప్ర :** వజ్రాఙ్కుశధ్వజాబ్జాఙ్క = వజ్రాయుధము, అంకుశము, ధ్వజము, పద్మము, ఈ గుర్తులు గల, భగవత్ పాదసేవనాత్ = భగవంతుని పాదములనుసేవించుట వలన, సత్త్వశుద్ధః = తనలోని సత్త్వగుణము, జీవశక్తి శుద్ధియైనవాడు, మాయా+ఆవృతిమ్ = మాయయొక్క ఆవరణమును, భిత్త్వా = బ్రద్దలు చేసి, పరం పదమ్ = పరమపదమును, యాతి = పొందుచున్నాడు.

**తా :** వజ్రము, అంకుశము, ధ్వజము, పద్మము వీని గుర్తులు గల భగవంతుని పాదములను సేవించుటవలన భక్తునిలోని సత్త్వము శుద్ధమై, ఆతడు మాయను బ్రద్దలు గొట్టి పరమ పదమును పొందును.

*

**శ్లో॥ జలేఽష్టాస్రం కనిష్ఠిక్యా లిఖిత్వా తారమన్తరే ।**
**పత్రేష్వష్టాక్షరం చైకం హృత్స్థమావాహ్య తత్ర షట్ ॥ 9**

**శ్లో॥ ప్రదర్శ్య ముద్రా ఋష్యాదీన్ స్మృత్వా విన్యస్య చోజ్ఝితేః ।**
**మాత్రాః శాఖాఙ్గేషు భూఖవాతాగ్న్యబ్భీజతో హృదా ॥ 10**

**శ్లో॥ దత్వోపచారాన్ గన్ధాదీన్ జపిత్వాఽష్టసహస్రకమ్ ।**
**తర్పయిత్వా చాష్టశతమృష్యాదీనేకవారతః ॥ 11**

**శ్లో॥ పునః సంపూజ్య విన్యస్య తం స్వాత్మన్యుద్వసేత్పరమ్ ।**
**త్రిసన్ధ్యమర్చనం త్వేవం యతేరన్యస్య చోచ్యతే ॥ 12**

**ప్ర :** జలే = నీటిపై, అష్టాస్రమ్ = అష్టదళపద్మమును, కనిష్ఠిక్యా = చిటికెన వ్రేలుతో, లిఖిత్వా = వ్రాసి, అన్తరే = దళములలో, తారమ్ = ఓంకారమును, పత్రేషు = పద్మపత్రములపై, అష్టాక్షరమ్ = **ఓం నమో నారాయణాయ** అను అష్టాక్షరీ మంత్రమును, (లిఖిత్వా), చ = మరియు, హృత్స్థమ్ = హృదయములోనున్న, ఏకమ్ = బ్రహ్మమును, ఆవాహ్య = ఆవహనచేసి, తత్ర = అచట, షట్ ముద్రా = ఆరు ముద్రలను (శంఖ, చక్ర, గద, పద్మము, ధేను, గరుడ పేర్లు గల వానిని), ప్రదర్శ్య = ప్రదర్శించి, ఋష్యాదీన్ = భగవాన్ ఋషిః, పరమాత్మా దేవతా, దైవీగాయత్రీఛన్దః అని, స్మృత్వా = స్మరించి, చ = మరియును, ఓఙ్కృతేః మాత్రాః విన్యస్య = **అం, ఉం మం** అని వ్రేళ్ళపై హృదయముపై, ఓంకారపు మాత్రలను విన్యాసము చేసి, శాఖాఙ్గేషు = శాఖయొక్క అంగములందు, భూఖవాతాగ్న్యబ్బీజతః = భూమి, ఆకాశము, వాయువు, అగ్ని, నీరు ఈ పంచభూతములను బీజాక్షరముల వలన, హృదా = మనస్ఫూర్తిగా, గన్ధాదీన్ ఉపచారాన్ దత్వా = గన్ధాది ఉపచారముల నిచ్చి, (అనగా, **లం** గన్ధం, **హం** పుష్పం, **యం** ధూపం, **రం** దీపం, **వం** నైవేద్యం అని మానసోపచారములతో పూజించి), అష్టసహస్రకం జపిత్వా = ప్రణవమును అష్టోత్తరసహస్రజపముచేసి, చ = మరియు, ఋష్యాదీన్ = ఋష్యాదులను, ఏకవారతః = ఒక్కొక్క సారిగా, అష్టశతం తర్పయిత్వా = అష్టోత్తరశతముగా ఓం తర్పయామి అని తర్పణలిచ్చి, పునః = మరల, సంపూజ్య = చక్కగ పూజించి, విన్యస్య = విన్యాసము చేసి, స్వ+ఆత్మని = తన ఆత్మయందు, తం పరమ్ = ఆ పరమాత్మను, ఉద్వసేత్ = ఉద్వాసము పలుకవలెను. (అనగా, తన ఆత్మయందు ఉన్నతముగా వసింపుమని ఆ పరమాత్మను వేడుకొనవలెను), ఏవమ్ = ఈ విధముగా, యతేః = యతికి, అన్యస్య చ = యతికాని వానికిని, త్రిసన్ధ్యమ్ = ఉదయ, మధ్యాహ్న, సాయం సంధ్యలు మూడిట, అర్చనమ్ = అర్చించు విధి, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా :** నీటిపై అష్టదళపద్మమును చిటికెన వ్రేలితో వ్రాసి, దళములలో ఓంకారమును, పత్రములలో అష్టాక్షరీ మంత్రమును వ్రాసి, పరబ్రహ్మను హృదయంలోకి ఆవాహన చేసి, అచట షణ్ముద్రలను ప్రదర్శించి, ఋష్యాదులను స్మరించి, ఓంకారాంగములైన త్రిమాత్రలను వ్రేళ్ళపై, హృదయముపై విన్యాసము చేసి, శాఖాంగములందు పంచభూతబీజాక్షరములతో మనస్ఫూర్తిగా గంధాది మానసోపచారములతో పూజించి, అష్టోత్తరసహస్రముగా ప్రణవమును జపించి, ఋష్యాదులను అష్టోత్తరశతముగా తర్పణజేసి, మరల పూజించి, విన్యాసము జేసి, ఆ పరమాత్మను తన ఆత్మయందు వసింపుమని వేడుకొని, ఈ విధముగా చేయవలెనని యతికిని యతికానివానికిని గూడ త్రికాల-సంధ్యార్చనవిధి చెప్పబడినది. *

**శ్లో॥ లబ్ధ్వా పూర్వం స్వగృహోక్తం ద్విజత్వం భక్తిమాఞ్ఛుచిః ।**
**జ్ఞాత్వా ధనర్ణసిద్ధారిచక్రసిద్ధిం మనుం గురోః ॥ 13**

శ్లో॥ లబ్ధ్వాఽర్ణసంఖ్యాలక్షాం ప్రాక్పురశ్చర్యాం యథావిధి ।
కృత్వాఽనేనార్చయేదర్చాం నియతో నిత్యకర్మకృత్ ॥ **14**

ప్ర : శుచిః = శుచియైనవాడు, భక్తిమాన్ = భక్తిగలవాడు, పూర్వమ్ = ముందుగా, స్వగృహ్య+ ఉక్తమ్ = తన గృహ్యసూత్రములననుసరించి, ద్విజత్వం లబ్ధ్వా = బ్రాహ్మణత్వమును పొంది, గురోః = గురువునుండి, ధనర్ణసిద్ధారిచక్రసిద్ధిం మనుమ్ = అకచటతపయశ వర్గములను, తన పేరులోని తొలి అక్షరవర్గమును ద్విగుణముగా దేవతాక్షరవర్గమున కలిపి అష్టభక్తావశిష్టముగ నొకచో స్థాపించి, దేవవర్గమునకును ఇట్లే చేసి, యేది అధికమో అది వర్ణదేవతగా గ్రహించి, కాది ముప్పదియారు హల్లులను స్వరయుతములుగా గ్రహించి, నక్షత్రనామ, వ్యావహారికనామ, అన్యనామాది అక్షరములతో ఆరంభించి, ఇష్టదేవతామంత్రపర్యంతము సిద్ధ, సాధ్య, సుసిద్ధ, అరి క్రమములో పునః పునః గణించుటచే సిద్ధాది మంత్రము గ్రాహ్యము; జ్ఞాత్వా = తెలిసికొని, అర్ణసంఖ్యాలక్షాం కృత్వా = మంత్రాక్షరము లెన్నియో అన్ని లక్షలుగా, ప్రాక్ = మొదట, యథావిధి = విధివిధానము ననుసరించి, నియతః = నియమముతో, నిత్యకర్మకృత్ = నిత్యకర్మచేయువాడై, అనేన = దానితో, అర్చాం అర్చయేత్ = పూజను చేయవలెను.

**తా :** శుచియైన భక్తుడు ముందుగా తన వర్ణాశ్రమధర్మముననుసరించి బ్రాహ్మణత్వమును పొంది, గురువునుండి ధనర్ణసిద్ధారిచక్రసిద్ధిమంత్రమును తెలిసికొని, మంత్రాక్షరసంఖ్యలక్షలు యథావిధిగా నియమముతో నిత్యకర్మ చేయువాడై పూజించవలెను.

శ్లో॥ లౌహీం వా సంస్కృతాం శైలీం విభోః సాస్త్రాం సలక్షణామ్ ।
సోఽపి లబ్ధ్వాఖిలాన్కామాన్దేహాన్తే తన్మయో భవేత్ ॥ **15**

ప్ర : లౌహీమ్ = లోహముతో చేయబడినది, వా = లేక, సంస్కృతాం శైలీమ్ = సంస్కరింపబడిన శిలామయమైన దానిని, సాస్త్రామ్ = అస్త్రములతో కూడిన దానిని, విభోః = దేవతలయొక్క, సలక్షణామ్ = లక్షణములుగలదానిని విగ్రహమును పూజించి (పై శ్లోకమున చెప్పిన విధివిధానముతో), సః అపి = ఆ భక్తుడున్నూ, అఖిలాన్ కామాన్ = కోరిక లన్నింటిని, లబ్ధ్వా = పొంది, దేహాన్తే = మరణము తరువాత, తన్మయో భవేత్ = తాను ఆరాధించిన దేవతా స్వరూపుడగును.

**తా :** ఇష్టదేవతా విగ్రహమును లోహముతోనో, శిలానిర్మితముగనో ఆ దేవత లక్షణములన్నిటితో అస్త్రసహితముగ నిర్మింపబడినదానిని విధిగా పూజించి, భక్తుడు కోరికలను సఫలము జేసికొని మరణానంతరము తన ఆరాధ్యదేవతలో లీనమగును. *

శ్లో॥ పురా నారాయణం బ్రహ్మా సత్యక్షేత్రే దయానిధిమ్ ।
ప్రణతోఽపృచ్ఛదేకం కిముపాస్యం దైవతం పరమ్ ॥ **16**

ప్ర : పురా = పూర్వము, సత్యక్షేత్రే =బ్రహ్మలోకమున, బ్రహ్మా = బ్రహ్మ, దయానిధిమ్ =

దయామయుడైన, నారాయణమ్ = విష్ణువును, ప్రణతః = నమస్కరించి, అపృచ్ఛత్ = ప్రశ్నించెను, ఏకం పరం దైవతమ్ = ఒక్క పరదైవము, ఉపాస్యమ్ = ఉపాసింపదగిన వాడు, కిమ్ = ఏమి, ఎవరు?

**తా :** పూర్వము బ్రహ్మలోకమున బ్రహ్మ దయామయుడైన విష్ణువును నమస్కరించి, ఉపాసింపదగిన ఒకేయొక పరదైవమేది?, అని అడిగెను. *

**శ్లో॥ స ప్రాహ నామకం ధామ యద్దత్తాత్రేయసంజ్ఞితమ్ ।**
**సదానన్దాత్మకం శుద్ధం సాత్త్వికం తారకం పరమ్ ॥ 17**

**శ్లో॥ విశ్వరూపం జగద్యోనిం తదేవోపాస్వ దైవతమ్ ।**
**లకారం వహ్నిసంయుక్తం సతుణ్డాక్షరబిన్దుకమ్ ॥ 18**

**శ్లో॥ తదర్చనే మనుం విద్ధి ఛన్దోగాయత్రికాఽస్య చ ।**
**సదాశివ ఋషిర్దేవో దత్తాత్రేయశ్చతుర్భుజః ॥ 19**

**శ్లో॥ మనురేకాక్షరోఽస్యాయం జాప్యో గర్భాదితారణః ।**
**తారః శ్రీదుర్గా క్రోం భూమిదత్తైకాక్షరయుఙ్మనుః ॥ 20**

**ప్ర :** సః ప్రాహ = నారాయణు డిట్లనెను : యత్ ధామ = యే స్థానము, సదానందాత్మకమ్ = ఆనందనిరంతరమైనది, శుద్ధం సాత్త్వికమ్ = శుద్ధసాత్త్వికమైనది, పరం తారకమ్ = సంసారమును దాటించుటలో పరమమైనది, జగద్యోనిమ్ = జగత్తునకు మూలజన్మస్థానమైన, విశ్వరూపమ్ = జగద్రూపమైన, దత్తాత్రేయసంజ్ఞితమ్ = దత్తాత్రేయుడు సంకేతముగా గలది, తత్ ఏవ దైవతమ్ = ఆ దైవమునే, ఉపాస్వ = ఉపాసింపుము, తత్ అర్చనే = ఆ దైవతారాధనలో, మనుం విద్ధి = మంత్రముగా తెలియుము, లకారమ్ = **ల**, వహ్నిసంయుక్తమ్ = **ర** తో కూడినది, సతుణ్డాక్షర బిన్దుకమ్ = **అం,** అస్య చ = దానికిన్నీ, ఛన్దో = ఛందము, ఛన్దోగాయత్రికా = గాయత్రీ ఛందము, ఋషిః సదాశివః = ఋషి సదాశివుడు, దేవః చతుర్భుజః దత్తాత్రేయః = దేవత చతుర్భుజదత్తాత్రేయుడు, అస్య అయం మనుః = దానియొక్క మంత్రము, జాప్యః = జపించదగినది, గర్భాదితారణః = తల్లి కడుపునబడినది మొదలు తరింపజేయునది, తారః = ఓంకారము, శ్రీ = శ్రీ అను బీజాక్షరము, దుర్గా = దుర్గాబీజము **హ్రీం,** క్రోం = క్రోం అను చతుర్థబీజాక్షరము, భూమిదత్త+ఏకాక్షరయుక్ మనుః = **లం** లేక **గ్లౌం, ద్రాం** తో కూడినది మంత్రము.

**తా :** నారాయణు డిట్లనెను : నిరంతరానందమయము, శుద్ధసాత్త్వికము, పరమ తారకము, జగన్మూలము, జగద్రూపము, దత్తాత్రేయసంజ్ఞ గలది యే స్థానమో, ఆ దైవమునే ఉపాసింపుము. ఆ దేవతారాధనలో లం, రం, అం, మంత్రముగా తెలియుము. దానికి గాయత్రీ ఛందము, సదాశివుడు ఋషి, చతుర్భుజదత్తాత్రేయుడు దేవత. జపించదగిన మంత్రము : ఓం శ్రీం హ్రీం క్రోం గ్లౌం ద్రాం. *

**శ్లో॥ షడక్షరో యోగదోఽయం సర్వసంపత్సమృద్ధికృత్ ।**
**ఋష్యాదిః పూర్వవన్న్యాసో బీజైః శాఖా హృదాదిషు ॥ 21**

ప్ర : అయం షట్+అక్షరః = ఈ ఆరు అక్షరములు గల మంత్రము, యోగదః = యోగకారకము, సర్వసంపత్సమృద్ధికృత్ = సమస్తసంపదలను సమృద్ధిగా కలిగించునది, దీని, ఋషి+ఆదిః = ఋషి ఛందము, దేవత మొదలగు వివరములు, పూర్వవత్ = మునుపే చెప్పినట్లుగా, బీజైః = ఆ యా బీజాక్షరములతో, శాఖాహృదాదిషు = అంగములు, కరములు, హృదయము మొదలగు వానియందు, న్యాసః = న్యాసము (చేయవలెను).

**తా :** ఈ షడక్షరమంత్రము యోగదాయకము, సంపత్కరము, దీని ఋషి మొదలగు వివరములు యథాపూర్వము గ్రాహ్యము. ఆ యా బీజాక్షరములతో అంగన్యాసకరన్యాసములు చేయదగును. *

**శ్లో॥ దత్తాత్రేయం శివం శాన్తమిన్ద్రనీలనిభం విభుమ్ ।**
**ఆత్మమాయారతం దేవమవధూతం దిగమ్బరమ్ ॥ 22**

**శ్లో॥ భస్మోద్ధూలితసర్వాఙ్గం జటాజూటధరం విభుమ్ ।**
**చతుర్బాహుముదారాఙ్గం ప్రఫుల్లకమలేక్షణమ్ ॥ 23**

**శ్లో॥ జ్ఞానయోగనిధిం విశ్వగురుం యోగిజనప్రియమ్ ।**
**భక్తానుకమ్పినం సర్వసాక్షిణం సిద్ధసేవితమ్ ॥ 24**

**శ్లో॥ ఇత్యౌపనిషదం దత్తం ధ్యాత్వైకాగ్ర్యం మనుం జపేత్ ।**
**స వాఞ్ఛితఫలం భుక్త్వా పరత్ర శ్రేయ ఆప్నుయాత్ ॥ 25**

ప్ర : దత్తాత్రేయమ్ = దత్తాత్రేయుని, శివమ్ = సుఖంకరుని, శాన్తమ్ = శాంతుని, ఇన్ద్రనీలనిభమ్ = ఇంద్రనీలమణిప్రకాశుని, విభుమ్ = సర్వవ్యాపిని, ఆత్మమాయారతమ్ = తన మాయయందు రమించువానిని, దేవమ్ = దేవుని, అవధూతమ్ = అవధూతను, దిగమ్బరమ్ = వస్త్రములు ధరింపనివానిని, భస్మ+ఉద్ధూలితసర్వాఙ్గమ్ = దేహమంతయు భస్మము పూతగలవానిని, జటాజూటధరమ్ = జడలు గట్టిన కేశములు గలవానిని, విభుమ్ = సర్వవ్యాపిని, చతుర్బాహుమ్ =నాలుగు బాహువులు గలవానిని, ఉదారాఙ్గమ్ = అందమైన దేహము గలవానిని, ప్రఫుల్ల = విప్పారిన, కమల+ఈక్షణమ్ = పద్మములవంటి కన్నులుగలవానిని, జ్ఞానయోగనిధిమ్ = జ్ఞానయోగముగూర్చి తెలిసిన సముద్రమువంటి వానిని, విశ్వగురుమ్ = జగద్గురువును, (లేక, విశ్వమే గురువుగా గలవానిని), యోగిజనప్రియమ్ = యోగులకు ప్రేమపాత్రుని, భక్త+అను-కంపినమ్ = భక్తులయందు దయగలవానిని, సర్వసాక్షిణమ్ = అన్నిటికీ సాక్షియైన వానిని, సిద్ధసేవితమ్ = సిద్ధులచే సేవింపబడు వానిని, ఇతి = అని, ఔపనిషదమ్ = ఉపనిషత్తుచే చెప్పబడిన, దత్తమ్ = దత్తుని, ఏకాగ్ర్యమ్ = ఒక్కటే రీతిగా, మనుం జపేత్ = మంత్రమును

జపించదగును. సః = ఆ భక్తుడు, వాఞ్ఛితఫలం భుక్త్వా = కోరిన ఫలమును అనుభవించి, పరత్ర = పరలోకమున, శ్రేయ ఆప్నుయాత్ = మోక్షమును పొందును.

**తా :** దత్తాత్రేయుని, శివస్వరూపుని, శాంతుని, ఇంద్రనీలమణి ప్రభాభాసితుని, తన మాయలో తానే రమించువానిని, సర్వవ్యాపియైన దేవుని, దిగంబరుడగు అవధూతను, భస్మాంగుని, జటాధరుని, చతుర్బాహుని, సుందరాంగుని, పద్మాయతాక్షుని, జ్ఞానయోగిని, జగద్గురువును, యోగిజనప్రియుని, భక్తదయాపరుని, సర్వసాక్షిని, సిద్ధసేవితుని, ఉపనిషద్వర్ణితుని, శ్రీదత్తుని మంత్రజపము నొకే మనస్సుతో చేసిన ఆ భక్తుని వాంఛలు దీరి కడపట మోక్షము నొందును. *

**శ్లో॥ సైకాక్షరం చతుర్థ్యన్తం దత్తాత్రేయం నమోఽన్వితమ్ ।**
**అష్టార్ణమన్త్రం గాయత్రం విద్ధి ద్రాం బీజమస్య తు ॥ 26**

**ప్ర :** చతుర్థ్యన్తం దత్తాత్రేయం నమోఽన్వితం అష్టార్ణమన్త్రమ్ = **ద్రాం దత్తాత్రేయాయ నమః** అను అష్టాక్షరీమంత్రమును, గాయత్రమ్ = గాయత్రీమంత్రముగ, విద్ధి = తెలియుము, అస్య తు = దానికేమో, బీజం స ఏకాక్షరమ్ = బీజమైన ఒకే అక్షరమును, ద్రామ్ = **ద్రాం** అనుదానిని, (విద్ధి = తెలియుము).

**తా :** **ద్రాం దత్తాత్రేయాయ నమః** అను అష్టాక్షరీమంత్రము గాయత్రీస్వరూపమైనదే యనియు, దానికి ఏకాక్షరబీజము **ద్రాం** అనియు తెలియుము.

**శ్లో॥ చతుర్థీం కీలకం శక్తిర్నమ ఆర్షః సదాశివః ।**
**దత్తాత్రేయపదస్యార్థః సత్యానన్దచిదాత్మకః ॥ 27**

**ప్ర :** చతుర్థీమ్ = చతుర్థీవిభక్త్యంతము, కీలకమ్ = కీలకము; నమః = నమః అనునది, శక్తిః = శక్తి, ఆర్షః = ఋషి, సదాశివః = సదాశివుడు, దత్తాత్రేయపదస్య అర్థః = దత్తాత్రేయుడను మాటకు అర్థము, సత్య+ఆనన్ద చిత్+ఆత్మకః = శాశ్వతానందమైన జ్ఞానస్వరూపుడు.

**తా :** **దత్తాత్రేయాయ** అనుదాని చతుర్థీ విభక్తి ఏకవచనాంతప్రత్యయము కీలకము, అనగా మంత్రమునకు ఇరుసు వంటిది. **నమః** అనునది శక్తి. ఋషి సదాశివుడు. **దత్తాత్రేయ** పదమునకు **శాశ్వతానందజ్ఞానరూపి** యని అర్థము. *

**శ్లో॥ ప్రహ్వీభావో నమోఽర్థస్తు పూర్ణానన్దైకవిగ్రహః ।**
**తారం సబిన్దుం తుణ్డార్ణం దుర్గాం క్రోం తుర్యమేహి చ ॥ 28**

**ప్ర :** నమః అర్థః తు = నమః అనుదాని అర్థమైతే, ప్రహ్వీభావః = వినమ్రతా భావము, తారమ్ = **ఓం** కారము, సబిన్దుం తుణ్డార్ణమ్ = **అం**, దుర్గామ్ = **హ్రీం,** తుర్యం క్రోమ్ = నాలవది **క్రోం,** ఏహి చ = **ఏహి** యను క్రియాపదము గూడ.

**తా :** నమః అనునది వినమ్రతా భావార్థకము. **ఓం అం హ్రీం క్రోం ఏహి.** *

**శ్లో॥ దత్తాత్రేయేతి సంబుద్ధ్యా స్వాహాంతం ద్వాదశాక్షరమ్ ।**
**సర్వకామదుఘం విద్ధి గాయత్రం భో శివార్షకమ్ ॥ 29**

**ప్ర :** దత్తాత్రేయ+ఇతి = దత్తాత్రేయుని, సంబుద్ధ్యా = సంబోధనంతో, స్వాహాన్తమ్ = స్వాహా శబ్దముతో ముగియునట్లు, ద్వాదశాక్షరమ్ = పంద్రెండక్షరములుగల మంత్రమును, **ఓం ఆం హ్రీం క్రోం ఏహి దత్తాత్రేయ! స్వాహా**, అను దానిని, సర్వకామదుఘమ్ = అన్ని కోరికల నిచ్చుదానిని, శివార్షకమ్ = సదాశివుని ఋషిగా గల, గాయత్రమ్ = గాయత్రీ మంత్రముగా, విద్ధి భో = తెలియుము.

**తా :** శ్రీదత్తాత్రేయుని సంబోధనంతో, **ఓం ఆం హ్రీం క్రోం ఏహి దత్తాత్రేయ! స్వాహా**, అను ద్వాదశాక్షరీమంత్రమును జపించిన వానికి కామ్యసిద్ధి కలుగును. ఆ మంత్రమునకు ఋషి సదాశివుడు. ఇది గాయత్రీమంత్రమే యని తెలియుము. *

**శ్లో॥ వరాభయదహస్తం యో భజేదాభ్యాం మహావ్రతః ।**
**సర్వాన్కామానిహైవాప్త్వా సోఽమృతో భవతి ధ్రువమ్ ॥ 30**

**ప్ర :** వర+అభయదహస్తమ్ = వరములను, అభయములను ప్రసాదించు హస్తమును, యః మహావ్రతః = వ్రతనిష్ఠితుడై ఎవడు, ఆభ్యామ్ = లక్ష్మీనారాయణులకై, భజేత్ = సేవ చేయునో, సః = అతడు, ఇహ ఏవ = ఈ లోకముననే, సర్వాన్ కామాన్ = అన్ని కోర్కెలను, ఆప్త్వా = పొంది, ధ్రువమ్ = నిశ్చయముగా, అమృతః భవతి = అమృతమయుడగును.

**తా :** శ్రీ దత్తాత్రేయుని వరదహస్తమును, అభయహస్తమును దృఢభక్తితో లక్ష్మీనారాయణరూపులుగా పూజించిన భక్తుడు, ఐహికకామనలను పొంది, నిశ్చయముగా అమృతమయుడగును, అనగా ఇహపరసాఫల్యము చేకూరును. *

**శ్లో॥ ఓం బీజం స్వాహాఽత్ర శక్తిః సంబుద్ధిః కీలకం క్రమాత్ ।**
**ద్వాభ్యాం హృది చ కే ద్వాభ్యాం శిఖాయాం క్రియయా న్యసేత్ ॥ 31**

**ప్ర :** అత్ర = ఈ మంత్రవిషయమున, ఓం బీజమ్ = ఓం అనునది బీజము, స్వాహా శక్తిః = స్వాహా యనునది శక్తి, సంబుద్ధిః కీలకమ్ = సంబోధనం కీలకము; క్రమాత్ = క్రమముగా, క్రియయా = క్రియతో, హృది = హృదయమునందు, శిఖాయాం చ = శిఖయందును, కే = శిరసునందు, ద్వాభ్యామ్ = రెండిటిచేత, ద్వాభ్యామ్ న్యసేత్ = అంగన్యాసకరన్యాసములు చేయవలెను.

**తా :** ఈ మంత్రమునకు ఓం బీజము, స్వాహా శక్తి, సంబుద్ధి కీలకము. దీనిని క్రమముగా హృదయమున, శిఖయందు, అంగన్యాస కరన్యాసాది చేయదగును. *

శ్లో॥ సంబుద్ధిభ్యాం స్కంధచక్షుర్ద్వయేఽస్త్రేఽన్యేన తన్మయః ।
చతుర్బీజైః సక్రియాఖ్యాన్త్యాభ్యాం న్యాసం కరాదిషు ॥ 32

శ్లో॥ కృత్వా యజేద్దేవదేవం యన్త్రన్యస్తమభీష్టదమ్ ।
దత్తాత్రేయ! హరే! కృష్ణ! ఉన్మత్తానన్దదాయక! ॥ 33

శ్లో॥ దిగమ్బర! మునే! బాల పిశాచ! జ్ఞానసాగర! ।
ఆనుష్టుభః శివార్షోఽయం షడ్భుజాత్రేయదైవతః ॥ 34

ప్ర : సంబుద్ధిభ్యామ్ = (దత్తాత్రేయుని) సంబోధన చేయుచూ, స్కంధ చక్షుః ద్వయే అస్త్రే అన్యేన = రెండు భుజములు, రెండు కన్నులు అస్త్రమునందు, తన్మయః = పరవశుడై, చతుర్బీజైః = నాలుగు బీజాక్షరములతో, సక్రియా = క్రియలతో కూడిన, (ఆ)ఖ్యాన్త్యాభ్యామ్ = వానియందు, కరాదిషు = అంగములందు, న్యాసమ్ = అంగన్యాస కరన్యాసమును, కృత్వా = చేసి, దేవదేవమ్ = దేవతలకు దేవుడైన వానిని, యన్త్రన్యస్తమ్ = యంత్రమున ప్రతిష్ఠింపబడిన వానిని, అభీష్టదమ్ = కామ్యముల దీర్చువానిని, యజేత్ = పూజించదగును; దత్తాత్రేయ! హరే! = ఓ దత్తాత్రేయా! ఓ శ్రీహరీ!, కృష్ణ! = ఓ కృష్ణా!, ఉన్మత్త!+ఆనన్దదాయక! = ఉన్మత్తుడా! ఆనందము నిచ్చువాడా!, దిగమ్బర! మునే! = దిగంబరా! మునీ!, బాల! పిశాచ! జ్ఞానసాగర! = బాల! పిశాచ! జ్ఞానసాగర!, (అని తలచుచు ఆ యా అంగములందు న్యాసము చేయవలెను), అయమ్ = ఈ మంత్రము, శివార్షః = సదాశివుడు ఋషిగా గలది, షడ్భుజ+ఆత్రేయదైవతః = షడ్భుజదత్తాత్రేయుడు దేవతగా గలది, అనుష్టుభః = అనుష్టుభ్ ఛందముగా గలది. *

శ్లో॥ ద్వాభ్యాం ద్వాభ్యాం హృచ్ఛిరసోః శిఖాయామేకతో గలే ।
ద్వాభ్యామేకైకేన దోర్దృగ్ద్వయే ద్వాభ్యాం తథాస్త్రకే ॥ 35

శ్లో॥ విన్యస్య జపితా దోషముక్తః సర్వోపకారకృత్ ।
తారం వాయుం క్లాం హ్రాం దుర్గాం హ్రూం చ విద్ధి సౌః ॥ 36

ప్ర : దత్తాత్రేయేతి హృది, హరే! శ్రీకృష్ణేతి శిరసి, ఉన్మత్తేతి శిఖాయాం, ఆనన్దదాయక! దిగమ్బరేతి కణ్ఠే, మునే ఇతి బాహవోః, బాలేతి నేత్రయోః, పిశాచజ్ఞానసాగరేత్యస్త్రే కరయోరపి, విన్యస్య = విన్యసించి, జపితా = జపము చేయువాడు, తారమ్ = **ఓం** కారమును, వాయుమ్ = వాయుబీజమైన **యం,** క్లాం = క్లాం, హ్రాం = హ్రాం, దుర్గాం = హ్రీం, హ్రూం = హ్రూం, సౌః = సౌః, చ = మరియు (వాగ్బీజమైన ఐం, అను బీజములను), జపితా = జపించినవాడు, దోషముక్తః = దోషరహితుడై, సర్వోపకారకృత్ = లోకోపకారియగును, అని, విద్ధి = తెలియుము.

**తా :** క్రియాపూర్వకముగ సర్వాంగములందును దత్తాత్రేయుని వివిధ నామములతో కరన్యాసాదులతో ఆ యా బీజాక్షరములను చేర్చి విన్యాసము చేసి జపించు భక్తుడు దోషరహితుడై, సర్వోపకారి యగును. *

**శ్లో॥ దత్తాత్రేయం చతుర్థ్యన్తం స్వాహాన్తం షోడశాక్షరమ్ ।**
**వాయుస్థానే తు వాగ్బీజం నమోఽన్తే యోజయాథవా ॥ 37**

ప్ర : చతుర్థి+అన్తమ్ = చతుర్థీవిభక్తి ప్రత్యయముతో, దత్తాత్రేయమ్ = దత్తాత్రేయశబ్దమును, అనగా దత్తాత్రేయాయ అని, షోడశ+అక్షరమ్ = పదియునారు అక్షరములుగల మంత్రమును, స్వాహా+అన్తమ్ = స్వాహా శబ్దముతో ముగియు దానిని, వాయుస్థానే తు = వాయుస్థానమున, వాగ్బీజమ్ = ఐం, అన్తే = చివర, నమః = నమః అనుదానిని, యోజయ = చేర్చుము, అథవా = అట్లుకానిచో, **ఓం ఐం క్లాం క్లీం క్లూం హ్రాం హ్రీం హ్రూం సౌః దత్తాత్రేయాయ నమః**

**శ్లో॥ స్వాహైకత్ర నమోఽన్యత్ర శక్తిర్బీజం చ కీలకమ్ ।**
**తారశ్చతుర్థీం గాయత్రీమంత్రరాజః శివోదితః ॥ 38**

ప్ర : ఏకత్ర = ఒకచోట, స్వాహా = స్వాహాశబ్దము, అన్యత్ర = మరియొక చోట, నమో = నమో శబ్దమును, శక్తిః బీజం చ కీలకమ్ = శక్తి కీలకబీజములను, తారః = ఓంకారము, చతుర్థీమ్ = నాలవదానిని, శివ+ఉదితః = శివునిచే చెప్పబడిన, గాయత్రీమంత్రరాజః = శ్రేష్ఠమైన గాయత్రీ మంత్రము.

**తా :** 'దత్తాత్రేయాయ' అని షోడశాక్షరీ మంత్రమును 'స్వాహా' శబ్దముతో నొకచోట, నమో శబ్దముతో నొకచోట, ఓంకారముతోను శక్తిబీజముతో జపించదగునని శివోదితమైన గాయత్రి. **ఓం ఐం క్లాం క్లీం క్లూం హ్రాం హ్రీం హ్రూం సౌః దత్తాత్రేయాయ స్వాహా.** *

**శ్లో॥ హృది ద్వే కే త్రీణి శిఖాయాం చైకం కవచే దృశోః ।**
**చతుర్థీమన్త్యమస్త్రే చ విన్యస్య జాపకామదమ్ ॥ 39**

ప్ర : హృది = హృదయమునందు, ద్వే = రెండు, కే = శిరస్సున, త్రీణి = మూడు, శిఖాయామ్ = శిఖయందు, ఏకమ్ = ఒకటియు, కవచే చ = కవచమున, రెండు భుజస్కంధములందు, దృశోః = రెండు కన్నులందు, చతుర్థీమ్ = రెండు రెండుగా నాల్గు, అస్త్రే = అస్త్రమున, అన్త్యమ్ = చివరిది, ఇట్లు, జాపకామదమ్ = జపసంబంధి ఫలమునిచ్చు దానిని, విన్యస్య = విన్యసించి,

**తా :** హృదయమున రెండు బీజములు, శిరసున మూడు, శిఖయందొకటియు, కవచమున (భుజములందు), కన్నులందు కలిపి నాలుగు, అస్త్రమున చివరి బీజము, ఇట్లు న్యాసము చేసిన జపఫలము లభించును. *

**శ్లో॥ సచ్చిదానన్దస్వరూపీ సుఖీ ముక్తో భవత్యతః ।**
**సిద్ధగన్ధర్వాదిసఙ్గీ లక్షజాప్యష్టసిద్ధిభాక్ ॥ 40**

ప్ర : సచ్చిదానన్ద స్వరూపీ = సత్ చిత్ ఆనందములే తన రూపముగా నైనవాడై, సుఖీ = సుఖము గలవాడై, ముక్తః = ముక్తుడై, లక్షజాపి = లక్షసంఖ్య మంత్రజపము చేసినవాడు, అతః =

అందువలన, అష్టసిద్ధిభాక్ = అణిమా, మహిమా, లఘిమా, గరిమా, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం (లేక, కామావసాయితా) అనబడు ఎనిమిది యోగసిద్ధులు గలవాడై, సిద్ధగన్ధర్వాదిసఖ్యీ = సిద్ధులు, గంధర్వులు మొదలగు దేవయోనుల చెలికాడుగా, భవతి = అగుచున్నాడు.

**తా :** అట్టి సాధకుడు లక్షసంఖ్య మంత్రజపము చేసినచో, ఆ శక్తివలన, ఆతడు అణిమాది అష్టసిద్ధులను పొంది సిద్ధగంధర్వాదుల చెలిమిగలవాడై, సుఖియై, ముక్తుడై, సచ్చిదానంద రూపియగును. *

**శ్లో॥ త్రిదేవలోకసంచారీ కోటిజాపీ చ దత్తవత్ ।**
**దశకోటిజాపీ సాక్షాజ్జరామరణవర్జితః ॥ 41**

**శ్లో॥ ద్వ్యష్టకోటిజపీ సిద్ధః పరకాయగతాదికృత్ ।**
**మన్త్రశక్తిరియం శ్లోకా అభిగీతా ఇహాప్యమీ ॥ 42**

**ప్ర :** కోటిజాపీ = ఒక కోటిసంఖ్య మంత్రజపము చేసినవాడు, త్రిదేవలోకసంచారీ = మూడు దేవలోకములు, అనగా, బ్రహ్మ విష్ణు శివలోకములలో సంచరించువాడగును; చ = మరియు, దశకోటిజాపీ = పదికోట్ల సంఖ్య జపించినవాడు, జరామరణవర్జితః = ముసలితనము, మరణము లేనివాడగును; ద్వ్యష్టకోటిజపీ = పదునారుకోట్ల సంఖ్య జపించినవాడు, సాక్షాత్ దత్తవత్ = సాక్షాత్తూ శ్రీదత్తునివలె, పరకాయగతాదికృత్ = పరకాయ ప్రవేశము మొదలగునవి చేయగల, సిద్ధః = సిద్ధుడు (కాగలడు); ఇయం మంత్రశక్తిః = ఈ మంత్రశక్తి, ఇహ+అపి = ఇప్పుడు, అభిగీతాః = పాడబడినవైన, అమీ శ్లోకాః = ఈ శ్లోకములు.

**తా :** ఒక కోటి మంత్రజపము చేసిన వానికి బ్రహ్మ విష్ణు శివలోకములలో సంచరించు శక్తి కలుగును. పదికోట్లు జపించిన వానికి ముసలితనము, మరణము కలుగవు. పదునారు కోట్లు జపించిన వాడు శ్రీదత్తునంతటివాడై, పరకాయప్రవేశము చేయగల సిద్ధుడు కాగలడు. ఈ మంత్రశక్తి నిట్టి శ్లోకములు గానము చేయుచున్నవి. *

**శ్లో॥ ఖడ్గస్తమ్భో జలస్తమ్భః సేనాస్తమ్భస్తథైవ చ ।**
**ఇచ్ఛాసిద్ధిర్వశిత్వం చ దిక్పాలైః సహ భాషణమ్ ॥ 43**

**శ్లో॥ వాయువద్గతిరిత్యాహురాహ్లాదిత్వం చ చన్ద్రవత్ ।**
**అగ్నివత్సర్వభక్షిత్వం నిత్యతృప్తత్వమేవ చ ॥ 44**

**శ్లో॥ సర్వభాషాపరిజ్ఞానం సర్వచిత్తావబోధనమ్ ।**
**వాపీకూపసముద్రాణాం పర్వతానాం చ చాలనమ్ ॥ 45**

**శ్లో॥ దత్తాత్రేయమయః స్వచ్ఛో భవేత్స వ్యాసవత్కవిః ।**
**ఇతీదం షోడశార్ణస్య మాహాత్మ్యం తత్ప్రయత్నతః ॥ 46**

ప్ర : ఖడ్గస్తమ్భః = ఖడ్గస్తంభము, జలస్తమ్భః = జలస్తంభము, సేవాస్తమ్భః = సేవాస్తంభము, తథా ఏవ చ = అట్లే మరియును, ఇచ్ఛాసిద్ధిః = కోరిక తీరుట, వశిత్వమ్ = తన అధీనమందుంచుకొనుట, చ = మరియు, దిక్పాలైః సహ = దిక్పాలకులతో గూడ, భాషణమ్ = మాటలాడుట, వాయువత్ = గాలివలె, గతిః = సంచారము, చన్ద్రవత్ = చంద్రునివలె, ఆహ్లాదిత్వమ్ = ఆనందపరచుట, అగ్నివత్ = అగ్నివలె, సర్వభక్షిత్వమ్ = సమస్తమును దహించుట, నిత్యతృప్తత్వమ్ = ఎల్లప్పుడు వెలితిలేక తృప్తితో నుండుట, ఏవ చ = ఇవియును, ఇతి = అని, ఆహుః = చెప్పుదురు, సర్వభాషాపరిజ్ఞానమ్ = భాషలన్నిటి జ్ఞానము, సర్వచిత్త+అవబోధనమ్ = అన్ని మనస్సులు తెలియుట, వాపీకూపసముద్రాణామ్ = బావులు, చెఱువులు, సముద్రములు, పర్వతానామ్ చ = పర్వతములును, చాలనమ్ = వీనిని కదలించుట, దత్తాత్రేయమయః = దత్తాత్రేయస్వరూపియై, స్వచ్ఛః = పరిశుద్ధుడు, వ్యాసవత్ = వ్యాసునివలె, కవిః = కవి, ఇతి = అని, ఇదమ్ = ఈ, షోడశార్ణస్య మాహాత్మ్యమ్ = షోడశాక్షరీ మహామంత్రమాహాత్మ్యము, తత్ ప్రయత్నతః = ఆ ప్రయత్నమువలన, సః = ఆ సాధకుడు, భవేత్ = అగును.

**శ్లో॥ ప్రాణో దేయో మనశ్చక్షుశ్ఛిత్వా దేయం శిరో వపుః ।**
**న దేయః షోడశార్ణోఽసౌ తచ్ఛిష్యాయ మహాత్మనే ॥ 47**

**శ్లో॥ మహాగుణవతే దేయః కుప్యేత ప్రభురన్యథా ।**
**మాలాకమణ్డలూ వాద్యత్రిశూలే శఙ్ఖచక్రకే ॥ 48**

**శ్లో॥ దధానమత్రివరదం దత్తాత్రేయం త్ర్యధీశ్వరమ్ ।**
**ధ్యాత్వేత్థం విధివన్మన్త్రజాప్యుక్తఫలభాగ్భవేత్ ॥ 49**

ప్ర : ప్రాణః దేయః = ప్రాణమీయదగినది, మనః = మనస్సు, చక్షుః చ = కన్నులు కూడ, శిరః = శిరస్సు, వపుః = శరీరము, ఛిత్వా = తెగగోసి, దేయమ్ = ఇవ్వదగినది; అసౌ = ఈ, షోడశార్ణః = షోడశాక్షరీమంత్రము, న దేయః = ఇవ్వరానిది; తత్ శిష్యాయ = వాని శిష్యునకై, మహాత్మనే = ఆత్మోన్నతి గలవానికై, మహాగుణవతే = గొప్ప సుగుణశాలికై, దేయః = ఇవ్వదగినది, అన్యథా = వేరు విధముగ జరిగినచో, **ప్రభుః = శ్రీ దత్త ప్రభువు**, కుప్యేత = కోపగించును, మాలా = అక్షమాలను, కమణ్డలూ = కమండలమును, వాద్య = డమరును, త్రిశూలే = త్రిశూలమును, శఙ్ఖచక్రకే = శంఖచక్రములను, దధానమ్ = ధరించిన, అత్రివరదమ్ = అత్రి మహర్షికి వరప్రసాదముగా లభించిన, దత్తాత్రేయమ్ = దత్తాత్రేయుని, త్రి+అధీశ్వరమ్ = త్రిలోకాధిపతిని, ధ్యాత్వా = ధ్యానించి, ఇత్థమ్ = ఈరీతి, విధివత్ = శాస్త్రోక్తప్రకారముగా, మన్త్రజాపి = మంత్రమును జపించినవాడు, ఉక్త = చెప్పబడిన, ఫలభాక్ = ఫలమందినవాడుగా, భవేత్ = అగును.

**తా (శ్లో.43-49) :** ఖడ్గస్తంభము, జలస్తంభము, సేవాస్తంభము అనబడు వానిని నిర్వీర్యము,

నిస్తేజము, నిష్ప్రయోజనము చేయగలుగు వశీకరణ శక్తి, కోరిన దానిని పొందుట, దేనినైన యెవరినైన తన అధీనమందుంచుకొనుట, దిక్పాలకులైన దేవతలతో మాటాడు శక్తి, గాలివలె సంచరించు శక్తి, చంద్రునివలె ఆనందపరచు శక్తి, అగ్నివలె సర్వము దహించుశక్తి, అన్నివేళల పూర్ణతృప్తితో నుండు స్థితి, అన్ని భాషల ఎఱుక, అందరి మనస్సుల నెఱుగుట, బావులు, చెఱువులు, సముద్రములు, పర్వతములు, వీనిని కదిలించగలుగు శక్తిని పొందగలుగును. వ్యాసునివలె కవియగును. పరిశుద్ధుడై దత్తాత్రేయస్వరూపి యగును, అని ఇట్లు షోడశాక్షరీమంత్రప్రభావము చెప్పబడినది. ఈ షోడశాక్షరిని ఆత్మోన్నతిగలిగి, సుగుణశాలియైన తన శిష్యునకు మాత్రమే ఉపదేశింపవలెను. కానివారికి ఇవ్వరాదు. దత్తాత్రేయ ప్రభువు కోపించును. బలవత్తర పరిస్థితు లేర్పడినను, ఈ మంత్రపవిత్రతను పరిరక్షించుటకై ఆ మంత్రసిద్ధుడు ప్రాణత్యాగమునకైనను, లేక శరీరమున యే భాగమునైన కోసి యిచ్చుటకును సంసిద్ధుడై యుండవలెను. అపాత్రున–కుపదేశింపరాదు.

*

శ్లో॥ ఓం నమో భగవాన్దత్తాత్రేయః స్మరణమాత్రసన్తుష్టో ।
మహాభయనివారణో మహాజ్ఞానప్రదః ॥ 50

శ్లో॥ చిదానన్దాత్మా బాలోన్మత్తపిశాచవేషో ।
మహాయోగ్యవధూతోఽనసూయానన్దవర్ధనోఽత్రిపుత్రః ॥ 51

శ్లో॥ ఓం బన్ధవిమోచనో హ్రీం సర్వవిభూతిదః ।
క్రోం అసాధ్యాకర్షణ ఐం వాక్ప్రదః ॥ 52

శ్లో॥ క్లీం జగత్త్రయవశీకరణః సౌః సర్వమనఃక్షోభణః ।
శ్రీం మహాసంపత్ప్రదో గ్లౌం భూమణ్డలాధిపత్యప్రదః ॥ 53

శ్లో॥ ద్రాం చిరంజీవీ వషడ్వశీకురు వౌషడాకర్షయ ।
హుం విద్వేషయ ఫడుచ్చాటయ ఠః ఠః ॥ 54

శ్లో॥ స్తమ్భయ ఖేం ఖేం మారయ నమః సమ్పన్నయ ।
స్వాహా పోషయ పరమన్త్రపరయన్త్రపరతన్త్రాణి ॥ 55

శ్లో॥ ఛిన్ధి గ్రహాన్నివారయ వ్యాధీన్వినాశయ ।
దుఃఖం హర దారిద్ర్యం విద్రావయ దేహం పోషయ ॥ 56

శ్లో॥ చిత్తం తోషయ సర్వమన్త్రస్వరూపః ।
సర్వతన్త్రస్వరూపః సర్వపల్లవస్వరూపః ॥ 57

శ్లో॥ ఓం నమో మహాసిద్ధః స్వాహాన్తో మాలామన్త్రః ।
ప్రథమాన్తాంశ్చతుర్థ్యా ద్విః క్రియాశ్చ వ్యాహరేత్ ॥ 58

**శ్లో॥ విష్ణునామోక్తా ఇమే మన్త్రా బ్రహ్మణే కామధేనవః ।**
**ప్రయోగగ్రహభూతారికుదృగ్రుక్తాపభీతిహాః ॥ 59**

**శ్లో॥ కామినోఽభీష్టఫలదా దేవసాంనిధ్యకారకాః ।**
**తద్వచ్చ వజ్రకవచం దత్తనామ సహస్రకమ్ ॥ 60**

**ప్ర :** భగవాన్ దత్తాత్రేయః = భగము అను షడ్గుణసంపత్తిగల దత్తాత్రేయుడు, స్మరణమాత్రసంతుష్టః = భక్తులు స్మరించిన మాత్రమున సంతోషించువాడు, మహాభయనివారణః = అజ్ఞానాంధభయమును తొలగించువాడు, మహాజ్ఞానప్రదః = ఆత్మజ్ఞానమును కలిగించువాడు, చిదానన్దాత్మా = జ్ఞానమే ఆనందమై వెలుగువాడు, బాల+ఉన్మత్తపిశాచవేషః = బాలునివలె, మత్తెక్కినవానివలె (పిచ్చివాని వలె), పిశాచమువలె, దేనికీ కట్టుబడనట్లు ప్రవర్తించువాడు, మహాయోగీ = మహాయోగి, అవధూతః = శరీరాభిమానము లేనివాడు, అనసూయా+ఆనన్దవర్ధనః = అనసూయాదేవి ఆనందమును వృద్ధిచేయువాడు, అత్రిపుత్రః = అత్రిమహర్షి కుమారుడు, ఓం = ప్రణవమూర్తియైనవాడు, నమః = నమస్కారము. (శ్లో.50-51)

**ఓం** బన్ధవిమోచనః = బంధములనుండి తప్పించువాడు, **హ్రీం** సర్వవిభూతిదః = సర్వ సంపదల నిచ్చువాడు, **క్రోం** అసాధ్యాకర్షణః = అనితరసాధ్యమైన ఆకర్షణ గలవాడు, **ఐం** వాక్ప్రదః = వాక్సిద్ధిని ప్రసాదించువాడు, **క్లీం** జగత్త్రయవశీకరణః = ముల్లోకములను స్వాధీనమందుంచు కొనువాడు, **సౌః** సర్వమనఃక్షోభణః = అందరి మనస్సులకు సంక్షోభమును కలిగించువాడు, **శ్రీం** మహాసంపత్ప్రదః = మహాసంపదల నిచ్చువాడు, **గ్లౌం** భూమణ్డలాధిపత్యప్రదః = భూమి సమస్తముపై అధికారమును ప్రసాదించువాడు, **ద్రాం** చిరంజీవీ = చిరకాలము జీవించి యుండువాడు, వషడ్వశీకురు = **వషట్** వశముగావించుము, వౌషడాకర్షయ = **వౌషట్** ఆకర్షించుము, **హుం** విద్వేషయ = ద్వేషమును పెంచుము, ఫడుచ్చాటయ = **ఫట్** పారద్రోలుము, **ఠః ఠః** స్తమ్భయ = నిస్తేజము చేయుము, **ఖేం ఖేం** మారయ = చంపుము, **నమః** సంపన్నయ = నమస్కారము సంపన్నము చేయుము, **స్వాహా** పోషయ = పోషించుము, పరమన్త్ర = ఇతర మంత్రములను, పరయన్త్ర = ఇతర యంత్రములను, పరతన్త్రాణి = ఇతర తంత్రప్రయోగములను, ఛిన్ది = బద్దలు చేయుము, గ్రహాన్ = గ్రహదోషములను, నివారయ = అడ్డుకొనుము, వ్యాధీన్ = రోగములను, వినాశయ = సమూలముగ నశింపజేయుట, దుఃఖం హర = దుఃఖమును తొలగించుము, దారిద్ర్యం = లేమిని, విద్రావయ = నీరుగార్చుము, కరిగిపోనిమ్ము, దేహం పోషయ = దేహమును పోషించుము, చిత్తం తోషయ = మనస్సును సంతోషపెట్టుము, సర్వమన్త్ర స్వరూపః = అన్ని మంత్రముల రూపమున ఉన్నది నీవే, సర్వతన్త్రస్వరూపః = అన్నితంత్రముల రూపము నీదే, సర్వపల్లవస్వరూపః = చిగురించున దంతయు నీవే, **ఓం నమః మహాసిద్ధః స్వాహా** అను, అన్తః = ముగింపుగలది, మాలామన్త్రః = మాలామంత్రము, ప్రథమాన్తాన్ = ప్రథమావిభక్తి ప్రత్యయాన్తశబ్దములను, చతుర్థ్యా = చతుర్థీవిభక్తిప్రత్యయముతో, క్రియాః చ =

క్రియలను, ద్విః = ద్వితీయతోను, వ్యాహరేత్ = వ్యవహరింపవలెను. (ఉదా:- దత్తాత్రేయః అను దానిని దత్తాత్రేయాయ అనియును, అంగన్యాస కరన్యాసాది క్రియల విషయమున ద్వితీయను). (శ్లో. 52-58).

విష్ణునామ+ఉక్తాః = విష్ణువు పేరున చెప్పబడినవి, ఇమే మన్త్రాః = ఈ మంత్రములు, బ్రహ్మణే = బ్రహ్మకొరకు, కామధేనవః = కోరిన ఫలములను పిదుకు పాడియావులు, ప్రయోగ = చాతబడి, బాణామతి వంటి దుష్టప్రయోగములు, గ్రహ = గ్రహపీడ, భూత = భూతపిశాచాది బాధలు, అరి = శత్రుబాధ, కుదృక్ = దోషదృష్టి, రుక్ = రోగము, తాప = తాపము, భీతిహాః = భయమును తొలగించునవి, కామినః = కోరినవాని, అభీష్టఫలదా = ఇష్టఫలమునిచ్చునది, దేవసాంనిధ్యకారకాః = దేవుని సన్నిధిని ప్రసాదించునవి, తత్ వత్చ = అట్టిది, వజ్రకవచం దత్తనామ సహస్రకమ్ = దత్తనామసహస్రజపము వజ్రకవచము. (శ్లో. 59-60)

**తా :** భక్తుడు స్మరించగనే సంతోషించి, అజ్ఞానభయమును తొలగించి ఆత్మజ్ఞానమును ప్రసాదించు భగవానుడు దత్తాత్రేయుడు. తాను జ్ఞానమైన ఆనందరూపుడు. లోకమున బాలుని వలెను, పిచ్చివానివలెను, పిశాచము పట్టినవానివలెను సంచరించు మహాయోగి, శరీరాభిమానము లేనివాడు, అనసూయానందనుడు, అత్రిపుత్రుడు, ప్రణవమూర్తి. వానికి నమస్కారము. **ఓం ఆం హ్రీం క్రోం ఐం క్లీం సౌః శ్రీం గ్లౌం ద్రాం** బీజాక్షరశక్తియుతుడై సర్వవినాశక యంత్ర తంత్ర మంత్రములను భంగపరచి, గ్రహవ్యాధి దుఃఖదారిద్ర్యములను హరించి, దేహమును పోషించి, మనస్సును ఆనందపరచి, భక్తుల పాలించు ప్రభువాతడు. ఈ మాలామంత్రస్వరూపుడాతడే. సర్వమంత్రతంత్రయంత్రములాతని శక్తిరూపాంతరములే. *

**శ్లో॥ ఏషామన్యతమేనేశం యో వైదికవిధానతః ।**
**ఉపాస్తే చిత్తశుద్ధ్యా స ముచ్యతేఽత్ర పరత్ర వా ॥ 61**

**ప్ర :** ఏషామ్ = వీనికి, అన్యతమేన = అన్యమైన వానిలో ఏదో ఒక దానిచేత, యః = ఎవడు, వైదికవిధానతః = వేదసంప్రదాయముననుసరించి (తాంత్రిక విధానమున కాదు, అని), చిత్తశుద్ధ్యా = చిత్తశుద్ధితో, ఈశమ్ = శ్రీదత్తప్రభువును, ఉపాస్తే = ఉపాసించునో, సః = ఆతడు, అత్ర = లోకమున, వా = లేక, పరత్ర = పరలోకమున, ముచ్యతే = ముక్తుడగుచున్నాడు.

**తా :** ఈ చెప్పబడిన దత్తరూపములలో ఏదేని యొక దానిచే, వైదికవిధిగా చిత్తశుద్ధితో ఉపాసించిన వానికి ఇహపరములు రెండిట ముక్తి లభించును.

**శ్లో॥ దత్తాత్రేయనివాసం తదా చణ్డాలశ్వగోఖరమ్ ।**
**బ్రహ్మాదిస్తమ్బపర్యన్తం సమదృక్ప్రణమేత్సుధీః ॥ 62**

**ప్ర :** దత్తాత్రేయనివాసమ్ = దత్తాత్రేయుని నివాస స్థానము, చణ్డాల = చండాలుడు, శ్వ = కుక్క గో = గోవు, ఖరమ్ = గాడిద, బ్రహ్మ = బ్రహ్మ, ఆది = మొదలు, స్తమ్బ = గడ్డిదుబ్బు, పర్యన్తమ్

= వరకును, తదా = అప్పుడు, సమదృక్ = సమానదృష్టిగలవాడై, సుధీః = సద్వివేకవంతుడు, ప్రణమేత్ = నమస్కరించును.

**తా :** పై శ్లోకమున చెప్పబడిన భక్తుడు చండాలుడు, కుక్క, గోవు, గాడిద, బ్రాహ్మణుడు, గడ్డిదుబ్బు అను న్యూనాధిక్యతలు పాటించక సమస్తమును దత్తాత్రేయు నివాసముగా దర్శించి నమస్కరించును. ఇది వందనభక్తి తాత్పర్యము.

**శ్లో॥ చాలకో భాసకోఽస్త్యేషాం సచ్చిదాత్మా స్వయంప్రభః ।**
**అస్తి భాతి ప్రియత్వేన భగవానేవ నాపరః ॥ 63**

**ప్ర :** ఏషామ్ = వీనికి, చాలకః = నడుపువాడు, భాసకః = వెలిగించువాడు, సచ్చిదాత్మా = తానే ఉనికి, జ్ఞానము అయినవాడు, స్వయంప్రభః = తనంత తా వెల్గువాడు, అస్తి భాతి ప్రియత్వేన = ఉన్నాడు, వెలుగుచున్నాడు అను ప్రేమతో, భగవాన్ ఏవ = భగవాన్ శ్రీదత్తుడే, న అపరః = వేరొకడు కాడు.

**తా :** పై జెప్పబడిన సమస్తచరాచరములకు, న్యూనాధికములకను, లోనుండి నడుపువాడు, జ్ఞానదీప్తినిచ్చువాడు, ఉనికియు జ్ఞానమును తానేయైన జ్యోతిస్వరూపుడు, అస్తి, భాతి, యని ప్రియముగా పేర్కొనబడిన భగవాన్ దత్తప్రభువు మాత్రమే, వేరెవరును కారు.

**శ్లో॥ యథాధిపే వశా భృత్యా నిర్మానా ఈశ్వరే తథా ।**
**విదధ్యాత్స్వాత్మనో దాస్యం నిరీహం ద్వైతదర్శనే ॥ 64**

**ప్ర :** ద్వైతదర్శనే = జీవుడు – దేవుడు అను రెండు విభిన్న విషయములుగా సృష్టిని పరిగణించి చూచినచో, అధిపే = అధికారియందు, భృత్యాః = సేవకులు, యథావశాః = ఎట్లు వశులై యుందురో, ఈశ్వరే = ఈశ్వరుని యందు, స్వాత్మనః = జీవాత్మయొక్క, దాస్యమ్ = సేవకత్వమును, తథా = అట్లే, నిర్మానా = ఆత్మాభిమానము లేనిదిగా, నిరీహమ్ = లాభాపేక్షలేనిదిగా, విదధ్యాత్ = గ్రహించవలెను.

**తా :** జీవుడు దేవునకు సేవకుడు, ఈ దాస్యములో జీవునకు లాభాపేక్ష గాని ఆత్మాభిమానము గాని లేదు. సేవకులు యజమానిని సేవించినట్లే సేవించును. ఇది ద్వయభావమున భక్తివిధానము.

**శ్లో॥ సఖ్యోః సఖ్యం యథా లోకే నిరపేక్షం తథాఽఽత్మనః ।**
**పరాత్మనాపి సతతం సమాధేః ప్రాక్ప్రకల్పయేత్ ॥ 65**

**ప్ర :** సఖ్యోః = చెలికానియొక్క, సఖ్యమ్ = చెలిమి, లోకే = లోకమున, యథా = ఎట్లు, నిరపేక్షమ్ = లాభాపేక్షలేకుండునో, తథా = అట్లే, ఆత్మనః = ఆత్మకు (జీవునకు), పరాత్మనా అపి = పరమాత్మతో కూడ, సతతమ్ = ఎల్లపుడు, సమాధేః = సమాధికి, ప్రాక్ = భూమిక, ప్రకల్పయేత్ = కల్పింపవలెను.

**తా : చెలిమికి ప్రాతిపదిక స్వార్థాపేక్ష లేకుండుట. అట్లే జీవునకు పరమాత్మతో సమాధియందు సంగమునకు భూమిక నిస్స్వార్థత కావలయును.**

**శ్లో॥ కర్తృత్వాది న మయ్యేకే శుద్ధే దేహాదిసాక్షిణః ।**
**ఇతీక్షణమసందిగ్ధం సర్వస్వాత్మనివేదనమ్ ॥ 66**

**ప్ర :** దేహ+ఆది సాక్షిణః = శరీరము, ఇంద్రియము, మనస్సు, బుద్ధి ఇత్యాదుల వ్యాపారములకు సాక్షిమాత్రుడనై, శుద్ధే = శుద్ధుడను, నిర్వికారుడనై, ఏకే = కేవలుడనైన, మయి = నా యందు, కర్తృత్వ+ఆది = కర్మచేయుట ఫలమనుభవించుట అనునవి, న = లేదు, ఇతి = అని, అసందిగ్ధం ఈక్షణమ్ = సునిశ్చితమైన దృష్టి, సర్వస్వాత్మనివేదనమ్ = సర్వము ఆత్మకే భుక్తము చేయుట.

**తా :** నేను నిర్వికారుడను, దేహాది వ్యాపారములకు సాక్షిని మాత్రమే, అని నిస్సంశయముగా దర్శించుచు, నేను కర్తను గాను కనుక భోక్తను గాను అను నిశ్చయముతో పరమాత్మకే నివేదించుట.

**శ్లో॥ అతీత్య వరదేశాదీన్ కాశ్యాం సంతోష్య దీపకః ।**
**వేదధర్మగురుం రుగ్ణం కష్టేన హి మహామతిః ॥ 67**

**శ్లో॥ శ్రీదత్తలీలాశ్రవణం యయాచే తుష్ట ఏవ సః ।**
**గురుః శిష్యాయ యత్ప్రాహ ముక్త్యై తత్సార ఉచ్యతే ॥ 68**

**ప్ర :** కాశ్యామ్ = కాశీయందు, వరద+ఈశాదీన్ = వరములిచ్చు ఈశ్వరాదులను, అతీత్య = మించి, సంతోష్య = సంతోషపెట్టి, దీపకః = దీపకుడు అనుశిష్యుడు, రుగ్ణమ్ = రోగగ్రస్తుడైన, వేదధర్మగురుమ్ = వేదధర్మా అనుపేరుగల గురువును, మహామతిః = గొప్ప బుద్ధిగలవాడై, కష్టేన హి = బాధపడుచునే, శ్రీదత్తలీలాశ్రవణమ్ = శ్రీ దత్తుని లీలలను గూర్చి వినగోరుదునని, యయాచే = ప్రార్థించెను, సః గురుః = ఆ గురువు, తుష్టః ఏవ = సంతోషము తోడనే, శిష్యాయ = శిష్యుని కొరకు, ముక్త్యై = ముక్తి కొరకు, యత్ ప్రాహ = దేనిని బోధించెనో, తత్ సారః = దాని (ఆ బోధనల) సారము, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా :** దీపకుడను శిష్యుడు కాశీనగరమున వరదుడైన విశ్వనాథుని మించి తన గురువు వేదధర్ముని సంతోషింపజేసి, ఆ గురువు రోగగ్రస్తుడై యుండుటకు బాధపడుచునే, శ్రీదత్తలీలాకథలను చెప్పుడని వేడుకొనగా, ఆతడు సంతోషించి, ముక్తి లక్ష్యముగా తన శిష్యునకు బోధించిన దాని సారము ఇచట చెప్పబడుచున్నది.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం తృతీయాష్టకే ప్రథమోఽధ్యాయః ॥

ఓమ్ శం

అనుబంధం - 1

# అథర్వణీయదత్తాత్రేయోపనిషత్

**శ్లో॥ దత్తాత్రేయ! బ్రహ్మవిద్యా సంవేద్యానందనిగ్రహమ్ ।**
**త్రిపాన్నారాయణాకారం దత్తాత్రేయముపాస్మహే ॥**

**ఓం భద్రం కర్ణేభిరితి శాంతిః.**

**ప్రథమః ఖండః.**

ఓం. ఓం సత్యక్షేత్రే బ్రహ్మా నారాయణం మహాసామ్రాజ్యం కిం తారకం తతో బ్రూహీత్యువాచ భగవానిత్యుక్తస్సత్యానందచిదాత్మకం సాత్వికం మామకం ధామోపాస్వేత్యాహ, సదా దత్తోఽహ మస్మీతి ప్రీత్యేతత్సంవదంతి యే, న తే సంసారిణో భవంతి, నారాయణే నైవం వివక్షితో బ్రహ్మా విశ్వరూపధరం విష్ణుం నారాయణం దత్తాత్రేయం ధ్యాత్వా సద్వదతి, దమితి హంసః దామితి దీర్ఘం తద్బీజం నామ బీజస్థం **దామిత్యేకాక్షరం భవతి, తదేతత్తారకం భవతి**, తదేవోపాసితవ్యం విజ్ఞేయం గర్భాదితారణమ్, గాయత్రీచ్ఛందస్సదాశివ ఋషిః దత్తాత్రేయో దేవతా, వటబీజస్థ మివ దత్తబీజస్థం సర్వం జగత్, ఏతదేవైకాక్షరం వ్యాఖ్యానమ్, వ్యాఖ్యాస్యే షడక్షరమ్, ఓ మితి ప్రథమం శ్రీమితి ద్వితీయం హ్రామితి తృతీయం క్లీమితి చతుర్థం గ్లౌమితి పంచమం ద్రామితి షట్కమ్, షడక్షరోయం భవతి, సర్వసంపద్వృద్ధికరో భవతి, యోగానుభవో భవతి, గాయత్రీచ్ఛంద-స్సదాశివ ఋషిః దత్తాత్రేయో దేవతా, ద్రమిత్యుక్త్వా ద్రామిత్యుక్త్వా వా దత్తాత్రేయాయ నమ ఇత్యష్టాక్షరః, దత్తాత్రేయాయేతి సత్యానందచిదాత్మకం నమ ఇతి పూర్ణానందైకవిగ్రహమ్, గాయత్రీ చ్ఛందస్సదాశివ ఋషిః దత్తాత్రేయో దేవతా దత్తాత్రేయేతి కీలకం తదేవబీజం నమశ్శక్తిర్భవతి, ఓమితి ప్రథమం ఆమితి ద్వితీయం హ్రీమితి తృతీయం క్రోమితి చతుర్థం ఏహీతి తదైవ వదే ద్దత్తాత్రేయేతి స్వాహేతి మంత్రరాజోఽయం ద్వాదశాక్షరః, జగతీఛందః సదాశివ ఋషిః దత్తాత్రేయో దేవతా, ఓమితి బీజం స్వాహేతి **శక్తిస్సంబుద్ధి**రితి కీలకమ్, ద్రమితి హృదయే హ్రీం క్లీమితి శీర్షే ఏహీతి శిఖాయాం దత్తేతి కవచే ఆత్రేయేతి చక్షుషి స్వాహేత్యస్త్రే తన్మయో భవతి య ఏవం వేద, షోడశాక్షరం వ్యాఖ్యాస్యే ప్రాణం దేయం మానం దేయం చక్షుర్దేయం శ్రోత్రం దేయం షడ్దశశిరశ్ఛినత్తి షోడశాక్షరమంత్రో న దేయో భవతి, అతిసేవాపరభక్తగుణవచ్ఛిష్యాయ వదేత్, ఓమితి ప్రథమం భవతి, ఐమితి ద్వితీయం, క్రోమితి తృతీయం, క్లీమితి చతుర్థం, క్లూమితి పంచమం, హ్రామితి షష్ఠం, హ్రీమితి సప్తమం, హ్రూమిత్యష్టమం, సౌరితి నవమం, దత్తాత్రేయాయేతి చతుర్దశ, స్వాహేతి షోడశ, గాయత్రీ ఛందస్సదాశివ ఋషిః దత్తాత్రేయో దేవతా ఓం బీజం స్వాహా శక్తి **శ్చతుర్థ్యంతం** కీలకం ఓమితి హృదయే క్లాం క్లీం క్లూమితి శిఖాయాం, సౌరితి కవచే చతుర్థ్యంతం చక్షుషి స్వాహేత్యస్త్రే, యో నిత్యమధీయాన సచ్చిదానంద సుఖీ మోక్షీ భవతి, సౌరిత్యంతే శ్రీవైష్ణవ ఇత్యుచ్యతే తజ్జాపీ విష్ణురూపీ భవతి, అనుష్టుప్ఛందః, వ్యాఖ్యాస్యే సర్వత్ర సంబుద్ధిరిమానీత్యుచ్యంతే, దత్తాత్రేయ! హరే! కృష్ణ! ఉన్మత్తానంద! దాయక!, దిగంబర! మునే! బాల! పిశాచ! జ్ఞానసాగరేత్యుపనిషత్.

అనుష్టుప్ఛంద స్సదాశివ ఋషిః, దత్తాత్రేయో దేవతా దత్తాత్రేయేతి హృదయే, హరే కృష్ణేతి శీర్షే, ఉన్మత్తానందేతి శిఖాయామ్, దాయక మున ఇతి కవచే, దిగంబరేతి చక్షుషి, పిశాచజ్ఞానసాగర ఇత్యస్త్రే, అనుష్టుభోయం మయాఽధీతః, అబ్రహ్మజన్మదోషాశ్చ ప్రణశ్యంతి సర్వోపకారీ మోక్షీ భవతి య ఏవం వేదేత్యుపనిషత్. 1.

**ద్వితీయః ఖండః**

ఓమితి వ్యాహరేదోన్నమో భగవతే దత్తాత్రేయాయ స్మరణమాత్రసంతుష్టాయ మహాభయ-నివారణాయ మహాజ్ఞానప్రదాయ చిదానందాత్మనే బాలోన్మత్తపిశాచవేషాయేతి మహాయోగినే అవధూతాయేతి అనసూయానందవర్ధనాయాత్రిపుత్రాయేతి సర్వకామఫలప్రదాయ ఓమితి వ్యాహరేద్భవబంధమోచనాయేతి హ్రీమితి వ్యాహరేత్సకలవిభూతిదాయేతి, క్రోమితి వ్యాహరేత్సాధ్యాకర్షణాయేతి, సౌరితి వ్యాహరేత్సర్వమనఃక్షోభణాయేతి, శ్రీమితి వ్యాహరేన్మహాసంపత్ప్రదాయేతి గ్లౌమితి భూమండలాధిపత్యప్రదాయేతి వ్యాహరే చ్చిరం జీవినే వషడితి వ్యాహరేద్వశీకురు వశీకురు, వౌషడితి వ్యాహరేదాకర్షయాకర్షయ, హుమితి వ్యాహరేద్విద్వేషయ విద్వేషయ, ఫడితి వ్యాహరేదుచ్చాటయోచ్చాటయ, ఠఠేతి వ్యాహరేత్ స్తంభయ స్తంభయ, ఖఖేతి వ్యాహరేన్మారయ మారయ, నమస్సంపపన్నాయ నమస్సంపన్నాయ, స్వాహా పోషయ పోషయ, పరమంత్ర పరయంత్ర పరతంత్రాణి ఛింధి ఛ్ఛింధి, గ్రహాన్నివారయ నివారయ, వ్యాధిం నివారయ నివారయ, దుఃఖం హరయ హరయ, దారిద్ర్యం విద్రావయ విద్రావయ, దేహం పోషయ పోషయ చిత్తం తోషయ తోషయ సర్వమంత్ర సర్వయంత్ర సర్వతంత్ర సర్వపల్లవస్వరూపాయేతి ఓం నమశ్శివాయేత్యుపనిషత్. 2.

**తృతీయః ఖండః.**

య ఏవం వేద అనుష్టుప్ఛందస్సదాశివ ఋషిః దత్తాత్రేయో దేవతా ఓమితి బీజం స్వాహేతి శక్తిః ద్రామితి కీలకం అష్టమూర్త్యష్టమంత్రా భవంతి యో నిత్యమధీతే వాయ్వగ్నిసోమాదిత్య-బ్రహ్మవిష్ణురుద్రైః పూతో భవంతి గాయత్ర్యాశ్శతసహస్రం జప్తో భవతి మహారుద్రశతసహస్రజాపీ భవతి ప్రణవాయుతకోటిజప్తో భవతి శతపూర్వాన్ శతోత్తరాన్ పునాతి సపఙ్క్తిపావనో భవతి బ్రహ్మహత్యాదిపాతకై ర్ముక్తో భవతి గోహత్యాదిపాతకైర్ముక్తో భవతి తులాపురుషాదిదానైః ప్రపాపానతః పూతో భవతి అశేషపాపాన్ముక్తో భవతి అభక్ష్యభక్షణపాపైర్ముక్తో భవతి సర్వమంత్రయోగపారీణో భవతి స ఏవ బ్రాహ్మణో భవతి తస్మాచ్ఛిష్యం భక్తం ప్రతిగృహ్ణీయాత్సోఽనంతఫలమశ్నుతే స జీవన్ముక్తో భవతీత్యాహ భగవాన్నారాయణో బ్రహ్మణమిత్యుపనిషత్. 3

ఓం భద్రం కర్ణేభిరితి శాంతిః

ఇతి దత్తాత్రేయోపనిషత్సమాప్తా.

ఓం తత్సత్.

అనుబంధం - 2

**మన్త్రపాఠః**

**1. ఏకాక్షరో దత్తాత్రేయమన్త్రః :-**

అస్య శ్రీదత్తాత్రేయైకాక్షరమహామంత్రస్య । శబరో మహారుద్ర ఋషిః । గాయత్రీ ఛందః । శ్రీదత్తాత్రేయపరమాత్మా దేవతా । ద్రాం బీజం । ఆం శక్తిః । క్రోం కీలకం । శ్రీదత్తాత్రేయ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః । ద్రామిత్యాది న్యాసః ।

**ధ్యానమ్**

**శ్లో॥ యోగారూఢం యోగపట్టేన వీతం**
**హస్తద్వంద్వం జానుయుగ్మే ప్రసార్య ।**
**అంసాగ్రస్థరక్తచఞ్చజ్జటాకం**
**దత్తాత్రేయం భావయే వీక్షమాణమ్ ॥**

లమిత్యాది మానసోపచారైః సంపూజయేత్ ।

**మన్త్రః :-** ఓం ద్రాం ॥

**2. షడక్షరో దత్తాత్రేయమన్త్రః :-**

అస్య శ్రీదత్తాత్రేయషడక్షరమహామంత్రస్య । శబరో మహారుద్ర ఋషిః । గాయత్రీ ఛందః । శ్రీదత్తాత్రేయో దేవతా । ద్రాం బీజం । శ్రీం శక్తిః । హ్రీం కీలకం । శ్రీదత్తాత్రేయప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ॥ మంత్ర షడ్బీజైర్న్యాసః ।

**ధ్యానమ్**

**శ్లో॥ ఉత్తానితే కరతలేఽప్యపసవ్యసవ్య-**
**సోపానపర్వసదృశేఽప్యుపరి స్వనాభేః ।**
**ప్రసార్య చర్మవసనం భసితాఙ్గరాగం**
**మన్త్రేణ తం భజత రక్తజటాకలాపమ్ ॥**

లమిత్యాది మానసోపచారైః సంపూజయేత్ ।

**మన్త్రః :- ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం ద్రాం ॥**

**3. అష్టాక్షరో దత్తాత్రేయమన్త్రః :-**

అస్య శ్రీదత్తాత్రేయాష్టాక్షరమహామంత్రస్య । శబరో మహారుద్ర ఋషిః । గాయత్రీ ఛందః । శ్రీదత్తాత్రేయో దేవతా । ద్రాం బీజం । నమశ్శక్తిః । దత్తాత్రేయాయేతి కీలకం । శ్రీదత్తాత్రేయ ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ॥ ద్రామిత్యాదిన్యాసః ।

**ధ్యానమ్**

**శ్లో॥ యోగారూఢం యోగపట్టేన వీతం**
**హస్తద్వంద్వం జానుయుగ్మే ప్రసార్య ।**
**అంసాగ్రస్థదివ్యభూషాజటాకం**
**దత్తాత్రేయం భావయే వీక్షమాణమ్ ॥**

లమిత్యాది మానసోపచారైః సంపూజయేత్ ।

**మన్త్రః :- ఓం దత్తాత్రేయాయ నమః ॥**

---

**4. ద్వాదశాక్షరో దత్తాత్రేయమన్త్రః :-**

అస్య శ్రీదత్తాత్రేయద్వాదశార్ణమహామంత్రస్య । శబరో మహారుద్ర ఋషిః । జగతీ ఛందః । శ్రీ దత్తాత్రేయో దేవతా । ద్రాం బీజం । నమశ్శక్తిః । **దత్తాత్రేయేతి** కీలకం । శ్రీదత్తాత్రేయప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ।

ఓం ఆం । హ్రీం క్రోం । ఏహి । దత్తాత్రేయ । స్వాహా ॥ ఇతి పంచాంగన్యాసః ॥ యద్వా ద్రామిత్యాది షడంగన్యాసః ॥

**ధ్యానమ్**

**శ్లో॥ వ్యాఖ్యాముద్రాం కరసరసిజే దక్షిణే సందధానో**
**జానున్యస్తాపరకరసరోజాత్తవేత్రో నతాంసః ।**
**ధ్యానాధ్యానాత్సుఖపరవశాదర్ధమామీలితాక్షో**
**దత్తాత్రేయో భసితధవళః పాతు నః కృత్తివాసాః ॥**

లమిత్యాది మానసోపచారైః సంపూజయేత్ ।

**మన్త్రః :- ఓం ఆం హ్రీం క్రోం ఏహి దత్తాత్రేయ! స్వాహా ॥**

---

**5. షోడశాక్షరో దత్తాత్రేయమన్త్రః :-**

అస్య శ్రీదత్తాత్రేయషోడశాక్షరమహామంత్రస్య । శబరో మహారుద్ర ఋషిః । ద్రాం బీజం । నమశ్శక్తిః । దత్తాత్రేయాయేతి కీలకం । శ్రీదత్తాత్రేయప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ।

ఓం ఐం । క్లాం క్లీం క్లూం ॥ హ్రాం హ్రీం హ్రూం । సౌః । దత్తాత్రేయాయ స్వాహా ॥ ఇతి పంచాంగన్యాసః । యద్వా ద్రామిత్యాది షడంగన్యాసః ॥

**ధ్యానమ్**

**శ్లో॥ మందారమూలే మణిపీఠసంస్థం**
**సువర్ణదానైకనిబద్ధదీక్షమ్ ।**
**ధ్యాయేత్పరీతం నవనాథసిద్ధై-**
**ర్దారిద్ర్యదావానలకాలమేఘైః ॥**

లమిత్యాది మానసోపచారైః సంపూజయేత్ ।

**మన్త్రః :- ఓం ఐం క్లాం క్లీం క్లూం హ్రాం హ్రీం హ్రూం సౌః దత్తాత్రేయాయ స్వాహా ॥**

**6. వింశత్యర్ణో దత్తాత్రేయమంత్రః :-**

అస్య శ్రీదత్తాత్రేయవింశత్యర్ణమహామంత్రస్య । సదాశివ ఋషిః । కృతిశ్ఛందః । శ్రీ దత్తాత్రేయో దేవతా । ఓం బీజం । స్వాహా శక్తిః । సౌః । శ్రీవిష్ణవ ఇతి కీలకం । శ్రీదత్తాత్రేయప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ॥

ఓం ఐం । క్లాం క్లీం క్లూం । హ్రాం హ్రీం హ్రూం । సౌః । శ్రీవిష్ణవే । దత్తాత్రేయాయ స్వాహా । ఇతి కరహృదయాది న్యాసః ॥

**ధ్యానమ్**

**శ్లో॥ మందారమూలే మణిపీఠసంస్థం**
**సువర్ణదానైకనిబద్ధదీక్షమ్ ।**
**ధ్యాయేత్పరీతం నవనాథసిద్ధై-**
**ర్దారిద్ర్యదావానలకాలమేఘైః ॥**

లమిత్యాది మానసోపచారైః సంపూజయేత్ ।

**మన్త్రః :- ఓం ఐం క్లాం క్లీం క్లూం హ్రాం హ్రీం హ్రూం సౌః శ్రీవిష్ణవే దత్తాత్రేయాయ స్వాహా ॥**

**7. దత్తాత్రేయానుష్టుభమంత్రః :-**

అస్య శ్రీదత్తాత్రేయానుష్టుభమంత్రస్య । శబరో మహారుద్ర ఋషిః । అనుష్టుప్ఛందః । శ్రీ దత్తాత్రేయో దేవతా । దత్తాత్రేయ హరే కృష్ణ ఇతి బీజం । ఉన్మత్తానందదాయక దిగంబరేతి శక్తిః ॥ మునే బాలపిశాచ జ్ఞానసాగరేతి కీలకం । శ్రీదత్తాత్రేయప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ।

దత్తాత్రేయ! హరే! కృష్ణ! ఉన్మత్త! ఆనంద! దాయక! దిగంబర! మునే! బాల! పిశాచ! ఇతి కరహృదయాది న్యాసః ॥

**ధ్యానమ్**

**శ్లో॥ కాశీ కోల్లా మాహురీ సహ్యకేషు**
**స్నాత్వా జప్త్వా ప్రాశ్యతే చాన్వహం యః ।**

దత్తాత్రేయస్మరణాత్స్మర్తృగామీ
త్యాగీ భోగీ దివ్యయోగీ దయాళుః ॥

లమిత్యాది మానసోపచారైః సంపూజయేత్ ।

మన్త్రః :- దత్తాత్రేయ! హరే! కృష్ణ! ఉన్మత్తానంద! దాయక! ।
దిగంబర! మునే! బాల! పిశాచ! జ్ఞానసాగర ॥

---

**8. దత్తాత్రేయమాలామన్త్రః :-**

అస్య శ్రీదత్తాత్రేయమాలామహామంత్రస్య । సదాశివ ఋషిః । అనుష్టుప్ఛందః । శ్రీ దత్తాత్రేయో దేవతా । ద్రామితి కీలకం । శ్రీదత్తాత్రేయప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః । ద్రామిత్యాదినా న్యాసః ॥

ధ్యానమ్

శ్లో॥ కాశీ కోల్లా మాహురీ సహ్యకేషు
స్నాత్వా జప్త్వా ప్రాశ్యతే చాన్వహం యః ।
దత్తాత్రేయస్మరణాత్స్మర్తృగామీ
త్యాగీ భోగీ దివ్యయోగీ దయాళుః ॥

లమిత్యాది మానసోపచారైః సంపూజయేత్ ।

మన్త్రః :- **ఓం ఆం హ్రీం క్రోం ఐం క్లీం సౌః శ్రీం గ్లౌం ద్రాం ఓం నమో భగవతే దత్తాత్రేయాయ స్మరణమాత్రసంతుష్టాయ, మహాభయనివారణాయ, మహాజ్ఞానప్రదాయ, సచ్చిదానందాత్మనే, బాలోన్మత్తపిశాచవేషాయ, మహాయోగినేఽవధూతాయ, అనసూయానందవర్ధనాయ, అత్రిపుత్రాయ, సర్వకామప్రదాయ, ఓం భవబంధవిమోచనాయ, ఆం సాధ్యబంధనాయ, హ్రీం సర్వవిభూతిదాయ, క్రోం సాధ్యాకర్షణాయ, ఐం వాక్ప్రదాయ, క్లీం జగత్త్రయవశీకరణాయ, సౌః సర్వమనఃక్షోభణాయ, శ్రీం మహాసంపత్ప్రదాయ, గ్లౌం భూమండలాధిపత్యప్రదాయ, ద్రాం చిరంజీవినే, వషడ్వశీకురు వశీకురు, వౌషడాకర్షయ ఆకర్షయ, హుం విద్వేషయ విద్వేషయ, ఫడుచ్చాటయ ఉచ్చాటయ ఠఠస్తంభయ స్తంభయ, ఖేఖే మారయ మారయ, నమస్సంపన్నాయ సంపన్నాయ, స్వాహా పోషయ పోషయ, పరమంత్ర పరయంత్ర పరతంత్రాణి ఛింధి ఛింధి, గ్రహాన్నివారయ నివారయ, వ్యాధిం నివారయ నివారయ, దుఃఖం హరయ హరయ, దారిద్ర్యం విద్రావయ విద్రావయ, దేహం పోషయ పోషయ, చిత్తం తోషయ తోషయ, సర్వమంత్రస్వరూపాయ, సర్వయంత్రస్వరూపాయ, సర్వతంత్రస్వరూపాయ, సర్వపల్లవస్వరూపాయ, ఓం నమశ్శివాయ స్వాహా ॥**

శ్రీః

శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## తృతీయాష్టకము - ద్వితీయాధ్యాయము

హరిః ఓమ్ ॥

**శ్లో॥ ఇచ్ఛన్తి యత్కృపాం సర్వే తల్లీలాత్రోపవర్ణ్యతే ।**
**భార్గవోఽభూద్ద్విజః కశ్చిత్తత్పుత్రో జడవత్సుధీః ॥ 1**

**ప్రతిపదార్థం :** సర్వే = అందఱును, యత్ కృపామ్ = ఎవని కృపను, ఇచ్ఛన్తి = కోరుచున్నారో, తత్ లీలా = వాని లీల, అత్ర = ఇచట, ఉపవర్ణ్యతే = వివరింపబడుచున్నది; కశ్చిత్ ద్విజః = ఒకానొక బ్రాహ్మణుడు, భార్గవః = భృగువంశజుడు, తత్ పుత్రః = వాని కుమారుడు, సుధీః = బుద్ధిశాలి, జడవత్ = మూర్ఖునివలె, అభూత్ = ఆయెను.

**తాత్పర్యము :** యే ప్రభువు దయను అందఱు కోరుకొందురో, ఆ ప్రభు లీల యిది : భృగువంశమున బుట్టిన ఒకానొక బ్రాహ్మణుని కుమారుడు బుద్ధిమంతుడైనను, మూర్ఖునివలె అయినాడు.

**శ్లో॥ తత్పితాహ సుతాధీష్వ వేదాన్ముక్త్యై చరాశ్రమాన్ ।**
**స ప్రాహ ప్రాక్తతాధీతాః సర్వా విద్యాః క్రియాః కృతాః ॥ 2**

**శ్లో॥ భోగా భుక్తా లక్షయోనిరాధ్భృత్యత్వాది చోషితమ్ ।**
**తత్సర్వం సంస్మరే యోగభ్రష్టత్వాత్పౌర్వదేహికమ్ ॥ 3**

**శ్లో॥ న స్పృశామి త్రయీధర్మం భాన్తి మే విగుణాః క్రియాః ।**
**జాతబోధస్య మే వేదైః కిం కార్యం వశినో యతేః ॥ 4**

ప్ర : తత్ పితా = వాని తండ్రి, ఆహ = అనెను, (హే) సుత = ఓ కుమారా!, ముక్త్యై = ముక్తికొరకు, వేదాన్ = వేదములను, అధీష్వ = అధ్యయనము చేయుము, ఆశ్రమాన్ = బ్రహ్మచర్యాది ఆశ్రమధర్మములను, చర = పాలించుము; సః = అతడు, ప్రాహ = ఇట్లనెను, తతా(తాత) = ఓ తండ్రీ!, ప్రాక్ = పూర్వము, సర్వాః విద్యాః = అన్ని విద్యలు, అధీతాః = నేర్వబడినవి, క్రియాః

= వైదికక్రియలు, కృతాః = చేయబడినవి, భోగాః = భోగములు, భుక్తాః = అనుభవింపబడినవి, లక్షయోనిరాట్ భృత్యత్వ+ఆది చ = లక్షజన్మల రాజత్వము, దాసత్వము మొదలగునది, కూడ, ఉషితమ్ = దహింపబడినది, పౌర్వదేహికమ్ = పూర్వజన్మల సంబంధియైన, తత్ సర్వమ్ = అది యంతయు, యోగభ్రష్టత్వాత్ = యోగభ్రష్టుడనై నందువలన, సంస్మరే = జ్ఞాపకము చేసికొనుచున్నాను, త్రయీధర్మమ్ = వేదధర్మము, న స్పృశామి = తాకను, జాతబోధస్య మే = జ్ఞానినైన నాకు, వశినః యతేః = జితేంద్రియుడైన యతికి, వేదైః కిం కార్యమ్ = వేదములతో యేమి పని?, మే = నాకు, క్రియాః = క్రియలు, విగుణాః భాన్తి = గుణములేనివిగా కన్పడుచున్నవి.

**తా :** తండ్రి కుమారునితో, "కుమారా! వేదాధ్యయనం చెయ్యి. ఆశ్రమధర్మాలు పాటించు" అనినాడు. తండ్రికి సమాధానంగా ఆ కుమారుడు, "ఓ తండ్రీ! నేను పూర్వమే వేదాలు చదివాను, వైదికక్రియలు నిర్వహించాను, అన్ని విద్యలున్నూ నేర్చినాను. ఎన్నో యోనులలో మరల మరల జన్మించి రాజుగానూ, సేవకుడుగానూ అన్ని అనుభవించినాను. అవన్నీ నా కిప్పుడు గుర్తున్నవి. కారణం, నేను యోగభ్రష్టుడనై జన్మించినాను. పూర్వమే జ్ఞానినై, జితేంద్రియుడనై, యతినైన నా కిప్పుడు వేదములతో, వైదికక్రియలతో, ఆశ్రమనియమాలతో నేమి పని?" అనినాడు.

**శ్లో॥ పురాఽసౌ బ్రాహ్మణో బ్రహ్మవిచారపరినిష్ఠితః ।**
**సత్సఙ్గాభ్యాసవైరాగ్యైరేకాన్తిత్వముపాగతః ॥ 5**

**ప్ర :** పురా = పూర్వము, అసౌ బ్రాహ్మణః = ఈ బ్రాహ్మణుడు, బ్రహ్మవిచార పరినిష్ఠితః = బ్రహ్మ చింతనయందే నిష్ఠగలవాడు, సత్+సఙ్గ+అభ్యాసవైరాగ్యైః = సత్పురుషుల సహవాసము, రాగద్వేష-రాహిత్యములచేత, ఏకాన్తిత్వమ్ = ఏకాంతమున నివసించుటను, ఉపాగతః = ఎంచుకొనినవాడు.

**తా :** పూర్వజన్మమున ఈ బ్రాహ్మణుడు, బ్రహ్మచింతనలోనే సదా నిమగ్నుమై యుండువాడు. సత్పురుషసాంగత్యము, అధ్యాత్మవిద్యాసాధన, రాగద్వేషరాహిత్యము కలిగి ఒంటరియై జీవించువాడు.

*

**శ్లో॥ దైవాన్మృతస్య బోధాత్ప్రాగ్లుప్తాభ్యాసాన్న మే స్మృతిః ।**
**బుద్ధ్వేహ సుప్తోత్థితవత్స్వాత్మానం హి దృఢవ్రతః ॥ 6**

**ప్ర :** దైవాత్ = విధివశమున, మృతస్య = మరణించిన వానికి, మే = నాకు, బోధాత్ ప్రాక్ = పుట్టుకకుముందు, లుప్త+అభ్యాసాత్ = వదలిన అభ్యాసమునుండి, స్మృతిః న = జ్ఞాపకము లేదు, ఇహ = లోకమున, బుద్ధ్వా = మేల్కొని, స్వ+ఆత్మానం హి = నన్ను నేనే, సుప్త+ఉత్థితవత్ = నిద్రించి లేచినవానివలె, దృఢవ్రతః = దృఢమైన నిష్ఠగలవాడనై,

**శ్లో॥ ప్రాప్తోఽస్మీహ పరాం శాన్తిమచలో హ్యబ్ధివత్స్వదృక్ ।**
**నాశో నాద్య త్రిభూమిస్థయమినః కిముతాన్యతః ॥ 7**

**ప్ర :** ఇహ = ఇప్పుడు, అబ్ధివత్ = సముద్రమువలె, స్వదృక్ = ఆత్మావలోకనము గలిగి, పరాం

శాన్తిం హి = పరమశాంతినే, ప్రాప్తః = పొందినవాడనై, అచలః అస్మి = నిశ్చలుడనైతిని, ఆద్య = ప్రధానమైన, త్రిభూమిస్థ = శుభేచ్ఛా, విచారణా, తనుమానసభూములు మూడింటియందున్న, యమినః = యమనియమాది సాధకునకు, నాశః = నాశము, న = లేదు, ఉత+అన్యతః కిమ్ = ఇక అన్యుల విషయమేమి?

**తా :** విధివశమున మరణించిన నాకు, నేను మరియొక జన్మనెత్తితినను గురుతులేక, నిద్రించి మేల్కొంటి నను నట్లున్నది. దానివలన నాకు పరమశాంతి లభించి, నిశ్చలచిత్తుడనై సముద్రమువలె స్వాత్మదృష్టి గలిగి యున్నాను. సాధకున కే నాశములేదని చెప్పుదురు కదా, ఇక సాధకుని స్థాయిని మించిన జ్ఞాని సంగతి చెప్పునదేమి?

**శ్లో॥ తచ్ఛ్రుత్వా తం పితా ప్రాహ క్షణసత్సఙ్గనిర్వృతః ।**
**పుత్రేదృశోఽసి చేత్త్వాదృగ్యథా భూయాం తథాఽఽదిశ ॥ 8**

**ప్ర :** తత్ శృత్వా = ఆ మాటలు విని, తమ్ = వానిని గూర్చి, పితా = తండ్రి, ప్రాహ = ఇట్లనెను, (హే) పుత్ర! = ఓ కుమారా!, క్షణసత్సఙ్గనిర్వృతః = కొలదికాలము సత్పురుషసాంగత్యము నుండి మరలింపబడినవాడవై, ఈదృశః = ఇట్టివాడవు, అసి చేత్ = అయినట్లయిన, త్వాదృక్ = నీ వంటివాడు, యథా = ఎట్లు, భూయామ్ = కా నోపునో, తథా = అట్లు, ఆదిశ = నిర్దేశింపుము.

**తా :** కుమారుని ఆ మాటలు విని, తండ్రి వాని కిట్లనెను : నాయనా! సత్పురుషసాంగత్యము కొలదికాలము కొరవడినంత మాత్రమున నీ వంటి పూర్వజన్మసంస్కారము, స్మృతి కలిగిన వానికే సమస్తము విగుణమై తోచినచో, మరి నీకు మేలు చేకూరు టెట్లో నీవే చెప్పుము. *

**శ్లో॥ బిభేమి కర్మనిగడాన్నేక్షేఽత్రాన్యత్ర వా సుఖమ్ ।**
**పుత్రః ప్రాహార్జునాదిభ్యః శ్రీదత్తేన పురోదితః ॥ 9**

**ప్ర :** కర్మనిగడాత్ = కర్మయను సంకెలలవలన, అత్ర వా అన్యత్ర = ఇహము నందు లేక పరము నందు, సుఖమ్ = సుఖమును, న ఈక్షే = చూచుట లేదు, బిభేమి = భయపడు చున్నాను, పుత్రః = కుమారుడు, ప్రాహ = ఇట్లనెను, పురా = పూర్వకాలమున, శ్రీదత్తేన = శ్రీ దత్తునిచేత, అర్జున+ఆదిభ్యః = అర్జునుడు మొదలగు వారికొరకై, ఉదితః = చెప్పబడినది.

**శ్లో॥ యోగస్తం దుఃఖసంయోగవియోగం శృణు తాత! మత్ ।**
**ప్రతిష్ఠానే కౌశికాఖ్యో ద్విజః పూర్వార్జితాదభూత్ ॥ 10**

**శ్లో॥ కుష్ఠీ రుగ్ణోఽపి తద్భార్యాఽభజత్తం దేవవత్సదా ।**
**స్నానవస్త్రాఙ్గసంవాహప్రియవాగ్భోజనౌషధైః ॥ 11**

**ప్ర :** దుఃఖసంయోగ-వియోగమ్ = దుఃఖముకలుగుట, తొలగిపోవుట, తం యోగమ్ = అను నట్టి యోగమును గూర్చి, మత్ = నా మాటలను, శృణు = వినుము, తాత! = తండ్రీ!, ప్రతిష్ఠానే = ప్రతిష్ఠానపురమున, కౌశికాఖ్యః ద్విజః = కౌశికుడను పేరుగల బ్రాహ్మణుడు, పూర్వార్జితాత్ =

పూర్వజన్మకర్మఫలముగా లభించినదానివలన, కుష్ఠీ అభూత్ = కుష్ఠరోగి యాయెను, రుగ్ణః అపి = రోగగ్రస్తుడైనను, తద్భార్యా = వాని భార్య, తమ్ = వానిని, సదా = ఎల్లవేళల, దేవవత్ = దేవునివలె, స్నాన-వస్త్ర అఙ్గ+సంవాహప్రియవాక్ భోజన-ఔషధైః = స్నానము చేయించి, వస్త్రము చుట్టి, ఒడలు తుడిచి, కాళ్ళు పిసికి, మంచి మాటలు చెప్పుచూ, భోజనము చేయించి, ఔషధము లిచ్చి, ఇట్లు, అభజత్ = సేవించెను.

**తా (శ్లో.9-11) :** కర్మ యనునది సంకెల. ఆ బంధమువలన ఇహపరములలో యెక్కడ గాని సుఖము కనరాదు. కావున భయమగుచున్నది, అని తండ్రి యనగా కుమారుడిట్లనెను : పూర్వము శ్రీదత్తుడు అర్జునాదులకు ఉపదేశించిన దుఃఖవిషయమును వినుము. పూర్వకాలమున ప్రతిష్ఠానపురమున కౌశికుడను బ్రాహ్మణుడు పురాకృతకర్మఫలముగా కుష్ఠరోగియాయెను. ఆ రోగిష్ఠిని వాని భార్య దేవుని కొల్చినట్లు సేవించినది : నిత్యము స్నానము చేయించి, ఒడలు తుడిచి, తియ్యని మాటలతో భుజింప జేసి, ఔషధము లిచ్చి, ఇట్లనేక విధముల సేవలు చేసినది.

**శ్లో॥ శ్లేష్మమూత్రపురీషాసవక్షాలనైః సాధులేపనైః ।**
**స తథా సేవ్యమానో౽పి సత్యాతీవ వినీతయా ॥ 12**

**శ్లో॥ నిర్భర్త్సయతి తాం చణ్డః క్రూరో వేశ్యాగతాన్తరః ।**
**బీభత్సమపి తం దేవం మేనే సా పతిదేవతా ॥ 13**

**ప్ర :** శ్లేష్మమూత్రపురీష+ఆసవక్షాలనైః = కఫము, మూత్రము, విరేచనము, ఆది ద్రవములను కడిగి శుభ్రము చేయుటతో, సాధులేపనైః = బాధను పోగొట్టు పైపూత ఔషధములను పూయుటతో, తథా = ఆ రీతి, వినీతయా సత్యా = వినయశీలియైన భార్యచేత, సేవ్యమానః అపి = సేవింపబడు చున్నను, సః చణ్డః = ఆ అతికోపి, క్రూరః = క్రూరుడై, వేశ్యాగతాన్తరః = వేశ్యాలోలుడై, తామ్ = ఆమెను, అతీవ నిర్భర్త్సయతి = అమితముగ బాధించు చుండెను, బీభత్సం అపి = అంతటి తీవ్రకోపియైనను, పతిదేవతా సా = పతియే దేవతగా తలచిన ఆమె, తమ్ = వానిని, దేవం మేనే = దేవునిగా తలచెను.

**తా :** ఆ రోగిష్ఠిభర్తయొక్క మలమూత్రములను కఫాది నిష్ఠీవమును నిత్యము శుభ్రము చేసి వాని కుష్ఠవ్యాధికి బాధానివారకములైన, లేపనౌషధముల బూసి ఎంతయో సేవించెను. కాని ముక్కోపి, క్రూరుడు, వేశ్యాలోలుడు అయిన భర్త ఆ వినయశీలియైన భార్యను తీవ్రముగా బాధించెను. ఐనను ఆ యిల్లాలు భర్తయే దైవమని తలచెను.

**శ్లో॥ పరాధీనో౽ప్యేకదా స వేశ్యాం దృష్ట్వా౽వదత్ప్రియామ్ ।**
**ధర్మజ్ఞే! మే హరత్యేషా చిత్తం తన్వి! ఘటస్తనీ ॥ 14**

**శ్లో॥ తద్ధామ నయ మా౽శక్తం మరిష్యే సుభగే! న చేత్ ।**
**కామో వామో న మోక్తుం తం కో౽పి శక్నోతి భామిని! ॥ 15**

ప్ర : ఏకదా = ఒకప్పుడు, పరాధీనః అపి సః = రోగమువలన శరీరము తన అధీనమున లేకున్న ఆ కౌశికుడు, వేశ్యాం దృష్ట్వా = వేశ్యను చూచి, ప్రియామ్ = భార్యతో, అవదత్ = ఇట్లనెను, తన్వి! ధర్మజ్ఞే! = ధర్మము నెఱిగిన ఓ అబలా!, ఏషా ఘటస్తనీ = కుంభకుచములు గల ఈమె, మే చిత్తమ్ = నా మనస్సును, హరతి = చూరగొన్నది, అశక్తం మా = శక్తిలేని నన్ను, తత్ ధామ = ఆ వేశ్యయింటికి, నయ = తీసికొని పొమ్ము, న చేత్ = లేనిచో, మరిష్యే = మరణింతును, సుభగే = ఓ సౌభాగ్యవతీ!, కామః = కోరిక, వామః = తీవ్రమైనది, తమ్ = ఆ కాముని, మోక్తుమ్ = విడిపించుటకు, భామిని = ఓ భామా!, కః అపి = ఎవడును, న శక్నోతి = సమర్థుడు కాడు.

**తా :** ఒకప్పుడు రోగమువలన కదలలేనివాడైనను ఆ కౌశికుడు వేశ్యను చూచి భార్యతో యిట్లనెను : స్త్రీధర్మము నెఱిగిన ఓ అబలా! ఈ వేశ్య నా మనస్సు హరించినది. నా యంత నేను పోలేను, కావున నన్నామె యింటికి తీసికొని పొమ్ము. లేకున్న నేను మరణింతును. మన్మథుడు తీవ్రముగ బాధించుచున్నాడు. వానినుండి ఎంతటి వారును తప్పించుకొనలేరు. *

**శ్లో॥ తచ్ఛ్రుత్వా సాఽభవద్ధృష్టా కులీనా సుభగా సతీ ।**
**బద్ధ్వా పరికరం శుల్కం భూర్యాదాయ నిధాయ తమ్ ॥ 16**

**శ్లో॥ స్కన్ధే మన్దం యయౌ రాత్రౌ ధ్వాన్తే విద్యుత్త్విషా సుధీః ।**
**శూలే చోరభ్రమాత్ప్రోతో మాణ్డవ్యో భూభృతా విధేః ॥ 17**

ప్ర : తత్ శృత్వా = ఆ మాటలు విని, సా సుభగా కులీనా సతీ = ఉత్తమజన్మగలదియు సౌభాగ్యవతియు పతివ్రతయునైన ఆమె, హృష్టా అభవత్ = సంతోషించిన దాయెను, పరికరమ్ = వాహకమును, బద్ధ్వా = కట్టి, భూరి శుల్కమ్ = అధికమైన వేశ్యాధనమును, ఆదాయ = తీసికొని, తం నిధాయ స్కన్ధే = వానిని భుజములపై నుంచుకొని, రాత్రౌ = రాత్రివేళలో, ధ్వాన్తే = మార్గమున, సుధీః = ఆ బుద్ధిశాలిని, విద్యుత్ త్విషా = మెఱుపులకాంతిలో, మన్దమ్ = మెల్లగా, యయౌ = నడిచెను; విధేః = విధివశమున, చోరభ్రమాత్ = దొంగయన్న అపోహవలన, భూభృతా = రాజుచేత, మాణ్డవ్యః = మాండవ్యమహర్షి, శూలే = శూలముపై, ప్రోతః = గుచ్చబడియుండెను.

**శ్లో॥ ధ్వాన్తేఽజ్ఞానా త్కౌశికాఙ్ఘ్రిచాలితః ప్రాహ దుఃఖితః ।**
**యేనాహం దుఃఖితో యాతు మృత్యుం సోఽర్కోదయాదితి ॥ 18**

ప్ర : ధ్వాన్తే = మార్గమున, అజ్ఞానాత్ = తెలియనందువలన, కౌశిక+అంఘ్రి-చాలితః = కౌశికుని పాదముచే కదలించబడినవాడై, దుఃఖితః = దుంఖితుడై, ప్రాహ = ఇట్లనెను, అహమ్ = నేను, యేన = ఎవనిచే, దుఃఖితః = బాధింపబడితినో, సః = ఆతడు, అర్క+ఉదయాత్ = సూర్యోదయము వలన, మృత్యుం యాతు ఇతి = మరణించును, అని.

**తా (శ్లో.16-18) :** ఆ మాటలు విని ఉత్తమజన్మగల ఆ పతివ్రత సంతోషించి, వేశ్యకిచ్చుటకు పెద్దమొత్తముగా ధనము తీసికొని, వాని నౌక వాహకమున గూర్చుండబెట్టి, భుజములపై కెత్తుకొని, రాత్రివేళలో మెఱుపుల కాంతిలో మెల్లగా ఆ సాధ్వి బయలుదేరినది. విధివశమున దొంగగా భ్రమించి రాజు మాండవ్యుని శూలముపై కొరతవేయగా, త్రోవలో కనరాక ఆ కౌశికుని పాదము తగిలి శూలము కదలగా బాధితుడైన మాండవ్యుడు సూర్యుడుదయించినంతనే కౌశికుడు మరణించునని శపించినాడు.

**శ్లో॥ తచ్ఛ్రుత్వోచే సతీ ఖిన్నా నోదేష్యత్యర్క ఇత్యహో ।**
**శప్త్వైవం పూరయిత్వా స్వభర్తృకామం గృహం యయౌ ॥ 19**

**ప్ర :** తత్ శ్రుత్వా = ఆ మాండవ్యుని శాపవచనము విని, సతీ = ఆ సాధ్వి, ఖిన్నా = దిగులు చెందినదై, అర్కః = సూర్యుడు, న+ఉదేష్యతి = ఉదయించకుండును, ఇతి = అని, ఊచే = అనియెను, ఏవమ్ = ఈ విధముగా, శప్త్వా = శపించి, స్వభర్తృకామమ్ = తన భర్తకోరికను, పూరయిత్వా = తీర్చి, గృహం యయౌ = ఇంటికి పోయెను. అహో = ఔరా!

**తా :** ఆ మాండవ్యుని శాపమును విని, ఆ సాధ్వి దిగులుతో, “సూర్యుడు ఉదయించకుండుగాక!” అని ప్రతిశాపమిచ్చి, తన భర్త కోరికను తీర్చి, తన యింటికి మరలి పోయెను.

**శ్లో॥ తచ్ఛాపాన్నోదితః సూర్యస్తతస్త్రస్తం జగత్త్రయమ్ ।**
**కాలవ్యవస్థా నష్టేఽర్కే నాతో లుప్తాః క్రియాః సమాః ॥ 20**

**ప్ర :** తత్ శాపాత్ = ఆ శాపమువలన, సూర్యః = సూర్యుడు, న ఉదితః = ఉదయించలేదు, తతః = దానివలన, జగత్ త్రయమ్ = మూడు లోకములు, త్రస్తమ్ = బాధింపబడినది, అర్కే నష్టే = సూర్యుడు గతి దప్పుటచే, కాలవ్యవస్థా న = కాలమను వ్యవస్థ లేనిదాయెను, అతః = అందువలన, సమాః క్రియాః = లౌకికవైదికకర్మలన్నియు, లుప్తాః = లోపించినవి.

**తా :** ఆ సాధ్వి శాపమువలన సూర్యుడుదయించలేదు, ముల్లోకములు కల్లోలితములైనవి. కాలము ఆగినదాయెను. అందువలన లౌకికకర్మలు, వైదికకర్మలు అన్నియు నిలిచిపోయినవి. *

**శ్లో॥ ఇహ భీతం జగద్ధ్వాన్తాత్స్వర్గే దేవా ఉపోషితాః ।**
**వృష్ట్యాది నానుగృహ్ణీమో మర్త్యాంస్తేఽప్యధ్వరైశ్చ నః ॥ 21**

**ప్ర :** ఇహ జగత్ భీతమ్ = ఈ జగత్తు భయము జెందినది, ధ్వాన్తాత్ = త్రోవ దప్పినది, స్వర్గే = స్వర్గమున, దేవాః = దేవతలు, ఉపోషితాః = ఉపవసించిరి, వృష్టి+ఆది = వర్షము మొదలగువానిని, న+అనుగృహ్ణీమః = అనుగ్రహించకుండిరి, తే అపి = వారున్నూ, మర్త్యాన్ = మర్త్యులను, నః = మమ్ములను, అధ్వరైః చ = యజ్ఞములతో

**తా :** ఇహలోకము భయముతో గతి దప్పినది. మర్త్యులు యజ్ఞములతో దేవతల నుపాసించుట మానిరి. దేవతలున్నూ సకాల వర్షములాది అనుగ్రహింపకుండిరి. హవిర్భోక్తల కుపవాసమైనది. *

**శ్లో॥ భుక్త్వాపి లోలుపా యేஉస్మద్దత్తం యాగైర్యజన్తి నో ।**
**ఇజ్యన్త ఉపసర్గైస్తేஉతివృష్ట్యాద్యైః సుదారుణైః ॥ 22**

**ప్ర :** యే = ఎవరు, అస్మత్ దత్తమ్ = మాచే ఇవ్వబడినదానిని, భుక్త్వా అపి = అనుభవించియును, లోలుపాః = భోగమగ్నులై, యాగైః = యాగములతో, నః = మమ్ము, యజన్తి = పూజించుచున్నారో, తే = వారు, ఉపసర్గైః అతివృష్ట్యాద్యైః సుదారుణైః = అతివృష్టి మొదలగు భయంకరమైన ప్రకృతి ఉపద్రవములతో, ఇజ్యన్తః = యాగము చేయుచున్నారు.

**తా :** మేము ప్రసాదించిన వానిని అనుభవించి కూడా, భోగలాలసులైనచో ఫలితార్థముగ అతివృష్టి అనావృష్టివంటి ప్రకృతివిపరిణామములు కలుగును.

**శ్లో॥ నాపరాధోஉధునాత్రైషాం కాలాభావాన్నృణామితి ।**
**విచార్య శరణం దేవాః కం గత్వా తం న్యవేదయన్ ॥ 23**

**ప్ర :** కాల+అభావాత్ = కాలగమనములేనందున, అధునా = ఈ సమయమున, నృణాం ఏషామ్ = ఈ నరులకు, అత్ర = ఈ విషయమున, న అపరాధః ఇతి = దోషము లేదు అని, విచార్య = ఆలోచించి, దేవాః = దేవతలు, కమ్ = బ్రహ్మను, శరణం గత్వా = శరణు పొంది, తం న్యవేదయన్ = వానికి నివేదించిరి.

**తా :** కాలగమనము లేనందున కాలనియతి ననుసరించి చేయు కర్మలకు లోపము కలుగుటలో నరుల దోషము లేదని విచారించిన దేవతలు బ్రహ్మను శరణువేడి వానికిట్లు నివేదించిరి.

**శ్లో॥ ధ్యాత్వా ముహూర్తం బ్రహ్మాపి దేవాంస్తాన్ప్రాహ సర్వవిత్ ।**
**సూర్యో భీతః సతీశాపాదుపాయః కల్ప్యతేஉత్ర తు ॥ 24**

**ప్ర :** బ్రహ్మా అపి = బ్రహ్మయును, ముహూర్తమ్ = క్షణకాలము, ధ్యాత్వా = ధ్యానించి సర్వవిత్ = అంతయు తెలిసిన వాడై, తాన్ దేవాన్ ప్రాహ = ఆ దేవతలతో ననియెను, సతీశాపాత్ = పతివ్రత శాపమువలన, సూర్యః = సూర్యుడు, భీతః = భయపడినాడు, తు = కాని, అత్ర = ఈ విషయమున, ఉపాయః = పరిష్కారము, కల్ప్యతే = కనుగొనబడును.

**తా :** క్షణకాల మాలోచించి, బ్రహ్మ దేవతలతో నిట్లనినాడు : సాధ్వి శాపమునకు సూర్యుడు భయపడి ఉదయించుట మానినాడు. కాని, ఈ సమస్యకు పరిష్కారము కనుగొందుము.

**శ్లో॥ తేజసైతి శమం తేజో యథా సత్యా సతీ తథా ।**
**పతివ్రతాగ్రగణ్యాత్రేరనసూయా తపస్వినీ ॥ 25**

**శ్లో॥ వధూః ప్రసాదితా సైవ కార్యం వః సాధయిష్యతి ।**
**ఇత్యుక్తాస్తే యయుః సాకం ధాత్రాஉత్రేరుటజం శుభమ్ ॥ 26**

**ప్ర :** తేజః = నక్షత్రాదుల తేజస్సు, యథా = ఎట్లు, తేజసా = సూర్యుని తేజస్సుచే, శమం ఏతి = ఉపశాన్తిని పొందునో, తథా = అట్లు, సతీ = సాధ్వి, సత్యా = సాధ్విచేత (శమం ఏతి), పతివ్రతా+అగ్రగణ్యా = పతివ్రతలలో మొదట చెప్పదగినది, అత్రేః వధూః = అత్రిమహర్షి భార్య, అనసూయా = అనసూయయగు, తపస్వినీ = తపోధనురాలు, ప్రసాదితా = ప్రార్థింపబడినదై, సా ఏవ = ఆమెయే, వః కార్యమ్ = మన కార్యమును, సాధయిష్యతి = సాధించును, ఇతి = అని, ధాత్రా = బ్రహ్మచే, ఉక్తాః = చెప్పబడినవారై, తే = వారు, సాకమ్ = వెంటనే, అత్రేః = అత్రిమహర్షియొక్క, శుభమ్ = శుభంకరమైన, ఉటజమ్ = పర్ణశాలను, యయుః = చేరిరి.

**తా :** సూర్యుని వెలుగుతో నక్షత్ర కాంతి మణిగినట్లు ఒక సాధ్వి ప్రమేయముతో మరియొక సాధ్వివలన కలిగిన ఉపద్రవము శాంతించును, కాన దేవతలు అత్రిమహర్షి భార్యను ప్రార్థించి తమ కార్యమును సాధించుకొనగలుగుదురని బ్రహ్మ సూచించినాడు. అనసూయాదేవి పతివ్రతలలో ప్రథమురాలు, తపశ్శక్తి గలది. కనుక బ్రహ్మ మాటను విని దేవతలు వెంటనే అత్రిమహర్షి పర్ణశాలను చేరిరి.

**శ్లో॥ ఆసాద్యాత్రిం చ తత్పత్నీం సాధ్వీం సర్వే చ సత్కృతాః ।**
**ప్రాపుః కౌశికధామాహానసూయా సత్కృతా సతీమ్ ॥ 27**

**ప్ర :** అత్రిం చ తత్ సాధ్వీం పత్నీమ్ = అత్రిమహర్షిని, వాని భార్యయగు సాధ్విని, ఆసాద్య = చేరి, ప్రార్థించి, సర్వే చ = అందఱును, సత్కృతాః = సత్కరింపబడినవారై, కౌశికధామ = కౌశికుని యింటిని, ప్రాపుః = చేరిరి, సత్కృతా = సత్కరింపబడి, అనసూయా = అనసూయాదేవి, సతీం ఆహ = కౌశికుని భార్యయగు సతితో నిట్లనెను.

**తా :** దేవతలు అత్రిమహర్షిని వాని భార్యను చేరి ప్రార్థించగా, వారును దేవతలను గౌరవించి, వారితో కలిసి కౌశికుని యిల్లు జేరిరి. అచట పరస్పరసత్కారములైన తరువాత సాధ్వి అనసూయ కౌశికుని భార్యతో నిట్లనెను. *

**శ్లో॥ దేవేభ్యోఽప్యధికస్తే కిం స్వభర్తా తన్ముఖేక్షణాత్ ।**
**నన్దస్యపి తదర్థం తే కచ్చిద్భద్వాక్తనుక్రియా ॥ 28**

**శ్లో॥ పతిశుశ్రూషయా నృణ్యం త్రివర్గాప్తిశ్చ యోషితః ।**
**క్లేశేన మహతా సాధ్వీ స్వాచారాత్పతిలోకగా ॥ 29**

**శ్లో॥ స్త్రీణాం పృథక్క్రియా కాపి నైవాతః సేవయేశితః ।**
**పుణ్యార్ధహారిణీ సార్ధం భర్త్రా పత్యాదిలోకగా ॥ 30**

**శ్లో॥ అతస్త్వయా సదా కార్యా పాతివ్రత్యే మతిః సతి! ।**
**ఐహికాముష్మికార్థోఽతః స్త్రీణాం భర్తా హి సద్గతిః ॥ 31**

**శ్లో॥ పాతివ్రత్యాన్మయాఽప్యార్యే! ధర్మ్యం మహాఫలమ్ ।**
**రూపాద్యైః క్వాపి నేక్షేఽన్యం భర్తృతుల్యం కదాప్యపి ॥ 32**

ప్ర : తే = నీకు, స్వభర్తా = నీ భర్త, దేవేభ్యః అపి = దేవతల కంటెను, అధికః కిమ్ = ఎక్కువవాడు కాదా యేమి?, తత్ ముఖ+ఈక్షణాత్ = వాని ముఖము చూచినంతనే, నన్దసి అపి కిమ్ = ఆనందింతువా కాదా యేమి?, తే = నీదైన, హృత్ వాక్ తను క్రియా = హృదయము, వాక్కు, శరీరము, వీని కార్యము, తత్ అర్థం కచ్చిత్ కిమ్ = వానికొరకే యగునా? కాదా?, పతిశుశ్రూషయా = పతిసేవచేత, నృణ్యమ్ = మానవీయమైన, త్రివర్గ+ఆప్తిః చ = ధర్మ, అర్థ, కామము లను మూడు పురుషార్థముల ప్రాప్తియును, యోషితః = స్త్రీకి, మహతా క్లేశేన = చాల కష్టముతో, సాధ్వీ = పతివ్రత, స్వ+ఆచారాత్ = తన ప్రవర్తనవలన, పతిలోకగా = భర్తలోకమును చేరును; స్త్రీణామ్ = స్త్రీలకు, పృథక్ క్రియా = వేరుగా చేయదగిన కార్యము, కా అపి = ఏదియును, న ఏవ = లేనే లేదు, అతః = అందువలన, ఈశితః = ఈశ్వరుడను భావమున, సేవయా = సేవచేత, పుణ+అర్ధహారిణీ = సగము పుణ్యమును చేకొని, భర్త్రా సార్ధమ్ = భర్తతో గూడ, పతి+ఆది లోకగా = పతియొక్క లోకమును పొందును; అతః = ఆ కారణమున, త్వయా = నీ చేత, సదా = ఎల్లపుడును, సతి! = ఓ సాధ్వీ!, పాతివ్రత్యే = పాతివ్రత్యమున, మతిః కార్యా = బుద్ధినుంచదగును, అతః = దానివలన, స్త్రీణామ్ = స్త్రీలకు, ఐహిక+ఆముష్మిక+అర్థః = ఇహపరములలో కోరదగిన, సద్గతిః = మంచి జీవితము, భర్తా హి = భర్తయే; అర్యే! = ఓ పవిత్రురాలా!, పాతివ్రత్యాత్ = పాతివ్రత్యము వలన, మయా అపి = నా చేత గూడ, ధర్మ్యం మహాఫలమ్ = ధర్మసంబంధి మహాఫలము, ప్రాప్తమ్ = పొందబడినది, రూప+ఆద్యైః = రూపము మొదలగు వానితో, భర్తృతుల్యమ్ = నా భర్తతో సమానమైన వానిని, కదా+అపి = ఎప్పుడైనను, క్వ+అపి = ఎక్కడను, అన్యమ్ = మరియొకనిని, న ఈక్షే = చూడను.

**తా :** నీకు నీ భర్త దేవతలకంటె అధికుడు కదాయేమి? వాని ముఖవీక్షణమే ఆనందకరమా? కాదా యేమి? నీ హృదయము, వాక్కు, శరీరము అన్నిటి కార్యములున్నూ నీభర్త కొరకేనా? కాదా యేమి? స్త్రీలకు పతిసేవయే త్రివర్గపదము. ఎంత కష్టమైనను సహించి తన శీలమువలన భర్తతో యే లోకమునైన పొందును. స్త్రీలకు వేరుగా శాస్త్రవిధులేవియును లేవు. భర్తను ఈశ్వరభావనజేసి సేవించి, ఆ భర్త సంపాదించిన పుణ్యములో సగమునకు అధికారిణి యగును, భర్తతో గూడ పరమగతిని పొందును. అందువలన ఓ సాధ్వీ! నీవు పాతివ్రత్యముననే సదా బుద్ధినుంచుము. ఇహపరములలో సద్గతి భర్తయే. పాతివ్రత్యమువలన నాకు గూడ మహాధర్మఫలము లభించినది. రూపము మొదలగు అన్ని గుణములలో నా భర్తతో సమానుడెవడునూ ఎక్కడనూ కన్పడడు.

**శ్లో॥ ఇతి శ్రుత్వాఽబ్రవీత్సాఽపి హృష్టా సాధ్వి! తథైవ మే ।**
**శ్రద్ధాం వర్ధయసేఽత్యన్తం సాధ్వ్యా భర్తైవ దైవతమ్ ॥ 33**

ప్ర : ఇతి = అని యనగా, శ్రుత్వా = విని, సా అపి = ఆమెయును, హృష్ట్వా = సంతోషించి, సాధ్వ్యా = సాధ్వితో, అబ్రవీత్ = పలికెను, సాధ్వి! = ఓ అనసూయా సాధ్వీ!, మే = నాకు, శ్రద్ధామ్ = శ్రద్ధను, అత్యన్తమ్ = మిక్కిలిగా, వర్ధయసే = పెంచుచున్నావు, భర్తా ఏవ = భర్తయే, దైవతమ్ = దైవము.

**తా :** అనసూయాసాధ్వి మాటలు విని సంతోషించి కౌశికుని భార్య ఇట్లనెను : ఓ సాధ్వీ! నీ మాటలు నా శ్రద్ధను పెంచునట్లున్నవి, నాకు నా భర్తయే దైవము.

**శ్లో॥ దివిషద్భిః సమం జాతం భవత్యా దర్శనం పరమ్ ।**
**తత్పుణ్యాత్తేఽనుగ్రహోఽయం ధన్యాఽహం వః కరోమి కిమ్ ॥ 34**

ప్ర : భవత్యాః = నీ యొక్క, పరం దర్శనమ్ = పరమమైన దర్శనము, దివిషద్భిః సమమ్ = దేవతలతో సమముగ, జాతమ్ = కలిగినది, తత్ పుణ్యాత్ = ఆ పుణ్యము వలన, అయం అనుగ్రహః = ఈ అనుగ్రహము (కలిగినది), ధన్యా = ధన్యురాలనైన, అహమ్ = నేను, వః = తమకై, కిం కరోమి = యేమి చేతును?

**తా :** పరమపావనమైన తమదర్శనము దేవతలతో సమముగా కలిగినది. మీ అనుగ్రహ భాషణమున్నూ వినగల్గి ధన్యురాలనైతిని. తమకై నేనేమి చేయుదును? *

**శ్లో॥ సా ప్రాహ సాధ్వ్యమీ దేవా యాచన్తే లోకశర్మణే ।**
**పూర్వవద్ద్యునిశాసంస్థాం తదర్థం చాగతాఽస్మ్యహమ్ ॥ 35**

ప్ర : సా = ఆ అనసూయాదేవి, ప్రాహ = ఇట్లనెను, సాధ్వి = ఓ సాధ్వీ!, లోకశర్మణే = లోకములకు శుభము గల్గుటకై, పూర్వవత్ = పూర్వమువలె, ద్యునిశాసంస్థామ్ = రేబవళ్ళ కాలవ్యవస్థను, అమీ దేవాః = ఈ దేవతలు, యాచన్తే = కోరుచున్నారు, అహం చ = నేను గూడ, తదర్థం = ఆ ప్రయోజనమాశించియే, ఆగతా అస్మి = వచ్చి యున్నాను.

**తా :** అనసూయాదేవి ఆమె కిట్లనెను : ఓ సాధ్వీ! లోకకళ్యాణమునకై పూర్వమువలె పవలు రాత్రులతో గూడిన కాలవ్యవస్థ అవసరమగుచున్నది. దానికై ప్రార్థించుటకే యీ దేవతలిందు వచ్చినారు. నేనున్నూ ఆ ప్రయోజనసిద్ధికొరకే వచ్చియున్నాను.

**శ్లో॥ లోకోచ్ఛేదః క్రియాచ్ఛేదే తతో నశ్యేజ్జగత్క్రమాత్ ।**
**తత్త్వం ప్రసీద ధైర్యేణ సూర్యమావహ మానదే! ॥ 36**

ప్ర : క్రియాచ్ఛేదే = నిత్యనైమిత్తికకార్యకలాపములు నిల్చిపోవుటతో, క్రమాత్ = క్రమముగా, లోకోచ్ఛేదః = లౌకికవ్యాపారములు కకావికలై, తతః = దానివలన, జగత్ = సృష్టి, నశ్యేత్ = నశించును, తత్ = ఆ కారణమున, త్వమ్ = నీవు, ప్రసీద = ప్రసాదగుణము వహించుము, ధైర్యేణ = ధైర్యముతో (నా వలన అపకారము కలుగదని), మానదే = ఓ మానవతీ!, సూర్యమ్

= సూర్యుని, ఆవహ = ఉదయింప నాహ్వానించుము.

**తా :** యజ్ఞయాగాది కర్మలు నిల్చిపోవుటతో, క్రమముగా ఋతుచక్రము నిల్చిపోయి లోకము కల్లోలితమై జగత్తు నశించును. కనుక నీవు ప్రసాదశీలివై నీకపకారము కలుగదని ధైర్యముతో సూర్యుని ఉదయింప నాహ్వానింపుము. *

**శ్లో॥ సోవాచార్కోదయాదేవ చణ్డమాణ్డవ్యశాపతః ।**
**నాశం ప్రాప్స్యతి మే భర్తా సుభగే! కిం బ్రవీమ్యతః ॥ 37**

**ప్ర :** సా = ఆమె, ఉవాచ = అనెను, చణ్డమాణ్డవ్యశాపతః = కోపగించిన మాండవ్యుని శాపము వలన, అర్క+ఉదయాత్ ఏవ = సూర్యుడుదయించినంతనే, మే భర్తా = నా భర్త, నాశం ప్రాప్స్యతి = మరణించును, సుభగే! = ఓ సౌభాగ్యవతీ!, అతః = ఆ కారణమున, కిం బ్రవీమి = ఏమి చెప్పుదును?

**శ్లో॥ అనసూయాఽఽహ మా భీస్త్వం సూర్యమావహ తే పతిమ్ ।**
**సజీవం పూర్వవత్కుర్వే సత్యం తే యది రోచతే ॥ 38**

**ప్ర :** అనసూయా ఆహ = అనసూయా దేవి యిట్లనెను, మా భీః = భయపడకుము, సూర్యం ఆవహ = సూర్యుని ఆవాహనము చేయుము, తే పతిమ్ = నీ భర్తను, సజీవమ్ = సజీవునిగా, పూర్వవత్ = పూర్వమువలె, కుర్వే = చేయుదుము, సత్యమ్ = సత్యము, తే యది రోచతే = నీకిది రుచించినచో

**తా :** అనసూయాదేవి యిట్లనెను : భయపడకుము. నీ భర్తను పూర్వమువలె సజీవునిగా చేయుదుము, నీ యిష్టప్రకారమే. సూర్యుని ఆవాహన చేయుము. *

**శ్లో॥ తథేత్యుక్త్వాఽథ సా సాధ్వీ తద్విశ్వాసాద్దివాకరమ్ ।**
**ఆజుహావ ద్రుతం చాసౌ శోచిష్కేశస్తదోదితః ॥ 39**

**ప్ర :** తథా ఇతి ఉక్త్వా = అట్లే యని పలికి, సా సాధ్వీ = ఆ సాధ్వి, తత్ విశ్వాసాత్ = వారిపై విశ్వాసమువలన, దివాకరమ్ = సూర్యుని, ఆజుహావ = ఆహ్వానించెను, చ = మరియు, అసౌ శోచిష్కేశః = ఆ సూర్యుడు, తదా = అప్పుడు, ద్రుతమ్ ఉదితః = వేగముగా ఉదయించెను.

**తా :** ఆ సాధ్వి వారిపై విశ్వాసమువలన అట్లే కానిమ్మని సూర్యుని ఆహ్వానించెను. సూర్యుడును అప్పుడు వెంటనే ఉదయించెను. *

**శ్లో॥ స్థితోఽపి షట్శతఘటీకాలం భీత్యోద్గతో రవిః ।**
**సత్యాఽఽహూత్యా కౌశికాసూన్ సహైవ చ హరంస్తమః ॥ 40**

**ప్ర :** సత్యా ఆహూత్యా = ఆ సాధ్వి ఆహ్వానముతో, రవిః = సూర్యుడు, షట్ శతఘటీకాలమ్ = ఇరువది నాలుగు ఘడియల కాలము, స్థితః అపి = నెలకొన్న, తమః = చీకటిని, చ = మరియు,

కౌశిక+అసూన్ = కౌశికుని ప్రాణములను, సహైవ = తోడ్తోడనే, హరించుచు, భీత్యా ఉద్గతః = భయముచే ఉదయించెను.

**తా :** ఆ సాధ్వి ఆహ్వానించగనే, అప్పటి కిరువది నాలుగు ఘడియల కాలము నెలకొని యున్న చీకటిని, కౌశికుని ప్రాణములను ఏకకాలమున హరించుచు, సూర్యుడుదయించెను. *

**శ్లో॥ స్వేశం దృష్ట్వాఽబ్జినీ హృష్టా క్లిష్టా నష్టాధిపా చ సా ।**
**అనసూయోవాచ భద్రే మా శోచీః పశ్య మే తపః ॥ 41**

**ప్ర :** స్వ+ఈశమ్ = తన ప్రభువైన సూర్యుని, దృష్ట్వా = చూచి, అబ్జినీ = పద్మిని, హృష్టా = సంతోషించినదాయెను, చ = మరియు, సా = ఆ సాధ్వి, నష్టాధిపా = భర్తను పోగొట్టుకొని, క్లిష్టా = క్లేశము పాలాయెను, అనసూయా ఉవాచ = అనసూయా దేవి యిట్లనెను, భద్రే = ఓ సౌభాగ్యవతీ!, మే తపః పశ్య = నా తపశ్శక్తి చూడుము, మా శోచీః = విచారించకుము.

**తా :** సూర్యుని చూచి పద్మము వికసించినది. సూర్యోదయముతో ఆ సాధ్వి భర్తను కోల్పోయి దుఃఖితురాలైనది. ఆమెను చూచి అనసూయా దేవి యిట్లనినది : సౌభాగ్యవతీ! విచారించకుము, నా తపఃశక్తిని చూడుము.

**శ్లో॥ యది మేఽనన్యయా భక్త్యా పత్యుపాస్తిర్దృధా కృతా ।**
**స్వప్నేఽపి న మతం పత్యా సమం కమపి సర్వతః ॥ 42**

**శ్లో॥ హృద్వాక్కాయైః స్వధర్మాచ్చేత్సేవితా పతిదేవతా ।**
**తల్లవాత్ స్త్రీసహాయోఽసౌ జీవత్వబ్దశతం పునః ॥ 43**

**ప్ర :** అనన్యయా = సాటిలేని, దృధా భక్త్యా = దృఢభక్తితో, పతి+ఉపాస్తిః = పతిదేవతోపాసన, యది కృతా = చేయబడినదైనచో, సర్వతః = అన్ని విధములుగ, కం అపి = ఎవనినైన, స్వప్నే అపి = కలోనైన, మే = నాకు, పత్యాసమమ్ = పతితో సమానముగ, న మతమ్ (యది) = సమ్మతము కాకున్నచో, హృత్ వాక్ కాయైః = హృదయముతో, వాక్కుతో, శరీరముతో, (త్రికరణశుద్ధిగా), పతిదేవతా = పతిదేవత, స్వధర్మాత్ = నా ధర్మముగా, సేవితా చేత్ = సేవింపబడినదైనచో, తత్ లవాత్ = ఆ పుణ్యాంశ వలన, అసౌ = ఈతడు, పునః = మరల, స్త్రీసహాయః = తన భార్యతో గూడి, అబ్దశతమ్ = నూరు సంవత్సరములు, జీవతు = జీవించుగాక!

**తా :** సాటిలేని దృఢభక్తితో, కలనైన వేరొకరిని నా భర్తతో యే విషయమందైన సమానుడని భావించక, మనోవాక్కాయకర్మలు శుద్ధిగా, నా ధర్మముగా, పతిదేవతోపాసన నేను చేసిన దాననైనచో, ఆ పుణ్యలేశమున ఈతడు మరల తన భార్యను గూడి నూరు సంవత్సరములు జీవించును గాక!

**శ్లో॥ మన ఆవర్తయామ్యస్య క్వాపి యాతం పునస్త్విహ ।**
**జీవాతవేఽసునీతేఽస్య తన్మనో ధేహి పూర్వవత్ ॥ 44**

ప్ర : క్వ యాతం అపి = ఎక్కడకు వెళ్ళియున్నదైనను, అస్య మనః = వాని మనస్సును, పునః = మరల, ఇహ తు = ఇక్కడకే, ఆవర్తయామి = మరలించుచున్నాను, అసునీతే! = ఓ ప్రాణాది కళానియన్త్రీ దేవతా!, అస్య = వానియొక్క, తన్ మనః = తనువును మనస్సును, పూర్వవత్ = పూర్వమువలె సర్వకార్యనిర్వహణ దక్షత గలదిగా, జీవాతవే = జీవించుటకు, ధేహి = ధరించుము.

**తా :** ఓ జీవకళానియన్త్రీ దేవతా! వీని మనస్సు, అది యెక్కడకు వెళ్ళినదైయున్నను, మరల ఇక్కడకే, ఈ శరీరమునకే మరలి వచ్చుగాక! వీని తనువును మనస్సును పూర్వమువలె జీవించుటకు నీవు ధరింతువుగాక!

**శ్లో॥ సత్యేత్యుక్తే మృతోఽప్యేష సుప్తోత్థితవదుత్థితః ।**
**స్వదీప్త్యా భాసయన్వేశ్మ నీరోగో దేవవత్సుధీః ॥ 45**

ప్ర : సత్యా = సాధ్వి చే, ఇతి = ఈ విధముగా, ఉక్తే = పలుకబడగా, ఏష మృతః = ఆ మరణించిన కౌశికుడు, సుప్త+ఉత్థితవత్ = నిద్రించి మేల్కొన్నవానివలె, స్వదీప్త్యా = తన తేజస్సుతో, వేశ్మ = ఆ యింటిని, భాసయన్ = ప్రకాశింపజేయుచు, నీరోగః = రోగరహితుడై, దేవవత్ = దేవతవలె, సుధీః = బుద్ధిశాలియై, ఉత్థితః = లేచినవాడాయెను.

**తా :** సతీ అనసూయ యిట్లు పలుకగనే, మరణించిన కౌశికుడు నిద్రించి మేల్కొన్న వానివలె లేచెను. వాని కుష్ఠరోగము యేమాయెనో, వాని తీవ్రకోపస్వభావము, మూర్ఖత్వము యెటుబోయెనో, ధీశాలియైన దేవతవలె తన తేజస్సుతో ఆ యింటిని ప్రకాశింపజేసెను.

**శ్లో॥ తుష్టాః పుష్పముచో దేవాః బ్రహ్మవిష్ణుశివాదయః ।**
**రమ్భాద్యా ననృతుః సాధు గన్ధర్వా లలితం జగుః ॥ 46**

ప్ర : బ్రహ్మవిష్ణుశివాదయః = బ్రహ్మవిష్ణుశివుడాదిగా, దేవాః = దేవతలు, తుష్టాః = సంతోషించినవారై, పుష్పముచః = పూలు కురిపించిరి. రంభా ఆద్యాః = రంభ మొదలగు అప్సరసలు, సాధు = చక్కగా, ననృతుః = నాట్యము చేసిరి, గన్ధర్వాః = గంధర్వులు, లలితమ్ = మృదుమధురముగా, జగుః = గానము చేసిరి.

**తా :** బ్రహ్మాది దేవతలు సంతోషముతో పూలు చల్లిరి. అప్సరసలు నాట్యమాడిరి. గంధర్వులు పాడిరి.

**శ్లో॥ దేవా ఊచుర్మహాకార్యం కృతం కల్యాణి! నస్త్వయా ।**
**వరదాః స్మో వరం హృద్యమనసూయే వృణీష్వ భోః ॥ 47**

ప్ర : దేవాః = దేవతలు, ఊచుః = పలికిరి, కల్యాణి! = ఓ సౌభాగ్యవతీ!, భోః అనసూయే = ఓ అనసూయా!, త్వయా = నీ చేత, నః = మా కొరకు, మహాకార్యం కృతమ్ = గొప్పకార్యము

చేయబడినది, వరదాః స్మః = వరములిచ్చువారమై యున్నాము, హృద్యం వరం వృణీష్వ = నీ మనసుకెక్కిన వరమును కోరుకొనుము.

**తా :** దేవతలిట్లనిరి : సౌభాగ్యవతీ, అనసూయా! నీవు మా కొరకై గొప్ప కార్యము చేసినావు. మేము సంతోషించి వరములిత్తుము, నీ కిష్టమైన దానిని కోరుకొనుము.

**శ్లో॥ సోవాచ భర్తృయోగోఽస్తు క్లేశముక్త్యై సదా మమ ।**
**పుత్రభావం త్ర్యధీశో నౌ ప్రాప్నోత్వన్యైర్వరైస్తు కిమ్ ॥ 48**

**ప్ర :** సా ఉవాచ = ఆమె, అనసూయ యనెను, సదా = ఎల్లప్పుడు, క్లేశముక్త్యై = దుఃఖ రాహిత్యమునకై, భర్తృయోగః = భర్తతో కూడియుండుట, అస్తు = అగుగాక!, త్ర్యధీశః = త్రిలోకాధిపతి విష్ణువు, పుత్త్రభావమ్ = కుమారుని స్థానమును, నౌ = మాకు, ప్రాప్నోతు = పొందుగాక!, అన్యైః వరైః తు కిమ్ = ఇతర వరములతో నింక పనియేమి?

**తా :** అనసూయ యిట్టనినది : నా కెప్పుడు భర్తతో కూడియుండు యోగము కలుగుగాక! వియోగదుఃఖము లేకుండుగాక! త్రిలోకాధిపతి శ్రీ విష్ణువు మా ఇర్వురకు కుమారుడగు గాక! అన్యవరము లింక అప్రస్తుతములు కదా.

**శ్లో॥ ఏవమస్త్వితి తాం ప్రోక్త్వా జగ్ముర్దేవా యథాగతమ్ ।**
**స్వాశ్రమం చానసూయాపి కౌశికస్త్ర్యనుమోదితా ॥ 49**

**ప్ర :** ఏవం అస్తు = అట్లే యగుగాక!, ఇతి = అని, తామ్ = ఆమెను, ప్రోక్త్వా = ఆశీర్వదించి, దేవాః = దేవతలు, యథా ఆగతమ్ = ఎట్లు వచ్చిరో అట్లే, జగ్ముః = వెడలిరి, అనసూయా అపి = అనసూయ కూడ, కౌశికస్త్రీ+అనుమోదితా = కౌశికుని భార్య అంగీకారముగలదై, స్వ+ఆశ్రమమ్ = తన ఆశ్రమమును గూర్చి (వెడలెను).

**తా :** అట్లే యగునని ఆశీర్వదించి దేవతలు తాము వచ్చినట్లే వెడలిరి. అనసూయ కూడ కౌశికుని భార్య అనుమతితో తన ఆశ్రమము చేరబోయెను. *

**శ్లో॥ తతః కాలే సుచార్వఙ్గీమృతుస్నాతామనిన్దితామ్ ।**
**స్వజాయాం సుదతీం స్వఙ్గీం లోభనీయతమాకృతిమ్ ॥ 50**

**ప్ర :** తతః = అంతట, కాలే = కాలము గడువగా, సుచారు+అఙ్గీమ్ = మంచి అందమైన అవయవములు గలదానిని, ఋతుస్నాతామ్ = ఋతుమతియైన దానిని, అనిన్దితామ్ = దోషరహితను, సుదతీం-సు+అఙ్గీమ్ = పొందికైన అవయవములు గలదానిని, లోభనీయతమ +ఆకృతిమ్ = ఆకర్షకమైన రూపము గల దానిని, స్వ జాయామ్ = తన భార్యను,

**శ్లో॥ బ్రహ్మపుత్త్రో ద్వితీయోఽత్రిర్మహర్షిర్భగవాన్ ప్రభుః ।**
**సకామో మనసా భేజే ధ్యాతాఽజాత త్ర్యధీశ్వరః ॥ 51**

**ప్ర :** బ్రహ్మపుత్త్రః ద్వితీయః = బ్రహ్మకు రెండవ కుమారుడైన, మహర్షిః = మహర్షి, ప్రభుః = ప్రభువు, భగవాన్ = భగవానుడు అయిన, అత్రిః = అత్రి, సకామః = కామేచ్ఛగలవాడై, మనసా = మనసుతో, భేజే = సేవించెను, త్ర్యధీశ్వరః = త్రిలోకనాథుడు, ధ్యాతా = ధ్యానమువలన, అజాత = జన్మించెను.

**తా :** అంతట కాలగతిలో ఋతుస్నాతయైన సౌందర్యవతియైన తన భార్యను బ్రహ్మ మానస పుత్రులలో రెండవవాడైన అత్రి మహర్షి కామేచ్ఛగలవాడై, మనసా కూడెను. శరీరసంగములేని కామనవలన ధ్యానము కారణముగ త్రిలోకనాథుడు జన్మించెను.

**శ్లో॥ వాయూత్థం రజ ఉద్రిక్తం తేజో వైకారికం ద్యుమత్ ।**
**బ్రహ్మాధిష్ఠితమాధత్త చన్ద్రః కాంశో యతోఽభవత్ ॥ 52**

**ప్ర :** వాయు+ఉత్థమ్ = వాయువుచే ఎగురగొట్టబడిన, రజః = ధూళిచే, ఉద్రిక్తమ్ = ఉద్రేకము చెందిన, వైకారికం తేజః = వికారము చెందిన తేజస్సు, బ్రహ్మ+అధిష్ఠితమ్ = బ్రహ్మచే అధిష్ఠితమైన దానిని, ద్యుమత్ చంద్రః = వెలుగుచున్న చంద్రుడు, యతః ఆధత్త = ఎందుచే ధరించెనో, అందువలన, కాంశః అభవత్ = బ్రహ్మాంశ యాయెను.

**తా :** అత్రిమహర్షి కామవికారము చెందుటవలన వాయువుచే ఉద్రేకము చెంది పైకెగిరిన ధూళివలెనైన వాని రేతస్సును బ్రహ్మ అధిష్ఠించి యున్నందున దానిని ధరించి చంద్రుడు బ్రహ్మాంశయాయెను.

**శ్లో॥ మత్తోద్రిక్తం చ సాభిన్నం త్ర్యధీశాధిష్ఠితం మహః ।**
**యతోఽభూద్బ్రాహ్మణశ్రేష్ఠః శ్రీదత్తో భగవాన్ స్వయమ్ ॥ 53**

**ప్ర :** మత్త+ఉద్రిక్తం స+అభిన్నం చ త్రి+అధీశ+అధిష్ఠితం మహః = మదోద్రిక్తమై, అభిన్నమై, పరమేశ్వరుడధిష్ఠించియున్న మహస్తేజము, యతః = దానినుండి, బ్రాహ్మణశ్రేష్ఠః శ్రీదత్తః = బ్రాహ్మణశ్రేష్ఠుడైన శ్రీదత్తుడుగా భగవాన్ స్వయం అభూత్ = స్వయముగ భగవానుడే జన్మించెను.

**తా :** పరమేశ్వరాధిష్ఠితమైన మహస్తేజము నుండి బ్రాహ్మణతేజముతో శ్రీదత్తుడై సాక్షాత్ భగవానుడే జన్మించినాడు.

**శ్లో॥ తథైవ తమ ఉద్రిక్తం రుద్రాధిష్ఠితమంశతః ।**
**వరప్రభావాద్ధృత్వైవం శుశుభే నితరాం సతీ ॥ 54**

**ప్ర :** తథా ఏవ = అట్లే, తమః+ఉద్రిక్తమ్ = తమోగుణోద్రేకము గల, రుద్రాధిష్ఠితం అంశతః = రుద్రాంశచే అధిష్ఠితమైన తేజస్సును, వరప్రభావాత్ = వరప్రభావమువలన, ధృత్వా = ధరించి, నితరామ్ = పూర్తిగా, సతీ = సాధ్వి, సతీదేవి, శుశుభే = ప్రకాశించెను.

**తా :** అట్లే తమోగుణోద్రిక్తత చేత రుద్రాధిష్ఠితమై శంకరాంశగల తేజస్సును వరప్రభావమువలన ధరించినందువలన సతీదేవి ప్రకాశించినది.

**శ్లో॥ యథాకాలం కృతాః సర్వే సంస్కారా అత్రిణా క్రమాత్ ।**
**తతస్త్ర్యధీశోఽవతరత్తద్గర్భత్రయరూపతః ॥ 55**

**ప్ర :** అత్రిణా = అత్రిమహర్షిచేత, క్రమాత్ = క్రమముగా, సర్వే సంస్కారాః = పుంసవనాది సంస్కారము లన్నియు, యథా కాలమ్ = సరియగు సమయమున, కృతాః = చేయబడినవి, తతః = అంతట, త్రి+అధీశః = ముల్లోకాధిపతి, గర్భత్రయరూపతః = మూడు గర్భముల రూపమున, అవతరత్ = అవతరించెను.

**తా :** అత్రిమహర్షి కాలక్రమాన పుంసవనాది సంస్కారము లన్నిటిని యెప్పుడేది శాస్త్రోక్తమో ఆ విధి ననుసరించి నిర్వర్తించగా, త్రిలోకనాథుడు, (పై జెప్పిన రీతిలో) సత్వరజస్తమో గుణోద్రిక్తమైన రేతస్సువలన మూడు గర్భముల రూపమున అవతరించినాడు.

**శ్లో॥ దత్తావతారకాలే తు సుయోగే ముదితం జగత్ ।**
**త్రీశత్వం దర్శయిత్వా ప్రాక్ స్మృత్యై బాలోఽభవత్సుతః ॥ 56**

**ప్ర :** దత్త+అవతారకాలే తు = దత్త ప్రభువు అవతరించిన కాలమున, జగత్ = లోకము, సుయోగే = మంచియోగమున, ముదితమ్ = సంతోషించినది, ప్రాక్ = ముందుగా, స్మృత్యై = జ్ఞప్తికొరకు, త్రీశత్వమ్ = ముల్లోకాధిపత్యమును, దర్శయిత్వా = ప్రదర్శించి, బాలః సుతః అభవత్ = బాలుడైన కుమారుడైనాడు.

**తా :** దత్తప్రభువు అవతరించిన కాలము లోకమునకు మంచి యోగకాలము కాగా జగత్తు సంతోషించినది. ముందుగా శ్రీదత్తుడు తన త్రిలోకాధిపతి లక్షణమును ప్రదర్శించి, తరువాత వారి కుమారుడుగా బాలుడై అవతరించినాడు.

**శ్లో॥ చక్రేఽథ జాతకర్మాఽత్రిర్విధినా నామకర్మ చ ।**
**చన్ద్రో దత్తశ్చ దుర్వాసాః సతీస్తన్యం పపుర్ముదా ॥ 57**

**ప్ర :** అథ = అంతట, అత్రిః = అత్రి, విధినా = శాస్త్రోక్తముగా, జాతకర్మా చ నామకర్మ చక్రే = జాతకర్మయు నామకరణమున్నూ చేసెను, చన్ద్రః దత్తః చ దుర్వాసాః = చంద్రుడు, దత్తాత్రేయుడు, దుర్వాసుడున్నూ, సతీస్తన్యమ్ = సతీ అనసూయ చేనుబాలను, ముదా = సంతోషముతో, పపుః = త్రాగిరి.

**తా :** అంతట అత్రి శాస్త్రోక్తముగా జాతకర్మచేసి, నామకరణము చేసినాడు. చంద్రుడు, శ్రీదత్తుడు, దుర్వాసుడు అనసూయాదేవి చేనుబాలు త్రాగిరి.

**శ్లో॥ చన్ద్రోఽగాత్సంస్కృతః స్వర్గమౌషధీశోఽన్వయర్ధికృత్ ।**
**దుర్వాసాశ్చేద్ధతోఽటద్గాం స్వైరం రౌద్రోఽసదర్దనః ॥ 58**

**ప్ర :** సంస్కృతః = జన్మసంస్కారములు పొందిన, చన్ద్రః = చంద్రుడు, ఓషధీశః = ఓషధులకధిపతియై, అన్వయర్ధికృత్ = వంశవృద్ధికారకుడై, స్వర్గం అగాత్ = స్వర్గమునకు పోయెను, దుర్వాసాః చ = దుర్వాసుడేమో, ఉద్ధతః రౌద్రః అసదర్దనః = కోపదారి, గంభీరుడు, దుష్టులను శిక్షించువాడునై, స్వైరమ్ = స్వేచ్ఛగా, గాం అటత్ = భూమినంతయు తిరిగెను.

**తా :** జన్మసంస్కారముల తర్వాత, చంద్రుడు ఓషధీశుడై వంశవృద్ధికారకుడై ఆకాశమునకు వెడలెను. దుర్వాసుడు కోపిష్ఠియై, ఎవరినిగాని లెక్కచేయనివాడై, దుష్టశిక్షకుడై, తన యిష్టముగా నిరాతంకముగ భూమిని సంచరించెను.

**శ్లో॥ ఆప్తకామోఽపి భగవాన్ శ్రీదత్తో యోగమాయయా ।**
**బాలానుసార్యక్రియోఽపి బాలోక్తైర్ముగ్ధచేష్టితైః ॥ 59**

**శ్లో॥ క్వాప్యతర్క్యసులీలాభిః క్వాపి ధార్ష్ట్యైశ్చ చంక్రమైః ।**
**దర్శయన్ భక్తవశతాం సంతోష్య పితరౌ స్థితః ॥ 60**

**ప్ర :** భగవాన్ శ్రీదత్తః = **శ్రీదత్తభగవానుడు**, ఆప్తకామః+అపి = కోరికలు లేనివాడే యైనను, యోగమాయయా = యోగమాయచేత, బాల+అనుసార్యక్రియః అపి = బాలురకు యోగ్యమైన కార్యములు గలవాడై, బాల+ఉక్తైః = బాల్యమునకు తగిన ముద్దుమాటలతో, ముగ్ధచేష్టితైః = అమాయికపు పనులతో, క్వ+అపి అతర్క్యసులీలాభిః = ఒకప్పుడు ఊహకందని చక్కని ఆటలతో, క్వ+అపి ధార్ష్ట్యైః చ = ఒకప్పుడు దబాయింపులతో, బెదరింపులతోనూ, చంక్రమైః = సంచారములతో, భక్తవశతాం దర్శయన్ = తాను భక్తులకు వశుడనని ప్రదర్శించుచు, పితరౌ = తల్లితండ్రులను, సంతోష్య = సంతోషపెట్టి, స్థితః = యుండెను.

**తా :** శ్రీదత్తభగవానుడు కోరికలు తనకు లేకున్నను, భక్తపరవశుడై వారిని ఆనందింప జేయుటకు, యోగమాయ ఆధారముగా, బాల్యచేష్టలతోను, ముద్దుమాటలతోను, అమాయికత్వముతోనూ, తల్లిని తండ్రిని సంతోషపెట్టెను. *

**శ్లో॥ శిష్టపో దుష్టహా మాన్యో యోగమార్గప్రవర్తకః ।**
**ఇతి శ్రుత్వా మునిగణా యోగాభ్యాసార్థమాయయుః ॥ 61**

**ప్ర :** శిష్టపః = మంచివారిని అనుగ్రహించువాడు, దుష్టహా = చెడ్డవారిని హరించువాడును, మాన్యః = గౌరవనీయుడు, యోగమార్గప్రవర్తకః = యోగమార్గమున నడిపించువాడు, ఇతి = అని, శ్రుత్వా = విని, మునిగణాః = మునుల సమూహములు, యోగ+అభ్యాస+అర్థమ్ = యోగమును అభ్యసించుటకై, ఆయయుః = వచ్చి చేరిరి.

**తా :** ఆ దత్తభగవానుడు శిష్టరక్షకుడు దుష్టశిక్షకుడు, యోగశాస్త్రాభ్యాసములలో శిక్షణ నిచ్చువాడు, గౌరవనీయుడని విని మునులు యోగమును నేర్చుకొనుటకై వాని చెంతకు వచ్చి చేరిరి.

**శ్లో॥ జలేఽగాధేఽవిశత్తాంస్తు సర్వజ్ఞోఽపి పరీక్షితుమ్ ।**
**శతాబ్దం తత్ర కేఽప్యస్థుస్తన్మోహాయాపి యోగిరాట్ ॥ 62**

**ప్ర :** సర్వజ్ఞః అపి = అంతయు తానెఱిగినవాడైనను, తాన్ = వారిని, పరీక్షితుం తు = పరీక్షించుటకేమో, జలే అగాధే అవిశత్ = లోతు తెలియని జలములో ప్రవేశించెను, తత్ర = అక్కడ, కే అపి = ఒకానొక, శత+అబ్దమ్ = నూరు సంవత్సరముల కాలము, తత్ మోహాయ అపి = వారిని భ్రమింపజేయుటకు, యోగిరాట్ = యోగిరాజు, అస్థుః = ఉండెను.

**తా :** శ్రీదత్తుడు సర్వమెఱిగియు, తన కొరకై వచ్చిన వారిని పరీక్షించుటకు తానొక అగాధ జలనిధిలో ప్రవేశించి ఒక నూరు సంవత్సరములట్టే ఆ నీటిలో నుండెను. శిష్యుల దృఢసంకల్పమును తెలియుట కీ పరీక్ష.

**శ్లో॥ స్వాశ్రయాం పరశక్తిం స ధృత్వా మూర్తిమదుద్గతః ।**
**గాయన్తీం సాధువాద్యాని వాదయన్తీం నిజాఙ్కగామ్ ॥ 63**

**ప్ర :** స్వాశ్రయామ్ = తన నాశ్రయించియున్న, పరశక్తిమ్ = పరమ శక్తిని, నిజ+అఙ్కగామ్ = తన అంకమందున్నదానిని, సాధువాద్యాని వాదయన్తీమ్ = మధురముగా వాద్యములను మ్రోయించుచున్నదానిని, గాయన్తీమ్ = పాడుచున్నదానిని, ధృత్వా = ధరించి, సః = ఆతడు, మూర్తిమత్ = మూర్తిమంతుడై, ఉద్గతః = పైకి లేచెను.

**తా :** తన నాశ్రయించి, తన యంకమందుండి, మధురముగా వాద్యములను మ్రోయించుచు, పాడుచున్న పరమశక్తిని ధరించి, ఆతడు మూర్తిమంతుడై పైకి లేచెను.

**శ్లో॥ పీనశ్రోణికుచాం తన్వీమనఘాం మద్యమాంసయుక్ ।**
**తేజీయసాం న దోషోఽయమిత్యుక్త్వా కేచనాస్థితాః ॥ 64**

**ప్ర :** పీనశ్రోణికుచామ్ = బలిసిన పిఱుదులు కుచములు గలదానిని, తన్వీమ్ = పలుచని శరీరము గలదానిని, అనఘామ్ = పాపరహితురాలిని (పై శ్లోకముతో), మద్యమాంసయుక్ = మద్యమాంసములతో గూడ, తేజీయసామ్ = నిర్గుణమార్గమును అనుసరించువారికి, అయమ్ = ఇట్లుండుట, న దోషః = దోషము కాదు, ఇతి = అని, ఉక్త్వా = చెప్పి, కేచన అస్థితాః = కొందఱు వచ్చి నిల్చిరి.

**తా :** (పై శ్లోకముతో కలిపి అన్వయం) బలిసిన పిఱుదులు కుచములు గలిగి, పలుచని శరీరముతో పాపములేకున్న ఆ స్త్రీ మూర్తితోను మద్యమాంసములతోను శ్రీదత్తుడు వెలువడెను. చూచిన వారిలో కొందఱు త్రిగుణాతీతమైన జీవనమార్గమును అనుసరించువారికిది దోషము కాదని నిల్చియుండిరి. అనగా, అది దోషమని తలచిన మరికొందఱు ఆ చోటు విడచి పోయిరని భావము.

**శ్లో॥ తతో జ్ఞాత్వాఽమలాఞ్ఛిష్టాంశ్చక్రేఽనుగ్రహముత్తమమ్ ।**
**ప్రభుర్యేనార్జునముఖా యోగర్ధిముభయీం యయుః ॥ 65**

ప్ర : తతః = దానివలన, అమలాన్ = మాలిన్యములేనివారిని, శిష్టాన్ చ = శిష్టాచారము గలవారిని, జ్ఞాత్వా = తెలిసికొని, ప్రభుః = శ్రీదత్తప్రభువు, ఉత్తమమ్ అనుగ్రహమ్ = సర్వశ్రేష్ఠమైన అనుగ్రహమును, చక్రే = ప్రదర్శించెను, యేన = యే అనుగ్రహముచే, అర్జునముఖాః = అర్జును డాదిగా గలవారు, యోగర్ధిమ్ ఉభయీమ్ = ఐహిక ఆముష్మిక యోగవృద్ధిని, యయుః = పొందిరి.

**తా :** ఆ కారణమున రాగద్వేషరహితులను సదాచారసంపన్నులను దత్తభగవానుడనుగ్రహించెను. వారు చూపిన మార్గము ననుసరించి అర్జునాదులు ఐహికజీవితమున ఆముష్మికజీవితమున కూడ యోగక్షేమములను సాధించికొనిరి.

**శ్లో॥ సాహసం యద్యపీశస్య స్వైరం ధర్మవ్యతిక్రమః ।**
**తేజీయస్త్వాన్న దోషోఽగ్నేరివ సర్వభుజో విభోః ॥ 66**

ప్ర : ఈశస్య = దత్తప్రభువుయొక్క, సాహసమ్ = సాహసకార్యము, స్వైరమ్ = యథేచ్ఛగా ఆచరించినది, యది ధర్మవ్యతిక్రమః అపి = ఒకవేళ అది ధర్మము తప్పినదే యైనను, సర్వభుజః = సమస్తమును దహించువాడైన, అగ్నేః ఇవ = అగ్నికి వలె, విభోః = దత్తప్రభువునకు, తేజీయస్త్వాత్ = తేజస్వితవలన, దోషః న = దోషము కాదు.

**తా :** దత్తాత్రేయుడట్లు స్త్రీసాంగత్యముతోను మద్యమాంసములతోను దర్శనమిచ్చుట స్వేచ్ఛావిహారముగ ధర్మము తప్పిన సాహసక్రియగా తోచినను, అది వానికి దోషము కాదు. అగ్నికి సర్వభక్షకత్వము శీలము. ఆ లక్షణమే లేనిచో ఆతడగ్నియే కాడు. శ్రీదత్తప్రభువు వంటి జ్ఞాని స్థితియు అట్టిదే. ఇరువురిలోని విశేషమేమనగా, వారియందు చేరిన వాని ఉచ్చనీచములు రెండును దగ్ధమై పోవును, వారిలో మిగులునది లేదు. కనుక అది ఆ ఉభయులకును దోషముగా చెప్పరాదు.

**శ్లో॥ మూఢోఽనీశశ్చరన్నశ్యేత్తద్వినేశం యథా విషమ్ ।**
**ధర్మాద్యస్పృగ్వాయువన్నిస్త్రైగుణ్యః శ్రుతిమూర్ధగః ॥ 67**

**శ్లో॥ తాదృగీశవచస్తథ్యం తథైవాచరితం క్వచిత్ ।**
**తయోర్ధర్మ్యం ప్రవృత్తార్థం యుక్తం తన్మతిమాంశ్చరేత్ ॥ 68**

ప్ర : మూఢః = మూర్ఖుడు, అనీశః = అసమర్థుడు, చరన్ = ఇట్లాచరించుచు, నశ్యేత్ = నశించును, యథా = ఎట్లు, విషమ్ = విషమును, వినా ఈశమ్ తత్ = సమర్థుడు కానివాడు విషమునువలె, ధర్మ+ఆది = ధర్మము మొదలగునవి, వాయువత్ = వాయువువలె, నిస్త్రైగుణ్యః = త్రిగుణాతీతుడైనవాడు, శ్రుతిమూర్ధగః = వేదశిరస్సులనబడు ఉపనిషత్సారము నెఱిగినవాడు, అస్పృక్ = స్పర్శలేనివాడు, తాదృగ్ = అట్టివాడు, ఈశ = ఈశ్వరుడు, వచః తథ్యమ్ = వారి వచనములు అట్లే, క్వచిత్ = ఒకప్పుడు, తథైవ ఆచరితమ్ = అట్లే ఆచరింపబడిన, తయోః = వారియొక్క, ధర్మ్యమ్ = ధర్మలక్షణము, ప్రవృత్తార్థమ్ = ప్రవర్తింపదగినది, యుక్తమ్ = యుక్తమైనది, తత్ మతిమాన్ = అంతటి మతిమంతుడు, ఆచరేత్ = ఆచరించును.

**తా :** త్రిగుణాతీతులై అగ్నివలె వాయువువలె సర్వము నంటియు దేనినీ అంటనివారు ప్రవర్తించినది ధర్మబద్ధమే యోగ్యమే కాని అంతటివారికే అది ఆచరణీయము.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం వాసుదేవ్యాం తృతీయాష్టకే ద్వితీయోఽధ్యాయః ॥

ఓమ్ శమ్



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## తృతీయాష్టకము - తృతీయాధ్యాయము

**శ్లో॥ ఇన్ద్రతుల్యః పురా సోమవంశ్యః కృతయుగే నృపః ।**
**కృతవీర్యాభిధః సమ్రాట్ శతపుత్త్రాన్వితో௨భవత్ ॥ 1**

**ప్రతిపదార్థం :** పురా = పూర్వకాలమున, కృతయుగే = కృతయుగమున, ఇంద్రతుల్యః = ఇంద్రునితో సమానమైన, సోమవంశ్యః = చంద్రవంశపువాడైన, నృపః = క్షత్రియుడు, సమ్రాట్ = చక్రవర్తియై, కృతవీర్య+అభిధః = కృతవీర్యుడను పేరుగలవాడు, శతపుత్త్ర+అన్వితః = నూర్గురు కొడుకులతో గూడినవాడు, అభవత్ = ఉండెను.

**తాత్పర్యము :** పూర్వము కృతయుగమున కృతవీర్యుడు అను పేరుగల సార్వభౌముడు, చంద్రవంశపు క్షత్రియుడు, నూర్గురు కుమారులతో ఉండెను. ఆతడింద్రసమానవైభవశాలి.

**శ్లో॥ దైవాచ్చ్యవనశాపాత్తత్పుత్త్రా దగ్ధా నృపో యయౌ ।**
**గురుం శరణమస్మై స వ్రతం ప్రాహాఘహృత్సుఖమ్ ॥ 2**

**ప్ర :** తత్ పుత్త్రాః = వాని కుమారులు, దైవాత్ = విధివశమున, చ్యవనశాపాత్ = చ్యవనమహర్షి శాపకారణముగా, దగ్ధాః = భస్మమైరి. నృపః = రాజు, గురుమ్ = గురువును, శరణం యయౌ = శరణు పొందెను, అస్మై = వానికై, సః = ఆ గురువు, అఘహృత్ = పాపమును హరించు, సుఖమ్ = సుఖమిచ్చు, వ్రతం ప్రాహ = వ్రతమును చెప్పెను.

**తా :** కృతవీర్యుని కుమారులు విధివశమున చ్యవనమహర్షివలన శాపమంది, భస్మీభూతులయిరి. రాజు కృతవీర్యుడు గురువును శరణువేడగా, ఆ గురువు పాపనివారకము సుఖప్రదము అయిన వ్రతవిధానమును బోధించెను.

**శ్లో॥ కృతవీర్యానపత్యత్వం స్రావం గర్భస్య మూఢతా ।**
**పాతో మృతోద్భవో జాతనాశో వైక్లవ్యమస్య వా ॥ 3**

**ప్ర :** (హే) కృతవీర్య! = ఓ కృతవీర్యా!, అనపత్యత్వమ్ = సంతానములేమి, గర్భస్య స్రావమ్ = గర్భవిచ్ఛిత్తి, మృత+ఉద్భవః = బిడ్డ చనిపోయి జన్మించుట, పాతః = అకాలప్రసవము, జాతనాశః = పుట్టినవారి మరణము, వా = లేక, అస్య = వానియొక్క వైక్లవ్యమ్ = విహ్వలత.

**తా :** ఓ కృతవీర్యా! సంతానము లేకపోవుటకు కారణము లనేకములు : గర్భస్రావము, గర్భపాతము, బిడ్డ మరణించి జన్మించుట, పుట్టిన కొద్ది కాలమునకే మరణించుట, లేక వాని విహ్వలత.

**శ్లో॥ భూతగ్రహార్తిరోగాద్యైర్బాల్యే వాన్యత్ర చేచ్ఛిశోః ।**
**నాశశ్చాస్యాపి తత్రేయం శాన్తిదా సప్తమీనయుక్ ॥ 4**

**ప్ర :** భూతగ్రహ+ఆర్తి రోగ+ఆద్యైః = భూతములు, గ్రహములు, వీనిపీడ, గాయములు, రోగములు మొదలగు వానిచేత, బాల్యే = బాల్యమునందు, వా = లేక, అన్యత్ర = ఇతర వయసులో, శిశోః = శిశువునకు, నాశః చేత్ = నాశము కలిగినచో, అస్య అపి చ = దానికి గూడ, ఇయమ్ = ఇది, శాన్తిదా = శాంతిని చేకూర్చును, తత్ర = అట్టిచో, సప్తమీనయుక్ = ఆదివారము నాటి సప్తమీతిథియందు,

**శ్లో॥ గ్రహానుకూలే సత్కాలే వ్రతం సంకల్ప్య వాచయేత్ ।**
**స్వస్త్యాచార్యఇ్చ వృణుయాచ్ఛుద్ధభూమౌ వృతః స చ ॥ 5**

**ప్ర :** గ్రహానుకూలే = గ్రహములనుకూల స్థితిలో నుండగా, సత్కాలే = సుముహూర్తమున, సంకల్ప్య = భావించి, వ్రతమ్ = వ్రతమును, వాచయేత్ = ప్రకటింపవలెను, స్వస్త్యాచార్యం చ = శ్రేయఃకామియైన పురోహితుని గూడ, వృణుయాత్ = ఎన్నుకొనవలెను, స చ వృతః = ఆ ఎన్నుకొనబడిన పురోహితుడును, శుద్ధభౌమౌ = శుద్ధిచేయబడిన భూమియందు,

**శ్లో॥ ప్రతిష్ఠాప్యాగ్నిమీశాన్యాం విధివత్కలశోపరి ।**
**సూర్యరుద్రసప్తమాతృప్రతిమాః స్వర్ణనిర్మితాః ॥ 6**

**ప్ర :** అగ్నిమీశాన్యామ్ = అగ్నికి ఈశాన్యదిక్కున, విధివత్ = శాస్త్రోక్తముగా, కలశ+ఉపరి = కలశముపై, సూర్యరుద్రసప్తమాతృప్రతిమాః = సూర్యుడు, రుద్రుడు, బ్రాహ్మీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, మాహేంద్రీ, వారాహీ, చాముండా అనబడు సప్తమాతృకల మూర్తులను, స్వర్ణనిర్మితాః = బంగారముతో చేయబడిన వానిని, ప్రతిష్ఠాప్య = ప్రతిష్ఠించి,

**శ్లో॥ సంస్థాప్యాభ్యర్చ్య సప్తకుమ్భాన్యథావిధి ।**
**పూర్వపశ్చిమకోణాన్తదేశస్థాఞ్జలపూరితాన్ ॥ 7**

**ప్ర :** పూర్వపశ్చిమకోణాన్తదేశస్థాన్ = తూర్పున పడమరన నాలుగు కోణముల ప్రదేశములందును, యథావిధి = శాస్త్రోక్తముగ, జలపూరితాన్ సప్తకుంభాన్ = నీరు నిండిన కలశములను యేడింటిని, సంస్థాప్య = స్థాపించి, అభ్యర్చ్య = పూజించి,

**శ్లో॥ సౌరౌషధ్యృషిమన్త్రైః సమ్యృద్రత్నౌషధిపల్లవాన్ ।**
**స్తుత్వాఽన్వాధాయాధిశ్రిత్య పాయసం జుహుయాత్క్రమాత్ ॥ 8**

ప్ర : సౌర+ఓషధీ+ఋషి మన్త్రైః = సూర్యమంత్రములచే, ఓషధీమంత్రములచే, ఋషిమంత్రములచే, స్తుత్వా = స్తోత్రముజేసి, సమ్యృద్రత్నౌషధిపల్లవాన్ = రత్నములను, ఓషధిపల్లవములను, అన్వాధాయాధిశ్రిత్య = దానిననుసరించి అగ్ని నుంచి, పూజించి, క్రమాత్ = వరుసగా, పాయసమ్ = పాయసమును, జుహుయాత్ = హోమము చేయవలెను.

**శ్లో॥ ప్రత్యేకం పాయససమిద్యవకృష్ణతిలైర్గురుః ।**
**సూర్యరుద్రమనుభ్యాం చ శతమష్టోత్తరం విధేః ॥ 9**

ప్ర : ప్రత్యేకమ్ = ప్రత్యేకముగా, పాయస-సమిత్-యవ-కృష్ణతిలైః = పాయసము, సమిధలు, యవధాన్యము, నల్లనువ్వులు, వీనిచేత, గురుః చ = గురువున్ను, సూర్యరుద్రమనుభ్యామ్ = సూర్యరుద్ర మంత్రములతో, శతమష్టోత్తరమ్ = అష్టోత్తర శత నామముల, విధేః = పూజించదగును.

**శ్లో॥ కుర్యాత్ స్విష్టకృదాద్యఙ్గం బలిం పూర్ణాహుతిం తతః ।**
**జీవత్పతిప్రజా వృద్ధా బ్రాహ్మణ్యః స్వర్చితాః స్థితాః ॥ 10**

ప్ర : స్విష్టకృత్+ఆది+అఙ్గమ్ = స్విష్టకృత్ హోమమును సర్వాంగములతో, బలిమ్ = నైవేద్యమును, పూర్ణాహుతిమ్ = పూర్ణాహుతిని, కుర్యాత్ = చేయదగును, తతః = అందువలన, జీవత్‌పతిప్రజాః వృద్ధాః బ్రాహ్మణ్యాః = భర్తయును సంతానమును జీవించియున్న వృద్ధురాండ్రైన బ్రాహ్మణస్త్రీలు, స్వర్చితాః = చక్కగా అర్చింపబడినవారుగా, స్థితాః = ఉందురు.

**తా (శ్లో.4-10) :** బాల్యమునందు కలుగు సర్వవిధముల అరిష్టములు, తర్వాతి వయసులో కలుగు బాధలు, వీనిని నివారించుటకు వ్రత మొకటున్నది. ఆ వ్రతమును సప్తమీతిథి ఆదివారము కలిసియున్న రోజున, గ్రహానుకూల్యముగల సుముహూర్తమున సంకల్పించి, ప్రకటింపజేసి, ఆప్తుడైన పురోహితునిచే చేయింపదగును. ఆతడు శుద్ధిచేయబడిన భూమిపై అగ్నికి ఈశాన్యమున కలశమును స్థాపించి సూర్యరుద్రసప్తమాతృప్రతిమలను బంగారముతో చేయబడిన వానిని ప్రతిష్ఠించి, తూర్పు పడమరల కోణ ప్రదేశములందు, నీరు నిండిన యేడు కుండలను స్థాపించి, రత్న ఓషధీ పల్లవములతో పూజించి, సూర్య ఓషధీ ఋషి మంత్రములచే స్తుతించి, అగ్నిని పూజించి దానిలో పాయసమును హోమము చేయవలెను. ప్రత్యేకించి పాయసము సమిధలు, యవలు, నల్లనువ్వులతో సూర్యరుద్రమంత్రములతో అష్టోత్తర శతనామ పూజచేసి నైవేద్యమును, పూర్ణాహుతిని చేయవలెను. భర్తలు జీవించియున్న సంతానవతులైన వృద్ధబ్రాహ్మణస్త్రీలను పూజించవలె.

**శ్లో॥ ఉదఙ్ముఖ్యోఽభిషిఞ్చేయుర్ఘటాద్భిస్తత్స్థపల్లవైః ।**
**దీర్ఘాయురస్తు బాలోఽయం జీవత్పుత్రా చ భామినీ ॥ 11**

ప్ర : ఉదఙ్ముఖ్యః = ఉత్తరదిక్కుగా ముఖముగలవాడై, ఘటాద్భిః తత్‌స్థపల్లవైః = ఘటములందున్న

జలములను, అందున్న ఆకులతోగూడ, అభిషిఞ్చేయుః = అభిషేకము చేయుదురు, బాలః అయం = ఈ బాలుడు, దీర్ఘాయుః అస్తు = దీర్ఘాయువగుగాక!, భామినీ = వాని తల్లి, జీవత్ పుత్రా చ = జీవించియున్న కుమారుడు గలది, (అస్తు = అగుగాక!)

**తా :** ఉత్తరదిక్కుగా తిరిగి ఘటములను పల్లవములతోగూడ తీసికొని అభిషేకము చేయదగును. ఈ బాలుడు దీర్ఘాయువు గలవాడగు గాక! వాని తల్లియును తన కుమారుడు జీవించియుండుటను చూచి మురిసినది యగుగాక!

**శ్లో॥ ఆదిత్యచన్ద్రయుక్తం యద్గ్రహనక్షత్రమణ్డలమ్ ।**
**శక్రః సలోకపాలశ్చ బ్రహ్మావిష్ణుమహేశ్వరాః ॥ 12**

**శ్లో॥ ఏతే చాన్యే చ యే దేవాః సదా పాన్తు కుమారకమ్ ।**
**మా శనిర్మా చ హుతభుఙ్మా చ బాలగ్రహాః క్వచిత్ ॥ 13**

**శ్లో॥ పీడాం కుర్వన్తు బాలస్య మా మాతుర్జనకస్య చ ।**
**ఏవం జాతేఽభిషేకేఽథ ధృత్వా శుక్లామ్బరాదికమ్ ॥ 14**

**శ్లో॥ అభిషేకాప్లుతం వస్త్రం దత్వాఽచార్యాయ దేవతాః ।**
**సంపూజ్య స్వర్ణగోవస్త్రైః సంపూజ్యాచార్యమృత్విజః ॥ 15**

**శ్లో॥ గురవే తిలపాత్రస్థాం కాలమూర్తిం చ కాఞ్చనీమ్ ।**
**దత్వా సదక్షిణాం విప్రాః సస్త్రీకాః పాయసాదినా ॥ 16**

**శ్లో॥ భోజ్యాస్తైరాశిషో దేయాః సంతుష్టైర్దక్షిణాదినా ।**
**దీర్ఘాయురస్తు బాలోఽయం యావద్వర్షశతం సుఖమ్ ॥ 17**

**శ్లో॥ యత్కిఞ్చిదస్య దురితం తత్ క్షిప్తం బడబాముఖే ।**
**బ్రహ్మా విష్ణుర్హరిః స్కన్దో వాయుః శక్రో హుతాశనః ॥ 18**

**శ్లో॥ రక్షన్తు సర్వదుష్టేభ్యో వరదాః సన్తు సర్వదా ।**
**ఇతి లబ్ధ్వాఽఽశిషో నత్వా తాన్కర్తా సకుటుమ్బకః ॥ 19**

**శ్లో॥ కర్మేశ్వరార్పణం కృత్వా హుతశేషం చ భక్షయేత్ ।**
**ఏవం కృతే వ్రతే నశ్యేత్సప్తమ్యాం దుష్టమప్యరమ్ ॥ 20**

ప్ర : ఆదిత్యచన్ద్రయుక్తమ్ = సూర్యచంద్రులతోకూడియున్న, గ్రహనక్షత్రమణ్డలం యత్ = గ్రహనక్షత్రముల సమూహమేదియో, (అది), శక్రః సలోకపాలః చ = లోకపాలకులైనవారితో గూడి ఇంద్రుడను, బ్రహ్మావిష్ణుమహేశ్వరాః = బ్రహ్మ విష్ణు మహేశ్వరుడు, ఏతే చ = వీరున్నూ, అన్యే చ యే దేవాః= ఇతరులైన దేవతలెవరు కలరో, (వారున్నూ), కుమారకమ్ = చిన్ని బాలుని, సదా పాన్తు = ఎల్లవేళల రక్షింతురు గాక!, మా శనిః = శని గాని, మా చ హుతభుక్ = అగ్ని

గాని, మా చ బాలగ్రహాః= బాలగ్రహములు గాని, క్వచిత్ పీడామ్ = యెట్టి బాధనుగాని, బాలస్య = బాలునకు, మాతుః = తల్లికి, జనకస్య చ = తండ్రికిన్నీ, మా కుర్వన్తు = కలిగించకుందురు గాక!, ఏవం జాతే = ఈ విధముగా సాగిన, అభిషేకే = అభిషేకమున, ధృత్వా శుక్లాంబరాదికమ్ = తెల్లని వస్త్రము మొదలైన వానిని ధరించి, అథ = పిమ్మట, అభిషేక+ఆప్లుతం వస్త్రమ్ = అభిషేకముతో పూర్తిగా తడిసిన వస్త్రమును, ఆచార్యాయ = ఆచార్యునకై, దత్త్వా = ఇచ్చి, దేవతాః సంపూజ్య = దేవతలను పూజించి, ఋత్విజః = ఋత్విక్కు, ఆచార్యమ్ = ఆచార్యుని, స్వర్ణగోవస్త్రైః = బంగారము, గోవు, వస్త్రములతో, సంపూజ్య = చక్కగా పూజించి, గురవే = గురువునకై, తిలపాత్రస్థామ్ = నువ్వులుంచిన పాత్రలోగల, కాఞ్చనీం కాలమూర్తిం చ = బంగారముతో చేయబడిన కాలమూర్తిని, సదక్షిణామ్ = దక్షిణతో కలిపి, దత్త్వా = ఇచ్చి, విప్రాః సస్త్రీకాః = భార్యలతో గూడియున్న బ్రాహ్మణులను, పాయస+ఆదినా = పాయసము మొదలగు పదార్థములతో, భోజ్యాః = భుజింపజేయదగియున్నారు, దక్షిణాదినా సంతుష్టైః = దక్షిణాదులతో సంతోషపెట్టబడిన, తైః = వారిచే, ఆశిషః = ఆశీస్సులు, దేయాః = ఇవ్వదగియున్నవి, అయం బాలః = ఈ బాలుడు, యావత్ వర్షశతమ్ = నూరు సంవత్సరముల పర్యంతము, సుఖమ్ = సుఖముగా, దీర్ఘాయుః అస్తు = దీర్ఘకాలము జీవించు గాక!, అస్య దురితమ్ = వానియొక్క పాపము, యత్ కిఞ్చిత్ = యే కొంచెమో, తత్ = అది, బడబాముఖే = బడబానలమున, క్షిప్తమ్ = దాచియుంచబడినది (అగుగాక!), బ్రహ్మవిష్ణుః హరిః స్కన్దః వాయుః శక్రః హుతాశనః = బ్రహ్మ, విష్ణువు, హరి, కుమారస్వామి, వాయువు, ఇంద్రుడు, అగ్ని, వీరందఱును, సర్వదా = ఎల్లప్పుడు, వరదాః సన్తు = వరప్రదులగుదురు గాక!, సర్వదుష్టేభ్యః = సమస్తమైన చెడుగుల నుండి, రక్షన్తు = రక్షింతురు గాక!, ఇతి = అని, ఆశిషః లబ్ధ్వా = ఆశీస్సుల నంది, సకుటుంబకః కర్తా = కుటుంబముతో గూడిన కర్త (యజమాని), తాన్ = వారిని, నత్వా = నమస్కరించి, కర్మ = కర్మఫలమును, ఈశ్వరార్పణం కృత్వా = ఈశ్వరునకర్పించి, హుతశేషం చ = హవన శేషమును మాత్రము, భక్షయేత్ = తినవలెను, సప్తమ్యామ్ = సప్తమి తిథినాడు, ఏవం కృతే వ్రతే = ఈ రీతి వ్రతము చేయగా, దుష్టం అపి అరమ్ = చెడు కాలమైనను, నశ్యేత్ = నశించును.

**తా :** సూర్యచంద్రగ్రహనక్షత్రమండలమంతయును, ఇంద్రుడు, దేవతలు, త్రిమూర్తులున్ను, సమస్త దేవతా గణములున్ను, ఈ బాలుని సదా రక్షింతురుగాక!, శనిపీడ, అగ్నిపీడ, బాలగ్రహపీడ, ఇట్టి పీడలెవ్వియు ఈ బాలుని బాధించకుండునుగాక! ఇట్లే ఈ బాలుని తల్లితండ్రులకును సమస్తపీడా పరిహారమగుగాక!

ఇట్లు అభిషేకము సాగగా, ఆ సమయమున ధరించిన తెల్లనివస్త్రమును, అభిషేకముతో తడిసి ముద్దయైన దానిని ఆచార్యునకిచ్చి, దేవతలను పూజించి, ఋత్విజుడు ఆచార్యుని బంగారము, గోవు, వస్త్రములతో పూజించి, గురువునకు తిలపాత్రను బంగారు కాలమూర్తితో దక్షిణతో యిచ్చి, భార్యలతో కూడియున్న బ్రాహ్మణులకు పాయసాది పదార్థములతో తృప్తిగా భోజనము పెట్టి, దక్షిణలను బహుమతులను యిచ్చి సంతోషపరచి, వారి ఆశీస్సులు పొందవలెను.

ఈ బాలుడు శతాయువుగా సుఖముగా జీవించుగాక! వాని పాపము, అదెంత కొంచెమైనను, బడబానలమును చేరుగాక!, త్రిమూర్తులు, కుమారస్వామి, అగ్ని, ఇంద్రుడు, వాయువు, సదా వరప్రదులగుదురుగాక! సమస్త దుష్ప్రభావములనుండి రక్షింతురు గాక!

అని వారిచే ఆశీస్సుల నందుకొని, వారికి నమస్కరించి, **కర్మఫలమును ఈశ్వరార్పణ చేసి**, కర్త సకుటుంబముగా హోమము చేయగా మిగిలిన పదార్థమును భుజించవలెను.

ఈ రీతిగా వ్రతము చేయగా దుష్టశక్తుల ప్రభావము నశించును. *

**శ్లో॥ విధినా కుర్విదం రాజన్! సమ్రాట్ పుత్రో భవిష్యతి ।**
**ఇత్యుక్త్వాఽగాద్గురూ రాజా వ్యకృణోద్విధివద్వ్రతమ్ ॥ 21**

**ప్ర :** రాజన్ = ఓ రాజా!, ఇదమ్ = ఈ వ్రతమును, విధినా = శాస్త్రోక్తముగ, కురు = చేయుము, పుత్రః = నీ కుమారుడు, సమ్రాట్ = చక్రవర్తి, భవిష్యతి = అగును, ఇతి ఉక్త్వా = ఇట్లని పలికి, గురూ = గురువు, అగాత్ = వెడలెను, రాజా = రాజు, విధివత్ = శాస్త్రోక్తముగా, వ్రతమ్ = వ్రతమును, వ్యకృణోత్ = చేసెను.

**తా :** "ఓ రాజా! ఈ విధమైన వ్రతమును శాస్త్రవిధిగా చేయుము. దీని వలన నీ కుమారుడు చక్రవర్తియగును." అని పలికి గురువు వెడలిపోయెను. రాజు విధిగా వ్రతము చేసెను. *

**శ్లో॥ అథైకదాపి మహిషీ నామ్నా శీలధరాస్య చ ।**
**మైత్రేయీం గుణవత్పుత్రలబ్ధయేఽపృచ్ఛదానతా ॥ 22**

**ప్ర :** అథ = అటుపై, ఏకదా = ఒకప్పుడు, అస్య = వానియొక్క, మహిషీ = పట్టపుదేవి, నామ్నా చ శీలధరా = శీలధరా యను పేరుగలది, మైత్రేయీమ్ = మైత్రేయిని, ఆనతా = వినమ్రముగా, గుణవత్ పుత్రలబ్ధయే = గుణవంతుడైన కుమారుని పొందుటకు, అపృచ్ఛత్ = అడిగెను.

**తా :** అటుపై ఒకానొక సమయమున ఆ కార్తవీర్యుని పట్టపుదేవి శీలధరాయను నామె మైత్రేయితో వినయముగా, గుణవంతుడైన కుమారుని పొందుట కేమి ఉపాయమని అడిగెను.

**శ్లో॥ మైత్రేయ్యువాచ శ్రీదత్తవ్రతం కుర్విష్టదం త్విదమ్ ।**
**ఆబ్దం మార్గాదిపూర్ణాయాం ప్రతిమాసమనన్తకమ్ ॥ 23**

**ప్ర :** మైత్రేయీ ఉవాచ = మైత్రేయి యిట్లనెను, అనన్తకమ్ = అనంతముగా, ఇష్టదమ్ = ఇష్టమైన వానినిచ్చు, శ్రీదత్తవ్రతమ్ = శ్రీదత్తవ్రతమును, ఇదం తు = ఈ వ్రతమేమో, ఆబ్దమ్ = సంవత్సరకాలము, మార్గాది = మార్గశిరము మొదలుగా గల, ప్రతిమాసమ్ = ప్రతిమాసము నందును, పూర్ణాయామ్ = పూర్ణిమతిథినాడు, కురు = చేయుము.

**తా :** మైత్రేయి యిట్లనెను : అనంతముగా అభీష్టప్రదమైన శ్రీదత్తవ్రతమును మార్గశీర్షాది మాసములందన్నిట ప్రతిమాసమున పూర్ణిమాతిథినాడు ఒక సంవత్సరకాలము చేయుము.

**శ్లో॥ సఙ్కల్ప్య తద్వాచయిత్వా సమభ్యర్చ్య పితౄన్పురా ।**
**స్నానం కృత్వా పూర్ణిమాయాం గవ్యం ప్రాశ్యర్చ్యయాక్షరమ్ ॥24**

**శ్లో॥ అనన్తః సర్వకామానామనన్తం భగవాన్ ఫలమ్ ।**
**దదాత్వనన్తః పుత్త్రం చ భద్రం చాన్యచ్చ జన్మని ॥ 25**

**ప్ర :** సంకల్ప్య = వ్రతమును సంకల్పించి, పురా = ముందుగా, పితౄన్ = తల్లితండ్రులను, పితృదేవతలను, సమభ్యర్చ్య = చక్కగా పూజించి, తత్ = ఆ వ్రతసంకల్పమును, వాచయిత్వా = ప్రకటింపజేసి, స్నానం కృత్వా = స్నానము చేసి, పూర్ణిమాయామ్ = పూర్ణిమనాడు, గవ్యమ్ = ఆవుపాలు, పెరుగు, వెన్న, నెయ్యి, మూత్రము అనబడు పంచగవ్యములు, ప్రాశి+అర్చ్యయ = అన్నముతో అర్చించి, అక్షరమ్ = నాశములేని, అనన్తమ్ = అంతములేని, సర్వకామానాం ఫలమ్ = అన్ని కోరికల ఫలమును, భగవాన్ అనన్తః = అనంతుడైన భగవానుడు, దదాతు = ఇచ్చుగాక!, పుత్త్రం చ = పుత్రుని యున్ను, అన్యచ్చ జన్మని భద్రం చ = మరియొక జన్మలో క్షేమమును, అనన్తః = అనంతుడు, (దదాతు).

**తా :** వ్రతమును సంకల్పించి, ముందుగా పితృదేవతారాధన చేసి, వ్రతసంకల్పమును ప్రకటించి, పూర్ణిమనాడు స్నానము చేసి, అన్నము పంచగవ్యములతో అనంతు నర్చించి, అనంతకామనలను అనంతుడగు భగవానుడు సఫలము చేయుగాక యని, పుత్త్రునిచ్చుగాక యని జన్మజన్మలకు భద్రతను కలిగించుగాక! యని,

**శ్లో॥ అనన్తపుణ్యోపచయమనన్తః పూజయార్పితః ।**
**మహావ్రతప్రభావేన సన్తుష్టః సకలేశ్వరః ॥ 26**

**ప్ర :** అనన్తపుణ్య+ఉపచయమ్ = అనంతమైన పుణ్యరాశిని, పూజయా = పూజతో, అర్పితః అనన్తః = అర్పింపబడిన అనంతుడు, సకలేశ్వరః = సర్వమునకు అధిపతియైనవాడు, మహావ్రతప్రభావేన = మహావ్రతపుశక్తిచే, సంతుష్టః = సంతోషించినవాడై,

**తా :** పుణ్యరాశిని పూజతో అనంతునకర్పించి, సకలేశ్వరుడు తన వ్రత ప్రభావమున సంతోషించి, తన కామ్యముల సఫలము జేసి, పుత్త్రుని ప్రసాదించి జన్మజన్మలకు భద్రత గలిగించుగాక! (శ్లో. 25తో అన్వయము).

**శ్లో॥ ఇత్యుచ్చార్యాభ్యర్చ్య నామ్నా తద్దినే నిశి హవ్యభుక్ ।**
**వామం పాదం కటిం వస్త్రం స్కన్ధౌ దక్షం కటిం పదమ్ ॥ 27**

**శ్లో॥ కణ్ఠం జానూరూ చ గుహ్యం హృత్కం మార్గాదిమాసతః ।**
**అనన్త ఇతి కం సర్వాత్మేత్యూరూ చోరుబాహవః ॥ 28**

శ్లో॥ సంకర్షణేతి దివ్యాస్త్రధారీతి చ గలః కటిః ।
శ్రీకణ్ఠేతి చ కామేతి జాను శేషేతి చాననమ్ ॥ 29

శ్లో॥ పూజ్యం విశ్వముఖేత్యూరూ తథా సంకర్షణేతి చ ।
వాసుదేవేతి ముసలం రౌప్యం హైమం హలం సదా ॥ 30

శ్లో॥ పూజ్యం పార్శ్వే వ్రతం త్వేవం కుర్వబ్దం త్వం హవిష్యభుక్ ।
గోమూత్రం ప్రాక్ చతుర్మాసం ప్రాశ్యం దేయా యవాస్తతః ॥ 31

**ప్ర :** మార్గ+ఆది మాసతః = మార్గశిరము మొదలుగా ప్రతి మాసమున, నామ్నా = ఆ యా మాసముల పేర్లతో, తత్ దినే = ఆ యా పూర్ణిమలలో, నిశి = రాత్రులందు, హవ్యభుక్ = హవిశ్శేషమును మాత్రము భుజించి, వామం పాదమ్ = (మార్గశిరమున) ఎడమ పాదమును, కటిమ్ = (పుష్యమున) ఎడమ కటి ప్రదేశమును, వస్త్రమ్ = (మాఘమున) వస్త్రమును, స్కన్ధౌ = (ఫాల్గుణమున) భుజములను, దక్షం కటిమ్ = (చైత్రమున) కుడి కటి ప్రదేశమును, పదమ్ = (వైశాఖమున) కుడి పాదమును, కణ్ఠమ్ = (జ్యేష్ఠమున) కంఠమును, జాను = (ఆషాఢమున) మోకాళ్లను, ఊరూ = (శ్రావణమున) తొడలను, చ = మరియు, గుహ్యమ్ = (భాద్రపదమున) మర్మాంగమును, హృత్ = (ఆశ్వయుజమున) హృదయమును, కమ్ = (కార్తీకమున) తలను, ఇతి = ఇట్లు, ఉచ్చార్య+అభ్యర్చ్య = పలుకుచూ అర్చించి, (శ్లో. 27 1/2). అనన్త ఇతి = అనన్తయని, కం = శిరస్సును, సర్వాత్మా ఇతి ఊరూ = సర్వాత్మనామమున తొడలను, సంకర్షణ ఇతి ఊరు = సంకర్షణ నామమున ఊరువులను, దివ్యాస్త్రధారీ ఇతి బాహవః = దివ్యాస్త్రధారి నామమున బాహువులను, శ్రీకణ్ఠ ఇతి గలః చ = శ్రీకంఠనామమున గళమునున్ను, కామః ఇతి కటిః = కామ నామమున కటిని, శేషః ఇతి జాను = శేష నామమున మోకాళ్ళను, విశ్వముఖ+ఇతి ఆననమ్ = విశ్వముఖనామమున ముఖమును, పార్శ్వే = రెండు ప్రక్కలను, తథా = అట్లే, పూజ్యమ్ = పూజింపదగును, సంకర్షణః ఇతి = సంకర్షణనామమున, ముసలమ్ = ముసలమును, వాసుదేవః ఇతి హలమ్ = వాసుదేవనామమున నాగలిని, చ సదా = ఎల్లప్పుడున్ను, పూజ్యమ్ = పూజింపదగును, వ్రతం తు ఏవమ్ = వ్రతమును ఇట్లు, అబ్దం కురు = సంవత్సరము చేయుము, త్వమ్ = నీవు, హవ్యభుక్ = హవిస్సు శేషమును భుజించువాడవై, ప్రాక్ చతుర్మాసమ్ = ముందుగా నాలుగు నెలలు, గోమూత్రమ్ ప్రాశ్యం తతః యవాః = గోమూత్రమును సేవించదగినది, యవలును, దేయాః = ఇవ్వదగినవి.

**తా :** మార్గశిరము మొదలు ప్రతిమాసమునను, ఆ యా మాసనామములతో ఆ యా పూర్ణిమా దినములలో, రాత్రులందు హవిశ్శేషమును మాత్రము భుజించుచు, ఇట్లు పూజింపదగును : మార్గశిరమున వామపాదమును, పుష్యమున వామకటిని, మాఘమున వస్త్రమును, ఫాల్గునమున భుజములను, చైత్రమున దక్షిణ కటి ప్రదేశమును, వైశాఖమున దక్షిణపాదమును, జ్యేష్ఠమున కంఠమును, ఆషాఢమున జానువులను, శ్రావణమున ఊరువులను, భాద్రపదమున గుహ్యమును,

ఆశ్వయుజమున హృదయమును, కార్తికమున శిరస్సును, ఇట్లు పేరుపేరున అర్చించవలెను. అట్లే, అనన్త నామమున శిరస్సును, సర్వాత్మనామమున పాదములను, సంకర్షణ నామమున ఊరువులను, దివ్యాస్త్రధారి నామమున బాహువులను, శ్రీకంఠ నామమున కంఠమును, కామనామమున కటిని, శేషనామమున జానువులను, విశ్వముఖ నామమున ముఖమును, రెండు పార్శ్వములను, అట్లే సంకర్షణ నామమున ముసలమును, వాసుదేవ నామమున హలమును, అన్ని మాసములందు పూజింపదగును. ఈ విధముగా నీవు వ్రతము నొక సంవత్సర కాలము హవిస్సు భుజించుచు చేయుము. ముందుగా నాలుగు నెలలు గోమూత్రమును సేవింపదగును, యవలను ఇవ్వదగును.

**శ్లో॥ ప్రాశ్యం దేయం ఘృతం గవ్యం వ్రతసంపూర్తయే తతః ।**
**ఉదకుంభాన్ ద్వాదశాత్ర దద్యాద్గాం భోజయేద్ద్విజాన్ ॥ 32**

**శ్లో॥ ఏవం కృతే వ్రతే తుష్యేదనన్తః సర్వకామదః ।**
**కురుష్వైతద్వ్రతం శీలధరే! పాపప్రణాశనమ్ ॥ 33**

**శ్లో॥ లోకోత్తరగుణః సమ్రాట్ చిరజీవీ సుతో భవేత్ ।**
**ఇత్యుక్త్వా సత్కృతా సాఽగాన్మైత్రేయీ బ్రహ్మవాదినీ ॥ 34**

**ప్ర :** తతః = అంతట, వ్రతసంపూర్తయే = వ్రతసమాప్తికై, ప్రాశ్యమ్ = గోవుమూత్రమును, గవ్యం ఘృతమ్ = ఆవు నేయియు, దేయమ్ = ఇవ్వదగును, ద్వాదశ = పండ్రెండు, ఉదకుంభాన్ = ఉదకపూర్ణకుంభములను, గామ్ = గోవును, దద్యాత్ = ఇవ్వదగును, ద్విజాన్ = బ్రాహ్మణులను, భోజయేత్ = భుజింపజేయవలెను, ఏవం కృతే వ్రతే = ఇట్లు వ్రతము చేయగా, సర్వకామదః అనన్తః= అన్నికోర్కెల దీర్చు అనంతుడు, తుష్యేత్ = సంతుష్టుడగును, శీలధరే = ఓ శీలధరా!, పాపప్రణాశనమ్ = పాపమును పోకార్చు, ఏతత్ వ్రతం కురుష్వ = ఈ వ్రతమును చేయుము, లోకోత్తరగుణః చిరజీవీ సమ్రాట్ సుతః భవేత్ = లోకప్రసిద్ధుడై, చిరంజీవియై, చక్రవర్తియగు కుమారుడు కలుగును, ఇతి ఉక్త్వా = అని పలికి, బ్రహ్మవాదినీ సా మైత్రేయీ = బ్రహ్మజ్ఞానియగు ఆ మైత్రేయి, సత్కృతా అగాత్ = సత్కరింపబడి వెడలెను.

**తా :** అంతట వ్రతసమాప్తికై గోమూత్రమును గోఘృతమును సేవించి, పండ్రెండు జలపూర్ణ-కుంభములను, గోవును బ్రాహ్మణులకు భోజనమిడి ఇవ్వవలెను. ఈ వ్రతమువలన అనంతుడు కామ్యప్రదుడుగా సంతుష్టుడగును. కావున ఓ శీలధరా! పాపనాశకమగు ఈ వ్రతమును చేయుము. నీకు చిరజీవి సుగుణశీలి, చక్రవర్తియగు కుమారుడు కలుగును. అని యిట్లు పలికి, బ్రహ్మవాదిని మైత్రేయి సత్కారమంది వెడలెను. *

**శ్లో॥ యోగీశపత్నీ రాజ్ఞీ తు వ్రతం చక్రే యథోక్తవత్ ।**
**సంతుష్టస్తేన భగవాన్ దత్తాత్రేయో దిగమ్బరః ॥ 35**

ప్ర : యోగీశపత్నీ రాజ్ఞీ తు = యోగులకు ప్రభువైన కృతవీర్యుని భార్య యగు మహారాణియేమో, యథా ఉక్తవత్ = శాస్త్రమునందున్న విధముగా, వ్రతం చక్రే = వ్రతము చేసితివి, తేన = దానిచే, సంతుష్టః భగవాన్ దత్తాత్రేయః దిగంబరః = సంతోషించినవాడగు దిగంబరుడైన దత్తాత్రేయ భగవానుడు,

**శ్లో॥ అవధూతం నిజం రూపం సహస్రార్కప్రభోజ్జ్వలమ్ ।**
**మందస్మితముఖేనోచే రాజ్ఞి సాధు వ్రతం కృతమ్ ॥ 36**

ప్ర : నిజమ్ = తనదైన, సహస్ర+అర్క+ప్రభ+ఉత్+జ్వలమ్ = వేయి సూర్యుల కాంతిని మించి వెలుగుచున్న, అవధూతం రూపం = అవధూత రూపమును (ప్రదర్శించి), మందస్మితముఖేన = చిఱునవ్వు ముఖముతో, ఊచే = పలికెను, రాజ్ఞి = ఓ మహారాణీ!, సాధు = చక్కగా, వ్రతం కృతమ్ = వ్రతము చేయబడినది,

**శ్లో॥ అత్యుత్కటవ్రతవృషఫలం త్వత్రైవ జన్మని ।**
**పుత్రస్తే భవతా యోగీ సప్తద్వీపపతిర్విభుః ॥ 37**

ప్ర : అతి+ఉత్కట వ్రత వృషఫలం తు = అత్యంత కష్టసాధ్యమైన వ్రతధర్మనిర్వహణ ఫలమునేమో, అత్ర+ఏవ జన్మని = ఈ జన్మము నందే, (పొందితివి), తే = నీకు, భవితా పుత్రః = కలుగబోవు కుమారుడు, యోగీ = యోగియైన, సప్తద్వీపపతిః విభుః = సప్తద్వీపవసుంధరాపతియగు ప్రభువు, చక్రవర్తి,

**శ్లో॥ అవ్యాహతాజ్ఞో మత్కల్పః స్మృతిగామీ న సంశయః ।**
**ఇతి స్వప్నం సతీ దృష్ట్వా బుద్ధ్వా హృష్టతమావదత్ ॥ 38**

ప్ర : అవ్యాహత+ఆజ్ఞః = తిరుగులేని శాసనము గలవాడు, మత్‌కల్పః = నా యంతటివాడు, స్మృతిగామీ = ప్రసిద్ధుడు, న సంశయః = సంశయములేదు, ఇతి = అని, సతీ = ఆ సాధ్వి, స్వప్నం దృష్ట్వా = స్వప్నము గాంచి, బుద్ధ్వా = మేల్కొని, హృష్టతమా = అమితానందము నందినదై, అవదత్ = పలికెను.

**తా (శ్లో.35-38) :** యోగీశ్వరుడైన కృతవీర్యుని పత్నియగు రాణి, శాస్త్రోక్తముగ యీ వ్రతము చేయగా, సంతుష్టుడైన శ్రీదత్తభగవానుడు తన అవధూత రూపమును ప్రదర్శించి, చిఱునవ్వుతో ఇట్లనెను : "ఓ రాణీ! నీ వీ వ్రతము చక్కగా చేసితివి. దీని ఫలమును ఈ జన్మలోనే పొందగలవు. నీకు కలుగబోవు కుమారుడు యెగియగును, చక్రవర్తి యగును, తిరుగులేని శాసనము గలవాడై, నా యంతటి ప్రసిద్ధుడగుట నిశ్చయము" అని యీ విధమైన స్వప్నమును గాంచి మేల్కొని ఆ సాధ్వి అమితానందముతో ఇట్లనెను. *

**శ్లో॥ కృతవీర్యాయ పత్యై సా శ్రుత్వా సోఽపి తుతోష హ ।**
**కృతవీర్యోఽథ సంతుష్టః కాలే కాలేఽకరోత్క్రియాః ॥ 39**

ప్ర : సా = ఆమె, పత్న్యై కృతవీర్యాయ = భర్తయైన కృతవీర్యునకు (తెలిపెను); సః అపి = ఆతడున్నూ, శ్రుత్వా = విని, తుతోష హ = ఆనందించినాడు, అథ = అంతట, సంతుష్టః = సంతోషించినవాడై, కృతవీర్యః = కార్తవీర్యుడు, కాలే కాలే = ఆ యా కాలములందు, క్రియాః = పుంసవనాది సంస్కారములు, అకరోత్ = చేసెను.

**తా :** ఆమె భర్తకు తెలుపగా ఆతడున్నూ విని సంతోషించెను. అంత కృతవీర్యుడు సంతుష్టుడై ఆ యా కాలములలో పుంసవనాది విహితసంస్కారములు జరిపించెను. *

**శ్లో॥ ధృత్యా చ హృత్సమున్నత్యా క్రమాత్పుంసవనాదికాః ।**
**తతోఽసూత శుభే కాలే స్వోచ్చస్థైః పఞ్చభిర్గ్రహైః ॥ 40**

ప్ర : ధృత్యా చ హృత్ సమున్నత్యా = ధృతిచేతను హృదయోత్సాహముచేతను, క్రమాత్ = క్రమముగా, పుంసవనాదికాః = పుంసవనము మొదలుగాగల, (క్రియాః అకరోత్ కాలే కాలే, యని శ్లో. 39 ఉత్తరార్థంతో అన్వయము). తతః = అంతట, పంచభిః గ్రహైః = ఐదు గ్రహములు, స్వ+ఉచ్చస్థైః = తమ తమ ఉచ్చ స్థానములలో నుండగా, శుభే కాలే = శుభముహూర్తమున, (సా = ఆమె), అసూత = ప్రసవించెను.

**తా :** అంతట ఆమె ప్రసవించినది. ఆ శుభముహూర్తమున అయిదు గ్రహములు తమతమ ఉచ్చరాశులలో నున్నవి. *

**శ్లో॥ సుపుత్త్రం జ్ఞాపితాశేషభాగ్యోభయసుసమ్పదమ్ ।**
**జాతమాత్రే శిశావాశాః ప్రసేదుః ప్రవవౌ మరుత్ ॥ 41**

ప్ర : జ్ఞాపిత = గుర్తుచేయబడిన, అశేష = సమస్తమైన, భాగ్య+ఉభయ = ఐహికము ఆముష్మికము అను రెండు విధముల భాగ్యముల, సుసంపదమ్ = చక్కని సంపదగలవాడగు, సుపుత్రమ్ = చక్కని కుమారుని (అసూత = ప్రసవించెను), శిశౌ = శిశువు, జాతమాత్రే = పుట్టుకమాత్రముననే, ఆశాః = దిక్కులు, ప్రసేదుః = నిర్మలములైనవి, మరుత్ = వాయువు, ప్రవవౌ= సుఖముగా వీచెను.

**తా :** ఆమె ప్రసవించిన సమయమున దిక్కులు నిర్మలములు, గాలులు సుఖదములు అయినవి. ఆ బాలుడు జన్మముచేతనే ఐహికాముష్మికభాగ్యశాలి యని తెలియవచ్చినది.

**శ్లో॥ శాన్తాః ప్రదక్షిణశిఖా అగ్నయో యజ్వనోఽభవన్ ।**
**నీరజస్కమభూద్వ్యోమ హర్షితం సకలం జగత్ ॥ 42**

ప్ర : అగ్నయః = త్రేతాగ్నులు, ప్రదక్షిణశిఖాః = ప్రదక్షిణముగ జ్వాలలు సాచి హవిస్సులందుకొన్నవి, యజ్వనః = యజ్ఞము చేయువారు, శాన్తాః = శాంతులు, అభవన్ = అయిరి, వ్యోమ = ఆకాశము, నీరజస్కమ్ = ధూళిధూసరితము కాకుండ, అభూత్ = అయినది, సకలం జగత్ = లోకమంతయు, హర్షితమ్ = ఆనందించినది, (అభూత్ = ఆయెను).

**తా :** త్రేతాగ్నులు ప్రదక్షిణార్చిగా హవిస్సులందుకొనినవి. యజ్వలు శాంతచిత్తులైరి. ఆకాశము దుమ్ము ధూళి యనునది లేకుండ నిర్మలమైనది. లోకమంతయు ఆనందించినది.

**శ్లో॥ దేవదున్దుభయో నేదుః పుష్పవృష్టిః పపాత ఖాత్ ।**
**జగుర్గన్ధర్వపతయో ననర్తాప్సరసాం గణః ॥ 43**

**ప్ర :** దేవదున్దుభయః = దేవలోకపు దుందుభివాద్యములు, నేదుః = మ్రోగినవి, ఖాత్ = ఆకాశము నుండి, పుష్పవృష్టిః = పూలవాన, పపాత = కురిసెను, గన్ధర్వపతయః = గంధర్వరాజులు, జగుః = పాడిరి, అప్సరసాం గణః = అప్సరోగణము, ననర్త = నాట్యమాడినది.

**తా :** దేవలోకపు దుందుభులు మ్రోగినవి. ఆకాశమునుండి పూలవాన కురిసినది. గంధర్వులు పాడిరి. అప్సరసలు నాట్యమాడిరి.

**శ్లో॥ ధర్మే మనోఽభవన్నౄణాం ప్రససాద సతామపి ।**
**ఆయుష్మాన్ భవ సౌమ్యేతి సిద్ధాద్యా అబ్రువంస్తదా ॥ 44**

**ప్ర :** నౄణామ్ = నరులకు, ధర్మే = ధర్మమునందు, మనః అభవత్ = మనస్సాయెను, సతాం అపి = సత్పురుషులకున్నూ, ప్రససాద = మనఃప్రసాదమైనది, సిద్ధ+ఆద్యాః = సిద్ధులు మొదలగు దేవయోనులు, తదా = అప్పుడు, సౌమ్య = ఓ సౌమ్యుడా!, ఆయుష్మాన్ భవ = ఆయుష్మంతుడవు కమ్ము, ఇతి = అని, అబ్రువన్ = పలికిరి.

**తా :** నరులకు ధర్మమునందు మనస్సు నిల్చినది, సత్పురుషులకు మనస్సు శాంతమైనది, సిద్ధాది దేవయోనులు ఆ శిశువును, "ఓ సౌమ్యా! ఆయుష్మంతుడవు కమ్ము" అని దీవించిరి.

**శ్లో॥ రాజాప్యాహూయ దైవజ్ఞాఞ్జాతకర్మాఽకరోత్తదా ।**
**గోభూహిరణ్మయవస్త్రాణి ద్విజాదిభ్యో దదౌ నృపః ॥ 45**

**ప్ర :** రాజా+అపి = రాజున్నూ, దైవజ్ఞాన్ = దైవజ్ఞులను, ఆహూయ = ఆహ్వానించి, తదా = అప్పుడు, జాతకర్మా = జాతకర్మను, అకరోత్ = చేసెను, గోభూహిరణ్మయవస్త్రాణి = గోవులను, భూమిని, బంగారమును, వస్త్రములను, ద్విజ+ఆదిభ్యః = బ్రాహ్మణులు మొదలగు వారికి, నృపః = రాజు, దదౌ = దానము చేసెను.

**తా :** రాజున్నూ దైవజ్ఞులను రావించి జాతకర్మ చేయించెను. అప్పుడు గోవులను, భూమిని, బంగారమును, వస్త్రములను బ్రాహ్మణాది యాచకులకు రాజు దానమిచ్చెను.

**శ్లో॥ దైవజ్ఞా అబ్రువన్ రాజన్! కుమారో దైవశాల్యయమ్ ।**
**శ్రీదత్తస్య కృపాపాత్రం భవిష్యతి తపోబలాత్ ॥ 46**

**ప్ర :** దైవజ్ఞాః = దైవజ్ఞులు, అబ్రువన్ = ఇట్లనిరి, రాజన్ = ఓ రాజా!, అయం కుమారః = ఈ

కుమారుడు, దైవశాలి = దైవాంశ గలవాడు, శ్రీదత్తస్య = శ్రీదత్తుని, కృపాపాత్రమ్ = కృపకు పాత్రుడుగా, తపోబలాత్ = తపశ్శక్తివలన, భవిష్యతి = కాగలడు.

**తా :** దైవజ్ఞు లిట్లనిరి : ఓ రాజా! ఈ బాలుడు దైవాంశగలవాడు. తపశ్శక్తివలన శ్రీ దత్తాత్రేయుని కృపకు పాత్రుడగును.

**శ్లో॥ అనష్టద్రవ్యతాస్యైవ నామసఙ్కీర్తనాన్నృప! ।**
**సప్తద్వీపమహీపాలః స్మృతిగామీహ దత్తవత్ ॥ 47**

**ప్ర :** అస్య = వానికి, అనష్టద్రవ్యతా = తరుగుబోని సంపద, నృప! = ఓ రాజా!, నామసంకీర్తనాత్ = నామసంకీర్తనమువలన, సప్తద్వీపమహీపాలః = సప్తద్వీపములకు ప్రభువు, ఇహ = ఈ లోకమున, దత్తవత్ = శ్రీదత్తునివలె, స్మృతిగామీ = వేదవేత్త,

**శ్లో॥ పఞ్చాశీతిసహస్రాబ్దం చక్రవర్తీ భవిష్యతి ।**
**అనన్తవ్రతమాహాత్మ్యాత్సమ్రాడేష జయీ వశీ ॥ 48**

**ప్ర :** అనన్తవ్రతమాహాత్మ్యాత్ = అనంతవ్రతమహిమవలన, ఏషః = ఈతడు, జయీ = విజయశీలి, వశీ = ఇంద్రియములను వశపరచుకొనినవాడు, చక్రవర్తీ = చక్రవర్తి, సమ్రాట్ = సామ్రాట్టు, పఞ్చ+అశీతి–సహస్ర+అబ్దమ్ = ఎనుబది యైదువేల సంవత్సరములు, భవిష్యతి = అగును.

**తా :** ఈ బాలుని సంపద తఱుగుబోనిది. నామసంకీర్తనమువలన సమస్త వసుంధరా వలయమునకు చక్రవర్తియై పాలించును. అనంతవ్రతప్రభావమున ఈ బాలుడు శ్రీదత్తునివలె జితేంద్రియుడు, విజయశీలి, వేదాంతవేత్త యగును.

**శ్లో॥ సూర్యవ్రతప్రభావేన లక్షాయూ రోగవర్జితః ।**
**ఇత్యుక్త్వా గణకాస్తే తు పూజితాః స్వగృహం యయుః ॥ 49**

**ప్ర :** సూర్యవ్రతప్రభావేన = సూర్యవ్రతప్రభావముచేత, రోగవర్జితః = రోగములేనివాడై, లక్షాయూ = లక్షసంవత్సరములు జీవించు వాడగును, ఇతి ఉక్త్వా = ఇట్లని పలికి, తే గణకాః = ఆ దైవజ్ఞులు, పూజితాః తు = సన్మానింపబడినవారై, స్వగృహం యయుః = తమ తమ యిండ్లకు వెడలిరి.

**తా :** సూర్యవ్రతప్రభావమువలన రోగములేకుండ లక్ష సంవత్సరములు జీవించును, అని పలికి ఆ దైవజ్ఞులు సన్మానితులై తమ తమ యిండ్లకు వెడలిరి. *

**శ్లో॥ అథార్జునం సుతం నామ్నా షోడశేఽహ్ని పితాఽకరోత్ ।**
**తతః కాలేన కియతా తత్పితా పఞ్చతామితః ॥ 50**

**ప్ర :** అథ = అంతట, షోడశే అహ్ని = పదునారవ రోజున, సుతమ్ = కుమారుని, పితా =

తం(డి, నామ్నా = పేరుచేత, అర్జునమ్ = అర్జునుడుగా, అకరోత్ = చేసెను, తతః = ఆపై, కియతా కాలేన = కొంతకాలమునకు, తత్ పితా = ఆ తం(డి, పఞ్చతాం ఇతః = మరణించెను.

**తా :** అంతట పదునారవ రోజున ఆ శిశువునకు వాని తం(డి అర్జునుడని పేరు పెట్టెను. తరువాత కొంతకాలమునకు ఆ తం(డి మరణించెను.

**శ్లో॥ రాజ్యం కుర్వర్జునేత్యుక్తః పౌరైః (పాహాపి సంస్కృతః ।**
**న కరిష్యామి రాజ్యం స్వకర్మాపి నరకోత్తరమ్ ॥ 51**

**(ప :** రాజ్యం కురు+అర్జున = ఓ అర్జునా! రాజ్యము పాలించుము, ఇతి = అని, పౌరైః = పురజనులచేత, ఉక్తః = కోరబడినవాడై, సంస్కృతః అపి = ఉపనయనసంస్కారము, వేదాధ్యయనము కలిగినవాడైనప్పటికిని, (పాహ = ఇట్లని పలికెను, రాజ్యమ్ = రాజ్యపాలనము, స్వ కర్మ అపి = నాకు స్వభావసిద్ధమైన కర్మయే యైనను, నరకోత్తరమ్ = రాజ్యాన్తే నరకం ధ్రువం అను శాస్త్రోక్తి ననుసరించి, రాజరికమునకు ఫలము నరకము కనుక, న కరిష్యామి = చేయను.

**తా :** పుర(పజలు వానిని రాజ్యపాలన చేయుము అని కోరినను, ఆ అర్జునుడు, “రాజ్యపాలన క్షత్రియుడనైన నాకు స్వధర్మమే యైనను, నేను ఉపనీతుడను, వేదాధ్యయనము చేసినవాడను కూడ అయినప్పటికిని, రాజ్యపరిపాలనవలన ఫలితార్థముగ లభించునది నరకము కావున, నేను రాజ్యపాలనను చేపట్టను, అనియెను.

**శ్లో॥ భువః షష్ఠాంశః పణ్యానాం ద్వాదశోఽంశోఽత్ర భూభుజా ।**
**(గాహ్య ఇత్యాది యత్ (పోక్తం తత్తు తద్రక్షణాయ హి ॥ 52**

**(ప :** షష్ఠాంశః భువః = ఆరవ వంతు భూమి, పణ్యానామ్ = వ్యాపారమునకు, అత్ర = భూమియందు, ద్వాదశః అంశః = పం(డెండవ భాగము, భూ భుజా = రాజులచేత, (గాహ్య = తీసికొన దగినది, ఇతి +ఆది యత్ (పోక్తమ్ = అను నిట్టిది యేది చెప్పబడినదో, తత్ తు = అదేమో, తత్ రక్షణాయ హి = దాని పాలన కొరకే.

**తా :** భూమి ఆరవభాగము వ్యాపారనిమిత్తము, పం(డెండవ భాగము రాజున్నూ తీసికొన దగునని శాస్త్రము నిర్దేశించిన విషయము ఆ భూమిని పాలించి రక్షించుట కొరకే.

**శ్లో॥ చోరాదిభ్యోఽప్యరక్షన్యో భోగాశీ నరకం (వజేత్ ।**
**ధర్మవిప్లవమీశోఽపి యోఽనివార్య విహాయ చ ॥ 53**

**(ప :** చోర+ఆదిభ్యః+అపి = దొంగలనుండి కూడ, అరక్షన్యః = రక్షింప దగినది, భోగ+ఆశీ = అనుభవించ గోరువాడు, యః = ఎవడో వాడు, నరకం (వజేత్ = నరకమును పొందును, విహాయ చ = ఈ పద్ధతి దప్పినచో, ఈశః అపి = సమర్థుడైను, ధర్మవిప్లవమ్ = అధర్మము, అనివార్యః = అనివార్యము.

**తా :** దొంగలనుండి కూడ రక్షింపదగినది. అట్టి భూమిని తాననుభవింపగోరు వాడు నరకమును పొందును. సమర్థన కైనను, ఈ ధర్మము తప్పరానిదే, అధర్మమే.

**శ్లో॥ గురూక్తిం హన్తి లోభేన క్రుధా వా సోఽప్యధః పతేత్ ।**
**అదణ్డ్యదణ్డనాద్దణ్డ్యాదణ్డనాచ్చాపి తాదృశః ॥ 54**

**ప్ర :** లోభేన = లోభముతో, వా = లేక, క్రుధా = కోపముతో, (యః = ఎవడు), గురు+ఉక్తిమ్ = శాస్త్రవాక్యమును, హన్తి = పాలించడో, సః అపి = అట్టివాడున్నూ, అధః పతేత్ = పతితుడగును, అదణ్డ్య = శిక్షింపబడరానివారిని, దణ్డనాత్ = శిక్షించుటవలన, దణ్డ్య = శిక్షింపదగినవారిని, అదణ్డనాత్ చ అపి = శిక్షింపకుండుటవలన కూడ, తాదృశః = అట్టివాడగును, అనగా, ధర్మచ్యుతుడగును.

**తా :** భూమియందలి లోభముతోనో లేక ఒక వ్యక్తిపై కోపముతోనో శాస్త్రోక్తిని, పెద్దల మాటను పాటించని వాడు ధర్మము తప్పినవాడగును. అట్లే శిక్షార్హుని శిక్షించక విడచుట, శిక్షించరాని వానిని శిక్షించుట కూడ పతనహేతువులే యగును.

**శ్లో॥ ఏవమేకోఽన్యవిశ్వాసాత్కథం సాధుఫలం లభే ।**
**శ్రుత్వైవం తద్వచః ప్రౌఢం ధీమాన్ గర్గోఽవదన్నృప! ॥ 55**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగా, ఏకః = ఒక వ్యక్తి, అన్య విశ్వాసాత్ = వేరొక విశ్వాసము వలన, ధర్మమువలన, సాధుఫలమ్ = సత్ఫలితమును, కథం లభే = ఎట్లు పొందగలడు?, ఏవమ్ = ఈ విధమైన, తత్ = వాని, ప్రౌఢం వచః = వయోవృద్ధులకు తగిన మాటలు, శ్రుత్వా = విని, ధీమాన్ గర్గః = బుద్ధిశాలియైన గర్గుడు, అవదత్ = ఇట్లనెను, నృప! = ఓ రాజా!

**తా :** యే వ్యక్తియైనను తన స్వభావమునకు వేరైన ధర్మము ననుసరించినచో దాని ఫలము మంచిదగుట సాధ్యము కాదుకదా, అని ఇట్లు పలికిన వాని వయస్సునకు మించిన ఆలోచనాపరమైన మాటలు విని బుద్ధిశాలి గర్గుడిట్లనెను : రాజా!

**శ్లో॥ యర్హ్యేవం తర్హి యోగీన్ద్రం శ్రీదత్తం శరణం వ్రజ ।**
**నిస్త్రైగుణ్యే పథి సదా భక్తగుప్త్యై చరత్యముమ్ ॥ 56**

**ప్ర :** యర్హి ఏవమ్ = ఇట్లేయైనచో, తర్హి = అప్పుడు, యోగీన్ద్రం శ్రీదత్తమ్ = శ్రీదత్తయోగీంద్రుని, శరణం వ్రజ = శరణు వేడుము, అముమ్ = ఈతడు, సదా = ఎల్లప్పుడును, భక్తగుప్త్యై = భక్తుల రక్షణకై, నిస్త్రైగుణ్యే పథి = త్రిగుణాతీతమార్గమున (అనగా, ప్రకృతికతీతముగ), చరతి = సంచరించుచున్నాడు.

**తా :** ఓ రాజా! అట్లయినచో, నీ ఆలోచన లిట్లుండగా, పరిష్కారమునకై శ్రీదత్తయోగీంద్రుని శరణు పొందుము. ఆతడు సదా భక్తరక్షణకై త్రిగుణాతీతమార్గమున ప్రకృతిబాహ్యుడై సంచరించువాడు.

**శ్లో॥ తత్ ప్రసాదాదవాప్నోషి సమ్యగ్రాజ్యప్రశాసనే ।**
**ధృతిం శక్తిం మతిం చాన్యత్ప్రియం యోగప్రభావతః ॥ 57**

**ప్ర :** తత్ ప్రసాదాత్ = ఆ దత్తప్రభువు ప్రసాదమువలన, రాజ్యప్రశాసనే = రాజ్యపాలనమునందు, ధృతిమ్ = నిలుకడను, శక్తిమ్ = అధికారమును, మతిం చ = వివేకమునున్నూ, అన్యత్ ప్రియమ్ = ఇతరులను సంతోషపెట్టుటయు, యోగప్రభావతః = యోగశక్తివలన, సమ్యక్ = బాగుగా, అవాప్నోషి = పొందుదువు.

**తా :** ఆ దత్తప్రభు ప్రసాదమువలన యోగశక్తిని పొంది తద్ద్వారా రాజ్యపాలనలో నిలుకడను, తిరుగులేని అధికారమును, వివేకమును, ఇతరులను సంతోషపెట్టగల నేర్పును బాగుగా పొందగలవు.

**శ్లో॥ యోఽవతీర్ణో మహీపృష్ఠే స హ్యసానుకృతాశ్రమః ।**
**యోగయుక్తో మహాత్మా స సర్వత్ర సమదర్శనః ॥ 58**

**ప్ర :** మహీపృష్ఠే = భూతలముపై, యః = ఎవడు, అవతీర్ణః = అవతరించినవాడో, సః హి = ఆతడే, అసానుకృత+ఆశ్రమః = ఆశ్రమవ్యవస్థలో దేనికిగాని అనుకూలుడు గాడు, సః = ఆతడు, యోగయుక్తః = యోగదృష్టితో నుండువాడు, మహాత్మా = మహాత్ముడు, సర్వత్ర = అంతటను, సమదర్శనః = సమమైన వైఖరి గలవాడు.

**తా :** భూమిపై అవతరించిన దత్తప్రభువు బ్రహ్మచర్యాది ఆశ్రమములలో యే ఒక్కదానినైన అనుసరించువాడు కాడు. ఆతడు యోగమునందే రమించువాడు, మహాత్ముడు, అన్నివస్తువులందు, అందరు వ్యక్తులందు సమమైన వైఖరి గలవాడు.

**శ్లో॥ సాక్షాద్విష్ణుర్జగద్ధాతా తపోదీప్తోఽత్రినన్దనః ।**
**అనసూయాగర్భరత్నం భక్తానామీహితార్థదః ॥ 59**

**శ్లో॥ తమారాధయ యత్నేన యోగర్ద్ధిం తే ప్రదాస్యతి ।**
**యయేహ బహుధాఽఽత్మానం కృత్వేష్టం సాధయిష్యసి ॥ 60**

**ప్ర :** సాక్షాత్ విష్ణుః జగత్ ధాతా = సాక్షాత్తు జగద్రక్షకుడైన విష్ణువు, తపోదీప్తః = తపస్సుచే మూర్తిమంతుడైన, అత్రినన్దనః = అత్రిమహర్షి కుమారుడు, అనసూయాగర్భరత్నమ్ = అనసూయాగర్భమున బుట్టిన రత్నము, భక్తానామ్ = భక్తులకు, ఈహితార్థదః = కోరినదెల్ల ప్రసాదించువాడు, తమ్ = ఆ దత్తాత్రేయుని, యత్నేన = ప్రయత్నపూర్వకముగ, ఆరాధయ = ఆరాధించుము, తే = నీకు, యోగర్ద్ధిమ్ = యోగమున వృద్ధిని, ప్రదాస్యతి = ప్రసాదించును, యయా = ఆ యోగవృద్ధిచే, ఇహ = లోకమున, బహుధా = అనేక విధముల, ఇష్టం కృత్వా = కోరినది చేసి, ఆత్మానమ్ = ఆత్మజ్ఞానమును, సాధయిష్యసి = సాధింతువు.

**తా :** సాక్షాత్తూ విష్ణువు, జగద్రక్షకుడు, తపోదీప్తిచే అనసూయ అత్రిమహర్షుల కుమారుడై దత్తాత్రేయుడుగా అవతరించినాడు. ఆ ప్రభువు భక్తుల కభీష్టవరదుడు. వానిని ఆరాధించుము. నీకు యోగవృద్ధిని ప్రసాదించును. దానిచే నీవు ఐహికమును సాధించి, ఆత్మజ్ఞానమును పొందగలవు. *

**శ్లో॥ యమారాధ్య సురేన్ద్రోఽపి స దేవస్తత్ప్రసాదతః ।**
**జమ్భదైత్యం నిహత్యాశు హృతం పదమవాప సః ॥ 61**

**ప్ర :** యమ్ = ఎవనిని, యే దత్తాత్రేయుని, ఆరాధ్య = ఆరాధించి, సురేన్ద్రః+అపి = దేవేంద్రుడు కూడ, సః దేవః = ఆ దేవత, తత్ ప్రసాదతః = ఆ దత్తుని అనుగ్రహమువలన, జమ్భదైత్యమ్ = జమ్భాసురుని, నిహత్య = చంపి, ఆశు = సులువుగ, హృతం పదమ్ = అపహరింపబడిన పదవిని, సః = ఆ దేవేంద్రుడు, అవాప = పొందెను.

**తా :** ఆ దత్తాత్రేయు నారాధించి, ఆ దేవుని అనుగ్రహము వలన, దేవేంద్రుడు కూడ జంభాసురుని హరించి వెంటనే వానిచే అపహరింపబడిన తన ఇంద్ర పదవిని మరల పొందినాడు.

**శ్లో॥ అద్యాపి సేవమానస్తం దేవైర్దేవర్షిభిః సదా ।**
**భుఙ్క్తే ధర్మేణ ధర్మాత్మా రాజ్యం దివ్యమకణ్టకమ్ ॥ 62**

**ప్ర :** అద్య అపి = నేడు కూడ, దేవైః = దేవతలచేత, దేవర్షిభిః =దేవర్షులచేత, సదా = ఎల్లప్పుడు, సేవమానః = పూజింపబడువాడగుచు, ధర్మాత్మా = ధర్మబద్ధుడైనవాడై, ధర్మేణ = ధర్మముతో, తం దివ్యం రాజ్యమ్ = ఆ స్వర్గరాజ్యమును, అకణ్టకమ్ = నిరాతంకముగ, భుఙ్క్తే = భుజించుచున్నాడు.

**తా :** నేటికిని దేవతలచేత, దేవర్షులచేత సదా పూజింపబడుచు, ధర్మబద్ధుడైన వాడై ఇంద్రుడు ధర్మముగా స్వర్గమును ఎదురులేక పరిపాలించుచున్నాడు.

**శ్లో॥ ప్రభోరారాధనం విద్ధి దుష్కరం దుర్ధియామిహ ।**
**సుధీనాం సుకరం రాజన్నాత్మభూతస్య తస్య హి ॥ 63**

**ప్ర :** రాజన్ = ఓ రాజా!, ప్రభోః ఆరాధనమ్ = దత్తప్రభువు ఆరాధన, ఇహ = జగత్తులో, దుర్ధియామ్ = దుర్బుద్ధులకు, దుష్కరమ్ = అతికష్టసాధ్యము, సుధీనామ్ = సద్బుద్ధులకు, ఆత్మభూతస్య హి = ఆత్మసముడైన వానికి మాత్రమే, సుకరం విద్ధి = సులభమైన దానిగా తెలియుము.

**తా :** ఓ రాజా! దత్తప్రభువు నారాధించుట దుర్బుద్ధులకు అసాధ్యము, సద్బుద్ధులకు ఆత్మసముడైన భక్తునకే సాధ్యమని తెలియుము.

**శ్లో॥ యస్య గఙ్గాఽభ్యాసి స్నానం భిక్షా చ కమలాలయే ।**
**సహ్యాద్రౌ చ నివాసః స స్మృతిగామీ క్షణే క్షణే ॥ 64**

**ప్ర :** యస్య = ఎవనికి, గఙ్గా స్నానమ్ = గంగానదిలో స్నానము, చ = మరియు, కమలాలయే = కొల్హాపురమున, భిక్షా = భిక్షాటనము, సహ్యాద్రౌ = సహ్యాద్రిపై, నివాసః చ = నివాసమున్ను, అభ్యాసి = ఆచారమగునో, సః = ఆతడు, క్షణే క్షణే = ప్రతి నిమేషమున్నూ, స్మృతిగామీ = స్మరించదగువాడు.

**తా :** గంగాస్నానము, కొల్హాపురమున భిక్షాటనము, సహ్యాద్రిపై నివాసము అనునవి యెవనికి అభ్యాసముగా నుండునో, ఆతడు క్షణ క్షణము స్మరింపదగినవాడు.

**శ్లో॥ సుదూరే యోఽస్తి సతతం విషయాకృష్టచేతసామ్ ।**
**సుధీనామన్తికే చాస్య భజనాత్కిం న సిధ్యతి ॥ 65**

**ప్ర :** సతతమ్ = ఎల్లవేళల, విషయ+ఆకృష్టచేతసామ్ = ఇంద్రియభోగములచే ఆకర్షితమైన మనస్సుగల వారికి, యః = ఎవడు, సుదూరే = చాలదూరమున, సుధీనామ్ = బుద్ధిమంతుల యొక్క, అన్తికే చ = సమీపముననును, అస్తి = ఉన్నవాడో, అస్య భజనాత్ = వాని సేవ వలన, కిం న సిధ్యతి = యేమి సిద్ధించదు?

**తా :** ఇంద్రియలాలసగల వారికి దూరముగ నుండి, ఎల్లవేళల, బుద్ధిమంతులకు దగ్గరివాడై యున్న భక్తుని సేవించుటవలన ఫలించని కోరికలే లేవు.

**శ్లో॥ యేనైవ సృజ్యతే విశ్వం యేనైతద్ధార్యతే పునః ।**
**సంహర్తాపి స ఏవాస్తే భక్త్యా తం శరణం వ్రజ ॥ 66**

**ప్ర :** యేన+ఏవ = ఎవనిచేతనే, విశ్వమ్ = విశ్వము, సృజ్యతే = సృజింపబడుచున్నదో, యేన = ఎవనిచేత, ఏతత్ ధార్యతే = ఈ జగత్తు రక్షింపబడుచున్నదో, పునః = మరల, సః ఏవ = ఆతడే, సంహర్తా అపి ఆస్తే = నశింపజేయువాడున్నూ, అగుచున్నాడో, తమ్ = వానిని, భక్త్యా = భక్తితో, శరణం వ్రజ = శరణొందుము.

**తా :** ఈ జగత్తునెవడు సృష్టించునో, ఎవడు రక్షించునో, మరల నెవడు నశింపజేయునో, ఆ ప్రభువును భక్తితో శరణు వేడుము.

**శ్లో॥ శ్రుత్వైవమర్జునః ప్రాహ దేవేన్ద్రేణార్చితః కథమ్ ।**
**ఏవం ప్రభావో దేవోఽపి శ్రద్దధానాయ శంస మే ॥ 67**

**ప్ర :** ఏవం శ్రుత్వా = ఈ మాటలను విని, అర్జునః ప్రాహ = అర్జునిడిట్లనెను, ఏవం ప్రభావః దేవః = ఇంతటి శక్తిశాలియగు దైవము, దేవ+ఇన్ద్రేణ = దేవతల ప్రభువుచేత, కథం అర్చితః = ఎట్లు ఆరాధింపబడినాడు?, శ్రద్+దధానాయ అపి = శ్రద్ధను కలిగించుటకై, మే శంస = నాకు దెల్పుము.

**తా :** ఈ మాటలను విని అర్జునుడిట్లనెను : ఇంతటి ప్రభావముగల దత్తదేవుని దేవేంద్రు-డెట్లారాధించినాడు? నాలో శ్రద్ధను కలిగించుటకై ఆ వివరములను నాకు తెలియజెప్పుము.

**శ్లో॥ ఆరాధయామ్యహమపి తమేవ మునిసత్తమ ।**
**ఇత్యర్జునేన సంపృష్టో గర్గః ప్రాహ స్మరన్విభుమ్ ॥ 68**

**ప్ర :** మునిసత్తమ! = మునులలో నెల్ల ఉత్తముడవైన మహర్షీ!, తం ఏవ = ఆ దేవునే, అహం అపి = నేను గూడ, ఆరాధయామి = పూజింతును, ఇతి = అని, అర్జునేన = అర్జునునిచే, సంపృష్టః = అడుగబడినవాడై, గర్గః = గర్గమహర్షి, విభుం స్మరన్ = దత్తప్రభువును స్మరించుచు, ప్రాహ = ఇట్లనెను.

**తా :** ఓ మునిసత్తమా! నేను గూడ ఆ దత్తప్రభువునే పూజింతును, కావున వివరింపుడని అర్జునుడడుగగా, గర్గమహర్షి సర్వవ్యాపియైన దత్తుని స్మరించుచు ఇట్లనెను.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం తృతీయాష్టకే తృతీయోఽధ్యాయః ॥
ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## తృతీయాష్టకము - చతుర్థాఽధ్యాయము

**శ్లో॥ నతావనాత్తసుభగవ్రతోఽయం పరమేశ్వరః ।**
**తల్లీలాం శృణు భూపేన్ద్రో యతోఽభీష్టార్థభాగభృత్ ॥ 1**

**ప్రతిపదార్థం :** నత+అవన+ఆత్త-సుభగవ్రతః = భక్తరక్షణదీక్షితుడైనవాడు, అయం పరమేశ్వరః = ఈ దత్తప్రభువు, తత్ లీలామ్ = వాని చరితమును, శృణు = వినుము, యతః = దేనివలన, భూపేన్ద్రః = రాజు, చక్రవర్తి, అభీష్ట+అర్థభాగభృత్ = కోరినదానిని పొందినవాడాయెనో.

**తాత్పర్యము :** భక్తరక్షణదీక్షాదక్షుడైన శ్రీదత్తప్రభువు లీలాచరితమును వినుము. దీనివలన సార్వభౌముడు తాను కోరినదానిని పొందినాడు.

**శ్లో॥ సదైత్యో దైత్యరాట్ జంభో దేవేన్ద్రోఽపి సదేవతః ।**
**స్వర్గాయాయుధ్యతాన్యోన్యం దివ్యవర్షం పురా భృశమ్ ॥ 2**

**ప్ర :** సదైత్యః = రాక్షసులతో గూడినవాడై, దైత్యరాట్ జంభః = రాక్షసరాజు జంభుడు, సదేవతః = దేవతలతో గూడినవాడై, దేవేన్ద్రః అపి = దేవతల రాజైన ఇంద్రుదున్ను, పురా = పూర్వకాలమున, స్వర్గాయ = స్వర్గాధిపత్యమునకై, దివ్యవర్షమ్ = దేవతల కాలమానములో సంవత్సరము పర్యంతము, భృశమ్ = మిక్కిలిగా, అన్య+అన్యమ్ = ఒకరినొకరు, అయుధ్యత = పోరాడిరి.

**తా :** పూర్వకాలమున జంభాసురుడను రాక్షసరాజు, దేవేంద్రుదున్ను తమ తమ సేనల మోహరించి, స్వర్గాధిపత్యముకొరకు, దేవతల కాలమానమున ఒక సంవత్సరమంతయు మిక్కిలి పోరాడిరి.

**శ్లో॥ దైత్యైర్దేవాః పరాభూతా గత్వోచుర్జీవమాతురాః ।**
**దృష్టః పరాజయో నోఽద్య తత్కిం కార్యమతః పరమ్ ॥ 3**

**ప్ర :** దైత్యైః = రాక్షసులచేత, పరాభూతాః = ఓడించబడి, అవమానింపబడి, దేవాః = దేవతలు,

గత్వా = వెళ్లి, ఆతురాః = కల్లోలితమనస్కులై, జీవమ్ = బృహస్పతిని, ఊచుః = ఇట్లడిగిరి, నః = మాకు, అద్య = నేడు, పరాజయః = ఓటమి, దృష్టః = అనుభవమైనది, తత్ = ఈ విషయమున, అతః పరమ్ = గెలుపు కొఱకు, కిం కార్యమ్ = చేయదగినది యేమి?

**తా :** రాక్షసుల చేతిలో ఓడిన దేవతలు అశాంతితో వెడలి బృహస్పతిని ఇట్లడిగిరి : నేడు మేము ఓటమి చవిచూచితిమి, గెలుపు కొఱకు చేయదగిన కర్తవ్యమేమి?

**శ్లో॥ తానాశ్వాస్యాహ ధిషణో దత్తాత్రేయం తపోధనమ్ ।**
**శరణం యాత వరదః స కార్యం వః కరిష్యతి ॥ 4**

**ప్ర :** తాన్ = ఆ దేవతలను, ఆశ్వాస్య = ఓదార్చి, ధిషణః = బృహస్పతి, ఆహ = ఇట్లనెను, తపోధనం దత్తాత్రేయమ్ = తపోధనుడైన దత్తాత్రేయుని, శరణం యాత = శరణు పొందుడు, సః వరదః = ఆ వరప్రదాయకుడు, వః కార్యమ్ = మీకు కావలసిన కార్యమును, కరిష్యతి = చేయును.

**తా :** దేవతలను వారి గురువైన బృహస్పతి ఓదార్చి ఇట్లనెను : మీరు తపశ్శాలియైన దత్తాత్రేయుని శరణు వేడుడు. ఆతడు వరప్రదాత. మీకు చేయదగిన కార్యము నాతడు చేయును.

**శ్లో॥ ఇత్యుక్తః సామరః శక్రః ప్రాప దత్తాశ్రమం శుభమ్ ।**
**తత్ర దేవం మహాత్మానమప్రతర్క్యం దదర్శ సః ॥ 5**

**ప్ర :** ఇతి ఉక్తః = అని నిర్దేశింపబడినవాడై, శక్రః = ఇంద్రుడు, సామరః = దేవతలతో గూడ, శుభం దత్తాశ్రమమ్ = శుభప్రదమైన దత్తుని ఆశ్రమమును, ప్రాప = చేరెను, తత్ర = అచ్చట, సః = ఆ ఇంద్రుడు, అప్రతర్క్యమ్ = ఆతని గురించి యే వివరములును విచారింపరానివాడైన, మహాత్మానమ్ = మహితాత్ముడైన, దేవమ్ = దత్తదేవుని, దదర్శ = దర్శించెను.

**తా :** ఇట్లు దేవగురుడు నిర్దేశింపగా, ఇంద్రుడు దేవతలతో గూడి శ్రీదత్తాశ్రమమునకు చేరెను. అక్కడ ఆతడు ఆ మహాత్ముడైన దత్తదేవుని దర్శించెను. ఆ దత్తదేవుడు అప్రతర్క్యుడు, అనగా, వాని కులగోత్రములుగాని, వాని ఆశ్రమముగాని, ఆచారముగాని, తెలియరానివాడు, తర్కింపరానివాడు.

**శ్లో॥ దిగమ్బరమపి స్వాఙ్గే ధృత్వా బాలాం దిగమ్బరామ్ ।**
**అనఘాం సుదతీం తన్వీం పానాసక్తామపి స్థితమ్ ॥ 6**

**ప్ర :** బాలాం సుదతీం తన్వీం దిగంబరాం పానాసక్తాం అపి అనఘామ్ = చిన్న వయసులో నున్నది, మల్లెమొగ్గలవంటి పలువరుసగలది, తీవెవంటి శరీరము గలది, వివస్త్రగ నున్నది, మధుపానమునందాసక్తి గలది, యైనను పాపము లేనిది యైన స్త్రీని, స్వ+అఙ్గే = తన అంకమున, దిగంబరం అపి = దిగంబరముగనున్నను, ధృత్వా స్థితమ్ = కూర్చుండబెట్టుకొని యున్న వానిని,

**శ్లో॥ దృష్ట్వైవమపి తే చక్రుః సేవాం సర్వేఽమరాః సదా ।**
**తిష్ఠన్తముపతస్థుస్తే ప్రణతా యాన్తమన్వగుః ॥ 7**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగా, దృష్ట్వా అపి = చూచినప్పటికిని, సర్వే అమరాః = దేవతలందఱును, సదా = ఎల్లస్థితులలోనూ, తిష్ఠన్తమ్ = నిలుచున్న దత్తుని, ప్రణతాః = నమస్కరించుచు, తే = వారు, ఉపతస్థుః = నిల్చుండిరి, యాన్తమ్ = నడచుచున్న దత్తుని, అన్వగుః = అనుసరించి నడచిరి, (ఇట్లు), తే = దేవతలు, సేవాం చక్రుః = సేవించిరి.

**తా :** దేవతలు దర్శించిన దత్తాత్రేయదేవుడు తన దిగంబరదేహమున ఒక అందమైన దిగంబర యువతిని కూడి యున్నాడు. ఆమె మధుపానాసక్త. ఐనను పాపము లేనిది. ఇట్లున్న స్వామిని చూచినప్పటికిని దేవతలు అక్కడే యుండి ఆ స్వామి నిల్చినప్పుడు తామును నిల్చి నమస్కరించుచు, నడచినప్పుడు వారును వెంట నడచుచు, ఇట్లు అన్ని స్థితులలోనూ దేవతలందఱును శ్రీదత్తుని సేవించిరి.

**శ్లో॥ భక్త్యైవం బహుకాలం తే సేవయామాసురాదరాత్ ।**
**అథైకదాఽఽహ భగవాన్దేవాః కిం సేవయేచ్ఛథ ॥ 8**

**ప్ర :** తే = ఆ దేవతలు, ఏవమ్ = ఈ రీతిగా, భక్త్యా = భక్తితో, బహుకాలమ్ = చాలకాలము, ఆదరాత్ = ఆదరణతో, సేవయామాసుః = సేవించిరి, అథ = అంతట, ఏకదా = ఒకప్పుడు, భగవాన్ = దత్తభగవానుడు, ఆహ = ఇట్లడిగెను, దేవాః = ఓ దేవతలారా!, సేవయా = మీరు చేయుచున్న ఈ సేవకు ప్రతిఫలముగా, కిం ఇచ్ఛథ = యేమి కోరుచున్నారు?

**తా :** దేవతలు చాల కాలమట్లు ఆదరణతో సేవింపగా, ఒకనాడు దత్తభగవానుడు వారి నిట్లడిగెను : ఓ దేవతలారా! మీరు యేమి కోరి నా కీ సేవలు చేయుచున్నారు?

**శ్లో॥ దేవా ఊచుః ప్రణమ్యేశం పరమాత్మన్! జగత్ప్రభో! ।**
**సయజ్ఞభాగం త్రైలోక్యం దానవైరఖిలం హృతమ్ ॥ 9**

**ప్ర :** ఈశమ్ = ఈశ్వరుని, ప్రణమ్య = నమస్కరించి, దేవాః = దేవతలు, ఊచుః = ఇట్లనిరి, (హే) పరమాత్మన్ (హే) జగత్ప్రభో! = ఓ పరమాత్మా!, ఓ లోకేశ్వరా!, సయజ్ఞభాగమ్ = యజ్ఞములలో మా హవిర్భాగములతో గూడ, త్రైలోక్యమ్ = మూడులోకముల ఆధిపత్యమున్నూ, అఖిలమ్ = అంతయు, దానవైః = రాక్షసులచే, హృతమ్ = హరింపబడినది.

**తా :** దత్తప్రభువును నమస్కరించి దేవతలిట్లనిరి : ఓ దేవా! రాక్షసులు మా యజ్ఞభాగములను మా త్రిలోకాధిపత్యములను గూడ హరించిరి.

**శ్లో॥ వయం హృతాధికారాశ్చ తిష్ఠామో మర్త్యవద్భువి ।**
**పరిత్రాణాయ నో దేవ! తద్వధే చ ధియం కురు ॥ 10**

**ప్ర :** (హే) దేవ = ఓ దేవా!, వయం చ = మేమున్నూ, భువి = భూలోకమున, మర్త్యవత్ = మర్త్యులవలె, హృత+అధికారాః = హరించబడిన అధికారములు గలవారమై, తిష్ఠామః = నిల్చియున్నాము, నః = మమ్ములను, పరిత్రాణాయ = రక్షించి బలవంతులజేయుటకై, చ = మరియు, తత్ = ఆ దైత్యుల, వధే = వధించుటయందు, ధియం కురు = ఆలోచన లేక సంకల్పము చేయుము.

**తా :** ఓ దేవా! భూలోకమందలి మానవులతో సమానులమై మా సర్వాధికారములను కోల్పోయి, యిట్లున్నాము. మమ్ము మరల బలవంతులుగా చేయుటకు, ఆ దైత్యుల సంహరించుటకు తగిన యోచన చేయుము.

**శ్లో॥ త్వద్భక్తానాం సురాణాం నో వినా త్వచ్చరణామ్బుజాత్ ।**
**గతిర్నవిద్యతే భూమన్ పాహ్యార్తాఞ్ఛరణాగతాన్ ॥ 11**

**ప్ర :** త్వత్ భక్తానామ్ = నీ భక్తులమైన, నః సురాణామ్ = దేవతలమైన మాకు, త్వత్ చరణాంబుజాత్ వినా = నీ పాదపద్మములు కాక, భూమన్ గతిః = గొప్ప ఆశ్రయము, న విద్యతే = లేదు, శరణాగతాన్ ఆర్తాన్ = శరణన్న ఆర్తులను, పాహి = రక్షించుము.

**తా :** మా దేవతలము నీ భక్తులము. మాకు నిన్ను ఆశ్రయించుట తప్ప వేరుగా గొప్పమార్గమే లేదు. దిక్కుతోచక దీనులమై శరణన్న మమ్ము రక్షించుము.

**శ్లో॥ ప్రహస్య ప్రాహ తాన్ శ్రీమానహముచ్ఛిష్టదూషితః ।**
**మద్యాసక్తో వశీ నైవ మత్తః కిం భవతాం భవేత్ ॥ 12**

**ప్ర :** తాన్ ప్రహస్య = వారి మాటలకు నవ్వి, శ్రీమాన్ ప్రాహ = శ్రీ దత్తుడు ఇట్లనెను, అహమ్ = నేను, ఉచ్ఛిష్టదూషితః = నిషిద్ధములను స్వీకరించుటచే నింద్యుడను, మద్యాసక్తః = మద్యపానమునందాసక్తి గలవాడను, మత్తః = మత్తులో దోగువాడను, న ఏవ వశీ = జితేంద్రియుడను కానే కాను, భవతామ్ = మీకు, కిం భవేత్ = (నా వలన) ఏమి మంచి జరుగును? (లేక, మత్తః = నా నుండి, భవతాం కిం భవేత్?)

**తా :** వారి మాటలకు నవ్వి శ్రీదత్తప్రభువిట్లనినాడు : నేను లోకంలో సన్మార్గులైన వారు నిషేధించే వానిని స్వీకరించినవాడను. నాకు మద్యపానంలో మక్కువ. మద్యం మత్తులో దోగుతూ ఉంటాను. నాకు నా ఇంద్రియాలు అదుపులో ఉండవు. నా వలన మీకేమి ప్రయోజనం?

**శ్లో॥ స్త్రీసమ్భోగో హి దుఃఖాయ పాతాయ చ పునస్తు సః ।**
**దైవాదుచ్ఛిష్టతామస్యాః ప్రాప్తోఽహం కిమతో భవేత్ ॥ 13**

**ప్ర :** హి = ఏలన, స్త్రీసంభోగః = స్త్రీతోడి సంభోగాసక్తి, దుఃఖాయ = దుఃఖకారకము, పాతాయ చ = పతనహేతువు గూడ, పునః = మరల, సః తు = అదియేమో, ఉచ్ఛిష్టతామ్ = నిషేధింపదగినది,

దైవాత్ = దైవవశమున, అహమ్ = నేను, అస్యాః ప్రాప్తః = దానివలన పొందబడినవాడను, అతః = అందువలన, కిం భవేత్ = మీకు లాభమేమి?

**తా :** స్త్రీసంగమేచ్ఛ దుఃఖహేతువు, పతనహేతువుగూడ. అదియేమో నిషిద్ధమైనది. విధివశమున అది నాకు తగులమైనది. ఆ కారణమున, మీకు నా వలన ప్రయోజనము ఏమి కలుగును?

**శ్లో॥ దేవా ఊచుస్త్వమనఘో జ్ఞానదీపోఽనఘాప్యసౌ ।**
**విద్యా తవ విభో! యస్యాః ప్రసాదాత్సద్గతిః ఖలు ॥ 14**

**శ్లో॥ యథార్కస్య ప్రభా భూమన్విప్రచణ్డాలసఙ్గినీ ।**
**పుణ్యం పాపం చ నాదత్తే తథేయం ప్రకృతిస్తవ ॥ 15**

**ప్ర :** దేవాః ఊచుః = దేవతలిట్లనిరి, (హే) విభో! = ఓ సర్వవ్యాపీ!, త్వమ్ = నీవు, అనఘః = పాపమెఱుగని వాడవు, జ్ఞానదీపః = జ్ఞానతేజస్వివి, అసౌ అపి = ఆమెయున్నూ, తవ విద్యా = నీ జ్ఞానశక్తి, అనఘా ఖలు! = పాపము లేనిదే కదా, యస్యాః = ఆమెయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, సద్గతిః = మోక్షము, యథా = ఎట్లు, అర్కస్య ప్రభా = సూర్యుని కాంతి, భూమన్ = గొప్పదైనదై, విప్రచణ్డాలసఙ్గినీ = బ్రాహ్మణులతోను, చర్మకారునితోనూ సంబంధము కలదై, పుణ్యం పాపం చ = పుణ్యపాపములను, న+ఆదత్తే = పొందదో, తథా = అట్లు, ఇయం తవ ప్రకృతిః = ఈ నీ ప్రకృతి, స్వభావము.

**తా :** దేవతలిట్లనిరి : ఓ సర్వవ్యాపీ, దత్తప్రభూ! నీవు పాపమంటని వాడవు, జ్ఞానతేజోమయుడవు. నీతోగల యీ స్త్రీయున్నూ పాపములేనిదే. ఈమె నీ ప్రకృతి, జ్ఞానశక్తియే కాని సాధారణ స్త్రీ కాదు. సూర్యుని కాంతి ఉచ్చనీచములను భేదములేక అంతటను ప్రసరించినప్పటికిని, యే మలినమున్నూ దానినంటదు. ఆ జ్ఞానశక్తి అనుగ్రహమువలననే మోక్షము సాధ్యమగును.

**శ్లో॥ శ్రీదత్తః ప్రాహ యద్యేవం భవతాం సంమతం తతః ।**
**యుద్ధాయాహూయతాం దైత్యానిహానయత మా చిరమ్ ॥ 16**

**ప్ర :** శ్రీదత్తః ప్రాహ = శ్రీదత్తుడిట్లనెను, యది భవతాం సంమతం ఏవమ్ = మీకు సమ్మతమైనది యిట్టిదే యైనచో, తతః = ఆ కారణమున, దైత్యాన్ = రాక్షసులను, యుద్ధాయ = యుద్ధమునకై, ఆహూయతామ్ = ఆహ్వానింపుడు, మా చిరమ్ = త్వరలోనే, ఇహ = ఇచ్చటకు, ఆనయత = తీసికొని రండు.

**తా :** శ్రీదత్తు డిట్లనెను : మీ కిట్లే సమ్మతమైనచో, రాక్షసులను యుద్ధమున కాహ్వానించి త్వరలో ఇచటికి కొనిరండు.

**శ్లో॥ తతో హృష్టా సురా జగ్ముర్దైత్యాంస్తేఽపి మహాబలాః ।**
**ముఞ్చతో వివిధాస్త్రౌఘాన్య్యయుధుర్మదవిహ్వలాః ॥ 17**

ప్ర : తతః = అంతట, హృష్టాః సురాః = సంతోషించిన దేవతలు, దైత్యాన్ = రాక్షసులను గూర్చి, జగ్ముః= వెడలిరి, తే మహాబలాః అపి = ఆ మహాబలులున్నూ, వివిధ+అస్త్ర+ఓఘాన్ = నానావిధములైన అస్త్రముల ప్రవాహములను, ముఞ్చతః = విడచుచున్నవారగుచు, మదవిహ్వలాః = మదముతో వివశులై, యుయుధుః = యుద్ధము చేసిరి.

**తా :** అంతట దేవతలు సంతోషించి రాక్షసులకొరకు వెడలిరి. ఆ మహాబలశాలులైన రాక్షసులున్నూ నానావిధములైన అస్త్రములను ప్రవాహమువలె వేయుచు మదమున అదుపుదప్పి యుద్ధము జేసిరి.

**శ్లో॥ పలాయనపరా ఆసన్ దేవాస్తేఽసురపీడితాః ।**
**పృష్ఠతోఽనువ్రజన్తస్తే దైత్యా దత్తాశ్రమం గతాః ॥ 18**

ప్ర : తే దేవాః = ఆ దేవతలు, అసురపీడితాః = రాక్షసులచే బాధితులై, పలాయనపరాః+ఆసన్ = పారిపోవుటయందాసక్తి గలవారైరి, పృష్ఠతః = వెనుకనుండి, అనువ్రజన్తః = అనుసరించి పోవుచున్నవారై, తే దైత్యాః = ఆ రాక్షసులున్నూ, దత్తాశ్రమం గతాః = శ్రీదత్తుని ఆశ్రమమును ప్రవేశించిరి.

**తా :** ఆ యుద్ధములో రాక్షసపీడితులై దేవతలు పారిపోవుచుండగా, వారి వెనుకనే రాక్షసులున్నూ శ్రీదత్తప్రభుని ఆశ్రమమును ప్రవేశించిరి.

**శ్లో॥ కాలయన్తః సురాన్దైత్యా హన్యమానాన్భయాతురాన్ ।**
**శ్రీదత్తపృష్ఠసంలగ్నాన్సమస్తాఞ్ఛరణార్థినః ॥ 19**

**శ్లో॥ దదృశుస్తే మహాత్మానం దత్తాత్రేయం దిగమ్బరమ్ ।**
**తన్వీం తద్వామపార్శ్వస్థాం చార్వఙ్గీం ప్రమదోత్తమామ్ ॥ 20**

**శ్లో॥ పద్మపత్రాయతాక్షీం తాం సుదతీం సుస్తనీం శుభామ్ ।**
**సర్వయోషిద్గుణాఢ్యాం తే దృష్ట్వాఽఽసన్కామమూర్ఛితాః ॥ 21**

ప్ర : హన్యమానాన్ భయాతురాన్ = మృత్యుభయముతో కలవరపడుచున్న, శ్రీదత్తపృష్ఠసంలగ్నాన్ = శ్రీదత్తుని వెనుకచేరియున్న, శరణార్థినః = శరణువేడియున్న, సమస్తాన్ సురాన్ = దేవతలందఱును, కాలయన్తః = వెంటాడుచు వచ్చిన, దైత్యాః = రాక్షసులు, మహాత్మానమ్ = మహాత్ముడైన, దిగమ్బరం దత్తాత్రేయమ్ = దిగంబరుడైన దత్తాత్రేయుని, దదృశుః = చూచిరి, తత్ = వానియొక్క, వామపార్శ్వస్థామ్ = ఎడమప్రక్కనున్న, తన్వీమ్ = తీగవంటి శరీరము గలదానిని, చారు+అఙ్గీమ్ = అందమైన అవయవముల పొందికగల దానిని, సుదతీమ్ = చక్కని పలువరుస గలదానిని, సుస్తనీమ్ = చక్కని చన్నవగలదానిని, శుభామ్ = శుభదర్శనము గలదానిని, సర్వయోషిత్గుణ+ఆఢ్యామ్ = స్త్రీ గుణములన్నియు రాశిబోసినట్లున్నదానిని, తాం

ప్రమద+ఉత్తమామ్ = సర్వోత్తమస్త్రీయైన ఆమెను, దృష్ట్వా = చూచి, తే = వారు, కామమూర్ఛితాః ఆసన్ = కామముతో మతిభ్రష్టులయిరి.

**తా :** దేవతలు మృత్యుభయముతో పారిపోయి శ్రీదత్తుని శరణువేడి వాని వెనుక చేరిరి. శ్రీదత్తుడప్పుడు దిగంబరుడై యున్నాడు, వాని ఎడమభాగమున మూర్తీభవించిన స్త్రీ సౌందర్య మనునట్లున్న చక్కని సుందరాంగి యొకర్తును చూచి చూడగనే రాక్షసులకు కామోద్రేకము మిక్కుటమై మతిభ్రష్టులయిరి. *

**శ్లో॥ సాభిలాషస్తతో దైత్యాస్త్యక్త్వా దేవాన్వధూం వరామ్ ।**
**హర్తుం మనో దధుః సర్వే తత్సౌన్దర్యవిమోహితాః ॥ 22**

**ప్ర :** తతః = అంతట, దైత్యాః = రాక్షసులు, దేవాన్ = దేవతలను, త్యక్త్వా = విడచి, సాభిలాషః = అభిలాషగలవారై, వరాం వధూమ్ = ఉత్తమస్త్రీయగు ఆమెను, తత్ = ఆమెయొక్క, సౌన్దర్యవిమోహితాః = అందమునకు వివశులై, సర్వే = అందఱును, హర్తుమ్ = అపహరించుటకు, మనః దధుః = మనస్సును దృఢము జేసికొనిరి.

**తా :** అంతట రాక్షసులు దేవతలను విడచి, ఆ స్త్రీసౌందర్యమునకు ముగ్ధులై ఆమెను అపహరించి తీసికొనిపోవ నిశ్చయించిరి.

**శ్లో॥ వయం స్త్రీరత్నలాభేన కృతార్థా ఇతి తేఽసురాః ।**
**ఉక్త్వా బలాత్ స్త్రియం క్షిప్త్వా శిబికాయాం చ కే దధుః ॥ 23**

**ప్ర :** తే అసురాః = ఆ రాక్షసులు, వయమ్ = మేము, స్త్రీరత్న-లాభేన = రత్నమువంటి యీ స్త్రీని పొందుటచేత, కృతార్థాః = కోరిక తీరిన వారమైతిమి, ఇతి = అని, ఉక్త్వా = పలికి, స్త్రియమ్ = ఆ స్త్రీని, బలాత్ = బలవంతముగ, శిబికాయామ్ = పల్లకిలో, క్షిప్త్వా = ఉంచి, చ = మరియు, కే = తలపై, దధుః = ఎత్తుకొని మోసిరి.

**తా :** ఆ రాక్షసులు తమకు రత్నము వంటి స్త్రీ దొరికినందుకు సంతోషించి, ఆమెను బలవంతముగా పల్లకి నెక్కించి, ఆ పల్లకి తాము తలలపై మోసిరి.

**శ్లో॥ స్వస్థానాభిముఖా జగ్ముః సానురాగాః స్మరాతురాః ।**
**యోగీన్ద్రోఽథ ప్రహస్యాహ దానవాన్ పశ్యతామరాః! ॥ 24**

**ప్ర :** స్వస్థాన+అభిముఖాః = తమ స్థానముల దిశగా, సానురాగాః = ఆ స్త్రీయందు ప్రేమగలవారై, స్మర+ఆతురాః = కామతీవ్రతగలవారై, జగ్ముః = వెడలిరి, అథ = అంతట, యోగీన్ద్రః = యోగిరాజైన శ్రీదత్తుడు, ప్రహస్య = నవ్వి, ఆహ = ఇట్లనెను, అమరాః = ఓ దేవతలారా!, దానవాన్ = రాక్షసులను, పశ్యత = చూడుడు.

**తా :** రాక్షసులు (ఆ పల్లకిని మోయుచు) ఆ స్త్రీయందనురాగము వెల్లువకాగా, కామము తీవ్రము కాగా, తమ నివాసములకేగిరి. అప్పుడు శ్రీదత్తయోగీంద్రుడు నవ్వి, ఓ దేవతలారా! ఆ రాక్షసులను చూడుడు, అనెను.

**శ్లో॥ పరాఙ్గనాభిస్పర్శోత్థపాపేనాతిబలీయసా ।**
**హతశ్రీకా హతబలా జాతా ఏతే న సంశయః ॥ 25**

**ప్ర :** అతిబలీయసా = అత్యంత బలీయమైన, పరాఙ్గనా+అభిస్పర్శ+ఉత్థ–పాపేన = అన్యుల స్త్రీని తాకినందువలన కలిగిన పాపముచే, ఏతే = వీరు, ఈ రాక్షసులు, హతశ్రీకాః = సౌభాగ్యమును, వైభవమును కోల్పడినవారు, హతబలాః = బలమును పోగొట్టుకొన్నవారు, జాతాః = అయినారు, న సంశయః = అనుమానము లేదు.

**తా :** అన్యస్త్రీస్పర్శవలన పాపోపహతులై ఈ రాక్షసులు తమ భాగ్యవైభవములను, బలమును కూడ కోల్పోయి, బలహీనులు నిస్తేజులు అయినారు. ఇది నిజము. ఆ పాపము అంత బలమైనది.

**శ్లో॥ శ్రీః పదగాఽఽలయదాత్రీ, సక్థిగతాఽంశుకదాత్రీ ।**
**గుహ్యగతా ప్రమదాదాక్రోడగతాఽర్భకదా చేత్ ॥ 26**

**శ్లో॥ చేద్ధృది కామితదాత్రీ, కణ్ఠగతా వసుదాత్రీ ।**
**చేన్ముఖగాఽశనవాగ్దా, మూర్ధగతా తు శిరో దా ॥ 27**

**ప్ర :** శ్రీః = లక్ష్మి, పదగా = పాదములందు నెలకొన్నదైనచో, ఆలయదాత్రీ = గృహము ననుగ్రహించును, సక్థిగతా = తొడపై నెక్కినచో, అంశుకదాత్రీ = వస్త్రములనుగ్రహించును, గుహ్యగతా = మర్మాంగమున నున్నచో, ప్రమదాదా = స్త్రీసుఖము నిచ్చును, క్రోడగతా చేత్ = భుజాంతరమున నున్నచో, అర్భకదా = సంతతినిచ్చును, హృది చేత్ = హృదయము నందైనచో, కామితదాత్రీ = కోరినదెల్లనిచ్చును, కణ్ఠగతా = కంఠముననున్నదై, వసుదాత్రీ = ధనము నిచ్చును, ముఖగా చేత్ = ముఖమునందున్నచో, అశనవాగ్దా = భోజనమును, వాక్కును ప్రసాదించును, మూర్ధగతా తు = తలకెక్కినదైనచో, శిరః దా = తలను త్రెంచును.

**తా :** లక్ష్మీదేవి శక్తి యిట్లని చెప్పబడినది : ఆమె వ్యక్తి పాదములందున్న గృహమును; తొడపైనున్న వస్త్రమును; మర్మాంగమున నున్న స్త్రీ సుఖమును; భుజాంతరమున నున్న సంతతిని; హృదయమునందున్న కామితములను; కంఠమునందున్న ధనమును; ముఖమునందున్న భోజనమును, వాక్కును; కాని తలకెక్కినచో, ఆ తలను తెగత్రెంచును.

**శ్లో॥ తన్మూర్ధగాఽధునేయం శ్రీః శీర్షాణ్యుత్కృత్య సత్వరమ్ ।**
**ఆయాస్యత్యత్ర నైవాత్ర శఙ్కా హ్యేతే మృతోపమాః ॥ 28**

**ప్ర :** అధునా = నేడు, ఇయం శ్రీః = ఈ లక్ష్మి, తత్ = ఆ రాక్షసులయొక్క మూర్ధగా = తలనెక్కినది, సత్వరమ్ = త్వరలో, శీర్షాణి = తలలను, ఉత్కృత్య = త్రెంచి, అత్ర = ఇచ్చటకు, ఆయాస్యతి = వచ్చును, అత్ర = ఈ విషయమున, శఙ్కా = సంశయము, న ఏవ = లేనే లేదు, ఏతే = వీరు, మృత+ఉపమాః హి = చచ్చినవారితో సమానులే.

**తా :** ఇప్పుడు ఈ రాక్షసులు ఈ లక్ష్మిని తలకెత్తికొని వెళ్ళిరి కదా. ఆ కారణమున వారు చచ్చినవారితో సమానులే సుమా. త్వరలోనే వారి తలలను త్రుంచి ఆమె తిరిగి ఇచ్చటకు వచ్చును. ఇది నిశ్చయము.

**శ్లో॥ హన్యతాం తన్న భేతవ్యం ప్రాప్తోఽద్య విజయక్షణః ।**
**భవన్తోఽత్ర నిమిత్తం తే హతప్రాయాః శ్రియార్దితాః ॥ 29**

**ప్ర :** హన్యతామ్ = చంపుడు, తత్ = ఈ విషయమున, న భేతవ్యమ్ = భయపడవలదు, అద్య = ఇప్పుడు, విజయక్షణః = విజయము లభించు సమయము, ప్రాప్తః = చేరువైనది, అత్ర = ఈ విషయమున, తే = వారు, శ్రియా = లక్ష్మిచేత, అర్దితాః = కొట్టబడినవారై, హతప్రాయాః = చచ్చినవారితో సమానులైనారు, భవన్తః = మీరు, నిమిత్తమ్ = ఉపకరణమాత్రులే.

**తా :** వారిని చంపుడు. భయపడవలదు. ఇది మీకే చేరువైన విజయక్షణము. వారు లక్ష్మిచేత మర్దింపబడి మృతప్రాయులై యున్నారు. మీరు నిమిత్తమాత్రులు కండు.

**శ్లో॥ ఇత్యుక్తాస్తే సురా గత్వా శస్త్రైర్దైత్యశిరాంసి ।**
**ఫలానీవాశు వృక్షేభ్యః పాతయామాసురుద్యతాః ॥ 30**

**ప్ర :** ఇతి = అని, ఉక్తాః = చెప్పబడినవారై, సురాః తే = ఆ దేవతలు, గత్వా = వెళ్లి, శస్త్రైః = ఆయుధములతో, దైత్యశిరాంసి = రాక్షసుల తలలను, వృక్షేభ్యః = చెట్లనుండి, ఫలాని ఇవ = పండ్లనువలె, ఆశు = సులభముగా, ఉద్యతాః = ఉద్యమించినవారై, పాతయామాసుః = పడగొట్టిరి.

**తా :** ఇట్లు దత్తాత్రేయు డనగా విని, దేవతలు వెంటనే మరలిపోయి చెట్లనుండి పండ్లను రాలగొట్టినంత సులభముగా రాక్షసుల తలలను పనిగొని తమ ఆయుధములతో రాలగొట్టిరి.

**శ్లో॥ హతేషు తేష్వజం ప్రాప్తా శ్రీరుత్పత్త్యాఽవిభాగినీ ।**
**దేవా అపి యయుః స్వర్గం పూర్వవచ్ఛ్రీధరాజ్ఞయా ॥ 31**

**ప్ర :** ఉత్పత్త్యా = పుట్టుకతో, స్వభావమువలన, అవిభాగినీ = విభజింపరానిదైన, తేషు హతేషు = ఆ మృతులైన రాక్షసులందున్న, శ్రీః = లక్ష్మి, అజమ్ = విష్ణువును, ప్రాప్తా = పొందినదాయెను, దేవాః అపి = దేవతలున్నూ, శ్రీధర+ఆజ్ఞయా = విష్ణువు ఆజ్ఞచేత, పూర్వవత్ = మునుపటివలె, స్వర్గం యయుః = స్వర్గమునకు పోయిరి.

**తా :** లక్ష్మీదేవి పుట్టుకతో, స్వభావముతో అద్వితీయురాలు, అవిభాజ్య. మృతులైన రాక్షసులందున్న ఆమె తేజోఽంశ విష్ణువును చేరినది. ఆ శ్రీధరుని ఆజ్ఞననుసరించి దేవతలునూ యథాపూర్వం స్వర్గమునకు పోయిరి.

**శ్లో॥ ఏవం ప్రభావః శ్రీదత్త ఈశస్తం శరణం వ్రజ ।**
**ఇత్యుక్తః సోఽర్జునస్తేన శ్రీదత్తాశ్రమమాయయౌ ॥ 32**

**ప్ర :** ఏవం ప్రభావః = ఇట్టి ప్రభావము గలవాడు, ఈశః శ్రీదత్తః = ప్రభువైన శ్రీదత్తుడు, తమ్ = వానిని, శరణం వ్రజ = శరణు వేడుము, ఇతి = అని, తేన = వానిచే, ఉక్తః = చెప్పబడినవాడై, సః అర్జునః = ఆ అర్జునుడు, శ్రీదత్త+ఆశ్రమమ్ = శ్రీదత్తుని ఆశ్రమమును గూర్చి, ఆయయౌ = చేరబోయెను.

**తా :** ఇంతటి శక్తిశాలి శ్రీదత్తప్రభువు, వానిని శరణు వేడుము, అని వానిచే చెప్పబడి అర్జునుడు శ్రీదత్తాశ్రమము దిశగా వెడలెను.

**శ్లో॥ గర్గోక్తిశ్రవణాదేవ భక్త్యుత్కణ్ఠితధీర్నృపః ।**
**సహ్యాద్రిమేత్య యోగీన్ద్రం దృష్ట్వా హర్షమవాప సః ॥ 33**

**ప్ర :** గర్గ+ఉక్తిశ్రవణాత్+ఏవ = గర్గమహర్షి మాటలు వినినందువలననే, భక్తి+ఉత్+కంఠితధీః = భక్తిచేత ఆసక్తిగొన్న బుద్ధిగలవాడగు, నృపః= రాజు అర్జునుడు, సహ్యాద్రిం+ఏత్య = సహ్యాద్రిని చేరి, యోగీన్ద్రమ్ = యోగిశ్రేష్ఠుడైన శ్రీదత్తుని, దృష్ట్వా = చూచి, సః = ఆతడు, హర్షమ్ = సంతోషమును, అవాప = పొందెను.

**తా :** గర్గుని మాటలతో కలిగిన భక్తిచే ఆసక్తిగొని రాజు అర్జునుడు సహ్యాద్రిని చేరి, శ్రీదత్తుని దర్శించి, సంతోషించెను.

**శ్లో॥ అస్య దాసో భవామీతి నిశ్చిత్యానుదినం స్మరన్ ।**
**సిషేవే పరమానన్దో వారితో భర్త్సితోఽపి సః ॥ 34**

**ప్ర :** అస్య = ఈ శ్రీ దత్తునికి, దాసః = సేవకుడను, భవామి = అగుదును, ఇతి = అని, నిశ్చిత్య = నిశ్చయించి, అనుదినమ్ = దినము వెంట దినముగా, స్మరన్ = స్మరించుచు, వారితః = నిషేధింపబడినవాడు, భర్త్సితః అపి = దండింపబడిన వాడును అయినను, సః = ఆతడు, పరమ+ఆనన్దః = మిక్కిలి సంతోషముతో, సిషేవే = సేవించెను.

**తా :** అర్జునుడు తాను శ్రీదత్తుని సేవించుటకు నిశ్చయించికొని, ప్రతి రోజున్నూ స్మరించుచు, పెద్దలు వానిని వారించినను, దండించినను వినక, సంతోషముతో శ్రీదత్తుని సేవించెను. *

**శ్లో॥ పాదాబ్జసంవాహనేన మద్యాద్యాహరణేన చ ।**
**స్రక్చన్దనసుగన్ధాదిఫలాద్యానయనేన చ ॥ 35**

శ్లో॥ నిద్రాలస్యాది సంత్యజ్య సదా తద్గతమానసః ।
ఇఙ్గితజ్ఞోఽభజద్భూప ఉచ్ఛిష్టోపాసనేన చ ॥ 36

ప్ర : పాద+అఙ్గ సంవాహనేన = కాళ్ళను, ఒడలిని మర్దించుటతోను, మద్య+ఆది+ఆహరణేన చ = మద్యము మొదలగువానిని అందించుటతోనున్ను, స్రక్+చన్దన సుగన్ధ+ఆది = పూమాలలను మంచిగంధము మొదలగు వానిని, ఫల+ఆది= పండ్లు మొదలగువానిని, ఆనయనేన చ = తీసికొని వచ్చుటచేతనున్ను, నిద్రా+ఆలస్య+ఆది = నిద్రను ఆలస్యము మొదలగు వానిని, సంత్యజ్య = పూర్తిగా విడచి, సదా = ఎల్లవేళల, తద్గత–మానసః = వానియందే లగ్నమైన మనస్సుగలవాడై, ఇఙ్గితజ్ఞః = శ్రీ దత్తుని మనస్సు నెఱిగినవాడై, ఉచ్ఛిష్ట+ఉపాసనేన చ = ఎంగిలిని భుజించు ఆరాధన విధానమునను గూడ, భూపః = రాజు అర్జునుడు, అభజత్ = సేవించెను.

**తా :** శ్రీదత్తుని పాదములను శరీరమును మృదువుగా మర్దించుచు, వానికై మద్యాదులను తెచ్చి యిచ్చుచు; పూదండలను, చందన గంధమును, పండ్లను, ఇట్టివానిని తెచ్చి యిచ్చుచును; నిద్రలో దోగక, కర్తవ్యపాలనలో అలసత్వము లేక, ఎల్లవేళల శ్రీదత్తునియందే మనస్సు ఉంచి, ఆ స్వామి అవసరముల నెఱిగి, ఆ స్వామి తిని విడచిన పదార్థములను భుజించుచు, నిష్ఠతో రాజు అర్జునుడు సేవించినాడు.

శ్లో॥ భగవానపి తద్భావం పరీక్షితుమపాతయత్ ।
దృష్టిమాత్రేణ దోర్యుగ్మం స్మయమానస్తమాహ చ ॥ 37

ప్ర : భగవాన్ అపి = శ్రీ దత్తభగవానుడున్నూ, తత్ భావమ్ = ఆ అర్జునుని మనోనిశ్చయమును, పరీక్షితుమ్ = పరీక్షించుటకు, దృష్టిమాత్రేణ = తన చూపుచేత మాత్రమే, దోః యుగ్మమ్ = బాహుద్వయమును (రెండు భుజములను), అపాతయత్ = పడిపోవునట్లు చేసెను, స్మయమానః చ = ఆశ్చర్యపడుచున్నవాడు కూడ అగుచు, తం ఆహ = వానితో నిట్లనెను.

**తా :** శ్రీదత్తభగవానుడున్నూ ఆ రాకుమారుడగు అర్జునుని భావమును పరీక్షింపగోరి వాని భుజములను రెండిటిని తన చూపుతో పడిపోవునట్లు పనికి రాకుండునట్లు చేసి, ఆశ్చర్యపడుచున్న వానివలె కన్పడుచు, అర్జునరాకుమారున కిట్లనెను.

శ్లో॥ గచ్ఛ గచ్ఛాధునేతస్త్వం గలితం తే భుజద్వయమ్ ।
మరిష్యసీతః పరం వాఽశుద్ధసఙ్గో న శోభనః ॥ 38

శ్లో॥ సంత్యక్తాఖిలధర్మాహం భక్ష్యాభక్ష్యవివర్జితః ।
నగ్న ఉన్మత్తవద్వర్తే నగ్నా వామేయమఙ్కగా ॥ 39

శ్లో॥ భూపైవం కుత్సితోఽస్మీహ మమ సంసర్గదోషతః ।
పాపోత్థేనాగ్నినా దగ్ధం తవ చారు భుజద్వయమ్ ॥ 40

**ప్ర :** త్వమ్ = నీవు, అధునా = ఇప్పుడే, ఇతః = ఇటనుండి, గచ్ఛ గచ్ఛ = పో పొమ్ము, తే = నీ యొక్క, భుజద్వయమ్ = రెండు భుజములును, గలితమ్ = జారిపోయినవి, ఇతః పరమ్ = ఇక ముందు, అశుద్ధసఙ్గః = అపరిశుభ్రమైన వానితో సంబంధము గలవాడవై, మరిష్యసి = చచ్చిపోదువు, వా = లేక, న శోభనః = శుభములు పొందలేవు, అహమ్ = నేను, సంత్యక్త = విడువబడిన, అఖిలధర్మా = అన్ని ధర్మములు గలవాడను, భక్ష్య+అభక్ష్య = తినదగినవి, తినరానివి అను భేదము, వివర్జితః = విడచిన వాడను, నగ్నః = దిగంబరుడను, ఉన్మత్తవత్ = పిచ్చివానివలె, వర్తే = ప్రవర్తింతును, ఇయం వామా అఙ్కగా = ఒడియందున్న ఈ సుందరి, నగ్నా = దిగంబరి, భూప! = ఓ రాజా!, ఏవమ్ = ఈ రీతి, కుత్సితః అస్మి = నీచస్థితిలో ఉన్నవాడను, ఇహ = ఇక్కడ, మమ సంసర్గదోషతః = నా స్నేహదోషమువలన, పాప+ఉత్థేన+అగ్నినా = పాపముచే ప్రజ్వరిల్లిన అగ్నిచే, తవ = నీ యొక్క, చారు = అందమైన, భుజద్వయమ్ = భుజములు రెండున్నూ, దగ్ధమ్ = బలహీనమై నశించినవి.

**తా :** నీ విప్పుడే ఇటనుండి వెడలి పొమ్ము. నీ భుజములు జారిపోయినవి. అశుద్ధసంగము వలన ఇకముందు శుభములేమి పొందగలవు? మరణింతువు. నేను అన్ని ధర్మములను విడచినవాడను. నాకు తినరానిది లేదు. దిగంబరుడను. పిచ్చివానివలె ప్రవర్తింతును. నా ఒడియందున్న ఈ సుందరియును దిగంబరి. రాజా! ఈ రీతి నేను నీచస్థితిలో ఉన్నాను. నా స్నేహమువలన పాపము ప్రజ్వరిల్లి నీ చక్కని భుజములను అక్కఱకు రాకుండ చేసినది. *

**శ్లో॥ తచ్ఛ్రుత్వా విస్మితో రాజా స్మృత్వా గర్గవచోఽవదత్ ।**
**కిం మాం మోహయసీశ! త్వం వాక్యైర్లోకానుసారిభిః ॥ 41**

**ప్ర :** తత్ శ్రుత్వా = ఆ మాటలు విని, విస్మితః = చకితుడైన, రాజా = రాజు, గర్గవచః = గర్గమహర్షి మాటలను, స్మృత్వా = తలచి, అవదత్ = ఇట్లనెను, త్వమ్ = నీవు, లోక+అనుసారిభిః = లోకాచారముననుసరించునవైన, వాక్యైః = మాటలతో, మామ్ = నన్ను, మోహయసి కిం ఈశ = భ్రమింపజేయుచున్నావా యేమి, స్వామీ!?

**తా :** రాజు ఆ మాటలు విని చకితుడై, గర్గుని మాటలు దలచి తెప్పరిల్లి, ఇట్లనెను : ఓ స్వామీ! లోకాచారముగ చెప్పుకొను మాటలతో నీవు నన్ను భ్రమపెట్టుచున్నావా?

**శ్లో॥ దేవ! త్వమసి సర్వాత్మా స్వాం మాయాం సముపాశ్రితః ।**
**అనఘస్త్వం తథా తేఽసౌ దేవీ మాయాఽనపాయినీ ॥ 42**

**ప్ర :** దేవ! = ఓ స్వామీ!, త్వమ్ = నీవు, స్వాం మాయామ్ = నీ మాయను, సముపాశ్రితః = ఆశ్రయించినవాడవైన, సర్వాత్మా అసి = నీవు సర్వాత్మకుడవు. త్వమ్ = నీవు, అనఘః = పాపము లేనివాడవు, తథా = అట్లే, అసౌ దేవీ = ఈ దేవి, తే మాయా అనపాయినీ = నీ యొక్క అవినాశియైన శాశ్వతీ మాయాదేవి.

**తా :** ఓ స్వామీ! నీవు సర్వాత్మకుడవు. నీ మాయను ఆశ్రయించి ఇట్లున్నావు. ఈ దేవియే నీమాయ, శాశ్వతి. నీవు పాపములేని వాడవు. నీ మాయయునూ పాపము లేనిదే.

**శ్లో॥ యేఽనీశా ఉభయో రూపం విజ్ఞాతుం వామభేదతః ।**
**శాస్త్రైర్విధినిషేధాభ్యాం నియమ్యాస్తే న చాపరే ॥ 43**

**ప్ర :** యే = ఎవరు, వామ్ = మీ యొక్క, ఉభయః రూపమ్ = రూపములను రెండిటిని, అభేదతః = భేదములేని ఏకైక సత్యమని, విజ్ఞాతుమ్ = విశేషముగా తెలిసికొనుటకు, అనీశాః = అసమర్థులో, శాస్త్రైః = శాస్త్రములచేత, విధినిషేధాభ్యామ్ = విధి నిషేధములవలన, నియమ్య ఆస్తే = నియమించబడి యున్నారు. అపరే = అన్యులు, న చ = కారు.

**తా :** నీ సర్వాత్మకరూపమును, మాయాశ్రితరూపమును వేర్వేరని తలంచుచు, వాని ఏకత్వము నెఱుగకున్నారో, వారికై శాస్త్రములు విధులను నిషేధములను యేర్పరచినవి. నీ ద్వయరూపము యొక్క అద్వయతత్త్వము నెఱిగినవారికీ శాస్త్రనియమములు లేవు.

**శ్లో॥ ఇత్యుక్తోఽవ్యాజమీశస్తం ప్రత్యువాచ ప్రసన్నధీః ।**
**కార్తవీర్య! మహావీర్య! త్వయా సర్వం వశీకృతమ్ ॥ 44**

**ప్ర :** ఇతి+ఉక్తః = ఇట్లు చెప్పబడినవాడై, అవ్యాజమ్ = కారణములేకయే, ప్రసన్నధీః = ప్రసన్నమైన మనస్సుగలవాడై, ఈశః = శ్రీదత్తప్రభువు, తమ్ = ఆ అర్జునుని, ప్రతి+ఉవాచ = బదులు పలికెను, మహావీర్య = మహావీరుడైన, కార్తవీర్య = కృతవీర్యుని కుమారుడా!, త్వయా = నీచేత, సర్వమ్ = అంతయు, వశీకృతమ్ = వశము జేసికొన బడినది.

**శ్లో॥ వరం వృణీష్వ గుహ్యం మే త్వయా తత్త్వం సమీరితమ్ ।**
**సంతుష్టస్తేన తే దాస్యే దుర్లభాంశ్చ వరాన్వర ॥ 45**

**ప్ర :** వరం వృణీష్వ = వరము కోరుకొనుము, మే = నా యొక్క, గుహ్యం తత్త్వమ్ = రహస్యమైన తత్త్వము, త్వయా = నీ చేత, సమీరితమ్ = వివరించబడినది, తేన = దానిచే, సంతుష్టః = సంతోషించిన వాడనై, తే =నీకు, దుర్లభాన్ వరాన్ చ = కష్టసాధ్యమైన వరములను గూడ, దాస్యే = ఇచ్చెదను, వర = కోరుకొనుము.

**శ్లో॥ యే మామర్చన్తి తత్త్వజ్ఞా విమలేనైవ చేతసా ।**
**తేభ్యోఽభీష్టం ప్రయచ్ఛామి ఘాతయిష్యామి చేతరాన్ ॥ 46**

**ప్ర :** యే తత్త్వజ్ఞాః = యే తత్త్వమెఱిగినవారు, విమలేన చేతసా ఏవ = నిర్మలమైన మనస్సుతోనే, మామ్ =నన్ను, అర్చన్తి = పూజించుచున్నారో, తేభ్యః = వారికై, అభీష్టమ్ = మిక్కిలి ప్రియమైన దానిని, ప్రయచ్ఛామి = ప్రసాదింతును, ఇతరాన్ చ = ఇతరులను, ఘాతయిష్యామి = నశింపజేతును.

**తా (శ్లో.44-46) :** ఆ మాటలు విని దత్తప్రభువు, విశేషకారణము లేకుండగనే ప్రసన్న మనస్కుడై, ఇట్లనినాడు : ఓ కృతవీర్యకుమారా! నీవు తెలియదగిన దానిని తెలిసికొంటివి. నా తత్త్వసత్యమును గ్రహించితివి. సంతోషమైనది. దుర్లభమైన అలౌకికమైన వరములను గూడ అనుగ్రహింతును. కోరుకొనుము. నిర్మలమనస్కులై తత్త్వమెఱిగి నన్నారాధించిన వారికి ప్రియము చేకూర్తును. అన్యులను తుదముట్టింతును.

**శ్లో॥ పులకాఙ్కితసర్వాఙ్గః కార్తవీర్యోఽవదన్నతః ।**
**భగవంస్త్వం ప్రసన్నశ్చేత్తత్ప్రదేహ్యృద్ధిముత్తమామ్ ॥ 47**

**శ్లో॥ యథా ప్రజాపాలనజమర్థధర్మమవాప్నుయామ్ ।**
**పరానుస్మరణజ్ఞానం ప్రసిద్ధద్వన్ద్వతాఽపి చ ॥ 48**

**శ్లో॥ సహస్రమిచ్ఛయా మేఽస్తు బాహూనాం లఘిమా గుణః ।**
**అసఙ్గా గతయః సన్తు శైలాకాశామ్బుభూమిషు ॥ 49**

**శ్లో॥ పాతాలేషు చ సర్వేషు సర్వచిత్తజ్ఞతా సదా ।**
**తథోన్మార్గప్రవృత్తస్య సన్తు మే మార్గదర్శకాః ॥ 50**

**శ్లో॥ సన్తు నోఽతిథయః శ్లాఘ్యావసు చైవాక్షయం సదా ।**
**అనష్టద్రవ్యతా క్వాపి మమానుస్మరణ చ ॥ 51**

**శ్లో॥ త్వయ్యస్త్వనన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।**
**ఆయుష్మత్తాస్తు సామ్రాజ్యం వధః ఖ్యాత్యాధికాన్నరాత్ ॥ 52**

**ప్ర :** కార్తవీర్యః = కార్తవీర్యార్జునుడు, పులకాఙ్కిత = పులకించిన, సర్వాఙ్గః = శరీరము గలవాడై, నతః = వినయముతో వంగి నమస్కరించుచు, అవదత్ = పలికెను, భగవన్ = ఓ స్వామీ!, త్వమ్ = నీవు, ప్రసన్నః చేత్ = ప్రసన్నుడవైనచో, తత్ = అంత, ఉత్తమాం ఋద్ధిమ్ = సర్వశ్రేష్ఠమైన వృద్ధిని, దేహి = ఇమ్ము, యథా = యే రీతి, ప్రజాపాలనజమ్ = ప్రజాపాలనలో యేర్పడు, అర్థధర్మమ్ = అర్థమును ధర్మమును (లేక, అర్థసంబంధి ధర్మమును), అవాప్నుయామ్ = పొందుదునో (అట్లు), పరానుస్మరణజ్ఞానమ్ = ఇతరుల జ్ఞాపకముల గుర్తింపు (లేక, మిగత (గత) జన్మల జ్ఞాపకముల జ్ఞానము, ప్రసిద్ధద్వన్ద్వతా అపి చ = ప్రకృతిసిద్ధమైన జీవ-దేవ ద్వంద్వముల జ్ఞానమున్నూ, (దేహి = ఇమ్ము), మే = నాకు, ఇచ్ఛయా = నేను కోరినంతనే, బాహూనాం సహస్రమ్ = వేయి బాహువులు, అస్తు = కలుగుగాక!, లఘిమా గుణః = లఘిమ యనబడు సిద్ధి, శైల+ఆకాశ+అంబు భూమిషు = పర్వతములందు, ఆకాశమందు, నీటిలో, నేలపై, అసఙ్గా గతయః = వాని నంటని నడకలు, సన్తు = కలుగు గాక!, పాతాలేషు చ = అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాలము లనబడు సప్తపాతాళలోకములలోనూ,

సర్వేషు = అన్నిటియందు, సదా = ఎల్లపుడు, సర్వచిత్తజ్ఞతా = అందరి మనసుల నెఱుగుట, తథా = అట్లే, ఉన్మార్గప్రవృత్తస్య మే = ఊర్ధ్వమార్గమున సంచరించుచున్న నాకు, మార్గదర్శకాః = త్రోవచూపువారు, సన్తు = అగుదురు గాక!, నః = మా యొక్క, అతిథయః = అతిథులు, శ్లాఘ్యాః = మెచ్చదగినవారు, అక్ష్యం ఏవ చ సదా = ఎల్లపుడును కన్నులమందు, వసు = బంగారము, అనష్టద్రవ్యతా = తఱుగుబోని ధనము, క్వ+అపి = ఎప్పుడైనను, మమ అనుస్మరణ చ = నన్ను గురించిన తలంపున్ను, సన్తు = అగునుగాక!, త్వయి అనన్యయోగేన = నీయందు నిశ్చలముగా లగ్నమగుట చేత, అవ్యభిచారిణీ భక్తిః = మరిదేనినైన తలంచని ఏకాగ్రభక్తి, అస్తు = కలుగుగాక!, ఆయుష్మత్తా = దీర్ఘాయువున్నూ, సామ్రాజ్య = సామ్రాజ్యమున్నూ, ఖ్యాతి+అధికాత్+నరాత్ = అధికకీర్తిశాలియైన మానవునివలన, వధః = సంహారమున్నూ, అస్తు = అగుగాక!

**తా :** కార్తవీర్యుడు పులకించి, వినయముతో నమస్కరించి ఇట్లనెను : ఓ స్వామీ! మీరు నా యందు ప్రసన్నులైనచో, నాకు సర్వతోముఖవృద్ధిని ప్రసాదింపుడు. నా ప్రజాపాలన ధర్మబద్ధమై, ఆర్థికసమృద్ధిని గలిగి, నడచుగాక! నాకు గతస్మృతులు గలిగి, ఆధ్యాత్మికపరతగలిగి, నేను తలచినంతనే నాకు వేయి బాహువులు కలుగుగాక! లఘిమాసిద్ధి కలుగుగాక! పర్వతాకాశజల-భూభాగములందు నిరాతంకముగ సంచారము కలుగుగాక! ఊర్ధ్వలోకములయందును అధోలోకము లందును సంచరింతునుగాక! నా పేరు మార్మోగుగాక! నిన్ను మరువక నీ యందు అచంచల భక్తి కలిగియుందును గాక! అధికకీర్తిమంతుడైన నరునిచే నాకు మరణమగుగాక!

**శ్లో॥ ప్రభుః ప్రాహ ప్రార్థితం యత్తత్సర్వం సమవాప్స్యసి ।**
**త్వం మత్ప్రసాదాద్భవితా సప్తద్వీపమహేశ్వరః ॥ 53**

**ప్ర :** ప్రభుః = శ్రీదత్తప్రభువు, ప్రాహ = ఇట్లనెను, యత్ ప్రార్థితమ్ = యేది వరముగా కోరితివో, తత్ సర్వమ్ = అది యంతయు, సమవాప్స్యసి = పొందుచున్నావు, త్వమ్ = నీవు, మత్ ప్రసాదాత్ = నా అనుగ్రహమువలన, సప్తద్వీపమహేశ్వరః = (సప్తద్వీప వసుంధరా అనుటను బట్టి) భూమండలమునంతకు సామ్రాట్టువు, భవితా = కాగలవాడవు.

**తా :** శ్రీదత్తప్రభువు ఇట్లనెను : నీవు కోరినదంతయు పొందగలవు. నా యనుగ్రహమువలన నీవు సమస్తధరాధిపతివి అగుదువు.

**శ్లో॥ ఇత్యుక్తస్తం ప్రణమ్యాశు యయౌ ప్రస్థాపితః పురమ్ ।**
**తతోఽభిషిక్తః సామ్రాజ్యే మునిభిః సోఽర్జున స్తదా ॥ 54**

**ప్ర :** ఇతి ఉక్తః = అని చెప్పబడినవాడై, తం ప్రణమ్య = శ్రీ దత్తునకు నమస్కరించి, ఆశు = వెంటనే, ప్రస్థాపితః = బయలుదేరుట కుద్యుక్తుడై, పురం తతః యయౌ = తన పురమునకు,

అటనుండి వెడలెను, తదా = అప్పుడు, సః అర్జునః = ఆ అర్జునుడు, మునిభిః = మునులచేత, సామ్రాజ్యే = సామ్రాజ్యపాలనయందు, అభిషిక్తః = అభిషేకించబడెను.

**తా :** ఆ మాటలు విని అర్జునుడు శ్రీదత్తునకు నమస్కరించి, ప్రయాణమై అటనుండి తన నగరికి వెడలెను. అప్పుడు మునులు వానిని రాజుగా పట్టాభిషిక్తుని చేసిరి.

**శ్లో॥ తత ఆఘోషయామాస స్థితో రాజ్యే స హైహయః ।**
**అద్యప్రభృతి యః శస్త్రం మామృతేఽన్యో గృహిష్యతి ॥ 55**

**శ్లో॥ స హన్తవ్యో మయా దస్యుః పరహింసారతోఽపి చ ।**
**ఇత్యాజ్ఞప్తేఽభవన్రాష్ట్రే సర్వే భీతా నతా జనాః ॥ 56**

**ప్ర :** తతః = అంతట, సః హైహయః = హైహయుడైన (హేహయ వంశమునకు చెందినవాడైన) ఆ కార్తవీర్యార్జునుడు, అద్యప్రభృతి = నేడు మొదలుకొని, మాం ఋతే = నేను కాక, అన్యః = వేరొకడు, యః = ఎవడు, దస్యుః = వేదనిందకుడు, దొంగ, పరహింసారతః అపి చ = ఇతరులను హింసించుటలో ఆసక్తి గలవాడైనను గూడ, శస్త్రం గృహిష్యతి = ఆయుధము పట్టునో, సః = వాడు, మయా = నా చేత, హన్తవ్యః = చంపబడుటకు అర్హుడు, ఇతి = అని, ఆజ్ఞప్తే = ఆజ్ఞాపింపబడి, రాష్ట్రే = రాజ్యమునందు, సర్వేజనాః = ప్రజలందఱు, భీతాః నతాః = భయము జెందిన వారు, వినమ్రులైనవారు, అభవన్ = అయిరి.

**తా :** అంతట రాజైన హైహయుడు, నేటినుండి వేదనిందకుడైన దస్యుడైన, పరహింసా పరాయణుడైనను, ఆయుధముబట్టినచో, వానిని చంపుదును. ఆయుధముబట్టుట నాకు మాత్రమే చెల్లును, అన్యులకు చెల్లదు, అని ప్రకటించగా, ప్రజలు భయముతో వినమ్రులైరి.

**శ్లో॥ క్షేత్రపాలో గ్రామపాలః పశుపాలః స ఏవ చ ।**
**తపస్వివిప్రపాలోఽర్థధాన్యసేనాపతిః స చ ॥ 57**

**ప్ర :** క్షేత్రపాలః = పొలము కాపుండువాడు, గ్రామపాలః = గ్రామమును రక్షించు అధికారి, పశుపాలః చ = పశువుల కాపరి కూడ, స ఏవ = ఆతడే, సః చ = ఆతడే, అనగారాజు అర్జునుడు, తపస్వివిప్రపాలః = తాపసరక్షకుడు, బ్రాహ్మణరక్షకుడు, అర్థధాన్యసేనాపతిః = ధనాగారమునకు, ధాన్యాగారమునకు, సేనలకు అధిపతి.

**తా :** నాటినుండి రాజు తానే, సర్వరక్షకుడై, పంట పొలములను, పాడి పశువులను, గ్రామ పరిపాలనను, తాపసులను, బ్రాహ్మణులను, ధనాగారమును, ధాన్యాగారమును, సేనలను సంరక్షించుచుండెను.

**శ్లో॥ దస్యువ్యాలాగ్నిశస్త్రారిభయేషుచ్చైర్నిమజ్జతామ్ ।**
**సముద్ధర్తా సదాఽఽపత్సు సర్వేషామఖిలాస్వపి ॥ 58**

ప్ర : దస్యు = దొంగ, వ్యాల = సర్పము, అగ్ని = నిప్పు, శస్త్ర = ఆయుధము, అరి = శత్రువు, భయేషు = వీనివలన భయమునందు, ఉచ్చైః = అధికముగా, నిమజ్జతామ్ = మునిగియున్నవారిని, సముద్ధర్తా = ఉద్ధరించువాడు, సదా = ఎల్లవేళల, ఆపత్సు = ఆపదలందు, అఖిలాసు+అపి = అన్నిటియందును, సర్వేషామ్ = అందఱికి, (సముద్ధర్తా = ఉద్ధరించువాడు).

**తా :** దొంగలవలన, పాములవలన, నిప్పువలన, ఆయుధములవలన, శత్రువులవలన కలుగు భయములలోనూ అన్ని ఆపదలలోనూ నిండుగా మునిగిన వారికి సదా చేయూతగ నుండువాడు.

**శ్లో॥ సంస్మృతో బహుధా యోఽభూద్యోగేనాత్మేవ మాయయా ।**
**అనష్టద్రవ్యతాఽఽరోగ్యం తస్మిఞ్ఛాసతి చాభవత్ ॥ 59**

ప్ర : యః = ఎవడు, యోగేన = యోగశక్తియగు, మాయయా = మాయచే, ఆత్మా+ఇవ సంస్కృతః = సంస్కరింపబడిన, (రూపాంతరితుడైన) తన వలెనే, బహుధా = అనేక విధములుగా, అభూత్ = ఆయెను, తస్మిన్ శాసతి చ = ఆతడు పాలించుచుండగా, అనష్టద్రవ్యతా = తఱుగని ధనము, ఆరోగ్యమ్ = ఆరోగ్యము, చ = కూడ, అభవత్ = కలిగెను.

**తా :** ఆతడు తన యోగమాయచేత అనేకరూపియై అన్ని కార్యములను నిర్వహించినాడు. వాని పాలనలో ధనధాన్యములకు కొదువ లేకుండెను. అందఱు ఆరోగ్యవంతులుగ నుండిరి.

**శ్లో॥ ఇన్ద్రోఽవర్షద్యథాకామం భూశ్చాత్ర సుఫలాభవత్ ।**
**తేనేష్టం బహుభిర్యజ్ఞైః సౌవర్ణవరదక్షిణైః ॥ 60**

ప్ర : ఇన్ద్రః = ఇంద్రుడు, యథాకామమ్ = కోరినంతగా, ఆవర్షత్ = వర్షించెను, అత్ర = అతని రాజ్యమున, భూః చ = భూమియు, సుఫలా = బాగుగా పండినది, అభవత్ = ఆయెను, బహుభిః యజ్ఞైః = మిక్కిలి యజ్ఞములతో, సౌవర్ణవరదక్షిణైః = బంగారముతో కూడిన శ్రేష్ఠమైన దక్షిణలతో, తేన = వానిచేత, ఇష్టమ్ = ప్రియము చేయబడినది.

**తా :** ఇంద్రుడు కోరినంతగా వర్షించినాడు. వాని రాజ్యమున భూమి కూడ చక్కగా ఫలవంతమైనది. ఆతడు మనసారా ఎన్నో యజ్ఞములు చేసి, బంగారమును, శ్రేష్ఠమైన దక్షిణలను యిచ్చి ప్రియము చేసినాడు.

*

**శ్లో॥ త్రైలోక్యే సంచచారాసౌ మాహిష్మత్యాం వసన్నపి ।**
**పఞ్చాశీతిసహస్రాబ్దం సప్తద్వీపాం శశాస గామ్ ॥ 61**

ప్ర : అసౌ = ఆ రాజు అర్జునుడు, మాహిష్మత్యామ్ = తన రాజధానియైన మాహిష్మతీనగరములో, వసన్ అపి = నివసించుచున్నను, త్రైలోక్యే = మూడు లోకములందు, సంచచార = సంచరించెను, సప్తద్వీపాం గాం = సప్తద్వీపములతో కూడిన భూమిని, పఞ్చ+ఆశీతి సహస్ర+అబ్దమ్ = ఎనుబది యైదు వేల సంవత్సరముల కాలము, శశాస = పరిపాలించెను.

**తా :** ఆ రాజు తన రాజనగరిలో నివసించుచునే, ముల్లోకములలో సంచరించినాడు. సప్తద్వీప పర్యంతమైన భూమిని ఆతడు 85,000 సంవత్సరములు పాలించినాడు.

భూమి మొత్తముగ కొన్ని ద్వీపములుగా విభజింపబడియున్నదనియు, ఆ ద్వీపములు నాల్గు అని, ఏడు అని, తొమ్మిది అని, పదియుమూడు అనియు లెక్కగట్టిరి. అందు సప్తద్వీప ప్రకారము ఆ ద్వీపము లేదు ఇవి : జంబూద్వీపము, ప్లక్షద్వీపము, కుశద్వీపము, క్రౌంచద్వీపము, శాకద్వీపము, శాల్మలీద్వీపము, పుష్కరద్వీపము. ఈ ద్వీపములు మానవశరీరములోని మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రార యోగశక్తిస్థానములతో వరుసగా సరి యని చెప్పుట కద్దు.

**శ్లో॥ తీవ్రప్రతాపతేజస్వీ స సహస్రకరోఽర్కవత్ ।**
**అధర్మకారిణో హత్వా స్వయం ధర్మం చచార సః ॥ 62**

**ప్ర :** సః = ఆతడు, అర్కవత్ = సూర్యునివలె, సహస్రకరః = వేయిచేతులుగలవాడై, తీవ్రప్రతాప-తేజస్వీ = తీక్ష్ణమైన శౌర్యముతో వీరుడై తేజరిల్లి, అధర్మకారిణః = అధర్మము చేయువారిని, స్వయమ్ = తానే, హత్వా = చంపి, సః = ఆతడు, ధర్మం చచార = ధర్మము నాచరించెను.

**తా :** ఆ రాజు సూర్యునివలె వేయిచేతులతో ప్రతాపవంతుడై, కీర్తిమంతుడై, స్వయముగా అధర్మము చేయువారిని సంహరించి, ధర్మమును ఆచరించినాడు.

**శ్లో॥ అనఘాం చానఘం మాఘకృష్ణాష్టమ్యాం ప్రపూజ్య సః ।**
**షణ్మన్త్రైర్వైష్ణవైర్విప్రాన్ భోజయిత్వా ప్రజాగరమ్ ॥ 63**

**శ్లో॥ కృత్వా రాత్రౌ పరదినే సమాపయతి స వ్రతమ్ ।**
**కోఽప్యానఘవ్రతమిదం కుర్యాత్ సోఽపి సమృద్ధిభాక్ ॥ 64**

**ప్ర :** సః = ఆ రాజు కార్తవీర్యుడు, మాఘకృష్ణ+అష్టమ్యామ్ = మాఘమాసపు కృష్ణపక్షపు అష్టమినాడు, అనఘామ్ = పాపరహితయైన యోగలక్ష్మిని, చ = మరియు, అనఘమ్ = పాపరహితుడైన శ్రీదత్తప్రభువును, వైష్ణవైః షణ్మన్త్రైః = వైష్ణవ సాంప్రదాయికమైన షణ్మన్త్రములతో, ప్రపూజ్య = పూజించి, విప్రాన్ భోజయిత్వా = బ్రాహ్మణులను భుజింపజేసి, రాత్రౌ ప్రజాగరమ్ = రాత్రి నిద్రించకుండ జాగరణ, కృత్వా = చేసి, పరదినే = మరునాడు, సః = ఆతడు, వ్రతమ్ = వ్రతమును, సమాపయతి = పూర్తిచేయును, ఇదమ్ = ఈ, అనఘవ్రతమ్ = నిష్పాపవ్రతమును, కః అపి కుర్యాత్ = చేసినవాడెవడైనను, సః అపి = ఆతడు కూడ, సమృద్ధి-భాక్ = సకల సమృద్ధిగల వాడగును.

**తా :** ఆ కార్తవీర్యార్జునుడు మాఘకృష్ణ అష్టమినాడు శ్రీదత్తుని, వాని యోగలక్ష్మిని, వైష్ణవ సాంప్రదాయిక షణ్మన్త్రములతో చక్కగ పూజించి, బ్రాహ్మణులకు భోజనమిడి, రాత్రి జాగరణ

చేసి, మరునాడు వ్రతసమాప్తి చేయును. ఇది వాని ఆచారము. ఈ విధి ఎవ్వరైనను యీ అనఘ వ్రతమును చేసినచో, ఆతనికి గూడ సర్వసమృద్ధి కలుగును.

**శ్లో॥ యస్మిన్దినే వరో లబ్ధస్తద్దినే స మహోత్సవమ్ ।**
**చక్రే శశ్వద్దర్శనం చ విభోర్నిత్యం హృది స్మరన్ ॥ 65**

**ప్ర :** యస్మిన్ దినే = ఏ రోజున, వరః లబ్ధః = వరము లభించినదో, తత్ దినే = ఆ రోజున, సః = ఆ రాజు, మహా+ఉత్సవమ్ = గొప్ప సంబరమును, చక్రే = చేసెను, నిత్యమ్ = అనుదినము, హృది = మనసున, స్మరన్ = తలచుచు, విభోః = సర్వవ్యాపియైన దత్తప్రభువుయొక్క, దర్శనం చ = దర్శనమున్నూ, శశ్వత్ = మరల మరల, (చక్రే = చేసెను.)

**తా :** రాజు కార్తవీర్యుడు వరము పొంది వచ్చిన రోజున గొప్పసంబరమును చేసెను. మనసున ఆ దత్తప్రభువును తలచుచు నిత్యము మరల మరల ఆ స్వామిని తన మనసులో దర్శించెను.

**శ్లో॥ న నూనం కార్తవీర్యస్య గతిం యాస్యన్తి పార్థివాః ।**
**యజ్ఞదానతపోయోగశ్రుతవీర్యజయాదిభిః ॥ 66**

**ప్ర :** యజ్ఞదానతపోయోగశ్రుతవీర్యజయాదిభిః = యజ్ఞము, దానము, తపస్సు, యోగము, శౌర్యము, విజయశీలము, అను వీని చేత, పార్థివాః = రాజులు, కార్తవీర్యస్య గతిమ్ = కార్తవీర్యార్జునుని ప్రవర్తనను, నూనమ్ = నిశ్చయముగా, న యాస్యన్తి = అనుసరించిన వారు కారు.

**తా :** మిగత సమకాలీనులైన రాజులు యజ్ఞములు చేయుటలోనేమి, దానములు చేయుటలోనేమి, తపస్సులోనేమి, యోగసాధనలోనేమి, వీరత్వవిషయముననేమి, విజయశీలముననేమి, కార్తవీర్యార్జునుని మార్గమును అనుసరించినవారు కారు.

**శ్లో॥ దుర్ధర్షః క్వాపి తేజస్వీ బలౌజో వీర్యకీర్తియుక్ ।**
**అనష్టచిత్తస్మరణో బుభుజేఽక్షయ్యసత్సుఖమ్ ॥ 67**

**ప్ర :** క్వ+అపి = ఎక్కడనైనను, దుర్ధర్షః = ఎదుర్కొనరాని, తేజస్వీ = వీరత్వము గలవాడు, బల+ఓజః = శరీరబలముగలవాడు, వీర్య = వీరత్వము, కీర్తియుక్ = కీర్తి కలవాడు, అనష్టచిత్తస్మరణః = జ్ఞాపకశక్తిని కోల్పోనివాడు, అక్షయ్య = తఱుగుబోని, సత్ సుఖమ్ = అనింద్యమైన సుఖమును, బుభుజే = అనుభవించెనా?

**తా :** ఎదురునిల్వలేని బలపరాక్రమములు దైవతేజము గల్గి మహావీరుడను సత్కీర్తిని పొంది, నష్టబుద్ధికాకుండ అమలినసుఖమును అనుభవించినవాడు ఎక్కడైన ఉన్నాడా?

**శ్లో॥ రావణో రాక్షసేశోఽపి యేన బద్ధోఽపి లీలయా ।**
**శ్రీదత్తప్రార్థనయా ముక్త ఏవంభూతోఽర్జునోభవత్ ॥ 68**

**ప్ర :** రావణః రాక్షసేశః అపి యేన = రాక్షసరాజైనప్పటికిని యే రావణునిచేత, బద్ధః అపి = బంధింపబడినవాడయ్యును, శ్రీదత్తప్రార్థనయా = శ్రీ దత్తుని ప్రార్థించుటచేత, లీలయా = క్రీడవలె,

ముక్తః = విడువబడినవాడు, అర్జునః = కార్తవీర్యార్జునుడు, ఏవం భూతః = ఇట్టివాడై, అభవత్ = ఉండెను.

**తా :** రావణుడు రాక్షసరాజు. వానిచే కార్తవీర్యార్జునుడు బంధింపబడినాడు. అయినను శ్రీ దత్తుని ప్రార్థించి కార్తవీర్యుడు బంధముక్తుడైనాడు. ఇది బాలక్రీడవలె నున్నది. కార్తవీర్యార్జునుడు ఇట్టివాడై యున్నాడు.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం తృతీయాష్టకే చతుర్థోఽధ్యాయః ॥

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## తృతీయాష్టకము - పంచమాధ్యాయము

**శ్లో॥ వైశ్వానరసమో రాజా ప్రతాపేనాపి దుర్ధరః ।**
**యం యం ప్రాప్తముపాదత్తే శ్రీదత్తాత్రేయసంనిధౌ ॥ 1**

**ప్రతిపదార్థం :** రాజా = రాజు కార్తవీర్యార్జునుడు, వైశ్వానరసమః = అగ్నితో సమానమై, ప్రతాపేన అపి = ప్రతాపము లేక వీరముచేత గూడ, దుర్ధరః = భరింపరానివాడై, యం యం ప్రాప్తమ్ = దేని దేనిని పొందెనో, దానినెల్ల, శ్రీదత్తాత్రేయసంనిధౌ =శ్రీ దత్తాత్రేయుని సంనిధియందు, ఉపాదత్తే = సమర్పించెను.

**తాత్పర్యము :** రాజు కార్తవీర్యుడు ప్రతాపమునందేమి, పవిత్రతయందేమి, అగ్నితో సమముగా దుర్నిరీక్ష్యుడు. తాను సంపాదించినదానినంతయు శ్రీదత్తాత్రేయునకు సమర్పించినాడు.

**శ్లో॥ నమస్కృత్య పునర్యాతి కదాచిన్నివసత్యపి ।**
**కదాచిద్ధర్మశాస్త్రాణి శృణోత్యేవం ప్రియోఽభవత్ ॥ 2**

**ప్ర :** నమస్కృత్య = నమస్కరించి, పునః = మరల, యాతి = వెడలి పోవుచున్నాడు, కదాచిత్ = ఒకప్పుడు, నివసతి అపి = నివసించుచున్నాడు కూడ, కదాచిత్ = ఒకప్పుడు, ధర్మశాస్త్రాణి = ధర్మశాస్త్రములను, శృణోతి = వినుచున్నాడు, ఏవమ్ = ఈ రీతి, ప్రియః = ప్రియమైన వాడుగా, అభవత్ = అయినాడు.

**తా :** ఆ విధముగా తాను సంపాదించిన దంతయు శ్రీదత్తున కర్పించి నమస్కరించి మరల వెంటనే వెడలి పోవుటయు, ఒకప్పుడు కొద్దికాలము అచట శ్రీదత్తాశ్రమమునందే ఉండి పోవుటయు, ధర్మశాస్త్రములను ఆ ప్రభువునుండి వినుటయు చేయుచు, ఈ రీతిగా శ్రీదత్తప్రభువునకు ఇష్టుడైనాడు కార్తవీర్యార్జునుడు.

**శ్లో॥ ఏవం సన్నేకదా రాజా నిర్విణ్ణో మనసా భృశమ్ ।**
**తత్త్వజిజ్ఞాసయా దేవముపతస్థే కృతాఞ్జలిః ॥ 3**

**ప్ర :** ఏవం సన్ = ఇట్లుండగా, ఏకదా = ఒకనాడు, రాజా = రాజు, మనసా = మనస్సున, భృశమ్ = మిక్కిలి, నిర్విణ్ణః = కృంగిపోయినవాడై, తత్త్వజిజ్ఞాసయా = తత్త్వమును నెఱుగవలెనను కోరికతో, కృత+అఞ్జలిః = అంజలి ఘటించి, దేవమ్ = శ్రీదత్తదేవుని, ఉపతస్థే = సమీపించెను.

**తా :** కాలమీరీతి గడచుచుండగా ఒకనాడు రాజు కార్తవీర్యుడు మనసున మిక్కిలి చింతితుడై తత్త్వసత్యము నెఱుగగోరి శ్రీదత్తుని చేరబోయి అంజలి ఘటించెను.

**శ్లో॥ దేవోఽపి తత్పరీక్షార్థం సమాధిస్థ ఇవాబభౌ ।**
**యుక్తం చైతద్గురూణాం హి శిష్యధీదార్ఢ్యహేతవే ॥ 4**

**ప్ర :** దేవః అపి = శ్రీదత్తదేవుడున్నూ, తత్ పరీక్షార్థమ్ = వానిని పరీక్షించు కొరకు, సమాధిస్థః ఇవ = సమాధిస్థితుడైన వానివలె, అబభౌ = ఆయెను, గురూణామ్ = గురువులకు, శిష్యధీదార్ఢ్యహేతవే = శిష్యుల నిశ్చయబుద్ధి నెఱుగుటకై, ఏతత్ = ఇట్లు పరీక్షించుట, యుక్తం హి = సరియైన పనియే.

**తా :** శ్రీ దత్తదేవుడున్నూ ఆ కార్తవీర్యుని పరీక్షింప నెంచి ఆ సమయమున తాను గాఢసమాధిలో నున్నవానివలె మిన్నకుండెను. శిష్యుల మనోబలమెంతటిదో తెలిసికొనుటకు గురువులిట్లు చేయుట సమంజసమే.

**శ్లో॥ కర్మణా మనసా వాచా సర్వభావార్పణేన చ ।**
**సేవమానో హృషీకేశం స్థితో రాజాఽతిభక్తితః ॥ 5**

**ప్ర :** కర్మణా = తాను చేయు పనులచేత, మనసా = మనస్సులోని ఆలోచనలచేత, వాచా = మాటాడు మాటలచేత, సర్వభావ+అర్పణేన చ = అన్ని భావములను సమర్పించుటచేత, హృషీకేశమ్ = ఇంద్రియములను స్వాధీనపరచుకొనిన విష్ణువును, సేవమానః = సేవించుచున్నవాడై, రాజా = రాజు కార్తవీర్యార్జునుడు, అతిభక్తితః = విశేషించిన భక్తితో, స్థితః = నిల్చినవాడాయెను.

**తా :** రాజు కార్తవీర్యార్జునుడు విశేషభక్తితో త్రికరణశుద్ధిగా విష్ణువునకే అన్ని భావముల నర్పించి సేవచేయుచుండెను.

**శ్లో॥ త్యక్తోదమపి తం ఖిన్నం స్తువన్తమపి సూక్తిభిః ।**
**ప్రణమన్తమభీక్ష్ణం నో ధియాఽప్యాశ్వాసయత్ప్రభుః ॥ 6**

**ప్ర :** తమ్ = వానిని, త్యక్త+ఉదం+అపి = నీటినైన త్రాగకుండ, ఖిన్నమ్ = విచారగ్రస్తుడై, సూక్తిభిః = మంచి వాక్కులతో, స్తువన్తమ్ = స్తోత్రము చేయుచు, అభీక్ష్ణమ్ = పలుమారులు, ప్రణమన్తం అపి = నమస్కరించుచున్నను, ప్రభుః = శ్రీదత్తప్రభువు, ధియా = మనసుతో, నో ఆశ్వాసయత్ = ఆదరించి పలుకలేదు.

**తా :** ఆ కార్తవీర్యుడు నీటినైన త్రాగకుండ విచారగ్రస్తుడై మంచివాక్కులతో స్తోత్రము చేయుచు, మరల మరల నమస్కరించుచున్నప్పటికిని, శ్రీదత్తప్రభువు వానిని మనసార ఆదరించి పలుకలేదు.

**శ్లో॥ యత్రాస్తేఽచిజ్జగద్భ్రాన్తిః స్వప్నాభావ్యసతీ సతి ।**
**అలాతచక్రవల్లోలా మాయికా యత ఉత్థితా ॥ 7**

**ప్ర :** యత్ర =ఎక్కడ, అచిత్ = అజ్ఞానము, సతి = ఉండగా, జగత్ = జగత్తు, భ్రాన్తిః = భ్రాంతి రూపమున, ఆస్తే = ఉన్నదో, స్వప్న+అభావి = స్వప్నరహితస్థితిలో, అసతీ = లేనిదగునో, యతః = ఏ కారణమున, అలాత–చక్రవత్ = కట్టుకొయ్యచుట్టూ భ్రమించుటవలె, లోలా = చంచలమైన, మాయికా = మాయ, ఉత్థితా = కలిగినదో

**తా :** అజ్ఞానము కారణముగా ఈ జగద్రూపభ్రాన్తి కలుగుచున్నది. ఈ జగత్తు స్వప్నమైనను లేని గాఢసుషుప్తిలో అసలు లేనే లేదు. అందువలన జగత్తు మాయ, అనగా మాయవలన కలిగినది, అని నిర్ణయము.

**శ్లో॥ తాం విద్వాన్ జ్ఞానఖడ్గేన యతాత్మా సన్మహావ్రతః ।**
**ఛిత్వా సదుక్తితీక్ష్ణేన క్షిప్రం సంయాతి తత్పదమ్ ॥ 8**

**ప్ర :** తామ్ = ఆ మాయను, విద్వాన్ = విద్వాంసుడు, యతాత్మా = ప్రయత్నపూర్వకముగా, సత్+మహావ్రతః = దృఢమైన వ్రతదీక్షగలవాడై, జ్ఞానఖడ్గేన = జ్ఞానము అను పేరుగల ఖడ్గముతో, సదుక్తితీక్ష్ణేన = శాస్త్రోక్తియే పదునుగాగల దానితో, ఛిత్వా = త్రుంచివేసి, క్షిప్రమ్ = వేగముగా, తత్పదమ్ = అమృతపదమును, సంయాతి = చేరుచున్నాడు.

**తా :** ఆ మాయను విద్వాంసుడు శాస్త్రోక్తియను పదునుదేరిన జ్ఞానఖడ్గముతో ఖండించి తన మార్గమును సుగమము చేసికొని శ్రీపదమును చేరును.

**శ్లో॥ తం త్వాం త్రయీశం గోవిన్దం ముముక్షుః ప్రణతోఽస్మ్యహమ్ ।**
**నిత్యముక్తేశ! సర్వజ్ఞ! బద్ధం మాం శివ! పాహ్యజ! ॥ 9**

**ప్ర :** త్రయీ+ఈశమ్ = సత్త్వరజస్తమోగుణత్రయమును శాసించువాడవైన, గోవిన్దమ్ = గాం భూమిం ధేనుం స్వర్గం వేదం వా విందతీతి గోవిన్దః అను వ్యుత్పత్తిని బట్టి భూమికి, గోవునకు, స్వర్గమునకు, వేదమునకు ప్రభువువైన, త్వామ్ = నిన్ను, తమ్ = అంతటి వానిని, ముముక్షుః = మోక్షమును కోరినవాడనై, అహమ్ = నేను, ప్రణతః అస్మి = శరణు పొందినవాడనైతిని, నిత్యముక్తః! = సర్వకాల, సర్వావస్థలలోను యే వికారము లేనివాడవైన, ఈశ! = ఓ ప్రభూ!, సర్వజ్ఞ! = సమస్తమైన జ్ఞానమును స్వరూపముగా గలవాడా!, శివ! = ఓ మంగళప్రదా!, ఓ సుఖస్వరూపా!, అజ! = ఓ ఆద్యంతములు లేని విష్ణో!, మామ్ = నన్ను, బద్ధమ్ = అజ్ఞానకర్మబద్ధుడనైన వానిని, పాహి = రక్షించుము.

**తా :** త్రిగుణశాసకా!, గోవిందా!, నిత్యముక్తా!, ఈశ్వరా!, సర్వజ్ఞా!, శివా!, హే విష్ణో! నన్ను రక్షించుము : నేను అజ్ఞానకర్మబద్ధుడనై, వానినుండి మోక్షార్థినై నిన్ను శరణంటిని.

**శ్లో॥ ఓతం ప్రోతమిదం యస్మిన్వసనే తన్తవో యథా ।**
**ప్రపద్యే సచ్చిదానన్దం తం త్వాం నారాయణం పరమ్ ॥ 10**

**ప్ర :** వసనే = వస్త్రము నందు, తన్తవః = దారములు, యథా = ఎట్లో (తథా = అట్లే), యస్మిన్ = ఎవ్వనియందు, ఇదమ్ = ఈ జగత్తు, ఓతం ప్రోతమ్ = పడుగు పేకలైనదో, తం నారాయణం పరమ్ = అట్టి (నరశరీరముతో నవతరించువాడు, నరుల మధ్య నుండువాడు, శబ్దగమ్యుడైన వాడు, నరులను నడిపించువాడు, అను నిట్టి వ్యుత్పత్తులను బట్టి) నారాయణు డనబరగు పరమాత్మయైన వానిని, సత్+చిత్+ఆనన్దమ్ = ఉనికి, జ్ఞానము, ఆనందము తానైన వానిని, త్వామ్ = శ్రీదత్తాత్రేయుడవగు నిన్ను, ప్రపద్యే = శరణంటిని.

**తా :** వస్త్రములోని దారము లెట్లు పడుగుపేకలై అల్లుకొని వస్త్రభ్రాన్తిని కల్పించుచున్నవో అట్లే భ్రాన్తిజన్యమైన ఈ జగత్తు నీయందున్నది. ఏలన, ఉనికి నీ రూపము, జ్ఞానము నీ రూపము, ఆనందము నీ రూపము. కావున నిన్ను శరణంటిని : నీవు నరులను నడిపించు నాయకుడవు గూడ కదా.

**శ్లో॥ బిలావిష్టం కుసౌఖ్యోరుతర్షం మాం కృపయోద్ధర ।**
**కాలాహిదష్టమవశం స్మృత్వైవాశ్వేహి భో! హరే! ॥ 11**

**ప్ర :** కుసౌఖ్య+ఉరుతర్షమ్ = విషయసుఖములలో అమితముగా కోర్కెల సముద్రమునబడి, బిల+ఆవిష్టమ్ = సంసారమను గోతిలోబడినవాడనగు, కాల+అహి-దష్టమ్ = కాలము అను సర్పముచే కరువబడినవాడను, అవశమ్ = వశము దప్పినవాడను, మామ్ = నన్ను, భో హరే! = ఓ శ్రీహరీ!, స్మృత్వా ఏవ = స్మరించినంతనే, ఆశు = వెంటనే, ఏహి = రమ్ము, కృపయా = దయతో, ఉద్ధర = ఈ బాధల నుండి బైటబడవేయుము.

**తా :** ఓ శ్రీహరీ! నేను ఇంద్రియలోలుడనై కోర్కెలలో జిక్కి సంసారమను గోతిలో బడినవాడను. కాలవశమున అదుపుదప్పియున్నాను. నన్ను దయజూచి స్మరణమాత్రమున ప్రసన్నుడవై కాపాడుము.

**శ్లో॥ కస్తేఽర్హతీహితం జ్ఞాతుం వాఙ్మనోఽగోచరం పరమ్ ।**
**బ్రహ్మాద్యా మోహితా యత్ర తత్రాహం దుర్మతిః కియాన్ ॥ 12**

**ప్ర :** యత్ర = యే విషయమున, బ్రహ్మాద్యాః = బ్రహ్మాదులు, మోహితాః = మోహభ్రాంతు లగుదురో, వాఙ్మనః+అగోచరం పరమ్ = వాక్కులకు మనస్సునకు తెలియరానిదైన పరమమైన, తే ఈహితమ్ = నీ మనోగతమును, జ్ఞాతుమ్ = తెలిసికొనుటకు, కః అర్హతి = ఎవనికి యోగ్యత

కలదు? తత్ర = ఈ విషయమున, దుర్మతిః అహమ్ = వివేకహీనుడను నేను, కియాన్ = ఎంతవాడను?

**తా :** బ్రహ్మాదులే నీ మాయకు లోనై సత్యమెఱుగలేకున్నారనగా, ఇక నీ భావము నెఱుగ సమర్థుడెవడు? అవివేకినైన నేను, వాక్కునకు మనస్సునకు తెలియరాని నీ భావము నెఱుగుట కెంతవాడను?

**శ్లో॥ తాపతప్తం భవాటవ్యామనన్యం మరణోన్ముఖమ్ ।**
**దృష్ట్వా మాం దీనమేహి త్వమన్వర్థత్వం దయాఘన! ॥ 13**

**ప్ర :** భవ+అటవ్యామ్ = సంసారమను అడవియందు, అనన్యమ్ = తోడులేని వాడను, తాపతప్తమ్ = ఆధిభౌతిక, ఆధిమానసిక, ఆధ్యాత్మిక తాపముల మూడిటిచే దహించబడుచున్న వాడను, మరణ+ఉన్ముఖమ్ = పుట్టినదాది మరణము దిక్కై సాగుచున్నవానిని, మాం దీనమ్ = దీనుడగు నన్ను, దృష్ట్వా = చూచి, దయాఘన! = సాంద్రమగు దయగల ఓ స్వామీ!, త్వమ్ = నీవు, అన్వర్థత్వమ్ = ఆ పేరునకు తగిన వైఖరితో నన్ను దయజూచిన వాడవై, ఏహి = రమ్ము.

**తా :** ఓ దయామయా! నీ పేరు సార్థకము చేయుచు నన్ను దయజూడుము. నేను సంసారారణ్యమున నొంటరిని, తాపత్రయముతో దహించుకొనుచున్నాను, స్వభావముచే మర్త్యుడను. నేనిట్లు దీనుడనై నీ దయకు పాత్రుడనగుదును.

**శ్లో॥ ముముక్షోఽస్తేఽవతారోఽయం జ్ఞానవిజ్ఞానయోగదః ।**
**ఉద్ధారకోఽస్త్యతోఽధీశ! సర్వాత్మన్ పాహి మాఽధునా ॥ 14**

**ప్ర :** అధీశ! = ఈశ్వరా!, సర్వాత్మన్ = ఆత్మరూపివై సర్వవ్యాపివైనవాడా!, తే = నీ యొక్క, అయం అవతారః = ఈ శ్రీదత్తాత్రేయావతారము, ముముక్షోః = ముక్తిని కోరువానికి, జ్ఞానవిజ్ఞానయోగదః = జ్ఞానయోగమును, విజ్ఞానయోగమును ప్రసాదించునది, అతః = అందువలన, ఉద్ధారకః అస్తి = ఉత్తమ స్థితికి చేర్చునది, అధునా = నేడు, మా = నన్ను, పాహి = రక్షించుము.

**తా :** ఓ ఈశ్వరా! నీవు ఆత్మరూపివైన సర్వాత్మవు. నీ దత్తావతారము మోక్షకాములకు జ్ఞానముద్వారా, విశేషజ్ఞానముద్వారా, అనగా, ఆత్మజ్ఞానముద్వారా ఉత్తమస్థితిని చేర్చుట కుపకారియగునది. అందువలన నేడు నన్ను కాపాడుము.

**శ్లో॥ స్త్రీపుత్రార్థసుహృద్రాజ్యభోగా మాయామయా హి తైః ।**
**స్వరూపాచ్ఛాదకైః కిం మే సర్వత్రోద్వేగదైః సదా ॥ 15**

**ప్ర :** స్త్రీపుత్రార్థ-సుహృద్రాజ్యభోగాః= స్త్రీవలన సుఖము, సంతానమువలన సుఖము, ధనము వలన సుఖము, స్నేహితులవలన సుఖము, రాజ్యమువలన సుఖము అనునివి, మాయామయాః = మాయామోహభ్రాంతితో నిండినవి, స్వరూప+ఆచ్ఛాదకైః = స్వస్వరూపమును కప్పియుంచునవి,

హి = ఏలన, సదా = అన్ని అవస్థలలోనూ, సర్వత్ర = అన్నిటనూ, ఉద్వేగదైః = భావ, అనుభవతీవ్రతను కలిగించునవి, తైః = అట్టివానితో, కిం మే = నా కేమి ప్రయోజనము?

**తా :** సంసారమనగా స్త్రీపుత్ర అర్థ సుహృత్ రాజ్యమూలకమగు సుఖము. ఇది భ్రాంతి జనకము, క్షణికము, అన్నిట ఉద్రేకమును పెంచునది. నా ఆత్మస్వరూపమును కప్పియుంచి దర్శింప నివ్వదు. దీనివలన నాకేమి లాభము?

**శ్లో॥ భవచక్రం వినాఽత్యుగ్రం న బిభేమి రిపోర్యమాత్ ।**
**తీక్ష్ణదణ్డాదపి పవేర్భూతభౌతికతోఽప్యజ! ॥ 16**

**ప్ర :** అతి+ఉగ్రం భవచక్రం వినా = అమిత భయంకరమైన సంసారపు జననమరణచక్రమును కాక, భూతభౌతికతః అపి = పంచభూతాత్మకమైన శరీరధారినైన కారణమున గూడ, అజ! = ఓ పుట్టుక లేని స్వామీ!, రిపోః =ఈ భౌతికమర్త్యలోకమునకు శత్రువైన ఇంద్రునియొక్క, పవేః = వజ్రాయుధమునకును, తీక్ష్ణదణ్డాత్ యమాత్ అపి = కఠినాతి కఠినదండన విధించువాడైన యమునివలన గూడ, న బిభేమి = భయపడను.

**తా :** ఓ స్వామీ! ఈ పాంచభౌతికశరీరమునకు ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బలనిన భయము లేదు. నా యాతనాశరీరమునకు యమునివలన తీవ్రదండన కలుగుననియును భయము లేదు. కాని పునరపి జననం పునరపి మరణం అను యీ సంసారచక్రమునబడి తిరుగుటనిన భయము. అందులకే ముముక్షువునై నీ శరణు జొచ్చితిని.

**శ్లో॥ దేహి తచ్చక్రభఙ్గాయ నివాసం త్వత్పదామ్బుజే ।**
**యేనానన్దాశ్రుసాన్ద్రోఽహం యాస్యామి విభవః శయమ్ ॥ 17**

**ప్ర :** తత్ చక్రభఙ్గాయ = ఆ భవచక్రమును ప్రక్కలించుటకై, త్వత్ పద+అంబుజే = నీ పాదపద్మములందు, నివాసమ్ = నిలచి జీవించుటను, దేహి = నా కిమ్ము, యేన = (దేనిచే) దానిచే, ఆనన్ద+అశ్రుసాన్ద్రః = ఆనందమున కనుల నీరు నించుచున్నవాడనై, విభవః శయమ్ = వైభవాతిశయమును, యాస్యామి = పొందుదును.

**తా :** జననమరణపరంపరారూపమైన భవచక్రమును భంగము చేయుటకై, అనగా, ముక్తుడనగుటకై, నాకు సదా నీ పాదపద్మములందు ఆశ్రయము నిమ్ము. దానిచే అమితానందమున వైభవాతి-శయమును పొందగలను.

**శ్లో॥ ఉచితోఽర్థప్రసఙ్గోఽయం త్వత్పాదవిముఖేఽనలః ।**
**త్వత్పాదభక్తే సారజ్ఞే స కథం సుఖయత్యసన్ ॥ 18**

**ప్ర :** అయం అర్థప్రసఙ్గః = ధనకనకవస్తువాహనాది లౌకికమైన అర్థముల (అనగా అర్థింపదగినవాని) గూర్చిన తాపము, త్వత్ పాదవిముఖే = నీ పాదములందు ఆసక్తి లేని వానియందు, ఉచితః =

తగినదే, తత్ అసన్ అనలః = అసత్తయిన ఆ అగ్ని, త్వత్ పాదభక్తే సారజ్ఞే = నీ పాదపద్మములందు భక్తియను మకరందమునందాసక్తిగల గండుతుమ్మెదవంటి భక్తునియందు, సః = ఆ భవమను అగ్ని, కథం సుఖయతి = సుఖము నెట్లు కలిగించును?

**తా :** సాంసారికార్థములలో కోరిక, వాని సంపాదనలో పూనిక, వాని పొందు మార్గములను గురించి చింత, ఇదియంతయు పరమాత్మదైన అమృతపదమునందాసక్తి లేని వానికి సముచితమే. కాని పరమాత్మాసక్తుడు గండుతుమ్మెదవంటి వాడు. వాని ఆసక్తి పద్మమరందమునందే. అట్టివాని కీ సాంసారికార్థప్రసంగము అగ్నివలె దాహకము. దానియందేమి సుఖముండును?

**శ్లో॥ నాత్రాముత్రాపి భోగేచ్ఛా ప్రసాదాత్తే మమాధునా ।**
**వాసనారూఢదుర్యోగవియోగం యోగమాదిశ ॥ 19**

**ప్ర :** తే ప్రసాదాత్ = నీ యనుగ్రహమువలన, అధునా = నేడు, మమ = నాకు, అత్ర+అముత్ర+అపి = ఇహమునందైనను పరమునందైనను, భోగ+ఇచ్ఛా = ఇంద్రియసుఖముల కోరిక, న = లేదు, వాసన+ఆరూఢ = వాసనల (సంస్కారముల) రూపమున వ్రేళ్ళూనియున్న, దుర్యోగ = అసత్తుతోడి కూటమియొక్క, వియోగమ్ = రాహిత్యమైన, యోగమ్ = యోగమును, ఆదిశ = నాకు ఆదేశించుము లేక ఉపదేశించుము.

**తా :** నీయనుగ్రహమున నాకిపుడు మర్త్యస్వర్గభోగములందాసక్తి లేదు. ఐనను పూర్వజన్మ సంస్కారములందు సంగము ఉండనే యున్నది కదా. దానినుండి దూరము తొలగుటకు తగిన యోగమార్గమును నాకు చూపుము.

**శ్లో॥ ధన్యోఽత్రిరనసూయాపి యత్ప్రసాదాద్భవత్పదమ్ ।**
**అభవం వేదమృగ్యం తజ్జాతం సులభమత్ర తు ॥ 20**

**ప్ర :** అత్రిః = అత్రిమహర్షి, ధన్యః =ధన్యుడు, అనసూయా+అపి = అనసూయాదేవియున్నూ, యత్ ప్రసాదాత్ = ఎవ్వారి అనుగ్రహమువలన, వేదమృగ్యమ్ = వెదకి తెలియదగినది, అభవమ్ = భవమును నివారించునదైన, భవత్పదమ్ = నీ పదము, అత్ర తు = ఈ లోకముననైతే, సులభం తత్ జాతమ్ = సులభలభ్యమైనది.

**తా :** అనసూయాత్రి దంపతులు ధన్యులు. ఏలన, వారి అనుగ్రహమువలన ఈ లోకమున భవనివారకము, వెదకి తెలియదగినదియైన, శ్రీదత్తప్రభువు పాదద్వయము సులభతరణోపాయమై లభించినది.

**శ్లో॥ నమస్తే వాసుదేవాద్య! పురాణపురుషోత్తమ! ।**
**విశ్వాధ్యక్ష! హృషీకేశ! భక్తాధివ్యాధిమర్దన! ॥ 21**

**ప్ర :** ఆద్య! = సమస్తమునకు ఆరంభకుడవైన మోదటి వేల్పా!, వాసుదేవ! = వసుదేవకుమారా!, విశ్వ+అధ్యక్ష! = జగత్తునకు అధిపతియైనవాడా!, హృషీకేశ! = ఇంద్రియములకు ప్రభువైన వాడా!, భక్త = భక్తులయొక్క, ఆధివ్యాధిమర్దన! = మానసిక శారీరక రుగ్మతలను తొలగించువాడా!, పురాణ-పురుషోత్తమ! = సనాతనుడవైన పరమకర్తా!, తే = నీకు, నమః = నమస్కారము.

**తా :** జగత్తున కాద్యుడవు నీవు. జగన్నాయకుడవీవు. జగత్తును నడిపించు కర్మజ్ఞానేంద్రియముల కధిపతివి నీవు. భక్తుల మనశ్శరీరసంబంధి రోగములను నివారించు వాడ వీవు. సనాతనుడవు, సర్వకర్మలకు పరమకర్తవు నీవు. వసుదేవనందనుడవై జగత్తును నీ యందే నిల్పుకొన్న వాసుదేవుడవు నీవు. అట్టి నీకు నమస్కారము. *

**శ్లో॥ ఏవం స్తుత్వాఽభవత్తూష్ణీం సిద్ధా అత్రాన్తరేఽమితాః ।**
**బ్రాహ్మే ముహూర్తే ఏత్యేశం నత్వా జగ్ముర్విమానగాః ॥ 22**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగా, స్తుత్వా = స్తోత్రము చేసి, తూష్ణీం అభవత్ = మిన్నకుండెను, అత్రాన్తరే = అంతలో, బ్రాహ్మే ముహూర్తే = బ్రాహ్మీముహూర్తమున, అమితాః సిద్ధాః = అనేకులుగా సిద్ధులు, ఏత్య = వచ్చి, ఈశం నత్వా = ఈశ్వరుని నమస్కరించి, విమానగాః జగ్ముః = విమానములలో ప్రయాణమై వెడలిరి.

**తా :** ఇట్లు స్తోత్రముచేసి ఊరకుండగా, అంతలో అసంఖ్యాకులుగా సిద్ధులు విమానము లెక్కి వచ్చి బ్రాహ్మీముహూర్తమున ఈశుని నమస్కరించి మరలిపోయిరి.

**శ్లో॥ సగన్ధర్వాప్సరసో దేవాస్తదైవైత్య ప్రణమ్య తమ్ ।**
**పరిక్రమ్య యయుర్విప్రా మునయోఽపి తథామితాః ॥ 23**

**ప్ర :** సగన్ధర్వ+అప్సరసః దేవాః = గంధర్వులతో అప్సరసలతో గూడిన దేవతలు, తదా ఏవ = అప్పుడే, ఏత్య = వచ్చి, తమ్ ప్రణమ్య = ఆ స్వామిని నమస్కరించి, పరిక్రమ్య యయుః = ప్రదక్షిణము చేసి వెడలిరి, విప్రాః = బ్రాహ్మణులు, మునయః అపి = మునులున్నూ, తథా = అట్లే, అమితాః = అసంఖ్యాకులుగా (చేసిరి).

**తా :** దేవతలు గంధర్వ అప్సరాదులందఱును, బ్రాహ్మణులును, మునులును అసంఖ్యాకులై అప్పుడే వచ్చి శ్రీదత్తుని నమస్కరించి, ప్రదక్షిణచేసి వెడలిరి.

**శ్లో॥ సమృజ్జలః శాన్తతపా ఉషస్యాపోత్థితః ప్రభుః ।**
**రాక్షస్యాశాం యయౌ మౌనీ విమలః పునరాగతః ॥ 24**

**ప్ర :** ఉషసి = ఉషః కాలమున, సమృత్+జలః = మృత్తికతో జలమును తీసికొన్నవాడై, శాన్తతపాః = శాన్తతపుడను పేరుగలవాడు, ఆప = వచ్చెను; ప్రభుః = శ్రీదత్తప్రభువు, ఉత్థితః = లేచినవాడై,

రాక్షసి+ఆశామ్ = నైరృతి దిశగా, యయౌ = వెళ్ళెను, పునః = మరల, విమలః = నిర్వికారుడైన, మౌనీ = మౌనియగువాడు, ఆగతః = వచ్చెను.

**శ్లో॥ సమృజ్జలసమిత్తావత్ప్రాప్తోఽన్యో మునీశ్వరః ।**
**కృతశౌచోఽమ్భసి స్నాత్వా దేవర్ష్యాదీనతర్పయత్ ॥ 25**

ప్ర : తావత్ = ఇంతలో, అన్యః మునీశ్వరః = వేరొక మునిశ్రేష్ఠుడు, సమృజ్జలసమిత్ = మృత్తికతో జలమును సమిధలను చేతబట్టి, ప్రాప్తః = అక్కడకు చేరెను, కృతశౌచః = శౌచక్రియలాచరించినవాడై, అమ్భసి స్నాత్వా =నదీజలములందు స్నానము చేసి, దేవర్ష్యాదీన్ = దేవ ఋషి పితృదేవతలకు, అతర్పయత్ = తర్పణము లిచ్చెను.

**తా :** ఉషఃకాలమున మృత్తికాజలములనుగొని శాంతతపుడను నాతడు వచ్చెను. శ్రీదత్తప్రభువు లేచి, నైరృతి దిశగా వెళ్ళి మరల వచ్చెను. ఇంతలో వేరొక ముని మృత్తికా జలములతో సమిధలను గొని అక్కడకు వచ్చెను. శౌచక్రియానంతరము నదీజలములలో స్నానమాడి దేవ, ఋషి, పితరులకు తర్పణలిచ్చెను.

**శ్లో॥ సవల్కభస్మదర్భోఽన్యస్తావత్ప్రాప్తో యథావిధి ।**
**కృత్వాహ్నికం విభుస్తస్థౌ ధ్యాననిశ్చలదృష్టివత్ ॥ 26**

ప్ర : తావత్ = అంతలో, సవల్కభస్మదర్భః = చెట్టుపట్టను మొలచుట్టు ధరించి, భస్మమలది దర్భలను బట్టినవాడు, అన్యః = మరియొకడు, ప్రాప్తః = వచ్చి చేరెను, విభుః = శ్రీదత్తప్రభువు, ఆహ్నికమ్ = ఆహ్నికవిధులను, యథావిధి = శాస్త్రోక్తముగా, కృత్వా = నిర్వర్తించి, ధ్యాననిశ్చల దృష్టివత్ = ధ్యానమునందు ఏకాగ్రదృష్టియైనట్లు, తస్థౌ = ఉండెను.

**తా :** అంతలో వల్కలము ధరించి, భస్మమలది, దర్భలను బట్టిన మరియొకడు వచ్చినాడు. శ్రీదత్తప్రభువు ఆహ్నికమును నెరవేర్చి ధ్యానమగ్నునివలె ఉండిపోయెను.

**శ్లో॥ స్థితః ఖిన్నోఽభవద్రాజా తతః శాన్తతపా జగౌ ।**
**భక్తోఽయం ధార్మికః ఖిన్నో రాజోపేక్షాస్య నోచితా ॥ 27**

ప్ర : రాజా = రాజు కార్తవీర్యుడు, ఖిన్నః అభవత్ = విచారగ్రస్తుడాయెను, తతః = అంతట, శాన్తతపాః = శాంతతపుడు, జగౌ = ఇట్లనెను, అయం రాజా = ఈ రాజు, భక్తః = భక్తుడు, ధార్మికః = ధర్మవర్తనముగలవాడు, ఖిన్నః స్థితః = విచారముతో నిలచినాడు, అస్య ఉపేక్షా = వానిని ఉపేక్షించుట, న ఉచితా = తగినపని కాదు.

**తా :** రాజు కార్తవీర్యుడు విచారగ్రస్తుడాయెను. అంతట శాంతతపుడు ఇట్లనెను : ఈ రాజు భక్తుడు, ధార్మికుడు, ఖిన్నుడై యున్నవాడు, వానిని చూచి చూడనట్లుండుట సముచితము కాదు.

**శ్లో॥ ప్రహస్యాహ ప్రభుః సమ్రాట్! సమృద్ధః ఖిద్యసే ఉతః ।**
**కాం భూతిమిచ్ఛస్యప్రాప్తాం కిం మద్భక్తస్య దుర్లభమ్ । 28**

**ప్ర :** ప్రభుః = శ్రీదత్తప్రభువు, ప్రహస్య = నవ్వి, ఆహ = పలికెను, సమ్రాట్ = ఓ చక్రవర్తీ!, సమృద్ధః = అన్ని విధముల వృద్ధిలో నుంటివి, ఖిద్యసే = విచారించుచుంటివి, కుతః = ఎందుకు? అప్రాప్తామ్ = నీవు పొందని, కాం భూతిమ్ = యే సంపదను, ఇచ్ఛసి = కోరుచున్నావు?, మత్ భక్తస్య = నా భక్తునకు, దుర్లభమ్ = అసాధ్యమైనది, కిమ్ = ఏమున్నది?

**తా :** శ్రీదత్తప్రభువు నవ్వి ఇట్లనెను : ఓ చక్రవర్తీ! నీవు అన్ని విషయములలో వర్ధిల్లుచున్నావు; మరి యీ విచారమెందుకు? నీకు ఇప్పటికే లేని సంపద యేమిటి? నీ కోరిక యేమి? నీవు నా భక్తుడవు. నీకు అసాధ్యమేమున్నది?

**శ్లో॥ సాశ్రునేత్రోఽవదత్సమ్రాడనయాలం పరీక్షయా ।**
**ప్రశంసన్తీహ యోగ్యాయ యోగ్యం దానం మనీషిణః ॥ 29**

**శ్లో॥ తృషితేఽమ్బోఽన్నం క్షుధితే దానం దీనేఽవనం తథా ।**
**ఆర్తే యోగ్యం తథా జ్ఞానం ముముక్షౌ వేత్సి సర్వవిత్ ॥ 30**

**ప్ర :** సమ్రాట్ = చక్రవర్తి, స+అశ్రునేత్రః = కన్నుల నీరు నిండగా, అవదత్ = ఇట్లనెను, అనయా పరీక్షయా అలమ్ = ఈ పరీక్ష యిక చాలును, ఇహ = లోకమున, మనీషిణః = పండితులు, యోగ్యాయ = అర్హునకు, యోగ్యం దానమ్ = తగిన దానినిచ్చుటను, ప్రశంసన్తి = మెత్తురు, తృషితే = దప్పిగొన్నవానికి, అమ్బుః = నీరు, క్షుధితే = ఆకలిగొన్న వానికి, అన్నమ్ = అన్నము, తథా = అట్లే, దీనే = దీనత వహించిన వానికి, ఆర్తే = ఆర్తుడైనవానికి, అవనమ్ = రక్షణ, తథా = అట్లే, ముముక్షౌ = ముక్తిని కోరువానికి, జ్ఞానమ్ = జ్ఞానము, యోగ్యం దానమ్ = తగిన దానముగా, సర్వవిత్ = సర్వజ్ఞుడవైన నీవు, వేత్సి = తెలియుదువు.

**శ్లో॥ వాఙ్మనోఽగోచరం శుద్ధం బ్రహ్మైకం సదసత్పరమ్ ।**
**వేదాన్తీ ప్రాహ దృశ్యం చ మాయికం రజ్జుసర్పవత్ ॥ 31**

**ప్ర :** వేదాన్తీ ప్రాహ = వేదాంతి యిట్లనెను, దృశ్యం చ = కంటికి కనబడునది యేమో, రజ్జు సర్పవత్ = త్రాడు పామువలె నుండునట్లు, మాయికమ్ = భ్రాంతి, మాయ, ఏకం బ్రహ్మ = బ్రహ్మమొక్కటే, వాక్+మనః అగోచరమ్ = వాక్కు పలుకలేనిది, మనస్సు ఊహించలేనిది, సత్+అసత్ పరమ్ = సత్తు అసత్తు (వ్యక్తము అవ్యక్తము) అను వానికి అతీతమైనది, శుద్ధమ్ = యే వికారము (నామ రూప గుణ వికారములు) లేనిది.

**శ్లో॥ ప్రాహోఽన్యోఽనాది తత్సత్యం మిథ్యా చేద్దృశ్యతే కథమ్ ।**
**ఉత్తమత్వాదికం త్వస్య కర్మణైవాపరేఽబ్రువన్ ॥ 32**

**ప్ర :** అన్యః ప్రాహః = వేదాంతితో విభేదించిన మరియొకరు యిట్లనిరి, అనాది తత్ = అనాది (మొదలు లేనిది) యైన 'తత్' అనునది, సత్యమ్ = సత్యము (ఉన్నది), మిథ్యా చేత్ = లేనిది, మాయయైనచో, కథమ్ = ఎట్లు, దృశ్యతే = కనబడుచున్నది?, ఉత్తమత్వ+ఆదికం తు = ఉత్తమము, మధ్యమము, అధమము అను విభేదములయితే, అస్య = ఆ 'తత్' యొక్క, కర్మణా ఏవ = కర్మచేతనే (కలుగును); అపరే అబ్రువన్ = మరియు నొకడు ఇట్లనెను,

**శ్లో॥ నానాత్మత్వం జగుశ్చాన్యే ప్రధానం కారణం పరమ్ ।**
**నిమిత్తం ద్వన్ద్వజం చాన్యే క్షణికత్వం పరేఽస్య చ ॥ 33**

**ప్ర :** నానాత్మత్వమ్ = అనేకత్వమును, జగుః = చెప్పెను, అన్యే = మరియొకడు, ప్రధానమ్ = ప్రధానమును, పరం కారణమ్ = పరమకారణముగా, ద్వన్ద్వజమ్ = ద్వయభావమువలన కలిగిన, నిమిత్తం క్షణికత్వమ్ = కారణపు క్షణికత్వమును, అన్యే = మరియొకడు, పరే = మరియొకడు, అస్య చ = ఇట్టిదైన,

**శ్లో॥ యుక్త్యా స్వపక్షదార్ఢ్యార్థం వేదాదీన్యోజయన్త్యపి ।**
**యుక్తం కిమత్ర భగవన్! భ్రమశాన్త్యా ఉపదిశ ॥ 34**

**ప్ర :** స్వపక్షదార్ఢ్యార్థమ్ = తమ వాదనను బలపరచుకొనుటకు, యుక్త్యా = ఉపాయముతో, వేదాదీన్ = వేదము మొదలగు శాస్త్రములను, యోజయన్తి అపి = ఉపయోగింతురు కూడ, భ్రమశాన్త్యాః = భ్రమ తొలగుటకొరకు, అత్ర = వీనియందు, యుక్తం కిమ్ = తగినవాదమేది?, భగవన్! = స్వామీ!, ఉపదిశ = ఉపదేశించుము.

**తా (29-34) :** చక్రవర్తి కార్తవీర్యుడు కనుల నీరు చిందగా ఇట్లనెను : నన్ను పరీక్షించుట చాలును స్వామీ! ఈ ప్రపంచమున అర్థునకు ఆతడు కోరిన దానిని నిచ్చుట మెత్తురు కదా పండితులు. దప్పిగొన్నవానికి త్రాగునీరు, ఆకటికన్నము, దీనుడై అర్థించిన ఆర్తునకు రక్షణ, ముక్తికోరిన వానికి జ్ఞానము తగిన దానములని సర్వజ్ఞుడవైన నీవెఱుగుదువు.

ఇంద్రియానుభవమునకు అందునదంతయు మాయ, భ్రాంతి, త్రాడును పాముగా భ్రమించుట వంటిది; సత్యము ఒక్కటే; అది వాక్కునకు గాని మనస్సునకు గాని అందని బ్రహ్మము; వ్యక్తావ్యక్తముల కతీతము; నిర్వికారము. అని వేదాంతి వాదించును.

కాణాదుడు, వాని అనుచరులు తార్కికులు ఇట్లందురు : జగత్తు అనునది మిథ్యకాదు, సత్యము. ఇది మిథ్యయైనచో ఇంద్రియానుభవమెట్లు కలుగును? ఎట్లు కనబడును?

మీమాంసకులు ఇట్లందురు : కర్మయే నిర్ణాయకము. దీనిచేతనే ఉత్తమ, మధ్యమ, అధమ భేదములు కలుగుచున్నవి.

కపిలుడు ప్రతిపాదించిన సాంఖ్యవాదము, 'ప్రధానము' అనబడు పదార్థము 'మహత్తు' అనబడు

మనస్సు ఆధారముగా వెలసినది; ప్రకృతి-పురుషుల కలయికలో విశ్వము కలిగినది; ప్రకృతి యను అచేతన పదార్థము వికృతమై జగత్తు కలిగినది. ఇది యిట్లు మూల తత్త్వములు రెండుగా చెప్పు ద్వైతవాదము.

కార్యకారణముల అవిభాజ్యస్వభావము, దీనివలన రెండిటి క్షణికత్వమును ప్రతిపాదించువారు క్షణికవాదులనబడు బౌద్ధధర్మానుయాయులు.

వీరందరును తమ తమ వాదములను బలపరచుకొనుటకై వేదాదిశాస్త్రములనుపయోగింతురు. భ్రమను తొలగించు జ్ఞానమేది? దాని నుపదేశింపుమని కార్తవీర్యుని ప్రార్థన. *

**శ్లో॥ మచ్ఛాసనం త్వత్ప్రసాదాత్సర్వత్రావ్యాహతం ద్విషః ।**
**భృత్యా మే వాసనా కాపి న మే మోక్షాదృతేఽధునా ॥ 35**

**శ్లో॥ యయా కయాపి యుక్త్యా మాముత్తారయ భవామ్బుధేః ।**
**బ్రహ్మాదీనామపి బ్రహ్మన్ త్వమేవాస్యపరో గురుః ॥ 36**

**ప్ర :** త్వత్ ప్రసాదాత్ = నీ అనుగ్రహమువలన, మత్ శాసనమ్ = నా పరిపాలన, సర్వత్ర = అన్ని విధముల, అవ్యాహతమ్ = ఎదురులేనిది, ద్విషః = శత్రువులు, మే = నాకు, భృత్యాః = దాసులు, మే = నాకు, కా అపి = ఏమియును, అధునా = నేడు, మోక్షాత్ ఋతే = మోక్షమును విడచి, వాసనా = కోరిక, న = లేదు; మామ్ = నన్ను, యయా కయా అపి = ఏదియైన యొక, యుక్త్యా = ఉపాయముతో, భవ+అంబుధేః = సంసార సముద్రు నుండి, ఉత్తారయ = దాటించుము, బ్రహ్మ+ఆదీనాం+అపి = బ్రహ్మ మొదలగు త్రిమూర్తులకును, దేవతలకును, బ్రహ్మన్ = మూలమైన పరబ్రహ్మస్వరూపా!, త్వం+ఏవ = నీవే, అపరః గురుః = అద్వితీయుడవైన గురువు, అసి = అగుచున్నావు.

**తా :** నీ అనుగ్రహమువలన నా పరిపాలన ఎదురులేకున్నది. నా శత్రువులు నాకు దాసులయినారు. నేడు నాకు కోరిక లేమియును లేవు, ఒక్కటి తప్ప. అదేమి? యనగా, ఈ సంసారమను సముద్రము నుండి ముక్తుడ కావలె నన్నదే ఆ ఒక్క కోరిక. దానిని తీర్చగల పరమగురుమూర్తివి నీవు దక్క వేరొకరు లేరు. తమరు త్రిమూర్తులకును, దేవతలకును గూడ మూలమైన పరబ్రహ్మస్వరూపులు.

**శ్లో॥ భగవాన్ ప్రాహ శాస్త్రాణామేకం తాత్పర్య మీరితమ్ ।**
**బృహస్పతీన్ద్రసంవాదం శృణు సంశయభేదకమ్ ॥ 37**

**ప్ర :** భగవాన్ ప్రాహ = శ్రీ దత్తభగవాను డిట్లనెను, శాస్త్రాణామ్ = శాస్త్రములకు, తాత్పర్యమ్ = గ్రహింపదగిన అర్థము, ఏకమ్ = అద్వైతముగా, ఈరితమ్ = చెప్పబడినదైన, సంశయ-భేదకమ్ = సందేహములను నివారించునదైన, బృహస్పతి+ఇన్ద్రసంవాదమ్ = బృహస్పతి-ఇంద్రుల సంభాషణ, శృణు = వినుము.

**తా :** శ్రీదత్తభగవానుడిట్లనెను : అన్ని శాస్త్రములకు సారభూతమైనది అద్వైతమని తేటపడజేయు నిశ్చయార్థకమైన ఈ సంవాదమును వినుము, ఇది ఇంద్రునకును వాని గురువగు బృహస్పతికిని జరిగిన సంభాషణ.

**శ్లో॥ లౌకాయతస్మారశిల్పసౌగతాదిశ్రుతాన్యపి ।**
**పాఠయన్తం స్వశిష్యేభ్యో గురుం నత్వా వృషాఽవదత్ ॥ 38**

**శ్లో॥ జాత్యైవ ప్రాణినాం ప్రాప్తా రాగతో విషయాత్మతా ।**
**ఏతైరర్థాత్మకైః శాస్త్రైః కిం విధేయం విపశ్చితా ॥ 39**

**ప్ర :** లౌకాయత = ప్రత్యక్షప్రమాణమే అంగీకరింపదగునని వాదించు చార్వాకమత శాస్త్రమును, స్మార = వాత్స్యాయనుని కామశాస్త్రమును, శిల్ప = శిల్పమును, సౌగత = శూన్యవాదశాస్త్రమును, ఆది = న్యాయ, వైశేషిక, మొదలగు, శ్రుతాని అపి = శాస్త్రములను గూడ, స్వశిష్యేభ్యః = తన శిష్యులతో, పాఠయన్తమ్ = చదివించుచున్నవాడగు, గురుమ్ = గురువగు బృహస్పతిని, నత్వా = నమస్కరించి, వృషా = ఇంద్రుడు, అవదత్ = పలికెను, జాత్యా ఏవ = పుట్టుకతోనే, ప్రాణినామ్ = ప్రాణులకు, రాగతః = ఆసక్తిద్వారా, విషయాత్మతా = ఇంద్రియానుభవలాలస, ప్రాప్తా = కలిగియున్నది, ఏతైః అర్థాత్మకైః శాస్త్రైః = ఈ అర్థవాదశాస్త్రములతో, విపశ్చితా = పండితులచేత, కిం విధేయమ్ = విధి నిర్ణయమేమి చేయదగును?

**తా :** బృహస్పతి దేవతల గురువు. ఆతడు దేవతలకు చార్వాకమతమును, కామసూత్రములను, శిల్పమును, శూన్యవాదమును, న్యాయవైశేషిక ఇత్యాది శాస్త్రములను బోధించుచుండును. అట్టి గురువును చూచి, నమస్కరించి ఇంద్రుడు ఇట్లనెను : పుట్టుకతోనే జీవులకు ఇంద్రియసుఖము లందాసక్తి సహజముగ కలుగుచున్నది. ఈ శాస్త్రముల అర్థవాదముల సహాయమున పండితుడు దేనినైన నిర్ణయించుటెట్లు సాధ్యము?

**శ్లో॥ విషయాక్రాన్తచిత్తానాం కిం తత్తత్త్వబహిర్ముఖైః ।**
**కిం విద్వాన్ లభతేఽత్రాజ్ఞం కూపేఽన్ధమివ పాతయన్ ॥ 40**

**ప్ర :** విషయ+ఆక్రాన్త-చిత్తానామ్ = ఇంద్రియవిషయములచే ఆక్రమింపబడిన మనస్సుగల వారికి, తత్ తత్త్వ బహిః+ముఖైః = ఆ సత్యమునకు వెలుపల దృష్టిసారించువానిచేత, కిమ్ = ఏమి లాభము? అత్ర = ఈ విషయమున, అజ్ఞమ్ = అజ్ఞానిని, అన్ధమ్ = గ్రుడ్డివానిని, కూపే ఇవ = బావియందువలె, పాతయన్ = పడవేయుచు, విద్వాన్ = విద్వాంసుడు, కిం లభేత = యేమి పొందును?

**తా :** ఇంద్రియవిషయాసక్తులు సర్వదా ఆ విషయాన్వేషణలో వెలుపల జగత్తు నందే దృష్టిసారించుచుందురు. అట్టివారు తత్త్వసత్యమునందాసక్తి లేనివారు. వానిచే యేమి లాభము?

అజ్ఞాని గ్రుడ్డివానివంటివాడు. అట్టివానిని బావిలోనికి త్రోసినట్లే యగును, అనగా, శాస్త్రవిజ్ఞానము వానికి సత్యమార్గమును చూపదు. బావిలోపడిన గ్రుడ్డివాడు ఆ బావిలోనే ఎంతకాలమైన బైటపడలేక తిరుగునట్లు ఈ అజ్ఞానియు శాస్త్రములలో బడి తిరుగుచుండునే గాని వానినుండి బైటకు రాలేడు. *

**శ్లో॥ గురుః ప్రాహ క్రమాదేతైశ్చిత్తశుద్ధిర్భవిష్యతి ।**
**సప్తోదాహరణాన్యత్ర సంశయాన్తాని మే శృణు ॥ 41**

ప్ర : గురుః ప్రాహ = గురువు బృహస్పతి యిట్లనెను, ఏతైః = వీనిచే, క్రమాత్ = కాలము గడిచిన కొలది, చిత్తశుద్ధిః = మనస్సు నిర్వికారము, భవిష్యతి = అగును, అత్ర = ఈ విషయమున, సంశయాన్తాని = సందేహనివృత్తికై, సప్త = ఏడు, ఉదాహరణాని = ఉదాహరణములను, మే శృణు = నా మాటలలో వినుము.

**తా :** గురు విట్లనెను : ఈ శాస్త్రముల అధ్యయనమువలన కాలక్రమమున మనస్సు నిర్వికారమగును. ఈ సందర్భమున నీకు సందేహనివృత్తికై ఏడు ఉదాహరణములను చెప్పుదును, వినుము.

**శ్లో॥ కాపిల్యే శిల్పవిత్కశ్చిద్విధిజ్ఞాఖ్యః పురేఽభవత్ ।**
**గృహాన్ స నిర్మమే కాన్తాం శ్ఛిల్పశాస్త్రోక్తవద్బహూన్ ॥ 42**

ప్ర : కాపిల్యే పురే = కాపిల్యపురమున, విధిజ్ఞ+ఆఖ్యః = విధిజ్ఞుడను పేరుగల, కశ్చిత్ = ఒకానొక, శిల్పవిత్ = శిల్పశాస్త్రజ్ఞుడు, అభవత్ = ఉండెను; సః = ఆతడు, శిల్పశాస్త్రోక్తవత్ = శిల్పశాస్త్రమున చెప్పబడినట్లు, బహూన్ = ఎన్నియో, కాన్తాన్ గృహాన్ = అందమైన యిండ్లను, నిర్మమే = నిర్మించెను.

**తా :** కాపిల్యనగరమున విధిజ్ఞుడను పేరుగల గృహనిర్మాణశాస్త్రజ్ఞుడు ఒకడుండెను. ఆతడు అందమైన కట్టడముల నెన్నింటినో శాస్త్రానుసారము నిర్మించెను.

**శ్లో॥ గృహకర్మణి తం సర్వే మాన్యం వాఞ్ఛతి వేతనమ్ ।**
**భూరి ప్రాయోపజీవన్తి తమేవాన్యే స సత్యవాక్ ॥ 43**

ప్ర : గృహకర్మణి = వాస్తుశిల్పము విషయమున, తం మాన్యమ్ = ఆ గౌరవనీయుని, అన్యే సర్వే = మిగతవారందఱు, ప్రాయః = బహుశః, ఉపజీవన్తి = అనుసరించుచున్నారు, తం ఏవ = వానినే, సః సత్యవాక్ = ఆ సత్యవాది, భూరి వేతనమ్ = పెద్ద పారితోషికమును, వాంఛతి = కోరుచున్నాడు.

**తా :** ఆతనిని గౌరవించి వాస్తుకర్మలో మిగతవారందఱు వానినే అనుసరించుచున్నారు. ఆతడు అధిక వేతనమును కోరుచున్నాడు.

**శ్లో॥ మృతస్తతోఽగాత్స్వర్గం స భోగాన్ భుక్త్వాఽభవన్నృపః ।**
**యజ్వా స భూతలే దేవగృహవాపీతడాగకృత్ ॥ 44**

ప్ర : తతః = అంతట, మృతః = మరణించినవాడై, సః = ఆతడు, స్వర్గమ్ = స్వర్గమును, అగాత్ = చేరెను, భోగాన్ భుక్త్వా = భోగములనుభవించి, నృపః అభవత్ = రాజుగా జన్మించెను, సః = ఆతడు, భూతలే = భూమిపై, యజ్వా = యజ్ఞముచేసినవాడును, దేవగృహ = దేవాలయములను, వాపీ = బావులను, తడాగ = చెఱువులను, కృత్ = నిర్మించినవాడాయెను.

**తా :** అంతట నాతడు మరణించి స్వర్గమున భోగములనుభవించి, మరల భూమిపై రాజుగా బుట్టి యజ్ఞములు చేసెను, దేవాలయములను కట్టించెను, బావులను, చెఱువులను త్రవ్వించెను.

**శ్లో॥ ధార్మికః స మృతః స్వర్గే భోగాన్ భుక్త్వా ద్విజోఽభవత్ ।**
**వేదశాస్త్రార్థతత్త్వజ్ఞో ధ్యాననిష్ఠో మహావ్రతః ॥ 45**

ప్ర : ధార్మికః సః = ధర్మాత్ముడైన ఆతడు, మృతః = మరణించినవాడై, స్వర్గే = స్వర్గమున, భోగాన్ భుక్త్వా = భోగములనుభవించి, ద్విజః అభవత్ = బ్రాహ్మణుడై జన్మించెను, వేదశాస్త్ర+ అర్థతత్త్వజ్ఞః = వేదముల యొక్కయు, శాస్త్రములయొక్కయు, అర్థమును, సూక్ష్మసత్యమును తెలిసిన వాడై, ధ్యాననిష్ఠః = ధ్యానమును నిష్ఠగా స్వీకరించిన వాడై, మహావ్రతః = మహాదీక్షితుడాయెను.

**తా :** ఆ ధర్మాత్ముడైన రాజు మరణించి, స్వర్గమున సుఖములనంది, మరల ఒక బ్రాహ్మణుడై పుట్టి, వేదశాస్త్రమర్మము లెఱిగి, ధ్యాననిష్ఠుడై మహాదీక్షితుడాయెను.

**శ్లో॥ చతుర్థాశ్రమమాసాద్య జీవన్ముక్తశ్చచార గామ్ ।**
**శాస్త్రం ధీశుద్ధికృద్యస్మాచ్ఛిల్పజ్ఞోఽగాత్క్రమాద్గతిమ్ ॥ 46**

ప్ర : చతుర్థాశ్రమమ్ = సంన్యాసమును, ఆసాద్య = స్వీకరించి, జీవన్ముక్తః = జీవించి యుండగనే ముక్తిని పొందినవాడై, గామ్ = భూమిని, చచార = సంచరించెను, శాస్త్రమ్ = శాస్త్రము, ధీశుద్ధికృత్ = మనశ్శుద్ధిని కలిగించును, యస్మాత్ = ఆ కారణమువలన, శిల్పజ్ఞః = వాస్తుశిల్పవేత్త, క్రమాత్ = జన్మపరంపర ననుసరించి, గతిం అగాత్ = మోక్షమును పొందెను.

**తా :** అట్లా బ్రాహ్మణుడు సంన్యాసమును పొంది, ముక్తుడై జీవించుచు, భూమియంతయును సంచరించెను. శాస్త్రము మనస్సును పరిశుద్ధము జేసి జన్మజన్మాంతరములకైనను ముక్తిని ప్రసాదించుననుటకు ఈ వాస్తుశిల్పపండితున కథ ఒక ఉదాహరణము.

**శ్లో॥ మాహిష్మత్యాం ద్విజః కశ్చిద్గీతవాదిత్రవిత్కవిః ।**
**సున్దరః కామశాస్త్రజ్ఞో భార్యార్థం క్ష్మాం చచార సః ॥ 47**

ప్ర : మాహిష్మత్యామ్ = మాహిష్మతీనగరమున, కశ్చిత్ ద్విజః = ఒకానొక బ్రాహ్మణుడు, గీతవాదిత్రవిత్ = పాడుట, సంగీత వాద్యములను ప్రయోయించుట తెలిసినవాడు, అనగా, సంగీతము నెఱిగినవాడు, కవిః = కవిత్వము చెప్పగలవాడు, సున్దరః = అందమైన వాడు, కామశాస్త్రజ్ఞః =

కామశాస్త్రము నెఱిగినవాడు, భార్యార్థమ్ = తనకు భార్య కాగల స్త్రీ కొరకు వెదకుచు, సః = అతడు, క్ష్మాం చచార = భూమియంతయు ద్రిమ్మరినాడు.

**తా :** మాహిష్మతీనగరంలో ఒక అందగాడైన బ్రాహ్మణుడుండువాడు. ఆతడు కవి, సంగీతవేత్త, గాయకుడు, కామశాస్త్రపండితుడు. ఆతడు తనకు భార్యకాగల స్త్రీని వెదకుచూ భూమి నాలుగు చెరగుల సంచరించినాడు.

**శ్లో॥ తద్ధార్దజ్ఞో నృపః కశ్చిత్తస్మై కన్యాం వ్యదర్శయత్ ।**
**శాస్త్రోక్తసర్వలక్ష్మ్యాఢ్యాం దృష్ట్వోచ్చైర్మూర్ఛితోఽభవత్ ॥ 48**

**ప్ర :** తత్ = వానియొక్క, హార్దజ్ఞః = మనసు దెలిసి కొనిన, నృపః = రాజు, తస్మై = వానికొరకు, కశ్చిత్ = ఒకానొక, కన్యామ్ = కన్యను, వ్యదర్శయత్ = చూపెను, శాస్త్రోక్తసర్వలక్ష్మాఢ్యామ్ = శాస్త్రములో చెప్పబడిన అన్ని శుభలక్షణములతో కూడిన ఆమెను, దృష్ట్వా = చూచి, (సః = ఆతడు), ఉచ్చైః మూర్ఛితః = అధికముగా నిశ్చేష్టితుడు, అభవత్ = ఆయెను.

**తా :** వాని హృదయము నెఱిగిన రాజు వానికొక కన్యను చూపెను. ఆమె శాస్త్రానుసారము సర్వశుభలక్షణములు కలిగినది. ఆమెను చూచి ఆ బ్రాహ్మణుడు చేష్టలుడిగినాడు.

**శ్లో॥ సాపి తం చకమే కాన్తం హృష్టో రాజా స తాం దదౌ ।**
**రాజ్యార్ధమపి తస్మై స ద్విజో రేమే తయా సహ ॥ 49**

**ప్ర :** సా అపి = ఆమె కూడ, తం కాన్తమ్ = ఆ అందగానిని, చకమే = వరించెను, సః రాజా = ఆ రాజు, హృష్టః = సంతోషించినవాడై, తామ్ = ఆమెను, తయా సహ = ఆమెతో కూడ, రాజ్య+అర్ధం+అపి = సగము రాజ్యమును కూడ, తస్మై = వానికి, దదౌ = ఇచ్చెను, సః ద్విజః = ఆ బ్రాహ్మణుడు, (తయా సహ = ఆమెతో కూడ), రేమే = ఆనందించెను.

**తా :** ఆమె కూడ ఆతనిని వరించినది. రాజు సంతోషించి, వారిద్దరకు వివాహము జరిపించి, ఆ బ్రాహ్మణున కర్ధరాజ్యమిచ్చెను. ఆ బ్రాహ్మణుడు ఆనందముతో జీవించెను.

**శ్లో॥ సుఖం యదాత్మనో రూపం సర్వేహోపరతౌ స్ఫుటమ్ ।**
**వాఙ్మనోఽగోచరం నిత్యం శ్రేష్ఠమాత్యన్తికం పరమ్ ॥ 50**

**ప్ర :** యత్ సుఖమ్ = యే సుఖము, సర్వ+ఇహ+ఉపరతౌ = సమస్తమైన ఐహికాసక్తులందు, స్ఫుటమ్ = ప్రకాశించునదియో, నిత్యమ్ = శాశ్వతమైనదో, శ్రేష్ఠం పరం ఆత్యన్తికమ్ = అత్యంత శ్రేష్ఠమైనదో, వాక్+మనః అగోచరమ్ = వాక్కునకు, మనస్సునకు అందకున్నదో, ఆత్మనః రూపమ్ = ఆత్మయొక్క స్వస్వరూపమో

**శ్లో॥ మనుష్యానన్దమారభ్య బ్రహ్మానన్దాన్తమేవ యత్ ।**
**దశోత్తరగుణం తత్తు బ్రహ్మానన్దాంశతో మతమ్ ॥ 51**

**ప్ర :** మనుష్యానన్దం ఆరభ్య = మానుషానందము మొదలుకొని, బ్రహ్మానన్ద+అన్తం+ఏవ = బ్రహ్మానందము పర్యంతము గల సమస్తానందముల సమాహారము, యత్ = యేదియో, తత్ తు = ఆ ఆనందమేమో, దశ+ఉత్తరగుణమ్ = వందరెట్లు ఒక దానికంటె నొకటి అధికమైనదిగా, బ్రహ్మానంద+అంశతః = బ్రహ్మానందముయొక్క అంశల విభాగముచే, మతమ్ = అంగీకరించ బడినది.

**తా :** సుఖము, ఆనందము పర్యాయములు. ఇది ఆత్మయొక్క స్వస్వరూపము. అన్ని లౌకిక విషయములందును పొందునది ఈ ఆత్మానందపు ఛాయనే. ఇది సర్వకాలసర్వావస్థలలో అనుభవవేద్యము. అయినను దాని తత్త్వము మనస్సునకు గ్రహింపరాదు, వాక్కునకు వర్ణింప నలవి కాదు. అదియే పరమము, ఉత్తమావధి.

మనుష్యులకు ఆనందానుభవము మొదలు మనుష్యానందముతో. దాని పరమావధి బ్రహ్మానందము. ఈ మొదలు చివరల మధ్య స్థాయీ భేదములతో ఆనందమును మనుష్యుడు అనుభవించును. ఆ యా భేదానందముల కిట్లు పేర్లు పెట్టబడినవి : 1. మానుషానందము, 2. మనుష్యగంధర్వానందము, 3. దేవగంధర్వానందము, 4. పైతృకానందము, 5. అజానజామరానందము, 6. కర్మదేవానందము, 7. దేవానందము, 8. ఇంద్రానందము, 9. బృహస్పత్యానందము, 10. ప్రజాపత్యానందము, 11. బ్రహ్మానందము. ఈ వివిధానందములు ఒకదానికంటె నొకటి నూఱురెట్లు అధికమని చెప్పుదురు.

**శ్లో॥ వృత్త్యారూఢం చ తత్పూర్ణం భావ్యతే రతికర్మణా ।**
**విధిజ్ఞేన న మూర్ఖేణ తత్సౌఖ్యం సోఽలభత్సదా ॥ 52**

**ప్ర :** విధిజ్ఞేన = శాస్త్రజ్ఞునిచేత, న మూర్ఖేణ = మూర్ఖునిచే కాదు, రతికర్మణా = రతిక్రియతో, వృత్త్యారూఢమ్ = కామవృత్తిసిద్ధమైన, తత్ = ఆ సుఖము, పూర్ణమ్ = పరిపూర్ణ సుఖముగా, భావ్యతే = అనుభవింపబడుచున్నది, సః = ఆతడు, సదా = ఎల్లపుడు, తత్ సౌఖ్యమ్ = ఆ సుఖమును, అలభత్ = పొందెను.

**తా :** రతిక్రియలో లభించు ఆ సుఖము బ్రహ్మానందసహోదరమని శాస్త్రజ్ఞాని భావించును, కాని మూర్ఖుడట్లు భావింపడు. కామశాస్త్రప్రవీణుడైన యీ బ్రాహ్మణుడు ఆ సుఖమును పూర్తిగా అనుభవించినాడు.

**శ్లో॥ పత్నీ నాన్యం హృదాప్యైచ్ఛత్తస్యాభూద్ధృద్ధరా సతీ ।**
**రేమే తయైవ గీతజ్ఞో విప్రశ్చిత్తానురూపయా ॥ 53**

**ప్ర :** తస్య పత్నీ = వాని భార్య, హృదా అపి = మనసుతో కూడ, అన్యమ్ = ఇతరుని, న ఐచ్ఛత్ = కోరలేదు, హృత్+ధరా = హృదయమును నిండిన, సతీ = పతివ్రత, అభూత్ = ఆయెను,

గీతజ్ఞః = సంగీతవేత్తయగు, విప్రః = బ్రాహ్మణుడు, చిత్త+అనురూపయా = తన కోరికకు తగినదైన, తయా+ఏవ = ఆమె తోడనే, రేమే = రమించెను.

**తా :** ఆ బ్రాహ్మణుని భార్య పతివ్రత. అన్యపురుషుని మనసులోనైన కోరలేదు. మనసార భర్తనే కామించినది. ఆ సంగీతశాస్త్రవేత్త తనకు తగిన ఆమెతోనే రమించినాడు.

**శ్లో॥ చక్రే విత్తానుసారేణ నిత్యనైమిత్తికాః క్రియాః ।**
**యథారుచి యథాకాలం దివ్యార్థాన్ బుభుజే స చ ॥ 54**

**ప్ర :** విత్త+అనుసారేణ = ధనము కొలది, సః = ఆతడు, నిత్యనైమిత్తికాః క్రియాః = నిత్యక్రియలను, నైమిత్తిక క్రియలను, చక్రే = చేసెను, చ = మరియు, యథాకాలమ్ = కాలానుగుణముగా, యథారుచి = తనకు నచ్చిన విధముగా, దివ్య+అర్థాన్ = స్వర్గభోగములను, బుభుజే = అనుభవించెను.

**తా :** ధనముండుటంబట్టి సంధ్యావందనాది నిత్యకర్మలను, పితృతర్పణాదులను పర్వదినములందు నిర్వహించుటవంటి నైమిత్తికకర్మలను నిర్వర్తించి, ఆ బ్రాహ్మణుడు ఆయువున్నంతవరకు తనకు నచ్చిన స్వర్గభోగములను అనుభవించినాడు.

**శ్లో॥ న శ్రుతం నానుభూతం చ తాభ్యామంహోఽల్పమప్యకమ్ ।**
**దైవాత్ప్రేత్య స సస్త్రీకో గన్ధర్వేశోఽభవత్సుధీః ॥ 55**

**ప్ర :** తాభ్యామ్ = వారిద్దరిచేత, అల్పం అపి = కొంచెమైనను, అంహః = పాపము, న శ్రుతమ్ = వినబడలేదు, అకమ్ = దుఃఖము, న+అనుభూతమ్ = అనుభవింపబడలేదు, చ = మరియు, దైవాత్ = విధివశమున, ప్రేత్య = మరణించి, సః సుధీః = ఆ పండితుడు, సస్త్రీకః = తన భార్యతో గూడినవాడై, గన్ధర్వేశః = గంధర్వరాజుగా, అభవత్ = జన్మించెను. (ఆయెను).

**తా :** ఆ దంపతులను గూర్చి పాపపు మాటలు వినబడలేదు; వారు కొంచెమైన దుఃఖము ననుభవించలేదు. కాగా, విధివశమున మరణించి ఆతడు భార్యతో గూడ గంధర్వరాజుగా జన్మించినాడు.

**శ్లో॥ తత్రైవ నాదవిత్సోఽపి చార్వ్యా పత్న్యా సదాఽరమత్ ।**
**తన్వ్యా సర్వకలాభిజ్ఞో విధినా రమయన్ సురాన్ ॥ 56**

**ప్ర :** తత్ర ఏవ = అచటనే, ఆ గంధర్వలోకముననే, సః నాదవిత్ సర్వకలాభిజ్ఞః = సర్వకళాకుశలుడైన ఆ సంగీతవేత్త, చార్వ్యా తన్వ్యా పత్న్యా = అందమైన భార్యతో, విధినా = శాస్త్రానుసారము, సురాన్ = దేవతలను, రమయన్ = సంతోష పెట్టుచు, అరమత్ = రమించెను.

**తా :** ఆ గంధర్వలోకముననే కళాప్రవీణుడు, సంగీతవేత్తయైన ఆ బ్రాహ్మణుడు శాస్త్రముదప్పక దేవతలకు ప్రియము సేయుచు, తన అందమైన భార్యతో సదా ఆనందించెను.

**శ్లో॥ హిమాచలవనే రమ్యే కదాచిచ్ఛివయా శివః ।**
**ఉచ్చైర్గాయన్తమాకర్ణ్య సుస్వరం తమవాప సః ॥ 57**

**ప్ర :** రమ్యే = అందమైన, హిమాచలవనే = హిమాచలమందలి వనమున, కదాచిత్ = ఒకానొకప్పుడు, శివయా = పార్వతితో, శివః = శివుడు, సుస్వరమ్ = చక్కని కంఠస్వరముగల, ఉచ్చైః గాయన్తమ్ = గొంతెత్తి పాడుచున్న, ఆకర్ణ్య = ఆ గానమును విని, సః= శివుడు, తం అవాప = ఆ గంధర్వరాజును చేరెను.

**తా :** అందమైన హిమాలయమునందలి అడవిలో పార్వతితో విహరించు శివుడొకప్పుడు మధురమైన గాత్రముతో ఉచ్చైఃస్వరమున పాడుచున్న గంధర్వపతి గానమును విని, వాని వద్దకు వచ్చెను.

**శ్లో॥ నత్వేశం సహపత్న్యా స నాదజ్ఞో మఞ్జులస్వరః ।**
**గీతైరతోషయత్ప్రాహ మౌలిమాన్దోలయన్ శివః ॥ 58**

**ప్ర :** సః నాదజ్ఞః = ఆ నాదవేత్త, సహపత్న్యా = భార్యతోగూడ, ఈశం నత్వా = శివునకు నమస్కరించి, మంజుల–స్వరః = మధురమైన గాత్రము గలవాడై, గీతైః = పాటలతో, అతోషయత్ = సంతోషపరచెను, శివః = శివుడు, మౌలిం+ఆన్దోలయన్ = తలయూచుచు, ప్రాహ = ఇట్లనెను.

**తా :** ఆ నాదజ్ఞుడు భార్యతోగూడ శివునకు నమస్కరించి, తన తియ్యని గళమెత్తి పాడి సంతోషపరచెను. శివుడు తలయూచుచు విని ఆనందించి, వానితో ఇట్లనెను.

**శ్లో॥ సుశిక్షోఽస్యద్య యావన్మే శ్రుతం నేదృఙ్మనోరమమ్ ।**
**ధన్యోఽసి త్వం దివం యాహి భుంక్ష్వ భోగాన్ సుదుర్లభాన్ ॥ 59**

**ప్ర :** అద్య = నేడు, ఈదృక్ = ఇంతటి, మనోరమమ్ = మనస్సునానందింప జేయునది, యావత్ మే శ్రుతమ్ = నేను వినినంతలో (నాకు వినికిడి యున్నంతలో), న = లేదు, సుశిక్షః అసి = చక్కగా నేర్చితివి, ధన్యః అసి = ధన్యుడవైతివి, త్వమ్ = నీవు, దివం యాహి = స్వర్గమునకు పొమ్ము, సుదుర్లభాన్ భోగాన్ = అతిదుర్లభమైన భోగములను, భుంక్ష్వ = అనుభవింపుము.

**తా :** నేడు నేను వినిన యీ గానమునకు సరితూగునది ఇంతవరకు నేను వినినంతలో లేదు. సంగీతశాస్త్రమున చక్కని శిక్షణ పొందితివి, ధన్యుడవైతివి. నీవు స్వర్గమున అతిదుర్లభమైన భోగములనుభవింపుము, పొమ్ము.

**శ్లో॥ తతో లబ్ధవరో గత్వా విమానేన దివం స తు ।**
**త్వదాదీన్నమయామాస సుగీతైర్భార్యయా సహ ॥ 60**

**ప్ర :** లబ్ధవరః సః తు = వరమును పొందిన ఆతడేమో, తతః = అక్కడనుండి, విమానేన = విమానము నెక్కి, దివం గత్వా = స్వర్గమున కేగి, త్వత్ ఆదీన్ = నిన్నునూ తక్కినవారినిన్నీ,

భార్యయా సహ = తన భార్యతో గూడ, సుగీతైః = చక్కని పాటలతో, నమయామాస = స్తోత్రము చేసెను.

**తా :** ఆతడా వరమును పొంది, భార్యతోగూడ విమానముపై స్వర్గమున కేగి, ఇంద్రుని, అచ్చటగల మిగత వారిని తన పాటలతో నుతించెను. *

**శ్లో॥ కదాచిద్బ్రహ్మలోకేఽభూన్మహోత్సాహోఽఖిలాః ।
సంప్రాప్తాస్తత్ర సదసి గన్ధర్వాప్సరసో జగుః ॥ 61**

**ప్ర :** కదాచిత్ = ఒకప్పుడు, బ్రహ్మలోకే = బ్రహ్మలోకమున, మహా+ఉత్సాహః = గొప్ప ఉత్సవము, అభూత్ = ఆయెను, అఖిలాః సురాః = దేవతలందఱును, సంప్రాప్తాః = వచ్చి చేరిరి, తత్ర = అచట, సదసి = సభలో, గన్ధర్వ+అప్సరసః = గంధర్వులు అప్సరసలు, జగుః = గానము చేసిరి.

**తా :** ఒకప్పుడు బ్రహ్మలోకములో గొప్ప ఉత్సవము జరుగగా, దేవతలందఱు వచ్చిరి. అచటి సభలో గంధర్వులు, అప్సరసలు పాడిరి.

**శ్లో॥ తతానద్ధఘనచ్ఛిద్రవాద్యైః సహ సుమఞ్జులమ్ ।
తత్ర సర్వేషు గాయత్సు బ్రహ్మైకాగ్రమనా అభూత్ ॥ 62**

**ప్ర :** తత = వీణాది తంత్రీవాద్యములతో, ఆనద్ధ = మురజాదులతో, ఘన = కాంస్య తాళములతో, ఛిద్ర = వేణువు మొదలగు, వాద్యైః = వివిధ వాద్యములతో, సహ = కలిసి, సుమఞ్జులమ్ = చాల మధురముగా, గాయత్సు = పాడుచున్న, సర్వేషు = అందఱిలో, తత్ర = అచట, బ్రహ్మ+ఏక+అగ్రమనాః = బ్రహ్మపై లగ్నమైన మనస్సు, అభూత్ = ఆయెను.

**తా :** తంత్రీవాద్యములు, కాంస్యతాళములు, వేణువు, మురజ మొదలగు వివిధ వాద్యములతో గొంతు కలిపి అచట పాడుచున్న వారందఱిలోనూ బ్రహ్మపై మనస్సు లగ్నమైనది.

**శ్లో॥ బ్రహ్మోహైషాం తు సర్వేషాం కోఽయం గాయతి సుస్వరమ్ ।
తదా త్వయేన్ద్ర! స స్రష్టే దర్శితో నేత్రసంజ్ఞయా ॥ 63**

**ప్ర :** బ్రహ్మా ఆహ = బ్రహ్మ యిట్లనెను, ఏషాం సర్వేషాం తు = వీరందరి లోనేమో, సుస్వరం గాయతి = మధురమైన కంఠముతో పాడుచున్నవాడు, అయం కః= ఆతడెవడు?, తదా = అప్పుడు, ఇన్ద్ర = ఓ ఇంద్రా!, త్వయా = నీ చేత, సః = ఆతడు, నేత్రసంజ్ఞయా = కంటిచూపుతో, స్రష్టే = బ్రహ్మకు, దర్శితః = చూపబడినాడు.

**తా :** బ్రహ్మ అడిగినాడు, వీరందరిలో సుమధురకంఠముతో పాడిన ఆ గాయకుడెవరని. అప్పుడు ఇంద్రుడు ఈ గాయకుని తన చూపుతో సూచించినాడు.

**శ్లో॥ తదా నివారయామాస కః సర్వాన్ హస్తసంజ్ఞయా ।**
**సస్త్రీకః స తతోఽగాయన్నానారాగం చ సుస్వరమ్ ॥ 64**

**ప్ర :** తదా = అప్పుడు, కః = బ్రహ్మ, సర్వాన్ = అందఱును, హస్తసంజ్ఞయా = చేతి కదలికతో, నివారయామాస = పాడవలదని వారించెను, చ = మరియు, తతః = అటనుండి, సస్త్రీకః = భార్యతో గూడి, సః = ఆ గాయకుడు, సుస్వరమ్ = చక్కని కంఠముతో, నానారాగం అగాయత్ = వివిధ రాగములతో పాడెను.

**తా :** అప్పుడు బ్రహ్మ గాయకులనందఱను పాడవలదని చేసంజ్ఞతో నిలిపెను. అంతట ఆ గాయకుడు భార్యతో గొంతు కలిపి చక్కగా అనేక రాగములతో పాడెను.

**శ్లో॥ శ్రుత్వా గీతం తదానన్దం జ్ఞాత్వాఽవోచ విధిస్తదా ।**
**నాదబ్రహ్మాత్మతత్త్వం తత్సమ్యక్ ప్రాప్తమనేన హి ॥ 65**

**ప్ర :** గీతమ్ = పాటను, శ్రుత్వా = విని, తత్+ఆనన్దమ్ = అందలి ఆనందమును, జ్ఞాత్వా = తెలిసికొని, విధిః = బ్రహ్మ, తదా = అప్పుడు, అవోచ = ఇట్లనెను, అనేన హి = వీనిచేతనే, నాదబ్రహ్మ+ఆత్మతత్త్వం తత్ = నాదబ్రహ్మముయొక్క ఆత్మదైన తత్త్వము అనుదానిని, సమ్యక్ = చక్కగా, ప్రాప్తమ్ = గ్రహించబడినది.

**తా :** వాని ఆ పాటను విని, ఆనందించి, బ్రహ్మ యిట్లనెను : ఈ గాయకుడే నాదబ్రహ్మహృదయ సత్యమును బాగుగా తెలిసిన వాడు.

**శ్లో॥ విలక్షణోఽస్య చానన్దో రమయత్యపరానపి ।**
**బ్రహ్మలోకనివాసోఽస్య యుక్తో భార్యాన్వితస్య హి ॥ 66**

**ప్ర :** అస్య = వీనియొక్క, ఆనన్దః = గానానందము, విలక్షణః = విశేష లక్షణము కలిగినది, హి = ఏలన, రమయతి+అపరాన్ అపి = మిగత వారిని గూడ రమింపజేయును. భార్యాన్వితస్య = భార్యతోకూడియున్న, అస్య = వీనికి, యుక్తః = తగినది, బ్రహ్మలోకనివాసః = బ్రహ్మలోక నివాసము.

**తా :** వీని నాదబ్రహ్మానందము విలక్షణము. ఎట్లన, ఈతడు తన్మయుడై గానము చేయుటవలన వినువారిని కూడ ఆనందపరవశుల జేయుచున్నాడు. వీనికి తగిన నివాసస్థానము బ్రహ్మలోకమే.

**శ్లో॥ ఇత్యుక్త్వా కృపయా తస్మై యద్బ్రహ్మ శ్రుత్యగోచరమ్ ।**
**ముదా ప్రదర్శ్య సస్త్రీకం తం స్వాగ్రేఽస్థాపయద్విధిః ॥ 67**

**ప్ర :** ఇతి ఉక్త్వా = అని పలికి, కృపయా = దయతో, తస్మై = వానికై, శృతి+అగోచరం యత్ బ్రహ్మ = యే పరబ్రహ్మ వేదాతీతుడో, ఆ పరబ్రహ్మను, ప్రదర్శ్య = ప్రదర్శించి, ముదా =

సంతోషముతో, సస్త్రీకం తమ్ = భార్యతోగూడిన వానిని, స్వ+అగ్రే = తన ఎదుట, విధిః = బ్రహ్మ, అస్థాపయత్ = నిల్పెను.

**తా :** ఇట్లని పలికి ఆ గాయకునకు దయతో వేదాతీతుడైన పరబ్రహ్మదర్శన మిచ్చి, భార్యాసమేతముగా వానిని తన సన్నిధిలో నిల్పెను.

**శ్లో॥ ఏవం స కామశాస్త్రజ్ఞో భోగాన్ భుక్త్వాఽఖిలాన్ క్రమాత్ ।**
**సస్త్రీకోఽగాత్పరమానన్దం శాస్త్రం శుద్ధికరం న కిమ్ ॥ 68**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగా, సః కామశాస్త్రజ్ఞః = ఆ కామశాస్త్రప్రవీణుడు, అఖిలాన్ భోగాన్ భుక్త్వా = భోగములన్నింటిని అనుభవించి, సస్త్రీకః = భార్యతో గూడ, పరమ+ఆనన్దమ్ = బ్రహ్మలోకనివాసానందమును, క్రమాత్ అగాత్ = కాలక్రమమున పొందెను, శాస్త్రమ్ = శాస్త్రము, శుద్ధికరం న కిమ్ = శుద్ధికరము కాదా యేమి?

**తా :** ఈ రీతిగా కామశాస్త్రప్రవీణుడైన గాయకుడు అన్ని భోగములను అనుభవించి కాలక్రమమున భార్యతో గూడ బ్రహ్మలోకమును పొందినాడు. మరి శాస్త్రము శుద్ధికరము, అనుట సరియే కదా?

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం తృతీయాష్టకే పంచమోఽధ్యాయః ॥

ఓమ్ శం

**అష్టాక్షరో దత్తాత్రేయమన్త్రః**

**ఓం దత్తాత్రేయాయ నమః ॥**

శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## తృతీయాష్టకము - షష్ఠాధ్యాయము

**శ్లో॥ ఏవం త్వన్యద్బ్రువే కశ్చిద్వేదశర్మా ద్విజోఽభవత్ ।**
**సుశీలస్తత్సుతో దైవాత్సప్తబ్రహ్మగ్రహైర్వృతః ॥ 1**

**ప్రతిపదార్థం :** ఏవం తు = ఈ విధమైనదే, అన్యత్ = మరియొకటి, బ్రువే = చెప్పుదును, కశ్చిత్ ద్విజః వేదశర్మా అభవత్ = వేదశర్మ యను బ్రాహ్మణుడొకడుండెను, తత్ సుతః సుశీలః = మంచి నడవడి గలవాడు వాని కుమారుడు, దైవాత్ = విధివశమున, సప్త బ్రహ్మగ్రహైః వృతః = పరకాయ ప్రవేశము చేయగల ఏడు భూతములచే (బ్రహ్మరాక్షసులచే) ఆవహింపబడినాడు.

**తాత్పర్యము :** ఈ విధమైనదే మరియొకటి చెప్పుదును, వినుము. వేదశర్మ యను బ్రాహ్మణుడుండెను. వాని కుమారుడు మంచి నడవడి గలవాడు. దైవవశమున ఏడు బ్రహ్మరక్షస్సు లతని నావేశించినవి.

**శ్లో॥ దుర్ధరాన్దురభిప్రాయాన్ పరస్పరజయైషిణః ।**
**సూపాయైర్నాశశాకైతాన్ సముద్ధర్తుం శుశోచ సః ॥ 2**

**ప్ర :** సః = ఆ బ్రాహ్మణుడు వేదశర్మ, పరస్పరజయ+ఏషిణః = ఒకరినొకరు జయించవలెనని కోరిక గలవారగు, ఏతాన్ దుర్ధరాన్ = సహింపరానివారైన ఆ సప్తబ్రహ్మగ్రహములను, దురభిప్రాయాన్ = అపకారి భావములుగలవారిని, సు+ఉపాయైః = మంచి, మృదువైన ఉచ్చాటనాది ఉపాయములతో, సముద్ధర్తుమ్ = బాగుచేయుటకు, న శశాక = సమర్థుడు కాకపోయెను, శుశోచ = విచారించెను.

**తా :** ఆ వేదశర్మ తన కుమారు నావేశించిన బ్రహ్మరక్షస్సు లేడును సహింపరానివి, అపాయకారులు, పరస్పరస్పర్థతో నున్నవారని గ్రహించియు, వారిని నివారించి తన కుమారుని రక్షించికొనుటకు ఉచ్చాటనాది ఉపాయములు చేసియు విఫలప్రయత్నమున విచారగ్రస్తుడాయెను.

**శ్లో॥ గ్రహావిష్టోరుదన్ముహ్యన్నృత్యన్ధావన్హసన్రుషా ।**
**నానాచేష్టావ్యథాదేవం స్వార్థాద్భ్రష్టః స దైవతః ॥** **3**

**ప్ర :** దైవతః = విధివశమున, గ్రహ+ఆవిష్టః సః = గ్రహములచే ఆవేశింపబడిన ఆ బ్రాహ్మణ కుమారుడు, స్వార్థాత్ భ్రష్టః = ఆత్మజ్ఞానమునకై చేయునది మానినాడు, ఏవమ్ = ఇట్లు, ఈ విధముగా, రుదన్ = ఏడ్చుచు, ముహ్యన్ = మూర్ఛిల్లుచు, నృత్యన్ = నాట్యము చేయుచు, ధావన్ = పరుగెత్తుచు, రుషా = రోషముతో, హసన్ = నవ్వుచు, నానాచేష్టా వ్యథాత్ = వివిధములైన చేష్టలతో బాధవలన.

**తా :** దైవవశమున దుష్టగ్రహావిష్టుడైన ఆ బ్రాహ్మణకుమారుడు తన విధులను విడచి, ఏడ్చుచు, మూర్ఛిల్లుచు, నాట్యము చేయుచు, పరుగెత్తుచు, నవ్వుచు, రోషము జూపుచు ప్రవర్తింపసాగెను. భూతోచ్చాటనాది ప్రయత్నములతో నివారింపజూచియును వాని తండ్రి కృతకృత్యుడు కాకపోయెను.

**శ్లో॥ కదాచిద్వైశ్వదేవాన్తే తద్గృహే ధూలిధూసరః ।**
**భిక్షుకో భస్మలిప్తాఙ్గో మలినో మక్షికావృతః ॥** **4**

**శ్లో॥ దుర్గన్ధః ప్రాప తేజస్వీ తస్మై భిక్షాం దదౌ ద్విజః ।**
**ఛన్నాత్మా కోఽయమిత్యుక్త్వా పృష్ఠలగ్నోఽభవద్ద్విజః ॥** **5**

**ప్ర :** కదాచిత్ = ఒకప్పుడు, వైశ్వదేవ+అన్తే = వైశ్వదేవము జరిగిన తర్వాత, ధూలిధూసరః = మట్టిగొట్టుకొనియున్నవాడు, భస్మలిప్తాఙ్గః = బూడిద పూసికొన్న శరీరముగలవాడు, మలినః = మురికిగా నున్నవాడు, మక్షికా+ఆవృతః = ఈగలు ముసురుకొన్నవాడు, దుర్గన్ధః = దుర్వాసన గలవాడు, తేజస్వీ = తేజస్సుగలవాడు, భిక్షుకః = బిచ్చమెత్తువాడు, తత్ గృహే ప్రాప = ఆ బ్రాహ్మణునింటికి వచ్చెను; ద్విజః = బ్రాహ్మణుడు, తస్మై = వానికై, భిక్షాం దదౌ = భిక్షనిచ్చెను, కః అయం ఛన్నాత్మా = ఈ రహస్య స్వభావముగల భిక్షకుడు ఎవరు? ఇతి ఉక్త్వా = అని పలికి, ద్విజః = బ్రాహ్మణుడు, పృష్ఠలగ్నః – అభవత్ = (వాని) వెంట నంటి నడచెను.

**తా :** ఒకప్పుడు ఆ బ్రాహ్మణుడు వైశ్వదేవమును పూర్తిచేసికొను సమయమున వాని యింటికొక భిక్షకుడు వచ్చినాడు. ఆతడు మట్టిగొట్టుకొని యున్నాడు, బూది బూసికొని యున్నాడు, మురికిగా నున్నాడు, దుర్వాసనతో నున్నాడు, ఈగలు ముసురుచున్నవి, అయినను మంచి తేజస్సుగలవాడు. వానికా బ్రాహ్మణుడు భిక్షచేసి, ఇంతటి తేజస్వి యిట్లున్నాడనగా యేదో రహస్యమున్నదని తలచి ఆ భిక్షుకుని వెంట నడచినాడు.

**శ్లో॥ భిక్షుస్తం తాడితమపి కాష్ఠలోష్టేష్టికోపలైః ।**
**పశ్చాద్ధావన్తమూచే కిం కార్యం ప్రాప్తేన తే మయా ॥** **6**

**ప్ర :** కాష్ఠ = కర్రలతో, లోష్ఠ = మట్టిగడ్డలతో, ఇష్టికా = ఇటుకలతో, ఉపలైః = రాళ్ళతో,

తాడితం అపి = కొట్టబడుచున్నవాడైనను, పశ్చాత్ ధావన్తమ్ = తన వెంట పరుగిడుచున్నవాడగు, తమ్ = ఆ బ్రాహ్మణుని, భిక్షుః ఊచే = భిక్షువు ఇట్లడిగెను, తే = నీకు, మయా = నాతో, ప్రాప్తేన = కలిసినందున, కిం కార్యమ్ = ఏమి లాభము?

**తా :** అట్లు వెంటబడి వచ్చుచున్న బ్రాహ్మణుని వదిలించికొనుటకై ఆ భిక్షువు వానిని కఱ్ఱలతో, మట్టిగడ్డలతో, రాళ్ళతో కొట్టినాడు. అయినను ఆతడు వెనుదిరగక తనవెంటే వచ్చుట చూచి, యిట్లడిగినాడు : నన్ను కలియుటకు నీ వెందుకు వచ్చుచున్నావు? నాతో నీకేమి పని?

**శ్లో॥ ఇత్యుక్తో దుఃఖితః పుత్రముక్త్యై తం ప్రార్థయద్ద్విజః ।**
**ప్రాదుర్భూయాత్మనా దత్తో దత్వా సప్త మనూన్ జగౌ ॥ 7**

**ప్ర :** ఇతి ఉక్తః = ఇట్లడుగబడి, దుఃఖితః = దుఃఖించిన, ద్విజః = బ్రాహ్మణుడు, పుత్రముక్త్యై = కుమారుని శ్రేయస్సును కోరి, తమ్ = ఆ భిక్షువును, ప్రార్థయత్ = ప్రార్థించెను, దత్తః = శ్రీ దత్తప్రభువు, ప్రాదుర్భూయ+ఆత్మనా = తన నిజస్వరూపముతో ప్రత్యక్షమై, సప్త = ఏడు, మనూన్ = మంత్రములను, దత్వా = ఇచ్చి, జగౌ = వెడలెను.

**తా :** యిట్లడుగగా, దుఃఖితుడైన ఆ బ్రాహ్మణుడు తన కుమారుని స్థితిని వివరించి వాని కా పీడ తొలగింపు మని ప్రార్థించెను. అంత శ్రీదత్తభగవానుడు నిజస్వరూపముతో దర్శనమిచ్చి, వానికి యేడు మంత్రముల నిచ్చి వెడలెను.

**శ్లో॥ ఏకైకేనైషామేకైకం క్రమాద్గ్రహమపాకురు ।**
**యథాఽజ్ఞానావృతీః శాస్త్రైః క్రమాదున్మూలయన్త్యమూః ॥ 8**

**ప్ర :** శాస్త్రైః = శాస్త్రములచేత, అజ్ఞాన+ఆవృతీః = అజ్ఞానపు పొరలు, యథా = యే విధముగా, క్రమాత్ = ఒకదాని వెంటనొకటిగా, ఉన్మూలయన్తి = తొలగించుచున్నవో, అమూః = ఈ మంత్రములు, ఏక+ఏకేన = ఒకదానిచే నొకటిగా, ఏషామ్ = వీనిలో, ఏక+ఏకమ్ = ఒకటొకటిగా, గ్రహమ్ = గ్రహమును, క్రమాత్ = వరుసగా, అపా కురు = తొలగించుము.

**తా :** శాస్త్రవిజ్ఞానమును పొంది ఒకటొకటిగా యెట్లు అజ్ఞానపు పొరలను తొలగించుకొందుమో, అట్లే నే నుపదేశించిన యీ యేడు మన్త్రములను ఒకటొకటిగా ప్రయోగించి నీ కుమారునావేశించిన యేడు బ్రహ్మరాక్షసులను వరుసగా ఒక్కొక్కదానిని తొలగించుము.

**శ్లో॥ న హ్యన్యోన్యవిరుద్ధాస్తే జయ్యా ఏకేన దుర్గ్రహాః ।**
**తథైభిస్తాన్ జహీత్యుక్త్వా దేవోఽదృశ్యోఽభవత్ క్షణాత్ ॥ 9**

**ప్ర :** తే దుర్గ్రహాః = ఈ దుష్టగ్రహములు, అన్యోన్యవిరుద్ధాః = పరస్పరము వ్యతిరేకమైనవి, ఏకేన = ఒక్క మంత్రముతో, న హి జయ్యాః = జయింపరానివి, తథా = ఆ రీతిగా, ఏభిః = ఈ యేడు మంత్రములతో, తాన్ = ఆ దుష్టగ్రహములను, జహి = వదలింపుము, ఇతి ఉక్త్వా = అని

పలికి, దేవః = శ్రీదత్తదేవుడు, క్షణాత్ = రెప్పపాటులో, అదృశ్యః అభవత్ = కంటికి కనరాక పోయెను.

**తా :** ఈ దుష్టగ్రహములు పరస్పరము శత్రువులు కావున ఒకే మంత్రముతో వీని నన్నిటిని వెడలింపలేము. ఒక్కొక్క గ్రహమున కొక్కొక్క మంత్రము అవసరమగును. నీవును అట్లే యీ యేడు మంత్రములను ప్రయోగించి వానిని వదిలింపుము, అని చెప్పి శ్రీదత్తదేవుడు క్షణములో కనరాకపోయెను.

**శ్లో॥ తతస్తుష్టః స ధామైత్య యథా దత్తదితం వ్యధాత్ ।**
**ఏకైకమన్త్రేణైకైకమేకైకేన దినేన సః ॥ 10**

**శ్లో॥ మన్త్రశాస్త్రవిధానేన క్రమాద్గ్రాహమపాకరోత్ ।**
**శోకాద్యేకైకవారేణ నష్టమేకైకనిర్గమే ॥ 11**

**ప్ర :** తతః = అంతట, తుష్టః సః = సంతోషించిన ఆతడు, ధామ+ఏత్య = ఇంటికి వెడలి, యథా = ఎట్లు, దత్తదితమ్ = శ్రీదత్తునిచే విభజించబడెనో అట్లే, సః = అతడు, ఏకైకమన్త్రేణ = ఒక్కొక్క మంత్రముతో, ఏకైకమ్ = ఒక్కొక్కదానిని, ఏకైకేన దినేన = ఒక్కొక్క రోజున, మన్త్రశాస్త్రవిధానేన = మంత్రశాస్త్రములో చెప్పబడిన పద్ధతి ననుసరించి, క్రమాత్ = వరుసగా, గ్రాహమ్ = గ్రహమును, అపాకరోత్ = తొలగించెను, ఏకైకవారేణ = ఒక్కొక్క రోజున, ఏకైకనిర్గమే = ఒక్కొక్కటి తొలగిపోవుటలో, శోకాది నష్టమ్ = దుఃఖములనుండి బైటపడెను.

**తా :** అంతట ఆ బ్రాహ్మణుడు సంతోషించి ఇంటికి వెడలి, శ్రీ దత్తుడు చెప్పినట్లే విభజించి రోజుకొక్క మంత్రమును మంత్రశాస్త్రప్రకారము ప్రయోగించి, రోజుకొక్క గ్రహమును తొలగించుచు, క్రమముగా ఆ దుఃఖముల నుండి బైటపడెను.

**శ్లో॥ పూర్వవత్సోఽష్టమేఽహన్యాసీత్సోఽభ్యాసాద్యయౌ గతిమ్ ।**
**శాస్త్రం క్షుద్రమపీదం తు మోక్షోపకృతయే న కిమ్ ॥ 12**

**ప్ర :** అష్టమే అహని = ఎనిమిదవ రోజున, సః = ఆతడు, పూర్వవత్ = పూర్వము వలె, ఆసీత్ = ఆయెను, సః = ఆతడు, అభ్యాసాత్ = సాధనవలన, గతిం యయౌ = మోక్షమును పొందెను. ఇదం శాస్త్రమ్ = ఈ మంత్రశాస్త్రము, క్షుద్రం అపి = క్షుద్రమైనదేయైనను, తు = కాని, మోక్ష+ఉపకృతయే = మోక్షమునకు సహకారి, న కిమ్ = కాదా యేమి?

**తా :** ఎనిమిదవ దినమున, దుష్టగ్రహము లన్నియు తొలగిపోగా, ఆతడు మునుపటివలె ఆయెను. అటనుండి అభ్యాసమువలన మోక్షమును పొందెను. ఈ మంత్రశాస్త్రము క్షుద్రమైనదే. ఐనను దీనిచే ఆ బ్రాహ్మణకుమారుడు ఉపకారమునే పొందినాడు కదా. అట్లాతనికి మోక్షసాధనసుగమము చేసినది యీ మంత్రములే కదా. మరి ఆ శాస్త్రము ఉపకారి కాదనదగునా?

**శ్లో॥ మాతాపురే విష్ణుదత్తశర్మా పత్న్యా సుశీలయా ।**
**న్యవసద్గృహిధర్మేణ దత్తభక్తో మహామతిః ॥ 13**

**ప్ర :** మాతాపురే = మాతాపురమున (రేణుకాపురమున), విష్ణుదత్తశర్మా = విష్ణుదత్తశర్మ యను నాతడు, పత్న్యా సుశీలయా = సుశీలయను పేరుగల తన భార్యతో, దత్తభక్తః = దత్తప్రభుభక్తుడై, మహామతిః = మోక్షకామియై, గృహిధర్మేణ = గృహస్థధర్మము ననుసరించుచు, న్యవసత్ = నివసించెను.

**తా :** మాతాపురమని నామాంతరముగల రేణుకాపురమున విష్ణుదత్తశర్మ యను నాతడు సుశీలయని పేరుగల భార్యతో నివసించెను. ఆతడు శ్రీదత్తభక్తుడు, మోక్షకామి, గృహస్థధర్మానువర్తి.

**శ్లో॥ తద్ద్వార్యశ్వత్థవృక్షేఽభూద్బ్రహ్మరక్షో దినేదినే ।**
**విప్రత్యక్తం భూతబలిం బుభుజేపీడయన్న తౌ ॥ 14**

**ప్ర :** తత్ ద్వారి = వాని ఇంటి వాకిలియందు, అశ్వత్థవృక్షే = అశ్వత్థవృక్షముపై, బ్రహ్మరక్షః = బ్రహ్మరక్షస్సు, అభూత్ = ఉండెను, దినేదినే = ప్రతిదినమును, విప్రత్యక్తమ్ = బ్రాహ్మణుడు వదలిన, భూతబలిమ్ = భూతబలిగా వదలిన ఆహారమును, బుభుజే = భుజించెను, తౌ = ఆ బ్రాహ్మణదంపతులను, న పీడయత్ = పీడింపకుండెను.

**తా :** వాని ఇంటి వాకిలియందు అశ్వత్థవృక్షముపై బ్రహ్మరక్షస్సుండెను. దినదినము బ్రాహ్మణుడి విధిగా వదలిన భూతబలిని ఆహారముగా గొని, ఆ బ్రహ్మరక్షస్సు ఆ బ్రాహ్మణదంపతులను పీడింపకుండెను.

**శ్లో॥ తేనాన్యే పీడితా లోకాః శాన్తో విప్రాన్నసేవనాత్ ।**
**కదాచిద్వైశ్వదేవాన్తే ప్రాదురాస స్వరూపతః ॥ 15**

**ప్ర :** తేన = ఆ బ్రహ్మరక్షస్సుచేత, అన్యే లోకాః = తదితరులైన ప్రజలు, పీడితాః = పీడింపబడినారు, (సః = అతడు), విప్ర+అన్నసేవనాత్ = బ్రాహ్మణుని అన్నమును తిననందువలన, శాన్తః = ప్రసన్నుడై, కదాచిత్ = ఒకప్పుడు, వైశ్వదేవ+అన్తే = వైశ్వదేవవిధి పూర్తియైన తర్వాత, స్వరూపతః = నిజరూపముతో, ప్రాదుః+ఆస = ప్రత్యక్షమాయెను.

**తా :** ఆ బ్రహ్మరక్షస్సు యితరులను బాధించినది, (కాని, ఆ దంపతులను కాదు). పైగా, ఆ బ్రాహ్మణభోజనమువలన శాంతించి, ఒకనాడు, ఆ విప్రుని వైశ్వదేవవిధి అనంతరము, వాని ఎదుట నిజస్వరూపముతో నిల్చెను.

**శ్లో॥ దృష్ట్వాఽత్మానం కరాలం తం భీతం జ్ఞాత్వాఽఽహ మఞ్జువాక్ ।**
**విప్ర! మా భీర్వృణీష్వేష్టం రాక్షసోఽహం త్వదన్నభుక్ ॥ 16**

**ప్ర :** ఆత్మానం కరాలం దృష్ట్వా = భయంకరుడైయున్న తనను చూచి, భీతమ్ = భయము

జెందియున్న వానిగా, తమ్ = ఆ బ్రాహ్మణుని, జ్ఞాత్వా = తెలిసికొని, మఞ్జువాక్ = మధురమైన కంఠముతో, ఆహ = ఇట్లనెను, విప్ర = ఓ బ్రాహ్మణా!, మా భీః = భయపడవద్దు, ఇష్టం వృణీష్వ = నీకేది ప్రీతికరమో దానిని కోరుము, అహమ్ = నేను, త్వత్+అన్నభుక్ రాక్షసః = నీయొక్క అన్నముదిన్న రాక్షసుడను.

**తా :** తన రూపమును జూచి భయపడుచున్న ఆ బ్రాహ్మణునితో చక్కని మాటలతో ఇట్లనెను : ఓ బ్రాహ్మణా! భయము వలదు. నేను నీ అన్నముదిన్న రాక్షసుడను. నీ యభీష్టమును కోరుకొనుము.

**శ్లో॥ స్వపత్న్యభిమతేనాహ శ్రీదత్తం దర్శయాపరమ్ ।**
**న కాఙ్క్షేఽత్ర పరత్రాపీత్యుక్తః ప్రాహ స రాక్షసః ॥ 17**

**ప్ర :** స్వపత్నీ+అభిమతేన = తన భార్యయొక్క కోరికననుసరించి, ఆహ = యిట్లనెను, శ్రీదత్తం దర్శయ = శ్రీదత్తాత్రేయుని దర్శనము కలిగించుము, అత్ర = ఈ లోకమున, పరత్ర+అపి = వేరొకలోకమునగూడ, అపరమ్ = మరియొకటి, న కాంక్షే = కోరను, ఇతి+ఉక్తః = అని చెప్పబడినవాడై, సః రాక్షసః = ఆ బ్రహ్మరాక్షసుడు, ప్రాహ = యిట్లనెను.

**తా :** తనభార్య కోరికననుసరించి ఆ బ్రాహ్మణుడు యిట్లనెను : మాకు శ్రీదత్తుని దర్శనమును కలిగించుము. వేరేమియు ఇహపరములలో మాకు కోరదగినది లేదు. అది విని ఆ రాక్షసుడిట్లనెను.

**శ్లో॥ తదాఖ్యాపి న మే శ్రావ్యా తథాపి కథయామి తే ।**
**తుష్టోఽస్మి ప్రతికర్తుం తే ప్రయత్నాద్దర్శయామ్యతః ॥ 18**

**ప్ర :** తత్+ఆఖ్యా+అపి = వాని పేరైనను, మే = నాకు, న శ్రావ్యా = విననింపుకాదు, తథా అపి = అట్లయినను, తే కథయామి = నీకు చెప్పుదును, తుష్టః అస్మి = తృప్తుడనైనాను, తే ప్రతికర్తుమ్ = నీకు ప్రత్యుపకారము చేయుటకు, అతః = అందువలన, ప్రయత్నాత్ దర్శయామి = చూపుటకు ప్రయత్నింతును.

**తా :** వాని పేరైనను నాకు వినుట కిష్టము కాదు. అయినను నీకు చెప్పుచున్నాను. నేను మీ భోజనతృప్తుడనై యున్నాను. అందువలన ప్రత్యుపకారము నాకు కర్తవ్యము. కావున మీరు కోరినట్లు ఆ దత్తుని చూపుటకు ప్రయత్నింతును.

**శ్లో॥ విశ్వాత్మా దుర్ధరో దేవైరపి తం భక్తిగమ్యమిత్ ।**
**ఆత్మానం చేత్ క్షమం జ్ఞాతుం కృతకృత్యో భవిష్యసి ॥ 19**

**ప్ర :** విశ్వాత్మా = విశ్వమంతయు వ్యాపించిన ఆత్మయైనవాడు, దేవైః అపి = దేవతలచేత గూడ, దుర్ధరః = నిలువరింపరానివాడు, భక్తిగమ్యమిత్ = భక్తిచేత పొందదగినవాడు, తమ్ = వానిని, ఆత్మానం జ్ఞాతుం క్షమం చేత్ = తనను తాను (నిన్ను నీవు) తెలిసికొనుటకు సమర్థుడయినచో, కృతకృత్యః = ధన్యుడవు, సాఫల్యము నొందినవాడవు, భవిష్యసి = అగుచున్నావు.

**తా :** విశ్వవ్యాపి, ఆత్మరూపి, దేవతలకైనను చేరరానివాడు, భక్తిచేత మాత్రమే తెలియదగినవాడు, అట్టివానిని ఆత్మజ్ఞానముచేత మాత్రమే దర్శింపగలవు.

**శ్లో॥ ఏకదోన్మత్తవచ్ఛ్రీశం జ్ఞాత్వా మద్యాపణస్థితమ్ ।**
**ఆహూయాహ ద్విజం రక్షో విద్ధి తం యోగిదైవతమ్ ॥ 20**

**ప్ర :** ఏకదా = ఒకప్పుడు, ఉన్మత్తవత్ = మత్తెక్కినవానివలె, మద్య+ఆపణస్థితమ్ = మద్యమునమ్ము దుకాణములోనున్న, శ్రీశమ్ = శ్రీదత్తుని, జ్ఞాత్వా = తెలిసికొని, రక్షః = బ్రహ్మరాక్షసుడు, ద్విజమ్ = బ్రాహ్మణుని, ఆహూయ = పిలచి, ఆహ = ఇట్లనెను, తమ్ = వానిని (ఆ మద్యపు మత్తులోనున్న వానిని), యోగిదైవతమ్ = యోగులకు దైవముగా, విద్ధి = తెలియుము.

**తా :** ఒకప్పుడు ఆ బ్రహ్మరాక్షసుడు ఒక మద్యమునమ్ము దుకాణములో నున్న శ్రీదత్తుని గుర్తించి, ఆ బ్రాహ్మణుని పిలచి, ఆ మద్యపు మత్తులోనున్న వ్యక్తియే శ్రీదత్తుడు, యోగుల దేవుడు, అని తెలియుము.

**శ్లో॥ విప్రస్త్వవేక్ష్య తం హీనం మేనేఽదృశ్యోఽభవత్తదా ।**
**ఖిన్నోఽగాద్ధామ తం రక్షః ప్రాహ దుర్భాగ్య కిం కృతమ్ ॥ 21**

**ప్ర :** విప్రః తు = బ్రాహ్మణుడేమో, తమ్ అవేక్ష్య = వానిని చూచి, హీనం మేనే = హీనునిగా తలచెను, అదృశ్యః అభవత్ = అదృశ్యుడాయెను, తదా = అప్పుడు, ఖిన్నః = దిగులు చెందినవాడై, ధామ = యింటికి, అగాత్ = వెడలెను, తమ్ = ఆ బ్రాహ్మణుని, రక్షః = బ్రహ్మరాక్షసుడు, ప్రాహ = ఇట్లనెను, దుర్భాగ్య! = ఓ దౌర్భాగ్యుడా!, కిం కృతమ్? = ఏమి చేసితివి?

**తా :** బ్రాహ్మణు డా ఉన్మత్తుని చూచి హీనునిగా భావించెను. అంతట ఆ వ్యక్తి (శ్రీదత్తుడు) అంతర్ధానమాయెను. బ్రాహ్మణుడు దిగులుగా యిల్లు చేరెను. బ్రహ్మరాక్షసుడు వానిని చూచి, "దౌర్భాగ్యుడా! ఏమి చేసితివి?" అనెను. *

**శ్లో॥ శాసితోఽపి పురా విప్ర! మోహితోఽసి కథం వద ।**
**సందేక్ష్యే పునరప్యేనం సావధాన ఇతో భవ॥ 22**

**ప్ర :** పురా = ముందుగా, శాసితః అపి = హెచ్చరించబడినవాడవైనను, విప్ర! = ఓ బ్రాహ్మణుడా!, కథమ్ = ఎట్లు, మోహితః అసి = భ్రమలో బడినావు?, వద = చెప్పుము, పునః అపి = మరియొక సారికూడ, ఏనమ్ = వీనిని, సందేక్ష్యే = నీకు చూపుదును, ఇతః = ఈపై, సావధానః భవ = జాగరూకుడవు కమ్ము.

**తా :** ముందుగా హెచ్చరించినాను గదా, భ్రమలో నెట్లు మునిగితివయ్యా!? బాపడా! మరియొక సారి శ్రీదత్తుని చూపుదును. ఈసారి మెలకువగా నుండుము.

**శ్లో॥ అథైకదాఽఽహ రక్షోఽజ్ఞ! శ్వవృతో ధూలిధూసరః ।**
**తమాత్మక్రీడమాత్మానం విద్ధ్యాత్మరతిముత్తమమ్ ॥ 23**

ప్ర : అథ = అంతట, ఏకదా = ఒకప్పుడు, రక్షః = రాక్షసుడు, ఆహ = ఇట్లనెను, అజ్ఞ! = ఓ బ్రాహ్మణుడా!, ధూలిధూసరః = మట్టిగొట్టుకొనియున్నవాడు, శ్వవృతః = కుక్కలచే చుట్టుకొనబడిన వాడు, తమ్ = అట్టివానిని, ఉత్తమమ్ = ఉత్తముడగు, ఆత్మరతిమ్ = ఆత్మయందు రమించువానిగా, ఆత్మక్రీడమ్ = ఆత్మయొక్క లీలావిహారిగా, ఆత్మానమ్ = ఆత్మస్వరూపునిగా, విద్ధి = తెలియుము.

**తా :** అంతట నొకనాడు రాక్షసుడు బ్రాహ్మణునితో ఇట్లనెను : "ఓ బ్రాహ్మణుడా! ఒడలంతయు దుమ్ము గొట్టుకొని కుక్కల గుంపు మధ్యలోగల వానిని చూడుము. ఆతడు లీలావినోదియైన ఆత్మస్వరూపి, సర్వోత్తమమైన ఆత్మానందము ననుభవించు వాడని తెలిసికొనుము."

**శ్లో॥ రక్షోభిరపి యః స్మర్తుమశక్యోఽహం తు దైవతః ।**
**రక్షోఽభవం విప్రకోపాత్తద్భక్తోఽపి తతః స్మరే ॥ 24**

ప్ర : రక్షోభిః అపి = రక్షస్సులచేనైనను, యః = ఎవరు, స్మర్తుమ్ = తలచుటకు, అశక్యః = సాధ్యము కానివాడో, (అట్టివానిని), అహం తు = నేనేమో, దైవతః = విధివశమున, తత్ భక్తః అపి = వాని భక్తుడనైనను, విప్రకోపాత్ = బ్రాహ్మణకోపమువలన, రక్షః అభవమ్ = రాక్షసుడనైతిని, తతః = భక్తుడనైన కారణమున, స్మరే = స్మరించగలను, గుర్తించగలను.

**తా :** రక్షస్సులు దేవయోనులు. ఐనను వారు సైతము శ్రీదత్తుని గుర్తింపలేరు. ఇక నేను ఆ స్వామిభక్తుడను. ఒక బ్రాహ్మణకోపమువలన బ్రహ్మరాక్షసుడనైతిని. భక్తుడనైనందున, స్వామిని గుర్తింపగలను.

**శ్లో॥ విప్రోఽప్యథాస్థిభూషం తం రక్తాక్షం సంముఖోఽగమత్ ।**
**తేనాస్థ్నా తాడితోఽధావత్స భీతో జీవితేచ్ఛయా ॥ 25**

ప్ర : విప్రః అపి = బ్రాహ్మణుడు కూడ, అథ = అంతట, అస్థిభూషమ్ = ఎముకలను ఆభరణములుగా ధరించినవాడు, రక్తాక్షమ్ = ఎఱ్ఱని కన్నులు గలవాడు నైన, తమ్ = ఆ శ్రీదత్తుని, సంముఖః అగమత్ = ఎదుట నిల్చెను, తేన = వానిచే, ఆస్థ్నా = ఎముకతో, తాడితః = కొట్టబడినవాడై, భీతః = భయముజెందినవాడై, జీవితేచ్ఛయా = బ్రతుకుపై కోరికతో, సః = ఆతడు, అధావత్ = పరుగెత్తెను.

**తా :** అంతట బ్రాహ్మణుడును ఎముకలు ధరించి ఎఱ్ఱని కన్నులుగల ఆ శ్రీదత్తుని సంముఖమునకు వెళ్ళి నిల్చెను. కాని, వానిచే ఎముకతో కొట్టబడి ప్రాణభయముతో పరుగెత్తెను.

**శ్లో॥ రక్షోఽవదత్పరం దైవం మన్యే యత్నో నిరర్థకః ।**
**మిథ్యాఽఽత్మతాడనాత్కా తే హానిర్విప్ర! విచారయ ॥ 26**

**ప్ర :** రక్షః = బ్రహ్మరాక్షసుడు, అవదత్ = ఇట్లనెను, పరం దైవం మన్యే = పరమ దైవముగా భావింతును, యత్నః = ప్రయత్నము, నిరర్థకః = వ్యర్థమైనది, మిథ్యా = భ్రమయైన, ఆత్మ = ఆత్మచేత, తాడనాత్ = కొట్టబడుటవలన, తే = నీకు, కా హానిః = అపకారమేమి (కల్గును)? విప్ర! = ఓ బ్రాహ్మణుడా!, విచారయ = ఆలోచించుము.

**తా :** వానిని పరదైవముగా భావింతును. ప్రయత్నము వ్యర్థమైనది. ఓ బాపడా! **లీలామాత్రమైన ఆత్మక్రీడలో కొట్టిన దెబ్బలు నీకు హాని కలిగించునా?!** నీవే ఆలోచించుము.

**శ్లో॥ భూయోఽపి దర్శయిష్యే తే కార్యం సాధయ యత్నతః ।**
**కిం కార్యమితి పృచ్ఛేచ్చేత్ప్రసన్నః స తదా వద ॥ 27**

**ప్ర :** భూయః అపి = మరల కూడ, తే = నీకు, దర్శయిష్యే = చూపింతును, యత్నతః = ప్రయత్నముతో, కార్యం సాధయ = కోరికను సాధించుకొనుము, ప్రసన్నః = ప్రసన్నుడై, సః = శ్రీదత్తుడు, కిం కార్యమ్ = పనియేమి, ఇతి = అని, పృచ్ఛేత్ చేత్ = అడిగినట్లయిన, తదా = అప్పుడు, వద = చెప్పుము.

**తా :** మరియొకసారి నీకు చూపుదును. జాగరూకుతతో కార్యమును సాధించుకొనుము. శ్రీదత్తప్రభువు ప్రసన్నుడై యేమి నీ కోరిక యని అడిగినట్లయిన, అప్పుడు నీ కోరికను తెల్పుము.

**శ్లో॥ ధర్మశ్రాద్ధే క్షణం యాస్యే ప్రసాదః క్రియతామితి ।**
**అథైకదాऽऽహ రక్షో యః శ్వభ్యో మృతఖరామిషమ్ ॥ 28**

**శ్లో॥ దత్త ఉత్కృత్య తం విద్ధి దేవం సత్యం వచో మమ ।**
**పత్న్యాపి శిక్షితో ధైర్యాద్గత్వా తచ్చరణేఽగ్రహీత్ ॥ 29**

**ప్ర :** ధర్మశ్రాద్ధే = ధర్మవిషయమున శ్రద్ధవహించి, క్షణమ్ = కొద్దికాలమును, యాస్యే = గడుపుదును, ప్రసాదః క్రియతామ్ = అనుగ్రహింపదగుదురు, ఇతి = అని, (పై శ్లోకములోని, వద = చెప్పుము); అథ = అంతట, ఏకదా = ఒకప్పుడు, రక్షః = రాక్షసుడు, ఆహ = ఇట్లనెను, యః = ఎవడు, శ్వభ్యః = కుక్కలనుండి, మృతఖర = చనిపోయిన గాడిదయొక్క, ఆమిషమ్ = ఎముకను, ఉత్కృత్య = తీసికొనునో, తమ్ = వానిని, దేవమ్ = ప్రభువు, దత్తః = దత్తుడుగా, విద్ధి = తెలియుము, మమ = నాయొక్క, వచః = మాటలు, సత్యమ్ = నిజము; శిక్షితః = బోధింపబడినవాడై, పత్న్యా అపి = భార్యతోగూడ, ధైర్యాత్ = ధైర్యముబట్టి, గత్వా = వెడలి, తత్ చరణే = వాని (శ్రీదత్తుని) పాదములను, అగ్రహీత్ = పట్టుకొనెను.

**తా :** ధర్మమును గురించి క్షణకాలము శ్రద్ధవహింతును. తమరు అనుగ్రహింపవలయును, అని చెప్పుము. అంతట ఒకప్పుడు రాక్షసుడిట్లనెను, ఆ కుక్కలనుండి చచ్చినగాడిదఎముకను

లాగికొనుచున్నవాడే శ్రీదత్తప్రభువు. నా మాట నిజము. అట్లు సూచింపబడినవాడై, ఆ బ్రాహ్మణుడు, ధైర్యము చిక్కబట్టి, భార్యతో గూడ వెడలి శ్రీదత్తుని పాదములను పట్టుకొనెను.

**శ్లో॥ మాంసాస్థితాడితోఽప్యుక్తో ముఞ్చ ముఞ్చ వ్రజేత్యపి ।**
**ధైర్యాత్ స్వార్థపరో విప్రో వవన్దే న ముమోచ తమ్ ॥ 30**

ప్ర : మాంసాస్థి–తాడితః = మాంసముతోడి ఎముకతో కొట్టబడినవాడు, ముఞ్చ ముఞ్చ = విడు విడు, వ్రజ = వెళ్ళిపో, ఇతి అపి = అనియును, ఉక్తః అపి = చెప్పబడినవాడైనను, విప్రః = బ్రాహ్మణుడు, స్వార్థపరః = తన కోరికయందే స్థిరుడైనవాడై, ధైర్యాత్ = ధైర్యముబట్టి, తం వవన్దే = వానిని (శ్రీదత్తుని) నమస్కరించెను, న ముమోచ = (పాదములను) విడువలేదు.

**తా :** మాంసముతో కూడిన ఎముకతో కొట్టినను, "విడు విడు, వెడలిపో" యని నెట్టినను, బ్రాహ్మణుడు శ్రీదత్తుని పాదములు విడువక, తన లక్ష్యమునందే స్థిరబుద్ధియై, ధైర్యము కోల్పోక, నమస్కరించెను.

**శ్లో॥ దీనమార్తం ద్విజం ధీరం జ్ఞాత్వాఽఽహ కృపయా ప్రభుః ।**
**ఆగతోఽసి త్రివారం కిం కార్యం వ్రాత్యేన తే మయా ॥ 31**

ప్ర : ద్విజమ్ = బ్రాహ్మణుని, దీనమ్ = దీనునిగా, ఆర్తమ్ = రక్షణ కోరువానినిగా, ధీరమ్ = ధైర్యశాలినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, కృపయా = దయతో, ప్రభుః = శ్రీ దత్తప్రభువు, ఆహ = ఇట్లనెను, త్రివారమ్ = మూడు పర్యాయములు, ఆగతః అసి = వచ్చినవాడవైతివి, తే = నీకు, వ్రాత్యేన మయా = హీనుడనైన నాతో, కిం కార్యమ్ = యేమి పని?

**తా :** బ్రాహ్మణుడు దీనుడని, ఆర్తుడని, ధైర్యశాలినిగా తెలిసికొని దయతో దత్తప్రభువు, "మూడు పర్యాయములు నాకై వచ్చితివి; నేను హీనజన్ముడను; నాతో నీకేమి పని?"

**శ్లో॥ శ్రాద్ధే నిమన్త్రయామీతి ద్విజేనోక్తోఽవదద్భుత ।**
**పితరోఽధఃపతిష్యన్తి శ్రాద్ధేఽనాచారయోజనాత్ ॥ 32**

ప్ర : శ్రాద్ధే = పితృశ్రాద్ధమునందు, నిమన్త్రయామి = మిమ్ము భోక్తగా ఆహ్వానించుచున్నాను, ఇతి = అని, ద్విజేన = బ్రాహ్మణునిచేత, ఉక్తః = చెప్పబడి, అవదత్ = ఇట్లనెను; పితరః = పితరులు, శ్రాద్ధే = శ్రాద్ధమునందు, అనాచారయోజనాత్ = అనాచారము జరిపించుటవలన, అధఃపతిష్యన్తి = అధోలోకములకు పడిపోదురు.

**తా :** పితృశ్రాద్ధమునకు భోక్తగా నాహ్వానించుచున్నానని బ్రాహ్మణుడనగా శ్రీదత్తుడిట్లనెను : అనాచారమువలన నీ పితరులు అధోగతి చెందుదురు.

**శ్లో॥ ద్విజోఽబ్రవీత్కిమాచారైర్లభ్యన్తేఽన్యైశ్చ కా క్షతిః ।**
**తవేశస్యాప్తకామస్య కిమసక్తస్య కర్మభిః ॥ 33**

**ప్ర :** ద్విజః = బ్రాహ్మణుడు, అబ్రవీత్ = ఇట్లనెను, కిం ఆచారైః లభ్యన్తే = ఆచారముల చేత నేమి పొందబడుచున్నవో, అన్యైః చ = ఇతరులచేత గూడ, కా క్షతిః = నష్టమేమి? ఈశస్య ఆప్తకామస్య = కోరికలు లేని ఈశ్వరుడవైన, అసక్తస్య = నిరాసక్తునకు, తవ = నీకు, కర్మభిః = కర్మలచేత, కిమ్ = ఏమి?

**తా :** బ్రాహ్మణుడిట్లనెను : ఆచారములద్వారా యే లాభము కలుగునో ఆ లాభమే అనాచారము ద్వారా కలిగినచో నష్టమేమి? నీవు ఈశ్వరుడవు, కోరికలేలేని నిత్యతృప్తుడవు, దేనియందును ఆసక్తిలేనివాడవు. అట్టి నీవలన కర్మఫలముల కేమి నష్టము?

**శ్లో॥ ఇత్యుక్త ఓం తథేత్యుక్త్వా స్వరూపేణ స్థితోఽవదత్ ।**
**నిమన్త్ర్యాన్యం చ మత్కల్పం పాకశుద్ధిర్విధీయతామ్ ॥ 34**

**ప్ర :** ఇతి ఉక్తః = ఇట్లు చెప్పబడినవాడై, **ఓం** = అవును, తథా ఇతి = అట్లేయని, ఉక్త్వా = పలికి, స్వరూపేణ = నిజస్వరూపముతో, స్థితః = నిల్చినవాడై, అవదత్ = ఇట్లనెను, అన్యం చ = రెండవదానిని గూడ, మత్కల్పమ్ = నా సరసన కూర్చుండదగువానిని, నిమన్త్ర్య = ఆహ్వానించి, పాకశుద్ధిః = పాకశుద్ధిని, విధీయతామ్ = చేయదగును.

**తా :** ఇట్లు చెప్పబడినవాడై, శ్రీదత్తుడు, అవును. అట్లేయని చెప్పి, నిజస్వరూపముతో సాక్షాత్కరించి, రెండవవానిని నా సరసన కూర్చుండదగువానిని గూడ ఆహ్వానించి, పాకశుద్ధి చేయుము, అనెను. *

**శ్లో॥ సుస్నాతః శుచిరేష్యామి త్వద్వేశ్మకుతపక్షణే ।**
**న శ్మశానం న మాంసాస్థి తత్రాపశ్యద్ద్విజస్తదా ॥ 35**

**ప్ర :** సుస్నాతః = చక్కగా స్నానముచేసి, శుచిః = శుచినై, త్వత్ వేశ్మ = నీ యింటికి, కుతపక్షణే = కుతపకాలమున, అనగా, పగటివేళ 8వ ముహూర్తమున, అపరాహ్నమున, ఏష్యామి = వత్తును; తదా = అప్పుడు, ద్విజః = బ్రాహ్మణుడు, తత్ర = అచట, శ్మశానమ్ = శ్మశానమును, న = కాదు, మాంసాస్థి = మాంసమును ఎముకలను, న అపశ్యత్ = చూచినవాడుకాదాయెను.

**తా :** చక్కగా స్నానముచేసి శుచినై నీ యింటికి కుతపకాలమున వత్తును. ఆ సమయమున ఆ బ్రాహ్మణున కచట శ్మశానముగాని మాంసాస్థి గాని చూచినవాడు కాదు, అనగా, అది భ్రమయని భావము.

**కుతపకాలము** అనునది దినమును 15 ముహూర్తములుగా విభజించగా, అందలి 8వది. ఆ ముహూర్తములివి :– 1. రౌద్రము, 2. శ్వేతము, 3. మైత్రము, 4. శారభము, 5. సావిత్రము, 6. విజయము, 7. గాంధర్వము, 8. కుతపము, 9. రౌహిణేయము, 10. విరించము, 11. సోమము, 12. నిర్మృతి, 13. మాహేంద్రము, 14. వరుణము, 15. భటము.

**శ్లో॥ శ్మశానం యోగభూః శ్వానో వేదః శాస్త్రాణి వాయసాః ।**
**దృష్టో ద్విజేనావధూతః సాక్షాద్దత్తస్త్రిరూపధృక్ ॥ 36**

**ప్ర :** శ్మశానమ్ = శ్మశానము, యోగభూః = యోగభూమిగను, శ్వానః = కుక్క, వేదః = వేదముగను, వాయసాః = కాకులు, శాస్త్రాణి = శాస్త్రములుగ, అవధూతః = అవధూత, సాక్షాత్ = సాక్షాత్తు, త్రిరూపధృక్ = బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల మూడు రూపములను ధరించిన, దత్తః దత్తుడుగను, ద్విజేన = బ్రాహ్మణునిచేత, దృష్టః = దర్శింపబడెను.

**తా :** బ్రాహ్మణుడక్కడ శ్మశానమునకు బదులు యోగభూమిని, కుక్కకు బదులు వేదమును, కాకులకు బదులు శాస్త్రములను, అవధూత స్థానమున సాక్షాత్ త్రిమూర్తిస్వరూపుడైన శ్రీదత్తుని దర్శించెను.

**శ్లో॥ ద్విజో నత్వాఽఽహ ధన్యోఽస్మి ధన్యౌ మే పితరౌ కులమ్ ।**
**యత్పుణ్యౌఘాదపి కుధీరద్రాక్షం తే పదం మహత్ ॥ 37**

**ప్ర :** ద్విజః = బ్రాహ్మణుడు, నత్వా = నమస్కరించి, ఆహ = ఇట్లనెను, ధన్యః అస్మి = నేను ధన్యుడనైనాను, మే పితరౌ = నా తల్లితండ్రులు, ధన్యౌ = ధన్యులైనారు, కులమ్ = వంశము, యత్ = దేనిని, తే = నీయొక్క, మహత్ పదమ్ = గొప్ప పాదము, పుణ్య+ఓఘాత్ అపి = పుణ్య ప్రవాహము కంటెను, కుధీః అపి = మందుడును ఐనను, అద్రాక్షమ్ = చూడబడినది.

**తా :** బ్రాహ్మణుడు నమస్కరించి యిట్లనెను : నేను ధన్యుడను; నా తల్లితండ్రులు ధన్యులు; నా వంశము, మందుడునైనను చూడబడినది.

**శ్లో॥ ఇత్యుక్త్వా స దృతం గేహం గత్వా పత్న్యై శశంస తత్ ।**
**సాపి హృష్టా సతీ పాకం విధినా కర్తుమారభత్ ॥ 38**

**ప్ర :** ఇతి ఉక్త్వా = అని పలికి, సః = ఆ బ్రాహ్మణుడు, దృతమ్ = వేగముగా, గేహం గత్వా = యింటికి వెడలి, పత్న్యై = భార్యకు, తత్ = ఆ విషయమును, శశంస = తెలియజేసెను; సా అపి = ఆమెయున్నూ, హృష్టా సతీ = సంతోషించినదగుచు, విధినా = శాస్త్రోక్తప్రకారముగా, పాకమ్ = వంటకములను, కర్తుమ్ = చేయుటకు, ఆరభత్ = మొదలిడెను.

**తా :** ఇట్లని పలికి ఆ బ్రాహ్మణుడు వేగముగా యింటికి చేరి, ఆ విషయమును భార్యకు చెప్పగా ఆమె సంతోషించి, శాస్త్రము శ్రాద్ధవిధికి నియమించిన రీతిలో వంటకము సిద్ధము చేయ నారంభించెను.

**శ్లో॥ క్వ మృగ్యోఽన్యో ద్విజస్తుల్య ఇత్యుక్తో రాక్షసోఽబ్రవీత్ ।**
**యత్రాయాత్యీశ్వరస్తత్ర సమాయాన్త్యఖిలాః సురాః ॥ 39**

**ప్ర :** తుల్యః = సరితూగగల, అన్యః ద్విజః = రెండవ బ్రాహ్మణుడు, క్వ మృగ్యః = ఎక్కడ

వెదుకదగినవాడు?, ఇతి ఉక్తః = అని అడుగబడిన, రాక్షసః = బ్రహ్మరాక్షసుడు, అబ్రవీత్ = యిట్లనెను, ఈశ్వరః = దత్తప్రభువు, యత్ర = యెచ్చట(కు), యాతి = వెడలుచున్నాడో, తత్ర = అచ్చట(కు), అఖిలాః సురాః = దేవతలందఱు, సమాయాన్తి = వచ్చి చేరుచున్నారు.

**తా :** శ్రీదత్తునితో సరియగు మరియొక బ్రాహ్మణుని కొరకు ఎక్కడ వెదుకవలయునని అడుగగా, బ్రహ్మరాక్షసుడిట్లనెను : శ్రీదత్తప్రభువు యెక్కడకు వెడలునో అక్కడ దేవతలందఱు చేరుచున్నారు.

**శ్లో॥ తథాప్యర్కం గృహపతిం వహ్నిం వాఽత్ర నిమన్త్రయ ।**
**కార్యం తే సాధితం సర్వం ప్రసాదే మాం న విస్మర ॥ 40**

**ప్ర :** తథా అపి = అట్లయ్యును, అర్కమ్ = సూర్యుని, వా = లేక, గృహపతిమ్ – వహ్నిమ్ = గృహపతియనబడు అగ్నిని, అత్ర = రెండవ బ్రాహ్మణుని స్థానమున, నిమన్త్రయ = ఆహ్వానించుము, తే కార్యమ్ = నీవు చేయదగినది, సాధితం సర్వమ్ = అంతయు సఫలమగును, ప్రసాదే = ప్రసాదమును వినిమయము చేయునప్పుడు, మామ్ = నన్ను, న విస్మర = మరువకుము.

**తా :** అది అట్లున్నది కావున నీవు సూర్యునిగాని లేక అగ్నిని గాని రెండవ భోక్తగా శ్రాద్ధమున కాహ్వానింపుము. నీ కర్తవ్యము సఫలమగును. ప్రసాదము వితరణ చేయుటలో నన్ను మరువకుము.

**శ్లో॥ తథేత్యుక్త్వా స పత్న్యై తచ్ఛశంసాత్రాన్తరేఽత్రిజః ।**
**శ్రీశ ఏత్యాహ మత్కల్పః కోఽన్యో విప్రో వద ద్విజ! ॥ 41**

**ప్ర :** తథా ఇతి ఉక్త్వా = అట్లే యని చెప్పి, సః = ఆ బ్రాహ్మణుడు, పత్న్యై = భార్యకు, తత్ = ఆ విషయమును, శశంస = వివరించెను, అత్రాన్తరే = ఇంతలో, అత్రిజః శ్రీశః = అత్రికుమారుడైన శ్రీవిష్ణువు (శ్రీదత్తుడు), ఏత్య = వచ్చి, ఆహ = అడిగెను, ద్విజ! = ఓ బ్రాహ్మణుడా!, మత్కల్పః = నాకు సరియగు, విప్రః = బ్రాహ్మణుడు, అన్యః = రెండవ భోక్త, కః = ఎవడు?, వద = చెప్పుము.

**తా :** ఆ బ్రాహ్మణుడందుకంగీకరించి భార్య కా విషయ మెఱిగించెను. అంతలో శ్రీదత్తుడచటకు విచ్చేసి, "నాకు సరియైన రెండవ శ్రాద్ధభోక్త ఎవరో చెప్పుము" అని ఆ బ్రాహ్మణు నడిగెను.

**శ్లో॥ స్వాసనేఽత్రాస్యతామన్యో విప్ర ఆయాస్యతీతి తమ్ ।**
**ఉక్త్వా సతీ బహిర్గత్వాఽఽజుహావార్కం ప్రణమ్య సా ॥ 42**

**ప్ర :** స్వ+ఆసనే = తన స్థానమున, అత్ర = అచట, ఆస్యతామ్ = కూర్చుండజేయదగును, అన్యః విప్రః = రెండవ బ్రాహ్మణుడు, ఆయాస్యతి = వచ్చుచున్నాడు, ఇతి = అని, తమ్ = వానితో, ఉక్త్వా = పలికి, బహిర్గత్వా = బైటకు వెళ్ళి, సా సతీ = ఆ సాధ్వి, అర్కమ్ = సూర్యుని, ప్రణమ్య = నమస్కరించి, ఆజుహావ = ఆహ్వానించెను.

**తా :** రెండవ బ్రాహ్మణుడు భోక్తగా వచ్చుచున్నాడు, తన స్థానము అచట, కూర్చుండ జేయుడు, అని ఆ బ్రాహ్మణునితో పలికి, ఆ సాధ్వి బైటకు వెళ్ళి, సూర్యునికి నమస్కరించి ఆహ్వానించెను.

**శ్లో॥ సర్వాత్మన్! ధీర! సవితః! కరోషి త్వం సచేతనమ్ ।**
**విశ్వం జడమపీహాద్య దేవాగచ్ఛ దయస్వ నః ॥ 43**

**ప్ర :** సర్వాత్మన్! = ఓ సృష్టియంతటికి ఆత్మయైనవాడా!, ధీర! = బుద్ధిని వికసింపజేయువాడా!, సవితః! = ఓ సూర్యదేవా!, త్వమ్ = నీవు, విశ్వమ్ = జగత్తును, జడం అపి = జడముగా నున్నదానిని, సచేతనమ్ = చైతన్యవంతముగా, కరోషి = చేయుచున్నావు, అద్య = నేడు, నః = మమ్ములను, దయస్వ = దయతో జూడుము, దేవ = ఓ దేవా!, ఇహ = ఇక్కడకు, ఆగచ్ఛ = రమ్ము.

**తా :** ఓ సూర్యదేవా! సర్వాత్మా! బుద్ధివికాసకా! నీవు జడమైన జగత్తును చైతన్యవంతము జేతువు. నేడు మా యందు దయయుంచి మా ఆహ్వానమును మన్నించి రమ్ము.

**శ్లో॥ ఇత్యర్కః ప్రార్థితో విప్రరూపీ ప్రాపాత్రిజోఽవదత్ ।**
**దేవహీనం కథం శ్రాద్ధం తృతీయోఽన్విష్యతాం తథా ॥ 44**

**ప్ర :** ఇతి = అని యిట్లు, ప్రార్థితః అర్కః = ప్రార్థింపబడిన సూర్యుడు, విప్రరూపీ = బ్రాహ్మణ వేషమున, ప్రాప = వచ్చెను, అత్రిజః = శ్రీదత్తప్రభువు, అవదత్ = యిట్లనెను, దేవహీనమ్ = దేవత లేకుండ, శ్రాద్ధమ్ = శ్రాద్ధము, కథమ్ = ఎట్లు సాధ్యము?, తథా = అట్లే, తృతీయః = మూడవభోక్త, అన్విష్యతామ్ = వెదుకబడునుగాక!

**తా :** యిట్లు ప్రార్థింపగా సూర్యుడు బ్రాహ్మణుడై వచ్చెను. శ్రీదత్తుడు "దేవత భోక్తగా లేకుండ శ్రాద్ధమెట్లగును? కనుక మూడవ భోక్తను వెదకి తెమ్ము" అనెను.

**శ్లో॥ సతీ గృహపతిం ప్రాహ కర్మాధ్యక్షాంశతోఽధునా ।**
**ఏహీత్యుక్తోఽగ్నిరప్యాప తత్కల్పో విశ్వరూపధృక్ ॥ 45**

**ప్ర :** సతీ = ఆ సాధ్వి, గృహపతిమ్ = అగ్నిని, ప్రాహ = ఇట్లనెను, అధునా = ఇప్పుడు, కర్మ+అధ్యక్ష+అంశతః = కర్మాధ్యక్షుని అంశవలన, ఏహి = రమ్ము, ఇతి ఉక్తః = అని పిలువబడినవాడై, అగ్నిః అపి = అగ్నిదేవుడు కూడ, తత్ కల్పః = శ్రీదత్తునితో సముడై, విశ్వరూపధృక్ = విశ్వరూపధారియై, ఆప = వచ్చెను.

**తా :** ఆ బ్రాహ్మణుని యిల్లాలగు సాధ్వి అగ్నిని కర్మాధ్యక్షుని అంశగా, ఆతడు గార్హపత్యాగ్ని కావున, **అగ్నిర్వై దేవానామవమః** అను శ్రుతి ననుసరించి, దేవతాకల్పుడు కావున, వానిని రమ్మని ఆహ్వానించగా, అగ్నియు విశ్వరూపధారియైన శ్రీదత్తుని సముడుగా వచ్చెను.

**శ్లో॥ దేవేఽగ్నిముపవేశ్యేశం పిత్ర్యేఽర్కం చ యథావిధి ।**
**వ్యధాచ్ఛ్రాద్ధం ముదా భుక్తాస్తృప్తాః స్మేత్యవదంస్త్రయః ॥ 46**

**ప్ర :** దేవే = దేవస్థానమున, అగ్నిమ్ = అగ్నిదేవుని, ఉపవేశ్య = కూర్చుండజేసి, ఈశమ్ = శ్రీదత్తుని, పిత్ర్యే = పితృస్థానమున, అర్కం చ = సూర్యునియు, యథావిధి = శాస్త్రోక్తముగా, శ్రాద్ధమ్ = శ్రాద్ధమును, వ్యధాత్ = నిర్వహించెను, ముదా = సంతోషముగా, త్రయః = ముగ్గురును, భుక్తాః = భుజించినవారై, తృప్తాః స్మ = తృప్తిజెందితిమి, ఇతి అవదన్ = అని పలికిరి.

**తా :** దేవస్థానమున అగ్నిని, శ్రీదత్తుని, సూర్యుని పితరుల స్థానమునను కూర్చుండజేసి శాస్త్రవిధిగా శ్రాద్ధమును నిర్వహించెను. ఆ ముప్వురును భుజించి, సంతోషముతో తృప్తులమైతిమి అని పలికిరి.

**శ్లో॥ ఆచాన్తేష్వక్షయం దత్వా తమష్టశతనామభిః ।**
**నత్వాఽఽహ రక్షసోక్త్వా వః కృతకృత్యోఽస్మి దర్శనాత్ ॥ 47**

**ప్ర :** ఆచాన్తేషు = పిండప్రదానానంతర మాచమనము చేయగా, అక్షయం దత్వా = అక్షయమునిచ్చి (అక్షతల నిచ్చి), తమ్ = శ్రీదత్తుని, అష్టశతనామభిః = నూట యెన్మిది పేర్లతో, నత్వా = నమస్కరించి, ఆహ = పలికెను, రక్షస+ఉక్త్వా = రాక్షసుని మాటలచేత, వః దర్శనాత్ = తమ దర్శనమువలన, కృతకృత్యః అస్మి = ధన్యుడనైతిని.

**తా :** పిండప్రదానానంతరము ఆచమనమిచ్చి, అక్షతలను ఆశీర్వదించుటకై యిచ్చి, శ్రీదత్తుని అష్టోత్తరశతనామపురస్సరముగా నమస్కరించి, ఆ బ్రాహ్మణుడిట్లనెను : రాక్షసుని మాటలచేత తమ దర్శనమైనది, ధన్యుడనైతిని.

**శ్లో॥ దత్తః ప్రాహైతు రక్షోఽపి మదుచ్ఛిష్టాశనాద్గతిమ్ ।**
**ముక్తాస్తే పితరః పత్న్యా సిద్ధస్త్వం చైహి సద్గతిమ్ ॥ 48**

**ప్ర :** దత్తః = శ్రీదత్తప్రభువు, ప్రాహ = ఇట్లనెను, రక్షః అపి = రాక్షసుడు కూడ, మత్ = నా యొక్క, ఉచ్ఛిష్ట = ప్రసాదమును (ఎంగిలిని), అశనాత్ = తినుటవలన, గతిమ్ = మోక్షమును, ఏతు = పొందుగాక!, తే = నీ యొక్క, పితరః = పితరులు, ముక్తాః = ముక్తులయిరి, త్వమ్ = నీవు, పత్న్యా చ = భార్యతో గూడి, సిద్ధః = సహజముగా, సద్గతిం ఏహి = ముక్తుడవుగమ్ము!

**తా :** శ్రీదత్తుడిట్లనెను : బ్రహ్మరాక్షసుడుగూడ నా ప్రసాదమును భుజించుట కారణముగా మోక్షము పొందును. నీ పితరులు ముక్తులయిరి. నీవును భార్యాసమేతుడవై సహజముగనే నా ప్రసాదమున ముక్తుడవగుదువు.

**శ్లో॥ దత్వా విద్యా యయౌ దత్తః - స్వర్యానం కామగం చ కః ।**
**ఉభయర్ధీశ్చ శుష్మైవం - తేజీయాన్సోఽభవత్కృతీ ॥ 49**

**ప్ర :** దత్తః = శ్రీదత్తప్రభువు, విద్యాః = మంత్రములను, దత్వా = ఇచ్చి, యయౌ = వెడలెను, కః

చ = సూర్యుడున్నూ, స్వః+యానమ్ = విమానమున, కామగమ్ = కామగమనముతో (వెడలెను), ఏవమ్ = ఇట్లు, శుష్మా = అగ్ని, ఉభయర్ధీః చ = ఐహికము ఆముష్మికము అను రెండును వృద్ధిగా, కృతీ = కృతకృత్యుడై, సః = ఆ బ్రాహ్మణుడు, తేజీయాన్ అభవత్ = తేజస్వియాయెను.

**తా :** మంత్రములుపదేశించి శ్రీదత్తుడేగగా, విమానమెక్కి సూర్యుడున్నూ వెడలెను. అట్లే అగ్నియును ఆ బ్రాహ్మణునకు ఐహికాముష్మికసాధనలో సహకరించి వెడలెను. ఆ గృహస్థు ధన్యుడై తేజస్వియాయెను.

**శ్లో॥ అలఙ్ఘ్యశాసనోఽభీష్టభాగభూచ్ఛాస్త్రదృగ్ద్విజః ।**
**రక్షోఽప్యుచ్ఛిష్టభుఙ్ముక్త ఏవం శాస్త్రక్రమాద్గతిః ॥ 50**

**ప్ర :** ద్విజః = బ్రాహ్మణుడు, అలఙ్ఘ్య = దాటరాని, శాసనః = ఆజ్ఞగలవాడు, అభీష్ట = కోరిన, భాగభూత్ = భాగ్యమును పొందిన, శాస్త్రదృక్ = శాస్త్రమే దృష్టిగా గ్రహించువాడు, రక్షః అపి = రాక్షసుడు గూడ, ఉచ్ఛిష్టభుక్ = ప్రసాదమును భుజించి, ముక్తః= ముక్తుడాయెను, ఏవమ్ = ఈ విధముగా, శాస్త్రక్రమాత్ = శాస్త్రముననుసరించి యొక పరిణామముగా, గతిః = ముక్తి.

**తా :** బ్రాహ్మణుడు వైదికమార్గమును అతిక్రమించనివాడు. కోరిన భాగ్యమును సాధించుటకు శాస్త్రమే నిర్ణాయకమని నమ్మి నడచుకొన్నవాడు. బ్రహ్మరాక్షసుడున్నూ శ్రాద్ధప్రసాదమును భుజించి ముక్తుడాయెను. ఇట్లు **శాస్త్రము కర్మపరిణామఫలముగా మోక్షమును సమకూర్చును.**

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం

వాసుదేవ్యాం తృతీయాష్టకే షష్ఠాధ్యాయః ॥

ఓమ్ శం

---

**ద్వాదశాక్షరో దత్తాత్రేయమన్త్రః**

**ఓం ఆం హ్రీం క్రోం ఏహి దత్తాత్రేయ! స్వాహా ॥**

శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## తృతీయాష్టకము - సప్తమాధ్యాయము

**శ్లో॥ ప్రభుప్రసాదాద్విప్రో యం కమప్యన్వగ్రహీత్స చ ।**
**కృతార్థో భవతీత్యేవం ప్రసిద్ధోఽభూత్స భూతలే ॥ 1**

**ప్రతిపదార్థం :** ప్రభు ప్రసాదాత్ = శ్రీదత్తప్రభువుయొక్క అనుగ్రహమువలన, విప్రః = ఈ బ్రాహ్మణుడు, యం కం+అపి = ఎవరినైతే, అన్వగ్రహీత్ = అనుగ్రహింపచేసెనో, సః చ = ఆతడున్నూ, కృతార్థః భవతి = ధన్యుడగును, ఇతి = అని, ఏవమ్ = ఈ రీతిగా, భూతలే = భూలోకములో, ప్రసిద్ధః = కీర్తిగలవాడు, సః = ఆతడు, అభూత్ = ఆయెను.

**తాత్పర్యము :** శ్రీదత్తభగవానుని అనుగ్రహమువలన ఈ బ్రాహ్మణుడు (ఆ) బ్రహ్మరాక్షసుని గూడ అనుగ్రహింప జేసెను. ఇట్లు వారిర్వురున్నూ ధన్యులయిరి, అని యీ కథ జగత్ప్రసిద్ధమైనది.

**శ్లో॥ గోదావాసీ ద్విజః కశ్చిద్ధరిశర్మా తదాత్మజః ।**
**ద్విదశాబ్దో యస్య జన్యా గుల్మోఽష్టాబ్దః క్షయోఽభవత్ ॥ 2**

**ప్ర :** గోదావాసీ = గోదా యను గ్రామమున నివాసముండు, ద్విజః = బ్రాహ్మణుడు, కశ్చిత్ = ఒకానొకడు, హరిశర్మా = హరిశర్మ, తత్ ఆత్మజః = వాని కుమారుడు, ద్విదశ+అబ్దః = ఇరువదేండ్లవాడు, యస్య = ఎవనికి, జన్యా = పుట్టకతో, గుల్మః= గుల్మము, అష్టాబ్దః క్షయః అభవత్ = ఇరువదేండ్లలో ఎనిమిదేండ్లు గడువగా, పదమూడవయేడు వచ్చెను.

**తా :** గోదాగ్రామవాసి హరిశర్మయను బ్రాహ్మణుడొకడుండెను. వానికొక కుమారుడు. వానికి పుట్టుకతో గుల్మముండెను. అట్లే, ఆతడు ఇరువదేండ్ల వాడాయెను.

**శ్లో॥ త్ర్యబ్దో జలోదరో జీర్ణజ్వర ఏకాబ్ద ఆయనః ।**
**అతిసారః సకామశ్చ చాతుర్మాస్యో భగన్దరః ॥ 3**

**శ్లో॥ త్రిదోషేణాపి సంక్రాన్తం ప్రేక్ష్య మృత్యూన్ముఖం పతిమ్ ।**
**తద్భార్యా షోడాశాబ్దాగాచ్ఛరణం విష్ణుదత్తమిత్ ॥ 4**

**ప్ర :** త్ర్యబ్దః జలోదరః = జలోదరమను మూడేండ్ల వ్యాధి 18వ యేట యేర్పడినది, జీర్ణజ్వరః = జీర్ణజ్వరమను వ్యాధి, ఏకాబ్దః = సంవత్సరకాలము, ఆయనః = ఆరు నెలలు, అతిసారః సకామః చ = దగ్గుతో కూడిన బంకవిరేచనములున్నూ, చాతుర్మాస్యః = నాలుగు నెలల వ్యాధియగు, భగన్దరః = గుదము వ్యాధి, (fistula) అనునది, త్రిదోషేణ అపి సంక్రాన్తమ్ = కఫవాతపిత్త-సంనిపాతములను దోషములవలన కలిగిన వ్యాధులను, మృత్యు+ఉన్ముఖమ్ = మరణము దిక్కుగానున్న, పతిమ్ = భర్తను, ప్రేక్ష్య = చూచి, ఇత్ = అనంతరం, షోడశాబ్దా = పదునారు వత్సరములు గల, తత్ భార్యా = వాని భార్య, విష్ణుదత్తమ్ = విష్ణుదత్తుని శ్రీదత్తుని, శరణం అగాత్ = శరణు జొచ్చెను.

**తా :** మానవశరీరమునకు సహజమైన తత్త్వములు కఫవాతపిత్తసంనిపాతములనబడు దోషములవలన కలుగు వ్యాధులు జలోదరము, జీర్ణజ్వరము, అతిసారము, కామ, భగన్దరము అనువానితో మరణము తప్పనట్లున్న తన భర్తను చూచి, పదునారేడుల వాని భార్య విష్ణుదత్తుని శరణు పొందెను.

**శ్లో॥ సౌభాగ్యం దేహి మే బ్రహ్మన్! భర్తా మే రోగపీడితః ।**
**అత్యుత్కటాః ప్రతీకారా దైవాజ్జాతా నిరర్థకాః ॥ 5**

**ప్ర :** బ్రహ్మన్ = ఓ పరబ్రహ్మస్వరూపా!, మే భర్తా = నా భర్త, రోగపీడితః = రోగబాధితుడు, అతి+ఉత్కటాః = అతిబలవత్తరమైన, ప్రతీకారాః = నివారక చికిత్సలు, దైవాత్ = విధివశమున, నిరర్థకాః జాతాః = నిష్ఫలములైనవి, మే = నాకు, సౌభాగ్యం దేహి = ముత్తయిదువగా జీవించు భాగ్యము నిమ్ము.

**తా :** ఓ పరమాత్మా! నా భర్త రోగబాధితుడు. చాలా శక్తివంతమైన చికిత్సలు విధివశమున నిష్ఫలములైనవి. నాకు అయిదవతనము కలుగునట్లు ప్రసాదించుము.

**శ్లో॥ ఇత్యర్థితో దయాలుః స సాధ్వ్యా తద్గృహమేత్య తమ్ ।**
**దృష్ట్వా కర్మవిపాకోక్తం పత్న్యా వ్రతమకారయత్ ॥ 6**

**ప్ర :** ఇతి అర్థితః = ఇట్లు ప్రార్థింపబడినవాడై, దయాలుః సః = దయగలవాడగు ఆ స్వామి, సాధ్వ్యా = ఆ సాధ్వితో, తత్ గృహం ఏత్య = ఆమె యింటికి వచ్చి, తం దృష్ట్వా = వానిని చూచి, పత్న్యా = వాని భార్యచేత, కర్మవిపాక+ఉక్తమ్ = యే యే కర్మకేది ఫలమని చెప్పబడినదో ఆ యా రీతిగా, వ్రతం అకారయత్ = వ్రతమును చేయించెను.

**తా :** ఇట్లామె ప్రార్థింపగా శ్రీదత్తుడామెతో ఆమె యింటికేగి, ఆమె భర్తను చూచి, యే యే

కర్మఫలముగా వాని కే యే వ్యాధిపీడ కలిగినదో గ్రహించి, తన్నివారణకు తగిన వ్రతమును వాని భార్యచే చేయించెను.

**శ్లో॥ క్రమేణాశు లయం ప్రాప తత్తద్రోగః ప్రతివ్రతమ్ ।**
**క్షయే బ్రహ్మవధోత్థేఽదాద్ద్వాదశాబ్దం స నిర్గతః ॥ 7**

**ప్ర :** ప్రతివ్రతమ్ = దానికై చేయబడిన వ్రతఫలముగా, తత్ తత్ రోగః = ఆ యా రోగము, ఆశు = వెంటనే, క్రమేణ = ఒకదాని వెంట నొకటిగా, లయం ప్రాప = నశించెను, బ్రహ్మవధోత్థే = బ్రహ్మహత్యవలన కలిగిన, క్షయే = క్షయరోగము, ద్వాదశాబ్దమ్ = ద్వాదశాబ్ద ప్రాయశ్చిత్తకర్మ, అదాత్ = చేయించెను, సః = ఆ క్షయరోగము, నిర్గతః = వదలి వెళ్ళెను.

**తా :** ఒక్కొక్క రోగమునకు కారణమైన కర్మకు ప్రతిగా వ్రతము చేయించగా, ఆ యా రోగము లొక వరుసలో వదలి పోయినవి. బ్రహ్మహత్యాపాపమువలన కలిగినది క్షయరోగము. దీనికి ద్వాదశాబ్దప్రాయశ్చిత్తకర్మ చేయించెను. ఆ క్షయరోగము అంతట వదలిపోయెను.

**శ్లో॥ గుల్మః షడబ్దేన దేవద్రోహోత్థోఽపి జలోదరః ।**
**ద్వాదశాబ్దేన చాబ్దేన పాపోత్థోఽపి భగన్దరః ॥ 8**

**శ్లో॥ జ్వరోఽబ్దేనాతిసారశ్చ త్రిదోషశ్చౌషధాద్గతః ।**
**ద్విజోఽథ తం హృది స్పృష్ట్వా జజాపోపనిషన్మనుమ్ ॥ 9**

**ప్ర :** షట్+అబ్దేన = ఆరేండ్లతో, గుల్మః = గుల్మము, దేవద్రోహ+ఉత్థః అపి = దేవద్రోహము వలన కలిగిన దైనను, జలోదరః = జలోదరవ్యాధి, ద్వాదశాబ్దేన = పండ్రెండేండ్లతో, చ =మరియు, అబ్దేన = సంవత్సరముతో, పాప+ఉత్థః అపి = పాపమువలన కలిగినదైన, భగన్దరః = భగందరవ్యాధి, అబ్దేన = సంవత్సరముతో, జ్వరః = జ్వరము, అతిసారః చ త్రిదోషః చ = అతిసారమున్నూ కఫవాతపిత్తములను తత్త్వముల దోషములును, ఔషధాత్ = ఔషధసేవనము వలన, గతః = వదలిపోయెను, అథ = అంతట, ద్విజః = బ్రాహ్మణుడు, హృది స్పృష్ట్వా = హృదయమును తాకి,ఉపనిషన్మనుమ్ = ఉపనిషత్సంబంధి మంత్రమును, జజాప = జపించెను.

**తా :** వ్రతమువలన వివిధ వ్యాధులు వివిధ కారణములచే కలిగినవైనను తదనుగుణముగా వ్రతకాలవ్యవధిని నిర్దేశించి చేయించగా, వ్యాధులన్నియు ఒక్కొక్కటిగా వదలిపోయినవి. అంతట ఆ బ్రాహ్మణుడు హృదయమును స్పృశించి, ఉపనిషన్మంత్రమును జపించెను.

**శ్లో॥ నీరుగ్లేభే ద్విజస్తేన భూతిమాయుః ప్రజాం యశః ।**
**దివ్యాం గతిం దత్తభక్తిమిహాముత్ర చ సద్గతిమ్ ॥ 10**

**ప్ర :** ద్విజః = బ్రాహ్మణుడు, తేన = దానిచే, నీరుగ్ = రోగము లేనివాడై, భూతిమ్ = సంపదను, ఆయుః = ఆయువును, ప్రజామ్ = సంతతిని, యశః = కీర్తిని, దివ్యాం గతిమ్ = దివ్యమైన

జ్ఞానమును, దత్తభక్తిమ్ = దత్తభక్తిని, ఇహ+అముత్ర చ = ఇహపరములందును, సద్గతిమ్ = సద్గతిని, లేభే = పొందెను.

**తా :** బ్రాహ్మణుడు అట్లు రోగములేనివాడై, సంపదను, ఆయువును, సంతతిని, కీర్తిని, జ్ఞానమును, దత్తభక్తిని, ఇహసౌఖ్యమును, పరమగతిని పొందెను.

**శ్లో॥ పితృత్వేన వృతః సత్యా ద్విజః ప్రస్థాపితోఽస్పృహః ।**
**యయౌ ధామేతి రుగ్ణోఽపి ద్విజోఽగాత్సద్గతిం తతః ॥ 11**

**ప్ర :** ద్విజః = బ్రాహ్మణుడు, సత్యా = భార్యతో, పితృత్వేన = పితృత్వముచేత, వృతః = అంగీకారము పొందినవాడై, అస్పృహః = యే కోరికయు లేనివాడై, ప్రస్థాపితః = బయలుదేరినవాడై, ధామ = తన యింటిని, చేరబోయెను, ఇతి = అని, రుగ్ణః అపి = రోగగ్రస్తుడయ్యును, ద్విజః = బ్రాహ్మణుడు, తతః =ఆ కారణమున, సద్గతిమ్ = సద్గతిని, అగాత్ = పొందెను.

**తా :** బ్రాహ్మణుడు పితృత్వము నంగీకరించి కర్తవ్యపాలన జేసి, భార్యతో బయలుదేరి నిష్కాముడై యింటికి వెడలెను. ఆ కారణమున బ్రాహ్మణునకు సద్గతి కలిగెను.

**శ్లో॥ క్రమాద్రోగేషు నష్టేషు యథాన్తే పుష్టిదో రసః ।**
**నష్టేష్వవిద్యాదోషేషు శాస్త్రైర్బోధస్తతో రసః ॥ 12**

**ప్ర :** క్రమాత్ = వరుసగా, రోగేషు నష్టేషు = రోగములు నివారణకాగా, యథా = యెట్లు, అన్తే = కడపట, రసః = రసాయనము, పుష్టిదః = బలమునిచ్చునో, తతః= ఆ కారణమున, అవిద్యాదోషేషు నష్టేషు = అజ్ఞానదోషములు నశించగా, శాస్త్రైః = శాస్త్రములచేత, బోధః = జ్ఞానము, రసః = ఆనందదాయకము.

**తా :** కాలక్రమమున రోగములు తొలుగగా కడపట ఔషధము బలమిచ్చునట్లు, శాస్త్రజ్ఞానము వలన అజ్ఞానదోషములు నశించగా కడపట ఆనందము కలుగును.

**శ్లో॥ మిష్టాశనోత్థరోగార్తం బ్రాహ్మణీ కాచిదాత్మజమ్ ।**
**అమ్బా నిమ్బం పిబేత్యాహ తిక్తం నాదూరదృక్పపౌ ॥ 13**

**ప్ర :** కాచిత్ = ఒకానొక, బ్రాహ్మణీ = బ్రాహ్మణ స్త్రీ, మిష్ట+అశన+ఉత్థ = తియ్యని పదార్థము దినుటవలన యేర్పడిన, రోగ+ఆర్తమ్ = రోగముతో బాధపడుచున్న, ఆత్మజమ్ = కుమారుని, అమ్బా = తల్లి, నిమ్బమ్ = వేపరసమును, పిబ = త్రాగుము, ఇతి = అని, ఆహ = పలికెను, నాదూరదృక్ = దూరదృష్టిలేక, తిక్తమ్ = చేదును, పపౌ = త్రాగెను.

**తా :** ఒకానొక బ్రాహ్మణి, తన కుమారుడు అతిగా తియ్యని పదార్థములు దిని, దానివలన కలిగిన రోగముతో బాధపడుట చూచి, దానికి విరుగుడుగా చేదుగా నుండు వేపరసమును త్రాగుమని వానికి చెప్పెను. దూరమాలోచించక ఆతడట్లే త్రాగెను.

**శ్లో॥ దాస్యే లడ్డుకమిత్యుక్తః పపౌ దత్వాపి తత్కరే ।**
**అపథ్యశఙ్కినీ యుక్త్యా తతో జగ్రాహ లడ్డుకమ్ ॥ 14**

**ప్ర :** లడ్డుకమ్ = లడ్డును, దాస్యే = ఇత్తును, ఇతి ఉక్తః = అని చెప్పబడినవాడై, పపౌ = త్రాగెను, తత్ కరే = వానిచేతికి, దత్వా అపి = ఇచ్చియును, అపథ్యశఙ్కిని = అపథ్యమగునని సందేహించినదై, యుక్త్యా ఉపాయముతో, తతః = వానినుండి, లడ్డుకమ్ = లడ్డును, జగ్రాహ = తీసికొనెను.

**తా :** వేపరసము త్రాగినచో లడ్డూ నిత్తునని తల్లి చెప్పగా ఆతడు త్రాగెను. త్రాగిన పిదప వాని చేతిలో పెట్టిన లడ్డూను ఆమె, అపథ్యమై రోగము తిరుగబెట్టునేమో యని సందేహించి, మరల యేదియో సాకు జూపి తీసికొనెను.

**శ్లో॥ ఫలం లడ్డుకవద్గౌణం ముఖ్యమారోగ్యవత్పరమ్ ।**
**రోగ్యర్భవద్భవాధ్యార్తో హితకృన్మాతృవచ్ఛ్రుతమ్ ॥ 15**

**ప్ర :** లడ్డుకవత్ = లడ్డువలె, ఫలమ్ = ఫలము, గౌణమ్ = గుణసంబంధమైనది, ఔపచారికము, అప్రధానము, ఆరోగ్యవత్ = ఆరోగ్యమువలె, పరమ్ = మోక్షము, ముఖ్యమ్ = ముఖ్యము, సాధింపదగినది, భవ+ఆధి+ఆర్తః = సంసారము అను మానసికరోగముచేత బాధితుడైనవాడు, రోగీ+అర్భవత్ = రోగగ్రస్తుడైన పిల్లవాని వంటివాడు, శ్రుతమ్ = శాస్త్రము, మాతృవత్ = తల్లివలె, హితకృత్ = హితము చేయునది.

**తా :** లడ్డువలె ఫలము అప్రధానము, కేవలము కార్యసాధకము. ఆరోగ్యము ముఖ్యము. పిల్లవాని తల్లి హితకారి. ఇట్లే, మోక్షము సంసారరోగబాధితునకు ముఖ్యలక్షణము. శాస్త్రము తల్లివలె ఉపకారి.

**శ్లో॥ స్వర్గార్థం కామభోగార్థం శత్రుఘాతార్థమప్యయమ్ ।**
**న వశీకరణార్థం చ శాస్త్రౌఘో బుద్ధిశుద్ధిదః ॥ 16**

**ప్ర :** శాస్త్ర+ఓఘః = శాస్త్రప్రవాహము, బుద్ధిశుద్ధిదః = బుద్ధిని నిర్వికారము చేయునది, స్వర్గ+అర్థమ్ = స్వర్గము కొరకు, కామభోగ+అర్థమ్ = ఇంద్రియవిషయములను అనుభవించుకొరకు, శత్రుఘాత+అర్థం అపి = శత్రువులను నాశము చేయు కొరకు గూడ, వశీకరణార్థం చ = స్త్రీలను, ఎదుటి వ్యక్తులను మన వశము జేసికొనుటకు గూడ, అయమ్ = ఈ శాస్త్రప్రవాహము, న = కాదు.

**తా :** శాస్త్రము పవిత్రగంగా ప్రవాహము వంటిది : బుద్ధివికారములను తొలగించుటే దాని పరమప్రయోజనము. లోకము చెప్పుకొనుచున్నట్లు శాస్త్రము స్వర్గప్రాప్తికి కామవాంఛా తృప్తికి, శత్రునాశమునకు, స్త్రీజనవశీకరణమునకు సాధనము కాదు.

**శ్లో॥ విప్రస్య కస్యచిద్భార్యాం దృష్ట్వా తన్వీం గతే ప్రియే ।**
**గ్రామాన్తరే తత్స్వరూపధృగ్ ఝుటింగో హ్యవాప తామ్ ॥ 17**

**ప్ర :** కస్యచిత్ = ఒకానొక, విప్రస్య భార్యామ్ = బ్రాహ్మణుని భార్యను, తన్వీమ్ = అందమైన దానిని, గ్రామాన్తరే గతే ప్రియే = ఆమె ప్రియుడు వేరు గ్రామమునకు పోయి ఉండ, దృష్ట్వా = చూచి, తత్ స్వరూపధృగ్ = వాని రూపమును ధరించి, తామ్ = ఆమెను, ఝుటింగః హి = కామపిశాచి, అవాప = చేరవచ్చెను.

**తా :** ఒకానొక విప్రుని అందమైన భార్యను చూచి, ఆమె భర్త గ్రామాంతరమున నుండుటెఱిగి, వాని రూపమును ధరించి ఆమెను చేరవచ్చినాడొక కామపిశాచి.

**శ్లో॥ కామార్తో వర్ణవ్యవస్థాయాం దురాచారో హి యో మృతః ।**
**స ఝుటింగత్వమేత్యేవ దుర్ధరః కామలంపటః ॥ 18**

**ప్ర :** వర్ణవ్యవస్థాయామ్ = వర్ణాశ్రమవ్యవస్థలో, దురాచారః = దుష్టాచారుడై, కామార్తః = కామబాధితుడై, యః హి = ఎవడైతే, మృతః = మరణించునో, సః కామలంపటః = ఆ కామపీడితుడు, ధుర్ధరః = భరింపరాని, ఝుటింగత్వమ్ = పిశాచిత్వమును, ఏతి ఏవ = పొందియే తీరును.

**తా :** వర్ణవ్యవస్థలో దురాచారియై, కామార్తుడై మరణించిన భరింపరాని కామవాంఛాపీడితుడు పిశాచిత్వమును పొందుట తప్పదు.

**శ్లో॥ కథం హ్యాశ్వాగమ ఇతి సత్యోక్తః సత్కృతోఽవదత్ ।**
**గతో యదర్థం మార్గే స మిలితః ప్రాహ నాధునా ॥ 19**

**శ్లో॥ సాధ్యం కార్యం మాసమాత్రాదేహీత్యుక్తోఽఞ్జసాగమమ్ ।**
**ఇతి తాం వఞ్చయిత్వా స సాధ్వీం స్వవశమానయత్ ॥ 20**

**ప్ర :** ఆశు ఆగమః = త్వరగా (వెంటనే) మరలివచ్చుట, కథం హి = ఎట్లయినది, ఇతి = అని, సత్యా = భార్యతో, ఉక్తః = అడుగబడినవాడై, సత్కృతః = సత్కరింపబడి, అవదత్ = ఇట్లనెను, యదర్థం గతః = ఎవని కొరకు వెడలితినో, సః = ఆతడు, మార్గే = త్రోవలోనే, మిలితః = కలిసినవాడై, ప్రాహ = ఇట్లనెను, అధునా న = నేడు కాదు, మాసమాత్రాత్ = నెలవ్యవధిలో, ఏహి = రమ్ము, కార్యం సాధ్యమ్ = పని సఫలమగును, ఇతి ఉక్తః = అని చెప్పబడి, అఞ్జసా = వెంటనే, ఆగమమ్ = తిరిగి వచ్చితిని, ఇతి = అని, సః = ఆ కామపిశాచి, తాం సాధ్వీమ్ = ఆ యిల్లాలిని, స్వవశమ్ ఆనయత్ = తనవశము చేసికొనెను.

**తా :** వెంటనే తిరిగి వచ్చితిరేమని అడిగిన భార్యకు భర్తరూపపిశాచి యిట్లనెను : నే నెవరి కొరకు వెడలితినో ఆతడు త్రోవలోనే కలిసి, నేడు కాదు, ఒక నెల తరువాత రమ్ము, పని

సఫలమగునని చెప్పగా, వెంటనే మరలి వచ్చితిని, ఇట్లామె భర్తస్థానమున ఆ యింట జేరి ఆ యిల్లాలిని వశపరచికొనెను.

**శ్లో॥ వశం గతా తస్య మాయామజానన్తీ మనస్వినీ ।**
**ధార్ష్ట్యం బలం భోగశక్తిం వికారాంశ్చ విలక్షణాన్ ॥ 21**

**శ్లో॥ జ్ఞాత్వాపి దుఃఖితా వక్తుం న శశాకాప్రియం క్వచిత్ ।**
**తస్మిన్ సందిగ్ధచిత్తాపి ప్రత్యాఖ్యాతుమనీశ్వరా ॥ 22**

**ప్ర :** తస్య = ఆ కామపిశాచియొక్క, మాయామ్ = మోసమును, అజానన్తీ = తెలియనిదైన, మనస్వినీ = ఆ యిల్లాలు, (తస్య) వశం గతా = వానికి లొంగినదై, విలక్షణాన్ = విశేషలక్షణములైన, (తస్య) ధార్ష్ట్యమ్ = కరుకుదనమును, బలమ్ = బలమును, భోగశక్తిమ్ = సంభోగమునందలి శక్తిని, వికారాన్ చ = కామవికారములను, జ్ఞాత్వా అపి = తెలిసికొనియును, దుఃఖితా = మనస్తాపము జెంది, తస్మిన్ = వాని విషయమున, సందిగ్ధచిత్తా అపి = మనసున సంశయములున్నను, క్వచిత్ అప్రియమ్ = వానికి బాధకలిగించునదేమియు, వక్తుమ్ = మాట్లాడుటకు, న శశాక = శక్తిలేనిదాయెను, ప్రతి+ఆఖ్యాతుమ్ = అతని కోరిక కెదురు మాటాడుటకు, అనీశ్వరా = అసమర్థురాలాయెను.

**తా :** ఆ కామపిశాచి మోసము నెఱుగక వాని వశమైన ఆ యిల్లాలు, వాని విపరీత సంభోగలక్షణములకు, వాడు తన భర్తకాడేమో యని, సందేహించినను, వాని కోరికను కాదని వారింపలేకపోయినది.

**శ్లో॥ మాసేనైత్య గృహేశస్తం దృష్ట్వోచే మత్స్వరూపధృక్ ।**
**కోఽసి భార్యాం గృహం చార్థం కథం గృహ్ణాస్యరేఽధమ! ॥ 23**

**ప్ర :** మాసేన = నెల గడువగా, ఏత్య = వచ్చి, గృహ+ఈశః = ఇంటి యజమాని, తమ్ = వానిని, దృష్ట్వా = చూచి, ఊచే = ఇట్లనెను, మత్+స్వరూపధృక్ = నా రూపము ధరించి, భార్యామ్ = భార్యను, గృహమ్ = యింటిని, అర్థం చ = సంపదను, గృహ్ణాసి = అనుభవించు చున్నావు, కథమ్ = ఇదెట్లు, అరే అధమ! = ఓరి నీచుడా!, కః అసి = ఎవడురా నీవు?

**తా :** ఒక నెల గడువగా ఆ యింటి యజమాని తిరిగి వచ్చి, ఆ యింటనున్న ఆ కామపిశాచిని చూచి యిట్లనెను : నా రూపముతో నా భార్యను, యింటిని, సంపదను, నీ వెట్లనుభవించు చున్నావురా? ఒరే నీచుడా! ఎవరురా నీవు?

**శ్లో॥ స ప్రాహాహం గృహస్వామీ కస్త్వం మద్రూపధృక్ఖల! ।**
**త్వం ఖలస్త్వం ఖల ఇతి వివదన్తౌ విలోక్య తౌ ॥ 24**

**శ్లో॥ దృష్ట్వైకరూపౌ చకితా మిత్రశ్వశురబాన్ధవాః ।**
**సర్వం రహసి పత్న్యోక్తం జ్ఞాత్వా ఖిన్నోఽభవద్ద్విజః ॥ 25**

**ప్ర :** సః ప్రాహ = ఆతడిట్లనెను, అహమ్ = నేను, గృహస్వామీ = యింటి యజమానిని, కః త్వమ్ = నీ వెవడవు?, మద్రూపధృక్ = నా రూపము ధరించిన, ఖల! = ఖలుడా!, త్వం ఖలః = నీవు దుర్మార్గుడవు, త్వం ఖలః = నీవు నీచుడవు, ఇతి = అని, వివదన్తౌ = వాదులాడుచున్న, తౌ = వారిద్దరను, విలోక్య = పరికించి, ఏకరూపౌ దృష్ట్వా = ఒకే రూపముగలవారిగా గుర్తించి, మిత్ర = మిత్రులు, శ్వశుర = మామ, బాన్ధవాః = బంధువులు, చకితాః = ఆశ్చర్యమగ్నులైరి, రహసి = రహస్యముగా, పత్న్యా ఉక్తం సర్వమ్ = భార్యచే చెప్పబడిన దంతయు, జ్ఞాత్వా = తెలిసికొని, ద్విజః = బ్రాహ్మణుడు, ఖిన్నః అభవత్ = దుఃఖితుడాయెను.

**తా :** ఆతడు, నేను యీ యింటి యజమానిని; నా రూపముతో నున్న నీ వెవడవు? నీవు నీచుడవనగా, నీవు నీచుడవని ఆ యిద్దరు వాదులాడుకొనజొచ్చిరి. ఒకే రూపము గల యిద్దరను చూచి ఆ బ్రాహ్మణుని మామ, మిత్రులు అందఱు అబ్బురపడిరి. రహస్యముగా తన భార్య చెప్పిన విషయము తెలిసికొని ఆ బ్రాహ్మణుడు దిగులుపడెను.

**శ్లో॥ ఝుటింగేన స్త్రియా స్వేశ్చ విష్ణుదత్తాలయం ద్విజః ।**
**గత్వా శశంస తత్సర్వం జ్ఞాత్వాప్యేవావదత్స తౌ ॥ 26**

**ప్ర :** ద్విజః = బ్రాహ్మణుడు, స్వేః స్త్రియా చ = తన భార్యతోడను, ఝుటింగేన = ఆ పిశాచితోడ, విష్ణుదత్త+ఆలయం గత్వా = విష్ణుదత్తుని యింటికి వెడలి, తత్ సర్వమ్ = విషయ మంతయు, శశంస = వివరించెను, సః = విష్ణుదత్తుడు, జ్ఞాత్వా ఏవ అపి = పిశాచి యెవరో తెలిసియే, తౌ = వారిద్దరితో, అవదత్ = ఇట్లనెను.

**తా :** బ్రాహ్మణుడు తన భార్యను ఆ పిశాచిని కూడ తీసికొని విష్ణుదత్తుని యింటికి బోయెను. విషయమంతయు విని, పిశాచి యెవరో తెలిసి పోయినను, విష్ణుదత్తు డా యిద్దరతో నిట్లనెను.

**శ్లో॥ రూపం శీలం వయోఽవస్థా స్వరవర్ణకృతిర్గతిః ।**
**నామగోత్రకులాద్యేకం వదథః సత్యమత్ర కిమ్ ॥ 27**

**ప్ర :** రూపమ్ = పోలికలు, శీలమ్ = నడవడిక, వయః అవస్థా = యౌవనాది దశ, స్వర = కంఠస్వరము, వర్ణ = ఒడలి రంగు, కృతిః = చేష్టలు, గతిః = నడక, నామ = పేరు, గోత్ర = గోత్రము, కుల+ఆది = కులము మొదలగు వివరములు, ఏకం వదథః = ఒక్కటే యిద్దఱును చెప్పుచున్నారు, అత్ర = ఈ విషయమున, సత్యం కిమ్ = నిజమేమి?

**తా :** ఒకే పోలికగా ఉన్నారు. ఒకే వయసు, ఒకే రంగు, ఒకే గొంతు, ఒకే నడక, ఒకే పేరు,

ఒకే కులగోత్రములు, ఒకే ప్రవర్తన, ఒకే చేష్టలు, అన్నిటనూ యిద్దరొకటిగనే యున్నారు. నిజమైన వారెవరు?

**శ్లో॥ క్షన్తవ్యం నిశ్చినోమీదమిత్యుక్త్వా సప్త ముద్రికాః ।**
**దత్వా సమన్త్రా భాలేఽసౌ పృథక్ పప్రచ్ఛ సంసది ॥ 28**

**ప్ర :** ఇదమ్ = ఈ సత్యమును, నిశ్చినోమి = నిశ్చయింతును, క్షన్తవ్యమ్ = క్షమింపదగును, ఇతి = అని, ఉక్త్వా = పలికి, సప్త = ఏడు, ముద్రికాః = ముద్రికలను, (లేక, నాణెమునకొక ప్రక్క యేడు అంకె ముద్రింపబడుయున్నవాని కొన్నిటిని) సమన్త్రాః = మంత్రింపబడినవానిని, భాలే = చీకటిలో, దత్వా = యిచ్చి, సంసది = సభలో, పృథక్ = విడివిడిగా, అసౌ = వారిని, పప్రచ్ఛ = అడిగెను.

**తా :** ఈ సత్యమును నిశ్చయింతును, క్షమింపుడని పలికి, యేడు అంకె ఒక ప్రక్క ముద్రింపబడిన నాణెములను వారిర్వురకు చీకటిలో నిచ్చి, వారిని సభలో విడివిడిగా నడిగెను. అవి మంత్రించిన ముద్రికలు.

**శ్లో॥ కుప్యభాణ్డాంశుకాన్నాది గేహే లక్ష్మ చ తే శ్రియి ।**
**ప్రకాశం చాప్రకాశం చ సర్వమాఖ్యాతుమర్హసి ॥ 29**

**ప్ర :** తే = నీ యొక్క, గేహే = ఇంటియందు, కుప్యభాణ్డ = బంగారు వెండి కాక, దానికి భిన్నమయిన ధాతువు లేక లోహముతో చేసిన పాత్రలు, అంశుక = వస్త్రములు, అన్న+ఆది = అన్నము మొదలగు, లక్ష్మ చ = గుర్తులున్ను, శ్రియి = సంపదయందు, ప్రకాశం చ అప్రకాశంచ = అందరు చూచునవి, రహస్యముగ నున్నవి కూడ, సర్వమ్ = అంతయు, ఆఖ్యాతుమ్ = వివరించి చెప్పుటకు, అర్హసి = తగియున్నావు.

**తా :** నీ ఇంటిలో బంగారు పాత్రలు, వెండి పాత్రలు కాక, వేరు లోహముతో చేసిన పాత్రలు, వస్త్రములు, అన్నము మొదలగు పదార్థములు, బైటకు కన్పడునవియు కనరానివియు, అన్నిటిని వివరించి చెప్పుము.

**శ్లో॥ లేఖయిత్వా పృథక్ తాభ్యాముక్తం సంసది దూరతః ।**
**తౌ కృత్వా బ్రాహ్మణీం ప్రాహ సత్యం కస్యోభయోర్వద ॥ 30**

**ప్ర :** తాభ్యాం ఉక్తమ్ = వారిద్దరిచే చెప్పబడినది, పృథక్ = విడిగా, లేఖయిత్వా = వ్రాయించి, తౌ = వారిద్దరిని, దూరతః కృత్వా = దూరమున నుంచి, సంసది = సభలో, బ్రాహ్మణీం ప్రాహ = బ్రాహ్మణ స్త్రీ నిట్లడిగెను, ఉభయోః = ఇద్దరిలో, కస్య = ఎవరు చెప్పినది, సత్యమ్ = నిజము?, వద = చెప్పుము.

**తా :** వారిద్దరు చెప్పిన వివరములు విడివిడిగా వ్రాయించి యుంచి, వారిద్దరిని దూరమున

నుంచి, సభలో బ్రాహ్మణస్త్రీని యిట్లడిగెను : ఇద్దరిలో ఎవరు చెప్పిన వివరములు సరియైనవి? చెప్పుము.

**శ్లో॥ సా ప్రాహ యోఽద్య మాం భుఙ్క్తే తద్వాక్యే వ్యత్యయో మహాన్ ।**
**అపరోక్తౌ సత్యతేతి తథేత్యుక్త్వా ద్విజోఽబ్రవీత్ ॥ 31**

**ప్ర :** సా ప్రాహ = ఆమె యిట్లనెను, యః = ఎవడు, మామ్ = నన్ను, భుఙ్క్తే = అనుభవించెనో, తత్ వాక్యే = వాని పలుకునందు, మహాన్ వ్యత్యయః = చాల వ్యత్యాసమున్నది, అపర ఉక్తౌ = ఆ రెండవవాని మాటలలో, సత్యతా = నిజమున్నది, ఇతి = అని, ద్విజః = బ్రాహ్మణుడు, తథా = అట్లే, ఇతి ఉక్త్వా = అని చెప్పి, అబ్రవీత్ = యిట్లనెను.

**తా :** నేడు నన్ననుభవించిన వాని మాటలలో వ్యత్యాసము చాలయున్నది. రెండవ వాని మాటలే సత్యమని ఆ బ్రాహ్మణి చెప్పగా, సరియని, బ్రాహ్మణుడిట్లనెను.

**శ్లో॥ పఞ్చక్రోశాత్మకమిదం క్షేత్రం కృత్వా ప్రదక్షిణమ్ ।**
**విప్రవేక్ష్యతి యః శీఘ్రం పూర్వం స విజయీ భవేత్ ॥ 32**

**ప్ర :** ఇదం క్షేత్రమ్ = ఈ క్షేత్రము, పఞ్చక్రోశాత్మకమ్ = ఐదుక్రోసుల వైశాల్యము గలది, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి, యః = ఎవడు, శీఘ్రమ్ = త్వరగా, పూర్వమ్ = ముందుగా, విప్రవేక్ష్యతి = యిందు తిరిగి ప్రవేశించునో, సః = వాడు, విజయీ భవేత్ = విజేతయగును.

**తా :** ఈ క్షేత్రము అయిదు క్రోసుల విస్తీర్ణము గలది. దీనిని ప్రదక్షిణము చేసి ఇద్దరిలో ముందుగా త్వరగా వచ్చువాడు విజేతయగును.

**శ్లో॥ తథేత్యుక్త్వా గతౌ తత్ర క్షణార్ధేన పిశాచకః ।**
**పరిక్రమ్యైత్య తత్రాహ కృతా మేఽద్య ప్రదక్షిణా ॥ 33**

**శ్లో॥ లిఙ్గాని పథి సర్వాణి దేవతాయతనాని చ ।**
**తాని సర్వాణ్యసందిగ్ధం కథయామాస సంసది ॥ 34**

**ప్ర :** తథా ఇతి ఉక్త్వా = అట్లేయని పలికి, గతౌ = వెడలిన వారిద్దరు, తత్ర = అచటనుండి, పరిక్రమ్య = ముందుకు సాగి, క్షణ+అర్ధేన = ఒకటిన్నర క్షణములలో (లేక, అర్ధక్షణములో), ఏత్య = వచ్చి, పిశాచకః = పిశాచము, తత్ర = సభలో, ఆహ = ఇట్లనెను, అద్య = ఇప్పుడు, మే ప్రదక్షిణా కృతా = నా ప్రదక్షిణ పూర్తియైనది, పథి = మార్గమున గల, సర్వాణి లిఙ్గాని, గుర్తులన్నిటిని, దేవతా+ఆయతనాని చ = దేవాలయములను గూడ, తాని సర్వాణి = వాని నన్నిటిని, అసందిగ్ధమ్ = నిస్సంశయముగా, సంసది = సభలో, కథయామాస = చెప్పెను.

**తా :** అట్లేయని వెడలిన వారిద్దరిలో పిశాచము అరక్షణములో తిరిగివచ్చి, నా ప్రదక్షిణ పూర్తియైన దనుచూ త్రోవలో గల గుర్తులను, దేవాలయములను అన్నిటిని నిస్సందేహముగా సభలో చెప్పెను. *

**శ్లో॥ తచ్ఛ్రుత్వా చకితాః సర్వే సభ్యా ఊచుః పరస్పరమ్ ।**
**నేయం మనుష్యచేష్టాతో భూతోఽయం నాత్ర సంశయః ॥ 35**

**ప్ర :** తత్ శ్రుత్వా = అది విని, సర్వే సభ్యాః = సభ్యులందఱు, చకితాః = అబ్బురపడినవారై, పరస్పరం ఊచుః = ఒకరితో నొకరు చెప్పికొనిరి, అయమ్ = ఇది, మనుష్యచేష్టా న = మనుష్యులు చేయదగినది కాదు, అతః = అందువలన, అయమ్ = వీడు, భూతః = భూతము, అత్ర న సంశయః = ఈ విషయమున సంశయము లేదు.

**తా :** అది విని సభ్యులందఱు అబ్బురపడి వారిలో వారిట్లనుకొనిరి : ఇది మానవుడు చేయగల పని కాదు. కావున వీడు మానవుడు కాదు, భూతమే.

**శ్లో॥ ప్రాప విప్రస్త్వకృత్స్నజ్ఞో దినార్ధేనాబ్రవీత్సమమ్ ।**
**విష్ణుశర్మా పునః ప్రాహ సిద్ధాః కతి గిరావిహ ॥ 36**

**ప్ర :** విప్రః తు = బ్రాహ్మణుడేమో, అకృత్స్నజ్ఞః = వివరములన్నియు తెలియనివాడై, దినార్ధేన = సగమురోజులో (లేక ఒకటిన్న రోజులో), ప్రాప = వచ్చిచేరెను. సమమ్ = సరిగా, అబ్రవీత్ = చెప్పెను, విష్ణుశర్మా = విష్ణుశర్మ, పునః = మరల, ప్రాహ = అడిగెను, ఇహ గిరౌ = ఈ కొండపై, సిద్ధాః = సిద్ధులు, కతి = ఎందరు?

**తా :** బ్రాహ్మణుడేమో వివరములన్నియు తెలియనివాడై సగము రోజులో వచ్చి, సమముగా చెప్పెను. విష్ణుశర్మ మరల అడిగెను : ఈ కొండపై గల సిద్ధులెందరు?

**శ్లో॥ పృష్ట్వా తన్నామగోత్రాది గిరిం కృత్వా ప్రదక్షిణమ్ ।**
**బ్రూయాద్యః శీఘ్రమాగత్య ప్రథమం స జయీ భవేత్ ॥ 37**

**ప్ర :** తత్ నామగోత్ర+ఆది = వారి పేర్లను గోత్రములను మొదలగువానిని, పృష్ట్వా = అడిగి, గిరిమ్ = కొండను, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి, యః = ఎవడు, శీఘ్రం ఆగత్య ప్రథమమ్ = త్వరగా ముందుగా వచ్చి, బ్రూయాత్ = చెప్పునో, సః = ఆతడు, జయీ భవేత్ = జయించును.

**తా :** వాని నామగోత్రాది వివరముల నడిగి తెలిసికొని, కొండకు ప్రదక్షిణము చేసి వేగముగా మొదట వచ్చి చెప్పునో, ఆతడీ పరీక్షలో జయించును.

**శ్లో॥ ఇత్యుక్త్వా జగ్మతురుభౌ ముహూర్తార్ధాత్పిశాచకః ।**
**ఆగత్య స యథాపృష్టం కథయామాస సర్వశః ॥ 38**

**ప్ర :** ఇతి ఉక్త్వా = ఇట్లు చెప్పబడి, ఉభౌ = ఇద్దరును, జగ్మతుః = వెడలిరి, పిశాచకః = పిశాచము, ముహూర్తార్ధాత్ = 24 నిమిషములలో, ఆగత్య = తిరిగి వచ్చి, సః = ఆతడు, యథాపృష్టమ్ = అడిగిన వివరములు, సర్వశః = అన్ని విధములైనవి, కథయామాస = చెప్పెను.

**శ్లో॥ విప్రస్తు పఞ్చయామోర్ధ్వమేత్య క్లేశాదువాచ సత్ ।**
**సిద్ధా న దృష్టాస్తన్నామగోత్రవార్తా కుతః పునః ॥ 39**

**ప్ర :** విప్రః తు = బ్రాహ్మణుడేమో, పఞ్చయామ+ఊర్ధ్వమ్ = ఐదు యామములకుపైన, అనగా, 15 గంటల కాలమునకు మించి గడువగా, ఏత్య = వచ్చి, క్లేశాత్ = విచారముతో, సత్ = సత్యము, ఉవాచ = చెప్పెను, సిద్ధాః = సిద్ధులు, న దృష్టాః = నాకు కనబడలేదు, పునః = ఇంక, తత్ నామ గోత్ర వార్తా = వారి నామగోత్రముల విషయము, కుతః = ఎందుకు?, చెప్పుటకేమున్నది?

**తా :** ఇది విని ఇద్దరును వెడలిరి. పిశాచము 24 నిమిషములలో తిరిగి వచ్చి అడిగిన వివరములన్నియు తెలిపెను. బ్రాహ్మణుడేమో 15 గంటలు దాటిన వ్యవధిలో వచ్చి, విచారముతో సత్యము పలికెను : నాకు సిద్ధులెవరునూ కనబడలేదు. ఇంక వారి నామగోత్రము లేమని చెప్పుదును?

**శ్లో॥ తచ్ఛ్రుత్వాతీవ విశ్వాసో విప్రస్యాభూత్సభాసదామ్ ।**
**విష్ణుశర్మా పునః ప్రాహ పరీక్షైకా విశిష్యతే ॥ 40**

**ప్ర :** తత్ శ్రుత్వా = అది విని, సభాసదామ్ = సభలోని వారికి, విప్రస్య = విప్రునియందు, అతీవ విశ్వాసః = మిక్కిలి నమ్మకము, అభూత్ = కలిగెను, పునః = మరల, విష్ణుశర్మా = విష్ణుశర్మ, ప్రాహ = ఇట్లనెను, ఏకా పరీక్షా = ఒక్క పరీక్ష, విశిష్యతే = ప్రత్యేకించి మిగిలియున్నది.

**తా :** ఆ మాటలు విని, సభలోని వారికి బ్రాహ్మణుని మాటలలో మిక్కిలి నమ్మకము కలిగెను. మరల విష్ణుశర్మ, మరియొక్క పరీక్ష మిగిలి యున్నదనెను.

**శ్లో॥ ఇత్యుక్త్వా లోహకరకం సంస్థాప్యోవాచ తౌ ద్విజః ।**
**వక్త్రేణావిశ్య నాలేన నిర్గమ్య స్త్రీ ప్రగృహ్యతామ్ ॥ 41**

**ప్ర :** ఇతి ఉక్త్వా = అని పలికి, లోహకరకమ్ = లోహముతో చేసిన గొట్టమును, (ఇనుపది), సంస్థాప్య = నెలకొల్పి, తౌ = వారిద్దరితో, ద్విజః = విష్ణుశర్మ, ఉవాచ = ఇట్లనెను, వక్త్రేణ = ముఖముద్వారా, అవిశ్య = లోన ప్రవేశించి, నాలేన = లో ప్రదేశమునుండి, నిర్గమ్య = బైటకు వెడలి, స్త్రీ = ఈ స్త్రీని (తన భార్యను), ప్రగృహ్య తామ్ = స్వీకరించవచ్చును.

**తా :** ఇట్లనుచు, విష్ణుశర్మ లోహపాత్రను (గొట్టమును) తెప్పించి, అటనుంచి, వారిద్దరితో ఇట్లనెను : దీనిలో ప్రవేశించి, బైటకు వచ్చి, తన భార్యను తీసికొనిపోవచ్చును.

**శ్లో॥ ఇత్యుక్తః సత్వరం భూతః సూక్ష్మరూపీ సమావిశత్ ।**
**కృతరక్షో ద్విజో ధ్యాత్వా శ్రీశం మన్త్రం జజాప హ ॥ 42**

**ప్ర :** ఇతి ఉక్తః = ఇట్లని చెప్పబడి, భూతః = పిశాచము, సూక్ష్మరూపీ = సూక్ష్మరూపియై, సమావిశత్ = ప్రవేశించెను, ద్విజః = బ్రాహ్మణుడు విష్ణుశర్మ, కృతరక్షః = రాక్షసుని గుర్తించి, శ్రీశం ధ్యాత్వా = శ్రీదత్తుని ధ్యానించి, మన్త్రమ్ = మంత్రమును, జజాప = జపించెను, హ = ఔరా!

**శ్లో॥ దుర్ధరం దుర్ముఖం దుష్టం పిశాచమిన్ద్ర! సంహర ।**
**ధ్వా మన్త్రానుభావేన సర్వం రక్షో నిబర్హయ ॥ 43**

**ప్ర :** ఇన్ద్ర = ఓ ఇంద్రా!, దుర్ధరమ్ = భరింపరాని, దుర్ముఖమ్ = భయంకరమైన, దుష్టమ్ = చెడుగుచేయు, పిశాచమ్ = పిశాచమును, సంహర = సంహరింపు, మన్త్రానుభావేన బధ్వా = మంత్రశక్తితో బంధించి, రక్షః సర్వమ్ = రాక్షసుని సర్వస్వమును, నిబర్హయ = నిర్వీర్యము చేయుము.

**శ్లో॥ ఇత్యనేన ముఖం నాలం కీలయామాస మధ్యగః ।**
**భూతోఽభూద్దుఃఖితో బద్ధం తం తత్యాజ మహాగిరౌ ॥ 44**

**ప్ర :** ఇతి = అని, అనేన = మంత్రముతో, ముఖమ్ = కరకము యొక్క ముఖమును, నాలమ్ = నాలమును, కీలయామాస = మూసివేసెను, భూతః = పిశాచము, మధ్యగః = మధ్యలోనున్నదై, దుఃఖితః అభూత్ = దుఃఖించెను, బద్ధం తమ్ = బంధింపబడిన ఆ పిశాచమును, మహాగిరౌ = మహాపర్వతముపై, తత్యాజ = వదలెను.

**తా (శ్లో.42-44) :** ఈ మాటలు విని పిశాచము వెంటనే సూక్ష్మరూపముతో ఆ కరకమున ప్రవేశించెను. విష్ణుశర్మ రాక్షసుని గుర్తించి, శ్రీదత్తుని ధ్యానించి, మంత్రము జపించెను. ఆశ్చర్యకరముగా, ఆ పిశాచమును మంత్రశక్తితో బంధించి, వానిపైశాచిక శక్తిని నిర్వీర్యము చేసి, ఆ కరకముయొక్క రెండు చివరలను మూసివేసెను. కరకము మధ్యలో భూతము బందీయాయెను, దుఃఖించెను. అట్లు బంధింపబడిన ఆ పిశాచమును మహాపర్వతశిఖరముపై వదలెను.

**శ్లో॥ సాధ్వీ విప్రః సదస్యాశ్చ జహర్షుః ప్రాహ తాం ద్విజ! ।**
**దృష్టమాత్రో మయా జ్ఞాతో ఝుటింగోఽయం మహాఖలః ॥ 45**

**ప్ర :** సాధ్వీ = ఆ యిల్లాలు, విప్రః = బ్రాహ్మణుడు, సదస్యాః చ = సభాసదులున్ను, తాం జహర్షుః = ఆమెను పొగడిరి, ప్రాహ = ఇట్లనెను, ద్విజ! = ఓ బ్రాహ్మణుడా!, మయా = నాచే,

దృష్టమాత్రః = చూడబడిన తోడనే, అయమ్ = వీడు, మహాఖలః = మహానీచుడైన, ఝుటింగః = పిశాచముగా, జ్ఞాతః = ఎఱుగబడినవాడాయెను.

**తా :** ఆ యిల్లాలున్నూ, ఆ బ్రాహ్మణుడున్నూ, సభాసదులున్నూ, ఆమెను పొగడిరి. విష్ణుశర్మ యిట్లనెను : ఓ బ్రాహ్మణా! వీడు దుర్మార్గుడైన పిశాచము అని వానిని చూడగనే తెలిసికొంటిని.

**శ్లో॥ సహసా నిగృహీతేఽస్మిన్నపవాదో మయీత్యతః ।**
**కృతో యత్న క్రమాదేష లోకసంశయభేదకః ॥ 46**

**ప్ర :** మయి = నా యందు, అస్మిన్ అపవాదః = ఈ అపవాదము, సహసా = వెంటనే, నిగృహీతే = నివారింపదగును, ఇతి = అని, అతః = ఆ కారణమున, క్రమాత్ = పద్ధతిగా, ఏష = ఈ, లోకసంశయభేదకః = లోకుల అనుమానముల తొలగించు, యత్నః కృతః = ప్రయత్నము చేయబడినది.

**తా :** నా యందలి యీ అపకీర్తిని వెంటనే మాపుకొనదగునని, అందుకై ఒక పద్ధతిలో యీ ప్రయత్నము చేయబడినది. దీనివలన లోకుల అనుమానములు తొలగిపోవును.

**శ్లో॥ శాస్త్రక్రమాద్యథాజ్ఞస్యాజ్ఞానాన్తః క్రియతే తథా ।**
**కృతా ప్రతిక్రియైషాత్ర నైవ కస్యాపి సంశయః ॥ 47**

**ప్ర :** యతా = ఏ విధముగా, అజ్ఞస్య = అజ్ఞానియొక్క, అజ్ఞాన+అన్తః = అజ్ఞానము నశించుట, శాస్త్రక్రమాత్ = శాస్త్రముననుసరించుట వలన, క్రియతే = సాధించబడునో, తథా = ఆ రీతిగా, అత్ర = ఈ విషయమున, ఏషా ప్రతిక్రియా కృతా = ఈ విరుగుడుకై ఉపాయము చేయబడినది, కస్య+అపి = ఎవరికైనను, సంశయః = అనుమానము, న+ఏవ = లేనేలేదు.

**తా :** శాస్త్రీయపద్ధతులవలన అజ్ఞానము నశించునట్లు యీ ఉపాయముద్వారా సత్యము విదితమైనది. ఇప్పుడిక ఎవరికిని యే సంశయమునూ లేదు.

**శ్లో॥ విశ్వాసః ప్రథమే కిఞ్చిద్ద్వితీయే సవిశేషకః ।**
**తృతీయే సంశయశ్ఛిన్నస్తుర్యే నాశమితోఽధమః ॥ 48**

**ప్ర :** ప్రథమే = మొదటిపరీక్షలో, కిఞ్చిత్ = కొంచెము, విశ్వాసః = నమ్మకము కలిగినది, ద్వితీయే = రెండవపరీక్షలో, విశేషకః = అది బలపడినది, తృతీయే = మూడవపరీక్షలో, సంశయః = సందేహము, ఛిన్నః = తొలగిపోయినది, తుర్యే = నాల్గవపరీక్షలో, అధమః = దుర్మార్గుడు, నాశమితః = నాశము పొందినాడు.

**తా :** మొదటనే కొంత విశ్వాసమేర్పడినది. అది తర్వాత బలపడినది. మూడవపరీక్షలో నిశ్చయమైనది. నాల్గవదానితో ఆ నీచపిశాచము నశించినది.

**శ్లో॥ సర్వే తతస్తదాదిష్టా నత్వా జగ్ముర్యథాగతమ్ ।**
**సాధ్వీ సాఽనిన్దితా హృష్టా స్వేశం లబ్ధ్వా తథైవ సః ॥ 49**

ప్ర : తతః = అక్కడనుండి, తత్ ఆదిష్టాః = వానిచే ఆజ్ఞాపింపబడినవారై, సర్వే = అందఱును, నత్వా = నమస్కరించి, యథా ఆగతమ్ = ఎట్లు వచ్చిరో, జగ్ముః = (అట్లే) వెడలిరి, సా సాధ్వీ = ఆ యిల్లాలు, అనిన్దితా = అపకీర్తి తొలగినదై, హృష్టా = సంతోషించినదై, స్వ+ఈశమ్ = తన భర్తను, లబ్ధ్వా = పొంది, సః = అతడును, తథా+ఏవ = అట్లే (వెడలిరి).

**తా :** విష్ణుశర్మ ఆజ్ఞగొని అందఱును నమస్కరించి అటనుండి వచ్చినత్రోవనే ఎవరి తావుకు వారు వెడలిరి. ఆ యిల్లాలు, తనపై నింద తొలగిపోగా, సంతోషించి, తన భర్తతో వెడలెను.

**శ్లో॥ ఏవం శాస్త్రక్రమాత్త్యక్తః సంశయో యైః ప్రయత్నతః ।**
**ప్రాక్సిద్ధం ప్రాప్నువన్త్యేతే శర్మాసంశయమాత్మనః ॥ 50**

ప్ర : ఏవమ్ = ఈ విధముగా, శాస్త్రక్రమాత్ = శాస్త్రప్రకారము, ప్రయత్నతః = ప్రయత్నము వలన, యైః = ఎవరిచేత, సంశయః = సందేహము, త్యక్తః = తొలగించికొనబడినదో, ఏతే = వారు, అన్తే = కడపట, అసంశయమ్ = నిశ్చయముగా, ఆత్మనః = తమయొక్క, ప్రాక్సిద్ధం శర్మ = సహజమైన శాంతిని, ప్రాప్నువన్తి = పొందుదురు.

**తా :** ఇట్లు శాస్త్రానుసారము ప్రయత్నించి సంశయనివృత్తి చేసికొనినవారు, కడపట నిశ్చయముగా తమ సహజసిద్ధమైన ఆత్మశాంతిని, సుఖమును పొందుదురు.

**శ్లో॥ గత్వోర్ధ్వమపి భోగాన్తే ప్రాప్యేహౌషధితో నరమ్ ।**
**స్త్రీపుంయోగాచ్ఛుక్రరక్తమయో గర్భత్వమేత్యృతౌ ॥ 51**

ప్ర : ఊర్ధ్వమ్ = పైనగల స్వర్గాది లోకములకు, గత్వా అపి = వెడలినను, భోగాన్తే = భోగము కడపట, ఓషధితః = పంచాగ్ని ప్రకారమున, స్త్రీపుంసంయోగాత్ = స్త్రీపురుషుల కలయికవలన, శుక్ర రక్తమయః = వీర్యరక్తముల సమాహారమై, ఋతౌ = ఋతువునందు, నరం ప్రాప్య = నరుని పొంది, గర్భత్వం+ఏతి = గర్భవతి యగును.

**తా :** స్వర్గాది ఊర్ధ్వలోకములలోగూడ స్త్రీపురుషసంయోగమువలన సంభోగాంతమున, శుక్రరక్తములతో గూడిన గర్భము స్త్రీయందేర్పడును.

**శ్లో॥ కలలం ప్రాక్పఞ్చరాత్రాద్బుద్బుదః సప్తరాత్రతః ।**
**పేశీ పక్షాదర్బుదోఽథ భవతి స్వస్తితో ఘనః ॥ 52**

ప్ర : కలలమ్ = పిండము, పఞ్చరాత్రాత్ ప్రాక్ = ఐదు రాత్రులకు ముందు అవస్థలో, బుద్బుదః = బుడగ, సప్తరాత్రతః = ఏడు రాత్రుల పర్యంతము, పేశీ = ఒక గ్రుడ్డు, పక్షాత్ = పదునేను

దినములకు, అర్బుదః = ఒక కండ, అథ = అటుపై, స్వస్తితః = క్షేమముగా, ఘనః భవతి = గట్టిపడును.

**తా :** పిండము అయిదు రాత్రులకు ముందు, తొలిదశలో ఒక బుడగగనుండి ఆపై పిండముగ నగును. ఏడురాత్రులకు గ్రుడ్డుగాను, పదునేను దినములకు ఒక కండగనై, ఆ తరువాత క్షేమముగా ఘనీభవించును.

**శ్లో॥ మాసాత్క్రూరః కం ద్వితీయే తృతీయేఽస్యాఙ్కురోద్భవః ।**
**త్వక్ చతుర్థే రోమనఖాః పఞ్చమే మాసి షష్ఠకే ॥ 53**

**శ్లో॥ ఛిద్రాణి సప్తమే చిత్త్వమష్టమే ధీస్తతః స్మృతిః ।**
**నాలరన్ధ్రాప్తరసభుఙ్నార్తోఽపి మ్రియతే విధేః ॥ 54**

**ప్ర :** కం మాసాత్ = తల ఒకనెలకు, క్రూరః = గట్టిగను, ద్వితీయే = రెండవనెలకు, తృతీయే = మూడవ నెలకు, అస్య = శిశువునకు, అఙ్కుర+ఉద్భవః = కాలుసేతులు యేర్పడును, చతుర్థే = నాల్గవ నెలలో, త్వక్ = చర్మము, పఞ్చమే = ఐదవనెలలో, రోమనఖాః = వెంట్రుకలు, గోళ్ళున్నూ, షష్ఠకే మాసి = ఆరవ నెలలో, ఛిద్రాణి = నవరంధ్రములు, సప్తమే = ఏడవ నెలలో, చిత్త్వమ్ = మెదడు, హృదయము (వీని లక్షణములతో), అష్టమే = ఎన్మిదవ నెలలో, ధీః = బుద్ధి, తతః = ఆపై, స్మృతిః = జ్ఞాపకశక్తి, నాలరన్ధ్ర+ఆప్తరసభుక్ = బొడ్డుత్రాడులోని రంధ్రముద్వారా ప్రసరించి వచ్చు అన్నరసమును తినువాడై, న ఆర్తః అపి = ఆకలి బాధలేనివాడైనను, విధేః = దైవవశమున, మ్రియతే = మరణించును.

**తా :** ఒక నెలకు తల గట్టిపడి, రెండు మూడు నెలలో శిశువునకు కాలుసేతులేర్పడును. నాల్గవ నెలలో చర్మము, ఐదవనెలలో వెంట్రుకలు గోళ్ళున్నూ, ఆరవనెలలో నవరంధ్రములున్నూ, ఏడవ నెలలో మెదడు హృదయమున్నూ, ఎన్మిదవ నెలలో బుద్ధి, ఆపై జ్ఞాపకశక్తి కలుగును. వానికి ఆహారము బొడ్డు త్రాడుద్వారా రసముగా అందుచుండును కావున ఆకలితో బాధపడుట ఉండదు. ఇక విధివశమున ఆ జీవి మరణించును.

**శ్లో॥ స్తౌత్యథేశ! భవాభీతో మోచయార్య! సుదుర్గతేః ।**
**త్వాం భజేఽతః పరం నేదృగ్గతిర్యేన భవేన్మమ ॥ 55**

**ప్ర :** అథ = అంతట, ఈశ! = ఓ స్వామీ!, స్తౌతి = స్తుతించుచున్నాడు, భవాభీతః= జనన మరణరూపసంసారమునుండి భయము జెందినవాడై, ఆర్య! = ఓ ఆర్యా!, సుదుర్గతేః = దుర్గతినుండి, మోచయ = ముక్తినిమ్ము, త్వాం భజే = నిన్ను సేవింతును, అతః పరమ్ = ఇంతకు మించి, ఈదృక్ గతిః = ఇటువంటి గతి, యేన = దేనివలన, మమ = నాకు, న భవేత్ = కలుగదో.

**తా :** ఓ స్వామీ! గర్భస్థుడు నిన్ను స్తుతించుచున్నాడు; ఓ ఆర్య! ఈ జనన మరణశృంఖలవలన భయముజెంది, ఈ దుర్గతినుండి ముక్తినిమ్మని ప్రార్థించుచున్నాడు. ఇక ముందు ఇటువంటి గతి "పునరపి జననం, పునరపి మరణం, పునరపి జననీ జఠరే శయనం"అను దుర్గతి కలుగకుండుటకు తగిన జీవితమునిమ్ము. నిన్ను సేవింతును.

**శ్లో॥ స స్తుత్వైవం సూతివాయుత్యక్తో విస్మృతలబ్ధధీః ।**
**రోరూయతి జనుర్లబ్ధ్వా మోహితో మాయయేశితుః ॥ 56**

**ప్ర :** సః = ఆ గర్భస్థశిశువు, ఏవమ్ = ఈ విధముగా, స్తుత్వా = ప్రార్థించి, విస్మృత = మరపుదగిలిన, లబ్ధధీః = తానంతవరకు పొందియున్న బుద్ధికలవాడై, సూతివాయుత్యక్తః = మాతృగర్భమునుండి ప్రసూతివాయువులచే నెట్టబడి, జనుః = జన్మను, లబ్ధ్వా = పొంది, ఈశితుః = ఈశ్వరుని, మాయయా = మాయచేత, మోహితః = భ్రమలలో మునిగి, రోరూయతి = యేడ్చును.

**తా :** ఇట్లా శిశువు ప్రార్థించి, అంతలో అప్పటికి తనకున్న వివేకమును మరచిపోయి, తల్లి కడుపులో నుండి సూతివాయువులు నెట్టివేయగా జన్మించి ఈశ్వరుని మాయామోహమున బడి యేడ్చుచున్నాడు.

**శ్లో॥ అనభిప్రేతమాపన్న ఆసనోత్థాన చేష్టనే ।**
**పరాధీనతయా భుఙ్క్తే స వ్యథాం వక్తుమక్షమః ॥ 57**

**ప్ర :** అనభిప్రేతమ్ = విరుద్ధముగా, ఆపన్నః = వచ్చినవాడై, ఆసన+ఉత్థాన = కూర్చున్నచోటునుండి లేచి నిలచుట యను, చేష్టనే = చర్యవలన, పరాధీనతయా = తన మనస్సునకు విరుద్ధముగా, నిస్సహాయముగా, భుఙ్క్తే = అనుభవించునట్టి, సః = అతడు, వ్యథాం వక్తుమ్ = బాధను చెప్పుటకు, అక్షమః = అసమర్థుడు.

**తా :** చెంతకు వచ్చిన విరుద్ధమైన వానిని నివారించుటలోను, కూర్చుండుట లేచి నిలచుట వంటి చేష్టలలో ఒకరిపై ఆధారపడవలసిన బాధను చెప్పుటకైన ఆ శిశువు అసమర్థుడు.

**శ్లో॥ క్రీడాసమ్భోగచిన్తాక్తో బాల్యయౌవనవార్ధకే ।**
**పునరావర్తతేఽజ్ఞానీ జ్ఞానీ చేన్ముచ్యతేఽచిరాత్ ॥ 58**

**ప్ర :** బాల్యయౌవనవార్ధకే = బాల్యమున, యౌవనదశలో, ముదుసలియైన తరువాత, (వరుసగా), క్రీడాసంభోగచిన్తాక్తః = ఆటలయందును, సంభోగమునందును, చిన్తలలోనూ ఆసక్తుడై, అజ్ఞానీ = అజ్ఞానియగు వాడు, పునః+ఆవర్తతే = మరల మరల చక్రభ్రమణమున తిరుగును, జ్ఞానీ చేత్ = జ్ఞానియైనచో, అచిరాత్ = త్వరలోనే, ముచ్యతే = ముక్తుడగును.

**తా :** అట్లు జన్మించినవాడు పెరుగుచూ, బాల్యమున ఆటలలోనూ, యౌవనమున స్త్రీ

సంభోగమునందునూ, ముసలితనమున పలు చింతలలోనూ పడుచూ జన్మవెంట జన్మలో యిదే చరిత్రగా సుడిబడి తిరుగుచుండును. ఆ పుట్టిన శిశువొకవేళ జ్ఞానియైతే, త్వరలోనే ముక్తిని పొందును.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం తృతీయాష్టకే సప్తమాధ్యాయః ॥

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## తృతీయాష్టకము - అష్టమాధ్యాయము

**శ్లో॥ ఇదము త్యత్పురుతమం జ్యోతిరానన్దమాత్మవాన్ ।**
**జ్ఞాత్వాఽప్యస్థిరబోధోఽజ్ఞ ద్వైతాద్బిభేతి తచ్ఛృణు ॥ 1**

**ప్రతిపదార్థం :** ఇదమ్ = ఈ జగత్తు అపరోక్షము అనగా ప్రత్యక్షము, ఉ = అయినను, త్యత్ = పరోక్షము, పురుతమమ్ = వ్యాపకము, జ్యోతిః = స్వప్రకాశము, ఆనన్దమ్ = ఆనందము, ఆత్మవాన్ = చేతనము, (ఇట్లని) జ్ఞాత్వా అపి = తెలిసికొనియున్నూ, అస్థిరబోధః = చంచలమైన జ్ఞానముగలవాడై, అజ్ఞ = యథార్థముగా, ద్వైతాత్ = ద్వైతభావనవలన, బిభేతి = భయపడుచున్నాడు, తత్+శృణు = ఆ విషయమున ఇది వినుము.

**తాత్పర్యము :** జగత్తు ప్రత్యక్షము, అయినను ఇది పరోక్షమే. ఎట్లన, ఇదియును వ్యాపకము, స్వప్రకాశము, ఆనందమయము, చైతన్యము. ఈ విషయము తెలిసిన వారికి సైతము ఈ జ్ఞానము నిలుకడ లేకుండును. అందువలన ప్రత్యక్షమైన ద్వైతభావన భయము కలిగించును.

జ్ఞానము కలిగియు చాంచల్యము కలుగుటకు హేతువేమి? అనగా, అసంభావనా, విపరీత భావనా అనునవి ఆ జ్ఞానమును డోలాయమానము చేయును.

**శ్లో॥ ప్రతిష్ఠానే ద్విజః కశ్చిత్ జ్ఞానవిజ్ఞానతత్పరః ।**
**పూర్వాభ్యాసాజ్జన్మనైవ ముక్తోఽప్యాసీత్పిశాచవత్ ॥ 2**

**ప్ర :** ప్రతిష్ఠానే = ప్రతిష్ఠానపురమున, జ్ఞానవిజ్ఞానతత్పరః = లౌకికవిద్యల జ్ఞానమును గ్రహించుటయందును, మోక్షజ్ఞానమునందును ఏకాగ్రబుద్ధియైన, కశ్చిత్ = ఒకానొక, ద్విజః = బ్రాహ్మణుడు, పూర్వాభ్యాసాత్ = పూర్వజన్మలందలి అభ్యాసమువలన, జన్మనా+ఏవ = పుట్టుకచేతనే, ముక్తః అపి = ముక్తుడైనను, పిశాచవత్ = పిశాచమువలె, ఆసీత్ = ఉండెను.

**తా :** ప్రతిష్ఠానపురమున ఒక బ్రాహ్మణుడు పూర్వజన్మలలోని అభ్యాసమువలన లోకవిద్యల

ప్రావీణ్యముతో బాటు మోక్షవిద్యాజ్ఞానముగూడ కలవాడు. జన్మచేతనే ముక్తుడైనను ఈతడు పిశాచమువలె నుండెను.

**శ్లో॥ లోకసఙ్గాద్భృశం భీతో విషయేభ్యో విషాదవాన్ ।**
**మానభీత్యాపి సర్వజ్ఞో దుశ్చేష్టా వ్యకృణోద్ధియా ॥ 3**

**ప్ర :** లోకసఙ్గాత్ = లోకముతో కలసియుండుటకు, భృశమ్ = మిక్కిలి, భీతః= భయపడినవాడై, విషయేభ్యః = ఇంద్రియభోగవిషయములతో, విషాదవాన్ = దుఃఖితుడై, మానభీత్యా అపి = మర్యాదలోపించునను భయముతో గూడ, ధియా సర్వజ్ఞః = బుద్ధిచేత సర్వమెఱిగినవాడై, దుశ్చేష్టాః = చెడ్డపనులు, వ్యకృణోత్ = చేసెను.

**తా :** నలుగురితో కలిసిపోయి బ్రదుకుటకు చాల భయముగలవాడై, ఇంద్రియసుఖములచేత దుఃఖితుడై, మానహానికి భయపడియు, తన వివేకమునకు అంతయు స్పష్టమైనను, చేయరాని పనులు చేసెను.

**శ్లో॥ జన్మనైవ గ్రహగ్రస్తం మత్వా తం పితరౌ బుధమ్ ।**
**చక్రతుః పుత్త్రవాత్సల్యాత్ప్రతీకారం ప్రయత్నతః ॥ 4**

**ప్ర :** పితరౌ = వాని తల్లితండ్రులు, తం బుధమ్ = ఆ జ్ఞానిని, జన్మనా ఏవ = పుట్టుకతోనే, గ్రహగ్రస్తమ్ = భూతమావహించిన వానిగా, మత్వా = తలచి, పుత్త్రవాత్సల్యాత్ = కన్నబిడ్డపై ప్రేమవలన, ప్రయత్నతః = ప్రయత్నపూర్వకముగా, ప్రతీకారమ్ = నివారణకై విరుగుడు కార్యములను, చక్రతుః = చేసిరి.

**తా :** ఆ బాలుని తల్లితండ్రులు పురిటిలోనే వానినేదో దుష్టగ్రహ మావేశించినదని తలచి, బిడ్డపై ప్రేమవలన, అందుకు నివారణకై ప్రయత్నించి ఉపాయములు చేసిరి.

**శ్లో॥ వ్రతోపవాసనియమజపశాన్తిసురార్చనైః ।**
**రక్షాబన్ధనసత్తీర్థయాత్రాదానౌషధాదిభిః ॥ 5**

**ప్ర :** వ్రత = వ్రతముచేసి, ఉపవాస = నిరాహారముగ నుండి, నియమ = అనేకమైన నియమములు పాటించి, జప = జపములు చేయించి, శాన్తి = శాంతిక్రియలు జరిపించి, సుర+అర్చనైః = దేవీదేవతల పూజలతో, రక్షాబంధన = రక్ష కట్టించి, సత్+తీర్థయాత్రా = పుణ్యతీర్థముల యాత్రలు సేవించి, దాన = దానములిచ్చి, ఔషధ+ఆదిభిః = ఔషధము లిప్పించి, ఇట్లనేక ప్రయత్నములతో (నివారణకై ప్రయత్నము చేసిరి).

**తా :** వ్రతములు, ఉపవాసములు, నియమములు, జపములు, శాంతులు, పూజలు, రక్షలు, తీర్థయాత్రలు, దానములు, ఔషధములు, ఇట్లు మానవప్రయత్నమంతయు దానిని నివారించుటకై చేసిరి.

**శ్లో॥ ప్రకృతిం న యయౌ జాతాః ప్రయత్నా నిష్ఫలాస్తయోః ।**
**మలం మూత్రం తథా భక్ష్యం పానమన్నం న వేద సః ॥ 6**

**ప్ర :** తయోః ప్రయత్నాః = ఆ తల్లితండ్రుల ప్రయత్నములు, నిష్ఫలాః జాతాః = ఫలవంతములు కాలేదు, సః = ఆతడు, ప్రకృతిమ్ = సహజత్వమును, న యయౌ = పొందలేదు, మలం మూత్రమ్ = మలమూత్రములను, తథా = అట్లే, భక్ష్యం అన్నం పానమ్ = తినదగిన దానిని, అన్నమును, పానీయమును (త్రాగదగినదానిని), న వేద = తెలియకుండెను.

**తా :** ఆ తల్లితండ్రుల ప్రయత్నములు ఫలించలేదు. వారి తనయుడు అందరివలె మెలగుట లేదు. అసహజముగా, మలమూత్రములకును అన్నము నీరునకును భేదమెఱుగకుండెను.

**శ్లో॥ మలోత్సర్గాది కురుతే తిష్ఠన్వావపి స్వపన్నపి ।**
**అనర్థం కిమపి బ్రూతే న వేత్తి చ హితాహితమ్ ॥ 7**

**ప్ర :** తిష్ఠన్ వా అపి = కూర్చుని యైనను లేక, స్వపన్ అపి = నిద్రించుచుండియు, మల+ఉత్సర్గ+ఆది = మలమూత్ర విసర్జనములను, కురుతే = చేయును, కిం+అపి = ఎట్టిదైనను, అనర్థమ్ = అనరాని మాటలను, బ్రూతే = పలుకును, హిత+అహితం చ = మంచి చెడుగులను, న వేత్తి = ఎఱుగడు.

**తా :** కూర్చుని యున్నను లేక నిద్రించుచున్నను, అట్టే మలమూత్రములను విసర్జించును. అనరాని మాటను, అదెంత మాటయైనను, పలుకును. ఇది మంచియనియు, ఇది చెడ్డదనియు నెఱుగడు.

**శ్లో॥ ఉపనీతోఽష్టమేఽబ్దేఽపి సావిత్రీం న జజాప సః ।**
**న చక్రే శిక్షితోఽత్యుచ్చైః స సన్ధ్యావన్దనాదికమ్ ॥ 8**

**ప్ర :** అష్టమే అబ్దే = ఎనిమిదవ యేట, ఉపనీతః అపి = ఉపనయనము చేసినను, సః = అతడు, సావిత్రీమ్ = గాయత్రిని, న జజాప = జపించలేదు, శిక్షితః = శిక్షణపొందినవాడై, సంధ్యా-వందనాదికమ్ = సంధ్యావందనము మొదలగు విధులను, సః = అతడు, అతి+ఉచ్చైః = చక్కగా, బిగ్గరగా, న చక్రే = చేయలేదు.

**తా :** ఎనిమిదవ యేట ఉపనయనమైనను, ఆ బాలుడు గాయత్రిని జపించలేదు; శిక్షణ నిచ్చినను, సంధ్యావందనమును తక్కిన విధులను, చక్కగా బిగ్గరగా మంత్రోచ్చారణ చేయుచు, నిర్వహించలేదు.

**శ్లో॥ విష్ణుదత్తస్య మాహాత్మ్యం శ్రుత్వా తం పితరౌ గృహమ్ ।**
**నీత్వా తస్యోచతుః ఖిన్నౌ భో! బ్రహ్మన్! పాహి నః పితః! ॥ 9**

**ప్ర :** పితరౌ = తల్లితండ్రులు, విష్ణుదత్తస్య మాహాత్మ్యమ్ = విష్ణుదత్తుని గొప్పదనమును గూర్చి, శ్రుత్వా = విని, తమ్ = వానిని, తస్య గృహమ్ = విష్ణుదత్తుని యింటికి, నీత్వా = తీసికొని వచ్చి,

ఖిన్నౌ = దుఃఖితులై, ఊచతుః = ఇట్లనిరి, భో బ్రహ్మన్ = ఓ దేవా!, పితః = ఓ తండ్రి!, నః = మమ్ములను, పాహి = రక్షించుము.

**తా :** ఆ బాలుని తల్లితండ్రులు విష్ణుదత్తుని మహత్తును గూర్చి విని, వానిని ఆ విష్ణుదత్తుని యింటికి తీసికొని వెళ్లి, దుఃఖితులై యిట్లనిరి : ఓ దేవా! తండ్రీ! రక్షించుము.

**శ్లో॥ ఏక ఏవ సుతో జాతో జడో జన్మత ఆవయోః ।**
**గ్రహగ్రస్తోఽథవోన్మత్తో జ్ఞాత్వా నౌ దేహి జీవనమ్ ॥ 10**

**ప్ర :** ఆవయోః = దంపతులమైన మాకు, జన్మతః= పుట్టుకతో, జడః = బుద్ధిహీనుడైన, ఏకః ఏవ = ఒకే ఒక్కడు, సుతః = కుమారుడు, జాతః = పుట్టినాడు, (ఇతడు), గ్రహగ్రస్తః = దుష్టగ్రహమావేశించినవాడో, అథవా = లేకున్న, ఉన్మత్తః = పిచ్చివాడో, జ్ఞాత్వా = తెలిసికొని, నౌ = మాకు (దంపతులకు), జీవనమ్ = జీవితమును, దేహి = ఇమ్ము.

**తా :** మా దంపతులకు ఒకే ఒక్కడు కుమారుడు కలిగినాడు. అతడు జడుడై యున్నాడు. మా కుమారుడు దుష్టగ్రహబాధితుడో లేక మతిలేనివాడో తెలిసికొని మాకు జీవితమును ప్రసాదింపుడు.

**శ్లో॥ పుత్రం కృతార్థం జ్ఞాత్వా తత్పితరౌ ప్రాహ స ద్విజః ।**
**విశ్రామ్యతాం గృహే భుక్త్వా పుత్రో వామత్ర తిష్ఠతు ॥ 11**

**ప్ర :** పుత్రమ్ = కుమారుని, కృతార్థమ్ = ముక్తునిగా, జ్ఞాత్వా = తెలిసికొని, సః ద్విజః = ఆ బ్రాహ్మణుడు విష్ణుదత్తుడు, తత్ పితరౌ = వాని తల్లితండ్రులతో, ప్రాహ = ఇట్లనెను, వామ్ = మీ యొక్క, పుత్రః = కుమారుడు, అత్ర = ఇచట, తిష్ఠతు = ఉండుగాక, భుక్త్వా = భుజించి, గృహే = ఇంటిలో, విశ్రామ్యతామ్ = విశ్రమింపుడు.

**తా :** విష్ణుదత్తుడు ఆ బాలుడు ముక్తుడని గ్రహించినాడు, వాని తల్లితండ్రులతో యిట్లనినాడు : మీ కుమారుడు ఇచట నా చెంత యుండును, మీరు భుజించి ఇంటిలో విశ్రాంతి దీసికొనుడు.

**శ్లో॥ ఇత్యుక్తౌ తౌ గతౌ భోక్తుం విష్ణుదత్తోఽవదత్స తమ్ ।**
**కస్త్వం కస్య కిమాయాతః కిం తే కార్యం కరోషి కిమ్ ॥ 12**

**ప్ర :** ఇతి+ఉక్తౌ = ఇట్లు చెప్పబడినవారై, తౌ = వారిద్దరు, భోక్తుం గతౌ = భుజించుటకు వెడలిరి, సః విష్ణుదత్తః = ఆ విష్ణుదత్తుడు, తం అవదత్ = ఆ కుమారునితో ఇట్లనెను, త్వమ్ = నీవు, కః = ఎవడవు? కస్య = ఎవనికి సంబంధించినవాడవు, కిం ఆయాతః = వచ్చితివేమి (ఏల)?, తే = నీకు, కిం కార్యమ్ = చేయదగినదేమి?, కిం కరోషి = ఏమి చేయుచున్నావు?

**తా :** విష్ణుదత్తుడిట్లనగా ఆ దంపతులు భుజింపబోయిరి. విష్ణుదత్తుడు వారి బాలునిట్లడిగెను : నీ వెవడవు? అనగా, యే జాతివాడవని భావము; ఎవరివాడవు?, అనగా, ఎవరి సంబంధీకుడవు, అని; ఏల వచ్చితివి? పని యేమి?, అని వాని పుట్టుక ప్రయోజనమును గూర్చియు, ఏమి

చేయుచున్నావు? అని ఆతడున్న తీరును గూర్చి, దానివలన ప్రయోజనము తీరునా? యనియు భావము.

**శ్లో॥ గమ్యతాం స్వపితుర్గృహే భుజ్యతాం సుఖముత్తమమ్ ।**
**మయా తే కిం విధాతవ్యం త్యజ చేష్టాం వదాధునా ॥ 13**

**ప్ర :** గమ్యతామ్ = వెళ్లదగుదువు, స్వపితుః గృహే = నీ తండ్రి యింటిలో, సుఖమ్ = హాయిగా, ఉత్తమం భుజ్యతామ్ = శ్రేష్ఠమైన భోజనము చేయదగుదువు, మయా = నాచే, తే కిమ్ = నీకేమి, విధాతవ్యమ్ = చెప్పదగినది?, చేష్టామ్ = నీ నటనను, త్యజ = విడువుము, అధునా = నేడు, వద = పలుకుము.

**తా :** వెళ్ళుము, నీ తండ్రి యింట సుఖముగ ఉత్తమభోజనము చేయుము. నేను విధినిషేధములు నీకేమి నిర్దేశించి చెప్పగలను? నీ నటన నింక చాలించుము. సత్యము బలుకు మిపుడు.

**శ్లో॥ ఇత్యుక్తః ప్రాహ సంబన్ధో నిజబోధాత్మనః క్వ మే ।**
**కిం కరోమి క్వ యాస్యామి కిం గృహ్ణామి త్యజామి కిమ్ ॥ 14**

**ప్ర :** ఇతి ఉక్తః = ఇట్లని చెప్పబడినవాడై, ఆ బాలుడు, ప్రాహ = ఇట్లనెను, సంబన్ధః = సంబంధము, నిజ = నా యొక్క, బోధ = జాగృతమైన, ఆత్మనః = ఆత్మకు, మే = నాకు, క్వ = ఎక్కడ?, కిం కరోమి = ఏమి చేయుదును?, క్వ యాస్యామి = ఎక్కడకు పోదును?, కిం గృహ్ణామి = ఏమి గ్రహింతును?, కిం త్యజామి = ఏమి విడతును?

**తా :** ఇట్లు విష్ణుదత్తుడనగా, ఆ బాలుడిట్లనెను : నా సంబంధము ఆత్మతో. ఆత్మకు జాతిభేదము లేదు. వేరుగా ఎవరితోనూ లేదు. చేయదగినదియు లేదు. ఆత్మకు చలనము లేదు. స్వీకరించుట, నిరాకరించుట లేవు. ఇక ఈ 'నాది' అనునదెక్కడ?

**శ్లో॥ తతం కల్పామ్బునేవేదమాత్మనా సచ్చిదాత్మనా ।**
**అన్నాదోఽహమహం చాన్నం కిం మే భోగ్యం సుఖాత్మనః ॥ 15**

**ప్ర :** కల్పాంబునా ఇవ = ప్రళయకాలపు జలముచేతవలె, ఇదమ్ = ఈ జగత్తు, సత్+చిత్+ఆత్మనా = ఉనికి జ్ఞానము అనువానితో యేకమైయున్న, ఆత్మనా = ఆత్మస్వరూపినగు నాచేత, తతమ్ = వ్యాప్తమైయున్నది, అహమ్ = నేను, అన్నం చ = అన్నమునున్నూ, అన్న+అదః = అన్నము తినువాడనున్నూ అయితిని, సుఖ+ఆత్మనః = సుఖస్వరూపుడనగు, మే = నాకు, కిం భోగ్యమ్ = అనుభవింపదగినదేమి?

**తా :** జలప్రళయమున సమస్తము జలమయమైనట్లు ఈ జగత్తంతయు నాతోడనే నిండియున్నది, అనగా, అంతయు నేనే అయి యున్నాను. ఎట్లనగా, నేను ఉనికి, జ్ఞానము అనువానితో కూడిన సుఖస్వరూపమగు ఆత్మనై యుండుట వలన దేహబుద్ధులవలె వస్తుభేదము లేనివాడను నేను.

అన్నము నేనే, తినువాడను నేనే, కాగా నా కింక భోగ్యవస్తువు లేనూ లేదు, దాని అవసరమున్నూ లేదు.

**శ్లో॥ తచ్ఛ్రుత్వా తం సమాలిఙ్గ్య దత్తభక్తోఽవదన్ముదా ।**
**తర్హ్యాచారేణ విద్వంస్తే కోఽత్ర దోషో భవిష్యతి ॥ 16**

**ప్ర :** తత్ శ్రుత్వా = ఆ మాటలు విని, దత్తభక్తః = దత్తాత్రేయభక్తుడైన విష్ణుదత్తుడు, ముదా = సంతోషముతో, తమ్ = ఆ బాలుని, సమాలిఙ్గ్య = కౌగలించి, అవదత్ = ఇట్లనెను, తర్హి = అట్లయినచో, విద్వన్ = ఓ ఆత్మజ్ఞానీ!, తే = నీకు, ఆచారేణ = ఆచారముచేత, అత్ర = ఈ లోకమున, దోషః = దోషము, కః భవిష్యతి = యేమి కలుగును?

**తా :** ఆ సమాధానము విని, దత్తభక్తుడైన విష్ణుదత్తుడు సంతోషముతో ఆ బాలుని కౌగలించికొని ఇట్లనెను : ఓ ఆత్మజ్ఞానీ! నీ వంటి ఆత్మజ్ఞానికి లోకాచారము ననుసరించుటవలన దోషమేమి కలుగును?

**శ్లో॥ జాగృతిస్తిసృషు స్వప్నస్తుర్యా భూర్బ్రహ్మవిత్త్విహ ।**
**పరా నిద్రేహ బ్రహ్మజ్ఞవరో గాఢసుషుప్తికా ॥ 17**

**ప్ర :** ఇహ = జగత్తులో, తిసృషు = శుభేచ్ఛా, విచారణా, తనుమానసా, అను మూడు చైతన్యభూములును, జాగృతిః= జాగ్రదవస్థ, తుర్యా భూః = నాల్గవభూమియైన సత్త్వాపత్తి యనునది, స్వప్నః= స్వప్నావస్థ, ఇహ బ్రహ్మవిత్ = (ఇట సాధకుడు) బ్రహ్మవిత్ అనబడును; పరా = తర్వాతది, అసంసక్తి అనబడు భూమిక, నిద్రా = నిద్రావస్థ, ఇహ బ్రహ్మజ్ఞవరః = ఇట సాధకుడు శ్రేష్ఠ బ్రహ్మజ్ఞాని; గాఢసుషుప్తికా = గాఢనిద్రావస్థ.

**తా :** సప్తభూమికలు సాధకుని చేతనకు సంబంధించినవి. 1. శుభేచ్ఛా, 2. విచారణా, 3. తనుమానసా, 4. సత్త్వాపత్తి, 5. అసంసక్తి, 6. పరార్థభావినీ, 7. తుర్యా. వీనిలో మొదటి మూడు భూమికలలో నున్న సాధకుడు జాగ్రదవస్థలో నున్నవాడగును; నాల్గవదానిలో నుండగా స్వప్నావస్థలో నున్నవాడై బ్రహ్మవిత్ అనబరగును; ఐదవదానిలో నిద్రావస్థలో నుండి బ్రహ్మవిద్వరుడు అనబడును. గాఢసుషుప్తినున్నయగు...

**శ్లో॥ షష్ఠీహాన్యత ఉత్తిష్ఠేద్వరీయానసోఽపి కర్మకృత్ ।**
**తుర్యాన్యాత్ర వరిష్ఠో జ్ఞోఽక్రియస్తాదృగ్భవాన్న హి ॥ 18**

**ప్ర :** షష్ఠీ+ఇహ+అన్యతః = ఆరవభూమికయందు, ఉత్తిష్ఠేత్ వరీయానసః = వరీయాన్ అనబడు సాధకుడుదయించును, అపి = అయినను, కర్మకృత్ = కర్మచేయువాడు, అన్యా తుర్యా = తుర్యాయను మరియొక భూమిక (కలదు), అత్ర = అందు, వరిష్ఠః జ్ఞః = వరిష్ఠుడగు బ్రహ్మజ్ఞాని, అక్రియః = కర్మలేనివాడు, తాదృక్ = అట్టి వరిష్ఠజ్ఞాని, భవాన్ = తమరు, నహి = కారుకదా!

**తా :** ఆరవ భూమిక (పదార్థభావనీ). ఇందు సాధకుడు వరీయాన్ అనబడును. అయినను యీతడు కర్మకర్తయే. తదన్యము తుర్యాయను భూమిక. అందు సాధకుడు వరిష్ఠుడనబడను. ఈతడు కర్మకర్తృత్వము లేనివాడు. తమరు ఆ స్థితికి చేరినవారు కారు.

**శ్లో॥ జీవన్ముక్తః సుఖం తిష్ఠ శిక్షయాన్యాః క్రియాః కురు ।**
**బన్ధో దేహాభిమానోఽత్ర తత్త్యాగో ముక్తిరుచ్యతే ॥ 19**

**ప్ర :** జీవన్ముక్తః = జీవించి యుండియే ముక్తుడవై, సుఖం తిష్ఠ = సుఖముగా నుండుము, శిక్షయ = విద్యనేర్పుము, అన్యాన్ క్రియాః = ఇతర కార్యములను, కురు = చేయుము. దేహ+అభిమానః = దేహమునందలి తగులమే, బన్ధః = బంధము, అత్ర = జగమున, తత్ = ఆ బంధమును (కట్లు), త్యాగః = వదిలించుకొనుటే, ముక్తిః+ఉచ్యతే = ముక్తియందురు.

**తా :** జీవన్ముక్తుడవై సుఖముగ నుండుము. అందులకై, విద్యనేర్పుము, తదన్యకార్యములను చేయుము, దేహాభిమానము లేకుండ చేసిన కర్మయేదియు బంధము కాదు, ముక్తియే.

**శ్లో॥ అహం మమేతి సమ్బన్ధః కుతః స్వాత్మదృశో భవేత్ ।**
**మానావమానజో దోషో నిరహంకృతితః కుతః ॥ 20**

**ప్ర :** అహమ్ = నేను, మమ = నాది, ఇతి సంబంధః = అను సంబంధము, స్వాత్మదృశః = ఆత్మసాక్షాత్కారము గలవానికి, కుతః భవేత్ = ఎందువలన కల్గును? మాన+అవమానజః = మానము అవమానము అనువానివలన యేర్పడిన, దోషః = దోషము, నిరహంకృతితః = నిరహంకారమువలన, కుతః = ఏల కల్గును?

**తా :** నేను, నాది అను బంధము ఆత్మదర్శనము గలవారికి కలుగదు. మానము అవమానము అనునవి అహంకారమువలన కలుగు దోషములు. అహంకారమే లేనివానికి యీ దోషములుండవు, కావున యీ దోషములవలన కలుగు యే దోషములున్నూ ఉండవు.

**శ్లో॥ మానాద్యభావే విషయవాసనావిక్రియా కుతః ।**
**సమాహితమనాస్తస్మాన్ముక్తోఽయం నిరహంకృతిః ॥ 21**

**ప్ర :** మాన+ఆది+అభావే = మానము మొదలగునవి లేనప్పుడు, విషయవాసనావిక్రియా = ఇంద్రియవిషయములైన దృశ్యశ్రవణరసస్పర్శగంధాదుల ప్రభావము, కుతః = ఎందువలన కలుగును? తస్మాత్ = ఆ కారణమున, అయం నిరహంకృతిః = ఈ అహంకరించనివాడు, సమాహితమనాః= నిర్వికారమైన మనస్సుగలవాడు, ముక్తః = ముక్తుడు.

**తా :** మానావమానములు లేనివానిని ఇంద్రియసుఖములు ప్రలోభపెట్టలేవు, కావున అతడు స్వతంత్రుడగును. అందువలన నిరహంకారి నిర్వికారియగును, ముక్తుడగును.

**శ్లో॥ ఏవం సన్నపి నో మూఢో బధ్యతే కిం పునర్భవాన్ ।**
**మనోఽర్థసఙ్గి బన్ధాయ నిరర్థం ముక్తయే చ తత్ ॥ 22**

ప్ర : ఏవం సన్ అపి = ఇట్లయ్యును, పునః = మరల, భవాన్ = తమరు, నో మూఢః = మూఢులు కానివారై, బధ్యతే కిమ్ = బంధింపబడుచున్నారేమి?, అర్థసఙ్గి మనః = విషయాసక్తమైన మనస్సు, బన్ధాయ = బంధమున కగును, ముక్తయే చ = ముక్తికొరకైతే, తత్ = అది, ఆ మనస్సు, నిరర్థమ్ = నిష్ప్రయోజనకారి.

**తా :** తమరు మూఢులు కారు. అట్లయినను మరల బంధితులగుచున్నారు, ఎందులకు? విషయాసక్తిగల మనస్సు బంధముల కలిగించును, కాని, మోక్షమును సాధించలేదు.

**శ్లో॥ గృహకృత్యరతాఽపి స్త్రీ పరవ్యసనినీ యథా ।**
**తదేవాస్వాదయత్యన్తః పరసఙ్గరసాయనమ్ ॥ 23**

ప్ర : స్త్రీ = స్త్రీ, గృహకృత్యరతా+అపి = ఇంటి పనులలో నిమగ్నురాలైయున్ననూ, యథా = ఏ విధముగా, పరవ్యసనినీ = పరపురుషునియందు లగ్నమనస్కయై, పరసఙ్గరసాయనమ్ = పరపురుషునితోడి సాంగత్యసుఖమును, అన్తః = అన్తఃకరణమున, తత్+ఏవ = దానినే, ఆస్వాదయతి = ఆస్వాదించునో,

**శ్లో॥ తథా బ్రహ్మణి విశ్రాన్తః సమాహితమనాః సుధీః ।**
**తదేవాస్వాదయత్యన్తర్బహిర్వ్యవహరన్నపి ॥ 24**

ప్ర : తథా = ఆ రీతిగా, సమాహితమనాః సుధీః = నిర్వికారుడైన వివేకి, బ్రహ్మణి విశ్రాన్తః = బ్రహ్మమునందు విశ్రమించినవాడై, బహిః = వెలుపలి జగత్తులో, వ్యవహరన్ అపి = కార్యములందు ప్రవర్తించుచున్నను, అన్తః = లోపల మనసున, తత్+ఏవ = ఆ బ్రహ్మానందమునే, ఆస్వాదయతి = ఆస్వాదించుచున్నాడు.

**తా :** ఒక స్త్రీ పరపురుషునియందు దగిలిన మనస్సుతో, తాను తన యింటి పనులు చేయుచున్నను, మనసులో ఆ పరపురుషునితో ఎట్లానందించుచుండునో అదేరీతి నిర్వికారుడైన జ్ఞాని బ్రహ్మా-నందమును మనసులో అనుభవించుచున్నను బాహ్యప్రపంచమున లౌకిక వ్యవహారములు గూడ నెఱపుచుండును.

**శ్లో॥ దివస్పృష్ఠేఽఙ్గ! మోక్షో న పాతాలేఽపి న భూతలే ।**
**అహంకృతేర్విమోహస్య క్షయో మోక్షో న చాపరః ॥ 25**

ప్ర : అహంకృతేః = అహంకారముయొక్క, విమోహస్య = విశేషభ్రాంతియొక్క, క్షయః = నాశము, మోక్షః = మోక్షము, న చ అపరః = వేరొకటి కానే కాదు, అఙ్గ! = ఔరా!, దివస్పృష్ఠే =

స్వర్గమును తాకుటయందు, మోక్షః = మోక్షము, న = లేదు, భూతలే = భూలోకమునందు, పాతాలే అపి = పాతాళమున గూడ, న = లేదు.

**తా :** అహంకారము, దాని ఫలితము, అంతయు విశేషమైన భ్రాంతియే. ఆ భ్రాంతి నశించుటే మోక్షము. ఇదికాక మోక్షమనునది మరేదియో ఎక్కడనో లేదు. స్వర్గమును పొందినను, భూమియందైనను, పాతాళముననైనను, అనగా, ముల్లోకములలో ఎక్కడనూ మోక్షము లేదు.

**శ్లో॥ సుకరోఽహంకృతేస్త్యాగః పుష్పావదలనాదపి ।**
**దృఙ్మీలనాదపి ప్రాజ్ఞ! న క్లేశోఽత్ర మనాగపి ॥ 26**

**ప్ర :** అహంకృతేః త్యాగః = అహంకారమును వదలివేయుట, పుష్ప+అవదలనాదపి = పూవులు కోయుట కంటెను, దృక్+మీలనాత్+అపి = కన్నులు మూయుట కంటెను, సుకరః = సులభము, ప్రాజ్ఞ! = ఓ జ్ఞానీ!, అత్ర = ఈ విషయమున, మనాక్ అపి = కొంచెమైనను, క్లేశః న = కష్టము లేదు.

**తా :** అహంకారత్యాగము పూవులు కోయుటకంటె, కన్నులు మూయుట కంటె సులభము. ఇందు కొంచెమైనను కష్టము లేదు. ప్రాజ్ఞ! అను సంబోధనలో అట్టి ప్రాజ్ఞులకు సుకరము, క్లేశరహితము అని ధ్వనితము.

**శ్లో॥ స్ఫూర్తిర్భ్రాన్తిగతిర్వ్యాప్తిసంహృతిస్స్వాన్యతాముఖాః ।**
**జ్ఞాత్వా చలమనశ్చేష్టాస్తత్పరస్త్వం సుఖీభవ ॥ 27**

**ప్ర :** స్ఫూర్తిః = స్పందన, భ్రాన్తిః = లేనిది ఉన్నట్లు, ఉన్నదిలేనట్లు, ఒకటి వేరొకటియైనట్లు తోచుట, గతిః = కదలుట, వ్యాప్తి = ఆక్రమించి, పరచికొని యుండుట, సంహృతి = చంపుట, (ఇవి యన్నియును), స్వ+అన్యతా ముఖాః = నేను, నేను కానిది అనుభావన ప్రధానమై యేర్పడునవి, చలమనః+చేష్టాః = చంచలమనస్సుయొక్క చేష్టలుగా, జ్ఞాత్వా = తెలిసి, త్వమ్ = నీవు, తత్+పరః = దానికి భిన్నుడవై, సుఖీభవ = సుఖించుము.

**తా :** స్పందన-ప్రతిస్పందనలు, భ్రాన్తి, చలనము, వ్యాప్తి, సంహారము ఇవి యన్నియు చంచలమనస్సుయొక్క చేష్టలు. ఇందుకు కారణము, నేను-నీవు అను ద్వయభావము. ఈ రహస్యము నెఱిగి బ్రహ్మ లేక ఆత్మతత్పరుడవై సుఖించుము.

**శ్లో॥ నిర్బన్ధం న కరోమి జ్ఞ! కఞ్చిత్కాలం తథా వస ।**
**పిత్రోః ప్రేమ సమాలోచ్య బన్ధస్తేన న తే స్వదృక్ ॥ 28**

**ప్ర :** జ్ఞ! = ఓ జ్ఞానీ!, నిర్బన్ధం న కరోమి = అట్లే జీవించుమని బలవంతము చేయను, కంచిత్ కాలమ్ = కొలదికాలము, పిత్రోః ప్రేమ = తల్లితండ్రుల ప్రేమను, సమాలోచ్య = ఆలోచించి,

తథా వస = ఆ రీతి జీవించుము, తేన = అట్లు జీవించుటచేత, స్వదృక్ = ఆత్మదృష్టిగల, తే = నీకు, బన్ధః న = బంధము లేదు.

**తా :** ఓ జ్ఞానీ! నేను నిర్బంధించను. కాని నీ తల్లితండ్రుల ప్రేమను మనసులో నెంచి చూచి, నేను సూచించిన విధముగా కొద్దికాలము జీవించుము. అందుమూలమున నీకు బంధము (సంగము) కలుగదు. ఏలన, నీవు ఆత్మదృష్టి గలవాడవు.

**శ్లో॥ ఇత్యుక్తః స తథేత్యుక్త్వా భుక్త్వా తద్ధామ్ని సజ్జజమ్ ।**
**భయం సాధ్వ్యన్నమాహాత్మ్యాజ్జహౌ చేష్టాశ్చ కల్పితాః ॥ 29**

**ప్ర :** ఇతి ఉక్తః = ఇట్లు చెప్పబడి, సః = ఆ బాలుడు, తథా ఇతి ఉక్త్వా = అట్లే యని చెప్పి, తత్ ధామ్ని = వాని యింటిలో, భుక్త్వా = భుజించి, సజ్జజమ్ భయమ్ = ఆ సంబంధమువలన యేర్పడిన భయమును, సాధ్వీ+అన్నమాహాత్మ్యాత్ = ఆ యిల్లాలి చేతి అన్నముదిన్న ప్రభావమువలన, కల్పితాః చేష్టాః చ = తానై కల్పించుకొన్న చేష్టలు గూడ, జహౌ = విడచిపెట్టెను.

**తా :** ఆ మాటలు వినిన బాలుడు అట్లేయని చెప్పి, ఆ విష్ణుదత్తుని యింట భుజించి, ఆ యిల్లాలి చేతి అన్నము దినిన పుణ్యప్రభావమున, తనలోని సంగభయమును, కల్పితనటకచేష్టలను గూడ విడచివేసెను.

**శ్లో॥ పితరౌ ప్రేక్ష్య తం శాన్తం విప్రం నత్వోచతుః ప్రభో! ।**
**కో మన్త్రో భేషజం వాస్య కల్పితం శీఘ్రముక్తిదమ్ ॥ 30**

**ప్ర :** పితరౌ = తల్లితండ్రులు, తమ్ = ఆ బాలుని, శాన్తమ్ = ప్రశాంతముగా నుండుటను, ప్రేక్ష్య = చూచి, విప్రమ్ = విష్ణుదత్తుని, నత్వా = నమస్కరించి, ఊచతుః = ఇట్లనిరి, ప్రభో! = ఓ స్వామీ!, అస్య = వానికి, (ఈ బాలునికి), శీఘ్రముక్తిదమ్ = వెంటనే నివారణను ప్రసాదించెడు, కః మన్త్రః = యే మంత్రము, వా = లేక, భేషజమ్ = ఔషధము, కల్పితమ్ = సిద్ధము చేయబడినది?

**తా :** ఆ బాలుని ప్రశాంతమైన ప్రవర్తనను చూచి, ఆ బాలుని తల్లితండ్రులు విష్ణుదత్తునకు నమస్కరించి, "ప్రభూ! వీనినింత త్వరగా సాధారణబాలుని స్థితికి తెచ్చితిరి కదా, అదెట్లు సాధ్యమైనది? యే మంత్రశక్తిని ప్రయోగించినారు? లేక, యే ఔషధమును వాడినారు?

**శ్లో॥ దత్తం నో జీవనం బ్రహ్మన్నిత్యుక్త్వా తౌ గతౌ గృహమ్ ।**
**తదాదిష్టోఽప్యభీః పుత్రస్తస్థౌ ధామ్న్యాత్మసజ్జతమ్ ॥ 31**

**ప్ర :** బ్రహ్మన్ = ఓ దేవా!, నః = మాకు, జీవనమ్ = జీవితము, దత్తమ్ = ఇవ్వబడినది, ఇతి ఉక్త్వా = అని పలికి, తౌ = వారిద్దరు, గృహం గతౌ = యింటికి వెడలిరి; తత్ ఆదిష్టః అపి = వానిచే ఆదేశింపబడియు, అభీః = భయములేనివాడై, పుత్రః = ఆ బాలుడు, ఆత్మసజ్జతమ్ = ఆత్మసంబంధియై, ధామ్ని = తండ్రియింట, తస్థౌ = ఉండెను.

**తా :** ఓ దేవా! మాకు జీవితమును ప్రసాదించినారు, అని పలికి, వారిద్దరును యింటికి వెడలిరి. విష్ణుదత్తుని ఆదేశము ననుసరించి వారి కుమారుడున్నూ ఆత్మబంధమున తండ్రి యింటిలో నిర్భయముగ నివసించెను.

**శ్లో॥ తదేకం శాస్త్రతాత్పర్యమజ్ఞస్యానుపదం భయమ్ ।**
**భయమాత్రావశేషో హి విజ్ఞానామృతసాగరః ॥ 32**

**ప్ర :** తత్ ఏకమ్ = ఏకమద్వితీయం తత్, బ్రహ్మమొక్కటే, రెండవది లేదు, అనునది, శాస్త్రతాత్పర్యమ్ = సకలశాస్త్రములు బోధించు పరమార్థము; అజ్ఞస్య = ఈ సత్యము ననుసంధానము చేసికొనని అజ్ఞానికి, అనుపదమ్ = అడుగడుగున, ప్రతివిషయములోను, భయమ్ = భయము కలుగును; విజ్ఞాన+అమృతసాగరః = అమృతసముద్రమువంటి శాస్త్రవిజ్ఞానమంతయు, భయమాత్ర+అవశేషః హి = కడపట భయమును మాత్రమే మిగుల్చునది.

**తా :** చరమ సత్యమొక్కటే యనునది అన్ని శాస్త్రములకు పిండితార్థము. ఈ సత్యమును అన్వయించికొనలేనివానికి శాస్త్రములన్నిటిని పారజదివినను అడుగడుగునను అన్ని విషయముల లోను భయమే మిగులును. ఇతడు అజ్ఞాని. ఏకమద్వితీయం బ్రహ్మ తత్ పరం అను ఉపనిషద్వాక్యార్థమును శాస్త్రవిజ్ఞానమునకు పరమమావధిగా తెలిసిన యాతడు జ్ఞాని. వానికి శాస్త్రవిజ్ఞానము అమృతసాగరము.

**శ్లో॥ బుద్ధోఽపి సజ్జభీమాత్రవృతో విప్రసుతో యథా ।**
**తథా సర్వోఽపి లోకోఽయం మోహమాత్రావృతో మృషా ॥ 33**

**ప్ర :** బుద్ధః అపి = ఆత్మజాగృతి గలవాడైనను, సజ్జభీమాత్ర+ఆవృతః = సంగమువలన ప్రమాదము కలుగునను భయము చుట్టుముట్టినవాడు, విప్రసుతః యథా = బ్రాహ్మణకుమారుడెట్లో, తథా = అట్లే, సర్వః అపి అయం లోకః = ఈ లోకమంతయును, మోహమాత్ర+ఆవృతః = భ్రాంతిచేత చుట్టుకొనబడిన, మృషా = అసత్యము, లక్ష్యరహితము.

**తా :** ఆత్మజాగృతిగలవాడైనను లోకముతోడి సంగమునకు భయపడువాడు బ్రాహ్మణకుమారుని వలె లోకమంతయు భ్రాంతియని, అసత్యమని, అగమ్యమని భావించును.

**శ్లో॥ స్వాత్మానమనుభూయాపి సర్వదా చిద్ఘనం పరమ్ ।**
**కర్తా వికర్తా దాతాఽహం భోక్తా చ సుఖదుఃఖయోః ॥ 34**

**శ్లో॥ కోఽహం కేఽమీ కుతో మోహః క్వ సుఖం చేతి చిన్తయన్ ।**
**భ్రాన్త్యైవ నిత్యముక్తోఽపి బహిర్ధావతి ముహ్యతి ॥ 35**

**ప్ర :** స్వ+ఆత్మానమ్ = తన ఆత్మను, అనుభూయ+అపి = అనుభూతి చెందియును, సర్వదా =

సర్వకాలసర్వావస్థలయందు, చిత్+ఘనమ్ = జ్ఞానముతో నిండినది, పరమ్ = పరమము చరమము అయినదానిని, అహమ్ = నేను, సుఖదుఃఖయోః = సుఖదుఃఖములకు రెండిటికిని, కర్తా = కర్తను, వికర్తా = విశేషకర్తను, దాతా = ఇచ్చువాడను, భోక్తా చ = అనుభవించువాడను, అహమ్ = ఇట్టి నేను, కః = ఎవడను? అమీ = వీరందరు, ఇవియన్నియు, కే = ఎవరు?, మోహః = అపేక్ష, కుతః = ఎందువలన?, సుఖం చ = సుఖమున్నూ, క్వ = ఎక్కడ?, ఇతి చిన్తయన్ = ఇట్లని చింతించుచూ, నిత్యముక్తః అపి = నిత్యము ముక్తుడై యుండియు, భ్రాన్త్యా ఏవ = భ్రాంతిచేతనే, బహిః = తన ఆత్మనుండి వెలుపలకు, ధావతి = పరుగిడుచున్నాడు, ముహ్యతి = మోహము జెందుచున్నాడు.

**తా :** ఆత్మానుభూతి కలిగియును, ఆత్మజ్ఞానానందమయమని నిత్యమని, దానికంటె వేరేదియు లేదనియు తెలిసియును, లౌకిక సుఖదుఃఖములకు నిమిత్తకర్త, విశేషకర్త, దాత, భోక్త తానే యని భావించుచు, తానెవరు? తనవారైన వీరందరెవరు? వీరికై తనకీ అపేక్ష యెందులకు? సుఖమెక్కడున్నది? అని విచారించుచు భ్రాంతుడై, నిత్యముక్తుడుగూడ, వెలుపలి జగత్తులోనికి పరుగిడి మోహమునకు లోనగుచున్నాడు.

**శ్లో॥ నాసాభూషాం యథాకణ్ఠే ధృత్వా విస్మృత్య సా మమ ।**
**నష్టేతి శోచత్యజ్ఞా స్త్రీ తథాత్మార్థమయం జనః ॥ 36**

**ప్ర :** అజ్ఞా స్త్రీ = తెలియనిదైన ఆడుది, యథా = ఎట్లు, నాసాభూషామ్ = ముక్కునకగు ఆభరణమును (ముక్కుపుడకను), కణ్ఠే = మెడలో, ధృత్వా = ధరించి, విస్మృత్య = మరచిపోయి, సా = ఆమె, మమ = నా ఆభరణము, నష్టా ఇతి = పోయినదని, శోచతి = బాధపడునో, తథా = అట్లు, జనః = మానవుడు, అయం ఆత్మార్థమ్ = ఈ ఆత్మార్థమును (మరచి, విచారించును).

**తా :** ఒక స్త్రీ తన ముక్కుపుడకను మెడలో కట్టుకొని, ఆ విషయమును మరచి, తన ముక్కుపుడక పోయినదని బాధపడువిధమున మానవుడు ఆత్మార్థమును (తనయందే ఉన్నను) మరచిపోయి లేదని భావించును.

**శ్లో॥ తదర్థం సర్వశాస్త్రాణి బోధయన్తి ప్రకారతః ।**
**మోహమాత్రనిరాసే హి పర్యవస్యన్త్యనుక్రమాత్ ॥ 37**

**ప్ర :** తత్ అర్థమ్ = ఆ పరమార్థమును, సర్వశాస్త్రాణి = అన్ని శాస్త్రములు, ప్రకారతః = ప్రణాళికాబద్ధముగా, బోధయన్తి = బోధించుచున్నవి, అనుక్రమాత్ = హేతుబద్ధమైన ఒక పద్ధతిలో, మోహమాత్రనిరాసే హి = మోహమును తొలగించుట యందే, పర్యవస్యన్తి = ఫలస్వరూపమును వహించుచున్నవి.

**తా : శాస్త్రములన్నియు ఒక క్రమపద్ధతి ననుసరించి ఆ పరమార్థమునే బోధించుచున్నవి, మోహమును తొలగించుటయే లక్ష్యముగా సాగుచున్నవి.**

**శ్లో॥ మహాన్త్యల్పాని శాస్త్రాణి నాణుమాత్రభయాయ హి ।**
**స్వబుద్ధ్యేదం విచార్యేన్ద్ర! వదేదం సాధ్వసాధు వా ॥ 38**

ప్ర : అల్పాని శాస్త్రాణి = అల్పములైన శాస్త్రములు, అణుమాత్రభ్రమాయ హి = ఇసుమంత భ్రమకైనను, న మహాన్తి = గొప్పవి కావు; ఇన్ద్ర = ఓ ఇంద్రా!, స్వబుద్ధ్యా = స్వబుద్ధితో, ఇదం విచార్య = ఈ విషయమును యోచించి, ఇదమ్ = ఈ మాట, సాధు వా అసాధు = సరియైనదో కాదో, వద = చెప్పుము.

**తా :** అణుమాత్రమైన భ్రమకు తావిచ్చిన శాస్త్రములు అల్పములగును, గొప్పవి కావు. ఓ శ్రేష్ఠుడా! నీవే వివేకించి, యీ మాట సత్యమో అసత్యమో చెప్పుము.

**శ్లో॥ ఇత్యుక్తో గురుణాహేన్ద్రో నత్వా సాధూదితం గురో! ।**
**క్షమస్వాతిక్రమం మేఽద్య శాస్త్రతత్త్వమవేది సత్ ॥ 39**

ప్ర : ఇతి ఉక్తః = ఇట్లు చెప్పబడి, నత్వా = నమస్కరించి, గురుణా = గురువుతో, ఇన్ద్రః ఆహ = ఇంద్రుడిట్లనెను, గురో! = ఓ గురూత్తమా!, సాధు ఉదితమ్ = లెస్సగా చెప్పబడినది, మే అతిక్రమమ్ = నా అతిక్రమణను, క్షమస్వ = క్షమింపుము, అద్య = నేడు, సత్ = సత్యమైన, శాస్త్రతత్త్వమ్ = శాస్త్రలక్షణమును, అవేది = తెలిసికొంటిని.

**తా :** ఇట్లనగా విని, గురువుతో ఇంద్రుడు నమస్కరించి యిట్లనెను : మీరు చెప్పినది సరియే. శాస్త్రలక్షణరహస్యమును నే నిప్పుడు గ్రహించితిని. నా అతిక్రమణను మన్నింపుడు.

**శ్లో॥ శ్రీదత్తః ప్రాహ రాజేన్ద్ర! సంవాదోఽయం మయోదితః ।**
**శాస్త్రైర్విప్రతిపత్తిః క్వ సర్వాణ్యేకపరాణి హి ॥ 40**

ప్ర : శ్రీదత్తః ప్రాహ = శ్రీదత్తుడిట్లనెను, రాజేన్ద్ర = ఓ మహారాజ!, అయం సంవాదః = ఈ సంభాషణ, మయా+ఉదితః = నాచే చెప్పబడినది, శాస్త్రైః = శాస్త్రములతో, విప్రతిపత్తిః = విరోధము, క్వ = ఎక్కడ?, సర్వాణి = అన్నియును, ఏకపరాణి హి = ఒకే లక్ష్యము గలవి.

**తా :** శ్రీదత్తుడిట్లనెను : ఓ రాజా! నాచే వివరించబడిన సంవాదమిది. అన్ని శాస్త్రములకు గమ్యమొక్కటే యైనపుడు వానిలో వ్యతిరేకత యెక్కడ నుండును.

**శ్లో॥ మనోజవా గతిర్వ్యోమ్ని వివిధా యోగసిద్ధయః ।**
**తత్సర్వం నశ్వరం విద్ధి మోక్షమేకం సనాతనమ్ ॥ 41**

ప్ర : మనోజవా = మనోవేగముతో, వ్యోమ్ని = ఆకాశమున, గతిః = గమనము, యోగసిద్ధయః = యోగసిద్ధులు, వివిధాః = అనేకవిధములు, తత్ సర్వమ్ = అదియంతయు, నశ్వరమ్ = నశించునది, ఏకమ్ మోక్షమ్ = మోక్షమొక్కటి, సనాతనమ్ = నిత్యము, శాశ్వతమైనదిగా, విద్ధి = తెలియుము.

**తా :** మనోవేగముతో ఆకాశగమనము చేయుట వంటి యోగసిద్ధులనేకములు. అవి యన్నియు నశించునవే. మోక్షమొక్కటే అవినాశి యని తెలియుము.

**శ్లో॥ సో௨ప్యాత్మన్యుపచారో௨యం బన్ధః క్వాస్యేతి మోక్షణమ్ ।**
**అజ్ఞానజనబోధాయ వ్యవస్థేయం ప్రకల్పితా ॥ 42**

**ప్ర :** సః అపి = ఆ మోక్షమున్నూ, ఆత్మని = ఆత్మయందు, ఉపచారః = లాంఛన మాత్రమే, అస్య = ఆత్మజ్ఞానికి, బన్ధః క్వ = బంధమెక్కడ?, అనగా బంధము లేదు, ఇతి = అని, మోక్షణమ్ = మోక్షమున్న దనుట, అజ్ఞానజనబోధాయ = అజ్ఞానులైన సామాన్యప్రజలకుపదేశించుటకై, ఇయం వ్యవస్థా = ఈ వ్యవస్థ, ప్రకల్పితా = యేర్పరుపబడినది.

**తా :** ఆ మోక్షమన్న మాట కేవలము లాంఛనప్రాయమే. ఏలన, ఆత్మజ్ఞానికి బంధమేలేనప్పుడు మోక్షమును పొందుట యెట్లుండును? ఆతడెప్పుడును ముక్తుడే. ఐనను, అజ్ఞానులైన ప్రజాబాహుళ్యమునకు ఉపకారము చేయుటకై యీవ్యవస్థ యేర్పరుపబడినది.

**శ్లో॥ సత్యం జ్ఞానమనన్తం యద్బ్రహ్మాచిన్త్యమరూపకమ్ ।**
**భ్రమేణ కల్పితం నామరూపే௨త్ర సదసత్పరే ॥ 43**

**ప్ర :** యత్ సత్యమ్ = ఏది సత్యమో, జ్ఞానమనన్తమ్ = జ్ఞానమో అనంతమో, అచిన్త్యమ్ = మనసున కందనిదో, అరూపకమ్ = ఇంద్రియగ్రాహ్యము కాదో, అట్టిది, బ్రహ్మ = బ్రహ్మము, అత్ర = ఆ బ్రహ్మమునందు, సత్+అసత్+పరే = కార్యకారణముల సంబంధము లేనిదానియందు, భ్రమేణ = భ్రమచేత, నామరూపే = రూపమున్నూ దానికొకపేరున్నూ, కల్పితమ్ = కల్పింపబడినది.

**తా :** బ్రహ్మము సత్యమైనది, జ్ఞానస్వరూపమైనది, అనంతమైనది, మనసునకు ఊహకు అందనిది, రూపము లేనిది, కార్యకారణసంబంధరహితమైనది. దానియందు భ్రమచేత రూపము నామము కల్పింపబడినవి.

**శ్లో॥ మోహమాత్రో భ్రమో௨నాదిస్తన్నాశాయాత్ర వస్తుని ।**
**వికల్పితత్వలక్ష్యత్వసమ్బన్ధాద్యాస్తు కల్పితాః ॥ 44**

**ప్ర :** మోహమాత్రః భ్రమః = మోహము మాత్రమేయైన భ్రమ, అనాదిః = మొదలు లేనిది, తత్ నాశాయ = ఆ భ్రమ నశించుటకై, అత్ర = జగత్తులో, వస్తుని = వస్తువులు, వికల్ప-తత్వ-లక్ష్యత్వ సంబంధ+ఆద్యాః తు = వికల్పము, లక్ష్యము, సంబంధము మొదలగు నవేమో, కల్పితాః = కల్పింపబడినవి.

**తా :** భ్రమకు మూలము మోహము. అది అనాది. దాని నాశమునకై జగత్తున వికల్పము, లక్ష్యము, సంబంధము మొదలగు వస్తువులు కల్పింపబడినవి.

**శ్లో॥ జీవ ఈశశ్చ తద్భేదోఽవిద్యాచిత్తద్యుతిస్త్వియమ్ ।**
**షడస్మాకమనాదీయం మృషా జీవేశకల్పనా ॥ 45**

**ప్ర :** జీవః = జీవుడు, ఈశః చ = ఈశ్వరుడున్ను, తత్ భేదః = వారి భేదము, అవిద్యాచిత్ = అవిద్య, చిత్ అనగా జ్ఞానము, తత్ = వీని, యుతిః తు = యోగమేమో, ఇయమ్ = ఈ జగత్తు, షట్ = ఆరున్నూ, అస్మాకమ్ = మనకు, అనాది = మొదలు లేనిది, ఇయమ్ = ఇది, జీవ+ఈశ కల్పనా = జీవుడు ఈశ్వరుడు అను కల్పన, మృషా = మిథ్య.

**తా :** జీవుడు ఈశ్వరుడు అను ఈ భేదము అవిద్య చిత్ అనువాని యోగమువలన యేర్పడిన జగత్తు. ఇవి అనాదియైనవి. జీవేశకల్పన, మిథ్య.

**శ్లో॥ రౌప్యం శుక్తావివ స్థాణావివ తస్కర ఆత్మని ।**
**నావిద్యాతః కుతో భేదః కేన యోగః పరాత్మనః ॥ 46**

**ప్ర :** శుక్తౌ = ముత్తెపుచిప్పయందలి, రౌప్యమ్ = వెండివంటి మెఱుగు, ఇవ = వలె, స్థాణౌ = స్తంభమునందు, తస్కరః = దొంగ, ఇవ = వలె, ఆత్మని = ఆత్మలో, న అవిద్యాతః = అవిద్య లేనందున, భేదః = భేదము, కుతః = ఎందువలన?, పరాత్మనః = పరాత్మకు, యోగః = కలయిక, కేన = దేనితో, ఎవరితో?

**తా :** ముత్తెపుచిప్పలో వెండి యున్నట్లు కనబడినను లేనట్లే, ఒక స్తంభము దొంగ వలె కనబడినను అది దొంగ కానట్లే, ఆ అవిద్య (కనబడునది వేరుగా) లేనప్పుడు ఆత్మలో యింక భేదము ఎందువలన కల్గును? పరమాత్మకు ఎవరితో లేక దేనితో కలయిక, సంబంధము యేర్పడును.

**శ్లో॥ మిథ్యాభ్రమోఽప్యనర్థాయ యతో భేదో విమోహదః ।**
**యోగాదిస్తద్వినాశాయ నైవాయం వస్తుసిద్ధయే ॥ 47**

**ప్ర :** మిథ్యాభ్రమః అపి = లేనిది ఉన్నట్లు తోచు భ్రమ కూడ, యతః = ఎందువలన, విమోహదః భేదః = విశేషమోహమును కలిగించు భేదబుద్ధియో, (అది) అనర్థాయ = నష్టమును కలిగించుటకే యగును, యోగాదిః = యోగము మొదలైనవి, తత్ వినాశాయ = ఆ అనర్థమును నశింపజేయుటకే, అయమ్ = ఇది, వస్తుసిద్ధయే = సత్యసిద్ధికొరకు, న ఏవ = కానే కాదు.

**తా :** మిథ్యాభ్రమ భేదబుద్ధిని కలిగించును. దానివలన అనర్థము కలుగును. యోగాది సాధనలు ఆ అనర్థమును నశింపజేయుటకే, సత్యసిద్ధికి కాదు.

**శ్లో॥ వస్తు సత్స్వప్రకాశం నో న క్వాప్యన్యదపేక్షతే ।**
**భ్రమమాత్రాన్తరే త్వత్ర వికల్పో నైవ వస్తుని ॥ 48**

**ప్ర :** వస్తు = వస్తువు, సత్ = సత్యము, స్వప్రకాశమ్ = తనకు తానై వెల్గునది, న క్వాపి = ఎక్కడనూగాని, అన్యత్ = మరియొకదానినిగాని, నో అపేక్షతే = అపేక్షింపదు; అత్ర వస్తుని = ఆ

సత్యమునందు, భ్రమమాత్ర+అన్తరే = భ్రమమాత్రమైన భేదమున, వికల్పః = అనిశ్చితి, న+ఏవ = లేనేలేదు.

**తా :** వస్తువు సత్తు, సత్యము; అది స్వప్రకాశము. మరియొకదాని ఆధారమున అది నిల్చునది కాదు, వెల్గునది కాదు. ఆ సత్పదార్థమునందు భ్రమమాత్రమున భేదము, ద్వంద్వము కలుగదు.

**శ్లో॥ ద్వైతం నాస్త్యత్ర నాసీత్ప్రాజ్ న భవిష్యత్యనర్థకమ్ ।**
**అపి భాతం మృషైవేన్ద్రజాలవత్తన్మనోమయమ్ ॥ 49**

**ప్ర :** అత్ర = ఆ సత్పదార్థమునందు, ద్వైతమ్ = రెండు అనునది, న అస్తి = లేదు, ప్రాజ్ = పూర్వము, న ఆసీత్ = ఉండియుండలేదు, అనర్థకమ్ = అట్టి అనర్థము, న భవిష్యతి = ఇక రాబోవు కాలమున కలుగదు, మృషా+ఇవ = మిథ్యవలె, ఇన్ద్రజాలవత్ = మాయవలె, మనోమయం అపి = మనస్సే కార్యకారణములైనను, భాతమ్ = ప్రకాశించునది.

**తా :** సత్పదార్థమునందు ద్వైతము అనునది వర్తమానమున, భూతకాలమున, భవిష్యత్తులోను లేదు, ఉండదు. ఇంద్రజాలమువలె, మిథ్యయైన ద్వైతము మనోమయమై ప్రకాశించునది.

**శ్లో॥ భ్రమ ఏవ జగత్సర్వం భ్రమ ఏవాస్య సంసృతిః ।**
**భ్రమే సతి ప్రణష్టేఽస్మిన్నేకః స్వాత్మైవ శిష్యతే ॥ 50**

**ప్ర :** జగత్ సర్వమ్ = జగత్తంతయు, భ్రమ ఏవ = భ్రాంతియే, అస్య = ఈ జగత్తుయొక్క, సంసృతిః = ప్రవాహము, వర్తనము, భ్రమ ఏవ = భ్రాంతియే, భ్రమే ప్రణష్టే సతి = భ్రమ నష్టము కాగా, అస్మిన్ = ఈ జగత్తునందు, ఏకః = ఒక్కటి, స్వ+ఆత్మ+ఏవ = తనయొక్క ఆత్మయే, శిష్యతే = మిగులుచున్నది.

**తా :** జగత్తంతయు భ్రాంతియే. ఈ జగత్తు కొనసాగుచుండుటయు భ్రాంతియే. ఈ భ్రాంతి నశించిపోగా, జగత్తులో మిగులునది ఒక్కటే, ఆత్మయే.

**శ్లో॥ తస్మాద్భయం నిరాకృత్య జ్ఞానయోగపరో నరః ।**
**ఇహైవ భజతి స్వస్థః పరమానన్ద ఆప్లుతః ॥ 51**

**ప్ర :** తస్మాత్ = ఆ కారణమున, భయం నిరాకృత్య = భయమును త్రోసివేసి, నరః = మానవుడు, జ్ఞానయోగపరః = జ్ఞానయోగమునాశ్రయించి, ఇహ ఏవ = ఈ జగత్తుననే, స్వస్థః= ఆత్మయందే నిల్చినవాడై, పరమానన్దః = పరమమునందు ఆనందించువాడై, ఆప్లుతః = అందే మునిగిపోవును.

**తా :** అందువలన, నరుడు భయమును విడచి, జ్ఞానయోగియై, జీవించియుండగనే ఆత్మస్థిరుడై, ఆనందమయుడై పోవును.

**శ్లో॥ ఇతి శ్రుత్వా గురోర్వాక్యమర్జునో నష్టసంశయః ।**
**స్థైర్యాయ ప్రాప్తబోధస్య పర్యపృచ్ఛత్ర్యధీశ్వరమ్ ॥ 52**

**ప్ర :** ఇతి = ఇట్లని, గురోః వాక్యమ్ = గురువాక్యమును, శ్రుత్వా = విని, అర్జునః = అర్జునుడు, నష్టసంశయః = సందేహము తీరినవాడాయెను, ప్రాప్తబోధస్య స్థైర్యాయ = పొందిన ఉపదేశము స్థిరమగుటకై, త్రి+అధీశ్వరమ్ = త్రిలోకనాథుని, పరి+అపృచ్ఛత్ = తెలియనడిగెను.

**తా :** ఈ గురువాక్యమును విని అర్జునుడు సందేహమును వీడెను. పొందిన ఉపదేశము సుస్థిరమగుటకై త్రిలోకనాథుని తెలియనడిగెను.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం తృతీయాష్టకేఽ ష్టమాధ్యాయః ॥

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

**చతుర్థాష్టకము - ప్రథమాధ్యాయము**

**శ్లో॥ త్వామగ్నే! రవిచన్ద్రాదేర్భాసకం లోకచాలకమ్ ।**
**పృచ్ఛామీదం కథం జ్ఞానమాప్నుయాం దయయా వద ॥ 1**

**ప్రతిపదార్థం :** రవిచన్ద్ర+ఆదేః+భాసకమ్ = సూర్యచంద్రులకు వెలుగును ప్రసాదించువానిని, లోకచాలకమ్ = జగత్తును నడిపించువానిని, త్వామ్ = నిన్ను, అగ్నే! = ఓ అగ్నిదేవా!, ఇదమ్ = ఈ విషయమును గూర్చి, పృచ్ఛామి = అడుగుచున్నాను, జ్ఞానమ్ = జ్ఞానమును, కథమ్ = యెట్లు, ఆప్నుయామ్ = పొందుదును, దయయా = దయతో, వద = చెప్పుము.

**తాత్పర్యము :** రవిచంద్రులకు వెలుగునిచ్చి జగత్తును నడిపించు ఓ అగ్నీ!, జ్ఞానమును పొందుటెట్లు? అను విషయమును దయతో నాకు వివరింపుము, అని ప్రార్థించుచున్నాను.

**శ్లో॥ ఇతి పృష్టోఽర్జునేనాహ శ్రీదత్తః శృణు భూపతే! ।**
**యదేకం పరమం బ్రహ్మ నిత్యముక్తమవిక్రియమ్ ॥ 2**

**శ్లో॥ తత్స్వశక్తిసమావిష్టమీశమాహుర్మనీషిణః ।**
**స విష్ణుః స శివో బ్రహ్మ సోఽగ్నిరిన్ద్రః స్వరాడ్ఢరిః ॥ 3**

**శ్లో॥ ధాతా కాలః క్రియా కర్తా జీవనం మృత్యురామయః ।**
**నారాయణో హృషీకేశో భూతం భవ్యం భవచ్చ సః ॥ 4**

**ప్ర :** ఇతి పృష్టః = అని అడుగబడినవాడై, శ్రీదత్తః = శ్రీదత్తుడు, అర్జునేన = కార్తవీర్యార్జునునితో, ఆహ = ఇట్లనెను, భూపతే! = ఓ రాజా!, శృణు = వినుము, యత్ ఏకం పరమం బ్రహ్మ = యే పరబ్రహ్మము అద్వితీయమో, నిత్యముక్తమ్ = శాశ్వతముగా నిస్సంగమో, అవిక్రియమ్ = మార్పులేనిదో, వికారములకు లోనుగానిదో, తత్ = ఆ పరబ్రహ్మము తత్ అనబడునది, స్వశక్తిసమావిష్టమ్ = స్వయముగా శక్తిమంతమైనదో, మనీషిణః = పండితులు, ఈశం ఆహుః

= ఈశ్వరుడని పేర్కొందురో, సః = ఆ బ్రహ్మము, విష్ణుః = విష్ణువు, సః = ఆతడు, తానే, శివః = శివుడు, బ్రహ్మ = త్రిమూర్తులలోని బ్రహ్మ, సః = తానే, అగ్నిః = అగ్ని, ఇన్ద్రః = ఇంద్రుడు, స్వరాట్ = సర్వస్వతంత్రుడైన ప్రభువు, హరిః = శ్రీహరి, ధాతా = బ్రహ్మ, కాలః = కాలము, కాలుడు, క్రియా = కరణకర్తలచే నిర్వహింపబడు కార్యము, కర్తా = క్రియను చేయువాడు, జీవనమ్ = ప్రాణము, మృత్యుః = మృత్యువు, ఆమయః = రోగము, అపకారము, నారాయణః = నారాయణుడు, హృషీకేశః = హృషీకేశుడు, భూతమ్ = జరిగినది, భవ్యమ్ = జరుగబోవునది, భవత్ చ = జరుగుచున్నది కూడ, సః = ఆతడే (తానే).

**తా :** ఇట్లడుగబడి శ్రీదత్తుడు కార్తవీర్యునితో నిట్లనియె : అద్వితీయమై, శాశ్వతమై, నిస్సంగమై, నిర్వికారమై ఒక తత్త్వమున్నది. దానిని 'తత్' అనియు, పరబ్రహ్మమనియు నందురు. దాని శక్తికి మూలము లేదు, దానిని శాసించునది లేదు కావున పండితులు దానిని ఈశ్వరుడని యందురు. దాని నామాంతరములే విష్ణువు, శివుడు, బ్రహ్మ, అగ్ని, ఇంద్రుడు, హరి, ధాతా, కాలుడు, క్రియ, కర్త, ప్రాణము, మృత్యువు, రోగము, నారాయణుడు, హృషీకేశుడు అను దేవతలు. దాని రూపమే భూతభవిష్యత్వర్తమానకాలములు. (ఈ పేర్లు ఆ పరబ్రహ్మ ఆ యా వేళలో నిర్వహించు కార్యములను వర్ణించి చెప్పునవే తప్ప వేర్వేరు వ్యక్తులు కారు కావున పరమబ్రహ్మ, పరముడు, చరముడు, అద్వితీయుడు అనుట.)

**శ్లో॥ వస్తుమాత్రమిదం సర్వమహమేవాస్మి సర్వదృక్ ।**
**అహమేవ పరం ధ్యేయం మిథ్యాభ్రమనివృత్తయే ॥ 5**

**ప్ర :** సర్వం ఇదమ్ = సమస్తజగత్తు, వస్తుమాత్రమ్ = వస్తుమాత్రమే, నామభేదమే, సర్వదృక్ = దృష్టులన్నియు, దర్శనములన్నియు, అహం ఏవ అస్మి = నేనే అయి యున్నాను, మిథ్యాభ్రమ నివృత్తయే = మిథ్యాభ్రాంతిని తొలగించుటకు, పరం ధ్యేయమ్ = పరమలక్ష్యమును, ధ్యానించదగిన పరముడను, అహం ఏవ = నేనే.

**తా :** ఈ జగత్తంతయు నామమాత్రమే. దృష్టి, దర్శనము, ద్రష్ట నేనే. మోహభ్రాంతిని తొలగించుకొనుటకు నన్నే ధ్యానింపదగును.

**శ్లో॥ భ్రమస్యాపి చ నామాని కల్పితాని శృణుష్వ తత్ ।**
**మాయావిద్యా పరాదేవీ మనోఽనాదిర్భ్రమస్త్రివృత్ ॥ 6**

**శ్లో॥ ప్రధానం ప్రకృతిర్బ్రహ్మ యోనిః శక్తిశ్చ కారణమ్ ।**
**మోహోఽధ్యాసస్తమోఽజ్ఞానం ప్రస్వాపః కారణం త్విదమ్ ॥ 7**

**ప్ర :** భ్రమస్య అపి చ = భ్రమకు గూడ, కల్పితాని = కల్పింపబడిన, నామాని = పేర్లను, శృణుష్వ తత్ = అది వినుము, మాయా = మాయ, అవిద్యా = అవిద్య, పరాదేవీ = పరదేవత, మనః = మనస్సు, అనాదిః = మొదలు లేనిది, భ్రమః = భ్రమ, త్రివృత్ = త్రివృతము, ప్రధానమ్

= ప్రధానము, ప్రకృతిః = ప్రకృతి, బ్రహ్మ = బ్రహ్మ, యోనిః = యోని, శక్తిః చ = శక్తియు, కారణమ్ = కారణము, మోహః = మోహము, అధ్యాసః = అధ్యాస, తమః = తమస్సు, అజ్ఞానమ్ = అజ్ఞానము, ప్రస్వాపః = ప్రస్వాపము, కారణం తు ఇదమ్ = కారణమనునది జగత్తు.

**తా :** భ్రమకు చాల పేర్లు పెట్టబడినవి, ఇట్లు : మాయ, అవిద్య, పరదేవత, మనస్సు, అనాది, త్రివృత్, ప్రధానం, ప్రకృతి, బ్రహ్మ, యోని, శక్తి, కారణము, మోహము, అధ్యాస, తమస్సు, అజ్ఞానము, ప్రస్వాపము, కారణము, జగత్తు. (ఈ పేర్లు కూడా భ్రమయొక్క లక్షణములను వేర్వేరుగా వర్ణించి చెప్పునవే.)

**శ్లో॥ అతోఽవిద్యా పఞ్చపర్వా మహామోహో ద్విరూపకః ।**
**విక్షేపావృతిశక్త్యాఖ్య ఆద్యాత్సర్గోఽత్ర భౌతికః ॥ 8**

**ప్ర :** అతః = దానికి కారణము, అవిద్యా = అవిద్య యనునది, పఞ్చపర్వా = అయిదు అంగములు గలది, మహామోహః = మహామోహము, ద్విరూపకః = రెండు రూపములు గలది, విక్షేప+ఆవృతి శక్తి+ఆఖ్యః = విక్షేపశక్తి, ఆవృతిశక్తి, అనబడునవి, ఆద్యాత్ = విక్షేపశక్తినుండి, సర్గః = సృష్టి, అత్ర = ఈ రెంటిలో, భౌతికః = పంచభూతముల కూడికయే.

**తా :** భ్రమకు కారణమైనది అవిద్య. ఈ అవిద్యకు అంగములయిదు. దీనివలననే మోహమేర్పడును. ఈ మోహమునకు రెండు రూపములున్నవి : ఒకటి, విక్షేపశక్తిరూపము; రెండు, ఆవరణ (ఆవృతి) శక్తిరూపము. ఈ రెండిటిలో విక్షేపశక్తినుండియే పాంచభౌతికసృష్టి యేర్పడును.

**శ్లో॥ స్వరూపమావృణోత్యన్యో ముక్తం చేశం వినా భృశమ్ ।**
**యోఽవిద్యార్తోఽవశో దుఃఖీ భ్రాన్తోఽజ్ఞో జీవ ఏవ సః ॥ 9**

**ప్ర :** అన్యః = ఆవరణశక్తి, ముక్తమ్ = ముక్తుని, చ = మరియు, ఈశమ్ = ఈశ్వరుని, వినా = వదలి, భృశమ్ = మిక్కిలిగా, స్వరూపమ్ = స్వస్వరూపమును, ఆత్మస్వరూపమును, ఆవృణోతి = కప్పివేయుచున్నది, యః = ఎవడు, అవిద్యార్తః = అవిద్యచేత బాధితుడో, అవశః = పరాధీనుడో, దుఃఖీ = దుఖితుడో, భ్రాన్తః = మోహితుడో, అజ్ఞః జీవ ఏవ సః = అజ్ఞానియైన జీవుడే అట్టివాడు.

**తా :** ముక్తుడు, ఈశ్వరుడును తప్ప మిగతజీవుడు అవిద్యాబాధితుడు, అస్వతంత్రుడు, దుఃఖితుడు, భ్రమలోనున్నవాడు, అజ్ఞాని. అట్టి అజ్ఞానిని ఆవరణశక్తి చుట్టి వేసి ఆత్మదర్శనము కానివ్వదు.

**శ్లో॥ సమష్టిరీశః సర్వజ్ఞో వశమాయః స్వరాట్ సుఖః ।**
**అసత్త్వాభానాఖ్యభక్త్యావృతిహృద్గురురప్యసౌ ॥ 10**

**ప్ర :** ఈశః = ఈశ్వరుడు, సమష్టిః = వ్యక్తుల సమాహారమైనవాడు, సర్వజ్ఞః = సర్వమెఱిగినవాడు,

వశమాయః = మాయను వశముజేసికొన్నవాడు, స్వరాట్ = స్వతంత్రుడు, సుఖః = సుఖస్వరూపుడు, అసత్త్వాభాన+ఆఖ్యభక్త+ఆవృతి–హృత్ = రాజసభక్తుడు, తామసభక్తుడు అనబడు వారి హృదయములకు, గురుః అపి = గురువుకూడ, అసౌ = ఆ ఈశ్వరుడు.

**తా :** ఈశ్వరుడు వ్యష్టి లక్షణముగా వ్యక్తము కాక సమష్టిరూపుడై యుండును. అట్లాతడు సర్వవ్యాపియు, సర్వజ్ఞుడును, స్వతంత్రుడును, సుఖస్వరూపుడునగును. అతడు మాయకు వశుడు కాడు, మాయయే అతనికి వశమై యుండును. సత్త్వభక్తుడు, రాజసభక్తుడు, తామసభక్తుడు అనబడు వారిలో సత్త్వభక్తుని విడచి మిగతవారిలోని ఆవరణశక్తి హృదయమునకు గురువు గూడ ఈశ్వరుడే.

**శ్లో॥ మతం మూఢైర్జగన్నిత్యం తథా జీవేశయోర్భిదా ।**
**ఏవం భేదత్రయేణేదం భాతం వస్త్వేవ మాయయా ॥ 11**

**ప్ర :** మూఢైః = మూర్ఖులచేత, జగత్+నిత్యమ్ = జగత్తునిత్యముగా, తథా = అట్లే, జీవ+ఈశయోః భిదా = జీవుడు ఈశ్వరుడు వేరుగా, మతమ్ = నమ్మబడుచున్నది, ఏవమ్ = ఈ రీతి, భేదత్రయేణ = మూడు భేదములతో, వస్తు+ఏవ = బ్రహ్మపదార్థమే, ఇదం భాతమ్ = ఈ జగత్తు ప్రకాశింపజేయబడుచున్నది, మాయయా = మాయచేత.

**తా :** మూర్ఖులు జగత్తు నిత్యమనియు, జీవుడు వేరు, ఈశ్వరుడు వేరు అనియు ఇట్లు నమ్ముదురు. ఇట్లు జగత్తు, జీవుడు, ఈశ్వరుడు అని మూడుగా ప్రకాశించుటకు మూలము మాయ.

**శ్లో॥ తన్నివృత్త్యై కృతా వేదైః సృష్టిప్రలయకల్పనా ।**
**మూఢస్య సా మతా సత్యా భ్రమోఽయం లీయతే విదా ॥ 12**

**ప్ర :** తత్+నివృత్త్యై = దానిని తొలగించుటకు, వేదైః = వేదములచేత, సృష్టిప్రలయకల్పనా కృతా = సృష్టి–ప్రలయము అనువాని కల్పన చేయబడినది, మూఢస్య = మూర్ఖునకు, సా = ఆ కల్పన, సత్యా మతా = సత్యముగా తోచినది, అయం భ్రమః = ఈ భ్రమ, విదా = జ్ఞానులచే, లీయతే = తొలగించబడును.

**తా :** ఆ మాయను, అజ్ఞానమును తొలగించుటకు వేదములు సృష్టి ప్రలయము అను వానిని కల్పించినది. అజ్ఞాని అవి సత్యమని నమ్మును. పండితులు ఆ భ్రమను నశింపజేతురు.

**శ్లో॥ జ్ఞానం విద్యేతి తాం ప్రాహుర్ద్వేధా విద్యా విచారజా ।**
**పరోక్షా చాపరోక్షేతి తత్రాద్యా గురువక్త్రతః ॥ 13**

**ప్ర :** తామ్ = దానిని, జ్ఞానం విద్యా ఇతి = జ్ఞానము, విద్య అను, తామ్ = దానిని, పరోక్షా చ అపరోక్షా ఇతి = పరోక్షము, అపరోక్షము లేక ప్రత్యక్షము, అని, ద్వేధా ప్రాహుః = రెండుగా

చెప్పుదురు, తత్ర = వానిలో, ఆద్యా = మొదటిదైన పరోక్షజ్ఞానము, గురు-వక్త్రతః = గురుముఖమునుండి, విచారజా = తర్కవిచారమువలన కలుగునది.

**తా :** భ్రమను లేక మాయను తొలగించునది జ్ఞానము, విద్య అనబడునది, పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానము అని రెండు విధములు. అందు పరోక్షము గురువునుండి తర్కవిచారమువలన నేర్వబడునది.

**శ్లో॥ అమానిత్వాదియుక్తైః సా విజ్ఞేయా సాధనాన్వితైః ।**
**గురుభక్తిం వినా సాపి దుర్లభా మోక్షదాయినీ ॥ 14**

**ప్ర :** సా = పరోక్షజ్ఞానము, అమానిత్వాదియుక్తైః = స్వాభిమానములేని వినయశీలురచేత, సాధనాన్వితైః = సాధనసంపత్తులతో కూడిన వారిచే, విజ్ఞేయా = నేర్వదగినది, గురుభక్తిం వినా = గురుభక్తిలేక, దుర్లభా = లభ్యము కానిది, సా అపి = పరోక్షజ్ఞానముకూడ, మోక్షదాయినీ = మోక్షమును ప్రసాదించునది.

**తా :** పరోక్షజ్ఞానము గురుభక్తిగల సాధకులకు లభించునది. అట్టివారు స్వాభిమానులు కాక సాధనచేయువారై యుండవలె. పరోక్షజ్ఞానము కూడ మోక్షమును ప్రసాదించును.

**శ్లో॥ యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ ।**
**తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥ 15**

**ప్ర :** యథా = ఎట్లు, దేవే = దేవునియందు, యస్య = ఎవనికి, పరా భక్తిః = పరమభక్తియో, తథా = అట్లు, గురౌ = గురువునందుండునో, తస్య మహాత్మనః = ఆ మహాత్మునకు, ఏతే కథితాః అర్థాః = బోధింపబడిన విషయములు, ప్రకాశన్తే హి = జ్ఞానమునిచ్చి తీరును.

**తా :** మహాత్ముడైన శిష్యునకు దేవునియందెట్టి భక్తి యుండునో అట్టి భక్తి గురువు నందునూ యేర్పడునో, వానికి గురువుబోధించిన విషయములు జ్ఞానమును కలిగించును.

**శ్లో॥ గుర్వనుగ్రహమాత్రేణ విచారః సులభో నృణామ్ ।**
**విచారేణ పరం తత్త్వం స్వయమేవ ప్రకాశతే ॥ 16**

**ప్ర :** గురు+అనుగ్రహమాత్రేణ = గురువుయొక్క అనుగ్రహమొక్కటి కలిగిన, నృణామ్ = మానవులకు, విచారః = వివేకించి తెలిసికొనుట, సులభః = సులభసాధ్యము, విచారేణ = వివేకించుటచేత, పరం తత్త్వమ్ = పరబ్రహ్మ లక్షణము, స్వయం ఏవ = తనకు తానే, ప్రకాశతే = ప్రకాశించును, అవగతమగును.

**తా :** గురువు అనుగ్రహించిన చాలును మానవుడు ఎంత గొప్ప విషయమునైన తర్కబద్ధముగ వివేకించ గలుగును. ఇట్లు విచారించుటచేత పరమతత్త్వము తనంత తానే తెలియవచ్చును.

**శ్లో॥ రాజంస్త్వయాఽఖిలం కర్మయోగయాగాదికం మయి ।
సమర్పితం తతోఽయం తే విచారోఽద్య సముత్థితః ॥ 17**

**ప్ర :** రాజన్ = ఓ రాజా, కార్తవీర్యా!, త్వయా = నీచేత, అఖిలం కర్మ = కర్మయంతయు, యోగయాగ+ఆదికమ్ = యోగము, యాగము మొదలగునది, మయి = నాయందు, సమర్పితమ్ = సమర్పింపబడినది, తతః = ఆ కారణమున, అయం తే విచారః = నీకు యీ విచారము, అద్య = నేడు, సముత్థితః = మొలకెత్తినది.

**తా :** ఓ రాజా! యోగయాగాది కర్మనంతయు నీవు నా కర్పించినావు. అందుమూలమున నేడు నీలో యీ విచారము పొడసూపినది.

**శ్లో॥ వైరాగ్యం పరమం జాతం భ్రమమోహమలాపహమ్ ।
అతో విద్యాప్రసాదస్తే భవిష్యత్యచిరేణ హి ॥ 18**

**ప్ర :** భ్రమ-మోహమల+అపహమ్ = భ్రమ మోహము అను మాలిన్యమును తొలగించునదైన, వైరాగ్యమ్ = వైరాగ్యము, పరమం జాతమ్ = అతిశ్రేష్ఠమైనది, అతః = ఆ వైరాగ్యమునుండి, తే = నీకు, విద్యాప్రసాదః = విద్య లేక జ్ఞానము అను ప్రసాదము, అచిరేణ హి = త్వరలోనే, భవిష్యతి = కలుగును.

**తా :** వైరాగ్యము కలిగిననే భ్రమ, మోహము తొలగిపోవును. అట్టి శ్రేష్ఠమైన వైరాగ్యము నీకు కలిగినది కావున నింక త్వరలోనే నీకు జ్ఞానము లభించును.

**శ్లో॥ విద్యా జ్ఞేయా పరోక్షేయం వేదాన్తశ్రవణాత్మికా ।
ఉపక్రమాదిభిర్లిఙ్గైర్యత్తాత్పర్యావధారణమ్ ॥ 19**

**ప్ర :** ఇయం విద్యా = ఈ విద్య, జ్ఞానము, పరోక్షా = ఏదేని మాధ్యమము ద్వారా పొందదగినది, వేదాన్తశ్రవణాత్మికా = వేదాన్తమనబడు ఉపనిషత్తులను వినుట ప్రధానముగా, జ్ఞేయా = తెలియదగినది, ఉపక్రమాదిభిః లింగైః = ఉపక్రమము, అనగా ప్రారంభము, మొదలగు లక్షణములతో, తాత్పర్య+అవధారణమ్ = మూలభావమును గుర్తించి జ్ఞాపకముంచుకొనుట అనునది, యత్ = యేదియో (అదియే)

**తా :** ఇది పరోక్షజ్ఞానము. ఉపనిషద్వాక్యములను విని, మననము చేసికొనుచు, ప్రగాఢధ్యానము ద్వారా (నిదిధ్యాసనము) గ్రహించి భద్రపరచబడునో, దానినే **పరోక్షజ్ఞాన** మందురు.

**శ్లో॥ తదేవ శ్రవణం తత్తు హరేత్సంశయభావనామ్ ।
అసత్త్వావరణం చాపి వస్త్వస్తీతి తదైక్షతే ॥ 20**

**ప్ర :** శ్రవణమ్ = శ్రవణమనననిదిధ్యాసనములని చెప్పబడిన అంగములలోని శ్రవణమనునది, తత్ ఏవ = అదియే, వేదాన్తశ్రవణమే, తత్ తు = అదియేమో, సంశయభావనామ్ = సందేహముల

పుట్టుకను, హరేత్ = నశింపజేయును, అసత్త్వావరణమ్ =అజ్ఞానావరణమును, చ అపి = కూడ (హరేత్), వస్తు = సత్పదార్థము, సత్యవస్తువు, అస్తి+ఇతి = ఉన్నది యని, తత్ = ఆ శ్రవణము, ఐక్షతే = ఐక్యతను, ఏకత్వమును తెల్పును.

**తా :** సాధనాంగముగా చెప్పబడు శ్రవణ మనునది ఇదియే. ఇది సందేహములు కలుగకుండ చేయును, ఆత్మజ్ఞానమును దాచిన అజ్ఞానావరణమును గూడ తొలగించి, సర్వమూలక సత్పదార్థము ఉన్నది, అను అద్వయభావమును పాదుకొల్పును.

**శ్లో॥ మననం కార్యమస్యేదమాశ్వసమ్భావనాహరమ్ ।**
**వశీకారాఖ్యవైరాగ్యయుక్తస్యేదం సుఖావహమ్ ॥ 21**

**ప్ర :** అస్య = శ్రవణము అనగా వినినదానిని, మననమ్ = మనసుకెక్కునట్లు మరల మరల స్మరించుట యనునది, కార్యమ్ = చేయదగినది, ఇదమ్ = ఇది, ఆశు = త్వరగా, అసంభావనా హరమ్ = సత్పదార్థమును ఊహించలేని అశక్తతను తొలగించునది, వశీకార+ఆఖ్య = ఇంద్రియములను వశపరచుకొనినవాడు అనిచెప్పబడు, వైరాగ్యయుక్తస్య = వైరాగ్యముతో కూడిన వానికి, ఇదమ్ = ఇది, సుఖ+ఆవహమ్ = సుఖమును కల్గించునది.

**తా :** శ్రవణవిషయమైన వేదాంతవాక్యముల అర్థమును మరల మరల స్మరించుటయే మనన మనబడును. ఇది తప్పక చేయదగిన సాధన. దీనివలన మనసుకున్న అసంభావన అనుదోషము తొలగిపోవును. వైరాగ్యము గలిగి, ఇంద్రియములను జయించిన వానికి మననము వలన వేగముగా తనలో కలిగిన ఈ దోషరాహిత్యమువలన సుఖము కలుగును.

**శ్లో॥ ఆత్మైవ నేహ నానాస్తి మోహితస్య జగత్త్విదమ్ ।**
**భాతి నాన్యస్య మిథ్యేదం స్వప్నో నిద్రాగమే యథా ॥ 22**

**ప్ర :** ఇహ = ఈ జగత్తు, ఆత్మా ఏవ = ఆత్మయే, నానా = అనేకము, న అస్తి = కాదు, మోహితస్య = మోహము జెందినవానికి, ఇదమ్ = ఇది, జగత్ తు = జగత్తుగనే, భాతి = ప్రకాశించుచున్నది, న అన్యస్య = మోహము లేనివానికి కాదు, యథా = ఎట్లు, నిద్రాగమే = నిద్రరాగా, స్వప్నః = స్వప్నమో, (తథా = అట్లు), ఇదం మిథ్యా = ఇది మిథ్య, అనగా లేనిది.

**తా :** ఈ జగత్తులో వివిధ వస్తువులు లేవు. ఉన్నదొక్కటే, ఆత్మ. మోహభ్రమలో ఉన్నవానికి ఇది నానాత్వముతోడి జగత్తుగా కన్పించును, నిద్రలో నున్నవానికి కలలో వలె. కాని, యీ కన్పించు జగత్తు భ్రాంతి మాత్రమే. ఈ మోహము లేనివాని కిది ఆత్మ మాత్రమే.

**శ్లో॥ విషయాన్ ధ్యాయతో యద్వన్మనోరథపరమ్పరా ।**
**అసత్యేవ సదా భాతి నానావిషయగోచరా ॥ 23**

**ప్ర :** విషయాన్ = ఇంద్రియసుఖమునకు కారణమైన విషయములను, ధ్యాయతః = ధ్యానించు

వానికి, మనోరథపరమ్పరా = కోరికల గొలుసుకట్టు, యత్+వత్ = ఏదియో దానివలె, సదా = ఎల్లపుడు, అసతి నానావిషయగోచరా ఏవ = లేని అనేకవస్తువుల దృశ్యమే, భాతి = ప్రకాశించు చున్నది.

**తా :** ఇంద్రియసుఖములనే ధ్యానించువానికి ధారాయితముగా కోరికలు కలుగునట్లు, మోహితునకు జగత్తులో లేని విషయములనేకమున్నట్లు కన్పించును.

**శ్లో॥ పరమాత్మైక ఏవాహం వస్తుమాత్రశ్చిదాత్మకః ।**
**మయి మిథ్యావిభాగోఽయం దృశ్యతేఽనాద్యవిద్యయా ॥ 24**

**ప్ర :** అహమ్ = నేను అనునది, చిదాత్మకః = జ్ఞానస్వరూపముగల, వస్తుమాత్రః = సద్వస్తు వొక్కటేయైన, పరమ+ఆత్మా+ఏకః ఏవ = పరమమైన ఆత్మ ఒక్కటియే, మయి = నాలో, అయం మిథ్యావిభాగః = లేని యీ విభాగము, అనేకత్వము, అనాది+అవిద్యయా = మొదలు లేని అవిద్యచేత, దృశ్యతే = కనబడును.

**తా :** 'నేను' అనునది జ్ఞానరూపి, 'సత్' అనునది, ఒక్క పరమాత్మయే. నాలో, అనగా 'నేను'లో లేని నానాత్వము అనాదియైన అవిద్యవలన కల్పింపబడిన దృశ్యము మాత్రమే.

**శ్లో॥ భ్రమో మోహో మహామాయా ప్రధానం ప్రకృతిర్మనః ।**
**అజ్ఞానం శక్తిరవ్యక్తం గుణసామ్యమితీరితా ॥ 25**

**ప్ర :** భ్రమః = భ్రమ, మోహః = మోహము, మహామాయా = మహామాయ, ప్రధానమ్ = ప్రధానము, ప్రకృతిః = ప్రకృతి, మనః = మనస్సు, అజ్ఞానమ్ = అజ్ఞానము, శక్తిః = శక్తి, అవ్యక్తమ్ = అవ్యక్తము, గుణసామ్యమ్ = సత్త్వరజస్తమోగుణములు మూడిటి సమతౌల్యము, ఇతి = అని, ఈరితా = పిలువబడుచున్నది.

**తా :** భ్రమ, మోహము, మహామాయ, ప్రధానము, ప్రకృతి, మనస్సు, అజ్ఞానము, శక్తి, అవ్యక్తము, గుణసామ్యము అనునవన్నియు ఆ అవిద్యకు మారు పేర్లే. (ఇవి దాని లక్షణములను వర్ణించి చెప్పు పేర్లు.)

**శ్లో॥ సైవ మిథ్యామతిర్యస్యా ఇదం భాతి చరాచరమ్ ।**
**ఏవం విచారశ్రవణానుసారి మననం తు తత్ ॥ 26**

**ప్ర :** యస్యాః = దేనికి, ఇదమ్ = ఈ, చరాచరమ్ = చరాచరజగత్తు, భాతి = తోచునో, సా ఏవ = అదియే, మిథ్యామతిః = భ్రాంతియుతమైన బుద్ధి, ఏవమ్ = ఈ విధముగా, విచారశ్రవణానుసారి = తర్కించిన దానిని విని, దానిననుసరించినది, తత్ తు మననమ్ = అదియే మననము.

**తా :** యే బుద్ధికి చరాచరజగత్తు తోచునో, ఆ బుద్ధి మిథ్యయందు అనగా భ్రమలలో ప్రవర్తించుచున్నదని తర్కించి, ఆ సత్యమును స్మరించుటే మననము.

**శ్లో॥ సచ్చిదానన్దలక్ష్మాపి పరాత్మా మాయయాఽఽవృతః ।**
**నిజం స్వరూపం విస్మృత్య యయేదం దృశ్యతే జగత్ ॥ 27**

**ప్ర :** పరాత్మా = పరమాత్మ, సచ్చిదానన్దలక్ష్మా అపి = సత్ చిత్ ఆనందము అను లక్షణములు గలదే యైనను, మాయయా = మాయచేత, ఆవృతః = కప్పబడినదై, నిజమ్ = తనదైన, స్వరూపమ్ = ఆత్మరూపమును, విస్మృత్య = మరచి, యయా = దేనిచే, యే బుద్ధిచే, ఇదం జగత్ = ఈ జగత్తు, దృశ్యతే = దర్శించబడుచున్నదో, (అదియే మిథ్యామతియని పై శ్లోకముతో అన్వయము).

**తా :** పరమాత్మకు ఉనికి (సత్), జ్ఞానము (చిత్), ఆనందము అనునవి లక్షణములు. కాని ఈ ఆత్మ స్వరూపమును మూసివేసి, కనరానీయక మాయ కప్పినపుడు, ఈ సత్యము (అనగా ఆత్మయొక్క ఉనికి) కనరానిదై ఈ జగత్తు కానవచ్చును.

**శ్లో॥ మహాంస్తతోఽహమస్తస్మాత్తన్మాత్రాణి తతః క్రమాత్ ।**
**భూతేన్ద్రియసురాణాం చ సర్గస్త్ర్యాత్మాఽహమః క్రమాత్ ॥ 28**

**ప్ర :** తతః = (ఎందువలన, జగత్తు తోచునో), అందువలన, మహాన్ = జ్ఞాన క్రియాత్మ మహాన్ అనబడునది, తస్మాత్ = అందువలన, అహమః తన్మాత్రాణి = అహంకారతన్మాత్రలు శబ్దస్పర్శాదులు, తతః = అటనుండి, క్రమాత్ = క్రమముగా, భూత+ఇన్ద్రియ సురాణాం సర్గః చ = పంచభూతములు, పంచేంద్రియములు, దేవతలు వీనన్నిటి సృష్టికి గూడ, త్ర్యాత్మా = సత్త్వరజస్తమోగుణములు మూడునుగల ఆత్మ, క్రమాత్ = క్రమముగా, అహమః = గుణాహంకారములైనవి.

**తా :** అట్లు జగత్తు తోచుటకు కారణము మహత్ అనబడు జ్ఞానక్రియాత్మ త్రిగుణాత్మకమైన అహంకారముగనై క్రమమున పంచతన్మాత్రలై, పంచేంద్రియములై, దేవతలై, వీటి నధిష్ఠించిన అహంకారములుగా భిన్నమైపోవుట.

**శ్లో॥ నహ్యత్ర నియమోరాజన్నసత్యే మానసభ్రమే ।**
**కదాచిద్యుగపత్సృష్టిః క్రమసృష్టిః కదాచన ॥ 29**

**ప్ర :** రాజన్ = ఓ రాజా!, అత్ర అసత్యే మానసభ్రమే = అసత్యమైన యీ మానసిక భ్రమ విషయమున, నియమః నహి = నియమము లేదు, కదాచిత్ = ఒకప్పుడు, యుగపత్ సృష్టిః = అన్నియు నొకేసారి సృష్టి యగును, కదాచన = ఒకప్పుడు, క్రమసృష్టిః = పరిణామమున సృష్టి.

**తా :** ఓ రాజా! కేవలము మానసికభ్రమయైన యీ జగత్తునకు అజ్ఞానము కారణమైన అది యుగపత్ సృష్టి యనబడును, లేక మహదహంకారమునుండి పంచీకరణప్రక్రియద్వారానైనచో, అది క్రమసృష్టి యనబడును. ఈ విషయమున నియమము లేదు.

**శ్లో॥ దేహాః సురాసురనరతిరశ్చాం భౌతికా ఇమే ।**
**స్థూలైః స్థూలాని సూక్ష్మైశ్చ సూక్ష్మాణ్యేవ భవోద్భవః ॥ 30**

**ప్ర :** సుర+అసుర నర తిరశ్చామ్ = దేవతలు, రాక్షసులు, నరులు, జంతువులు, వీనియొక్క దేహాః = దేహములు, భౌతికాః = పంచభూతనిర్మితములు, ఇమే = ఇవి, స్థూలైః = స్థూలభూతముల చేత, స్థూలాని = స్థూలములు, చ = మరియు, సూక్ష్మైః = సూక్ష్మములచేత, సూక్ష్మాణి ఏవ = సూక్ష్మములున్నూ, భవ+ఉద్భవః = సృష్టియై జన్మించును.

**తా :** దేహములన్నియు, దేవతలు, దానవులు, నరులు, పశుపక్ష్యాదులు, అన్నిటివిన్నీ పంచభూత నిర్మితములే. స్థూలభూతములు స్థూలదేహములను, సూక్ష్మములు సూక్ష్మములను సృష్టించు చుండును.

**శ్లో॥ ఉపక్రమోయఽమాఖ్యాత ఉపసంహార ఉచ్యతే ।**
**భూతేషు భౌతికానీహ క్రమాద్యోగీ విలాపయేత్ ॥ 31**

**ప్ర :** అయమ్ = ఇది, ఉపక్రమః ఆఖ్యాతః = ఉపక్రమము అనబడును, భూతేషు = ప్రాపంచికమైన జీవులందు, భౌతికాని = భౌతికములను, ఇహ = జగత్తులో, యోగీ = యోగియైనవాడు, క్రమాత్ = పరిణామఫలముగా, విలాపయేత్ = తొలగించును, (ఇది) ఉపసంహారః = ఉపసంహారము, ఉచ్యతే = అనబడును.

**తా :** స్థూలసూక్ష్మదేహనిర్మాణము ఉపక్రమ మనబడును. సృష్టిలోని భౌతికపదార్థములలోని భౌతికతను యోగియైనవాడు క్రమసాధనఫలముగా తొలగించును.

**శ్లో॥ పృథ్వీ జలే జలం వహ్నౌ వహ్నిర్వాయౌ స ఖే చ ఖమ్ ।**
**అహమి ప్రాణగో దేవా మనశ్చాపి స్వకారణే ॥ 32**

**శ్లో॥ అహంకారోఽపి మహతి సోఽవ్యక్తే తచ్చ నిష్కలే ।**
**స ఏవాహం పరమాత్మైకః శుద్ధో ముక్త ఉపస్థితః ॥ 33**

**ప్ర :** పృథ్వీ = భూమి, జలే = జలమందు, జలమ్ = జలము, వహ్నౌ = అగ్నియందు, వహ్నిః = అగ్ని, వాయౌ = వాయువునందు, సః = వాయువు, ఖే చ = ఆకాశమునందున్నూ, ఖమ్ = ఆకాశము, అహమి = అహంకారమందు, ప్రాణగో దేవాః మనః చ అపి = ప్రాణము, ఇంద్రియములు, దేవతలు, మనస్సు కూడ, స్వకారణే = కారణభూతమైన నాయందు (అహంకారమందు), అహంకారః అపి = అహంకారము గూడ, మహతి = మహత్తునందు, సః = మహత్తు, అవ్యక్తే = అవ్యక్తమునందు, తత్ చ = ఆ అవ్యక్తమున్నూ, నిష్కలే = అఖండత్వము నందు, సః ఏవ = ఆ అఖండమే, అహమ్ = నేను, పరమాత్మ+ఏకః = పరమమైన ఆత్మ కేవలుడను, శుద్ధః = నిర్వికారుడను, ముక్తః = నిస్సంగుడను, ఉపస్థితః = అయియున్నాను.

**తా :** భూమి జలములోనూ, జలము అగ్నిలోనూ, అగ్ని వాయువులోనూ, వాయువు ఆకాశములోనూ, ఆకాశము అహంకారములోనూ, అహంకారమున ప్రాణము, ఇంద్రియములు,

దేవతలు, మనస్సున్ను, అహంకారము మహత్తునందు, మహత్తు అవ్యక్తమునందు, అవ్యక్తము అఖండమునందు, అఖండమే నేను, పరమాత్ముడను, నిర్వికారుడను, నిస్సంగుడను, అయి యున్నాను.

**శ్లో॥ ఏవం నిదిధ్యాసనత ఏకః స్వాత్మైవ శిష్యతే ।**
**తస్మాన్నాస్త్యపరం కిఞ్చిదాత్మైవాయం యథా తథా ॥ 34**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగ, నిదిధ్యాసనతః = ప్రగాఢధ్యానమువలన, స్వ+ఆత్మా+ఏవ ఏకః = తనదైన ఆత్మ ఒక్కటియే, శిష్యతే = మిగులును, తస్మాత్ = దానికంటె, అపరమ్ = మరియొకటి, కిఞ్చిత్ = కొంచెమున్ను, న+అస్తి = లేదు, అయం = ఇది, ఆత్మా ఏవ = ఆత్మయే, యథా తథా = ఉన్నది ఉన్నట్లే.

**తా :** ఇట్లు మననము వలన యేర్పడిన ప్రగాఢ ధ్యానమువలన సాధకుని ఆత్మ ఒక్కటి మాత్రమే కడపట మిగులునది. దానికంటె వేరుగా మరేదియు లేదు. ఆత్మయే, ఎట్లున్నదో అట్లే.

**శ్లో॥ రాజన్మమ ప్రసాదాత్త్వం ఖలు! ధన్యోఽస్య సంశయమ్ ।**
**అన్తఃకరణశుద్ధిస్తే జాతా వైరాగ్యముత్తమమ్ ॥ 35**

**ప్ర :** రాజన్ = ఓ రాజా! మమ ప్రసాదాత్ = నా అనుగ్రహమువలన, త్వమ్ = నీవు, అసంశయమ్ = నిశ్చయముగా, ధన్యః అసి ఖలు = ధన్యుడవైనావు కదా!, తే = నీయొక్క, అన్తఃకరణశుద్ధిః = అంతఃకరణశుద్ధి, ఉత్తమం వైరాగ్యం జాతా = ఉత్తమవైరాగ్యముగా ఉద్భవించినది.

**తా :** ఓ రాజా! నా యనుగ్రహమువలన నీవు ధన్యుడవైనావు. నీ మనఃశుద్ధి వైరాగ్యముగా రూపాంతరము చెందినది.

**శ్లో॥ మయి భక్తిర్దృఢా ప్రేమ్ణా శ్రవణం చాపి విస్తరాత్ ।**
**ప్రపఞ్చాస్థాఽపి చిత్తస్థా సర్వథా విలయం గతా ॥ 36**

**ప్ర :** మయి = నా యందు, భక్తిః = భక్తి, దృఢా = దృఢమైనదై, ప్రేమ్ణా = ప్రేమతో, శ్రవణం చ అపి = శ్రవణమున్ను, విస్తరాత్ = విస్తారముగా, ప్రపఞ్చ+ఆస్థా+అపి = ప్రపంచమునందు పాదుకొనినదైనను, చిత్తస్థా = మనసులో నిలచినది, సర్వథా = అన్ని విధములుగా, విలయం గతా = నశించిపోవును.

**తా :** నాయందు దృఢమైన భక్తి గలిగి, ప్రేమతో విస్తారముగా శ్రవణము చేయుటచే, ప్రపంచమున ప్రవర్తిల్లుచున్నదైనను మనసుకెక్కిన ఇంద్రియవిషయములు నాశము పొందును.

**శ్లో॥ తత్త్వమేకం పరం బ్రహ్మ న ద్వితీయం కదాపి హి ।**
**ఏవం శమాదిరూపం తామారూఢో భవ భూమికామ్ ॥ 37**

**ప్ర :** ఏకం తత్త్వం పరం బ్రహ్మ = పరబ్రహ్మతత్త్వమొక్కటే, కదా అపి = ఎప్పుడైన, ద్వితీయమ్ = రెండవది, న హి = లేనే లేదు, ఏవమ్ = ఈ విధమైనది, శమ+ఆదిరూపమ్ = మోహవికారము శమించినప్పుడు కలుగు తొలి రూపము, తాం భూమికామ్ = ఆ భూమికను, ఆరూఢః భవ = అధిష్ఠించినవాడవు కమ్ము.

**తా :** పరబ్రహ్మతత్త్వమొక్కటే, రెండవదెప్పుడూ లేదు. ఇట్టి నిర్వికారరూపము నధిష్ఠించిన వాడవు కమ్ము.

**శ్లో॥ త్వం సాక్షాత్కారసూపాయక్రమం విద్ధ్యథ భూపతే! ।**
**దత్తచిత్తో భవాద్యత్ర తత్త్వనిశ్చయకారకే ॥ 38**

**ప్ర :** భూపతే! = ఓ రాజా!, త్వమ్ = నీవు, అథ = అటుపై, సాక్షాత్కార = దర్శనమునకై, సు+ఉపాయక్రమమ్ = సులభమైన సాధనవిధానమును, విద్ధి = తెలియుము, ఆది = మొదట, అత్ర = ఆ విషయమున, తత్త్వనిశ్చయకారకే = సత్యమును నిశ్చయించుటకు సాధనమైన, ఉపదేశమున, దత్తచిత్తః భవ = ఏకాగ్రమనస్కుడవు కమ్ము.

**తా :** ఓ కార్తవీర్యా! నీవు ఆత్మదర్శనసాధనవిధి నెఱుగుము. సత్యనిశ్చయసాధనమైన ఆ ఉపదేశమున ఏకాగ్రచిత్తుడవు కమ్ము.

**శ్లో॥ సర్వసాధనసమ్పన్నః పురుషో జాతనిశ్చయః ।**
**శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం తం సద్గురుం శరణం వ్రజేత్ ॥ 39**

**ప్ర :** జాతనిశ్చయః = దృఢనిశ్చయముగలవాడైన, పురుషః = సాధకుడు, సర్వసాధనసంపన్నః = సాధనసంపత్తి నంతయు సమకూర్చుకొన్నవాడై, శ్రోత్రియమ్ = వేదాచారపరాయణుడైన, బ్రహ్మనిష్ఠమ్ = బ్రహ్మజ్ఞానసిద్ధుడైన, తం గురుమ్ = అట్టి గురువును, శరణం వ్రజేత్ = శరణు పొందవలెను.

**తా :** సాధకుడు దృఢనిశ్చయముతో, సాధన సంపత్తితో, వేదాచారముగల బ్రహ్మజ్ఞానియైన గురువును శరణువేడవలెను.

**శ్లో॥ తత్త్వమస్యాదివాక్యార్థముపదిష్టం తు షడ్విధైః ।**
**లిఙ్గైర్ధియా సమాలోచ్య బుధః సమవధారయేత్ ॥ 40**

**ప్ర :** తత్త్వమసి+ఆది వాక్య+అర్థం ఉపదిష్టమ్ = 'తత్త్వం అసి' (తత్ త్వం అసి), అనగా 'నీవు తత్త్వమే అగుచున్నావు' లేక 'అది నీవే అగుచున్నావు' అను ఉపనిషత్తు వాక్యమునకు అర్థమును తెలిసికొని, షడ్విధైః లిఙ్గైః = ఉపక్రమ–ఉపసంహారములు, అపూర్వత, అభ్యాసము, ఫలము, ప్రశంస, ఉపపత్తి అనబడు తాత్పర్యనిర్ణాయకలింగము లారింటిచే, ధియా = సూక్ష్మబుద్ధిచే, సమాలోచ్య = బాగుగా తర్కించి, బుధః = పండితుడు, సమవధారయేత్ = చక్కగా గ్రహించవలెను.

**తా :** గురువు బోధించిన '**తత్త్వమసి**' మొదలగు ఉపనిషద్వాక్యముల అర్థములను సూక్ష్మబుద్ధితో విచారించి షడ్విధలింగములను సమన్వయించి చూచి, పండితుడు అవధారణ చేయవలెను.

**శ్లో॥ శ్రవణం తు ఇదమేవోక్తం తత్సమాసేన తే బ్రువే ।**
**యతస్త్వం శిష్యతాం ప్రాప్తో మత్సేవాహతకిల్బిషః ॥ 41**

**ప్ర :** శ్రవణం తు = శ్రవణ మనునదేమో, ఇదం ఏవ = ఇదియే (యని), ఉక్తమ్ = చెప్పబడినది, తత్ = అది, యతః = ఎందువలన, త్వమ్ = నీవు, శిష్యతామ్ = శిష్యత్వమును, ప్రాప్తః = పొందినవాడవో, మత్ సేవా హత కిల్బిషః = నన్ను సేవించుటవలన నశించిన పాపముగల వాడవో, (తతః = అందువలన), సమాసేన = సంక్షిప్తముగా, తే = నీకు, బ్రువే = చెప్పుదును.

**తా :** దీనినే శ్రవణమందురు. నీవు నా సేవజేసి పాపమును తొలగించికొనిన కారణముగా నాకు శిష్యుడవైనావు. అందువలన నీకు సంక్షిప్తముగా ఈ ఉపదేశము చేసినాను.

**శ్లో॥ తత్పదేన పరం బ్రహ్మ త్వమ్పదేన చ పురుషమ్ ।**
**అనూద్యైకం తయోర్భూప! బోధ్యతేఽసిపదేన సత్ ॥ 42**

**ప్ర :** తత్ పదేన = 'తత్' అను పదముచేత, పరం బ్రహ్మ = పరబ్రహ్మము, త్వం-పదేన = '**త్వం**' అను పదముచేత, పురుషం చ = పురుషునిన్నీ, భూప! = ఓ రాజా!, తయోః = వారిద్దరిలో, ఏకమ్ = ఒకనిని, అనూద్య = అనుసరించి చెప్పి, అసిపదేన = 'అసి' అను పదముచేత, సత్ = ఉనికి, బోధ్యతే = బోధించుచున్నది.

**తా :** '**తత్త్వమసి**' అను ఉపనిషద్వాక్యములోని '**తత్**' అను పదము పరబ్రహ్మమును, '**త్వం**' అనుపదము పురుషుని, 'అసి' అను పదము ఉనికిని బోధించును. కాగా, 'తత్త్వమసి' అను వాక్యమును విశ్లేషించగా, **తత్ అసి, త్వం అసి** అను రెండిటి సమాహారార్థము, '**తత్త్వమసి**' అయినది. కాగా, తత్త్వార్థమున, 'అసి' అనునది తత్ త్వం ఉభయులకు ఏకత్వమును ఘటించుచున్నది. కర్తయైన జీవాత్మయు, పరమకర్తయైన పరమాత్మయు ఇద్దరు అనాద్యనంత శాశ్వతులని నట్లయినది.

**శ్లో॥ విరుద్ధస్య త్వమర్థస్య తదర్థత్వం కథం భవేత్ ।**
**ఇతి తచ్ఛృణు రాజేన్ద్ర! తయోరైక్యే నిదర్శనమ్ ॥ 43**

**ప్ర :** విరుద్ధస్య = విరుద్ధమైన, త్వమర్థస్య = త్వమర్థమునకు, తదర్థత్వమ్ = తదర్థసామ్యము, కథం భవేత్ = ఎట్లగును? ఇతి = అను విషయమున, రాజేన్ద్ర! = రాజోత్తమా!, తయోః = ఆ రెండిటి, ఐక్యే = ఏకత్వమునందు, తత్ నిదర్శనమ్ = దానికి ప్రమాణమును, శృణు = వినుము.

**తా :** ఓ రాజోత్తమా! **త్వం** పదముయొక్క అర్థము (నీవు అనునది), **తత్** పదముయొక్క అర్థమున్నూ

(అది అనునది) పరస్పరవిరుద్ధములుకదా, రెండు పదములకు ఏకార్థమెట్లు పొసగును? అను ప్రశ్నయున్నది కదా, దానికేమి సమాధాన మనుదానికి ప్రమాణము వివరింతును, వినుము.

శ్లో॥ దేవదత్తః క్వచిద్దృష్టో యువా దేశాన్తరే స చ ।
పునర్దృష్టో జరాం ప్రాప్తః సోఽయమిత్యవధార్యతే ॥ 44

శ్లో॥ పూర్వదేశమవస్థాం చ త్యక్త్వేదం తస్య వార్ధకమ్ ।
దేశం చాపి యథైకేన పిణ్డేనైకం ప్రతీయతే ॥ 45

శ్లో॥ త్యక్త్వా ద్వ్యంశౌ తథాత్రాపి వాక్య ఐక్యం హి లక్ష్యతే ।
త్వమ్పదస్య చ వాచ్యార్థః సంసారీతి సునిశ్చితః ॥ 46

శ్లో॥ కర్తా భోక్తా సుఖీ దుఃఖీ మాయయైవ న తత్త్వతః ।
దేహేన్ద్రియమనఃప్రాణాహఙ్కారేభ్యో విలక్షణః ॥ 47

శ్లో॥ వస్తుతః సచ్చిదానన్దస్వరూపో గుణగోచరః ।
ఏకాంశస్తత్ర చిద్రూపమన్యః సంసారితాస్య చ ॥ 48

శ్లో॥ ఏవం త్వమర్థం నిశ్చిత్య తదర్థమపి నిశ్చిను ।
అతద్వ్యావృత్త్యా విధినా సాక్షాచ్చ శ్రుతియుక్తితః ॥ 49

శ్లో॥ తత్పదస్య చ వాచ్యార్థః సర్వజ్ఞః పరమేశ్వరః ।
తస్యైకోఽంశోఽపి చిద్రూపం సర్వజ్ఞత్వాది చాపరః ॥ 50

శ్లో॥ త్యక్త్వా విరుద్ధవాచ్యాంశద్వయం జీవేశయోరిహ ।
లక్ష్యౌ చిదంశౌ నిర్బాధం పదయోరుభయోరపి ॥ 51

ప్ర : దేవదత్తః = దేవదత్తుడనువాడు, క్వచిత్ దేశాన్తరే = అన్యదేశంలో ఒకచోట, యువా దృష్టః = యువకుడుగా చూడబడినాడు, సః చ = ఆతడే, జరాం ప్రాప్తః = వార్ధక్యమును పొందినవాడై, పునః = మరల, దృష్టః = చూడబడినాడు, అయమ్ = ఈతడు, సః = ఆ దేవదత్తుడు, ఇతి = అని, అవధార్యతే = గ్రహింపబడుచున్నది, పూర్వదేశమ్ = ముందున్న ప్రదేశమును, అవస్థాం చ = వయోదశను, త్యక్త్వా = విడచిపెట్టి, ఇదమ్ = ఇది, తస్య = వానియొక్క, వార్ధకం దేశం చ అపి = ముసలితనము, ప్రదేశము గూడ, యథా = ఎట్లు, ఏకేన పిణ్డేన = ఒకే శరీరముచేత, ఐక్యమ్ = ఏకత్వము, ప్రతీయతే = గ్రహించబడుచున్నది, తథా = ఆ విధముగా, అత్ర అపి = ఆ విషయమున కూడ, ద్వి+అంశౌ = రెండు అంశములను, త్యక్త్వా = వదలి, వాక్య ఐక్యం హి = వాక్యార్థముల ఏకత్వమే, లక్ష్యతే = ప్రయోజనముగా గ్రహించబడుచున్నది, త్వం పదస్య చ = 'త్వం' పదమునకున్ను, వాచ్యార్థః = వాచ్యమైన స్పష్టార్థము, సంసారీ ఇతి = సంసారి యని, సునిశ్చితః = నిస్సంశయముగా అంగీకరించబడినది, కర్తా = కర్త, భోక్తా = భోక్త, సుఖీ =

సుఖించువాడు, దుఃఖీ = దుఃఖియైనవాడు, అను యీ విభాగము, మాయయా ఏవ = భ్రాంతిచేతనే, న తత్త్వతః = సూక్ష్మసత్యముగా కాదు, దేహ = శరీరము, ఇన్ద్రియ = ఇంద్రియములు, మనః = మనస్సు, ప్రాణ = ప్రాణము, అహంకారేభ్యః = అహంకారము, వీటి అన్నింటిచేత, విలక్షణః = విశేషలక్షణము గలది, వస్తుతః = స్వభావసిద్ధముగా, సచ్చిదానన్ద స్వరూపః = సత్ చిత్ ఆనందములు రూపముగా గలది, గుణగోచరః = గుణములతో కన్పించును, తత్ర = ఆ విషయమున, చిత్+రూపమ్ = చిత్ లేక జ్ఞానరూపము, ఏకాంశః =ఒక అంశ, అస్య చ సంసారితా = వాని ప్రాపంచికత, అన్యః = రెండవది, ఏవమ్ = ఇట్లు, త్వమర్థమ్ = 'త్వం' అనుదాని అర్థమును, నిశ్చిత్య = నిశ్చయించి, తదర్థమపి = 'తత్' అనుదాని అర్థముగూడ, అతద్ వ్యావృత్త్యా = ఇది అది కాదు (ఆత్మకాదు) అను వైఖరితో జగత్తును నిషేధించుటచేత, విధినా = శాస్త్రవిధానముతో, సాక్షాత్ చ = స్వానుభవదర్శనమువలనను, శ్రుతియుక్తితః = వేదోక్తమైన ఉపాయము వలనను, నిశ్చిను = నిశ్చయించుము. తత్పదస్య చ వాచార్థః = **తత్** పదముయొక్క శబ్దార్థము, సర్వజ్ఞః పరమేశ్వరః = సర్వమెఱిగిన పరమేశ్వరుడు, తస్య = వానికి, ఏకాంశోఽపి = ఒక అంశమైనది, చిద్రూపమ్ = జ్ఞానరూపము, సర్వజ్ఞత్వాది = సర్వజ్ఞము మొదలగునది, అపరః చ = మరియొకటియున్నూ, ఈ విరుద్ధవాచ్యాంశద్వయమ్ = రెండు పరస్పరవిరుద్ధమైన అంశములను, త్యక్త్వా = విడచి, జీవ+ఈశయోః = జీవుడు, ఈశ్వరుడు అను ఇద్దరికి చెందిన, ఉభయోః అపి పదయోః = రెండు పదముల యొక్కయు, చిదంశౌ = జ్ఞానాంశలైన, లక్ష్యౌ = లక్ష్యార్థములను, నిర్బాధమ్ = బాధ కలిగించనట్లుగా,

**శ్లో॥ అవిరుద్ధం తయోరైక్యం లక్షణాలక్షితం ద్వయోః ।**
**వాక్యార్థోఽయం సునిష్పన్నస్త్వం బ్రహ్మ పరమం హి తత్ ॥ 52**

**శ్లో॥ తదేవ త్వం పరం బ్రహ్మ నాస్తి భేదః కథంచన ।**
**అఖణ్డైకరసత్వేన వాక్యార్థోఽత్ర సతాం మతః ॥ 53**

**ప్ర :** తయోః ద్వయోః = రెండిటి యొక్క, ఐక్యమ్ = ఏకత్వము, లక్షణా లక్షితమ్ = లక్షణా వృత్తిచే లక్షింపబడిన అర్థము, అవిరుద్ధమ్ = వ్యతిరేకము కానిది, అయం వాక్యార్థః = ఈ వాక్యార్థము, సునిష్పన్నః = చక్కగా యేర్పడినది, త్వం బ్రహ్మ పరమం తత్ హి = నీవు పరబ్రహ్మమే యనునది, తత్ ఏవ = అదియే, త్వం పరం బ్రహ్మ = నీవు పరబ్రహ్మవు, కథంచన = ఎట్లన్నను, భేదః న అస్తి = భేదము లేదు, వాక్యార్థః = వాక్యార్థము, అత్ర = ఈ విషయమున, అఖణ్డ+ఏక రసత్వేన = అవిభక్తమైన ఒకే ఆనందముగా, సతామ్ = సత్పురుషులయొక్క, మతః = మతము.

**తా :** దేవదత్తునొకప్పుడొక అన్యగ్రామమున చూచినాము. అప్పుడాతడు యువకుడు. ఆ తరువాత మరల అతనిని వార్ధక్యమున చూచినాము. ఆ యువకుడు, ఈ వృద్ధుడు, ఇద్దరున్నూ ఒక్కరే యని గ్రహించినాము. అనగా, అతని పూర్వదశను, దేశమును త్రోసివేసి, శరీరము ఒక్కరిదే కనుక వ్యక్తియొక్కడే యని తీర్మానించినాము. అట్లే, **తత్త్వమసి** అను వాక్యములోని సారభూతమైన

అర్థమును గ్రహింతుము. **త్వం** అనునది సంసారిని సూచించును. **తత్** అనునది పరబ్రహ్మ. సంసారికి కర్మచేయుట, సుఖదుఃఖములనుభవించుట విశేషలక్షణములుగా గుర్తింపబడినవి. పరబ్రహ్మమునకీ లక్షణములు వర్తించవు. ఐనను, ఇతడే దేవదత్తుడెట్లు? అనగా, తత్త్వరూపమున ఒక్కరే. ఇట్లే **తత్** పదమును గూడ విశ్లేషించి, అర్థనిర్ణయము కలిగింతుము. ఇది సత్పురుషుల మతము.

**శ్లో॥ విశేష్యం త్వం పదం తస్య తత్పదం చ విశేషణమ్ ।**
**నిరస్యతేఽస్య దుఃఖిత్వం సుఖిత్వం చ విధీయతే ॥ 54**

**ప్ర :** త్వం పదమ్ = త్వం (నీవు) అను పదము, విశేష్యమ్ = విశేష్యము, చ = మరియు, తస్య = దానికి, తత్ పదమ్ = **తత్** అను పదము, విశేషణమ్ = విశేషణము, అస్య = దాని, దుఃఖిత్వమ్ = దుఃఖించు లక్షణము, నిరస్యతే = త్రోసివేయబడును, చ = మరియు, సుఖిత్వమ్ = సుఖించులక్షణము, విధీయతే = విధించబడును. అన్వయించబడును.

**తా :** త్వం అనునది విశేష్యము, దాని విశేషణము తత్ అనునది. ఇట్లు **త్వం** యొక్క దుఃఖము తొలగించబడి, **తత్** యొక్క సుఖము **త్వం** కు అన్వయించబడును.

**శ్లో॥ వైపరీత్యేన విజ్ఞేయం విశేష్యం తత్పదం తథా ।**
**విశేషణం త్వమ్పదం చ పారోక్షస్య నిరాసకృత్ ॥ 55**

**ప్ర :** వైపరీత్యేన = అందుకు విపరీతమైన పద్ధతిలో, తత్ పదమ్ = 'తత్' అను పదము, విశేష్యం విజ్ఞేయమ్ = విశేష్యముగా తెలియదగును, తథా = అదే రీతిగా, త్వం పదమ్ = 'త్వం' అను పదము, విశేషణం చ = విశేషణముగ కూడ, అందువలన, పారోక్షస్య = 'తత్' అను బ్రహ్మముయొక్క (ఆత్మయొక్క), పరోక్షత్వలక్షణము, నిరాసకృత్ = త్రోసివేయబడినదగును.

**తా :** ముందు చెప్పబడిన అన్వయమునకు విపరీతముగ (భిన్నముగ), **తత్** అనుబడు పరబ్రహ్మమును సూచించు పదము విశేష్యముగాను, **త్వం** అను జీవుని (సంసారిని) సూచించు పదమును విశేషణముగానూ స్వీకరించినప్పుడు పరబ్రహ్మ లక్షణమైన సచ్చిదానందము పరోక్షము కాక ప్రత్యక్షమే యగును.

**శ్లో॥ తద్బ్రహ్మ పరమం శుద్ధం త్వమాత్మైవ నిరామయః ।**
**ఇత్యైక్యం భూప! విజ్ఞేయం వేదోక్తం గుర్వనుగ్రహాత్ ॥ 56**

**ప్ర :** తత్ = తత్ అనునది, శుద్ధమ్ = నిర్వికారమైన, పరమం బ్రహ్మ = పరబ్రహ్మము, త్వమ్ = త్వం అనునది, నిరామయః = ఏ దోషము లేని, ఆత్మా ఏవ = ఆత్మయే, ఇతి = అని, భూప! = ఓ రాజా!, గురు+అనుగ్రహాత్ = గురువు దయవలన, వేదోక్తమ్ = వేదము చెప్పిన, ఐక్యమ్ = ఏకత్వము, విజ్ఞేయమ్ = విశేషముగా తెలియదగినది.

**తా : తత్** అని ఉపనిషత్తులు వర్ణించినది శుద్ధమైన పరబ్రహ్మము, **త్వం** అనునది నిర్దోషమైన ఆత్మయే. ఓ రాజా! గురువుదయతో విశేషముగా పొందదగిన జ్ఞానము యీ ఆత్మబ్రహ్మైక్యమే. వేదము ప్రతిపాదించిన సత్యమిదియే.

**శ్లో॥ స్వాత్మైకార్థమియం ప్రోక్తా సుధీభిర్భాగలక్షణా ।**
**త్రికాణ్డేనాపి వేదేన సోఽయమర్థో వినిశ్చితః ॥ 57**

**ప్ర :** ఇయం భాగలక్షణా = ఈ భాగలక్షణ (జహదజహలక్షణ) యను అర్థాన్వయపద్ధతి, శబ్దమును స్వీకరించి శబ్దవాచ్యార్థమును నిరాకరించుట (భాగత్యాగము), సుధీభిః = పండితులచే, స్వ+ఆత్మ+ఐక్య+అర్థమ్ = జీవాత్మపరమాత్మల ఐక్యతను తెల్పుటకు, ప్రోక్తా = చెప్పబడినది, త్రికాణ్డేన వేదేన అపి = మూడు కాండలుగల వేదము చేతగూడ, సః అయం అర్థః = ఆ యీ అర్థమే, వినిశ్చితః = విశిష్టముగా నిశ్చయింపబడినది.

**తా :** భాగలక్షణ అనబడు యీ అర్థాన్వయపద్ధతిని జీవాత్మపరమాత్మల ఏకత్వమును చెప్పుటకై పండితులు సూచించిరి. దీనినే కర్మజ్ఞానవైరాగ్యములను మూడు విషయములను బోధించు వేదము సమర్థించుచున్నది.

**శ్లో॥ స్థూలధీభిః సుదుర్జ్ఞేయో విజ్ఞేయో హి మనీషిభిః ।**
**పర్యవస్యన్తి వేదాద్యా అత్రైవ వివిధా అపి ॥ 58**

**ప్ర :** స్థూలధీభిః = మందబుద్ధులచేత, సుదుర్జ్ఞేయః = తెలిసికొనుటచాలా కష్టమైనది, మనీషిభిః = పండితులచేత, విజ్ఞేయః హి = తెలియదగినదే, వేద+ఆద్యాః = వేదము మొదలైన, వివిధాః అపి = భిన్న భిన్నములుగా ఉన్నను, అత్ర ఏవ = ఈ నిర్ణయమునకే, పర్యవస్యన్తి = త్రోవజూపుచున్నవి.

**తా :** మందబుద్ధుల కిది తెలిసికొనుట కష్టమైనది, పండితులకు తెలియదగినది. వేదము మొదలగు శాస్త్రములు ఈ నిర్ణయమునే సమర్థించుచున్నవి.

**శ్లో॥ శాస్త్రతత్త్వమవిజ్ఞాయ మూఢాః శాస్త్రాణి సర్వశః ।**
**తే ప్రవృత్తిపరాణ్యేవ కథయన్తి కుతర్కతః ॥ 59**

**ప్ర :** శాస్త్రతత్త్వమ్ = శాస్త్రములలోని సూక్ష్మసత్యమును, అవిజ్ఞాయ = తెలిసికొనక, సర్వశః = అన్ని విధముల, శాస్త్రాణి = శాస్త్రములు, ప్రవృత్తిపరాణి ఏవ = ఐహికభోగముల గూర్చి చెప్పునవియని, కుతర్కతః = వితండవాదముతో, తే మూఢాః = ఆ మూర్ఖులు, కథయన్తి = చెప్పుచున్నారు.

**తా :** శాస్త్రముల సూక్ష్మార్థమును తెలియని మూర్ఖులు శాస్త్రములు అన్ని విధములను లౌకిక విషయములనే బోధించు చున్నవని వితండవాదము చేయుచున్నారు.

**శ్లో॥ ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతా ఫలమ్ ।**
**అర్థవాదోపపత్తీ చ లిఙ్గం తాత్పర్యనిర్ణయే ॥ 60**

**ప్ర :** ఉపక్రమ = ఉపక్రమము, ఉపసంహారౌ = ఉపసంహారము అను రెండును, అభ్యాసః = అభ్యాసము, సాధన, అపూర్వతా = నవ్యత, ఫలమ్ = ప్రయోజనము, అర్థవాద+ఉపపత్తీ చ = అర్థవాదము, ఉపపత్తియను, తాత్పర్యనిర్ణయే = తాత్పర్యనిర్ణయములో, లిఙ్గమ్ = గుర్తు.

**తా :** ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము లేక ప్రశంస, ఉపపత్తి అనునవి తాత్పర్యనిర్ణయమున లింగములు లేక గుర్తులు.

**శ్లో॥ ప్రాక్ సదేవేత్యుపక్రమ్యైతదాత్మ్యమిదమేవ సత్ ।**
**ఉపసంహృతమిత్యేకమభ్యాసో నవధా పరమ్ ॥ 61**

**ప్ర :** ప్రాక్ = మొదట, సత్+ఏవ+ఇతి+ఉపక్రమ్య = సత్ లేక సత్పదార్థము లేక వస్తువు అని ప్రారంభించి, ఏతద్+ఆత్మ్యం+ఇదం+ఏవ = ఈ ఆత్మసంబంధియగు ఇదియే (జగత్తే), సత్ = సత్పదార్థము, వస్తువు, ఉపసంహృతమ్ = ఉపసంహరించబడినది, ఒకచో కూర్చబడినది, ఇతి = అని, ఏకమ్ = ఒక లింగము, గుర్తు, నవధా = క్రొత్తగా యేర్పబడిన, పరమ్ = పరమమైన ఆత్మ (బ్రహ్మ), అభ్యాసః = అభ్యాసము.

**తా :** మొదట ఉపక్రమ ఉపసంహారములు అనగా, ఈ జగత్తు సద్వస్తువు (బ్రహ్మము) అని ప్రతిపాదించి, ఇది ఆత్మ సంబంధి యని హేతువుల గూర్చు ప్రక్రియ. ఈ జగత్తు పరమమే నవ్యమైనది అని విచారించుట అభ్యాసము.

**శ్లో॥ శాబ్దేనైవ హ్యఖణ్డార్థవిషయత్వం తృతీయకమ్ ।**
**తుర్యం విదేహకైవల్యం ప్రారబ్ధాన్తే వివేకినః ॥ 62**

**ప్ర :** శాబ్దేన+ఏవ హి = శబ్దసంబంధమైనదానిచేతనే, అఖణ్డార్థవిషయత్వమ్ = అగోచరమైన అఖండబ్రహ్మమును గ్రహించుట, తృతీయకమ్ = **అపూర్వత** అనబడు మూడవ లింగము, తుర్యమ్ = నాల్గవదైన ఫలము అను లింగము, వివేకినః = వివేకవంతునకు, ప్రారబ్ధాన్తే = ప్రారబ్ధకర్మఫల భోగము తరువాత, విదేహకైవల్యమ్ = విదేహముక్తి, మరణానంతరముక్తి.

**తా :** బ్రహ్మమఖండమను సత్యము జగత్తు బ్రహ్మము అనుటకు ప్రత్యక్షత లేదు కనుక అది శాస్త్ర ప్రమాణమున అంగీకరించుట అనునది అపూర్వత అనబడు మూడవ లింగము. నాల్గవది ఫలము అనబడునది. ఇది వివేకవంతులకు ప్రారబ్ధ కర్మభోగానంతరము మరణము ప్రాప్తించగా లభించు విదేహముక్తి.

**శ్లో॥ షష్ఠం మృదాదిదృష్టాన్తైర్నిర్ణయస్తూపపత్తికమ్ ।**
**సృష్టిస్థిత్యన్తప్రవేశానియమః శోధనం ఫలమ్ ॥ 63**

**ప్ర :** షష్ఠం తు = ఆరవలింగము, ఉపపత్తికమ్ = ఉపపత్తి అనబడునది, మృత్+ఆది = మృత్తిక

మొదలగు, దృష్టాన్తైః = ఋజువులతో, నిర్ణయః = నిర్ణయము, సృష్టి–స్థితి+అన్త = సృష్టిస్థితి లయములు, ప్రవేశ = పునః సృష్టి, అనియమః = నియమము లేనిదని, శోధనమ్ = పరీక్షించుట, ఫలమ్ = దాని ఫలము.

**తా :** ఆరవలింగము ఉపపత్తి యనునది. మృత్తిక, వస్తురూపభిన్నత ఇత్యాది ఋజువులతో నిర్ణయించుట. **సృష్టిస్థితిలయములు, పునఃసృష్టి ఇత్యాది వానిని శోధనలచే నియతము కాని వనుట ఫలము.**

**శ్లో॥ సప్తార్థవాదాస్తద్రూపం పఞ్చమం లిఙ్గముచ్యతే ।**
**సర్వస్యాత్మన ఉత్పత్తేరవస్థానాచ్చ తత్ర హి ॥ 64**

**ప్ర :** సప్త = ఏడవది, అర్థవాదాః = స్తుతి, నింద, పరకృతి, పురాకల్పము అను నాలుగు విధములైన వాదములు, తద్రూపమ్ = వానిరూపము, పఞ్చమం లిఙ్గం ఉచ్యతే = ఐదవ లింగముగా చెప్పబడును. (ప్రశంస యనునది), సర్వస్య ఉత్పత్తేః = అన్నిటి ఉత్పత్తికి, ఆత్మనః = ఆత్మయొక్క, అవస్థానాత్ = నివాసమగుటచే, తత్ర హి = అచటనే,

**శ్లో॥ పునర్లయాజ్జగౌ వేదః కారణబ్రహ్మమాత్రతామ్ ।**
**సూర్యస్యేవ జలే చాత్ర ప్రవేశమపి చాత్ర తు ॥ 65**

**ప్ర :** వేదః తు = వేదమున్నూ, పునః = మరల, లయాత్ = లయమునుండి, కారణబ్రహ్మమాత్రతామ్ = సృష్టికారణమాత్రమైన మూర్తిత్రయబ్రహ్మను, జగౌ = చెప్పినది, జలే = జలమునందు, సూర్యస్య = సూర్యునియొక్క, ప్రవేశం ఇవ = ప్రవేశము వలె, అత్ర చ = అచట గూడ, అత్ర అపి చ = ఇచట కూడ.

**తా :** ఏడవది అర్థవాదము. ఈ వాదముల రూపమే ఐదవదైన ప్రశంస యను లింగముగ చెప్పబడినది. అన్నిటికి ఉత్పత్తిస్థానము ఆత్మయే, అత్మయే నివాసము. లయమునుండి పునః సృష్టికి మూలము కారణబ్రహ్మయని వేదోక్తి. జలములో సూర్యుని ప్రతిబింబమున్నది కదా. సూర్యుడు జలములో ప్రవేశించెనా? అనగా, ఆకాశపు సూర్యుడే జలములోని సూర్యునకు కారణము కదా. అట్లే, పరబ్రహ్మ కారణబ్రహ్మయై సృష్టిలో ప్రవేశించినాడు, అని వేదమనును.

**శ్లో॥ అన్తర్యామితయా భేదాత్సదా నియమనం స్మృతమ్ ।**
**తథా రోహితరూపాద్యైః పదార్థపరిశోధనమ్ ॥ 66**

**ప్ర :** అన్తర్యామితయా = అన్తర్యామిత్వముచేత, భేదాత్ = భేదమునుండి, సదా = ఎల్లపుడు, నియమనమ్ = నియమించుట, స్మృతమ్ = తలచబడినది, తథా = అట్లు, రోహితరూప+ఆద్యైః = ఎఱ్ఱనిరూపము మొదలగు వానిచే, పదార్థపరిశోధనమ్ = పదార్థముల పరీక్ష.

**తా :** పదార్థములలో భిన్నత్వము ప్రత్యక్షము. ఐనను యీ రూపభిన్నత్వములో, అనేకత్వములో అన్తర్యామియై ఆత్మరూపమున పరమాత్మ దర్శింపబడినది, ఇది ఫలము.

**శ్లో॥ అభేదజ్ఞానస్య పరం స్వాత్మైక్యమమృతం ఫలమ్ ।**
**ఏవం సప్తార్థవాదాత్మలక్షణం పఞ్చమం మతమ్ ॥ 67**

ప్ర : అభేదజ్ఞానస్య = జీవాత్మపరమాత్మలకు భేదము లేదు అను ఎఱుకకు, పరం ఫలమ్ = పరమఫలము, స్వ+ఆత్మ+ఐక్యం+అమృతమ్ = అమృతమయముగా జీవుడు తన ఆత్మను పరమాత్మయందు, లేక బ్రహ్మమునందు, లేక సద్వస్తువునందు లీనముచేయుట, ఏవమ్ = ఈ విధముగా, సప్త+అర్థవాద+ఆత్మలక్షణమ్ = ఉపక్రమమాదిగా గల ఏడు అర్థవాదములకు ఆత్మలక్షణమును స్థాపించుట యనునది, పఞ్చమమ్+ఫలము అనబడు అయిదవ ప్రయోజనముగా, మతమ్ = గ్రహించబడినది.

**తా :** జీవాత్మ పరమాత్మల ఏకత్వజ్ఞానమే పరమఫలము. ఈ జ్ఞానము వలన జీవలక్షణములు ఆత్మతత్త్వమున లీనమై అమృతత్వము సిద్ధించును. ఇదియే అర్థవాదములలో ఫలము అని చెప్పబడినది.

**శ్లో॥ షడ్లిఙ్గైరితి తాత్పర్యావధృతిః శ్రవణం స్మృతమ్ ।**
**ఆస్థాయాథో యోగభూమిం మననాది చరేద్బుధః ॥ 68**

ప్ర : షడ్లిఙ్గైః = ఆరు లింగములచేత, తాత్పర్య+అవధృతిః = అర్థనిర్ధారణ, ఇతి = అని, శ్రవణమ్ = శ్రవణమనబడు సాధన, స్మృతమ్ = తలంచబడినది, అథో = అటుపై, యోగభూమిమ్ = యోగమునకు తగిన ఆధారమును, ఆస్థాయ = సిద్ధపరచి, మనన+ఆది = మననము మొదలగునవి, అనగా శ్రవణమునుండి మననము, అటనుండి నిదిధ్యాసనము, ఈ రీతిగా క్రమమున, బుధః = పండితుడు, చరేత్ = చేయును.

**తా :** సాధకుడు తాను వినిన శాస్త్రములకు అర్థనిర్ధారణ చేయుటతో శ్రవణప్రక్రియ సంపన్నమగును. ఈ రీతిగా యోగసాధనకు ఆధారమును సిద్ధపరచి బుద్ధిశాలి మననాది అన్య పద్ధతులను క్రమముగ ఆచరించును.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం చతుర్థాష్టకే ప్రథమాధ్యాయః ॥

ఓమ్ శం

**వింశత్యర్ణో దత్తాత్రేయమన్త్రః**
**ఓం ఐం క్లాం క్లీం క్లూం హ్రాం హ్రీం హ్రూం సౌః శ్రీవిష్ణవే దత్తాత్రేయాయ స్వాహా ॥**

శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## చతుర్థాష్టకము - ద్వితీయాధ్యాయము

**శ్లో॥ మహీ మహేశ! యోగస్య మయాఽఽస్థేయా కథం వద ।**
**ఇతి పృష్టోఽర్జునేనాహ సాఙ్గం యోగం త్ర్యధీశ్వరః ॥ 1**

**ప్రతిపదార్థం :** మహేశ! = ఓ మహేశ్వర!, యోగస్య మహీ = యోగభూమి, మయా = నాచే, కథమ్ = ఎట్లు, ఆస్థేయా = స్థిరపరచదగియున్నది?, వద = చెప్పుము, ఇతి పృష్టః = ఇట్లడుగబడినవాడై, త్ర్యధీశ్వరః = త్రిలోకాధిపతియైన శ్రీదత్తుడు, అర్జునేన = కార్తవీర్యార్జునునితో, సాఙ్గం యోగమ్ = సాఙ్గయోగమును గూర్చి, ఆహ = చెప్పెను.

**తాత్పర్యము :** ఓ మహేశ్వరా! యోగభూమిని నేనెట్లు స్థిరపరచదగునో వివరింపుడని కార్తవీర్యార్జునుడు కోరగా, శ్రీదత్తుడు వానికి సాంగముగ యోగమును వివరించెను.

**శ్లో॥ అష్టాఙ్గో యోగ ఇత్యేకే షడఙ్గ ఇతి చాపరే ।**
**విసంవాదో నోభయత్ర శృణు తత్త్వం బ్రవీమి తే ॥ 2**

**ప్ర :** యోగః = యోగము, అష్టాఙ్గః = ఎనిమిది అవయవములు గలది, ఇతి = అని, ఏకే = ఒక మతము, షట్+అఙ్గః = ఆరు అవయవములు గలది, ఇతి = అని, అపరే చ = మరియొక వాదమున్నూ, ఉభయత్ర = రెండు వాదములలో, న విసంవాదః = విరోధము లేదు, తత్త్వమ్ = సూక్ష్మసత్యమును, తే = నీకు, బ్రవీమి = చెప్పుదును, శృణు = వినుము.

**తా :** యోగము అష్టాంగమని కొందరు, షడంగమని మరికొందరు అందురు. ఈ రెండు వాదములకు విరోధము లేదు. ఆ సూక్ష్మమును నీకు వివరింతును. వినుము.

**శ్లో॥ అష్టాఙ్గయోగో యమాద్యైః షడంగస్త్వాసనాదిభిః ।**
**యమానాం నియమానాం చ స్వభావేన విధానతః ॥ 3**

**ప్ర :** యమాద్యైః = యమము మొదలుగాగల వానితో, అష్టాఙ్గయోగః = అష్టాంగయోగము,

షడంగస్తు = షడంగయోగమేమో, ఆసనాదిభిః = ఆసనము మొదలుగా గలది, యమానాం నియమానాం చ = యమముల, నియమములయొక్కయు, స్వభావేన = స్వభావముచేత, విధానతః = కూర్చబడినందువలన.

**తా :** యోగాంగము లెన్మిది : 1. యమము, 2. నియమము, 3. ఆసనము, 4. ప్రాణాయామము, 5. ప్రత్యాహారము, 6. ధారణ, 7. ధ్యానము, 8. సమాధి. వీనిలో యమనియమములను లెక్కించకుండ, ఆసనముతో మొదలిడి లెక్కించిన షడంగయోగమగును. ఐనను, వాని స్వభావముచేత యమనియమములు మిగతవానిలో కలిసియే యున్నవగుటవలన లెక్కలో భేదముతప్ప లోపించిన విషయమేమియు లేదు.

**శ్లో॥ ఆసనాదిః షడఙ్గోఽతః సప్తాఙ్గం కేచనాబ్రువన్ ।**
**సప్తాఙ్గాని సమాధిస్తు ఫలమేవేతి తన్మతమ్ ॥ 4**

**ప్ర :** అతః = అందువలన, ఆసనముతో మొదలగుటచేత, షడఙ్గః = (యోగము) షడంగము (ఆరు అవయవములు కలది), కేచన = కొందరు, సప్తాఙ్గమ్ = ఏడు అంగములు గలదిగా, అబ్రువన్ = చెప్పిరి, సమాధిస్తు = సమాధియేమో, ఫలం+ఏవ = ఫలమే, ఇతి = అని, సప్త+అఙ్గాని = ఏడు అంగములే, తత్+మతమ్ = వారి మతము.

**తా :** ఆసనముతో మొదలిడి ఆరు అంగములే యోగమునకు. కొందరు ఏడు అంగములుగా పేర్కొందురు. సమాధి యనునది యోగసాధనకు ఫలమేగాని అంగము కాదని, అట్లు యోగము సప్తాంగమే యని వారి మతము.

**శ్లో॥ సమాధిం ద్వివిధం మత్వా సవికల్పావికల్పకమ్ ।**
**అఙ్గేష్వేకం సమాదాయ ద్వితీయం ఫలముచ్యతే ॥ 5**

**ప్ర :** సమాధిమ్ = సమాధియను అంగమును, ద్వివిధమ్ = రెండు విధములుగా, సవికల్పం+అవికల్పమ్ = సవికల్పము, నిర్వికల్పము అని, మత్వా = తలచి, ఏకమ్ = ఒకదానిని, అఙ్గేషు = అంగములందు, సమాదాయ = లెక్కగట్టి, ద్వితీయమ్ = రెండవది, ఫలమ్ = ఫలముగ, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా :** సమాధి, సవికల్ప – నిర్వికల్ప భేదముతో రెండు విధములుగా విభజించి, అందు మొదటిదైన సవికల్పసమాధిని యోగాంగముగా గుర్తించి, రెండవదైన నిర్వికల్పసమాధిని యోగఫలముగా పేర్కొందురు.

**శ్లో॥ సప్తాఙ్గత్వేఽపి చాష్టాఙ్గయోగమిత్యూచిరే పరే ।**
**శబ్దతోఽత్రైవ భేదోఽస్తి నాన్యథేతి వినిర్ణయః ॥ 6**

**ప్ర :** సప్తాఙ్గత్వే అపి = అంగములేడేయైనను, అష్టాంగయోగమ్ = అష్టాంగయోగము, ఇతి చ =

అనియే, అనికూడ, పరే = మరికొందరు, ఊచిరే = వర్ణించిరి, అత్ర ఏవ = అందునూ, శబ్దతః = శబ్దమునుబట్టి, భేదః = భేదము, అన్యథా = వేరువిధముగా, న అస్తి = లేదు, ఇతి = అని, వినిర్ణయః = విశేషనిర్ణయము.

**తా :** అంగములేడు అని లెక్క చెప్పినను, అష్టాంగయోగమనియే మరికొందరు పేరిడిరి. ఆ విషయమున, శబ్దమునుబట్టి భేదమే తప్ప వస్తుభేదము లేదని నిర్ణయము.

**శ్లో॥ యమాన్ దశాదౌ సమ్పాద్య నియమాంశ్చ మహావ్రతః ।**
**సుఖాల్లబ్ధ్వాఽఽసనస్థైర్యం ప్రాణాయామం తతోఽభ్యసేత్ ॥ 7**

**ప్ర :** ఆదౌ = మొదట, దశ యమాన్ = అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, దయ, ఆర్జవము, క్షమ, ధృతి, మితాహారము, శౌచము అనబడు పది యమములను, నియమాన్ చ = తపస్సు, సంతోషము, ఆస్తిక్యము, దానము, ఈశ్వరపూజనము, సిద్ధాంతశ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము అనబడు పది నియమములను, సంపాద్య = సాధించి, మహావ్రతః = వ్రతదీక్షతో, ఆసనస్థైర్యమ్ = ఆసన స్థిరత్వము, సుఖాత్ = సుఖముగా, లబ్ధ్వా = పొంది, తతః = అంతట, ప్రాణాయామమ్ = ప్రాణాయామసాధనను, అభ్యసేత్ = అభ్యసించవలెను.

**తా :** మొదట పది యమములను, పది నియమములను ఆచరణలో సాధించి మహావ్రతదీక్షతో సుఖముగా స్థిరాసనమున కూర్చుండుటను సాధించి, పిమ్మట ప్రాణాయామ సాధన చేయవలెను.

**శ్లో॥ సమే సుఖేఽజనే దేశే నిఃశబ్దే నిరుపద్రవే ।**
**సుఖాసనే సమాసీనశ్చైలాజినకుశోత్తరే ॥ 8**

**శ్లో॥ సర్వచిన్తాం పరిత్యజ్య ధృతిమాస్థాయ సాత్త్వికీమ్ ।**
**తత్రాభ్యాసం ప్రకుర్వీత యమవానాత్మశుద్ధయే ॥ 9**

**ప్ర :** అజనే = నిర్జనమైన, నిఃశబ్దే = యే ధ్వనులున్నూ లేనిదైన, నిరుపద్రవే = అలజడి లేనిదైన, సమే = ఎత్తుపల్లములు లేని, సుఖే దేశే = సుఖప్రదమైన ప్రదేశమున, ఏలాజినకుశోత్తరే = దర్భలపై జింకచర్మము పఱచిన, సుఖాసనే = సుఖాసనముపై, సమాసీనః = చక్కగ కూర్చున్నవాడై, చ = మరియు, సర్వచిన్తామ్ = చింతలన్నిటిని, పరిత్యజ్య = విడచి, సాత్త్వికీమ్ = సత్త్వగుణ సంబంధమైన, ధృతిమ్ = ధృతిని, ఆస్థాయ = కూడగట్టుకొని, యమవాన్ = యమనియమములను సాధించినవాడు, ఆత్మశుద్ధయే = ఆత్మశుద్ధికొరకు, తత్ర = అచట, అభ్యాసమ్ = సాధనను, ప్రకుర్వీత = చేయదగును.

**తా :** నిర్జన, నిఃశబ్ద, నిరుపద్రవ, సమప్రదేశమున దర్భలు పఱచి దానిపై జింకచర్మమునుంచి ఆ ఆసనముపై సుఖముగ కూర్చుండి, యే చింతయూ లేకుండ సత్త్వగుణసంబంధిధృతిని కలిగి, ముందుగనే యమనియమములను సాధించినవాడు, ఆత్మశుద్ధికై సాధనను ప్రారంభించును.

**శ్లో॥ సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।**
**ఇతస్తతో నైవ పశ్యేత్పశ్యేద్భ్రూమధ్యమేకధీః ॥ 10**

**ప్ర :** కాయ = శరీరము, శిరః = తల, గ్రీవమ్ = మెడ, సమమ్ = నిట్టనిలువుగా, ధారయన్ = నిల్పుచు, అచలమ్ = కదలకుండ, స్థిరః = కుదురుకున్నవాడై, ఇతః+తతః = ఇటునటు, న పశ్యేత్ = చూడక యుండును, ఏకధీః = ఏకాగ్రబుద్ధియై, భ్రూమధ్యమ్ = కనుబొమలమధ్య భాగమును, పశ్యేత్ ఏవ = చూచుచునే యుండును.

**తా :** శరీరము, అనగా వెన్నెముకను, తలను, మెడను, వంపులేకుండ సరళరేఖలోనుంచి (నిటారుగా నుంచి), కదలకుండ, ఇటునటు దిక్కులు చూడకుండ, ఏకాగ్రతతో, తదేకదృష్టితో కనుబొమల మధ్య ప్రదేశమును చూచుచుండును.

**శ్లో॥ పూరకుమ్భకరేచాత్మప్రాణాయామాఖ్యకర్మణి ।**
**దృఢాభ్యాసః ప్రకర్తవ్యో జితే ప్రాణే జితం మనః ॥ 11**

**ప్ర :** పూర = పూరకము, కుమ్భక = కుంభకము, రేచ = రేచకము అనునవి, ఆత్మ = కేంద్రముగా గల, ప్రాణాయామ+ఆఖ్య = ప్రాణాయామము అనబడు, కర్మణి = ప్రక్రియయందు, దృఢ+అభ్యాసః = సడలిపోని సాధన, ప్రకర్తవ్యః = చేయదగినది, జితే ప్రాణే = ప్రాణమును జయించగా, జితం మనసః = మనస్సు ఓడిపోయినదగును.

**తా :** ప్రాణాయామము అను యోగాంగప్రక్రియను పట్టువదలక సాధించదగును. ఏలన, ప్రాణము వశమైన వానికి మనస్సు వశమగును. ఈ ప్రాణాయామప్రక్రియలో మూడు భాగములున్నవి : 1. **పూరకము**, శ్వాసను గుండెల నిండుగ పీల్చుట, 2. **కుంభకము**, పీల్చిన శ్వాసను వదలక అట్టే నిలిపి యుంచుట, 3. **రేచకము**, నిలిపిన శ్వాసను మెల్లగా విడచుట.

**శ్లో॥ వృషావతిబలౌ మత్తౌ సంయుగం సంప్రధావతః ।**
**భవేతాం స్వవశే పాశే శృఙ్గాసక్తే యథైకతః ॥ 12**

**శ్లో॥ తథైవేమౌ మనఃప్రాణౌ యోగాభ్యాసేన సంయతౌ ।**
**జితేఽనయోరేకతరే తౌ ద్వావపి జితౌ ఖలు! ॥ 13**

**ప్ర :** అతిబలౌ = చాల బలముగలవి, మత్తౌ = మదించినవి, వృషౌ = జోడెడ్లు, సంయుగమ్ = జంటగా కాడికి పూన్చబడి, సంప్రధావతః = పరుగిడుచున్నవి, శృఙ్గ+ఆసక్తే = కొమ్ములకు కట్టబడిన, పాశే = పాశముకాగా, యథా = ఎట్లు, ఏకతః = ఒకటిగ, స్వవశే = తన వశము, భవేతామ్ = అగునో, తథా ఏవ = అట్లే, ఇమౌ మనః ప్రాణౌ = మనస్సు ప్రాణము అనబడు ఈ రెండును, యోగాభ్యాసేన = యోగము నభ్యసించుటచేత, సంయుతౌ = కట్టబడినవగును. అనయోః = వీనిలో, ఏకతరే = ఒకటి, జితే = జయించబడగా, తౌ ద్వౌ అపి = ఆ రెండును, జితౌ ఖలు! = జయించబడినవే కదా!

**తా :** బలమైన, మదించిన ఎద్దులు రెండు కాడికి కట్టబడినవి అదుపులేక పడుగిడుచుండ, వాని కొమ్ములకు కట్టబడిన తాళ్ళతో వాని నొకేసారి వశపరచుకున్నరీతిగా, యోగము నభ్యసించుట వలన మనస్సు, ప్రాణము కట్టుబడును. వీనిలో ఒకటి లొంగినచో, రెండవది కూడ లొంగును.

**శ్లో॥ అత్ర సత్కర్మభిః కేచిచ్ఛుద్ధచిత్తా మహాశ్రియః ।**
**స్థిరచిత్తా మదర్చాయాం వశప్రాణా భవన్తి తే ॥ 14**

**ప్ర :** అత్ర = ఆ విషయమున, కేచిత్ = కొందరు, మహాశ్రియః = మహాభాగ్యశాలురు, సత్కర్మభిః = సత్కర్మాచరణచేత, శుద్ధచిత్తాః = నిర్మలమనస్కులై, స్థిరచిత్తాః = ఏకాగ్రమనస్కులై, మత్+ అర్చాయామ్ = నా సేవలో, వశప్రాణాః = వివశులుగా, తే భవన్తి = వారు అగుచున్నారు.

**తా :** ఈ విషయమున కొందరు భాగ్యశాలులు సత్కర్మలు చేసి నిర్మలమైన మనస్సును, ఏకాగ్రతను సాధించి, నా పూజలో లీనమైపోవుచున్నారు.

**శ్లో॥ అఙ్గాని ధారణాదీని తేఽభ్యసన్తి మహావ్రతాః ।**
**అన్యేఽసుయామతః ప్రాణమనోజయమభీప్సవః ॥ 15**

**ప్ర :** తే మహావ్రతాః = ఆ వ్రతదీక్షితులు, ధారణ+ఆదీని = ధారణ మొదలుగా గల, అఙ్గాని = యోగాంగములను, అభ్యసన్తి = సాధనచేయుచున్నారు. అన్యే = ఇతరులు, అసుయామతః = ప్రాణాయామసాధనవలన, ప్రాణమనోజయమ్ = ప్రాణములను, మనస్సును జయింపవలెనని, అభీప్సవః = కోరుకొనువారు.

**తా :** అట్టి వ్రతదీక్షితులు ధారణ మొదలగు యోగాంగములను సాధన చేతురు. మరికొందరు ప్రాణాయామముద్వారానే మనస్సును ప్రాణములను జయింపజూతురు.

**శ్లో॥ ప్రాణస్పన్దనిరోధో హి ప్రాణాయామ ఇతీర్యతే ।**
**ఇడయా ప్రాణమాపూర్య కుమ్భయిత్వా పునర్బహిః ॥ 16**

**శ్లో॥ క్షిపేత్పిఙ్గలయాపూర్య ప్రాణం పూర్వవదాచరేత్ ।**
**విపరీతేన వా యుఞ్జ్యాద్బహిర్వా కుమ్భయేత్తథా ॥ 17**

**ప్ర :** ప్రాణస్పన్దనిరోధః హి = శ్వాస కదలికలను నిలిపివేయుటే, ప్రాణాయామః ఇతి = ప్రాణాయామము అని, ఈర్యతే = చెప్పబడుచున్నది, ఇడయా = ఇడానాడి ద్వారా, ఎడమ ముక్కు పుటమునుండి, ప్రాణమ్ = గాలిని, ఆపూర్య = లోపలకు పీల్చి నింపి, కుమ్భయిత్వా = అట్టే నిల్పియుంచి, పునః = మరల, బహిః = వెలుపలకు, పిఙ్గలయా = పింగళ యను నాడిద్వారా, కుడిముక్కుపుటము నుండి, క్షిపేత్ = విడువవలయును, ప్రాణమ్ =గాలిని, అపూర్య = పీల్చి, పూర్వవత్ = ముందటివలె, ఆచరేత్ = చేయవలెను, విపరీతేన వా = లేక, విరుద్ధమైన పద్ధతిలో, బహిః వా = వెలుపలనైన, యుఞ్జ్యాత్ = కలుపవలెను, తథా = అట్లు, కుమ్భయేత్ = నింపవలెను.

**తా :** శ్వాస కదలికలను నిలిపివేయుటే ప్రాణాయామము అందురు. ఇడా అనబడు ఎడమ ముక్కుపుటము నుండి గాలిని లోనికి పీల్చి, ఆ గాలితో ఊపిరితిత్తులు నిండుగా నింపి అట్టే కొంతకాలము వదలక నిలిపి, తరువాత మెల్లగా కుడిముక్కుపుటము నుండి (పింగళ) వదలివేయవలయును. దీనిని పూరక, కుంభక, రేచక ప్రక్రియలందురు. మరల ఇట్లే కుడిముక్కుతో పీల్చి, నిల్పి, ఎడమముక్కు నుండి వదలవలయును గూడ. లేదా, వదలిన శ్వాసను, అట్టే పీల్చక (కుంభకము వలె), ఊపిరి బిగబట్ట వచ్చును.

**శ్లో॥ పూరో ద్వాదశమాత్రాభిర్ద్విగుణాభిశ్చ రేచకః ।**
**కుమ్భశ్చతుర్గుణాభిశ్చ విధేయో బన్ధపూర్వకః ॥ 18**

**ప్ర :** పూరః = పూరకము, ద్వాదశమాత్రాభిః = పంౘ్రెండు మాత్రల కాలమున్నూ, రేచకః = రేచకము, ద్విగుణాభిః చ = రెట్టింపు (ఇరువది నాలుగు మాత్రల) కాలమున్నూ, కుమ్భకః = కుంభకము, చతుర్గుణాభిః చ = నాల్గింతలు (నలుబది యెన్మిది మాత్రల) కాలమున్నూ, బన్ధపూర్వకః = ఒక పద్ధతిలో, విధేయః = చేయదగినది.

**తా :** ప్రాణాయామ కాలవ్యవధి, ఒక ఆవృతికి 84 మాత్రలు. ఇందు పూరకము 12 మాత్రలు, రేచకము 24 మాత్రలు, కుంభకము 48 మాత్రలు.

**శ్లో॥ యథా యథా ప్రాణజయో మాత్రావృద్ధిస్తథా తథా ।**
**పిణ్డశుద్ధిస్తయా జ్ఞేయా వాతపిత్తకఫాన్తకా ॥ 19**

**ప్ర :** యథా యథా = ఏ రీతిగా, ప్రాణ జయః = శ్వాస అదుపులోనికి వచ్చునో, తథా తథా = ఆ రీతిగా, మాత్రావృద్ధిః = ప్రాణాయామావృతి కాలము మాత్రలలో పెరుగుచుండును. తయా = ప్రాణాయామముచే, పిణ్డశుద్ధిః = కాయశుద్ధిగా, వాతపిత్తకఫాన్తకా = వాతము, పిత్తము, కఫము అనబడు దోషములు హరించునదిగా, జ్ఞేయా = తెలియదగును.

**తా :** శ్వాసనియంత్రణ స్వాధీనమైన కొలది, క్రమముగా పూరక, కుంభక, రేచక, ప్రక్రియల కాలవ్యవధి పెరుగుచుండవలెను. దీనివలన శరీరతత్త్వములోని వాతపిత్తకఫదోషములు నశించును.

**శ్లో॥ నాడీద్వారాణి సర్వాణి నిర్మలాని భవన్త్యతః ।**
**నీరోగో జాయతే యోగీ క్రమాభ్యాసేన యత్నతః ॥ 20**

**ప్ర :** అతః = అందువలన, సర్వాణి నాడీద్వారాణి = నాడీద్వారములన్నియు, నిర్మలాని భవన్తి = నిర్మలము లగును, యోగీ = యోగి, యత్నతః = ప్రయత్నపూర్వకముగా, క్రమాభ్యాసేన = ఒక పద్ధతిలో సాధన చేయుటతో, నీరోగః = రోగరహితుడుగా, జాయతే = అగును.

**తా :** అందువలన నాడీముఖములన్నియు మలినము లేకుండ శుభ్రమగును. యోగి ప్రయత్నముతో పద్ధతి దప్పక సాధన జేసినచో, రోగము లేనివాడగును.

**శ్లో॥ నిర్బీజశ్చ సబీజశ్చ ప్రాణాయామో ద్విధా మతః ।**
**నిర్బీజః కేవలో రోధః సబీజో జపయుక్ శుభః ॥ 21**

**ప్ర :** నిర్బీజః చ = నిర్బీజమున్నూ, సబీజః చ = సబీజమున్నూ, అని, ద్విధా = రెండు విధములుగా, ప్రాణాయామః = ప్రాణాయామము, మతః = తలచబడినది, నిర్బీజః = నిర్బీజమనునది, కేవలః రోధః = శ్వాసను నిల్పుట మాత్రమే, సబీజః = సబీజమనునది, జపయుక్ = మంత్రజపముతో కూడినది, శుభః = శుభమైనది.

**తా :** ప్రాణాయామము రెండు విధములు : 1. నిర్బీజము, 2. సబీజము. వీనిలో నిర్బీజమనునది శ్వాసను నిరోధించుట మాత్రమే. సబీజమనునది మంత్రజపముతో జతగా సాగునది. శుభఫలము లిచ్చునది.

**శ్లో॥ లీనః సపఞ్చవిపలద్విపలం బ్రహ్మరన్ధ్రగః ।**
**ప్రాణః సుషుమ్ణయా ప్రోక్తః ప్రాణాయామః స ఉత్తమః ॥ 22**

**ప్ర :** ప్రాణః = ప్రాణము, సుషుమ్ణయా = సుషుమ్ణానాడితో, బ్రహ్మరన్ధ్రగః = బ్రహ్మరంధ్రమును చేరినదై, సపఞ్చవిపలద్విపలమ్ = 2 5/6 పలముల కాలప్రమాణము, అనగా 2 నిమిషముల 50 సెకనులు, లీనః = అందు తాదాత్మ్యమైన, ప్రాణాయామః = ప్రాణాయామము, సః = అది, ఉత్తమః ప్రోక్తః = ఉత్తమమని చెప్పబడినది.

**తా :** బ్రహ్మరంధ్రమున సుషుమ్ణానాడిలో 2 పలముల 5 విపలముల కాలము లీనమైనచో, అట్టి ప్రాణాయామము ఉత్తమమనబడినది.

**శ్లో॥ ఇన్ద్రియాణి జితే ప్రాణే విషయేభ్యః ప్రయత్నతః ।**
**మనసోపాహరేద్ధీరః ప్రత్యాహారః స ఉచ్యతే ॥ 23**

**ప్ర :** ప్రయత్నతః = సాధనవలన, విషయేభ్యః = విషయములనుండి, ఇన్ద్రియాణి = ఇంద్రియములను, ప్రాణే జితే = ప్రాణములు వశపరచుకొనబడగా, మనసా = మనస్సుచేత, ఉపాహరేత్ = లోబరచుకొనునో, సః ధీరః = అట్టి ధీరుడు, ప్రత్యాహారః ఉచ్యతే = ప్రత్యాహారము గలవాడు అనబడును.

**తా :** ప్రాణమును జయించిన ధీరుడు, సాధనవలన మనస్సుతో ఇంద్రియములను వాని విషయములనుండి ఉపసంహరించినచో, ఆ ప్రక్రియకు ప్రత్యాహారమని పేరు.

**శ్లో॥ యథా సంహరతేఽఙ్గాని సుఖాత్కూర్మస్తథాప్యయమ్ ।**
**అర్థేభ్యః సమనస్కాఙ్గాః ప్రత్యాహారస్తదోత్తమః ॥ 24**

**ప్ర :** యథా = ఎట్లు, అఙ్గాని = ఇంద్రియములను, సుఖాత్ = సుఖమునుండి, సంహరతే =

వేరుచేయునో, తథా అపి = అట్లే, అయమ్ = ఇది, కూర్మః = కూర్మము, గాః = ఇంద్రియముల, అర్థేభ్యః = వాని విషయములవలన, సమనస్కాః = మనస్సు చలించకుండునో, తదా = అప్పుడు, ప్రత్యాహారః = ప్రత్యాహారము, ఉత్తమః = ఉత్తమము.

**తా :** ఇంద్రియములను వాని సుఖములనుండి వెనుకకు మరలించగా, ఆ స్థితిని కూర్మము అందురు. ఇంద్రియములను వాని విషయములపట్ల ఉద్రిక్తత చెందకుండ ప్రశాంతముగ నుంచినచో అది ప్రత్యాహారమునకు ఉత్తమస్థితి యగును.

**శ్లో॥ కార్యాథ ధారణా సాఽఽపి ద్వివిధా పరికీర్తితా ।**
**సగుణాగుణభేదేన మనసః స్థిరతాఽఽత్మని ॥ 25**

**ప్ర :** అథ = పిమ్మట, ధారణా = ధారణ యను ప్రక్రియ, కార్యా = చేయదగినది, సా అపి = అదియును, సగుణ+అగుణ భేదేన = గుణముల (సత్త్వరజస్తమస్సుల) తో కూడినది, అగుణ = గుణసంబంధము లేనిది అను భేదముతో, ద్వివిధా = రెండు విధములయిన, ఆత్మని = ఆత్మయందు, మనసః = మనస్సుయొక్క, స్థిరతా = స్థిరత్వముగా, పరికీర్తితా = వివరింపబడినది.

**తా :** అటుపై, ధారణ అభ్యసింపదగినది. ఇది ఆత్మయందు మనస్సును స్థిరము చేయుట. ఇదియు రెండు విధములు : సగుణము, అగుణము.

**శ్లో॥ తతో ధ్యానం త్విదం కార్యం విక్షిప్తం మన ఆత్మని ।**
**అభ్యాసేన స్థిరీకుర్యాత్పునః పునరభేదతః ॥ 26**

**ప్ర :** తతః = అటనుండి, ధ్యానమ్ = ధ్యానము, ఇదం తు = ఇదియేమో, కార్యమ్ = చేయదగును, ఆత్మని = ఆత్మయందు, మనః = మనస్సును, నిక్షిప్తమ్ = ఉంచి, అభ్యాసేన = అభ్యాసము, సాధనతో, అభేదతః = భేదము లేకుండ, పునః పునః = మరల మరల, స్థిరీకుర్యాత్ = నిశ్చలము చేయవలెను.

**తా :** ఆపై ధ్యానము చేయదగును. మనస్సును ఆత్మయందు నిల్పి మరల మరల సాధనతో స్థిరము చేసి, ఆత్మతో అభేదముగా చేయవలెను.

**శ్లో॥ ధ్యానం ప్రాగ్ధారణా పశ్చాత్కేఽపీచ్ఛన్తి న తద్వరమ్ ।**
**ధ్యానం హ్యుపసమాధీతి సమాధిర్యానవిస్మృతిః ॥ 27**

**ప్ర :** ధ్యానమ్ = ధ్యానము, ప్రాక్ = ముందు, పశ్చాత్ = తరువాత, ధారణా = ధారణ అని, కే = కొందరు, ఇచ్ఛన్తి అపి న తత్ వరమ్ = అంతకు మించి శ్రేష్ఠమైన స్థితిని కొందరు కోరుకొనరు కూడ, ధ్యానమ్ = ధ్యానము, ఉపసమాధి హి = ఉపసమాధియే, ఇతి = అని, సమాధిః = సమాధియనునది, యాన విస్మృతిః = కదలిక లేకుండుట.

**తా :** ముందు ధ్యానము, తరువాత ధారణ అని కొందరి మతము. వారు అంతకు మించిన

స్థితిని కోరరు. ధ్యానము ఉపసమాధియే అని వీరి మతము. సమాధి అనునది ధ్యానము నిశ్చలమగుట మాత్రమే అని వీరందురు.

**శ్లో॥ ద్వాదశద్వాదశగుణా వృద్ధిః ప్రాణలయస్య యా ।**
**ప్రాణాయామాది చత్వారి యోగాఙ్గానీతి కేచన ॥ 28**

**ప్ర :** ప్రాణలయస్య = ప్రాణము (శ్వాస) నిల్పివేయుట యొక్క, యా వృద్ధిః = యే పురోగతి, ద్వాదశ ద్వాదశ గుణా = పండ్రెండు పండ్రెండురెట్లుగా నుండునో, ప్రాణాయామ+ఆది చత్వారి = ప్రాణాయామము మొదలుగా నాలుగు, అనగా ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యానములను నాలుగు, యోగాఙ్గాని ఇతి = యోగాంగము లని, కేచన = కొందరు.

**తా :** శ్వాసను నిల్పు కాలప్రమాణమున పండ్రెండు పండ్రెండు రెట్లుగా వృద్ధి సాధింపదగినది. ప్రాణాయామము మొదలుకొని యోగాంగములు నాలుగని కొందరి మతము.

**శ్లో॥ ఏవం ద్విషడ్దినైః సాధ్యః సమాధిర్ద్వివిధః స చ ।**
**సవికల్పో నిర్వికల్పో ధర్మమేఘః సదేవ హి ॥ 29**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగా, ద్విషట్+దినైః = పండ్రెండు దినములతో, సాధ్యః = సాధింపదగినది, సమాధిః = సమాధి, ద్వి-విధః = రెండు విధములు, సః చ = అదియును, సవికల్పః = సవికల్పము, నిర్వికల్పః = నిర్వికల్పము అయిన, సః ధర్మమేఘః = ఆ ధర్మమేఘము, సత్+ఏవ హి = సత్స్వరూపమే గదా!

**తా :** ఈ విధముగా పండ్రెండు దినములలో సాధింపదగిన సమాధి యనునది సవికల్పము, నిర్వికల్పము అని రెండు విధములైన ఆ ధర్మమేఘము సత్స్వరూపమే గదా!

**శ్లో॥ ప్రాణాయామాదిభిశ్చిత్తే సుస్థిరే మననక్షమే ।**
**యోగీ విశ్రుతవాక్యార్థమననం శ్రద్ధయా చరేత్ ॥ 30**

**ప్ర :** ప్రాణాయామ+ఆదిభిః = ప్రాణాయామము మొదలగు వానిచే, సుస్థిరే చిత్తే = మనస్సు సుస్థిరము కాగా, మననక్షమే = మనన సమర్థముకాగా, యోగీ = యోగి, విశ్రుత = విశేషముగ వినబడు, వాక్యార్థమననమ్ = వాక్యములయొక్క అర్థమును మననము చేయుట, శ్రద్ధయా = శ్రద్ధగా, చరేత్ = ఆచరించవలెను.

**తా :** ప్రాణాయామాదుల సాధనచే మనస్సు సుస్థిరము. మననసమర్థము కాగా, యోగి తాను వినిన చదివిన శాస్త్రవాక్యముల అర్థమును మననము చేయవలెను.

**శ్లో॥ పరాత్మచిన్తనం వేదావిరుద్ధాభిశ్చ యుక్తిభిః ।**
**అఖణ్డయా మనోవృత్త్యా మననం తత్ప్రచక్షతే ॥ 31**

**ప్ర :** వేద+అవిరుద్ధాభిః = వేదమునకు విరుద్ధము కాని, యుక్తిభిః = ఉపాయములచే,

పరాత్మచిన్తనమ్ = పరమాత్మను స్మరించుట, చ = మరియు, అఖణ్డయా మనోవృత్త్యా = ఎడలేని మనోవృత్తితో గూడి, మననమ్ = మననముగా, తత్ = అది, ప్రచక్షతే = చెప్పబడును.

**తా :** వేదమునకు వ్యతిరేకముగాని ఉపాయములతో ఎడలేని మనోవృత్తిచే పరమాత్మను స్మరించుటను మననము అని చెప్పుదురు.

**శ్లో॥ సమాధిః సవికల్పో యస్తన్నిదిధ్యాసనం విదుః ।**
**విజాతీయప్రత్యయస్య నిరాసేనైవ సర్వథా ॥ 32**

**ప్ర :** యః = ఏది, సవికల్పః సమాధిః = సవికల్పసమాధియో, తత్ = దానిని, నిదిధ్యాసనం విదుః = నిదిధ్యాసనముగా తెలియుదురు, అది, విజాతీయ ప్రత్యయస్య = తనకు భిన్నమైన జాతిలక్షణముగల దానియొక్క, నిరాసేన ఏవ = తిరస్కరణచేత మాత్రమే, సర్వథా = అన్ని విధములుగా,

**శ్లో॥ సజాతీయప్రత్యయస్య ప్రవాహీకరణం తు యత్ ।**
**అఖణ్డతైలధారావత్తన్నిదిధ్యాసనం స్మృతమ్ ॥ 33**

**ప్ర :** సజాతీయ ప్రత్యయస్య = తనకు అనుకూల లక్షణముగలదానిని, అఖణ్డతైలధారావత్ = తెరిపిలేక ధారగట్టిన నూనెవలె, ప్రవాహీకరణమ్ = పారించుట, యత్ = యేదియో, తత్ = అది, నిదిధ్యాసనం స్మృతమ్ = నిదిధ్యాసనమనబడును.

**తా :** నిదిధ్యాసనం అనుదానిలో మనస్సునకు సంబంధించిన రెండు గుణముల నియంత్రణము ఒకేసారి జరుగవలయును. ఒకటి, మనస్సు దేనిని ధ్యానించుచున్నదో దానికి వ్యతిరేకమైన ప్రేరణలన్నింటిని తిరస్కరించుట; రెండు, మనస్సు ధ్యానించుచున్న దానికి అనుకూలమైన ప్రేరణలను తైలధారవలె నిరంతరాయముగ లోనికి రానిచ్చుట.

**శ్లో॥ తల్లక్ష్మేదం మహాబాహో! దుర్లభం యత్కుయోగినామ్ ।**
**తత్త్వమస్యాదివాక్యార్థో వినిర్ణీతో యథా పురా ॥ 34**

**ప్ర :** మహాబాహో! = ఓ మహావీరుడా!, కుయోగినామ్ = సద్యోగులు కానివారికి, తత్+లక్ష్మ = ఆ లక్షణముగల, ఇదమ్ = ఇది, దుర్లభమ్ = కష్టసాధ్యము, యథా = ఏ రీతిగా, పురా = ముందుగా, తత్త్వమసి+ఆది = తత్త్వమసి మొదలగు, వాక్యార్థః = వాక్యముల అర్థము, వినిర్ణీతః = నిశ్చయింపబడినదో

**తా :** ఓ మహావీరుడా! సరియగు యోగులు కానివారికి ఆ లక్షణములుగల ఈ ప్రక్రియ కష్టసాధ్యము. ఈ పై జెప్పబడిన లక్షణముల నన్వయించిగాని **తత్ త్వం అసి** మొదలగు ఉపనిషద్వాక్యార్థములు నిశ్చయింపబడినవి.

**శ్లో॥ షడ్లిఙ్గైః శ్రుతినిర్ణీతైర్యః సమ్యగవధారితః ।**
**సులక్షితో లక్షణయా ధారణాభిశ్చ చిన్తితః ॥ 35**

**శ్లో॥ యుక్తిభిర్మననాఖ్యేన ధ్యానేన స్వవశీకృతః ।**
**యోగినాం సోఽవతిష్ఠేత హృది రూఢతమో యదా ॥ 36**

**ప్ర :** శ్రుతినిర్ణీతైః = వేదము విధించిన, షడ్లిఙ్గైః = ఆరులింగములచేత (ఉపక్రమాదులచే) సమ్యక్ = బాగుగ, అవధారితః = గ్రహణశక్తిగలవాడై, లక్షణయా = లక్షణావృత్తిచేత, సులక్షితః = లక్ష్యము నెఱిగినవాడై, ధారణాభిః చ = ధారణలతో గూడ, యుక్తిభిః = సాధనలచే, చిన్తితః = విచారించినవాడై, మనన+ఆఖ్యేన = మననము అను పేరుగల, ధ్యానేన = ధ్యానముతో, స్వవశీకృతః = తన వశమందున్నవాడై, యః = ఎవడో, సః = అట్టివాడు, యోగినామ్ = యోగుల, హృది = హృదయమున, రూఢతమః = అచంచలముగా, యదా అవతిష్ఠేత = ఎప్పుడు నిల్చునో,

**శ్లో॥ సోఽహమాత్మా పరం బ్రహ్మ బ్రహ్మైవాహం పరాత్పరమ్ ।**
**నిత్యం జ్ఞానమనన్తం యచ్ఛుద్ధం బుద్ధమనామయమ్ ॥ 37**

**శ్లో॥ ఆనన్దమయం పూర్ణం మనోవాచామగోచరమ్ ।**
**ఇత్యఖణ్డార్థధీవృత్తిర్దృఢా తన్మననం పరమ్ ॥ 38**

**ప్ర :** సః అహమ్ = అట్టి నేను, ఆత్మా = ఆత్మ, పరం బ్రహ్మ = పరబ్రహ్మము; పరాత్ పరమ్ = పరముకంటె పరమైనది, నిత్యమ్ = శాశ్వతమైనది, అనన్తం జ్ఞానమ్ = అంతులేని జ్ఞానమే తానైనది, శుద్ధమ్ = నిర్మలమైనది, బుద్ధమ్ = బోధిగలది, అనామయమ్ = రోగములేనిది, ఆనన్దమయమ్ = ఆనందము తానైనది, పూర్ణమ్ = స్వయంసమృద్ధమైనది, మనః వాచాం అగోచరమ్ = మనస్సుకు, వాక్కునకు తెలియరానిది, యత్ = యేదియో, (తత్) బ్రహ్మ = ఆ బ్రహ్మము, అహం ఏవ = నేనే, ఇతి = అని, అఖణ్డ+అర్థధీవృత్తిః దృఢా = ఏకైకమైన అర్థమునందు దృఢమైన బుద్ధి గలిగి, తత్ = దానిని, మననమ్ = స్మరించుట, పరమ్ = పరమము, ఉత్తమము.

**తా (శ్లో.35-38):** వేదవిధి ననుసరించి షడ్లింగములచే గ్రహించి, లక్షణావృత్తిచే లక్ష్యార్థమును స్వీకరించి, ధారణలచే సాధనలచే విచారించి మనన మనబడు ధ్యానముతో వశియగునో అట్టివాడు సదా యోగిహృదయములలో నిల్చిపోవును. ఈ స్థితిని సాధించిన నేను ఇహమునకే కాదు పరమునకు గూడ అతీతుడను, శాశ్వతుడను, నిర్మలుడను, జ్ఞానానందమయుడను, పూర్ణుడను, దోషరహితుడను, మనోవాక్కులకు అందని వాడను, ఈ ధర్మములన్నియుగల ఆత్మను, పరబ్రహ్మమును, అని ఒకే ఒక్క భావనలో దృఢముగ మనస్సునుంచి, ఆ భావమును స్మరించుటచే ఉత్తమమైన మననము కలుగును.

**శ్లో॥ యదా విస్మృత్య తద్ధ్యానం ధ్యేయాకారం మనో భవేత్ ।**
**నివాతదీపవత్ స్వస్థం సమాధిః సోఽభిధీయతే ॥ 39**

**ప్ర :** యదా = ఎప్పుడు, తత్ ధ్యానమ్ = ఆ ధ్యానమును, విస్మృత్య = మరచి, మనః = మనస్సు, ధ్యేయ+ఆకారం భవేత్ = ధ్యానమునకు లక్ష్యమైన వస్తువుయొక్క రూపముగలదగునో, నివాత దీపవత్ = గాలిలేని చోట దీపమువలె, స్వస్థమ్ = శాంతమగును, సః = ఆ స్థితి, సమాధిః = సమాధి, అభిధీయతే = అనబడును.

**తా :** ధ్యానము చేయుటను మరచి, మనస్సు తాను దేనిని ధ్యానించుచున్నదో ఆ వస్తువుతో తాను తాదాత్మ్యము చెంది, వేరుగా తన ఉనికినే మరచి నప్పుడు, గాలిలేని ప్రదేశమున దీపమెట్లు నిశ్చలమై ప్రశాంతముగ వెల్గునో, అట్లే యగును. ఆ స్థితిని **సమాధి** యందురు.

**శ్లో॥ వ్యాపకం తత్ర చైతన్యం తిష్ఠత్యేవ స్వయంప్రభమ్ ।**
**తదా యోగీ న వేదేదం బాహ్యమాభ్యన్తరం క్వచిత్ ॥ 40**

**ప్ర :** తత్ర = అచట, వ్యాపకం చైతన్యమ్ = విశ్వవ్యాప్త చైతన్యము, స్వయంప్రభమ్ = స్వప్రకాశమై, తిష్ఠతి+ఏవ = నిల్చునో, తదా = అప్పుడు, యోగీ = యోగి, ఇదం బాహ్యమ్ = ఇది వెలుపల, (ఇదం) ఆభ్యన్తరమ్ = ఇది లోపల, అని, క్వచిత్ = అనునది, న వేద = యెరుగడు.

**తా :** అచట సర్వవ్యాపకచైతన్యము స్వయంప్రకాశమై నిల్చును. అప్పుడు యోగికి ఇది వెలుపల యని, ఇది లోపల యని యే మాత్రము భేదము తెలియరాదాయె.

**శ్లో॥ సూర్యకాన్తస్య యోగేన తూలోఽర్కప్రతిబిమ్బితః ।**
**అగ్నిరేవ భవేత్తద్వద్ జ్ఞేయమత్రాపి నాన్యథా ॥ 41**

**ప్ర :** సూర్యకాన్తస్య యోగేన = సూర్యకాంతశిలయొక్క స్పర్శచేత, తూలః = ప్రత్తి, అర్కప్రతిబిమ్బితః = సూర్యునిచే ప్రతిబింబితమై, అగ్నిః ఏవ = అగ్నియే, భవేత్ = అగును, అత్ర అపి = ఈ విషయమున గూడ, తత్ వత్ = ఆ రీతిగనే, జ్ఞేయమ్ = తెలియదగినది, న అన్యథా = వేరు విధమున కాదు.

**తా :** సూర్యకాంతశిల స్పర్శసోకిన ప్రత్తి సూర్యుని ప్రతిబింబము యేర్పడగా, అగ్నియే జనించి రగులుకొనును. ఈ విషయమునగూడ అట్టిదే జరుగునని, భేదము లేదని, తెలియదగును.

**శ్లో॥ బ్రహ్మాకారా మనోవృత్తిః కేవలం బ్రహ్మ నిష్కలమ్ ।**
**విషయీకృత్య హరతి కేవలం తద్గతం తమః ॥ 42**

**ప్ర :** బ్రహ్మాకారా = బ్రహ్మరూపమైన, మనోవృత్తిః =మనస్సుయొక్క, వ్యాపారము, కేవలం నిష్కలం బ్రహ్మ = విభాగములు, అంగములు లేక ఒకే ఒక్కటైన బ్రహ్మము, విషయీ కృత్య = విషయముగా, లక్ష్యముగా చేసికొని, తద్+గతమ్ = అక్కడ, మనసులోగల, తమః = చీకటిని, కేవలమ్ = మాత్రము, ఒక్కదానినే, హరతి = నశింపజేయును.

**తా :** బ్రహ్మరూపమైన మనోవ్యాపారము అవిభక్తమైన బ్రహ్మజ్ఞానము. మనసున పాదుకొని యున్న తమోగుణసంబంధి అజ్ఞానవరణమును మొత్తముగ నశింపజేయును.

**శ్లో॥ నష్టే సకార్యే తమసి ప్రపఞ్చో నైవ తిష్ఠతే ।**
**ఏక ఏవాద్వితీయోఽత్ర తదా స్వాత్మావశిష్యతే ॥ 43**

**ప్ర :** సకార్యే తమసి నష్టే = తన కర్మలతో గూడ తమోగుణమను చీకటి నశించగా, ప్రపఞ్చః = పంచజ్ఞానేంద్రియకార్యమైన ప్రపంచము, న తిష్ఠతి ఏవ = మనుగడయే లేనిదగును, తదా = అప్పుడు, అత్ర = అక్కడ, స్వ+ఆత్మా = తన ఆత్మ, ఏకః ఏవ = ఒక్కటే, అద్వితీయః = రెండవది లేనిదై, అవశిష్యతే = మిగులుచున్నది.

**తా :** తమోగుణము నశించుట యనగా తమోగుణకర్మప్రేరణలు నశించుటే కదా. ఇట్టిది సమూలముగ నశించగా, ఇంద్రియజ్ఞాననిర్మితమైన ప్రపంచ మింకేడ నిలచును? ప్రపంచము తొలగిపోగా, ఇక సాధకుని ఆత్మ తప్ప రెండవదేమియు అక్కడ మిగిలి యుండదు.

**శ్లో॥ యా వృత్తిః సైవ విజ్ఞానం కార్యం కృత్వా తతః స్వయమ్ ।**
**స్వరూపే లీయతే స్వచ్ఛే జలే కతకరేణువత్ ॥ 44**

**ప్ర :** యా వృత్తిః = యేది మనస్సునకు వ్యాపారమో, సా ఏవ = అదియే, విజ్ఞానమ్ = విశేషజ్ఞానమును, కార్యం కృత్వా = తనకర్తవ్యముగా జేసికొని, తతః = అంతటినుండి, స్వయమ్ = తనకు తానుగా, జలే = నీటిలో, కతకరేణువత్ = చిల్లగింజరేణువువలె, స్వచ్ఛే = శుభ్రమైన, స్వరూపే లీయతే = తన రూపమున కలిసిపోవును.

**తా :** మనస్సు తనకు సహజమైన వ్యాపారమునే విజ్ఞానమయముగా చేసికొని, అంతట తనకు తానై, చిల్లగింజరేణువు నీటిలో కలిసిపోయినట్లు, తాను తనదైన ఆత్మరూపమున కలిసిపోవును.

**శ్లో॥ ఘటే భిన్నే ఘటాకాశో మహాకాశో యథా తథా ।**
**చిద్బిమ్బం తు చిదేవ స్యాదుపాధౌ విలయం గతే ॥ 45**

**ప్ర :** ఘటే భిన్నే = కుండ పగిలిపోగా, ఘటాకాశః = కుండలోని ఆకాశము, అనగా ప్రదేశము, యథా = ఎట్లు, మహాకాశః = మహాకాశమున చేరిపోవునో, తథా = అట్లు, చిత్+బిమ్బం తు = జ్ఞానప్రతిబింబమున్నూ, చిత్+ఏవ = జ్ఞానమే, ఉపాధౌ విలయం గతే = ఉపాధి అనగా శరీరము, లయముకాగా, స్యాత్ = అగును.

**తా :** కుండ బాగున్నంత కాలము దానిలో ఆకాశము లేక ప్రదేశము, చోటు ఉన్నట్లు కనబడును. కుండలోని ఆకాశము కుండకు స్వంతమనియే తోచును. కాని, కుండ పగిలిపోగా, అందలి ఆకాశము మహాకాశమున కలిసిపోవును. అట్లే, ఇంద్రియముల ద్వారా లభించిన జ్ఞానము ఈ

ప్రపంచముగ తోచును. కాని, ఆ జ్ఞానము మహాజ్ఞానమైన ఆత్మజ్ఞానములో కలిసిపోగా, ఇక ప్రపంచము రూపాంతరము చెంది ఆత్మలో కలియును.

**శ్లో॥ స్వప్రకాశం పరం బ్రహ్మ కథం హృత్తత్ప్రకాశయేత్ ।**
**అతః స్వచ్ఛాదర్శగతస్వముఖాలోకనోపమమ్ ॥ 46**

**శ్లో॥ స్వచ్ఛధీవృత్తిఫలితస్వాత్మనోఽపి నిరీక్షణమ్ ।**
**స్వస్యైవ నైవ మనసో దృశ్యస్యాచేతనస్య చ ॥ 47**

**ప్ర :** స్వప్రకాశమ్ = స్వప్రకాశమైన, పరం బ్రహ్మ = పరబ్రహ్మమును, కథమ్ = ఎట్లు, తత్ హృత్ = ఆ మనస్సు, ప్రకాశయేత్ = ప్రకాశింపజేయును?, అతః = అందువలన, స్వచ్ఛ+ఆదర్శగత = నిర్మలమైన అద్దమునందున్న, స్వముఖావలోకన+ఉపమమ్ = తన ముఖమును చూచుకొనుటతో పోల్చదగినదైన, స్వచ్ఛధీవృత్తిఫలిత = శుభ్రమైన మనోవృత్తియందు ప్రతిబింబితమైన, స్వ+ఆత్మనః అపి = తనయొక్క ఆత్మదేయైన రూపమును, నిరీక్షణమ్ = చూచుట, న ఏవ మనసః = మనసునది కానిదైన, స్వస్య ఏవ = తనదేయైన, అచేతనస్య = అచేతనమైన, దృశ్యస్య చ = దృశ్యమునదే.

**తా :** పరబ్రహ్మము స్వప్రకాశము కదా. దానిని మనస్సెట్లు ప్రకాశింపజేయును? అందువలన, నిర్మలమైన అద్దమునందున్న తన ముఖమును చూచుకొనుట వంటిదే. శుభ్రమైన మనోవృత్తియందు ప్రతిబింబితమైన తన ఆత్మరూపమును తాను చూచుటయే తప్ప, తనదేయైన అచేతనదృశ్యము, మనసునది కాదు.

**శ్లో॥ అజ్ఞాతస్యైవ విషయే మనోవృత్తేః ప్రయోజనమ్ ।**
**ద్రష్టవ్యం మనసేత్యాహ సార్థకం తచ్ఛ్రుతిః స్వయమ్ ॥ 48**

**ప్ర :** అజ్ఞాతస్య ఏవ = తెలిసికొనుట కవకాశమే లేని, విషయే = విషయమున, మనసా = మనస్సుచేత, ద్రష్టవ్యమ్ ప్రయోజనమ్ = చూడదగినదగు ప్రయోజనము, మనోవృత్తేః = మనస్సుయొక్క వ్యాపారమునకు, ఇతి = అని, సార్థకమ్ = అర్థవంతమైన, తత్ = ఆ విషయమును, శ్రుతిః స్వయం ఆహ = వేదము తానే చెప్పెను.

**తా :** ఆత్మ లేక పరబ్రహ్మ మనునది తెలియరానిదని చెప్పుదురు కదా, మనస్సు దాని నెట్లు ప్రతిఫలించును? అనగా, మనస్సుయొక్క సార్థకత అదియే యని వేదమే స్వయముగ చెప్పినది : **మనసైవానుద్రష్టవ్యమ్,** మనస్సు చేతనే ప్రతిఫలింపబడదగినది, అని శ్రుతివాక్యము.

**శ్లో॥ మనో న మనుతే బ్రహ్మ వాగప్యత్ర ప్రశామ్యతి ।**
**స్వయంప్రభం పరంజ్యోతిర్నిత్యం వాఙ్మనసః పరమ్ ॥ 49**

**ప్ర :** బ్రహ్మ = బ్రహ్మమును, మనః = మనస్సు, న మనుతే = భావించలేదు, వాక్ అపి = వాక్కు కూడ, అత్ర = ఆ విషయమున, ప్రశామ్యతి = మౌనము వహించును, వాక్+మనసః పరమ్ =

వాక్కునకు మనస్సునకు అతీతమైనది, స్వయంప్రభం పరంజ్యోతిః = స్వయంప్రకాశమైన పరంజ్యోతి, నిత్యమ్ = నిత్యమైనది.

**తా :** బ్రహ్మమును మనస్సు భావించలేదు, వాక్కుగూడ దాని గూర్చి పలుకలేక మౌనము వహించును. అట్టి బ్రహ్మము నిత్యమైన, స్వప్రకాశమైన పరంజ్యోతి, వాక్కునకు మనస్సునకు అందనిది.

**శ్లో॥ ఫలవ్యాప్యత్వమేవాత్ర శాస్త్రేణాస్య నిరస్యతే ।**
**బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తిఃవ్యాప్యత్వముచ్యతే ॥ 50**

**ప్ర :** అత్ర = ఆ విషయమున, అస్య = దానియొక్క, ఫలవ్యాప్యత్వమ్ ఏవ = ఫలవ్యాప్తినే, శాస్త్రేణ = శాస్త్రముద్వారా, నిరస్యతే = నిరాకరించబడుచున్నది; వ్యాప్యత్వమ్ = వ్యాపకత్వ మనునది, బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తిః = బ్రహ్మాజ్ఞాననాశమునకగు వ్యాపారముగా, ఉచ్యతే = చెప్పబడు చున్నది.

**తా :** శాస్త్రము ఆ బ్రహ్మమునకు వ్యాపిత్వమనునది ఫలము అను సిద్ధాంతమును తిరస్కరించుచూ, వ్యాప్యత్వము అనునది దాని వ్యాపారమనియు, ఆ వ్యాపారలక్షణము బ్రహ్మాజ్ఞానము కలుగకుండ చేయుటయే తప్ప బ్రహ్మాజ్ఞానవ్యాప్తి కాదనును.

**శ్లో॥ యావదేవం భవేత్సిద్ధం తావద్వృత్తిర్న శామ్యతి ।**
**జ్ఞాతృజ్ఞేయవిభాగోఽయం భాతి వృత్తౌ స్వభావతః ॥ 51**

**ప్ర :** యావత్ = ఎంతలో, ఏవమ్ = ఈ విధముగా, సిద్ధం భవేత్ = సిద్ధమగునో, తావత్ = అంతలో, వృత్తిః = వ్యాపారము, న శామ్యతి = శమింపదు, అయం వృత్తౌ = ఈ వృత్తియందు, స్వభావతః = సహజముగ, జ్ఞాతృజ్ఞేయవిభాగః భాతి = తెలిసికొనువాడు – తెలియదగినది అను విభజన ప్రకాశించును.

**తా :** బ్రహ్మమునకు వ్యాప్తి కలుగుట యనగా వ్యాపకవృత్తి అంతటితో శమించుట కాదు : ఈ వృత్తియందు సహజముగ జ్ఞాత–జ్ఞేయము అను రెండుగా విడబడి, అంతట జ్ఞానము అను మూడవదానిని పాదుకొల్పి, ఇట్లనేకత్వమున సాగుచుండుట ఆ వ్యాప్తి లక్షణము.

**శ్లో॥ సవికల్పోఽయమేవ స్యాత్సమాధిర్భూపసత్తమ! ।**
**వృత్తేర్లయో నిర్వికల్పః సమాధిః పరమో మతః ॥ 52**

**ప్ర :** భూపసత్తమ = రాజశ్రేష్ఠా!, అయం ఏవ = ఇదియే, సవికల్పః సమాధిః = సవికల్పసమాధి, స్యాత్ = అగును, వృత్తేః+లయః = వృత్తియొక్క నాశము, నిర్వికల్పః సమాధిః = నిర్వికల్ప సమాధిగా, పరమః మతః = అత్యుత్తముగా తలంచబడుచున్నది.

**తా :** ఓ రాజోత్తమా! దీనిని **సవికల్పసమాధి** యందురు. మనోవ్యాపారములు స్తంభించి పోయినప్పుడు, **నిర్వికల్పసమాధి** యందురు. ఇది ఉత్తమోత్తమమని తలంతురు.

**శ్లో॥ అవిభాగం పరంబ్రహ్మ యతస్తత్రానుభూయతే ।**
**ఇమామేవ పరాం భూమిమారూఢో న పునశ్చ్యవేత్ ॥ 53**

ప్ర : యతః = ఎందువలన, పరంబ్రహ్మ = పరబ్రహ్మము, అత్ర = అచట, ఆ స్థితిలో, అవిభాగం అనుభూయతే = ఏకరూపముగా, అఖండముగ అనుభవింపబడుచున్నదో, (తతః) ఇమాం పరాం భూమిం ఏవ = ఈ పరమోత్తమస్థితినే, ఆరూఢః = చేరినవాడు, పునః = మరల, న చ్యవేత్ = జారడు.

**తా :** ఆ స్థితిలో పరబ్రహ్మము ఏకరూపముగ అనుభవమునకు వచ్చుటవలన, ఆ స్థితికి చేరిన యోగి మరల లోకస్థితికి దిగిరాడు.

**శ్లో॥ యది విఘ్నా భవన్త్యత్ర యుఞ్జతో యోగినో మనః ।**
**తత్రోపాయస్త్వయం కార్యః సావధానేన యోగినా ॥ 54**

ప్ర : అత్ర యుఞ్జతః యోగినః మనః = యోగియొక్క మనస్సు అచట లగ్నము కాగా, యది విఘ్నాః భవన్తి = విఘ్నములు కలిగినట్లయిన, తత్ర = ఆ విఘ్నముల విషయమున, యోగినా = యోగిచేత, సావధానేన = మెలకువతో, అయం ఉపాయః తు = ఈ ఉపాయమేమో, కార్యః = చేయదగినది.

**తా :** యోగి తన మనస్సును ఆత్మలో లగ్నము చేయు తరుణమున విఘ్నములు కలిగినచో, వానిని మెలకువతో నివారించదగును.

**శ్లో॥ సిద్ధయోఽత్ర భవన్త్యష్టావణిమప్రముఖా నృప! ।**
**తదాసక్తౌ ప్రణశ్యేత యోగః సంసరతే స చ ॥ 55**

ప్ర : అత్ర = అచట, నృప! = ఓ రాజా! అణిమప్రముఖాః = అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం అనునవి, అష్టసిద్ధయః = ఎన్మిది సిద్ధులు, భవన్తి = కలుగుచున్నవి, తత్ ఆసక్తౌ = వానియందు ఆసక్తి కలిగినచో, యోగః = యోగము, ప్రణశ్యేత = నశించిపోవును, సః చ = ఆ యోగియును, సంసరతే = విచలితుడగును.

**తా :** ఓ రాజా! ఆ సమాధిస్థితిలో కలుగు విఘ్నములు సిద్ధుల రూపమున నుండును. ఇవి ఎన్మిది. వాని ఆకర్షణకు లోబడి యోగి వాని నుపయోగించుట కాసక్తిచూపినచో, వాని యోగము నశించి, ఆతడు గూడ సంసారి యగును, అనగా విచలితుడై సిద్ధులవలన ప్రసిద్ధుడై, ధనాదికములతో ప్రజాకర్షకుడై సంసారమునబడును.

**శ్లో॥ సర్వం తన్నశ్వరం విద్వాన్న ప్రసజ్యేత కర్హిచిత్ ।**
**లయే సమ్బోధయేచ్చిత్తం విక్షిప్తం శమయేత్పునః ॥ 56**

ప్ర : విద్వాన్ = పండితుడు, జ్ఞాని, కర్హిచిత్ = ఎప్పుడైనను, నశ్వరమ్ = నశించునదైన, తత్ సర్వమ్ = ఆ యోగసిద్ధుల ఆకర్షణను, న ప్రజ్యేత = ఉపయోగించదు, చిత్తమ్ = మనసును,

లయే = ఏకాగ్రతయందు, సంబోధయేత్ = ప్రేరణనిచ్చును, అట్లు, విక్షిప్తమ్ = లగ్నము కాకున్నచో, పునః = మరల, శమయేత్ = శమింపజేయును.

**తా :** జ్ఞాని ఆ సిద్ధుల నెప్పుడు గాని ఉపయోగించి లౌకికుడుగా మారిపోడు. మరల మనస్సును ఏకాగ్రము చేసి సమాధియందే ప్రేరేపించి శాంతింపజేయును.

**శ్లో॥ సకషాయం సుధీర్జహ్యాత్సమప్రాప్తం న చాలయేత్ ।**
**నాస్వాదయేద్రసం తత్ర నిఃసఙ్గః ప్రజ్ఞయా భవేత్ ॥ 57**

**ప్ర :** సుధీః = వివేకియైనవాడు, సకషాయమ్ = సరాగమైన మనస్సును, జహ్యాత్ = విడువదగును, సమప్రాప్తమ్ = నిశ్చలమైనదానిని, న చాలయేత్ = చలింపనివ్వరాదు, తత్ర = ఆ విషయమున, రసమ్ = ఆనందమును, న ఆస్వాదయేత్ = ఆస్వాదించరాదు, ప్రజ్ఞయా = జాగరూకతతో, నిఃసఙ్గః భవేత్ = తగులము లేనివాడగును.

**తా :** వివేకవంతుడు మనసును రాగస్పర్శలేకుండ నుంచవలెను, చలించనివ్వక నిశ్చలముగ నుంచవలెను. సిద్ధులను ప్రదర్శించుటలో ఆనందింపరాదు. మెలకువగలిగి వానితో యెట్టి బంధము లేనివాడై యుండవలెను.

**శ్లో॥ నివాతదీపవచ్చిత్తో బ్రహ్మాత్మా శూన్యవృత్తికః ।**
**కృతకృత్యః క్షీణకర్మా భిన్నహృద్గ్రన్థి సంశయః ॥ 58**

**ప్ర :** శూన్యవృత్తికః = వ్యాపారములుడిగినది, క్షీణకర్మా = కర్మ నశించినది, భిన్నహృత్+గ్రన్థి సంశయః = సంశయము అను హృదయపు ముడి వీడినది, బ్రహ్మాత్మా = బ్రహ్మమే తానైనది, కృతకృత్యః = ధన్యత సాధించినదియైన, చిత్తః = మనస్సు, నివాతదీపవత్ = గాలిలేనిచోట దీపమువలె.

**శ్లో॥ ప్రారబ్ధభోక్తాఽఽత్మారామో జీవన్ముక్తో భవేదియమ్ ।**
**యోగభూర్మహతీ రూఢ ఏతాం ముగ్ధాదివచ్చరేత్ ॥ 59**

**ప్ర :** ప్రారబ్ధ-భోక్తా = ప్రారబ్ధకర్మఫలము ననుభవించునదై, ఆత్మారామః = ఆత్మయందే రమించునదై, జీవన్ముక్తః = జీవించియుండగనే ముక్తుడుగా, ఇయమ్ = ఈ మనస్సు, భవేత్ = అగును, మహతీ = గొప్పదైన, యోగభూః = యోగభూమిని, రూఢః = స్థిరమై, ఏతామ్ = ఈ సిద్ధుల గూర్చి, ముగ్ధాదివత్ = ఏమియు తెలియదేమో యనునట్లు, చరేత్ = ప్రవర్తించును.

**తా :** అన్ని వ్యాపారములు నశించిన మనస్సు ఆత్మయందే రమించుచూ, కర్మనశించి, సంశయములు తొలగిపోయి, బ్రహ్మమే తానై, జీవన్ముక్తిని సాధించి ధన్యమై, ప్రారబ్ధకర్మఫలమును మాత్రమనుభవించుచున్నను, ఆ ఫలానుభవమునందును, యోగసిద్ధుల విషయమునను యేమియు తెలియనట్లే యుండి, యోగభూమిపై వ్రేళ్ళూని, గాలిలేనిచోట దీపమువలె కదలక నిల్చి వెల్గును.

**శ్లో॥ ముగ్ధోఽన్ధో బధిరోఽజిహ్వో యోగీ పఙ్గుర్నపుంసకః ।**
**స్వాత్మదృక్ పరమానన్దో భవేత్ స్వైరగతిః సదా ॥ 60**

**ప్ర :** ముగ్ధః = అమాయకుడు, అన్ధః = గ్రుడ్డివాడు, బధిరః = చెవిటివాడు, అజిహ్వః = మూగవాడు, పఙ్గుః = కుంటివాడు, నపుంసకః = నపుంసకుడు, యేమైనను, యోగీ = యోగి, సదా = ఎల్లపుడు, స్వైరగతిః = స్వేచ్ఛగా తిరుగువాడై, స్వాత్మదృక్ = ఆత్మను దర్శించుచూ, పరమానన్దః = పరమానందము గలవాడుగా, భవేత్ = అగును.

**తా :** ఒక వ్యక్తిగా లోకము దృష్టిలో యోగి అమాయకుడు, గ్రుడ్డి, చెవిటి, మూగ, కుంటి, నపుంసకుడు, యేదైన కావచ్చును. కాని యోగిగా ఆతడు స్వేచ్ఛాజీవి, ఎల్లప్పుడున్నూ తన ఆత్మతో తాదాత్మ్యము చెంది ఆనందించుచుండును.

**శ్లో॥ అర్థానామపి సాన్నిధ్యే సమర్థోఽవికలేన్ద్రియః ।**
**సుప్తవద్వర్తతే నిత్యం స యోగీ ముగ్ధ ఈరితః ॥ 61**

**ప్ర :** అర్థానామ్ సాన్నిధ్యే అపి = ఇంద్రియములకు సుఖము నిచ్చు విషయములు చెంతనే ఉన్నను, అవికలేన్ద్రియః = చలించని ఇంద్రియములుగల, సమర్థః = సమర్థుడైన, యోగీ = యోగి, నిత్యమ్ = ఎల్లవేళల, సుప్తవత్ వర్తతే = నిద్రించినవానివలె ప్రవర్తించును, సః = అట్టి యోగి, ముగ్ధః = ముగ్ధుడుగా, ఈరితః = పిలువబడువాడు.

**తా :** ఇంద్రియసుఖములు చెంతనే యుండి సదా ఆకర్షించుచున్నను, చలించని ఇంద్రియములు గల యోగి నిద్రించుచున్నవానివలె ప్రవర్తించు సమర్థుడు. అట్టి వానిని **ముగ్ధయోగి** అందురు.

**శ్లో॥ తిష్ఠతో వ్రజతో వాఽస్య యోగినో దృజ్ న దూరగా ।**
**యుగమాత్రాం భువం త్యక్త్వా యోగిరాట్ సోఽన్య ఉచ్యతే ॥ 62**

**ప్ర :** తిష్ఠతః వా వ్రజతః = నిలచియున్నవాడైనను లేక నడచుచున్నవాడైనను, అస్య యోగినః దృక్ = ఆ యోగియొక్క దృష్టి, న దూరగా = దూరమునకు, వెలుపలకు, ప్రసరించదు, యుగమాత్రాం భువమ్ = నిలుకడయే లేని భువనమును, లోకమును, త్యక్త్వా = విడచిపెట్టి, సః యోగిరాట్ = ఆ యోగిరాజు, అన్యః = అన్యుడుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు. (అంధయోగి యనబడుచున్నాడు).

**తా :** ముగ్ధయోగి నిలచియున్ననూ నడచుచున్ననూ వాని దృష్టి వెలుపలకు దూరముగా ప్రసరించదు, లోని ఆత్మరూపమునే దర్శించుచుండును. బాహ్యప్రపంచమును నిలుకడలేనిదని ఆతడు విడచిపెట్టును. అట్టి యోగిరాజును **అంధయోగి** యని చెప్పుదురు.

**శ్లో॥ శోకావహం మనోహారి హితం వాఽప్యహితం వచః ।**
**న సంశృణోతి శ్రుత్వాఽపి స యోగీ బధిరః స్మృతః ॥ 63**

ప్ర : శోకావహమ్ = శోకమును కలిగించునది, మనోహారి = మనస్సును ఆకర్షించునది, హితమ్ = శ్రేయస్సును కలిగించునది, వా = లేక, అహితమ్ = చెడు చేయునది యైన, వచః = మాటలను, శ్రుత్వా అపి = విని కూడా, న సంశృణోతి = చెవియొగ్గి వినడు, సః యోగీ = అట్టి యోగి, బధిరః స్మృతః = బధిరయోగిగా నెంచబడును.

**తా :** అది దుఃఖకారకమైనను, సుఖకారకమైనను, శ్రేయస్కరమైనను కాకున్నను, ఎట్టి మాటలనైనను వినుచున్నట్లున్నను చెవి బెట్టని యోగిని **బధిరయోగి** అందురు.

**శ్లో॥ ఇదమిష్టమిదం నేతి యోఽశ్నన్నపి న సజ్జతే ।**
**సత్యం హితం మితం బ్రూతే యోగీ సోఽజిహ్వ ఉచ్యతే ॥ 64**

ప్ర : ఇదం ఇష్టం ఇదం న ఇతి = ఇది ఇష్టమైనది, ఇది కాదు, అని, యః = ఎవరు, అశ్నన్+అపి = తినుచును గూడ, న సజ్జతే = భావించడో, సత్యమ్ = సత్యమును, హితమ్ = హితమును, మితమ్ = అవసరమైనంతవరకు, బ్రూతే = మాటాడునో, సః యోగీ = అట్టి యోగి, అజిహ్వ ఉచ్యతే = మూగ (మూక) యోగి యందురు.

**తా :** యే యోగి భుజించుచు గూడ తాను భుజించునది తన కిష్టమనియో కాదనియో భావించడో, సత్యమును హితమును మాత్రమే ఆవశ్యకత ననుసరించి మాటాడునో, అట్టి యోగిని **అజిహ్వాయోగి** (నాల్కలేని యోగి) యందురు.

**శ్లో॥ భిక్షార్థం యస్య గమనం విణ్మూత్రోత్సృతయేఽపి చ ।**
**యోజనాన్న పరం యాతి స యోగీ పఙ్గురుచ్యతే ॥ 65**

ప్ర : యస్య గమనమ్ = ఎవని చలనము (సంచారము), భిక్షార్థమ్ = బిచ్చమెత్తుటకై, విణ్మూత్ర+ఉత్సృతయే అపి చ = మలమూత్రవిసర్జనముకొరకు గూడ, యోజనాత్ పరమ్ = ఒక యోజనము (ఆమడ అను 8 మైళ్ల దూరము) నకు మించి, న యాతి = ముందుకు సాగదో, సః యోగీ = అట్టి యోగి, పఙ్గుః ఉచ్యతే = పంగువు (కుంటి యోగి) అని యందురు.

**తా :** ఏ యోగి భిక్షాటనమునకును విసర్జనావసరము కొరకును గూడ ఒక ఆమడ దూరమునకు మించి సంచరించడో అట్టి యోగిని **పంగుయోగి** యందురు.

**శ్లో॥ సద్యోజాతాం కుమారీం యో దృష్ట్వా షోడశవార్షికీమ్ ।**
**వృద్ధామపి సమాం పశ్యన్నిర్వికారః స షణ్డకః ॥ 66**

ప్ర : యః = ఏ యోగి, సద్యోజాతామ్ = అప్పుడే పుట్టిన ఆడు శిశువును, కుమారీమ్ = 10-12 సంవత్సరముల వయసుగల ఆడుపిల్లను, షోడశవార్షికీమ్ = 16 సం॥ల వయసుగల నవయౌవనవతిని, వృద్ధామ్ = వయసుమీరిన స్త్రీని, దృష్ట్వా అపి = చూచియును, సమామ్ =

సమముగనే, పశ్యన్ = భావించుచు, నిర్వికారః = కామవికారములేనివాడై యుండునో, సః = ఆతడు, షణ్డకః = నపుంసకయోగి.

**తా :** అప్పుడే పుట్టిన శిశువును, పది పండ్రెండేండ్ల కుమారిని, పదునారేండ్ల జవ్వనిని, వయసుమీరిన ముదుసలిని, అందఱనూ ఒకే దృష్టితో నిర్వికారియై చూచు యోగిని **నపుంసకయోగి** యందురు.

**శ్లో॥ యోగచర్యామిమాం ప్రాప్య శ్రిత ఉత్తమభూమికామ్ ।**
**జీవన్ముక్తో భుక్తదైవో విదేహాం ముక్తిమనశ్నుతే ॥ 67**

**ప్ర :** ఉత్తమభూమికామ్ = ఉత్తమభూమికయైన, ఇమాం యోగచర్యామ్ = ఈ యోగచర్యను, ప్రాప్య = పొంది, శ్రితః = యోగ్యుడైన యోగి, జీవన్ముక్తః = జీవించి యుండగనే ముక్తుడైన వాడై, భుక్తదైవః = దైవానుభవము గలవాడై, విదేహామ్ = మరణమును, ముక్తిమన్ = ముక్తుడై యుండియే, అశ్నుతే = అనుభవించుచున్నాడు.

**తా :** ఈ పై జెప్పి వివిధరీతులు యోగి సాధించదగినవి. ఇట్టి ఉత్తమభూమికను యోగచర్యగా పొంది యోగ్యుడైన యోగి జీవన్ముక్తుడై, దైవానుభవమును పొంది, మరణమును సైతము ముక్తుడై యుండియే ఆస్వాదించును.

**శ్లో॥ యోగాదేశమిమం రాజన్నావినీతాయ బోధయ ।**
**శ్రద్దధానాయ శిష్యాయ శంస శుద్ధ హృదేఽర్జున ॥ 68**

**ప్ర :** యోగాదేశమ్ = యోగమును ప్రతిపాదించునదైన, ఇమమ్ = ఈ శాస్త్రమును, అవినీతాయ = వినయములేనివానికి, న బోధయ = ఉపదేశింపకుము, రాజన్ = ఓ రాజా!, శ్రద్దధానాయ శిష్యాయ = శ్రద్ధగల శిష్యునకు, శుద్ధహృదే = నిర్మలహృదయునకు, శంస అర్జున = బోధించుమో అర్జున!

**తా :** ఓ రాజా, కార్తవీర్యార్జునా! ఈ యోగశాస్త్రమును వినయములేనివానికి బోధించకుము, శ్రద్ధగల నిర్మలహృదయునకు శిష్యునిగా స్వీకరించి ఉపదేశించుము.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం చతుర్థాష్టకే ద్వితీయాధ్యాయః ॥

ఓమ్ శం

**షోడశాక్షరో దత్తాత్రేయమన్త్రః**

**ఓం ఐం క్లాం క్లీం క్లూం హ్రాం హ్రీం హ్రూం సౌః దత్తాత్రేయాయ స్వాహా ॥**

శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## చతుర్థాష్టకము - తృతీయాధ్యాయము

శ్లో॥ ప్రయుఙ్క్తే యదాఽఽత్మానం బుద్ధిస్తత్ప్రేరకస్య హి ।
మహీదేవస్య సవితుర్మమ కార్యా పరిష్టుతిః ॥ 1

**ప్రతిపదార్థం :** యదా = ఎప్పుడు, ఆత్మానమ్ = మనస్సును, బుద్ధిః = బుద్ధి, ప్రయుఙ్క్తే = నడిపించునో, తత్ ప్రేరకస్య హి = ఆ క్రియను ప్రేరేపించువాడనే యైన, మహీదేవస్య = భూమిపై దేవుడనగు, సవితుః మమ = సూర్యుడనైన నాయొక్క, మహీ పరిష్టుతిః = ప్రగాఢ స్తుతి, కార్యా = చేయదగియున్నది.

**తాత్పర్యం :** మనస్సునెప్పుడు బుద్ధి నడిపించునో, ఆ నడుపించుట యను క్రియకు ప్రేరణనిచ్చు పుడమిపై దేవుడనైన సూర్యుడను నన్ను ప్రగాఢముగ స్తుతించదగును.

శ్లో॥ యో మద్గతాన్తరాత్మాఽత్ర శ్రద్ధావాన్ భజతే హి మామ్ ।
స మమాతిప్రియో నూనం సర్వేషామేవ యోగినామ్ ॥ 2

**ప్ర :** అత్ర = ఈ విషయమున, మత్ గత ఆన్తరాత్మా = నా యందు లగ్నమైన మనస్సు గలవాడై, శ్రద్ధావాన్ = శ్రద్ధగలవాడై, యః హి = ఎవడైతే, మామ్ = నన్ను, భజతే = పూజించునో, సః = ఆతడు, నూనమ్ = నిశ్చయముగా, మమ = నాకు, సర్వేషాం యోగినామ్ = యోగులందఱకు, అతిప్రియః ఏవ = అధికముగా ఇష్టుడు.

**తా :** నాయందు మనసునిల్పి శ్రద్ధతో ఎవడు నన్ను సేవించునో వాడు నాకున్నూ యోగులందఱకునూ అధికప్రియుడు. ఇది నిశ్చయము.

శ్లో॥ త్వమపి శ్రద్ధయా రాజన్! యోగం యుఞ్జన్ భజస్వ మామ్ ।
మత్ప్రసాదాదిహైవాశు మత్సాయుజ్యం త్వమేష్యసి ॥ 3

**ప్ర :** రాజన్ = ఓ రాజా!, త్వం అపి = నీవు గూడ, యోగం యుఞ్జన్ = యోగమును జోడించి,

మాం భజస్వ = నన్ను సేవింపుము, మత్ ప్రసాదాత్ = నా అనుగ్రహమువలన, ఇహ ఏవ = ఇక్కడనే (జీవించియుండగనే), ఆశు = త్వరలో, త్వమ్ = నీవు, మత్ = నాదైన, సాయుజ్యమ్ = సాయుజ్యమును, ఏష్యసి = పొందుదువు.

**తా :** ఓ రాజా! నీవున్నూ యోగముతో గూడ నా పూజ సేయుము. నా దయవలన త్వరలోనే నీకు జీవన్ముక్తి లభించి, నాతో గూడియుండు సాయుజ్యముక్తి కలుగును.

**శ్లో॥ ఇత్యుక్తః ప్రణతో రాజా నత్వా ప్రాహ సగద్గదమ్ ।**
**ఫుల్లాస్యాబ్జో గలన్నేత్రో హృష్టరోమా తదాచిరాత్ ॥ 4**

**శ్లో॥ మోహతమో మమ నష్టం త్వద్వచనాన్నహి కష్టమ్ ।**
**శిష్టమిదం మయి హృష్టం హృత్పరమాత్మని తుష్టమ్ ॥ 5**

**ప్ర :** ఇతి ఉక్తః = ఇట్లని చెప్పబడినవాడై, రాజా = రాజు, నత్వా ప్రణతః = వంగి నమస్కరించి, సగద్గదమ్ = డగ్గుత్తికతో, గలన్నేత్రః = కన్నీరు గార్చుచు, హృష్టరోమా = ఆనందపులకితుడై, ఫుల్ల+ఆస్య+అబ్జః = వికసించిన ముఖపద్మముతో, తదా = అప్పుడు, ప్రాహ = పలికెను, త్వత్+వచనాత్ = నీ మాటలవలన, మమ = నాదైన, మోహతమః = భ్రాంతియను చీకటి (తమోగుణసంబంధి మోహలక్షణము), అచిరాత్ = సత్వరము, నష్టమ్ = నశించినది, న హి కష్టమ్ = కష్టమేమియు కలుగలేదు. ఇదమ్ = ఇది, మీరు చెప్పిన విషయము, శిష్టమ్ = శుభకరమైనది, మయి = నా యందు, హృష్టమ్ = దీపించినది, హృత్ = హృదయము, పరమాత్మని = పరమాత్మునియందు, తుష్టమ్ = సంతృప్తిజెందినది.

**తా :** శ్రీదత్తుని యీ ఉపదేశమును విని, రాజు కార్తవీర్యార్జునుడు వంగి నమస్కరించి, కన్నుల బాష్పములు జారగా, శరీరము హర్షపులకాంకితము కాగా, కంఠము బొంగురువోవ, ముఖపద్మము వికసింపగా, ఇట్లనెను : మీ మాటలవలన నా లోని తమోగుణచర్యయైన మోహభ్రాంతి సత్వరము నశించినది. మీ ఉపదేశవాక్యములు నా కేమియు కష్టము కలిగింపకపోగా, నాలో హర్షాతిరేకమును నింపినవి, నా ఆత్మ పరమాత్మను జేరి సంతృప్తి కలిగినది. మీ బోధ శిష్టజ్ఞానము, శిష్టాచారము.

**శ్లో॥ జ్ఞానరవిర్హృది భాతః స్వావరణాఖ్యతమోఽతః ।**
**క్వాపి గతం భవదీక్షాసౌ ఖలు! కా మమ దీక్షా ॥ 6**

**శ్లో॥ క్లేశరుజాం హరణేన త్వచ్చరణస్మరణేన ।**
**అస్మి కృతార్థ ఇహేశ! శ్రీశ! పరేశ! మహేశ! ॥ 7**

**ప్ర :** శ్రీశ! = లక్ష్మీనాథుడవైన ఓ విష్ణుదేవా!, ఈశ = ఈశ్వరా!, మహా+ఈశ = ఈశుల కీశుడవైన మహేశ్వరా!, పరేశ = పరమునకు ప్రభువైన ఓ దేవా!, త్వత్+చరణ స్మరణేన = నీ పాదసంస్మరణతో, క్లేశరుజామ్ = దుఃఖము అను రోగము నశించగా, హృది = హృదయమున,

జ్ఞానరవిః = జ్ఞానము అను సూర్యుడు, భాతః = ప్రకాశించినాడు, స్వ+ఆవరణ+ఆఖ్య తమః = ఆత్మను కప్పియుంచిన తమోగుణము (చీకటి) అనునది, అతః = ఆ కారణమున, క్వా+అపి గతమ్ = ఎక్కడకో పోయినది, అసౌ = ఈ జ్ఞానఫలము, భవత్ ఈక్షా = నీ చూపుల ప్రసాదమే, మమ దీక్షా = నా నిష్ఠ, కా ఖలు! = ఏమున్నది కనుక? కృతార్థః అస్మి = ధన్యుడనైతిని.

**తా :** ఓ మూర్తిత్రయరూపా! శ్రీ దత్తప్రభూ! నీ పాదచింతనచే దుఃఖము నశించి, జ్ఞానము సూర్య ప్రకాశమైనది. అందు మూలమున నా ఆత్మను కప్పిన తమోగుణము తొలగిపోయినది. ఈ జ్ఞానము నీ అనుగ్రహవీక్షణ ఫలముగా నాకు లభించినదే కాని నా నిష్ఠాగరిష్ఠత కారణముగా నేను సాధించినది కాదు.

**శ్లో॥ ప్రేమదుఘం తవ పాదం కో న భజేదవివాదమ్ ।**
**దైవవశాద్ధృది మేయం దర్శితవానసి మే యమ్ ॥ 8**

**ప్ర :** ప్రేమదుఘమ్ = ప్రేమయను పాలను పితుకు నట్టి, తవ పాదమ్ = నీ పాదమును, కః = ఎవడు, అవివాదమ్ = వ్యతిరేకత చూపకుండ, న భజేత్ = సేవింపడు?, యమ్ = దేనిని, మే = నాకు, దైవవశాత్ = భాగ్యవశమున, హృది = హృదయమునందు, మేయమ్ = ఇంద్రియ జ్ఞానముగా, దర్శితవాన్ అసి = దర్శింపజేసితివి.

**తా :** ప్రేమను ధారగా పితుకు కామధేనువు వంటి నీ పాదమును మారు మాటాడక సేవింపనివా డెవడు? నా భాగ్యవశమున నాకు నా హృదయమందే అట్టి తమ పాదమును ప్రాకృతికముగ దర్శించుట కలిగినది. అది మీ వాత్సల్యఫలము.

**శ్లో॥ చిత్రమిదం సదమేయం సోఽప్యభవద్ధృది మేయః ।**
**దేవసురర్షిసుగేయః సోఽద్య కథం మమ హేయః ॥ 9**

**ప్ర :** ఇదం చిత్రమ్ = ఇది విచిత్ర విషయము, అమేయమ్ = ఇంద్రియాతీతమైన, సత్ = ఆత్మపదార్థము, సః అపి = అట్టిది కూడ, హృది = హృదయమున, మేయః అభవత్ = ఇంద్రియముల జ్ఞానవిషయమైనది, దేవసుర+ఋషిసుగేయః = దేవతలచే, దేవర్షులచే చక్కగా నుతించబడునదైన, సః = ఆ దైవము, అద్య = నేడు, మమ హేయః = నాకు విడువదగినవాడు, కథమ్ = ఎట్లు (అగును)?

**తా :** ఇంద్రియాతీతమైన ఆత్మ ఇంద్రియవిషయముగా నా హృదయమున నిలచినది. ఇది మహావిచిత్రము. దేవతలు, దేవర్షులు కొనియాడు అట్టి దేవుని నేనెట్లు విడువగలను?

**శ్లో॥ ఆశ్రితతాపహరం తం పాతకదైన్యహరన్తమ్ ।**
**నౌమి శివం భగవన్తం పాదమహం తవ సన్తమ్ ॥ 10**

**ప్ర :** ఆశ్రితాపహరమ్ = ఆశ్రయించిన భక్తజనులయొక్క ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మికము

లను తాపత్రయమును హరించువాడును, పాతకదైన్యహరన్తమ్ = పాపుల దైన్యమును తొలగించువాడును, భగవన్తమ్ = ఉత్పత్తి, వినాశము, భూతముల ఆగమన నిష్క్రమణములు, జ్ఞానాజ్ఞానముల వివేకము – వీనిని భగమందురు, ఇవి కలవాడు భగవానుడు, అట్టి వానిని, శివమ్ = శుభకరమైనది, సన్తమ్ = శాశ్వతుడునైన, తవ = నీ యొక్క, తం పాదమ్ = ఆ పాదమును, అహమ్ = నేను, నౌమి = నమస్కరింతును.

**తా :** భక్తుల తాపములను హరించువాడును, పాపులదైన్యము బాపువాడును, భగవంతుడు, శివుడు, శాశ్వతుడునైన నీయొక్క పాదమును నేను నమస్కరింతును.

**శ్లో॥ యత్ర జగద్భ్రమ ఏషః కల్పిత ఏవ సశేషః ।**
**భ్రాన్తిలయేఽద్వయ ఏవావేది మయాద్య స ఏవ ॥ 11**

**ప్ర :** యత్ర = ఎక్కడ, ఏషః జగత్ భ్రమః = ఈ జగత్తు అను భ్రాంతియో, (తత్ర = అచట), సశేషః = ఆ భ్రాంతిశేషముగనే, కల్పితః ఏవ = కల్పింపబడినదియే, భ్రాన్తిలయే = ఆ జగత్తు అను భ్రాన్తి నశించగా, మయా = నాచేత, అద్య = నేడు, సః ఏవ అద్వయః = అదియే ఒక్కటిగా (జగత్తు అను అనేకత్వము లేనిదిగా), అవేది ఏవ = నిశ్చయముగా ఎఱుగబడినది.

**తా :** జగత్తు అనునది భ్రాంతి. ఆ భ్రాంతియే అనేకత్వము. భ్రాంతి నశించగా అనేకత్వము నశించి, సమస్తముగా ఏకత్వమే గోచరించినది. మిథ్యాజగత్తు మాయమై పోయినది.

**శ్లో॥ శాన్తిపదం తవ పాదం నౌమి సంసేవ్యమఖేదమ్ ।**
**స్వార్థదమాద్యమనన్తం హాపిత కామధనం తమ్ ॥ 12**

**ప్ర :** శాన్తిపదమ్ = నిర్వికారస్థానమైన, తవ పాదమ్ = నీ పాదమును, అఖేదమ్ = నిశ్చింతగా, సుసేవ్యమ్ = సేవింపదగినదానిని, స్వార్థదమ్ = ఆత్మార్థమును ప్రసాదించుదానిని, ఆద్యమ్ = జగత్తున కారంభకమైనదానిని, అనన్తమ్ = అంతములేనిదానిని, హాపిత కామధనమ్ = కామము అను ధనమును పోగొట్టిన, తమ్ = అట్టిదానిని, నౌమి = నమస్కరింతును.

**తా :** నీ పాదము శాంతినివాసము, ఆత్మజ్ఞానమును ప్రసాదించునది, జగదారంభకము, అంతములేనిది, కామధనమును పోగొట్టినది, అన్ని చింతలను తొలగించునది, సేవింపదగినది. దానికి నమస్కారము.

**శ్లో॥ దేవోఽభావో రాద్ధః సిద్ధః సత్యో నిత్యో బుద్ధః శుద్ధః ।**
**సర్వోఽపూర్వో హర్తాఽకర్తా భిన్నస్త్వం నః పాతా మాతా ॥ 13**

**ప్ర :** దేవః = స్వయంప్రకాశము గలవాడు, అభావః = జన్మము లేనివాడు, రాద్ధః = శాంతుడు, సిద్ధః = సహజలభ్యుడు, సిద్ధులు గలవాడు, సత్యః = ఉనికిగలవాడు, నిత్యః = శాశ్వతుడు, బుద్ధః = జాగరూకుడు, శుద్ధః = నిర్మలుడు, సర్వః = సర్వరూపి, అపూర్వః = తనకు గతము

అనునది లేనివాడు, హర్తా = హరించువాడు, అకర్తా = కర్మచేయనివాడు (నిష్క్రియుడు), భిన్నః = అనేకమైనవాడు, త్వమ్ = నీవు, నః = మా యొక్క, పాతా = రక్షకుడవు, మాతా = తల్లివి.

**శ్లో॥ త్వం దేహకరణాతీతః సర్వాత్మా శరణం సతామ్ ।**
**స ప్రాణఘోషమాత్రాత్మా సూక్ష్మో దేహో గుహాం శ్రితః ॥ 14**

**ప్ర :** త్వమ్ = నీవు, దేహకరణ+అతీతః = శరీరక్రియలకు అందనివాడవు, సర్వ+ఆత్మా = చరాచరము లన్నిటికి చేతనవు, సతాం శరణమ్ = సత్పురుషులకు ఆశ్రయము, సః =భగవంతుడవు, ప్రాణఘోషమాత్ర+ఆత్మా = శ్వాసయందలి నాదరూపుడవు, అజపగాయత్రీ రూపుడవు, సోఽహం మంత్రస్వరూపుడవు, సూక్ష్మః దేహః = సూక్ష్మదేహము గలవాడవు, గుహాం శ్రితః = హృదయగుహలో నెలకొనిన వాడవు.

**శ్లో॥ యథోష్మమేయః కాష్ఠేఽగ్నిర్మథనాద్దృశ్యతే క్రమాత్ ।**
**తథా చిత్సుఖమేయాత్మా యోగేనాత్రాపి గమ్యతే ॥ 15**

**ప్ర :** ఊష్మమేయః = వేడిచేత తెలియదగినదైన, అగ్నిః = నిప్పు, మథనాత్ = మథించుటవలన (రాపిడి వలన), క్రమాత్ = కొంతకాలమునకు, కాష్ఠే = కట్టెయందు, యథా = ఎట్లు, దృశ్యతే = కనబడుచున్నదో, తథా = అట్లు, చిత్+సుఖమేయ+ఆత్మా = జ్ఞానానందముచే తెలియదగిన ఆత్మ, యోగేన = ధ్యానముచేత, అత్ర+అపి = అచటగూడ, గమ్యతే = అనుభవింపబడుచున్నది.

**తా :** వేడిచేత అగ్ని తెలియవచ్చును. రాపిడిచేత ఎండు కట్టెలో వేడి కలిగి అగ్ని రగుల్కొనును. ఇది ప్రత్యక్షానుభవమే. అట్లే జ్ఞానానందముద్వారా ఆత్మను తెలియవచ్చును. ఆ జ్ఞానానందము ధ్యానమువలన కాలక్రమసాధ్యము.

**శ్లో॥ భక్త్యాశ్లిష్టస్త్వమేకోఽపి దేవో వ్యక్తోఽప్యహో! త్రివృత్ ।**
**బహుధేవ భ్రమాద్భాసి స్వస్థోఽప్యప్సు యథా రవిః ॥ 16**

**ప్ర :** అహో! = ఔరా!, భక్తి+ఆశ్లిష్టః = భక్తిచేత పొదువుకొనబడినవాడవై, త్వమ్ = నీవు, ఏకః దేవః అపి = ఒక్కడవే అయిన దేవుడవైనను, త్రివృత్ = మూడు వృత్తుల బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగా, వ్యక్తః = ప్రకటమైనాడవు, అపి = మరియు, భ్రమాత్ = భ్రమవలన, బహుధా = అనేకముగా, భాసి ఏవ = ప్రకాశించుచున్నావు, యథా = ఏ విధముగా, స్వస్థః అపి = తానున్న చోటనే ఉన్నవాడై కూడ, రవిః = సూర్యుడు, అప్సు = నీటి యందు కన్పించునో అట్లే.

**తా :** ఔరా! భక్తికి ప్రతిస్పందించి కేవలాత్మవైన నీవు మూడు మూర్తులుగా ప్రకటమైనావు, ఒక్కడవే అనేకులుగా ప్రకాశించుచున్నావు. సూర్యుడొక్కడే ఆకాశముననే ఉండియు, భూమిపై నీటిలో గూడ అనేకముగా ప్రకాశించుట చూచుచున్నాము కదా! అట్లే.

శ్లో॥ యస్మిన్నోతమిదం ప్రోతం వసనే తన్తవో యథా ।
సర్వయోనిం భజే తం త్వాం సచ్చిదానన్దమద్వయమ్ ॥ 17

ప్ర : వసనే = వస్త్రమునందు, తన్తవో యథా = దారపు పోగులట్లు, యస్మిన్ = ఎవ్వని యందు, ఇదమ్ = ఈ జగత్తు, ఓతం ప్రోతమ్ = పడుగు పేకలైనదో, తం సర్వయోనిమ్ = అట్టి జగత్తునకు జన్మస్థానమైన, సత్+చిత్+ఆనన్దమ్ = ఉనికి, జ్ఞానము, ఆనందము తానైన, అద్వయమ్ = కేవలాత్మయగు, త్వామ్ = నిన్ను, భజే = సేవింతును.

**తా :** ఈ జగత్తు నీయందు అల్లుకొని యున్నది. సత్ చిత్ ఆనందములు మూడును కలసి ఒక్కటేయైన అద్వయాత్మవు నీవు. జగత్తునకు జన్మస్థానము నీవు. వస్త్రము అనునది పడుగు పేకలుగ అల్లబడిన నూలుపోగుల సమాహారము. అట్టిదే జగత్తు. అందలి ఆత్మ. ఆత్మ నీవు. కావున నిన్ను సేవింతుము.

శ్లో॥ మాయాభాతో భవతరుః శతమూలో ద్విబీజకః ।
పఞ్చార్థసూతిస్త్రినాలః పఞ్చస్కన్ధో దశాఙ్కురః ॥ 18

ప్ర : భవతరుః = భవము (జగత్తు, సంసారము) అను వృక్షము, మాయాభాతః = మాయచే ప్రకాశింపబడినది, ద్విబీజకః = రెండు విత్తనములు గలది, శతమూలః = నూరు వ్రేళ్ళు గలది, పఞ్చ+అర్థసూతిః = అయిదు విషయముల ప్రసవించినది, త్రి నాలః = మూడు నాళములు గలది, పఞ్చస్కన్ధః = అయిదు కొమ్మలు గలది, దశ+అఙ్కురః = పది మొలకలు గలది.

**తా : ఈ సంసారవృక్షము పాపపుణ్యములను రెండు విత్తనములు గలది; వాసనలు (సంస్కారములు) అనబడు వ్రేళ్ళూనినది; ఇంద్రియ విషయములైన శబ్దస్పర్శగంధశ్రవణ దృశ్యములైదిటిని ప్రసవించునది లేక పుష్పించునది; సత్త్వరజస్తమోగుణములు మూడును నాళములుగా గలది; పృథివ్యాపస్తేజోవాయురాకాశములైదును కొమ్మలుగా గలది; కర్మేంద్రియములగు వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థలు అయిదును, జ్ఞానేంద్రియములగు చర్మము, నేత్రము, శ్రోత్రము, జిహ్వా, ఘ్రాణము అనునైదును, మొత్తము పది ఇంద్రియములు మొలకులుగా గలది; మాయచే ప్రకాశించునది. ఇట్టిదీ భవవృక్షము.**

శ్లో॥ ద్విసుపర్ణస్త్రివల్కో ద్విఫలః ప్రత్నశ్చిదాశ్రయః ।
గృధ్రోఽస్యైకం ఫలం హంసోఽన్యద్భుంక్తే స సుదుర్ధరః ॥ 19

ప్ర : ద్వి-సుపర్ణః = రెండు పక్షులు గలది, (రెండాకులు గలది), త్రివల్కః = మూడు వస్త్రములు (బెరడులు) గలది, ద్విఫలః = రెండు పండ్లు గలది, ప్రత్నః = పురాతనమైనది, చిదాశ్రయః = జ్ఞానచైతన్యమున కాశ్రయమైనది, అస్య = దానియొక్క, ఏకం ఫలమ్ = ఒక పండు, గృధ్రః = విషయలాలస, అన్యత్ = వేరొకటి, హంసః = ఆత్మ, భుంక్తే = అనుభవించును, సః సుదుర్ధరః = భరింపరానిది.

**తా :** ఈ సంసారవృక్షము సుఖదుఃఖములను రెండు పండ్లు గలది; మూడు ఆవరణలు (వస్త్రములు) అవిద్య, అజ్ఞానము, అహంకారము అనునవి కలది; పురాతనమైనది; జ్ఞానచైతన్యమున కాశ్రయమైనది; దానికి కాచిన పండ్లు సుఖదుఃఖములనునవి రెండు; ఆ చెట్టుపై రెండు పక్షులు, ఒకటి విషయఫలములను భుజించుచుండును; వేరొకటి హంస (ఆత్మ), విషయఫలత్యాగము చేసి సుఖించుచున్నది.

**శ్లో॥ వృద్ధాః పరమహంసాస్తం తీక్ష్ణవిద్యాసినా భృశమ్ ।**
**ఛిత్వాన్వేష్య పదం యాన్తి యతో నావర్తతే పునః ॥ 20**

ప్ర : వృద్ధాః = జ్ఞానవృద్ధులు, పరమహంసాః = పరమాత్మ సమానులు, తీక్ష్ణవిద్యాసినాః = తీవ్రమైన జ్ఞానతృష్ణగలవారు, భృశం అన్వేష్య = శాస్త్రములను గాలించి, ఛిత్వా = ఆ సంసార వృక్షమును ఛేదించి, యతః = ఎక్కడనుండి, పునః న ఆవర్తతే = మరల వర్తమానము కాదో, తం పదమ్ = ఆ స్థానమును, యాన్తి = పొందుచున్నారు.

**తా :** జ్ఞానవృద్ధులైన పరమహంసలు సునిశితమైన జ్ఞానతృష్ణతో శాస్త్రములను గాలించి ఆ సంసారవృక్షమును తెగనరికి మరల ప్రభవించని పరమపదమును చేరుచున్నారు.

**శ్లో॥ తం క్షేమధామ దేవం త్వాం ప్రాప్తవానస్మ్యతో మయా ।**
**కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్తమత్ర న సంశయః ॥ 21**

ప్ర : తం క్షేమధామ దేవం త్వామ్ = అట్టి క్షేమమైన స్థానమగు దేవుడవైన నిన్ను, ప్రాప్తవాన్ అస్మి = పొందినవాడనైతిని, అతః = అందువలన, మయా = నాచేత, ప్రాపణీయమ్ = పొందదగిన, కృత్యమ్ = కార్యము, కృతమ్ = చేయబడినది, అత్ర ప్రాప్తమ్ = అచటకు చేరినది, న సంశయః = సందేహము లేదు.

**తా :** అట్టి క్షేమధామము నీవు. నిన్ను పొందదగిన కార్యమును నేను నిర్వహించినాను. ఆ కారణముగనే నిశ్చయముగా నేను నిన్ను చేరితిని.

**శ్లో॥ గురో! గురుతరాగమ్య! గురుగమ్య! గుణకార! ।**
**గురూత్తమ! నమస్తేఽస్తు సన్నిధో భవ సర్వదా ॥ 22**

ప్ర : గురో! = ఓ గురూ, అజ్ఞానాంధకారమును నశింపజేయువాడా!, గురుతర+అగమ్య! = చేరుట కత్యంత కష్టమైనవాడా, చేరరానంత మహత్తుగలవాడా!, గురుగమ్య! = గురూపదేశమున మాత్రమే చేరదగినవాడా!, గుణకార! = సత్త్వగుణసిద్ధిని కలిగించువాడా!, గురూత్తమ! = ఉత్తమ గురువైనవాడా!, నమః తే అస్తు = నీకు నమస్కారము, సర్వదా = ఎల్లప్పుడును, సన్నిధః భవ = నాకు సమక్షమగుదువు గాక!

**శ్లో॥ ఏవం సుతీర్థః శ్రీదత్తస్తీర్థకీర్తిః ప్రసాదితః ।**
**ఫుల్లహృన్నేత్రవక్త్రాస్యః ప్రేమ్ణా ప్రాహ పరేశ్వరః ॥ 23**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగ, సుతీర్థః = పూజ్యుడు, తీర్థకీర్తిః = నిర్మలమైన కీర్తిగలవాడు, ప్రసాదితః = ప్రసన్నుడైనవాడు, ఫుల్ల = వికసించిన, హృత్ = హృదయము, నేత్ర = కన్నులు, వక్త్ర = నోరు, ఆస్యః = ముఖము గలవాడై, పరేశ్వరః శ్రీదత్తః = పరమేశ్వరుడైన శ్రీదత్తుడు, ప్రేమ్ణా = ప్రేమతో, ప్రాహ = ఇట్లనెను.

**తా :** ఈ విధముగా పూజ్యుడు, నిర్మలకీర్తిమంతుడు, ప్రసన్నుడు అయిన శ్రీదత్తప్రభువు తన ఆనందము చిఱునవ్వులోనూ, ముఖకాంతిలోనూ, కన్నుల వెలుగులోనూ, హృదయములో కన్పడగా ప్రేమతో యిట్లనెను. (లేదా)

శ్రీదత్తప్రభువు ఆ మాటలకానందించి, ఆ ఆనందము తన ముఖప్రసన్నతలోనూ, కన్నుల కాంతిలోనూ, చిరునవ్వులోనూ ప్రతిఫలించగా, ప్రేమ మీర ఇట్లనెను.

**శ్లో॥ విదితం మత్ప్రసాదేన పరం తత్త్వం త్వయానఘ! ।**
**యావద్దృఢీభవేత్తావదభ్యాసం కురు యత్నతః ॥ 24**

**ప్ర :** అనఘ! = ఓ పాపరహితుడా!, మత్ ప్రసాదేన = నా యనుగ్రహముచేత, త్వయా = నీచే, పరం తత్త్వమ్ = పరమతత్త్వము, విదితమ్ = తెలియవచ్చినది, యావత్ దృఢీభవేత్ = అది గట్టిగా స్థిరమగునంతవరకు, తావత్ = అంతకాలము, అభ్యాసం కురు యత్నతః = ప్రయత్న పూర్వకముగా సాధన చేయుము.

**తా :** పాపములేనివాడా! నా కృపచే నీకు పరమతత్త్వము తెలియవచ్చినది కదా, ఇంక ప్రయత్నపూర్వకముగ, ఈ జ్ఞానము సుస్థిరమగునట్లు సాధన చేయుము.

**శ్లో॥ దరీ నిరామయా హృద్యా గూఢైషాఽత్రాసనమ్ దృఢమ్ ।**
**బధ్వోపవిశ్య సుచిరం సమకాయశిరాః స్వదృక్ ॥ 25**

**ప్ర :** దరీ నిరామయా గూఢా హృద్యా = భయమునకు కారణము లేనిది, రహస్య ప్రదేశమైనది, మనస్సునకు నచ్చినదియైన గుహ, ఏషా = అది, అత్ర = దానియందు, దృఢం ఆసనం బధ్వా = స్థిరమైన ఆసనమును యేర్పరచి, సమకాయశిరాః = శరీరమును, శిరస్సును నిటారుగ నిల్పి, ఉపవిశ్య = కూర్చొని, సుచిరమ్ = చాలకాలము, స్వదృక్ = స్వస్వరూపమున (ఆత్మదర్శనమున) దృష్టిగలవాడై,

**శ్లో॥ మయోపదిష్టం యత్తత్త్వం సమ్యక్చిన్తయ భక్తితః ।**
**తత్ర బోధః సమాధిర్వా నిర్విఘ్నో యో భవేత్స చ ॥ 26**

**శ్లో॥ అనుభూయ చిరం తేన కృతకృత్యో భవిష్యసి ।**
**ఇత్యుక్త్వా దక్షిణం హస్తం నిదధౌ తచ్ఛిరస్యజః ॥ 27**

ప్ర : మయా = నా చేత, ఉపదిష్టమ్ = ఉపదేశింపబడినది, యత్ తత్త్వమ్ = తత్త్వమేదియో, (దానిని), భక్తితః = భక్తితో, సమ్యక్ = బాగుగా, చిన్తయ = వివేకించుము, తత్ర = అచట, యః బోధః = యే జ్ఞానము, వా సమాధిః = లేక సమాధి, నిర్విఘ్నః = విఘ్నములు లేనిదై, భవేత్ = కలుగునో, సః చ = అదికూడ, చిరమ్ = చాలకాలము, అనుభూయ = అనుభవించి, తేన = దానిచే, కృతకృత్యః భవిష్యసి = ధన్యుడవగుచున్నావు, ఇతి ఉక్త్వా = అని పలికి, దక్షిణం హస్తమ్ = కుడి చేతిని, తత్ శిరసి = వాని తలపై, అజః = శ్రీదత్త ప్రభువు, నిదధౌ = ఉంచెను.

**తా (శ్లో.25-27):** నిర్భయమైనది, ప్రశాంతమైనది, యైనట్టి గుహలో స్థిరాసనముపై శరీరమును శిరస్సును నిటారుగ నిల్పి కూర్చుండి ఆత్మదృష్టిగలవాడై నేనుపదేశించిన తత్త్వమును భక్తితో బాగుగ వివేకించగా అచట సమాధి, జ్ఞానము యేది నిర్విఘ్నమై కలుగునో దాని ననుభవించి ధన్యుడవు కమ్ము!, అని శ్రీదత్తప్రభువు పలికి ఆ కార్తవీర్యుని తలపై తన కుడి చేతినుంచెను. ఇందు మూలమున శ్రీదత్తుడు శక్తిపాతమును కలిగించెనని భావము.

**శ్లో॥ మా భీ రాజన్! కృతార్థస్త్వం సాయుజ్యం మమ యాస్యసి ।**
**ఇత్యుక్తస్తం ప్రణమ్యాశు గుహాం గత్వా యథావిధి ॥ 28**

**శ్లో॥ ఉపవిశ్యాసనే దధ్యౌ ప్రసన్నకరణోఽర్జునః ।**
**సమాహితోఽల్పకాలేన సోఽభవత్సుదృఢాసనః ॥ 29**

ప్ర : రాజన్! = ఓ రాజా!, మా భీః = భయపడకుము, త్వమ్ = నీవు, కృతార్థః = కోరినది పొందినవాడవై, మమ సాయుజ్యం యాస్యసి = నా సాయుజ్యమును పొందుదువు, ఇతి ఉక్తః = అని చెప్పబడినవాడై, అర్జునః = కార్తవీర్యార్జునుడు, తం ప్రణమ్య = ఆ దత్తుని నమస్కరించి, ఆశు = వెంటనే, గుహాం గత్వా = గుహను ప్రవేశించి, యథావిధి = శాస్త్రోక్తప్రకారముగా, ఆసనే ఉపవిశ్య = ఆసనమున కూర్చుండి, ప్రసన్నకరణః = ప్రశాంతమైన మనస్సుగలవాడై, దధ్యౌ = ధ్యానించెను, అల్పకాలేన = కొలదికాలములోనే, సః = ఆతడు, సుదృఢాసనః = స్థిరాసనము గలవాడై, సమాహితః అభవత్ = నిశ్చలుడాయెను.

**తా :** భయపడకుము రాజా! నీవు నా సాయుజ్యముక్తిని పొంది ధన్యుడవగుదువు, అని శ్రీదత్తుడనగా, కార్తవీర్యుడా స్వామికి ప్రణమిల్లి వెంటనే గుహలో ప్రవేశించి, శాస్త్రము ననుసరించి ఆసనమున కూర్చుండి, నిర్వికారుడై ధ్యానమగ్నుడై స్థిరుడై నిశ్చలుడాయెను.

**శ్లో॥ ఉత్థితో ద్వాదశదినైః పునర్మాసేన సుస్థిరః ।**
**పునః స్థాణుర్నిశ్చలాత్మా త్రిమాస్యా స సముత్థితః ॥ 30**

ప్ర : ద్వాదశదినైః = పండ్రెండు రోజులకు, ఉత్థితః = ధ్యానమునుండి లేచినవాడై, పునః =

మరల, మాసేన = ఒక నెలరోజులకు, సుస్థిరః = సునిశ్చితిగలవాడై, పునః = మరల, స్థాణుః = కదలనివాడై, నిశ్చలాత్మా = నిశ్చలమనస్కుడై, త్రిమాస్యా = మూడు నెలలకు, సః సముత్థితః= ఆతడు ఆసనము నుండి లేచెను.

**తా :** పండ్రెండు దినములకు ఆసనమునుండి లేచి, మరల ఒక్క నెలకు కూడదీసికొని మరల శరీరము, మనస్సు నిశ్చలముగా మూడు నెలల కాలముండి అప్పుడాతడు ధ్యానము చాలించి లేచెను.

**శ్లో॥ ఉత్థాయ శనకైః ప్రాప్య వవన్దేఽఙ్ఘ్ర్యబ్జ ఈశితుః ।**
**తమాలిఙ్గ్యాహ భగవాననుభూతం కిముచ్యతామ్ ॥ 31**

**ప్ర :** ఉత్థాయ = లేచి, శనకైః = మెల్లగా, ప్రాప్య = చేరి, ఈశితుః = శ్రీదత్తప్రభువుయొక్క, అఙ్ఘ్రి+అబ్జః = పాదపద్మమును, వవన్దే = నమస్కరించెను, తమ్ = వానిని, ఆలిఙ్గ్య = కౌగలించి, భగవాన్ ఆహ = శ్రీదత్తభగవానుడిట్లనెను, కిం అనుభూతమ్ = నీకు కలిగిన అనుభూతి యెట్టిదో, ఉచ్యతామ్ = చెప్పుము.

**తా :** ధ్యానము చాలించి లేచి మెల్లగా శ్రీదత్తప్రభువును చేరి, వాని పాదపద్మమునకు నమస్కరించగా, ఆ ప్రభువు వానిని కౌగలించికొని, నీ కేమి అనుభూతి కలిగినదో చెప్పుమనెను.

**శ్లో॥ దృఢాసనో భవాన్ కాలమేతావన్తం సమాహితః ।**
**కథమవ్యగ్రయా బుద్ధ్యా నైశ్చల్యం పరమం గతః ॥ 32**

**ప్ర :** దృఢాసనః = దృఢమైన ఆసనముననున్నవాడవై, భవాన్ = నీవు, ఏతావన్తం కాలం సమాహితః = ఎంతకాలము శాంతుడవై యుంటివో, అవ్యగ్రయా బుద్ధ్యా = ఉద్రిక్తముగాని మనస్సుతో, కథమ్ = ఎట్లు, పరమం గతః = పరమానందమును పొందితివి?

**తా :** దృఢముగ ఆసనస్థుడవై ఎంతకాలము నీ వనుద్రిక్తమతివై శాంతుడవై యుంటివి, అప్పుడెట్టి పరమానందమును పొందితివి?

**శ్లో॥ ప్రహస్యాహార్జునో నత్వా భూమన్! క్వానుభవః పృథక్ ।**
**పృథక్చ కోఽనుభవితా సర్వత్రాస్మీహ ఖే ఖవత్ ॥ 33**

**శ్లో॥ తథాప్యుత్థిత ఏవానుస్మరే శ్రీసద్గురోః కృపామ్ ।**
**పరానన్దే నిమగ్నస్య త్రిపుటీ నైవ భాతి మే ॥ 34**

**ప్ర :** అర్జునః = కార్తవీర్యార్జునుడు, నత్వా = నమస్కరించి, ప్రహస్య = నవ్వి, ఆహ = ఇట్లనెను, భూమన్! = ఓ అద్వయ బ్రహ్మా!, క్వ+అనుభవః = అనుభవమేమి?, కః అనుభవితా = అనుభవించిన వాడెవడు?, సర్వత్ర ఇహ = విశ్వమునందంతట, ఖే = ఆకాశమున, ఖవత్ = ఆకాశమువలె, అస్మి = ఉన్నాను; తథా అపి = అట్లయినను, ఉత్థితః = ధ్యానము చాలించి లేచినవాడనై,

శ్రీసద్గురోః కృపాం ఏవ = శ్రీదత్తసద్గురుని కృపను మాత్రమే, అనుస్మరే = స్మరింతును, పరానన్దే = పరమానందమున, నిమగ్నస్య = మునిగియున్న, మే = నాకు, త్రిపుటీ = అనుభవించువాడు, అనుభవింపబడునది, అనుభవము అను మూడిటితో కూడిన జ్ఞానము, న+ఏవ భాతి = కలుగనే కలుగుట లేదు.

**తా :** కార్తవీర్యార్జునుడు చిఱునవ్వుతో నమస్కరించి ఇట్లనెను : ఓ అఖండబ్రహ్మా! అనుభవమెక్కడ? అనుభవించువాడెవడు? ఆకాశమున ఆకాశమున్నట్లు నేనే అంతట, అన్నిట ఉంటిని. ఐనను, ధ్యానానంతరము బాహ్యస్మృతిలో ఈ స్థితి గురుకృపవలన కలిగినదనియు, ఈ పరమానందస్థితిలో కర్త కర్మ క్రియ అనబడు త్రిపుటి, మూడైన జ్ఞానము కలుగదనియు స్మరించికొంటిని.

**శ్లో॥ తదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ ।**
**పరమానన్ద ఆభాతి ధీశ్చాపి న విచేష్టతే ॥ 35**

**ప్ర :** తదా = అప్పుడు, పఞ్చ జ్ఞానాని = అయిదు జ్ఞానేంద్రియములు, మనసా సహ = మనస్సుతో గూడ, అవతిష్ఠన్తే = నిగ్రహింపబడిన వగును, ధీః అపి చ = బుద్ధి, వివేకము గూడ, విచేష్టతే = చేష్టలుడిగిన దగును, పరమానన్దః = పరమానందము, ఆభాతి = సర్వమై ప్రకాశించును.

**తా :** ఆ స్థితిలో జ్ఞానేంద్రియములైదు, మనస్సు, బుద్ధి కూడా నిగ్రహింపబడినవై చేష్టలుడుగును. పరమానందమే సర్వస్వమై ప్రకాశించును.

**శ్లో॥ తదా ప్రమత్తతా స్వామిన్! సుస్థిరేన్ద్రియధారణా ।**
**స ఆనన్దో న కరణైర్వాచ్యో న చ హృదా ధియా ॥ 36**

**ప్ర :** తదా = అప్పుడు, స్వామిన్! = ఓ స్వామీ!, ప్రమత్తతా = మైమరపు, సుస్థిర+ఇన్ద్రియధారణా = స్థిరముగా ఇంద్రియనిగ్రహము కలిగియుండుట, సః ఆనన్దః = ఆ ఆనందము, కరణైః = భాషారూపమైన పరికరములచే, న వాచ్యః = వాకొనరానిది, న చ హృదా ధియా = మనస్సునకైన, బుద్ధికైన అందనిది.

**తా :** ఆ స్థితిలో కలుగు మైమరపు, ఇంద్రియనిగ్రహము, ఆ ఆనందము వర్ణించి చెప్పుటకు భాషలేదు, మనస్సు భావింపలేదు, బుద్ధి వివేకింపలేదు.

**శ్లో॥ తదాఽజ్ఞాతాపి చాత్మార్థవృత్తిః ప్రాగ్భావనావశాత్ ।**
**అద్యానుస్మర్యతే భూమానన్దం ధ్యాప్తం కథం బ్రువే ॥ 37**

**ప్ర :** తదా = అప్పుడు, అజ్ఞాతా అపి = తెలియనిదే యైనను, ప్రాక్ భావనావశాత్ = సమాధియందలి అనుభవమును భావించినందువలన, ఆత్మార్థవృత్తిః = ఆత్మజ్ఞానము, అద్య చ = ఇప్పుడున్నూ, అనుస్మర్యతే = నెమరువేయబడుచున్నది, భూమ+ఆనన్దమ్ = మహదానందము, ధ్యాప్తమ్ = ధ్యానమున పొందబడినది (ధ్యా+ఆప్తం), కథమ్ = ఎట్లు, బ్రువే = చెప్పుదును.

**తా :** ఆ స్థితిలో ముందటి సమాధిలోని అనుభవమును నెమరువేసికొనుటవలన అదే మహదానందము కలుగును. దాని నెట్లు చెప్పగలను?

**శ్లో॥ భవత్ప్రసాదాదానన్దమనుభూతోఽస్మ్యనుత్తమమ్ ।**
**పునర్దేహదశాం నీతః ప్రారబ్ధేన జవీయసా ॥ 38**

**ప్ర :** భవత్ ప్రసాదాత్ = తమ అనుగ్రహమువలన, అనుత్తమం ఆనన్దమ్ = ఉత్తమోత్తమమైన ఆనందమును, అనుభూతః అస్మి = అనుభవించినవాడనైతిని, ప్రారబ్ధేన = ప్రారబ్ధకర్మఫలముచేత, జవీయసా = వేగవంతమైనదానిచేత, పునః = మరల, దేహదశాం నీతః = ఆత్మస్థానమునుండి దేహదశను పొందింపబడితిని.

**తా :** తమ అనుగ్రహమువలన ఉత్తమోత్తమమైన ఆనందమును అనుభవించితిని, ప్రారబ్ధకర్మ ఫలముగా మరల దేహస్పృహను పొందితిని.

**శ్లో॥ ఇహ కాపి న మే హానిర్భవన్తం పశ్యతో విభో! ।**
**సుగుణోఽపి హి పూర్ణాత్మా సర్వానన్దనిధిర్భవాన్ ॥ 39**

**ప్ర :** ఇహ = జగత్తులో, భవన్తం పశ్యతః = తమరిని చూచుచున్నవాడనైన, మే = నాకు, కా అపి హానిః = ఏ విధమైన హానియును, న = లేదు, విభో! = ఓ ప్రభూ! హి = ఏలయనగా, భవాన్ = తమరు, సుగుణః = గుణవంతులు, అపి = మరియు, పూర్ణాత్మా = ఆత్మప్రపూర్ణులు, సర్వ+ఆనన్ద నిధిః = సమస్తమైన, ఆనందముల ప్రోవు.

**తా :** ఓ ప్రభూ! తమరిని దర్శించుచున్న నాకు జగత్తులో ఎట్టి హానియు లేదు. ఏలన, తమరు సుగుణములు గలవారు. అయినను గుణసంబంధిదోషములు లేని పూర్ణమైన ఆత్మస్వరూపులు, ఆనందము లన్నిటికి నెలవు.

**శ్లో॥ బహూనా కిమిహోక్తేన నిస్తీర్ణోఽస్మి భవామ్బుధేః ।**
**పరమానన్దసన్దోహనిమగ్నోఽస్మి నిరాకులః ॥ 40**

**ప్ర :** ఇహ = ఇప్పుడు, కిం బహునా ఉక్తేన = ఎక్కువగా మాట్లాడిన ప్రయోజనమేమి?, భవ+అమ్బుధేః = సంసారసాగరమునుండి, నిస్తీర్ణః+అస్మి = దాటించబడితిని, పరమ+ఆనన్ద సందోహనిమగ్నః = బ్రహ్మానందమున మున్గినవాడనై, నిరాకులః = వ్యాకులత లేనివాడను, అస్మి = అయితిని.

**తా :** పలు మాటలేల? నేను సంసారసాగరమునుండి ఆవలి తీరము జేరితిని, బ్రహ్మానందమున మునిగితిని, వ్యాకులత లేనివాడనైతిని.

**శ్లో॥ న కిఞ్చిన్మేఽస్తి కర్తవ్యం కృతం సర్వమశేషతః ।**
**జ్ఞాతవ్యమపి విజ్ఞాతం ప్రాప్తం ప్రాప్తవ్యమప్యహో! ॥ 41**

ప్ర : మే = నాకు, కర్తవ్యమ్ = చేయదగినది, కిఞ్చిత్ = కొంచెము, న అస్తి = లేదు, సర్వమ్ = అంతయు, అశేషతః = మిగులులేకుండ, కృతమ్ = చేయబడినది, జ్ఞాతవ్యం అపి = తెలియదగినది కూడ, విజ్ఞాతమ్ = చక్కగా తెలిసికొనబడినది, ప్రాప్తవ్యం అపి = పొందదగినది కూడ, ప్రాప్తమ్ = పొందబడినది, అహో! = ఔరా!

తా : ఔరా! నాకింక కర్తవ్యమనునదిగాని, జ్ఞాతవ్యముగాని, ప్రాప్తవ్యముగాని లేదు. చేయదగిన దంతయు చేసితిని, తెలియదగినదంతయు తెలిసికొంటిని, పొందదగినది పొందితిని.

**శ్లో॥ ఇదం స్వాత్మసుఖం త్యక్త్వా మనో మే నైతి కుత్రచిత్ ।**
**న కం కృతేన రాజ్యేన నాకం త్యక్తేన వా పునః ॥ 42**

ప్ర : ఇదం స్వాత్మసుఖమ్ = ఈ ఆత్మసాక్షాత్కారసుఖమును, త్యక్త్వా = విడిచి, మే మనః = నా మనస్సు, కుత్రచిత్ = ఎక్కడకునూ, న ఏతి = వెడలుట లేదు, కృతేన రాజ్యేన = రాజ్యము చేసినందువలన, న కమ్ = సుఖము లేదు, వా పునః = లేక మరల, త్యక్తేన = వదలినందున, న అకమ్ = దుఃఖము లేదు.

తా : ఈ ఆత్మానుభూతిసుఖమును విడచి నా మనస్సు వేరెక్కడకునూ కదలుట లేదు. రాజ్యపాలనము వలన సుఖము గాని రాజ్యత్యాగమువలన దుఃఖము గాని లేదు.

**శ్లో॥ అదః పూర్ణమిదం పూర్ణం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।**
**పూర్ణస్యాదాయ పూర్ణం హి పూర్ణం బ్రహ్మావశిష్యతే ॥ 43**

ప్ర : అదః = అది, జగత్తునకు హేతువైన అవ్యక్తపరబ్రహ్మతత్త్వము, పూర్ణమ్ = అఖండము, అనాద్యనంతము, ఇదమ్ = ఇది, జగత్తు, వ్యక్తసృష్టి, పూర్ణమ్ = అఖండము, అనాది, అనంతము, పూర్ణాత్ = అఖండపరబ్రహ్మతత్త్వమునుండి, పూర్ణమ్ = నామరూపగుణవ్యక్తజగత్తు, ఉదచ్యతే = ఉదయించుచున్నది, పూర్ణస్య = నామరూపగుణజగత్తుయొక్క, పూర్ణమ్ = అసత్పదార్థ సర్వస్వమును, ఆదాయ = తీసిన, పూర్ణం హి బ్రహ్మ = బ్రహ్మ పూర్ణముగనే, అవశిష్యతే = మిగులును.

తా : జగత్తు వ్యక్తము, అనంతము. ఇది నామరూపగుణచేతనాదులచే వ్యక్తమగునది. దీనికి మూలము అఖండపరబ్రహ్మము. ఇది అవ్యక్తము. ఈ అవ్యక్తతత్త్వమునుండియే వ్యక్తజగత్తు వెలువడుట. ఈ వ్యక్తజగత్తునుండి వ్యక్తలక్షణములన్నిటిని ఉపసంహరించికొన్నను, అఖండ బ్రహ్మతత్త్వము అట్టే మిగిలి యుండును.

**శ్లో॥ ఆత్మైకః పరిపూర్ణోఽత్ర నాన్యత్కిఞ్చిత్తతః పరమ్ ।**
**జ్ఞాతం భవత్ప్రసాదాన్మే భగవన్నాత్ర సంశయః ॥ 44**

ప్ర : ఆత్మా+ఏకః = ఆత్మ ఒక్కటే, పరిపూర్ణః = అఖండము, అత్ర = ఇచట, తతః పరమ్ = ఆత్మకంటె వేరైనది, అన్యత్ = మరియొకటి, కిఞ్చిత్ న = కొంచెమైన లేదు, భవత్ ప్రసాదాత్ =

మీ అనుగ్రహము వలన, భగవన్ = ఓ స్వామీ!, మే = నాకు, జ్ఞాతమ్ = తెలిసినది, న సంశయః = సందేహము లేదు.

**తా :** ఆత్మ మాత్రమే పరిపూర్ణము. ఇచట ఆత్మ తప్ప మరియొకటేదియు లేదు. మీ అనుగ్రహము వలన, ఓ స్వామీ! నే నా సత్యమును నిశ్చయముగా తెలిసికొంటిని.

**శ్లో॥ అతో సజ్యే వ్యవహృతో దేశే కాలార్థవస్తుషు ।**
**సదా భాతి చిదాత్మాతః సుఖమయ్యోఽఖిలా దిశః ॥ 45**

**ప్ర :** అతః = అందువలన, సజ్యే = గ్రహింతును, చిదాత్మా = ఆత్మ చైతన్యము, దేశే = దేశమున, కాల+అర్థవస్తుషు = కాలమున, ఇంద్రియవిషయములందు, వ్యవహృతః = వ్యవహరింపబడుచు, ప్రవర్తించుచు, సదా = ఎల్లప్పుడు, భాతి = ప్రకాశించుచున్నది, అతః = ఆ కారణమున, అఖిలాః దిశః = దిక్కులన్నియు, సుఖమయ్యః = సుఖమయములై యున్నవి.

**తా :** అందువలన ఆత్మచైతన్యము దేశకాలములందును ఇంద్రియవిషయవస్తుజాలమునందును సదా ప్రవర్తించుచు ప్రకాశించుచుండును. కావుననే దిక్కులన్నియు సుఖమయములై యున్నవి.

**శ్లో॥ యద్యాజ్ఞా భవతో భూయో ధ్యానార్థం ప్రవిశే గుహామ్ ।**
**ఈక్షే భవత్స్వరూపం వా సగుణం నాగ్రహో మమ ॥ 46**

**ప్ర :** యది భవతః ఆజ్ఞా = తమయొక్క ఆజ్ఞయైన యెడల, భూయః = మరల, ధ్యానార్థమ్ = ధ్యానము చేయుటకై, గుహాం ప్రవిశే = గుహను ప్రవేశింతును, భవత్ స్వరూపమ్ = తమ స్వరూపమును, సగుణమ్ = సగుణమూర్తిగా, మమ = నాకు, న అగ్రహః వా = గ్రాహ్యము కాదేమో, ఈక్షే = చూతును, ప్రయత్నింతును.

**తా :** మీ ఆజ్ఞయైనచో, మరల గుహను ప్రవేశించి, ధ్యానమగ్నుడనై తమ సగుణమూర్తిని దర్శింప గలనేమో ప్రయత్నించి చూతును.

**శ్లో॥ శ్రీశః ప్రాహ నృప! స్నాత్వా కృత్వా నిత్యవిధిం సుధీః ।**
**కృత్వాహారం సమాధిం చ శ్వోభూతే వ్రజ పూర్ణదృక్ ॥ 47**

**ప్ర :** శ్రీశః = శ్రీదత్తప్రభువు, ప్రాహ = ఇట్లనెను, నృప = ఓ రాజా!, స్నాత్వా = స్నానము చేసి, నిత్యవిధిం కృత్వా = సంధ్యావందనాది నిత్యవైదికధర్మములను నిర్వహించి, సుధీః = సద్బుద్ధి గలిగి, కృత్వా ఆహారమ్ = భుజించి, శ్వోభూతే = రేపటి దినమున, పూర్ణదృక్ = దృష్టిని చెదరనీక, సమాధిం చ వ్రజ = సమాధిస్థితిని గూడ పొందుము.

**తా :** శ్రీదత్తుడిట్లనెను : ఓ రాజా! స్నానము చేసి, నిత్యకృత్యములను నిర్వహించి, సద్వివేకివై, భోజనము చేసి, రేపటి దినమున పూర్తిగా దృష్టిని నిల్పి సమాధిస్థితిని పొందుము.

**శ్లో॥ ఇత్యాజ్ఞప్తస్తథా చక్రే సోఽర్జునోఽథ సమాహితః ।**
**షణ్మాసాత్పునరుత్థానం ప్రాప శ్రీదత్తవాఞ్ఛయా ॥ 48**

**ప్ర :** ఇతి ఆజ్ఞప్తః = ఇట్లు ఆజ్ఞాపింపబడినవాడై, సః అర్జునః = ఆ కార్తవీర్యార్జునుడు, అథ సమాహితః = అంతట సంసిద్ధుడై, తథా చక్రే = అట్లు ఆజ్ఞానుసారము చేసెను, షణ్మాసాత్ = ఆరునెలలకు, పునః = మరల, శ్రీదత్తవాఞ్ఛయా = శ్రీదత్తుని సంకల్పముచే, ఉత్థానం ప్రాప = సమాధి చాలించి లేచెను.

**తా :** ఇట్లాజ్ఞాపింపబడినవాడై అంతట కార్తవీర్యార్జునుడు ధ్యానమగ్నుడై, మరల ఆరునెలల తరువాత శ్రీదత్తసంకల్పమువలన ధ్యానము చాలించి లేచెను.

**శ్లో॥ తతః పునర్విశేత్యుక్తో భూయో యోగీ సమాహితః ।**
**వర్షేణోత్థాయ చాగత్య నత్వాగ్రే శ్రీగురోః స్థితః ॥ 49**

**ప్ర :** తతః = అంతట, పునః = మరల, విశ = ప్రవేశించుము, ఇతి ఉక్తః = అని చెప్పబడిన, యోగీ = యోగియైన కార్తవీర్యార్జునుడు, భూయః సమాహితః = మరల ధ్యానమగ్నుడై, వర్షేణ = ఒక్క సంవత్సరకాలమునకు, ఉత్థాయ = లేచి, ఆగత్య చ = వచ్చియును, శ్రీగురోః అగ్రే = శ్రీదత్తగురువుయొక్క ముంగిట, నత్వా స్థితః = నమస్కరించి నిల్చెను.

**తా :** అంతట మరల ప్రవేశింపుమని ఆజ్ఞకాగా, యోగి కార్తవీర్యార్జునుడు మరల ధ్యానమగ్నుడై, సంవత్సరము గడచిన తరువాత ధ్యానము చాలించి లేచి వచ్చి శ్రీదత్తుని ఎదుట నమస్కరించి నిల్చెను.

**శ్లో॥ తం ప్రాహ ప్రణతం శాన్తం స్వభక్తం భక్తవత్సలః ।**
**స్వాగ్రే తముపవేశ్యాఙ్గ త్వయా పృష్టం మయోదితమ్ ॥ 50**

**ప్ర :** భక్తవత్సలః = భక్తులకు తల్లివంటి వాడైన శ్రీదత్తుడు, ప్రణతమ్ = నమస్కరించిన, శాన్తమ్ = శాంతుడైన, స్వభక్తం తమ్ = తన భక్తుడైన వానితో, తమ్ = వానిని, స్వ+అగ్రే = తనముందు ఉపవేశ్య = కూర్చుండజేసి, ప్రాహ = ఇట్లనెను, అఙ్గ = నిశ్చయముగా, త్వయా = నీ చేత, పృష్టమ్ = అడుగబడినది, మయా = నా చేత, ఉదితమ్ = చెప్పబడినది.

**తా :** భక్తవత్సలుడైన శ్రీదత్తుడు తనకు నమస్కరించిన, శాంతుడైన, తన భక్తుని తనముందు కూర్చుండ జేసి యిట్లనెను : నీవడిగినది నేను చెప్పినాను.

**శ్లో॥ కిమాచారేణ మే కృత్యం తవాపి చ తథాప్యయమ్ ।**
**ధర్మః సనాతనః సేవ్యో లోకోపకృతయే సదా ॥ 51**

**ప్ర :** మే = నాకు, తవ+అపి చ = నీకు గూడను, ఆచారేణ = ఆచారముతో, కిం కృత్యమ్ = చేయదగినదేమి?, తథా అపి = అట్లయినను, అయమ్ = ఇది, సనాతనః ధర్మః = చాల

పురాతనమైన ధర్మము, లోక+ఉపకృతయే = లోకోపకారమునకై, సదా సేవ్యః = ఎల్లవేళల ఆచరించదగినది.

**తా :** నాకును, నీకును గూడ ఆచారముతో పనిలేదు. అయినను, లోకోపకారముకొరకై మన మీ సనాతనధర్మమును ఆచరించవలసినదే.

**శ్లో॥ లోకబాధానిరాసార్థం విపరీతం క్వచిద్బహిః ।**
**చరిత్వాపి నహి త్యాజ్యాః క్రియా వర్ణాశ్రమోచితాః ॥ 52**

**ప్ర :** లోక బాధా నిరాసార్థమ్ = లోకబాధను తొలగించుటకై, క్వచిత్ = ఒకచో, బహిః = వెలుపల, విపరీతమ్ = విపరీతముగా, చరిత్వా అపి = ఆచరించినను, వర్ణాశ్రమోచితాః క్రియాః = వర్ణాశ్రమములకు తగిన కార్యములను, నహి త్యాజ్యాః = విడువరాదు.

**తా :** ఒకచో బాహ్యదృష్టికి మనచర్యలు విపరీతముగా తోచినను, వర్ణాశ్రమధర్మములు ఆచరణీయములే.

**శ్లో॥ గృహస్థేన త్వయా భూప! త్రివిధా కర్మచోదనా ।**
**లోకసంగ్రహసిద్ధ్యర్థం శ్రద్ధయైవ విజానతా ॥ 53**

**ప్ర :** భూప! = ఓ రాజా!, గృహస్థేన త్వయా = గృహస్థాశ్రమివైన నీచేత, త్రివిధా = మూడు విధములైన, కర్మచోదనా = కర్మాచరణ, లోకసంగ్రహసిద్ధ్యర్థమ్ = లోకమున శుభము జరుగుటకు, శ్రద్ధయా ఏవ = శ్రద్ధతోడనే, విజానతా = తెలియదగును.

**తా :** ఓ రాజా! నీవు గృహస్థాశ్రమమున నున్న వాడవు. కావున నీకు లోకశ్రేయమునకై చేయదగిన కార్యములు మూడు విధములు.

**శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోఽపి చ ।**
**స యత్ప్రమాణం మనుతే లోకస్తదనువర్తతే ॥ 54**

**ప్ర :** శ్రేష్ఠః = సమాజములోని పెద్ద, యత్ యత్ ఆచరతి = ఏమేమి చేయునో, తత్ తత్ ఏవ ఇతరః అపి చ = ఇతరుడు కూడ దానినే (చేయును), సః = ఆ శ్రేష్ఠుడు, యత్ = దేనిని, ప్రమాణం మనుతే = ప్రమాణముగ భావించునో, లోకః = లోకప్రజలు, తత్ అనువర్తతే = దాని ననుసరించి ప్రవర్తింతురు.

**తా :** సమాజములోని వయః శ్రేష్ఠులు, విద్యాశ్రేష్ఠులు, అధికారశ్రేష్ఠులు యేమేమి చేయుదురో, దానినే సాధారణప్రజలు కూడ చేయుదురు. శ్రేష్ఠులు తమ కే యే శాస్త్రములు ప్రమాణమని చెప్పుదురో, స్వీకరింతురో, వానినే అన్యులు గూడ స్వీకరింతురు.

**శ్లో॥ దోషబుద్ధ్యా భయాతీతః నిషిద్ధాన్న నివర్తతే ।**
**గుణబుద్ధ్యా న విహితం కరోతి జ్ఞోఽపి బాలవత్ ॥ 55**

**శ్లో॥ యస్త్వాత్మరతిరాత్మజ్ఞః స్వాత్మతృప్తః సదాత్మవాన్ ।**
**స్వాత్మన్యేవాత్మని తుష్టస్తత్కార్యం క్వావశిష్యతే ॥ 56**

**శ్లో॥ కృతేన తస్య నైవార్థో నానర్థోఽప్యకృతేన చ ।**
**అతోఽస్య నైవ కుత్రాపి కశ్చనార్థవ్యపాశ్రయః ॥ 57**

**ప్ర :** యః తు = ఎవడైతే, దోషబుద్ధ్యా = తప్పుచేయుచున్నానను స్పృహతో, భయాతీతః = భయములేనివాడై, నిషిద్ధాత్ = నిషిద్ధకర్మలనుండి, న నివర్తతే = వెనుదిరుగడో, గుణబుద్ధ్యా = మంచిదను భావముతో, విహితమ్ = శాస్త్రనిర్ణయమైన కర్మలు, జ్ఞః అపి = తెలిసిన వాడైనను, బాలవత్ = బాలునివలె, న కరోతి = చేయకుండునో, ఆత్మరతిః = ఆత్మయందే ఆనందించువాడు, ఆత్మజ్ఞః = ఆత్మనెఱిగిన వాడు, స్వ+ఆత్మ-తృప్తః = తన ఆత్మయందే సంతుష్టుడు, సదాత్మవాన్ = సత్పదార్థమైన ఆత్మదృష్టిగలవాడు, స్వ+ఆత్మని ఏవ = తన ఆత్మయందే, ఆత్మనా తుష్టః = ఆత్మతో సంతుష్టుడో, తత్ = వానికి, కార్యమ్ = కర్తవ్య కర్మ యనునది, క్వ = ఎక్కడ, అవశిష్యతే = మిగిలియుండును?, తస్య = వానికి, కృతేన = చేయుటచేత, చేసిన కర్మచేత, న అర్థః ఏవ = ఫలభోగము కలుగదు, అకృతేన చ = కర్మ చేయనందువలన, న అనర్థః అపి = బాధయును లేదు, అతః = అందువలన, అస్య = వానికి, కుత్ర అపి = ఎక్కడనైనను, కశ్చన = ఎట్టిదిగాని, అర్థవ్యపాశ్రయః = చేరదగిన సత్ఫలము చేరకుండుట యనునది, న ఏవ = లేనే లేదు.

**తా :** ఎవడైతే దోషబుద్ధి గలిగి భయములేక నిషిద్ధకర్మలు చేయునో, గుణమునెంచి శాస్త్రవిహిత కర్మలు తెలిసియు, బాలునివలె ప్రవర్తించుచు చేయకుండునో, ఆత్మానందమును పొందుచుండు ఆత్మజ్ఞానియై, ఆత్మవంతుడై, ఆత్మతృప్తి గలిగి, ఆత్మానందము కాక విషయానందమునకు తృప్తిచెందడో, అట్టివాడు కర్మచేసినచో కలుగు ప్రయోజనములేదు, చేయకున్న నష్టమునూ లేదు, అనగా ఆతడు పుణ్యపాపము లంటనివాడని భావము.

**శ్లో॥ ద్వావేతౌ పురుషౌ లోకే పరమానన్దనిర్భరౌ ।**
**యోగయుక్తో ద్వయాతీతో యశ్చ బుద్ధేః పరం గతః ॥ 58**

**ప్ర :** ఏతౌ ద్వౌ పురుషౌ = ఈ యిద్దరు పురుషులు, లోకే = లోకమున, పరమానన్ద-నిర్భరౌ = పరమానందము ననుభవించువారు, ద్వయాతీతః = ద్వయభావమునకు లొంగనివాడైన, యోగయుక్తః = యోగి, యః చ = మరియొకడు, బుద్ధేః = బుద్ధికి, పరంగతః = పరమత్వమును పొంది (నిష్కామకర్మ చేయువాడు).

**తా :** లోకమున యిద్దరు పరమానందభరితులు. ఒకడు యోగియై ఆద్వయభావమున విడచి లోకమంతయు ఆత్మస్వరూపముగ దర్శించువాడు; వేరొకడు, కర్మతత్త్వమును వివేకించి నిష్కామకర్మ చేయువాడు.

శ్లో॥ పురం గచ్ఛావనిం పాహి సప్తద్వీపాం భుజాఽర్జితామ్ ।
దేవాన్యజ్ఞైర్యజ శ్రాద్ధైః పితౄన్దానైర్ద్విజానపి ॥ 59

శ్లో॥ విప్రాన్సన్తర్పయ స్వర్ణగోభూకన్యారథాదిభిః ।
భూయో భూయోఽపి మే ప్రీత్యా దర్శనం చ సమాచర ॥ 60

శ్లో॥ స్మరణం కురు రాజ్యేఽపి హృదాఽవ్యగ్రేణ మే సదా ।
పరానన్దస్వరూపం మే న విస్మరసి కర్హిచిత్ ॥ 61

శ్లో॥ అన్తర్నిష్ఠః సదా యుక్తో బహిర్వ్యవహరన్నపి ।
ప్రవాహపతితం కర్మ కురు తేన న లిప్యసే ॥ 62

శ్లో॥ జీవన్ముక్తః సదా తిష్ఠ యావదారబ్ధమాత్మదృక్ ।
తతో విదేహకైవల్యం ప్రాప్స్యసే మయి నిశ్చితమ్ ॥ 63

శ్లో॥ మయాఽనుశిష్టో గచ్ఛాశు యథోక్తం సమ్యగాచర ।
సుఖీభవానన్దమయః సదైవ త్వం నిరామయః ॥ 64

ప్ర : పురం గచ్ఛ = నీ నగరమునకు పొమ్ము, భుజా+అర్జితామ్ = భుజబలముచే సంపాదింపబడిన, సప్తద్వీపామ్ = సప్తద్వీపములుగల, అవనిమ్ = భూమిని, పాహి = పాలించుము, దేవాన్ = దేవతలను, యజ్ఞైః = యజ్ఞములతో, యజ = పూజించుము, పితౄన్ = పితరులను, శ్రాద్ధైః = ప్రతిసాంవత్సరిక శ్రాద్ధకర్మలతో, ద్విజాన్ = బ్రాహ్మణులను, దానైః = దానములతో, విప్రాన్ = బ్రాహ్మణులను, సన్తర్పయ అపి = సంతోష పెట్టుముగూడ, స్వర్ణగోభూకన్యారథాదిభిః = బంగారము, గోవులు, భూమి, కన్యలు, రథములు మొదలగు వానితో, భూయః భూయః అపి = మరల మరల కూడ, మే దర్శనమ్ = నా దర్శనమును, ప్రీత్యా = ఇష్టముతో, సమాచర = చేయుము, రాజ్యే అపి = రాజ్యపాలనమందున్నను, అవ్యగ్రేణ హృదా = చింతలులేని మనస్సుతో, సదా = ఎల్లప్పుడు, మే స్మరణం కురు = నన్ను స్మరించుము, కర్హిచిత్ = ఎప్పుడైనను, మే పరానన్ద-స్వరూపమ్ = నా పరమానందస్వరూపమును, న విస్మరసి = విస్మరించకుము, అన్తః+నిష్ఠః = ఆత్మనిష్ఠగలిగి, బహిః వ్యవహరన్ అపి = వెలుపల లోకమున ప్రవర్తించుచున్నను, సదా యుక్తః = ఎప్పుడును, ఆత్మయుతుడవై, న లిప్యసే = ఫలభోగము నిన్నంటదు, జీవన్ముక్తః = జీవన్ముక్తుడవై, యావత్ ఆరబ్ధమ్ = ప్రారబ్ధకర్మ యున్నంతవరకు, ఆత్మదృక్ = ఆత్మదృష్టి కలిగి, సదా తిష్ఠ = ఎప్పుడును ప్రవర్తించుము, తతః = ఆపై, మయి = నా యందు, విదేహ కైవల్యమ్ = మరణానంతరము కైవల్యమును, ప్రాప్స్యసే = పొందుదువు, నిశ్చితమ్ = నిశ్చయము, మయా = నా చేత, అనుశిష్టః = అనుమతించబడినవాడవై, ఆశు గచ్ఛ = వెంటనే వెడలుము, యథా ఉక్తమ్ = ఎట్లు చెప్పబడినదో అట్లు, సమ్యక్+ఆచర = చక్కగ ఆచరించుము, సుఖీభవ =

సుఖముండుము, సదా+ఏవ త్వమ్ = నీవెల్లపుడును, నిరామయః = ఆధివ్యాధులు లేకుండ, ఆనన్దమయః = ఆనందమయుడవు (భవ = కమ్ము).

**తా :** నీవు నీ నగరమునకు పోయి, నీ రాజ్యమును పాలించుము. దేవతలను యజ్ఞములతో పూజించి, పితరులను శ్రాద్ధకర్మలతోను, బ్రాహ్మణులను దానములతోను, బంగారమును, గోవులను, భూమిని, కన్యలను, రథాదులను సంతోషపెట్టుము. మరల మరల నా దర్శనమునకై రమ్ము. రాజ్యపాలనములో నున్నను మనసా నన్ను స్మరించుము. ఎప్పుడును నా పరమానందరూపమును స్మరించుము. లోకవ్యవహారములో మునిగియున్నను, సదా ఆత్మయుక్తుడవై కర్మలు చేయుము. దానిచే కర్మఫలమైన పాపపుణ్యములు, సుఖదుఃఖములు నిన్నంటవు. ప్రారబ్ధమున్నంతవరకు జీవన్ముక్తుడవై నిష్కామకర్మ చేయుము. నాయందు విదేహకైవల్యమును పొందుదువు. నా అనుమతితో వెంటనే వెడలుము. నేను చెప్పిన రీతిగా ఆచరించుము. ఆధివ్యాధులు లేకుండ ఆనందముగ సుఖముగ జీవించుము.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం చతుర్థాష్టకే తృతీయాధ్యాయః ॥

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## చతుర్థాష్టకము - చతుర్థాధ్యాయము

**శ్లో॥ ఋతస్య గోపోఽద్య భవాన్యదాజ్ఞాపయతి ప్రభుః ।**
**తన్మే మూర్ధ్నా ధృతమితి ప్రోక్త్వా నత్వాఽర్జునో గతః॥ 1**

**ప్రతిపదార్థం :** ఋతస్య = తప్పక రావలసిన ఫలమునకు, గోపః = రక్షకుడు, ప్రభుః = ప్రభువు, భవాన్ = తమరు, అద్య = నేడు, యత్ ఆజ్ఞాపయతి = యే ఆజ్ఞనిచ్చితిరో, తత్ = అది, మే మూర్ధ్నా ధృతమ్ = నా శిరసున ధరించబడినది, ఇతి ప్రోక్త్వా = అని చెప్పి, నత్వా = నమస్కరించి, అర్జునః = కార్తవీర్యార్జునుడు, గతః = వెడలినాడు.

**తాత్పర్యం :** రాదగిన ఫలమునకు రక్షకులైన ప్రభువు తమరు ఆజ్ఞాపించినట్లే చేతును, అని చెప్పి నమస్కరించి కార్తవీర్యార్జునుడు వెడలెను.

**శ్లో॥ పురమేత్యార్జునః సమ్రాట్ శ్రీదత్తేన యథోదితమ్ ।**
**చచారావ్యాహత స్వైరగతిర్వాయురివాత్మవాన్ ॥ 2**

**ప్ర :** సమ్రాట్ అర్జునః = కార్తవీర్యార్జున చక్రవర్తి, పురం ఏత్య = తన నగరమునకు వెడలి, శ్రీదత్తేన యథా ఉదితమ్ = శ్రీదత్తునిచే చెప్పబడిన రీతిగా, ఆత్మవాన్ = ఆత్మనిష్ఠుడై, వాయుః ఇవ = వాయువు వలె, అవ్యాహత = ఆటంకములేని, స్వైరగతిః = స్వేచ్ఛతో, చచార = ప్రవర్తించెను.

**తా :** కార్తవీర్యార్జునుడు తన పురమునకు మరలిపోయి, శ్రీదత్తుడు చెప్పినట్లు ఆత్మవంతుడై వాయువువలె స్వేచ్ఛగా అడ్డులేక తన కర్తవ్యము నాచరించెను.

**శ్లో॥ దశయజ్ఞసహస్రైః స భూప ఈజే మహామతిః ।**
**సర్వే యజ్ఞా మహారాజో భూరికాఞ్చనదక్షిణాః ॥ 3**

**ప్ర :** దశయజ్ఞ-సహస్రైః = పదివేల యజ్ఞములతో, సః మహామతిః భూపః = మహాబుద్ధిశాలియైన

ఆ రాజు, ఈజే = దేవతల పూజించెను, సర్వే యజ్ఞాః = అన్ని యజ్ఞములును, భూరికాఞ్చన దక్షిణాః = గొప్ప బంగారు కానుకలతో, మహారాజః = గొప్పగా ప్రకాశించెను.

**తా :** ఆ రాజు పదివేల యజ్ఞములు చేసెను. అన్ని యజ్ఞములలోను గొప్పగా బంగారు కానుకల నిచ్చెను.

**శ్లో॥ సర్వే కాఞ్చనవేదీకా వేదవిన్మునిసంవృతాః ।**
**సర్వైర్దేవైః సుసంప్రాప్తైర్విమానస్థైరలఙ్కృతాః ॥ 4**

**ప్ర :** సర్వే = అన్నియు, కాఞ్చనవేదీకాః = బంగారు వేదికలు గలవి, వేదవిద్+ముని = వేదవేత్తలైన మునులచే, సంవృతాః = పరివేష్ఠింపబడినవి, సర్వైః దేవైః = దేవతలందఱచేత, విమానస్థైః సుసంప్రాప్తైః = విమానములలో సకాలమునకు చేరుకొనినవారిచే, అలంకృతాః = అలంకరింప బడినవి.

**తా :** యజ్ఞవేదికలన్నియు బంగారపు నిర్మాణములే, వేదవేత్తలైన మునులచే పరివేష్ఠింపబడినవే, విమానములలో సకాలమునకు చేరుకొనిన దేవతలందఱచే అలంకరింపబడినవే.

**శ్లో॥ అప్సరోభిశ్చ గన్ధర్వైర్గాయద్భిః పరిశోభితాః ।**
**నాకాలే యస్య రాష్ట్రే తు మరణం కోఽప్యపశ్యత ॥ 5**

**ప్ర :** అప్సరోభిః = అప్సరసలచేత, చ = మరియు, గాయద్భిః = పాడుచున్న, గన్ధర్వైః = గంధర్వులచేత, పరిశోభితాః = శోభిల్లినవి, యస్య రాష్ట్రే తు = ఎవని రాష్ట్రమునందేమో, అకాలే మరణమ్ = వార్ధక్యము రాకముందే మరణించుట యనునది, కః అపి = ఎవరునూ, న అపశ్యత = చూడలేదు.

**తా :** అప్సరో నాట్యములు, గంధర్వగానములు శోభగూర్చినవి. ఆ కార్తవీర్యార్జునుని రాజ్యమున అకాలమరణముల నెవరును చూడలేదు.

**శ్లో॥ దుర్భిక్షమీతిభీత్యాది యస్య రాష్ట్రే కదాపి నో ।**
**యథాకాలం వవర్షేన్ద్రః సస్యవృద్ధిం దదౌ మహీ ॥ 6**

**ప్ర :** యస్య రాష్ట్రే = ఎవని రాజ్యమందు, దుర్భిక్షమ్ = కరువు, ఈతిభీతి+ఆది = ఈతిబాధల భయము, అతివృష్టి, అనావృష్టి, మిడుతలదండు, ఎలుకలు, చిలుకలు అతివృద్ధి, విదేశీయుల దాడులు అను మొ॥ ఆరిటివలన భయము, కదా+అపి నో = ఎప్పుడును లేదు, ఇన్ద్రః = ఇంద్రుడు, యథాకాలమ్ = సరియైన ఋతువులో, వవర్ష = వర్షించెను. మహీ = భూమి, సస్యవృద్ధిమ్ = ధాన్యవృద్ధిని, దదౌ = ఇచ్చెను.

**తా :** ఆ కార్తవీర్యార్జునుని రాజ్యమున కరువుగాని, ఈతిబాధలు గాని యేనాడునూ లేదు.

ఇంద్రుడు సరియైన ఋతువులో వర్షించెను. భూమి పంటలు పండి ధాన్యమును సమృద్ధిగా యిచ్చెను.

**శ్లో॥ సమస్తరత్నసంపూర్ణశ్చక్రవర్తీ బభూవ సః ।**
**స్వయం హి సప్తద్వీపేషు ఖడ్గీ చక్రీ శరాసనీ ॥ 7**

**ప్ర :** సః = ఆ కార్తవీర్యుడు, సమస్తరత్నసంపూర్ణః = ముత్యము, మాణిక్యము, వైదూర్యము, గోమేదికము, వజ్రము, పగడము, పద్మరాగము, మరకతము, నీలము అనబడు నవరత్నములతో నిండియున్న సంపదగల, చక్రవర్తీ = చక్రవర్తి, బభూవ = ఆయెను, స్వయం హి = తానే, సప్తద్వీపేషు = సప్తద్వీపములలో, అనగా, పుడమి యంతటిలో, ఖడ్గీ = ఖడ్గచాలనవీరుడు, చక్రీ = చక్రాయుధప్రయోగకుశలుడు, శరాసనీ = ధనుర్విద్యాప్రవీణుడు, (బభూవ = ఆయెను).

**తా :** ఆ కార్తవీర్యార్జునుడు సమస్తరత్నసంపదగలవాడై, చక్రవర్తియై, భూమండలమున ఖడ్గధారిగా, చక్రధారిగా, విలువిద్యాప్రవీణుడుగా సర్వశ్రేష్ఠవీరుడైనాడు.

**శ్లో॥ రథీ పరిభ్రమత్యేవ దుష్టచోరారిశాసనః ।**
**సర్వాన్తరో యథా వాయురాత్మా సాక్షీ స్వయోగతః ॥ 8**

**ప్ర :** రథీ = రథికుడై, దుష్టచోర+అరిశాసనః = దుష్టులు, దొంగలు, శత్రువులైన వారిని నియంత్రించువాడై, పరిభ్రమతి+ఏవ = సంచరించుచుండియే, స్వయోగతః = తన యోగశక్తివలన, యథా వాయుః = వాయువువలె, (యథా) ఆత్మా = ఆత్మవలె, సర్వ+అన్తరః సాక్షీ = అన్నిట అన్తరాత్మ సాక్షియైనాడు.

**తా :** రథికుడై దుర్మార్గులను నియంత్రించుచు సంచరించినాడు. వాయువువలె, అంతరాత్మవలె, తన యోగశక్తివలన, సర్వసాక్షియైనాడు.

**శ్లో॥ ఏవం రాజా మనుష్యోఽపి మాహిష్మత్యాం వసన్నపి ।**
**కర్కోటకసుతాం జిత్వా పురీం తత్ర న్యవేశయత్ ॥ 9**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగా, రాజా = రాజు, మనుష్యః అపి = మనుష్యుడైనను, మాహిష్మత్యామ్ = మాహిష్మతిలో, వసన్ అపి = నివసించుచున్నను, కర్కోటక–సుతామ్ = కర్కోటకుని (నాగవంశీయుడు) కుమార్తెను, జిత్వా = గెల్చి, తత్ర పురీమ్ = ఆ నగరిలో, న్యవేశయత్ = ప్రవేశపెట్టెను.

**తా :** ఈ రీతిగా రాజు మనుష్యుడైనను, మాహిష్మతీ నగరమున వసించిననూ, నాగవంశీయుడైన కర్కోటకుని కుమార్తెను అచట నగరిలో ప్రవేశింపజేసెను.

**శ్లో॥ కదాచిత్ స్త్రీసహస్రాఢ్యో రేవాయాం స మహాబలః ।**
**చిక్రీడే దోఃసహస్రేణ రేవాం ప్రాగ్గతిమానయన్ ॥ 10**

ప్ర : కదాచిత్ = ఒకప్పుడు, సః మహాబలః = ఆ మహాబలశాలి, స్త్రీసహస్రాఢ్యః = వేయిమంది స్త్రీలతో గూడినవాడై, దోఃసహస్రేణ = సహస్రబాహువులతో, రేవామ్ = నర్మదానదిని, ప్రాక్+గతిం ఆనయన్ = తూర్పుదిక్కుగా ప్రవహింపజేయుచు, రేవాయామ్ = నర్మదానదిలో, చిక్రీడే = క్రీడించెను.

**తా :** ఒకప్పుడా మహాబలశాలి వేయిమంది స్త్రీలతో గూడి నర్మదానదిలో క్రీడించెను. ఆ సందర్భమున నాతడు తన వేయి బాహువులతో నర్మదానది గతిని తూర్పుదిశగా మార్చెను.

**శ్లో॥ తత్ప్రేక్ష్య తత్పతిః క్రుద్ధః సిన్ధుర్వేగాదధావత ।**
**తమూర్మిమాలినం క్రుద్ధం దృష్ట్వా రాజా ప్రహస్య చ ॥ 11**

**శ్లో॥ ఏకో భుజసహస్రేణ జగాహే స మహార్ణవమ్ ।**
**తస్య బాహుసహస్రేణ పీడితోఽభూన్మహోదధిః ॥ 12**

ప్ర : తత్ ప్రేక్ష్య = దానిని చూచి, తత్ పతిః = ఆ నర్మదానదీ భర్తయైన, సిన్ధుః = సముద్రుడు, క్రుద్ధః = కోపించినవాడై, వేగాత్ = వేగముగా, అధావత = పరువెత్తెను, తం ఊర్మిమాలినమ్ = తుంగతరంగితుడైన ఆ సముద్రుని, క్రుద్ధం దృష్ట్వా = కోపించినవానిగా చూచి, రాజా = రాజు కార్తవీర్యార్జునుడు, ప్రహస్య చ = నవ్వియు, ఏకః = ఒక్కడే, తస్య = వానియొక్క, బాహుసహస్రేణ = వెయ్యి బాహువులతో, పీడితః = బాధింపబడినవాడు, మహోదధిః = సాగరుడు, అభూత్ = ఆయెను.

**తా :** నర్మద ఆ రీతి తూర్పుదిశగా మరల్చబడుటను చూచిన నదీనాథుడు సాగరుడు కోపించి వేగముగా పరువెత్తెను. ఉవ్వెత్తున లేచిపడుచూ వచ్చిన ఆ సముద్రుని కార్తవీర్యుడొక్కడే తన వేయి బాహువులతో పీడించెను.

**శ్లో॥ చూర్ణీకృతమహావీచిర్లీనమీనముఖః స చ ।**
**భీతభీతః సముద్రోఽపి పలాయనపరోఽభవత్ ॥ 13**

ప్ర : చూర్ణీకృత = పొడిగా నలుగగొట్టబడిన, మహావీచిః = ఉత్తుంగతరంగములు గలిగి, లీన మీన ముఖః = చెదరి పారిన చేపలు గలవాడై, సః సముద్రః అపి = ఆ సముద్రుడు గూడ, భీతభీతః = మిక్కిలి భయము జెందినవాడై, పలాయనపరః అభవత్ = పరువెత్తి పారిపోయెను.

**తా :** సముద్రుని ఉత్తుంగతరంగములను కార్తవీర్యార్జునుని వేయి బాహువులు నలుగగొట్టగా, ఆ నీటిలోని చేపలు కానరాకుండ చెదరిపారగా, ఆ సముద్రుడు మిక్కిలి భయపడి, పారిపోయినాడు.

**శ్లో॥ అబ్ధౌ సంక్షోభ్యమాణే తు పాతాలస్థా మహాసురాః ।**
**సర్వేఽప్యహివరా బాధమార్తిమాపుర్దురత్యయామ్ ॥ 14**

ప్ర : అబ్ధౌ సంక్షోభ్యమాణే తు = సముద్రము కల్లోలితమగుచుండగా, పాతాలస్థాః =

పాతాళలోకమున నివాసముండు, మహాసురాః = మహారాక్షసులు, సర్వే అపి అహివరాః = నాగశ్రేష్ఠులందఱును కూడ, బాఢమ్ = మిక్కిలి, ఆర్తిం దురత్యయాం ఆపుః = భరింపరాని దుఃఖము నొందిరి.

**తా :** సముద్రము కల్లోలము కాగా, పాతాళమున గల రాక్షసులు, నాగులు అందఱును భరింపరాని వేదన పొందిరి.

**శ్లో॥ ఏవం ప్రభావో రాజర్షిరేకో ధన్వీ మహీతలే ।**
**యోగాభ్యాసరతో నిత్యం రాజ్యం చక్రే స్వధర్మవిత్ ॥ 15**

**ప్ర :** ఏవం ప్రభావః = ఇట్టి శక్తిమంతుడైన, ఏకః ధన్వీ = ఒక ధానుష్కుడు, రాజర్షిః= ఋషియైన రాజు, యోగాభ్యాసరతః నిత్యమ్ = అనుదినమును యోగసాధనయందాసక్తుడై, మహీతలే = భూమండలమున, స్వధర్వవిత్ = తన ధర్మము నెఱిగినవాడై, రాజ్యం చక్రే = రాజ్యమును పాలించెను.

**తా :** ఇంతటి శక్తిమంతుడైన ఒక ధానుష్కుడు, రాజర్షి, యోగాభ్యాసాసక్తుడు, స్వధర్మవేత్త, భూమిని పాలించెను.

**శ్లో॥ దుశ్చరం తత్తపో దృష్ట్వా నిప్రత్యూహాంస్తథాఽధ్వరాన్ ।**
**స్వపదస్థా అపి సురా భయమాజగ్మురన్వహమ్ ॥ 16**

**ప్ర :** దుశ్చరమ్ = ఆచరణ క్లిష్టమైన, తత్ తపః దృష్ట్వా = వాని తపస్సును చూచి, తథా = అట్లే, నిప్రత్యూహాన్ అధ్వరాన్ = నిర్విఘ్నముగా సాగిన యజ్ఞములనున్నూ, స్వపదస్థాః అపి = తమ స్థానములందున్నవారైనను, సురాః = దేవతలు, అన్వహమ్ = దినదినము, భయం ఆజగ్ముః = భయము జెందిరి.

**తా :** కష్టసాధ్యమైన ఆ రాజుయొక్క తపస్సును, నిర్విఘ్నముగా సాగిన యజ్ఞములను చూచి, తమ స్థానములందున్నవారే అయినను, దేవతలు నిత్యము భయము జెందిరి.

**శ్లో॥ దేవాధికారహర్తాఽయం భవిష్యతి తపోబలాత్ ।**
**ఇత్యాశఙ్క్యామరైః సూర్యః సత్త్వహృత్యై ప్రచోదితః ॥ 17**

**ప్ర :** అయమ్ = ఈతడు, తపోబలాత్ = తపశ్శక్తివలన, దేవ+అధికారహర్తా = దేవతల అధికారములను హరించువాడుగా, భవిష్యతి = కాబోవును, ఇతి = అని, ఆశంక్య = సందేహించి, అమరైః = దేవతలచేత, సత్త్వహృత్యై = శక్తిని హరించుటకై, సూర్యః = సూర్యుడు, ప్రచోదితః = ప్రేరేపింపబడినాడు.

**తా :** ఈ కార్తవీర్యార్జునుడు తన తపశ్శక్తివలన దేవతలను పదవీచ్యుతులను చేసి వారి

అధికారములను హరించునని సందేహించి దేవతలు వాని శక్తిని హరించుమని సూర్యుని ప్రోత్సహించిరి.

**శ్లో॥ ద్విజరూపధరో భూత్వా వైశ్వదేవక్షణే రవిః ।**
**బూభుక్షితోఽతిథిః ప్రాప్త ఆతిథేయం తమర్జునమ్ ॥ 18**

**ప్ర :** రవిః = సూర్యుడు, వైశ్వదేవక్షణే = వైశ్వదేవము అనబడు విహితకర్మచేయువేళ, ద్విజరూపధరః = బ్రాహ్మణరూపమును ధరించి, బూభుక్షితః = ఆకలిగొన్న, అతిథిః భూత్వా = అతిథియై, ఆతిథేయం అర్జునం తమ్ = ఆతిథ్యమిచ్చువాడైన కార్తవీర్యార్జునుని, ప్రాప్తః = సమీపించిన వాడాయెను.

**తా :** సూర్యుడు వైశ్వదేవయజ్ఞము చేయువేళ బ్రాహ్మణరూపమున ఆకలిగొన్న అతిథియై కార్తవీర్యుని ఆతిథ్యము కోరి వచ్చినాడు.

**శ్లో॥ అతిథిః ప్రాహ రాజేన్ద్ర! బ్రహ్మణ్యోఽసి దయాపరః ।**
**తృప్తిమేకాం ప్రయచ్ఛాద్య త్వత్తః కోఽన్యో మమేష్టదః ॥ 19**

**ప్ర :** అతిథిః = అతిథియైన సూర్యుడు, ప్రాహ = ఇట్లనెను, రాజేన్ద్ర! = ఓ రాజా!, దయాపరః = దయామయుడవైన, బ్రహ్మణ్యః అసి = బ్రహ్మణ్యమూర్తియై యున్నావు, అద్య = నేడు, తృప్తిం ఏకాం ప్రయచ్ఛ = తృప్తి నొక్కదానినే నా కిమ్ము, త్వత్తః = నీకంటె, అన్యః = వేరైనవాడు, కః = ఎవడు, మమ = నాకు, ఇష్టదః = ఇష్టమైనదానినిచ్చువాడు?

**తా :** అతిథియైన సూర్యుడు యిట్లనెను : ఓ రాజా! నీవు దయగల బ్రహ్మణ్యమూర్తివి. నేడు నాకు తృప్తిని కలిగించుము. నీకంటె వేరుగా నాకు ఇష్టమైనదానిని ఇచ్చువారెవరు?

**శ్లో॥ రాజోచే కేన తే తృప్తిర్వద సర్వం దదామి తే ।**
**దైవతం బ్రాహ్మణోఽస్మాకం సర్వస్వం వాఽర్పయామ్యుత ॥ 20**

**ప్ర :** రాజా ఊచే = రాజు యిట్లనెను, కేన = దేనిచే, తే = నీకు, తృప్తిః = తృప్తి?, వద = చెప్పుము, తే = నీకు, సర్వం దదామి = అంతయు యిత్తును, అస్మాకమ్ = మాకు, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, దైవతమ్ = దైవము, సర్వస్వం వా = సర్వస్వమున్నూ, అర్పయామి+ఉత = అర్పింతును.

**తా :** రాజు యిట్లనెను : నీకు తృప్తి దేనితో కలుగును? మాకు బ్రాహ్మణుడు దైవము. అంతయు నీ కిత్తును.

**శ్లో॥ సూర్యస్తమాహ సర్వోద్భిద్రూపభిక్షాం ప్రయచ్ఛ మే ।**
**తయా భవేయం సంతృప్తస్తృప్తిర్మే భూప! నాన్యథా ॥ 21**

ప్ర : సూర్యః = సూర్యుడు, తం ఆహ = వాని కిట్లనెను, సర్వ+ఉద్భిత్+రూప = సమస్తమైన వృక్షరూపమైన, భిక్షామ్ = భిక్షను, మే ప్రయచ్ఛ = నా కిమ్ము, తయా = దానిచే, సంతృప్తః భవేయమ్ = సంతృప్తుడనగుదును, భూప = ఓ రాజా!, మే = నాకు, అన్యథా = మరియొక విధముగా, తృప్తిః న = తృప్తి కలుగదు.

**తా :** సూర్యుడు వాని కిట్లనెను : సమస్తవృక్షరూపమైన భిక్షను నా కిమ్ము. దానిచే తృప్తుడనగుదును, మరియొక విధమున కాదు.

**శ్లో॥ తచ్ఛ్రుత్వాఽఽశ్చర్యతోషాభ్యాం రాజా ప్రాహ ప్రణమ్య తమ్ ।**
**యద్యాచితం తద్దదామి కో భవాన్మానుషో న హి ॥ 22**

ప్ర : తత్ శృత్వా = ఆ మాటలు విని, ఆశ్చర్యతోషాభ్యామ్ = ఆశ్చర్యసంతోషములతో, రాజా = కార్తవీర్యార్జునుడు, తం ప్రణమ్య = వానికి నమస్కరించి, ప్రాహ = ఇట్లనెను, యత్ యాచితమ్ = యేది కోరబడినదో, తత్ దదామి = దాని నిత్తును, కః భవాన్ = తమరెవరు?, న హి మానుషః = మనుష్యుడవు మాత్రము కాదు.

**తా :** ఆ మాటలు విని సంభ్రమాశ్చర్యములతో కార్తవీర్యార్జునుడు వానికి నమస్కరించి యిట్లనెను : అడిగిన దాని నిత్తును; తమరెవరు? మనుష్యులు మాత్రము కారు.

**శ్లో॥ తదా సూర్యః స్వరూపేణ ప్రాదురాస ప్రణమ్య తమ్ ।**
**రాజా ప్రాహాద్య ధన్యోఽస్మి లబ్ధో యస్యేదృశోఽతిథిః ॥ 23**

ప్ర : తదా = అప్పుడు, సూర్యః = సూర్యుడు, స్వరూపేణ = నిజరూపముతో, ప్రాదురాస = సాక్షాత్కరించెను, తమ్ = ఆ సూర్యుని, ప్రణమ్య = నమస్కరించి, రాజా = రాజు కార్తవీర్యార్జునుడు, ప్రాహ = యిట్లనెను, అద్య = నేడు, ధన్యః అస్మి = ధన్యుడనైతిని, ఈదృశః అతిథిః = ఇంతటి గొప్ప అతిథి, యస్య = ఎవనికి, లబ్ధః = లభించెను?

**తా :** అప్పుడు సూర్యుడు నిజరూపముతో సాక్షాత్కరించగా, వానికి నమస్కరించి కార్తవీర్యార్జునుడిట్లనెను : నేడు నేను ధన్యుడను, మీ యంతటి గొప్ప అతిథి ఎవనికి లభించును?

**శ్లో॥ న శక్యాః స్థావరాః సర్వే తేజసా స్వబలేన చ ।**
**నిర్దగ్ధుం తపతాం శ్రేష్ఠ! త్వామేవ ప్రణతోఽస్మ్యహమ్ ॥ 24**

ప్ర : తేజసా = నా తేజస్సుచేత, స్వ-బలేన చ = నా దేహబలముచేతను, సర్వే స్థావరాః = వృక్షములన్నియు, నిర్దగ్ధుమ్ = నిశ్శేషముగ దహించుటకు, న శక్యాః = సాధ్యము కానివి, శ్రేష్ఠ! = సర్వశ్రేష్ఠతేజస్వీ!, త్వామేవ = నిన్నే, అహమ్ = నేను, ప్రణతః అస్మి = నమస్కరించినవాడనైతిని, తపతామ్ = దహించుడు.

**తా :** ఈ వృక్షముల నన్నిటిని నిశ్శేషముగ దహించుటకు నా బలము, తేజస్సు కూడ చాలవు. కనుక తమరే దహించుడు. తమకు నమస్కారము.

**శ్లో॥ ఏవముక్తస్తతః సూర్యః ప్రాహ రాజన్! బహుప్రద! ।**
**తుష్టస్తేఽహం దదామీషూనక్షయాన్ సర్వతోముఖాన్ ॥ 25**

**ప్ర :** ఏవం ఉక్తః = ఇట్లు చెప్పబడినవాడై, తతః = అంతట, సూర్యః ప్రాహ = సూర్యుడిట్లనెను, రాజన్! = ఓ రాజా!, బహుప్రద! = అనేక దానములు చేసినవాడా!, తుష్టః అహమ్ = సంతృప్తుడనైన నేను, తే = నీకు, ఇషూన్ అక్షయాన్ సర్వతోముఖాన్ = అక్షయమై అన్నిదిక్కులకు ప్రసరించగల బాణములను, దదామి = ఇచ్చుచున్నాను.

**తా :** రాజు ఇట్లనగా, అంతట సూర్యుడిట్లనెను : అనేక దానములు చేసిన ఓ రాజా! నేను సంతృప్తి చెందినాను. నీకు అక్షయములు, అన్ని దిక్కులకు ప్రసరించగలవియైన బాణములను ఇచ్చుచున్నాను.

**శ్లో॥ తే క్షణాజ్జ్వాలయిష్యన్తి మమ తేజఃసమన్వితాః ।**
**సన్ధాయ తాన్ శరాన్ సర్వాన్ శోషయిత్వార్పయాద్య మే ॥ 26**

**ప్ర :** తే = ఆ శరములు, మమ తేజఃసమన్వితాః = నా తేజస్సుతో కూడినవై, క్షణాత్ = క్షణములో, జ్వాలయిష్యన్తి = దహించును, తాన్ శరాన్ సంధాయ = ఆ బాణములను పూన్చి, సర్వాన్ = అన్నిటిని (వృక్షములను), శోషయిత్వా = ఎండించి, మే = నాకు, అద్య = నేడు, అర్పయ = అర్పింపుము.

**తా :** నేను నీ కిచ్చిన బాణములు నా తేజస్సుతో కూడినవి. అవి క్షణములో దహించును. వానిని ప్రయోగించి, వృక్షముల నన్నిటిని ఎండించి నా కర్పింపుము.

**శ్లో॥ శుష్కాన్ భస్మీకరిష్యామి తేన తృప్తిర్భవేన్మమ ।**
**ఇత్యుక్త్వా స రవిర్దివ్యాన్ బాణానస్మా ఉపానయత్ ॥ 27**

**ప్ర :** శుష్కాన్ = ఎండిపోయిన వృక్షములను, భస్మీకరిష్యామి = భస్మము జేతును, తేన = దానిచే, మమ = నాకు, తృప్తిః = తృప్తి, భవేత్ = కలుగును, ఇతి ఉక్త్వా = అని పలికి, సః రవిః = ఆ సూర్యుడు, దివ్యాన్ బాణాన్ = దివ్యమైన బాణములను, అస్మా (అస్మై) = వానికై, ఉపానయత్ = ప్రసాదించెను.

**తా :** ఎండిపోయిన చెట్లను భస్మము జేతును; దానిచే నాకు తృప్తి కలుగును, అని పలికి ఆ సూర్యుడు దైవశక్తిగల బాణములను వానికి ప్రసాదించెను.

**శ్లో॥ తేన దత్తాన్ శరాన్రాజా సన్ధాయ బలవత్తరః ।**
**స పఞ్చశతచాపేభ్యో ముమోచాప ఇవామ్బుదః ॥ 28**

**ప్ర :** తేన = వానిచే, దత్తాన్ శరాన్ = ఇవ్వబడిన బాణములను, సః రాజా = రాజు, బలవత్తరః = అధికబలశాలియై, సంధాయ = పూన్చి, పఞ్చశతచాపేభ్యః = ఐదువందల ధనుస్సుల నుండి, అమ్బుదః = మేఘము, ఆపః ఇవ = నీటినివలె, ముమోచ = విడచెను.

**తా :** సూర్యుడిచ్చిన ఆ బాణములతో రాజు అధికబలవంతుడై, ఐదువందల బాణముల కా అమ్ములను పూన్చి, మేఘము వర్షించినట్లు, బాణవర్షము కురిపించెను.

**శ్లో॥ పర్వతగ్రామనగరఘోషదుర్గవనాదిజాః ।**
**సుశుష్కాః స్థావరాః సర్వే బభూవుర్బాణవృష్టితః ॥ 29**

**ప్ర :** పర్వత=కొండలపైన, గ్రామ = పల్లెలలోన, నగర = పట్టణములలోన, ఘోష = గొల్లపల్లెల లోన, దుర్గ = కోటలలోన, వన = తోటల, అడవులలోన, ఆది = మొదలగు ప్రదేశములలో, జాః = పుట్టిన, స్థావరాః సర్వే = వృక్షములన్నియు, బాణవృష్టితః = బాణవర్షమువలన, సుశుష్కాః = బాగుగా ఎండినవిగా, బభూవుః = అయినవి.

**తా :** ఆ రాజు వదలిన బాణములు వర్షమువలె కురిసి, కొండలపైన, పల్లెలలోన, నగరములలోన, గొల్లవాడలలోన, రాజదుర్గములలోన, వనములలోన పుట్టిన చెట్లనన్నిటిని బాగుగా ఎండించెను.

**శ్లో॥ తతః సూర్యాగ్నిరూపేణ శుష్కాన్ సర్వానభక్షయత్ ।**
**తృణగుల్మలతావృక్షముఖాంస్తాన్ స్థావరాన్ క్షణాత్ ॥ 30**

**ప్ర :** తతః = అంతట, సూర్య+అగ్నిరూపేణ = సూర్యుని తేజోరూపమైన అగ్నిచేత, శుష్కాన్ = ఎండిపోయిన, తృణ = గడ్డిమొక్కలు, గుల్మ = పొదలు, దుబ్బులు, లతా = తీవలు, వృక్షముఖాన్ = చెట్లు రూపముగా గల, తాన్ స్థావరాన్ సర్వాన్ = ఆ స్థావరములన్నిటిని, క్షణాత్ = తృటిలో, అభక్షయత్ = తినివేసెను.

**తా :** అంతట సూర్యుడు తన తేజోరూపాగ్నిచేత ఎండియున్న వృక్షవిశేషములను, తృణవిశేషములను అన్నిటిని నిమిషములో దహించివేసెను.

**శ్లో॥ అత్రాన్తరే వసిష్టాఖ్యస్తపోదీప్తో మహామునిః ।**
**సమాధివిరమే వృక్షాన్నిర్దగ్ధాన్సమపశ్యత ॥ 31**

**ప్ర :** అత్రాన్తరే = ఇంతలో, వసిష్టాఖ్యః = వశిష్టుడను పేరుగల, తపోదీప్తః మహామునిః = తపస్సుచే తేజస్వియైన మహర్షి, సమాధివిరమే = తపస్సమాధి చాలించినంతనే, వృక్షాన్ నిర్దగ్ధాన్ = పూర్తిగా బూదియైయున్న వృక్షములను, సమపశ్యత = తేరిపార జూచెను.

**తా :** ఇంతలో వసిష్టమహర్షి తపస్సు చాలించి లేచి, కాలి బూదియైన చెట్లనన్నిటిని పరికించెను.

**శ్లో॥ క్రుద్ధః శాపం దదౌ తస్మై అర్జునాయ మహాతపాః ।**
**మదాశ్రమద్రుమా యస్మాత్త్వయా దగ్ధాః సుదుర్మతే! ॥ 32**

**ప్ర :** మహాతపాః = గొప్ప తపశ్శాలియైన ఆ వసిష్ఠుడు, క్రుద్ధః = కోపించి, తస్మా (తస్మై) అర్జునాయ = ఆ కార్తవీర్యార్జుననకు, శాపం దదౌ = శాపమిచ్చెను, సుదుర్మతే! = ఓ దుర్బుద్ధీ!, త్వయా = నీ చేత, మత్ ఆశ్రమద్రుమాః = నా ఆశ్రమ వృక్షములు, యస్మాత్ దగ్ధాః = ఏ కారణమున దహింపబడినవి?

**తా :** తపశ్శాలియైన వసిష్ఠుడు కోపించి, ఆ కార్తవీర్యార్జుననకు శాపమిచ్చెను : ఓ దుర్మతీ! నీవు నా ఆశ్రమవృక్షముల నే కారణమున దహించితివి?

**శ్లో॥ మత్తోఽసి బలదృప్తోఽసి యతః ప్రతిభటో న తే ।**
**మా గర్వం వహ దుష్టాత్మంస్తేజస్వీ బ్రాహ్మణోత్తమః ॥ 33**

**శ్లో॥ భార్గవో జామదగ్న్యస్తే రామః పరశునా భుజాన్ ।**
**ఛిత్త్వా సహస్రం ద్రుస్కన్ధానివ త్వాం నిహనిష్యతి ॥ 34**

**ప్ర :** మత్తః+అసి = మైమరచి యున్నావు, బలదృప్తః+అసి = బలగర్వితుడవైతివి, ప్రతిభటః న తే యస్మాత్ = నీకు ఎదురునిల్వ గల వీరుడు లేనందువలన; గర్వం మా వహ = గర్వించకుము, దుష్టాత్మన్ = దుష్టాత్మా!, తేజస్వీ బ్రాహ్మణోత్తమః = తేజస్వియైన బ్రాహ్మణుడు, భార్గవః జామదగ్న్యః = భృగువంశజుడైన జమదగ్ని కుమారుడైన, రామః = రాముడు, తే భుజాన్ = నీ భుజములను, పరశునా = గొడ్డలితో, ద్రుస్కన్ధానివ = చెట్లబోదెలను వలె, సహస్రం ఛిత్త్వా = వేయింటిని నరికి, త్వామ్ = నిన్ను, నిహనిష్యతి = చంపును.

**తా :** ఓరి దుష్టాత్మా! నీకు ఎదురునిల్వగల వీరుడు లేడని బలగర్వముతో మైమరచియున్నావు, గర్వించకుము. తేజస్వియైన బ్రాహ్మణుడు, జమదగ్ని కుమారుడైన భార్గవరాముడు నీ సహస్రబాహువులను చెట్ల బోదెలను నరికిన విధముగా తన గొడ్డలితో నరికి నిన్ను చంపును.

**శ్లో॥ ఏవం స భావినా రాజా బ్రహ్మణ్యోఽప్యతిథిప్రియః ।**
**దైవయోగేన సంశప్తః శాన్తేనాపి మహర్షిణా ॥ 35**

**ప్ర :** రాజా = రాజు కార్తవీర్యార్జునుడు, బ్రహ్మణ్యః అతిథిప్రియః అపి = అతిథుల నాదరించు బ్రహ్మవేత్త యైనను, సః = ఆతడు, భావినా దైవయోగేన = భవిష్యత్తు దైవనిర్ణయముచేత, ఏవమ్ = ఈ విధముగ, మహర్షిణా శాన్తేన అపి = స్వభావతః శాంతుడైన మహర్షిచేత, సంశప్తః = శపించబడెను.

**తా :** రాజు అతిథిప్రియుడు, బ్రహ్మవేత్తయే యైనను, దైవనిర్ణయముననుసరించి, స్వభావముచేత శాంతుడైన వసిష్ఠమహర్షి కట్టి భావము కలిగి, రాజును శపించినాడు.

**శ్లో॥ తదాప్రభృతి రాజాఽసావుద్ధతోఽభూత్సుధీరపి ।**
**బభూవుర్బహవః పుత్రాస్తస్య రాజ్ఞో మహాబలాః ॥ 36**

**ప్ర :** తదాప్రభృతి = అప్పటినుండి, అది మొదలు, అసౌ రాజా = ఆ రాజు కార్తవీర్యార్జునుడు, సుధీః అపి = బుద్ధిశాలియయ్యును, ఉద్ధతః అభూత్ = కఠినుడాయెను, తస్య రాజ్ఞః = ఆ రాజునకు, మహాబలాః = చాల బలవంతులైన, పుత్త్రాః = కుమారులు, బహవః = పెక్కు మంది, బభూవుః= కలిగిరి.

**తా :** అది మొదలు రాజు కార్తవీర్యుడు, బుద్ధిశాలియైనను, కఠినవర్తనుడాయెను. వానికి అతిబలవంతులు పెక్కురు కుమారులు కలిగిరి.

**శ్లో॥ దత్త్రాత్రేయప్రసాదేన లబ్ధేన స్యన్దనేన సః ।**
**కామగేన విమానేన చచారాఖిలలోకగః ॥ 37**

**ప్ర :** దత్త్రాత్రేయప్రసాదేన లబ్ధేన = దత్త్రాత్రేయప్రసాదముగా లభించిన, స్యన్దనేన = రథముతో, కామగేన విమానేన = మనస్సు నెఱిగి ప్రయాణించు విమానముతో, సః = ఆతడు, అఖిలలోకగః = అన్ని లోకములలోను, చచార = సంచరించెను.

**తా :** దత్త్రాత్రేయుని అనుగ్రహమువలన లభించిన రథముపైనను, కామగమనముగల విమానము పైనను ఆతడు అన్ని లోకములలోను తిరుగజొచ్చెను.

**శ్లో॥ ఐశ్వర్యమతులం లేభే కిఙ్కర్యః సిద్ధయోఽస్య హి ।**
**అవ్యాహతజ్ఞః సర్వత్ర స సమ్రాడుగ్రశాసనః ॥ 38**

**ప్ర :** అతులమ్ ఐశ్వర్యమ్ = అసమానసంపదను, లేభే = పొందెను, అస్య కింకర్యః = వాని సేవకులు, సిద్ధయః హి = సిద్ధులే, సర్వత్ర = అంతటను, సః = ఆతడు, అవ్యాహతజ్ఞః = ఎదురులేనివాడని ప్రసిద్ధుడై, ఉగ్రశాసనః = చండశాసనుడైన, సమ్రాట్ = చక్రవర్తి.

**తా :** ఆతడు ఎనలేని సంపదతో, సిద్ధులే కింకరులు కాగా, అంతట చండశాసనుడై ఎదురులేని చక్రవర్తిగా ప్రసిద్ధినొందెను.

**శ్లో॥ స్మృతిగామీ స సర్వత్ర కామితానేకదేహధృక్ ।**
**ప్రత్యక్షదర్శీ సర్వస్య దత్త్రాత్రేయ ఇవాపరః ॥ 39**

**శ్లో॥ దుర్వృత్తాన్ వారయామాస నృపాంశ్చోరాఞ్జఘాన చ ।**
**మమర్ద దేవాన్ యక్షాదీన్ పీడయామాస సర్వశః ॥ 40**

**ప్ర :** సః = ఆతడు, సర్వత్ర = అన్ని తావులందు, స్మృతిగామీ = స్మరణమాత్రమున చేరుకొనువాడై, కామిత+అనేక-దేహధృక్ = కోరిన నానారూపధారియై, సర్వస్య = అన్నిటికి, ప్రత్యక్షదర్శీ = ప్రత్యక్షసాక్షియై, అపరః దత్త్రాత్రేయః ఇవ = రెండవ దత్త్రాత్రేయునివలె, దుర్వృత్తాన్ నృపాన్ = దుర్మార్గులైన రాజులను, వారయామాస = నివారించెను, చోరాన్ చ = దొంగలను గూడ,

జఘాన = చంపెను, దేవాన్ = దేవతలను, మమర్ద = మర్దించెను, యక్ష+ఆదీన్ = యక్షులు మొదలగు వారిని, సర్వశః = అన్నిటనూ, అన్నివిధములుగా, పీడయామాస = బాధించెను.

**తా :** ఆతడు ఎక్కడకైన తలచినంతనే పోగలిగినవాడై, కామరూపధారియై, అపరదత్తాత్రేయునివలె, సర్వసాక్షియై దుర్మార్గులను, దొంగలను, దేవతలను, అన్నిటనూ శిక్షించెను, చంపెను, బాధించెను.

**శ్లో॥ దివ్యేనైవ విమానేన హైహయాధిపతిర్బలీ ।**
**క్రీడన్తమిన్ద్రం పౌలోమ్యా ధర్షయామాస తం దివి ॥ 41**

**ప్ర :** హైహయాధిపతిః+బలీ = హేహయవంశపురాజైన బలవంతుడైన కార్తవీర్యార్జునుడు, దివ్యేన విమానేన ఏవ = దివ్యవిమానముతో, దివి = స్వర్గలోకమున, పౌలోమ్యా క్రీడన్తమ్ = పులోమి కుమార్తెయైన ఇంద్రాణితో క్రీడించుచున్న, తం ఇన్ద్రమ్ = ఆ ఇంద్రుని, ధర్షయామాస = తూలనాడి, దాడిచేసెను.

**తా :** కార్తవీర్యార్జునుడు దివ్యవిమానమున సంచరించుచు దేవలోకమున ఇంద్రాణితో క్రీడించుచున్న ఇంద్రునిపై దాడిచేసెను.

**శ్లో॥ తతో దేవా వినిర్ధూతా దేవర్షిసహితాస్తదా ।**
**పీడితాః కార్తవీర్యేణ శ్రీవిష్ణుం శరణం యయుః ॥ 42**

**ప్ర :** తతః = అంతట, దేవాః = దేవతలు, వినిర్ధూతాః = తమ నెలవులనుండి తరుమబడిరి, తదా = అప్పుడు, దేవర్షిసహితాః = నారదసహితులై, కార్తవీర్యేణ పీడితాః = కార్తవీర్యునిచేత బాధింపబడినవారు, శ్రీవిష్ణుమ్ = విష్ణుదేవుని, శరణం యయుః = శరణుజొచ్చిరి.

**తా :** అంతట దేవతలునూ పదవీచ్యుతులు గావింపబడి వెడలగొట్టబడిరి. వారట్లు కార్తవీర్యార్జుననిచే బాధింపబడి, నారదసహితులై విష్ణుదేవుని శరణు వేడిరి.

**శ్లో॥ దేవదేవ! సురారిఘ్న! విష్ణో! సత్యపరాక్రమ ।**
**భగవన్! భూతరక్షార్థం కార్తవీర్యార్జునం జహి ॥ 43**

**శ్లో॥ స దివ్యేన విమానేన త్రైలోక్యే విచరన్ స్వయమ్ ।**
**బాధతే విశ్వమఖిలం త్వాం వినా కోఽస్య ఘాతకః ॥ 44**

**ప్ర :** దేవదేవ! = ఓ దేవతల దిక్కైన దేవా!, విష్ణో! = సర్వవ్యాపీ!, సుర+అరిఘ్న! = దేవతల శత్రువులను సంహరించువాడా!, సత్యపరాక్రమ! = సత్యపరాక్రమ!, భగవన్! = భగవానుడా!, భూతరక్షార్థమ్ = సృష్టిని కాపాడుటకై, కార్తవీర్యార్జునం జహి = కార్తవీర్యార్జునుని చంపుము, సః = ఆతడు, స్వయమ్ = తనకు తానై, దివ్యేన విమానేన = దివ్యవిమానముపై, త్రైలోక్యే విచరన్

= మూడులోకములలో సంచరించుచు, అఖిలం విశ్వమ్ = సృష్టినంతయు, బాధతే = బాధించుచున్నాడు, త్వాం వినా = నీవు కాక, కః = ఎవడు, అస్య ఘాతకః = వానిని చంపువాడు?

**తా :** ఓ స్వామీ, విష్ణుదేవా! ప్రాణుల రక్షించుటకు కార్తవీర్యార్జునుని సంహరింపుము. ఆతడు దివ్యవిమానమెక్కి ముల్లోకములలో సంచరించుచు స్వయముగా జగత్తునంతయు బాధించు చున్నాడు. నీవు కాక వానిని సంహరించు వా రెవరు?

**శ్లో॥ ఇతి సంప్రార్థితో దేవో దేవాన్ దృష్ట్వార్జునార్దితాన్ ।**
**ప్రాహావతీర్య తం హన్మి విప్రరూపేణ నిశ్చితమ్ ॥ 45**

**ప్ర :** ఇతి = ఇట్లని, సంప్రార్థితః దేవః = ప్రార్థింపబడిన దేవుడు, అర్జున+అర్దితాన్ = కార్తవీర్య బాధితులైన, దేవాన్ దృష్ట్వా = దేవతలను చూచి, ప్రాహ = ఇట్లనెను, నిశ్చితమ్ = నిశ్చయముగా, విప్రరూపేణ = బ్రాహ్మణరూపమున, అవతీర్య = అవతరించి, తమ్ = వానిని, హన్మి = వధింతును.

**తా :** ఇట్లు దేవతలు ప్రార్థింపగా, విష్ణుదేవు డా కార్తవీర్య బాధితులతో నిట్లనెను : నేను బ్రాహ్మణ రూపమున అవతరించి, వానిని వధింతును. ఇది నిశ్చితము.

**శ్లో॥ ఏవముక్తా భగవతా హృష్టా ఇన్ద్రముఖాః సురాః ।**
**విష్ణుం నత్వా స్వస్వధామ ప్రాపుశ్చిన్తావివర్జితాః ॥ 46**

**శ్లో॥ భగవానపి సర్వజ్ఞః స్వభక్తం వీక్ష్య తాదృశమ్ ।**
**అర్జునం మునినా శప్తం సముద్ధర్తుం మనో దధౌ ॥ 47**

**ప్ర :** భగవతా = విష్ణుదేవుని చేత, ఏవం ఉక్తాః = ఇట్లు తెలుపబడినవారై, హృష్టాః = సంతోషించిన, ఇన్ద్రముఖాః సురాః = ఇంద్రాది దేవతలు, విష్ణుం నత్వా = విష్ణువును నమస్కరించి, చిన్తావివర్జితాః = దుఃఖముడిగినవారై, స్వస్వధామ ప్రాపుః = తమ తమ నెలవులకు వెడలిరి; సర్వజ్ఞః భగవాన్ అపి = సర్వమెఱిగిన భగవానుడు కూడ, తాదృశం స్వభక్తమ్ = అట్టి తన భక్తుని, మునినా శప్తం అర్జునమ్ = మునిచే శపింపబడిన కార్తవీర్యుని, దృష్ట్వా = చూచి, సముద్ధర్తుమ్ = వాని నుద్ధరించుటకు, మనో దధౌ = మనసు నుంచెను.

**తా :** విష్ణుదేవుని వాక్కులతో ఇంద్రాది దేవతలు సంతృప్తులై చింతబాసి, తమ తమ నివాసముల కేగిరి. సర్వజ్ఞుడైన విష్ణుదేవుడునూ అట్టి తన భక్తుడైన కార్తవీర్యుని సముద్ధరణకై యోచన చేసెను.

**శ్లో॥ వధోఽస్య కల్పితః పూర్వం మయా ఖ్యాత్యాధికాన్నరాత్ ।**
**అతోఽహం ద్విజరూపేణ హన్మి భక్తమపి స్వయమ్ ॥ 48**

**శ్లో॥ యోగాభ్యాసేన తపసా ముక్తోఽయం మదనుగ్రహాత్ ।**
**నూనం విదేహకైవల్యం భక్తారబ్ధం నయామ్యహమ్ ॥ 49**

**శ్లో॥ ఇతి నిశ్చిత్య భగవాన్ స్వాంశేన త్రిజగత్పతిః ।**
**అవాతరద్విప్రరూపీ దయాలుర్భక్తభావనః ॥ 50**

**ప్ర :** అస్య వధః = వీని వధ, పూర్వమ్ = మునుపు, ముందుగనే, మయా = నా చేత, ఖ్యాత్యా = కీర్తిచేత, లోకవ్యవహారము చేత, అధికాత్ నరాత్ = అధికుడైన నరునివలన, కల్పితః = యేర్పరుపబడినది, అతః = ఆ కారణమున, అహమ్ = నేను, భక్తం అపి = నా భక్తుడనే యైనను, స్వయమ్ = నేనే, ద్విజరూపేణ హన్మి = బ్రాహ్మణరూపమున వధింతును; అయమ్ = ఈతడు, మత్ అనుగ్రహాత్ = నా దయవలన, తపసా = తపస్సుచేత, యోగ+అభ్యాసేన = యోగసాధనచేత, ముక్తః = ముక్తుడు, నూనమ్ = నిశ్చయముగా, భక్త+ఆరబ్ధమ్ = భక్తునిచే ముందే ఆరంభింపబడిన, విదేహకైవల్యమ్ = మరణానంతర కైవల్యమును, అహం నయామి = నేను నడుపుదును; ఇతి నిశ్చిత్య = అని నిశ్చయించి, త్రిజగత్పతిః భగవాన్ = ముల్లోకనాథుడైన విష్ణుభగవానుడు, స్వ+అంశేన = తనదైన అంశతో, దయాలుః = దయామయుడు, భక్తభావనః = భక్తప్రియుడు, విప్రరూపీ = బ్రాహ్మణరూపియై, అవాతరత్ = అవతరించెను.

**తా :** ఈ కార్తవీర్యార్జునుని వధ వానికంటె అధికుడైన నరునిచేత జరుగునట్లు పూర్వమే నిశ్చయమైనది. అందువలన లోకవ్యవహారమున క్షత్రియుడైన వీనికంటె జ్ఞానాధికుడైన బ్రాహ్మణరూపమున నేనే నా భక్తుడైన వీనిని సంహరింతును. ఈతడు నా అనుగ్రహమువలన మునుపే తపస్సువలన, యోగసాధనవలన ముక్తుడైనాడు. ఇక ఆతడు పూర్వమే సంపాదించినికొనిన విదేహముక్తికి మార్గము సుగమము జేతును. అందుకై నా అంశతో నేనే బ్రాహ్మణరూపమున అవతరించి వానిని, వసిష్ఠశాపానుసారముగ, వధింతును.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం చతుర్థాష్టకే చతుర్థాధ్యాయః ॥

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## చతుర్థాష్టకము - పంచమాధ్యాయము

**శ్లో॥ త్వం హి నః పాహి దేవేతి సకృద్యః ప్రార్థయత్యపి ।**
**సర్వాపద్భ్యస్తముద్ధృత్య దదాతీశః పదం ధ్రువమ్ ॥ 1**

**ప్రతిపదార్థం :** త్వం హి = నీవే, నః పాహి = మమ్ము కాపాడుము, దేవ! = ఓ దేవా!, ఇతి = అని, సకృత్ = ఒక్కసారి, యః ప్రార్థయతి అపి = ఎవరైన ప్రార్థించిన, సర్వ+ఆపద్భ్యః= అన్ని ఆపదల నుండి, తమ్ = వానిని, ఉద్ధృత్య = ఉద్ధరించి, ఈశః = దత్తప్రభువు, ధ్రువం పదమ్ = మోక్షపదమును, దదాతి = ఇచ్చును.

**తాత్పర్యం :** నీవే మమ్ము కాపాడు మని ఒక్కసారి ఆ దేవుని ఎవరైన ప్రార్థించినచో, వానిని అన్ని ఆపదలనుండి ఉద్ధరించి శ్రీదత్తప్రభువు మోక్షమును ప్రసాదించును.

**శ్లో॥ నిత్యముక్తం నిజం భక్తమేక భక్తిం తమర్జునమ్ ।**
**కథం హన్యాత్స నిన్యే తత్ప్రార్థితం సత్యతాం ప్రభుః ॥ 2**

**ప్ర :** నిత్యముక్తమ్ = జీవన్ముక్తుడైన, ఏకభక్తిమ్ = సంపూర్ణభక్తిగలవాడైన, నిజం భక్తమ్ = తన భక్తుడే యైన, తమ్ అర్జునమ్ = ఆ కార్తవీర్యార్జునుని, తత్ ప్రార్థితమ్ = ఆతడు కోరుకొనిన ఖ్యాత్యాధిక వధ లక్షణమును, సత్యతాం నిన్యే = సత్యత్వమునకు నడుపుచు, ప్రభుః సః = ఆ ప్రభువు, కథం హన్యాత్ = ఎట్లు వధించును?

**తా :** ఆ కార్తవీర్యుడు శ్రీదత్తభక్తుడు, సంపూర్ణభక్తిగల జీవన్ముక్తుడైన తన భక్తుని ఆతడే కోరుకొనినట్లు ఖ్యాత్యాధికునిచే చచ్చునట్లు నడిపించి దానిని సత్యముజేసి, దత్తప్రభువు వానినెట్లు వధించును?

**శ్లో॥ ఆసీన్నృపః కాన్యకుబ్జే గాధీ నామ మహాబలః ।**
**వసతో భార్యయా సార్థం వనే తస్యాభవత్సుతా ॥ 3**

**ప్ర :** కాన్యకుబ్జే = కన్యాకుబ్జమున, గాధీ నామ = గాధియను పేరుగల, మహాబలః నృపః = చాల బలవంతుడైన రాజు, ఆసీత్ = ఉండెను, భార్యయా సార్ధమ్ = భార్యతోగూడి, వనే వసతః = వనములో నివసించువానికి, తస్య = వానికి, సుతా = కుమార్తె, అభవత్ = కలిగెను.

**తా :** కన్యాకుబ్జమున గాధియని ప్రసిద్ధుడైన మహాబలవంతుడైన రాజు కలడు. ఆతడు భార్యతో గూడి వనములో నివసించుచుండగా ఒక కుమార్తె కలిగెను.

**శ్లో॥ రూపలావణ్యసమ్పన్నాం దేవీమివ మహాప్రభామ్ ।**
**ఋచీకో భార్గవో దృష్ట్వా యయాచే తాం నృపం ప్రతి ॥ 4**

**ప్ర :** రూపలావణ్యసంపన్నామ్ = చక్కని రూపము లావణ్యము కలిగి, దేవీం ఇవ = లక్ష్మీదేవి వలె, మహాప్రభామ్ = వెలిగిపోవుచున్న ఆమెను, భార్గవః ఋచీకః = భృగు వంశజుడైన ఋచీకుడు, దృష్ట్వా = చూచి, తాం ప్రతి = ఆమెను కోరి, నృపమ్ = రాజు గాధిని, యయాచే = యాచించెను.

**తా :** రూపలావణ్యములతో మహాలక్ష్మివలె వెలుగుచున్న ఆ కన్యను చూచి, ఋచీకుడను మహర్షి, ఆమెను భార్యగా తన కిమ్మని రాజు గాధి నడిగెను.

**శ్లో॥ మహాతపస్వినం దృష్ట్వా గాధీ తం శంసితవ్రతమ్ ।**
**ప్రత్యాఖ్యాతుం నృపోభీతః ప్రాహ తం ప్రార్థయన్ బహు ॥ 5**

**ప్ర :** గాధీ = గాధి, తం శంసితవ్రతం మహాతపస్వినం దృష్ట్వా = ప్రసిద్ధవ్రతియైన ఆ మహాతపస్విని చూచి, ప్రత్యాఖ్యాతుమ్ = తద్విరుద్ధముగ మాటాడుటకు, భీతః = భయపడి, తమ్ = వానిని, బహు ప్రార్థయన్ = మిక్కిలి ప్రార్థించుచు, నృపః = రాజు, ప్రాహ = ఇట్లనెను.

**తా :** రాజైన గాధి ఆ ప్రసిద్ధుడైన నిష్ఠగల మహామునిని చూచి, వానికి విరుద్ధముగ మాట్లాడుటకు భయపడి, మిక్కిలిగా ప్రార్థించుచు, ఇట్లనెను.

**శ్లో॥ బ్రహ్మన్! సమ్భావనీయోఽసి భార్యేయ ముచితా తవ ।**
**తథాఽప్యేకః పణో మేఽద్య కృతస్తం శృణు మానద! ॥ 6**

**ప్ర :** బ్రహ్మన్ = ఓ బ్రహ్మమూర్తీ!, సంభావనీయః అసి = నీవు గౌరవనీయుడవు, తవ = నీకు, ఇయమ్ = ఈమె, ఉచితా భార్యా = తగిన భార్య, తథా అపి = అట్లయినను, ఏకః పణః = ఒక శుల్కము, మే = నాకు, అద్య = నేడు, కృతః = చెల్లించవలసినది, మానద! = ఓ మర్యాద నిచ్చువాడా!, తం శృణు = ఆ శుల్కము వినుము.

**తా :** ఓ బ్రహ్మణ్యమూర్తీ! నీవు గౌరవనీయుడవు, గౌరవమెఱిగినవాడవు. ఈమె నీకు తగిన భార్యయే. ఐనను నేనొక శుల్కమును నీనుండి కోరుదును. అది వినుము.

**శ్లో॥ ఏకతః శ్యామకర్ణానాం పాణ్డురాణాం తరస్వినామ్ ।**
**సహస్రం వాజినాం శుల్కం యో దదాత్యేవ భాగ్యవాన్ ॥ 7**

**శ్లో॥ తద్విధాయ మయా దేయా కన్యైషాఙ్గాప్సరః సమా ।**
**ఇతి విప్రం ప్రతిజ్ఞాతం మయా తే సాధ్యతే కథమ్ ॥ 8**

**ప్ర :** యః భాగ్యవాన్ = ఏ భాగ్యశాలి, శ్యామకర్ణానామ్ = నల్లని చెవులు గలవి, పాణ్డురాణామ్ = తెల్లనివి, తరస్వినామ్ = వేగముగలవియైన, వాజినాం సహస్రమ్ = వేయి గుఱ్ఱములను, ఏకతః = ఈ లక్షణములు ప్రతియొక్క దానిలో నుండగా, శుల్కమ్ = శుల్కముగా, దదాతి ఏవ = ఇచ్చునో, తద్విధాయ = అట్టివానికి, మయా = నా చేత, ఏషా అఙ్గాప్సరః సమా కన్యా = అప్సరసతో సమమైన ఈ కన్య, దేయా = ఇవ్వదగినది, ఇతి = అని, మయా = నా చేత, విప్రం ప్రతిజ్ఞాతమ్ = సత్య ప్రతిజ్ఞ చేయబడినది, తే = నీకు, కథమ్ = ఎట్లు, సాధ్యతే = సాధ్యమగును.

**తా :** ఏ భాగ్యశాలి నల్లని చెవులుగలిగిన తెల్లని గుఱ్ఱములను, వేగము గలవానిని, వెయ్యింటిని శుల్కముగా నిచ్చునో, అట్టివానికే అప్సరసవంటి నా కుమార్తెనిత్తునని ప్రతిజ్ఞ చేసినాను. అది మీ కెట్లు సాధ్యమగును?

**శ్లో॥ ఋషిః ప్రాహాహమేవాశు దాస్యామ్యద్య తథైవ తే ।**
**సాధ్వీ మమాస్తు భార్యేయం నాత్ర కార్యా విచారణా ॥ 9**

**ప్ర :** ఋషిః ప్రాహ = ఋచీకుడు యిట్లనెను, అహం ఏవ = నేనే, తథైవ = నీవు కోరినట్లే, తే = నీకు, ఆశు = వెంటనే, అద్య = నేడు, దాస్యామి = ఇత్తును, ఇయమ్ = ఈమె, మమ = నాకు, సాధ్వీ భార్యా = పతివ్రతయైన భార్య, అస్తు = అగుగాక, అత్ర = ఈ విషయమున, విచారణా = విచారము, న కార్యా = చేయదగదు.

**తా :** ఋషి ఋచీకుడిట్లనెను : నీవు కోరినట్లే, నేనే ఆ శుల్కము నిత్తును. ఆ విషయమున విచారమక్కరలేదు. ఈమె నా యిల్లాలుగా సాధ్వియగుగాక!

**శ్లో॥ ఇతి ప్రతిజ్ఞాయ మునిర్వరుణం ప్రాప్య తం జగౌ ।**
**శుల్కార్థం శ్యామకర్ణాశ్వసహస్రం మే ప్రదీయతామ్ ॥ 10**

**ప్ర :** ఇతి = అని, ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞచేసి, మునిః = ఋచీకుడు, వరుణమ్ = వరుణ దేవుని, ప్రాప్య = చేరి, తం జగౌ = వాని కిట్లనెను, శుల్కార్థమ్ = కన్యాశుల్కమిచ్చుటకు, శ్యామకర్ణాశ్వ సహస్రమ్ = నల్ల చెవుల గుఱ్ఱములు వేయి, మే = నాకు, ప్రదీయతామ్ = ఇత్తువుగాక!,

**తా :** ఇట్లు ప్రతిజ్ఞచేసి, ఋచీకుడు వరుణుని జేరి వానికిట్లనెను : కన్యాశుల్కముగా యిచ్చుటకు నల్లచెవులు గల వేయి గుఱ్ఱముల నిమ్ము.

**శ్లో॥ జ్ఞాత్వోగ్రతపసం విప్రం వరుణోఽపి స్వరాడ్ భృశమ్ ।**
**ప్రత్యాఖ్యాతుమనీశోఽదాత్స తస్మై తాదృశాన్ హయాన్ ॥ 11**

ప్ర : విప్రమ్ = బ్రాహ్మణుని, ఉగ్రతపసమ్ = తీవ్రతపశ్శాలిగా, జ్ఞాత్వా = తెలిసికొని, వరుణః = వరుణుడు, స్వరాడ్ అపి = స్వతంత్రుడైనను, ప్రత్యాఖ్యాతుమ్ = ఎదిరించుటకు, అనీశః = అసమర్థుడై, భృశమ్ = మిక్కిలిగా, తాదృశాన్ హయాన్ = ఆతడు కోరినట్టి గుఱ్ఱములను, సః = ఆతడు, తస్మై అదాత్ = వాని కిచ్చెను.

**తా :** ఆ ఋచీకుడు గొప్ప తాపసి యని గ్రహించి, వరుణుడు వానికి ఎదురు చెప్పలేక, ఆతడు కోరినట్టి గుఱ్ఱములను మిక్కిలిగా నిచ్చెను.

**శ్లో॥ ఆదాయాశ్వాన్మునిః శీఘ్రం గఙ్గామధ్యాద్బహిర్యయౌ ।**
**కాన్యకుబ్జేఽశ్వతీర్థం తత్తతోఽభూత్సర్వపాపహమ్ ॥ 12**

ప్ర : మునిః = ఋచీకుడు, శీఘ్రమ్ = వెంటనే, అశ్వాన్ = గుఱ్ఱములను, ఆదాయ = తీసికొని, గఙ్గామధ్యాత్ = గఙ్గానదిమధ్యనుండి, బహిః యయౌ = బయల్వెడలెను, తతః = అందువలన, అప్పటినుండి, తత్ = అది, సర్వపాపహమ్ = అన్ని పాపములను పోగొట్టు, అశ్వతీర్థమ్ = అశ్వతీర్థముగ, కాన్యకుబ్జే = కన్యాకుబ్జమున, అభూత్ = ఆయెను.

**తా :** ముని గుఱ్ఱములను తీసికొని వెంటనే గంగానది మధ్యనుండి బయల్పడెను. అందువలన అది అశ్వతీర్థముగా కన్యాకుబ్జమున పేరొందెను. ఆ తీర్థము పాపహరము.

**శ్లో॥ గాధిభూపమవాప్యాహ త్వత్ప్రతిజ్ఞానుసారతః ।**
**అత్రానీతా మయేమేఽశ్వాః స్వస్తి తే దేహి మే సుతామ్ ॥ 13**

ప్ర : గాధిభూపమ్ = గాధిరాజును, అవాప్య = చేరి, ఆహ = ఇట్లనెను, త్వత్ ప్రతిజ్ఞా+అనుసారతః = నీ ప్రతిజ్ఞ ననుసరించి, మయా = నా చేత, ఇమే అశ్వాః = ఈ గుఱ్ఱములు, అత్ర = ఇక్కడకు, ఆనీతాః = తీసుకురాబడినవి, తే = నీకు, స్వస్తి = శుభమగుగాక!, మే = నాకు, సుతామ్ = నీ కుమార్తెను, దేహి = ఇమ్ము.

**తా :** ఆ ఋషి గాధిరాజును చేరి ఇట్లనెను : నీ ప్రతిజ్ఞ ననుసరించి ఈ గుఱ్ఱములను నేను తెచ్చినాను. నీకు శుభము!, నీ కుమార్తెను నాకిమ్ము.

**శ్లో॥ తస్యాత్యద్భుతమాహాత్మ్యం దృష్ట్వైవ తస్మై ముదా నృపః ।**
**యథోక్తేన విధానేన దదౌ కన్యామనిన్దితామ్ ॥ 14**

ప్ర : తస్య = వాని యొక్క, అతి+అద్భుత మాహాత్మ్యమ్ = చాలా ఆశ్చర్యకరమైన మహిమను, దృష్ట్వా = చూచి, నృపః = రాజు, ముదా = సంతోషముతో, తస్మై = వానికి, యథా+ఉక్తేన విధానేన = చెప్పబడిన విధముగా, అనిన్దితాం కన్యామ్ = దోషములేని కన్యను, దదౌ = ఇచ్చెను.

**తా :** ఆ మహర్షి మహిమను చూచి రాజు సంతోషముతో వానికి యే దోషము లేని తన కుమార్తెను కన్యాదానము చేసెను.

**శ్లో॥ ఏవం ధర్మేణ లబ్ధ్వా తామృచీకః స్వర్వధూపమామ్ ।**
**యథాసుఖం యథాకామం తయా రేమే సుమధ్యయా ॥ 15**

**ప్ర :** ఏవమ్ = ఈ రీతి, ధర్మేణ = ధర్మబద్ధముగా, తాం స్వర్+వధూ+ఉపమామ్ = స్వర్గములోని అప్సరస్త్రీలతో సమానమైన ఆ రాజకుమారిని, లబ్ధ్వా = పొంది, ఋచీకః = ఋచీకుడు, సుమధ్యయా తయా = అందమైన నడుముగల ఆ సత్యవతితో, యథాసుఖమ్ = సుఖముగా, యథాకామమ్ = కోరినట్లుగా, రేమే = రమించెను.

**తా :** ఈ విధముగా స్వర్గస్త్రీలతో పోల్చదగిన ఆ సత్యవతితో ఋచీకుడు సుఖముగా, తాను కోరినట్లు రమించెను.

**శ్లో॥ దేవా ఇన్ద్రాదయో దృష్ట్వా తస్యోద్యోగం మహాత్మనః ।**
**ఆశ్చర్యం పరమం ప్రాపుః ప్రశశంసుస్తపస్వితమ్ ॥ 16**

**ప్ర :** ఇన్ద్రాదయః దేవాః = ఇంద్రుడు మొదలగు దేవతలు, తస్య మహాత్మనః = ఆ మహాత్మునియొక్క, ఉద్యోగం దృష్ట్వా = ప్రవర్తనను చూసి, పరమం ఆశ్చర్యం ప్రాపుః = పరమాశ్చర్యమును పొందిరి, తపస్వితమ్ = తపశ్శక్తిని, ప్రశశంసుః = మెచ్చిరి.

**తా :** ఆ ఋచీకుడని నడవడికను చూచి ఇంద్రాది దేవతలు ఆశ్చర్యమంది, తపఃశక్తిని పొగడిరి.

**శ్లో॥ అథైకదాహ తం గాధిర్మునేఽపుత్రోఽస్మి సర్వవిత్! ।**
**ఉపాయం కురు యేన స్యాం సపుత్రోఽహం విముక్తిగః ॥ 17**

**ప్ర :** అథ = అటు తరువాత, ఏకదా = ఒకప్పుడు, గాధిః = గాధి, తమ్ = వానిని, ఆహ = ఇట్లనెను, మునే = ఓ మునీ!, అపుత్రః అస్మి = కొడుకు లేని వాడనైతిని, సర్వవిత్ = ఓ సర్వజ్ఞా!, ఉపాయం కురు = ఉపాయము సూచించుడు, యేన = దేనిచే, అహమ్ = నేను, విముక్తిగః = మోక్షమునొందు, సపుత్రః స్యామ్ = కుమారుడు గలవాడ నగుదునో.

**తా :** ఆపై ఒకప్పుడు గాధిరాజు ఆ ఋషియైన ఋచీకునితో ఇట్లనెను : ఓ మహర్షీ! తమరు సర్వజ్ఞులు. నాకు కొడుకులేడు. కావున యే ఉపాయము చేత నాకు మోక్షప్రదుడైన కుమారుడు కలుగునో నిర్దేశింపుడు.

**శ్లో॥ తథేత్యుక్త్వా తతః పత్న్యా సాకం స పితరం ముదా ।**
**ఆగత్య తత్పదే భక్త్యా వవన్దే భక్తిభావితః ॥ 18**

**ప్ర :** తథా ఇతి ఉక్త్వా = అట్లేయని పలికి, సః = ఆ ఋచీకుడు, తతః = అక్కడనుండి, పత్న్యా సాకమ్ = భార్యతోగూడ, ముదా = సంతోషముతో, పితరం ఆగత్య = తండ్రియొద్దకు వచ్చి,

భక్తిభావితః భక్త్యా = భక్తిభావము సాకారముకాగా, తత్ పదే = వాని పాదములకు, వవన్దే =నమస్కరించెను.

**తా :** అట్లేయని ఆ ఋచీకుడు అచటినుండి తండ్రివద్దకు చేరి భక్తితో వాని పాదములకు నమస్కరించెను.

**శ్లో॥ సర్వం న్యవేదయత్ప్రేమ్ణా భృగుస్తుష్టో మహామునిః ।**
**తం దృష్ట్వా కామసదృశం స్నుషాం చ స్వర్వధూపమామ్ ॥ 19**

**శ్లో॥ స్వాశ్రమే స్థాపయామాస ప్రహృష్టేనాన్తరాత్మనా ।**
**సుభగా సాప్యనుదినం భర్తృసేవాపరాయణా ॥ 20**

**శ్లో॥ శీలేన సేవయా చాపి మునిం పరమధార్మికమ్ ।**
**సాధ్వీ ప్రసాదయామాస గాధిపుత్రీ మనస్వినీ ॥ 21**

**ప్ర :** సర్వం న్యవేదయన్ = అంతయు నివేదించెను, మహామునిః భృగుః = భృగుమహర్షి, తుష్టః = సంతోషించినవాడై, ప్రేమ్ణా = ప్రేమతో, తం కామసదృశమ్ = మన్మథుని పోలిన ఆతనిని, స్వర్వధూపమమ్ = దివ్యకాంతతో సరియైన, స్నుషాం చ = కోడలిని గూడ, దృష్ట్వా = చూచి, స్వ+ఆశ్రమే = తన ఆశ్రమమందు, ప్రహృష్టేన అంతరాత్మనా = ఆనందముగల మనస్సుతో, స్థాపయామాస = నివాసమేర్పరచెను, సా అపి సుభగా = సౌభాగ్యవతియైన ఆమెయును, అనుదినమ్ = నిత్యము, భర్తృసేవాపరాయణా = భర్తను సేవించు దీక్షగలదై, శీలేన = నడవడితో, సేవయా చ అపి = సేవలతో గూడ, పరమధార్మికం మునిమ్ = మహాధర్మాత్ముడైన మునిని, గాధిపుత్రీ మనస్వినీ = గాధికుమార్తెయైన సన్మతి, సాధ్వీ = సత్యవతీ సాధ్వి, ప్రసాదయామాస = ప్రసన్నుని జేసికొనెను.

**తా :** అంతయు తన తండ్రియైన భృగువునకు నివేదించెను. ఆతడును కామునివంటి కొడుకును, అప్సరస వంటి కోడలిని చూచి సంతోషించి వారిని తన ఆశ్రమమందే ఉండుమనెను. ఋచీకుని భార్య సత్యవతియు తన ప్రవర్తనతో సేవలతో, భర్తృసేవతో ఆ మహర్షిని సంతోషపెట్టెను.

**శ్లో॥ భృగుః ప్రసన్నస్తామాహ ధన్యాసి త్వం పతివ్రతే ।**
**వరం వృణీష్వ సుభగే! దాస్యామి త్వదభీప్సితమ్ ॥ 22**

**ప్ర :** ప్రసన్నః భృగుః = ప్రసన్నుడైన భృగువు, తాం ఆహ = ఆమెకిట్లనెను, త్వమ్ = నీవు, ధన్యా అసి పతివ్రతే! = ఓ పతివ్రతా! నీవు ధన్యురాలవైతివి, సుభగే! = ఓ సౌభాగ్యవతీ!, వరం వృణీష్వ = వరము కోరుకొనుము, త్వత్ అభీప్సితమ్ = నీ కిష్టమైన దానిని, దాస్యామి = ఇత్తును.

**తా :** భృగుమహర్షి ప్రసన్నుడై ఆమె కిట్లనెను : ఓ పతివ్రతా! నీవు ధన్యురాలవు, నీకిష్టమైన వరము కోరుకొనుము. ఇత్తును.

**శ్లో॥ సా ప్రాహ భగవన్! మాతురపుత్త్రాయా మమాప్యుత ।**
**ఆధిం జ్ఞాత్వా మహాప్రాజ్ఞ ప్రసాదం కర్తుమర్హసి ॥ 23**

**ప్ర :** సా = ఆమె, ప్రాహ = ఇట్లనెను, భగవన్! = ఓ దేవా!, అపుత్త్రాయాః మాతుః = కొడుకులులేని నా తల్లికి, మమ అపి ఉత = నాకును గూడ, ఆధిం జ్ఞాత్వా = మా మనస్తాపమును తెలిసి, మహాప్రాజ్ఞ = ఓ మహాజ్ఞానీ!, ప్రసాదం కర్తుం అర్హసి = పుత్రరూపమున దయ జూపదగుదురు.

**తా :** ఆమె ఇట్లనినది : ఓ దేవా! నా తల్లి అపుత్త్రక. మా మనస్తాపమును గ్రహించి ఆమెకును నాకును గూడ పుత్త్రసంతతి కలుగునట్లాశీర్వదింపుడు.

**శ్లో॥ తాం సోఽవదదుపాయోఽయం సాధ్వి పుంసవనాయ వామ్ ।**
**ఋతుస్నాతం త్వం చ మాతా మనస్యాధాయ తత్పరమ్ ॥ 24**

**శ్లో॥ అశ్వత్థం పృథగాలిఙ్గ్య యజ్ఞాఙ్గం చ యథావిధి ।**
**చరుద్వయం చ సంస్కృత్య ప్రాశితవ్యం విధానతః ॥ 25**

**శ్లో॥ పుత్త్రస్తే బ్రహ్మవర్చస్వీ సమ్రాణ్మాతుశ్చ తే క్రమాత్ ।**
**భవిష్యతి న సన్దేహః సత్యం సత్యవతి! స్నుషే! ॥ 26**

**ప్ర :** సః = ఆ భృగుమహర్షి, తాం అవదత్ = ఆమె కిట్లనెను, సాధ్వి! = ఓ పతివ్రతా!, అయమ్ = ఇది, ఉపాయః = ఉపాయము, ఋతుస్నాతం త్వం చ మాతా వామ్ = నీవున్నూ, నీ తల్లియూ, ఉభయులున్నూ, ఋతుస్నాతలై, పుంసవనాయ = పుంసవనము అనబడు ప్రక్రియకై, మనసి ఆధాయ తత్పరమ్ = మనమున ఈశుని ధ్యానించి, పృథక్ = వేర్వేరుగా, అశ్వత్థమ్ = అశ్వత్థవృక్షమును (నీవును), యజ్ఞాఙ్గం చ = ఉదుంబర లేక ఉడుంబర లేక ఔదుంబర మను వృక్షమును (నీ తల్లియు), ఆలిఙ్గ్య = కౌగలించికొని, యథావిధి = శాస్త్రోక్తముగ, చరుద్వయం చ = చరువు అనబడు పదార్థమును పచనము చేయు పాత్రలను, సంస్కృత్య = శుభ్రము చేసి, విధానతః = పుత్త్రకామేష్టివిధానమున, ప్రాశితవ్యమ్ = భుజించదగును, క్రమాత్ = వరసగా, తే = నీకు, బ్రహ్మవర్చస్వీ పుత్త్రః = బ్రహ్మతేజము గల కుమారుడు, తే మాతుః చ = నీ తల్లికి గూడ, సమ్రాట్ = చక్రవర్తి కాగల కుమారుడు, భవిష్యతి = కలుగును, న సందేహః = సందేహము లేదు, స్నుషే సత్యవతి = ఓ కోడలా, సత్యవతీ!, సత్యమ్ = ఇది సత్యము.

**తా :** భృగుమహర్షి ఆమె కిట్లనెను : ఓ సాధ్వీ! ఇది ఉపాయము, కొడుకు గనుటకు. ఋతుస్నాతలై నీవును, నీ తల్లియు మనసున ఈశ్వరుని ధ్యానించి, నీవు అశ్వత్థవృక్షమును, నీ తల్లి ఉదుంబర వృక్షమును శాస్త్రోక్తముగ కౌగలించి, చరు అనబడు పాత్రను శుభ్రము చేసి అందు పచనము చేయబడిన చరు అను పదార్థమును విధిగా భుజించినట్లయిన, నీకు బ్రహ్మతేజము గల కుమారుడునూ, నీ తల్లికి చక్రవర్తికాగల కుమారుడునూ జన్మించుట తథ్యము. సందేహము లేదు కోడలా, సత్యవతీ!

**శ్లో॥ తథేత్యుక్త్వాథ సా రాష్ట్రం పితుః ప్రాప ప్రియాన్వితా ।**
**యథోపదిష్టం భృగుణా వ్యకరోత్పుత్రకాఙ్క్షయా ॥ 27**

ప్ర : తథా ఇతి ఉక్త్వా = అట్లేయని పలికి, సా = ఆమె (సత్యవతి), అథ = అంతట, ప్రియాన్వితా = భర్తతో గూడి, పితుః రాష్ట్రం ప్రాప = తండ్రి రాజ్యమును చేరెను, భృగుణా = భృగుమహర్షిచేత, యథా ఉపదిష్టమ్ = ఎట్లు ఉపదేశింపబడెనో, (తథా = అట్లే), పుత్రకాఙ్క్షయా = పుత్రుడు కావలెనను కోరికతో, వ్యకరోత్ = చేసెను.

**తా :** అట్లేయని, ఆ సత్యవతి తన భర్తను వెంటనిడుకొని తన తండ్రి రాజ్యమునకు బోయెను. భృగుమహర్షి చెప్పినట్లు పుత్రకాంక్షతో చేసెను.

**శ్లో॥ చరుప్రాశనకాలే తు వ్యత్యాసోదైవతోఽభవత్ ।**
**మాత్రా పుత్ర్యాశ్చరుర్భుక్తః పుత్ర్యా మాతుః ప్రమాదతః ॥ 28**

ప్ర : చరుప్రాశనకాలే = చరును భుజించు సమయముననేమో, దైవతః = విధివశమున, వ్యత్యాసః అభవత్ = అటుదిటు లాయెను, మాత్రా = తల్లిచేత, పుత్ర్యాః చరుః = కుమార్తెయొక్క చరు, పుత్ర్యా = కుమార్తెచేత, మాతుః చ = తల్లియొక్క చరువున్నూ, ప్రమాదతః = పొరబాటున, భుక్తః = భుజింపబడినది.

**తా :** విధివశమున చరును భుజించుటలో పొరబాటు జరిగినది. తల్లి కుమార్తె భుజించవలసిన దానిని, కుమార్తె తల్లి భుజించవలసిన దానిని భుజించిరి.

**శ్లో॥ తతో బహుతిథే కాలే గతే దివ్యేన చక్షుషా ।**
**విజ్ఞాయ వ్యత్యయం ప్రాప్య భృగుః ప్రాహ స్నుషాం సతీమ్ ॥ 29**

ప్ర : తతః = అప్పటినుండి, బహుతిథే కాలే గతే = ఎన్నో రోజులు గడిచిన మీదట, భృగుః = భృగుమహర్షి, దివ్యేన చక్షుషా = దివ్యదృష్టితో, విజ్ఞాయ = తెలిసికొని, స్నుషాం సతీమ్ = సాధ్వియైన కోడలిని, ప్రాప్య = చేరి, ప్రాహ = ఇట్లనెను.

**తా :** అప్పటినుండి చాలకాలము తరువాత భృగుమహర్షి జ్ఞాననేత్రముతో తెలిసికొని సాధ్వియైన కోడలితో ఇట్లనెను.

**శ్లో॥ ఉపభుక్తశ్చరుర్భద్రే! వృక్షస్యాలిఙ్గనం కృతమ్ ।**
**విపరీతం హి జాతం తత్స్నానవ్యత్యయో భవేత్ ॥ 30**

**శ్లో॥ బ్రాహ్మణోఽపి క్షత్రవృత్తిస్తవ పుత్రో భవిష్యతి ।**
**క్షత్రోఽపి బ్రాహ్మణాచారో మాతుస్తవ సుతస్తథా ॥ 31**

ప్ర : భద్రే! = ఓ సుమంగళీ!, చరుః = చరు, ఉపభుక్తః = భుజింపబడినది, వృక్షస్య ఆలిఙ్గనం

కృతమ్ = వృక్షము కౌగిలించబడినది, విపరీతం హి జాతమ్ = విపరీతమే జరిగినది, తత్ సంతానవ్యత్యయః భవేత్ = దానివలన సంతానమున్ను తారుమారగును; తవ పుత్రః = నీ కొడుకు, బ్రాహ్మణః అపి = బ్రాహ్మణుడైయుండియు, క్షత్రవృత్తిః = క్షత్రియవర్తనము గలవాడు, తవ మాతుః సుతః = నీ తల్లి కుమారుడు, తథా = ఆ రీతిగనే, క్షత్రః అపి = క్షత్రియుడైనను, బ్రాహ్మణ+ఆచారః = బ్రాహ్మణుని వర్తనగలవాడు, భవిష్యతి = అగును.

**తా :** ఓ సుమంగళీ! మీరు చరు భుజించినారు, వృక్షములను కౌగలించినారు. కాని విపరీతము జరిగినది, తారుమారైనది. అందువలన సంతానమున్నూ తారుమారగుదురు : నీ కొడుకు, బ్రాహ్మణుడైనను, క్షత్రియవర్తనము గలిగిన వాడగును. అట్లే, నీ తల్లి కుమారుడు, క్షత్రియుడైనను, బ్రాహ్మణవర్తనము గలవాడగును.

**శ్లో॥ తచ్ఛ్రుత్వా ప్రార్థయామాస శ్వశురం సా పునః పునః ।**
**న మే పుత్రో భవత్వీదృక్కామం పౌత్రో భవత్వితి ॥ 32**

**ప్ర :** తత్ శ్రుత్వా = ఆ మాటలు విని, సా = ఆమె, పునః పునః = మరి మరి, శ్వశురమ్ = మామగారిని, మే = నాకు, ఈదృక్ = ఇటువంటి, పుత్రః = కొడుకు, న భవతు = కలుగకుందుగాక, కామమ్ = కావలెననిన, పౌత్రః = మనుమడు, భవతు = అగుగాక, ఇతి = అని, ప్రార్థయామాస = ప్రార్థించెను.

**తా :** ఆ మాటలు విని, ఆమె (సత్యవతి) మామగారిని మరిమరి యిట్లు ప్రార్థించినది : అట్టి కుమారుడు నాకు కలుగకుందుగాక, ఒకవేళ కలుగవలసిన, మనుమడు అట్టి వాడగుగాక!

**శ్లో॥ భృగుస్తాం ప్రతినన్ద్యాహ తథాస్త్వితి తతో యయౌ ।**
**స్వాశ్రమం సా తతోఽసూత కాలే సత్యవతీ సుతమ్ ॥ 33**

**ప్ర :** భృగుః = భృగుమహర్షి, తామ్ = ఆమెను, ప్రతినన్ద్య = ప్రశంసించి, తథా అస్తు = అట్లే యగుగాక!, ఇతి = అని, ఆహ = పలికెను, తతః = అటనుండి, స్వ ఆశ్రమమ్ = తన ఆశ్రమమును, యయౌ = చేరబోయెను, సా సత్యవతీ = ఆ సత్యవతి, కాలే = సరియైన సమయమున, సుతం అసూత = కొడుకును కనెను.

**తా :** భృగుమహర్షి ఆమెను ప్రశంసించి, అట్లేయగుగాక! యని, అటనుండి తన ఆశ్రమమునకు వెడలెను. సత్యవతి సరియైన సమయమున కుమారుని ప్రసవించెను.

**శ్లో॥ తేజసా వర్చసా యుక్తం జమదగ్నిమితి ద్విజమ్ ।**
**నామ్నాకరోదభూత్సోఽపి వేదవేదాఙ్గపారగః ॥ 34**

**ప్ర :** తేజసా = బుద్ధినైశిత్యముచేత, వర్చసా = దేహకాంతిచే, దార్ఢ్యముచే, యుక్తమ్ = తగినదని, నామ్నా = పేరుచే, జమదగ్నిం ఇతి = జమదగ్ని యని, ద్విజమ్ = బ్రాహ్మణబాలుని, అకరోత్ =

చేసెను, సః అపి = ఆతడును, వేదవేదాఙ్గపారగః = ఋగ్వేదాది నాలుగు వేదములను, వేదమునకు అంగములైన శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను శాస్త్రములను మొదలంట చదివినాడు.

**తా :** దేహకాంతిచేత, బుద్ధికుశాగ్రతచేత ఈ బ్రాహ్మణబాలుడు అగ్నివలె వెల్గుచున్నాడని ఆ సత్యవతీపుత్త్రునికి జమదగ్నియని పేరిడిరి. ఆ బాలుడు నాలుగు వేదములను, ఆరు వేదాంగములను పారజదివెను.

**శ్లో॥ తస్యా మాతుః సుతో జజ్ఞే విశ్వామిత్రో మహామనాః ।**
**చరుప్రభావాత్స యయౌ బ్రహ్మర్షిత్వం తపోబలాత్ ॥ 35**

**ప్ర :** తస్యాః మాతుః = ఆ సత్యవతియొక్క తల్లికి, సుతః = కుమారుడు, మహామనాః = గొప్ప మనస్సుగల, విశ్వామిత్రః = విశ్వర్షిగా, జజ్ఞే = పేరొందెను, సః = ఆతడు, చరుప్రభావాత్ = చరు శక్తివలన, తపోబలాత్ = తపశ్శక్తివలన, బ్రహ్మర్షిత్వమ్ = బ్రహ్మర్షి స్థానమును, యయౌ = పొందెను.

**తా :** ఆ సత్యవతి తల్లియొక్క కుమారుడు విశ్వర్షి యగునని, విశ్వామిత్రుడని పేరిడిరి. ఆతడు తపోబలము వలన బ్రహ్మర్షియాయెను.

**శ్లో॥ జమదగ్నిస్తు రుద్రాంశో మహాతేజా మహామనాః ।**
**రేణోఃకన్యాం శక్తికలాముపయేమే స రేణుకామ్ ॥ 36**

**ప్ర :** జమదగ్నిః తు = జమదగ్ని యేమో, మహాతేజా = గొప్పతేజశ్శాలి, మహామనాః = గొప్ప మనస్సుగలవాడు, రుద్రాంశః = రుద్రుని అంశ గలవాడు, రేణోః కన్యామ్ = రేణు కుమార్తెయైన, రేణుకామ్ = రేణుకను, శక్తికలామ్ = శక్తి లేక ఉమాదేవియొక్క అంశగల దానిని, ఉపయేమే = పెండ్లియాడెను.

**తా :** జమదగ్ని రుద్రాంశ గలవాడు, మహాతేజస్వి, మహాబుద్ధిశాలి, ఆతడు రేణుకన్యను శక్తియంశగల రేణుకను పెండ్లాడెను.

**శ్లో॥ గార్హస్థ్యం ధర్మమాశ్రిత్య తయా రేణుకయా సహ ।**
**సాధ్వ్యానుకూలయా తీవ్రం జమదగ్నిస్తపోఽతపత్ ॥ 37**

**ప్ర :** గార్హస్థ్యం ధర్మం ఆశ్రిత్య = గృహస్థధర్మమును స్వీకరించి, అనుకూలయా సాధ్వ్యా రేణుకయా తయా సహ = అనుకూలవతియైన భార్యయైన రేణుకతో గూడి, జమదగ్నిః = జమదగ్ని, తీవ్రమ్ = తీవ్రమైన, తపః = తపస్సు, అతపత్ = తపించెను.

**తా :** గృహస్థధర్మమును స్వీకరించి, అనుకూలవతియైన భార్య రేణుకతో గూడి జమదగ్ని తీవ్రమైన తపస్సు చేసెను.

**శ్లో॥ తయోః పుత్త్రా మహాత్మానః పఞ్చాసన్నమరోపమాః ।**
**తేషాం కనీయాన్ శ్రీవిష్ణోరంశో రామః ప్రతాపవాన్ ॥ 38**

**ప్ర :** తయోః మహాత్మనః = ఆ మహాత్మునకు, పుత్త్రాః = కొమరులు, పఞ్చ = ఐదుగురు, అమర+ఉపమాః = దేవతలతో సములు, ఆసన్ = కలిగిరి, తేషామ్ = వారిలో, కనీయాన్ = చిన్నవాడు, చివరివాడు, శ్రీవిష్ణోః = శ్రీ విష్ణుదేవునియొక్క, అంశః = అంశగలవాడు, ప్రతాపవాన్ = వీరుడైన, రామః = రాముడు.

**తా :** ఆ జమదగ్నికి అయిదుగురు కొడుకులు, దేవతలతో సమానులు. వారిలో చివరివాడు శ్రీమహావిష్ణు అంశగల రాముడు, మహావీరుడు.

**శ్లో॥ సాఙ్గాన్వేదానధీత్యాసౌ బ్రహ్మచర్యేణసంయుతః ।**
**ధనుర్వేదం చ విధివత్పితృసేవాపరోఽభవత్ ॥ 39**

**ప్ర :** అసౌ = ఆ రాముడు, బ్రహ్మచర్యేణ-సంయుతః = బ్రహ్మచర్యమును స్వీకరించినవాడై, సాఙ్గాన్ వేదాన్ = వేదములను, వేదాంగములతో గూడ, ధనుర్వేదం చ = ధనుర్విద్యను గూడ, విధివత్ = శాస్త్రముననుసరించి, అధీత్య = అధ్యయనముచేసి, పితృసేవాపరః = తండ్రిసేవలో తత్పరుడుగా, అభవత్ = ఆయెను.

**తా :** ఆ రాముడు వేదవేదాంగములను, ధనుర్విద్యను అభ్యసించి, బ్రహ్మచారియై తండ్రి సేవకు అంకితమాయెను.

**శ్లో॥ ఆహితాగ్నేః పితుర్నిత్యమనుకూలోఽభవత్సదా ।**
**ఫలమూలసమిత్పుష్పకుశాదీనాన్రామ ఆహరత్ ॥ 40**

**ప్ర :** ఆహితాగ్నేః పితుః = ఆహితాగ్నియైన తండ్రికి, నిత్యమ్ = రోజూ, సదా = ఎల్లపుడు, అనుకూలః అభవత్ = అనుకూలుడాయెను, ఫలమూలసమిత్పుష్పకుశాదీనామ్ = పండ్లను, కందమూలములను, దర్భలను, పుష్పములను, సమిధలను, రామః ఆహరత్ = రాముడు తెచ్చి యిచ్చెను.

**తా :** ఆహితాగ్నియైన తండ్రికి నిత్యము అనుకూలుడై ఫలములను, కందమూలములను, సమిధలను, పూవులను, దర్భలను సమకూర్చెను.

**శ్లో॥ ఏకదా రేణుకా స్నాతుం నదీం గత్వా దదర్శ తమ్ ।**
**క్రీడన్తం సలిలే స్త్రీభీ రాజానం పద్మమాలినమ్ ॥ 41**

**ప్ర :** ఏకదా = ఒకప్పుడు, రేణుకా = రేణుకాదేవి, స్నాతుమ్ = స్నానము చేయుటకు, నదీం గత్వా = నదికివెళ్ళి, సలిలే = నీటిలో, స్త్రీభిః = స్త్రీలతో, క్రీడన్తమ్ = వినోదించుచున్న, పద్మమాలినం తం రాజానమ్ = పద్మమాలి యను గంధర్వరాజును, దదర్శ = చూచెను.

**తా :** ఒకప్పుడు రేణుకాదేవి స్నానమునకై నదికి వెడలి, అచట నదిలో స్త్రీలతో వినోదించుచున్న గంధర్వరాజగు పద్మమాలిని చూచెను.

**శ్లో॥ క్షణం స్థిత్వా రేణుకా సా తత్క్రీడాం వీక్ష్య హర్షితా ।**
**తతః సా శఙ్కితా భర్తుః సమీపమగమద్ద్రుతమ్ ॥ 42**

**ప్ర :** రేణుకా = రేణుకాదేవి, క్షణం స్థిత్వా = ఒక్క క్షణమచట నిలచి, సా = ఆమె, తత్ క్రీడాం వీక్ష్య = ఆ వినోదమును చూచి, హర్షితా = సంతోషించినదాయెను, తతః = అచటనుండి, శఙ్కితా = తన మగడు తనను త్యజించునా?యని సందేహించునదై, ద్రుతమ్ = వేగముగా, భర్తుః సమీపమ్ = భర్తచెంతకు, అగమత్ = వెడలెను.

**తా :** రేణుకాదేవి క్షణకాలమచట నిలచి, ఆ గంధర్వజలక్రీడను చూచి, సంతోషించినదై, అందుకు తన భర్త శంకించి వదలివేయునా? యని సందేహించుచూ భర్తచెంతకు వెంటనే వెడలెను.

**శ్లో॥ స తాం దృష్ట్వా చ్యుతాం ధైర్యాద్బ్రాహ్మ్యా లక్ష్మ్యా వివర్జితామ్ ।**
**ధిక్ కృత్వా తాం విగర్హ్యాహ వసుమన్తం సుతం రుషా ॥ 43**

**ప్ర :** సః = జమదగ్ని మహర్షి, తామ్ = ఆమెను, ధైర్యాత్ = ధైర్యముతో, బ్రాహ్మ్యా లక్ష్మ్యా వివర్జితాం చ్యుతామ్ = ధైర్యముతో బ్రాహ్మణతేజమును కోల్పోయి పతనమైన ఆ రేణుకను, దృష్ట్వా = చూచి, తాం ధిక్ కృత్వా విగర్హ్య = ఛీ యని ఆమెను నిందించి, సుతం వసుమన్తమ్ = కొడుకైన వసుమంతుని, రుషా = కోపముతో,

**శ్లో॥ పుత్రేమాం ఘాతయాశు త్వమితి శ్రుత్వాపి తద్వచః ।**
**సస్నేహో నావధీత్తూష్ణీం తస్థౌ పశ్యన్నధో భియా ॥ 44**

**ప్ర :** పుత్ర! = ఓ కుమారుడా!, త్వం = నీవు, ఇమామ్ = ఈమెను, ఆశు = వెంటనే, ఘాతయ = చంపుము, ఇతి = అని, శ్రుత్వా అపి తత్ వచనః = అని తండ్రిమాటలు వినియును, సస్నేహః = తల్లిపై ప్రేమతో, న అవధీత్ = వినకుండెను, భియా = భయముతో, అధః పశ్యన్ = క్రిందకు చూచుచు, తూష్ణీం తస్థౌ = మౌనముగ నుండెను.

**తా :** ధైర్యముతో బ్రాహ్మీలక్ష్మిని కోల్పోయియు పతనమైన ఆ రేణుకను చూచి జమదగ్ని ఛీత్కరించి కోపముతో కొడుకు వసుమన్తునితో, "నీవు నీ తల్లిని వెంటనే వధింపుము" అని పలుకగా, ఆ ఆజ్ఞను వినియును, తల్లియందలి ప్రేమతో, ఆతడు వినని వానివలె భయముతో మౌనముగా క్రింది చూపులు చూచుచు నిలువబడెను.

**శ్లో॥ భస్మీభవేతి తం ప్రోక్త్వా సుషేణం చ తథా వసుమ్ ।**
**విశ్వావసుం చ తాన్నిన్యే కోపేనైవ యమక్షయమ్ ॥ 45**

**ప్ర :** భస్మీభవ = బూదివై పొమ్ము, ఇతి = అని, తం ప్రోక్త్వా = అతనిని శపించి, సుషేణం చ

తథా వసుం విశ్వావసుం చ = సుషేణుని, అట్లే వసువును, విశ్వావసువును గూడ, తాన్ = వారిని, కోపేన ఏవ = కోపముతోనే, యమక్షయం నిన్యే = మృతుల జేసెను.

**తా :** బూది యగునట్లు వానిని, సుషేణుని, వసువును, విశ్వావసువును గూడ శపించి యమపురి కంపెను.

**శ్లో॥ అత్రాన్తరే వనాద్రామః ప్రాప తం ప్రాహ సత్వరమ్ ।**
**జహ్యేనామవిచారేణ భో! రామ! త్వం మమాజ్ఞయా ॥ 46**

ప్ర : అత్రాన్తరే = అంతలో, వనాత్ = అడవినుండి, రామః ప్రాప = రాముడు వచ్చెను, తం ప్రాహ = వాని కిట్లనెను, భో! రామ! = ఓ రామ!, త్వమ్ = నీవు, మమ ఆజ్ఞయా = నా ఆజ్ఞచే, అవిచారేణ = సంకోచము లేకుండ, ఏనామ్ = ఈమెను, జహి = చంపుము.

**తా :** అంతలో రాముడడవి నుండి రాగా, "ఓ రామా! నీవు ఈమెను చంపుము. ఇది నా ఆజ్ఞ. సంకోచము వలదు", అని వాని నాజ్ఞాపించెను.

**శ్లో॥ తత ఆదాయ పరశుం రామో మాతుః శిరోఽచ్ఛినత్ ।**
**శాన్తో మునిస్తమాలిఙ్గ్య ప్రాహాభీష్టం వరం వృణు ॥ 47**

ప్ర : తతః = అంతట, రామః = రాముడు, పరశుం ఆదాయ = గొడ్డలిని తీసికొని, మాతుః శిరః = తల్లి తలను, అచ్ఛినత్ = నరికెను, శాన్తః శాంతించినవాడై, మునిః = ఆ జమదగ్ని, తం ఆలిఙ్గ్య = ఆ రాముని కౌగలించి, ప్రాహ = ఇట్లనెను, అభీష్టం వరమ్ = నీ కిష్టమైన వరమును, వృణు = కోరుకొనుము.

**తా :** అంతట రాముడు గొడ్డలిని చేపట్టి తన తల్లి తలను నరికెను. దాన శాంతించిన జమదగ్ని వానిని కౌగలించికొని నీ కిష్టమైన వరమును కోరుకొమ్మనెను.

**శ్లో॥ స వవ్రే మాతురుత్థానం భ్రాతౄణాం చాత్మనో జయమ్ ।**
**యుద్ధేఽప్రతిద్వన్ద్వతాయుర్దీర్ఘం సోఽపి తథా దదౌ ॥ 48**

ప్ర : సః = ఆ రాముడు, మాతుః = తల్లియొక్క, భ్రాతౄణామ్ = సోదరుల యొక్కయు, ఉత్థానమ్ = పునర్జీవనము, చ = మరియు, ఆత్మనః = తనయొక్క, యుద్ధే జయమ్ = యుద్ధమున జయము, అప్రతిద్వన్ద్వతా = ఎదురునిల్చు వీరుడు లేకుండుటయు, దీర్ఘం ఆయుః = దీర్ఘాయువును, వవ్రే = వరముగా కోరెను, సః అపి = ఆ జమదగ్నియు, తథా దదౌ = అట్లే ఇచ్చెను.

**తా :** రాముడు తన తల్లికి, సోదరులకు పునర్జీవితమున్నూ, తనకు యుద్ధమున సరిజోడు లేకుండుట, విజయము, దీర్ఘాయువును వరముగా కోరెను. వాని తండ్రి జమదగ్నియు ఆ వరముల నట్లే ప్రసాదించెను.

**శ్లో॥ తతస్తే బన్ధవస్తస్య మృతా అప్యుత్థితాః పునః ।**
**రేణుకా చ మహాభాగా తతో రామో ముదం యయౌ ॥ 49**

**శ్లో॥ తతః ప్రభృతి రామోఽసౌ మహావీర్యోఽభవద్భువి ।**
**తేజసాతీవ దుర్ధర్షో ధనుర్విద్యావిశారదః ॥ 50**

**ప్ర :** తతః = అంతట, తస్య = ఆ రామునియొక్క, తే మృతాః అపి బన్ధవః మహాభాగా రేణుకా చ = చనిపోయిన బంధువులైన ఆ సోదరులున్నూ మహాత్మురాలైన రేణుకాదేవియూ, పునః ఉత్థితాః = మరల సజీవులయిరి. తతః = దానివలన, రామః = రాముడు, ముదం యయౌ = సంతోషించెను; తతః ప్రభృతి = అప్పటినుండియు, అసౌ రామః = ఈ రాముడు, మహావీర్యః = మహావీరుడు, భువి = భూమిపై, తేజసా = తేజస్సుచేత, అతీవ = మిక్కిలి, దుర్ధర్షః = ఎదుర్కొనరాని, ధనుర్విద్యావిశారదః = ధనుర్విద్యానిపుణుడు, అభవత్ = ఆయెను.

**తా :** అంతట ఆ రాముని సోదరులునూ తల్లి రేణుకయూ మరల జీవించిరి. రాముడందుకు సంతోషించెను. అప్పటినుండి రాముడు భూమిపై దుర్నిరీక్ష్యతేజశ్శాలియై, ఎదురులేని ధనుర్విద్యా నిపుణుడై, మహావీరుడాయెను.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం చతుర్థాష్టకే పంచమాధ్యాయః ॥

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## చతుర్థాష్టకము - షష్ఠాధ్యాయము

**శ్లో॥ పిబతః ప్రత్యహం సోమం రాజ్ఞో ధర్మాత్మనోఽస్య చ ।**
**బ్రహ్మణ్యస్యాపి ధీర్భ్రష్టా మునిశాపేన దైవతః ॥ 1**

**ప్రతిపదార్థం :** ప్రత్యహమ్ = ప్రతిదినమును, సోమం పిబతః = సోమరసమును త్రాగునట్టి, రాజ్ఞః = రాజునకు, ధర్మాత్మనః = ధర్మాత్ముడైన వానికి, బ్రహ్మణ్యస్య అపి = బ్రహ్మజ్ఞానియే యైనను, అస్య చ = వానికిని, మునిశాపేన = మునిశాపముచే, దైవతః = దైవవశమున, ధీః = బుద్ధి, భ్రష్టా = భ్రష్టమైనది.

**తాత్పర్యం :** ప్రతిదినము సోమరసము నాస్వాదించు ధర్మాత్ముడైన బ్రహ్మజ్ఞానియైనను, మునిశాపముచేత దైవవశమున బుద్ధి భ్రష్టమైనది.

**శ్లో॥ విహితార్థోఽపి రాజాఽసౌ బ్రహ్మణ్యోఽపి సునీతిమాన్ ।**
**వశీకృతో భావినాయమపరాధం వ్యధాదృషేః ॥ 2**

**ప్ర :** విహితార్థః+అపి = కృతార్థుడైనను, బ్రహ్మణ్యః+అపి = బ్రహ్మజ్ఞుడైనను, సునీతిమాన్ = నీతిమంతుడైనను, అసౌ రాజా = ఆ రాజు కార్తవీర్యార్జునుడు, భావినా = ప్రారబ్ధముచే, వశీకృతః = వశముజేసికొనబడినవాడై, ఋషేః = ఋషికి, అయం అపరాధమ్ = ఈ అపచారమును, వ్యధాత్ = చేసెను.

**తా :** కార్తవీర్యార్జునుడు బ్రహ్మజ్ఞాని, నీతిమంతుడు, కృతార్థుడు. అయినప్పటికిని, కాలవశమున ఋషికి యీ అపచారమును చేసెను.

**శ్లో॥ బ్రహ్మాదయోఽపి సర్వజ్ఞా భావినైవ వశీకృతా ।**
**అవశ్యం భావితాఽప్యేషా స్వయమీశేన నిర్మితా ॥ 3**

**ప్ర :** బ్రహ్మ+ఆదయః = బ్రహ్మమొదలగు వారు, సర్వజ్ఞాః అపి = సర్వము తెలిసినవారైనను, భావినా ఏవ = కాలమునకే, వశీకృతాః = వశమైనవారైరి, ఏషా = ఇది, అవశ్యం భావితా అపి = తప్పక జరుగవలసినది కూడ, ఈశేన = ఈశ్వరుని చేత, స్వయమ్ = తానై, నిర్మితా = నిర్మింపబడినది.

**తా :** బ్రహ్మమొదలగు దేవతలు సర్వజ్ఞులైనను, భవిష్యన్నిర్ణయమునకు వశులై (విధివశులై) ప్రవర్తింతురు. తప్పక జరుగవలసిన భవిష్యత్ ప్రణాళిక గూడ ఈశ్వరుడు స్వయముగ తానే యేర్పరచినదే.

**శ్లో॥ కుమారశాపదగ్ధాస్తే పేతుర్భువ్యజపార్షదాః ।**
**చన్ద్రేన్ద్రభృగుదక్షాద్యా భావినైవేహ వఞ్చితాః ॥ 4**

**ప్ర :** కుమార శాపదగ్ధాః = సనకాదుల శాపబాధితులు, అజపార్షదాః = విష్ణుభక్తులైన, చన్ద్ర = చంద్రుడు, ఇన్ద్ర = ఇంద్రుడు, భృగు = భృగుమహర్షి, దక్ష+ఆద్యాః = దక్షుడాదిగా గలవారు, భువి = భూమిపై, పేతుః = అవతరించిరి, ఇహ = ఈ విషయమున, తే = వారు, భావినా ఏవ = ప్రారబ్ధము చేతనే, వఞ్చితాః = లోగొనబడిరి.

**శ్లో॥ నారదాద్యా అపి విధిం నాతిక్రామన్తి తద్వశాః ।**
**కా కథా తు మనుష్యాణాం బలీయాన్విధిరేష హి ॥ 5**

**ప్ర :** నారదాద్యాః అపి = నారదుడు మొదలగువారైనను, విధిమ్ = విధిని, తత్ వశాః = ఆ విధికి వశులై, న అతిక్రామన్తి = త్రోసిరాజనుటలేదు, మనుష్యాణాం తు = మనుష్యుల విషయమున, కా కథా = చెప్పవలసిన దేమున్నది?, ఏషః విధిః = ఈ విధి, బలీయాన్ హి = బలవత్తరమే.

**తా :** నారదాదులు కూడ విధివశులైరి, దాని దాటకుండిరి. ఇంక మనుష్యుల విషయమున చెప్పవలసినదేమి? విధి బలవత్తరమే.

**శ్లో॥ బలిష్ఠేఽస్మిన్నపి కుతో హానిస్తత్త్వవిదః సతః ।**
**శరీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 6**

**ప్ర :** అస్మిన్ బలిష్ఠే అపి = విధి బలిష్ఠమే యైనను, తత్త్వవిదః = తత్త్వజ్ఞులైన, సతః = సత్పురుషులకు, హానిః = అపకారము, కుతః = ఎందువలన కలుగును?, కర్మ కేవలం కుర్వన్ = కర్మమాత్రము చేయుచు, శరీరమ్ = శరీరము, కిల్బిషమ్ = పాపమును, న ఆప్నోతి = పొందదు.

**తా :** విధి చాల బలమైనదే. ఐనను తత్త్వమెఱిగిన సత్పురుషులకు దానివలన అపకారము కలుగదు. ఏలన, శరీరము కర్మ మాత్రమే చేయును. పాపపుణ్యముల అనుభవము దానికి లేదు. కర్తృత్వము వహించు పురుషుడు సత్పురుషుడై సత్యస్వరూపము నెఱిగిన వాడైనచో, ఆ కర్మఫలము వాని నంటదు.

**శ్లో॥ యదా సిద్ధోఽభవద్యోగీ సోఽర్జునః ప్రాహ తం గురుమ్ ।**
**బలిష్ఠం మాం త్వమేవేశ! జహి యాస్యే తతో గతిమ్ ॥ 7**

ప్ర : యదా = ఎప్పుడు, సిద్ధః = సిద్ధుడు, యోగీ అభవత్ = యోగి యాయెనో, సః అర్జునః = అట్టి అర్జునుడు, తం గురుమ్ = తన గురువును గూర్చి, ప్రాహ = ఇట్లనెను, ఈశ! = ఈశ్వరా!, బలిష్ఠం మామ్ = బలిష్ఠుడనై యున్న నన్ను, త్వం ఏవ జహి = నీవే చంపుము, తతః = ఆ కారణమున, గతిం యాస్యే = మోక్షమును పొందుదును.

**తా :** కార్తవీర్యార్జునుడు సిద్ధుడై అటనుండి యోగియైనప్పుడు, ఆతడు తన గురువునిట్లు ప్రార్థించెను : నేను బలవంతుడనై యుండగా, ఈశ్వరా! నీవే నన్ను చంపుము. అందువలన నాకు మోక్షము కలుగును.

**శ్లో॥ నేదం త్వాం రోచతే మృత్యుర్నమే రోగాన్న హీనతః ।**
**భూయద్భవాదృశాదేవ రాజ్ఞేత్థం యాచితం తదా ॥ 8**

ప్ర : ఇదం మృత్యుః = ఈ మరణము, మే = నాకు, రోగాత్ = రోగము వలన, హీనతః = శక్తి క్షీణించుట వలన, న = కాదు, ఇదమ్ = ఇట్టి మృత్యువు, త్వాం న రోచతే = రుచించదాయెను, భవాదృశాత్ ఏవ = తమవంటి వారిచేతనే, భూయాత్ = అగుగాక!, ఇత్థమ్ = ఈ రీతిగా, తదా = అప్పుడు, రాజ్ఞా = కార్తవీర్యునిచే, యాచితమ్ = కోరబడెను.

**తా :** నాకు మరణమనునది రోగమువలన, వయస్సుమీరుటచే శక్తిహీనతవలన కలుగుట రుచించదు, బలవంతుడనై యుండగనే నీ చేతనే కలుగవలెను. అందువలన నాకు ముక్తికలుగును, అని కార్యవీర్యుడు తాను యోగియైనప్పుడే గురువైన శ్రీదత్తుని కోరినాడు.

**శ్లో॥ శ్రీశః స్వాంశేన తత్సిద్ధ్యా చావతీర్య ద్విజన్మనా ।**
**జఘ్నే ఖ్యాత్యాధికో రామో భార్గవోఽపి స్వసేవకమ్ ॥ 9**

ప్ర : తత్ సిద్ధ్యా = ఆ సిద్ధిచేత (అనగా, అట్లు సిద్ధించిన భవిష్యత్తురూపకముగా), శ్రీశః = విష్ణువు, స్వ+అంశేన ద్విజన్మనా = బ్రాహ్మణుడుగా తన అంశతో, అవతీర్య = అవతరించి, ఖ్యాత్యా+అధికః = జన్మవ్యవహారముచే అధికుడైన, రామః = రాముడు, భార్గవః అపి = భృగువంశజుడైనను, స్వసేవకమ్ = తన భక్తుని, జఘ్నే = వధించెను.

**తా :** అట్లు కార్తవీర్యుని మరణరూపభవిష్యత్తు సిద్ధమై యుండగా, విష్ణువు తన అంశతో కార్తవీర్యుని కంటె జన్మాధికుడైన బ్రాహ్మణుడై భృగువంశజుడై అవతరించి తన భక్తుని వధించెను.

**శ్లో॥ దోషః క్వ చేశ్వరస్యాత్ర కల్ప్యతేఽత్ర జగద్భ్రమః ।**
**ఈశః సర్గస్థితిలయాన్ కరోతీతి భ్రమో హ్యసన్ ॥ 10**

**ప్ర :** అత్ర = ఈ విషయమున, ఈశ్వరస్య దోషః = ఈశ్వరుని దోషము, క్వ = ఎక్కడ?, అత్ర = ఇందు, జగత్+భ్రమః = జగత్తు అను భ్రాంతి, కల్ప్యతే = కల్పింపబడుచున్నది, ఈశః = ఈశ్వరుడు, సర్గ = సృష్టి, స్థితి = ఉనికి, లయాన్ = నాశము, అను వానిని, కరోతి = చేయుచున్నాడు, ఇతి = అని, భ్రమః హి = భ్రమయే, అసన్ = అసద్రూపము, సత్యము కానిది.

**తా :** ఈ విషయమున దేవుని దోషము లేదు. జగత్తును ఈశ్వరుడు సృష్టించి, పోషించి, చంపుచున్నాడను భ్రాంతి మాత్రమే కల్పింపబడుచున్నది. ఈ భ్రమయే అసద్రూపము, సత్యము కానిది.

**శ్లో॥ ఈశః కర్తాస్య సర్వస్య హర్తా భర్తా జనార్దనః ।**
**బాలవత్ క్రీడతి సదా తేన బన్ధః కుతో విభోః ॥ 11**

**ప్ర :** అస్య సర్వస్య = ఈ సమస్తమునకు, కర్తా భర్తా హర్తా = చేయువాడు, అనుభవించువాడు, నశింపజేయువాడు, జనార్దనః = జనార్దనుడు (జీవుని బాధను హరించువాడు), సదా = ఎల్లపుడు, బాలవత్ = బాలునివలె, క్రీడతి = ఆడుచున్నాడు, తేన = దానిచే, విభోః = ఆ సర్వవ్యాపికి, బన్ధః = బంధము, కుతః = ఎందువలన, ఎక్కడనుండి కలుగును?

**తా :** ఈ సమస్తమునకు కర్త, భర్త, హర్త అన్నియూ ఈశ్వరుడే. ఆతడే జనార్దనుడు. ఆతడు బాలునివలె ఆడుచున్నాడు. అట్టి బాలునికి, సర్వవ్యాపికి, బంధము దేనినుండి కలుగును?

**శ్లో॥ ఉత్పన్నస్యాపి సర్వస్య ధ్రువో నాశోఽధ్రువత్వతః ।**
**కిం వినష్టం హి భక్తస్య దేహే నష్టే చిదాత్మనః ॥ 12**

**ప్ర :** ఉత్పన్నస్య సర్వస్య అపి = జన్మించిన దానికంతటికిన్నీ, అధ్రువత్వతః = నిలుకడలేనిదైన కారణమున, నాశః ధ్రువః = నశింపు నిశ్చయము, చిదాత్మనః భక్తస్య = జ్ఞానరూపియైన భక్తునకు, దేహే నష్టే = దేహము నశించగా, వినష్టం హి కిమ్ = విశేషమైన నష్టమేమి కలిగినది?

**తా :** రూపము దాల్చిన దేదియైన రూపుమాసిపోవలసినదే. ముందు లేనిదే కదా పుట్టినది! కనుక అది తాత్కాలికము. భక్తుని దేహము గూడ అట్టి యొక రూపమే. అది నశించినందువలన వాని కేమి గొప్ప నష్టము? తాను జ్ఞానస్వరూపుడు కదా.

**శ్లో॥ జ్ఞస్యాపి యావదారబ్ధం చేష్టా భవతి తేన కిమ్ ।**
**హీయతే తస్య స జ్ఞానకాల ఏవ స్థితిం గతః ॥ 13**

**ప్ర :** జ్ఞస్య అపి = జ్ఞానికైనను, యావత్ ఆరబ్ధమ్ = ప్రారంభింపబడినది యెట్లయినన, చేష్టా భవతి = అది కార్యమగును, తేన కిమ్ = దాని కేమి?, సః = ఆతడు, స్థితిం గతః = అద్వయస్థితిని పొందినవాడు, తస్య = వానియొక్క, జ్ఞానకాలః ఏవ = జ్ఞానానుభవకాలము మాత్రమే, హీయతే = నశించుచున్నది.

**తా :** జ్ఞానికైనను ఆరబ్ధకర్మానుభవము కలుగును. అయిన నేమి? ఆతడు అద్వయస్థితిని పొందినవాడు. కనుక నశించినది వాని అనుభవకాలము. అంత మాత్రమే.

**శ్లో॥ కర్మణైవేశ్వరోఽప్యత్ర చేష్టతే న స్వభావతః ।**
**న తేన బాధ్యతే తస్మాన్నాత్ర దోషో ద్వయోరపి ॥ 14**

**ప్ర :** కర్మణా ఏవ = కర్మచేతనే, న స్వభావతః = స్వభావముచేత కాదు, ఈశ్వరః అపి అత్ర = ఈశ్వరుడైనను, చేష్టతే = ఫలము నిచ్చును, న తేన బాధ్యతే = వానిచే బాధింపబడదు, తస్మాత్ = అందువలన, అత్ర = ఆ విషయమున, ద్వయోః అపి = రెండిటికిని, దోషః న = దోషము లేదు.

**తా :** కర్మచేతనే గాని స్వభావముచేత ఈశ్వరుడైనను ఫలము నివ్వదు. కనుక జీవునకు దేవునకు ఇద్దరకును కర్మదోషము లేదు.

**శ్లో॥ ఏకదా రథమారుహ్య సమ్రాడ్రాజా స పర్యటన్ ।**
**క్రీడిత్వా సుచిరం హర్షాచ్చతురఙ్గబలాన్వితః ॥ 15**

**ప్ర :** ఏకదా = ఒకప్పుడు, సమ్రాట్ రాజా = కార్తవీర్యార్జునచక్రవర్తి, రథం ఆరుహ్య = రథము నెక్కి, సుచిరమ్ = చాలకాలము, హర్షాత్ = సంతోషముతో, చతురంగబలాన్వితః సః = రథ గజ తురగపదాతి దళములను నాలుగు అంగములుగల సేనతో కూడిన ఆతడు, పర్యటన్ = ద్రిమ్మరుచు,

**శ్లో॥ మార్గే నివృత్తః సోఽద్రాక్షీజ్జమదగ్న్యాశ్రమం శుభమ్ ।**
**ద్విత్రైర్మిత్రైర్యుతో రాజా పాదచారీ తమావిశత్ ॥ 16**

**ప్ర :** మార్గే = త్రోవలో, నివృత్తః = విడిసినవాడై, జమదగ్ని+ఆశ్రమం శుభమ్ = శుభకరమైన జమదగ్ని ఆశ్రమమును, అద్రాక్షీత్ = చూచెను, సః రాజా = ఆ రాజు, ద్విత్రైః = ఇద్దరు లేక ముగ్గురు, మిత్రైః యుతః = స్నేహితులతో కూడి, పాదచారీ = నడచుకొనుచు, తమ్ = ఆ ఆశ్రమమును, ఆవిశత్ = ప్రవేశించెను.

**తా :** త్రోవలో విడిది చేసినవాడై శుభదమైన జమదగ్ని ఆశ్రమమును చూచెను. అంతట నా కార్తవీర్యుడు ఇద్దరు-ముగ్గురు మిత్రులతో కాలినడకన ఆ ఆశ్రమములో ప్రవేశించెను.

**శ్లో॥ దృష్ట్వాఽఽశ్రమే మూర్తిమన్తం శివయేవ శివం నృపః ।**
**జమదగ్నిం తపోదీప్తం సాధ్వ్యారేణుకయాన్వితమ్ ॥ 17**

**ప్ర :** ఆశ్రమే = ఆశ్రమమున, శివయా శివం ఇవ = పార్వతితో శివునివలె, సాధ్వ్యా రేణుకయా అన్వితమ్ = మహాపతివ్రతయైన రేణుకతో గూడియున్న, తపోదీప్తమ్ = తపస్సుచే తేజస్వియై,

మూర్తిమన్తమ్ = వెలుగొందుచున్న, జమదగ్నిం దృష్ట్వా = జమదగ్నిని చూచి, నృపః = రాజు కార్తవీర్యుడు,

**శ్లో॥ తం నమస్కృత్య భక్త్యైవ మూర్ధ్ని బద్ధాఞ్జలిర్నృపః ।**
**స్తుత్వా స్తోత్రైశ్చ వివిధైర్నత్వాపి చ పునః పునః ॥ 18**

ప్ర : భక్త్యా ఏవ = భక్తితోడనే, మూర్ధ్ని = తలపై, బద్ధాఞ్జలిః = అంజలి ఘటించినవాడై, తమ్ = ఆ మహర్షిని, నమస్కృత్య = నమస్కరించి, స్తోత్రైః వివిధైః స్తుత్వా చ = నానావిధముల స్తోత్రపాఠములతో స్తుతించియును, పునః పునః = మరల మరల, నత్వా అపి = నమస్కరించియు, నృపః = రాజు కార్తవీర్యుడు,

**శ్లో॥ తదాజ్ఞయా తత్పురతో వినయావనతో నృపః ।**
**ఉపవిశ్యాథ పప్రచ్ఛ కుశలం సోఽపి తం తథా ॥ 19**

ప్ర : తత్ ఆజ్ఞయా = ఆ మహర్షి ఆజ్ఞాపింపగా, తత్ పురతః = వాని ఎదురుగా, వినయ+అవనతః = వినయముతో వంగి, ఉపవిశ్య = కూర్చొని, అథ = అటుపై, నృపః = రాజు, కుశలం పప్రచ్ఛ = కుశలమడిగెను, సః అపి = ఆ మహర్షియు, తం తథా = వాని నట్లే.

**తా (శ్లో.17-19) :** ఆశ్రమమున రేణుకా సహితుడైన జమదగ్ని పార్వతితో శివునివలె కన్పించెను. భక్తితో తలపై చేతులుంచి అంజలి ఘటించి ఆ మహర్షిని నమస్కరించి, పలువిధముల స్తోత్రములతో స్తుతించి మరల మరల నమస్కరించెను. అంతట ఆ మహర్షి ఆజ్ఞతో వినయముగ వంగి ఎదురుగ కూర్చొని రాజు కార్తవీర్యుడు ఆ మహర్షిని కుశల ప్రశ్న జేసెను. జమదగ్నియు వాని నట్లే కుశల మడిగెను.

**శ్లో॥ రాజాఽఽహ రాష్ట్రకోశాదౌ ధర్మే సర్వత్ర చాప్యహో ।**
**భవత్ప్రసాదాత్స్వస్త్యస్తి ధన్యో వో దర్శనాదహమ్ ॥ 20**

ప్ర : రాజా ఆహ = రాజు కార్తవీర్యుడిట్లనెను, రాష్ట్రకోశ+ఆదౌ = ధనాగారము మొదలు, సర్వత్ర చ = అంతటను, ధర్మే = ధర్మమునందు, భవత్ ప్రసాదాత్ = మీ అనుగ్రహము వలన, స్వస్తి అస్తి = క్షేమము, శుభముగ నున్నది, వః దర్శనాత్ = మీ దర్శనము వలన, అహమ్ = నేను, ధన్యః = ధన్యుడను.

**తా :** కార్తవీర్యుడిట్లనెను : ధనాగారము మొదలు అన్ని విషయములందును మీ అనుగ్రహమువలన ధర్మము నందున్నది. శాంతి నెలకొన్నది. మీ దర్శనమువలన నేను ధన్యుడను.

**శ్లో॥ ఇత్యుక్తః స ఋషిః స్నేహాదాతిథ్యేన నిమన్త్ర్య తమ్ ।**
**ససైన్యం తర్పయామాస స్వస్నైర్ధేనుప్రసాదతః ॥ 21**

**ప్ర :** ఇతి ఉక్తః = ఇట్లు చెప్పబడినవాడై, సః ఋషిః = ఆ జమదగ్నిమహర్షి, స్నేహాత్ = ప్రేమవలన, ఆతిథ్యేన = ఆతిథ్యముతో, తం నిమన్త్ర్య = వానిని ఆహ్వానించి, ససైన్యమ్ = సైన్యముతో గూడ, స్వన్నైః = యథోచితమైన ఆహారములతో, ధేనుప్రసాదతః = కామధేనువు అనుగ్రహమువలన, తర్పయామాస = సంతృప్తులజేసెను.

**తా :** రాజు కార్తవీర్యుడిట్లనగా జమదగ్ని మహర్షి ప్రేమతో వాని నాహ్వానించి, ఆతిథ్యమిచ్చెను. సైన్యముతో గూడ అందఱకు యథోచితభోజనసత్కారముల నిచ్చెను. కామధేనువు అనుగ్రహము వలన ఇది సాధ్యమైనది.

**శ్లో॥ దృష్ట్వా తద్వైభవం రాజా భావినాఽఽకృష్టచేతనః ।**
**ఋషిం పప్రచ్ఛ చైశ్వర్యం కుత ఈదృక్తవ ప్రభో! ॥ 22**

**ప్ర :** రాజా = కార్తవీర్యుడు, తత్ వైభవం దృష్ట్వా = ఆ వైభవమును చూచి, భావినా = విధిచే, ఆకృష్టచేతనః = ప్రేరేపింపబడిన చేతన గలవాడై, ఋషిం పప్రచ్ఛ చ = ఋషి జమదగ్ని నిట్లడిగెను కూడ, ప్రభో = ఓ స్వామీ!, తవ = నీకు, ఈదృక్ = ఇట్టి, వైభవమ్ = వైభవము, కుతః = ఎందువలన కలిగినది?

**తా :** రాజు ఆ ఋషివైభవమును చూచి విధిచే ప్రేరణ పొంది, ఓ ప్రభూ! ఇంతటి వైభవము మీ కెట్లు ప్రాప్తమైనదని యడిగెను.

**శ్లో॥ స ప్రాహ కామధుగియం సదా మే సర్వకామదా ।**
**రాజాఽఽహ దీయతే మే సా నిష్క్రియం తే దదామ్యహమ్ ॥ 23**

**శ్లో॥ బహుమూల్యం ధనం రత్నం భూమిం గాశ్చాప్యనేకధా ।**
**గృహాణేతి ప్రార్థితోఽపి స ధేనుం న దదౌ మునిః ॥ 24**

**ప్ర :** సః ప్రాహ = ఆతడనెను, ఇయం కామధుక్ = ఈమె అడిగినదిచ్చునది, సదా = ఎల్లవేళల, మే = నాకు, సర్వకామదా = అన్ని కోరికలను తీర్చునది, రాజా ఆహ = రాజిట్లనెను, మే దీయతామ్ = నా కిండు, సా = ఆమె, తే = నీకు, నిష్క్రియమ్ = ఊరక ఉండునది, అహమ్ = నేను, బహుమూల్యం ధనమ్ = చాల విలువైన ధనమును, రత్నమ్ = రత్నమును, భూమిమ్ = భూమిని, అనేకధా = లెక్కలేనన్ని, గాః చ అపి = గోవులనున్నూ, దదామి = ఇత్తును, గృహాణ = స్వీకరింపుము, ఇతి = అని, ప్రార్థితః అపి = వేడుకొనినను, సః మునిః = ఆ ముని, ధేనుమ్ = కామధేనువును, న దదౌ = ఇవ్వలేదు.

**తా :** జమదగ్ని యనెను, ఇది కామధేనువు. నాకు ఎప్పుడు యేమి కోరిన దాని నిచ్చును, అని. కార్తవీర్యుడనినాడు, దీనిని నా కిండు, మీ యొద్ద ఊరకే యున్నది, నేను మీకు చాల ధనమును,

రత్నములను, భూమిని, మరెన్నియో గోవుల నిత్తును, తీసికొనుడని, ఇట్లెంతగా వేడుకొన్నను జమదగ్ని ఆ కామధేనువు నివ్వలేదు.

**శ్లో॥ మునిః శాన్తపరోఽయం మే కిం కరిష్యత్యతో బలాత్ ।**
**నయామీతి విచిన్త్యాశు హఠాత్తాం ధేనుమాదదే ॥ 25**

ప్ర : అయం శాన్తపరః మునిః = ఈతడు శాంతికామియైన ముని, మే = నాకు, కిం కరిష్యతి = అపకారమేమి చేయును?, అనుభావముతో, అతః = ఇటనుండి, బలాత్ = బలవంతముగ, నయామి = తీసికొనిపోదును, ఇతి = అని, విచిన్త్య = ఆలోచించి, ఆశు = వెంటనే, హఠాత్ = అకస్మాత్తుగా, తాం ధేనుమ్ = ఆ కామధేనువును, ఆదదే = పట్టుకొనెను.

**తా :** ఈతడు ముని, స్వభావతః శాంతుడు, వీనివలన నాకేమి భయము? నేను బలవంతముగా ఈ ధేనువును తీసికొని పోదును, అని భావించి, కార్తవీర్యుడు హఠాత్తుగా కామధేనువును పట్టుకొనెను.

**శ్లో॥ రత్నం ధనం బహువిధం దత్తమప్యాత్మవాన్మునిః ।**
**న స్వీచకరా భూయోఽపి ధీమాన్ శాన్తిపరోఽభవత్ ॥ 26**

ప్ర : బహువిధం రత్నం ధనమ్ = వివిధములైన రత్నములు, ధనము, దత్తం అపి = ఇవ్వబడినను, ఆత్మవాన్ మునిః = ఆత్మనిరతుడైన ముని, న స్వీచకార = స్వీకరించలేదు, భూయః అపి = అంతమాత్రమే కాక, ధీమాన్ = బుద్ధిశాలి, శాన్తిపరః = శాన్తముగ నిర్వికారుడై, అభవత్ = ఉండెను.

**తా :** నానావిధరత్నసంపద నిచ్చిననూ జమదగ్ని స్వీకరించకపోగా, కార్తవీర్యుని దుర్వర్తనమునకు సైతము స్పందించక శాంతముగనే యుండెను.

**శ్లో॥ తతోఽనయత్స్వనగరం తాం ధేనుం సోఽర్జునో ముదా ।**
**అత్రాన్తరే వనాద్రామ ఆయయౌ స సమిత్కుశః ॥ 27**

ప్ర : సః అర్జునః = ఆ కార్తవీర్యుడు, ముదా = సంతోషముతో, తాం ధేనుమ్ = ఆ కామధేనువును, తతః = అటనుండి, స్వనగరమ్ = తన నగరమునకు, అనయత్ = కొనిపోయెను, అత్రాన్తరే = అంతలో, వనాత్ = అడవినుండి, స సమిత్కుశః = సమిధలను దర్భలను వెంటగొని, రామః ఆయయౌ = రాముడు వచ్చి చేరెను.

**తా :** ఆ కార్తవీర్యుడు సంతోషముతో ఆ కామధేనువును తనతో తీసికొని తన నగరమునకు పోయెను. అంతలో సమిధలను దర్భలను సేకరించి రాముడు వనమునుండి వచ్చెను.

**శ్లో॥ సోదరైః కథితం శ్రుత్వా ధేన్వాకర్షణమప్రియమ్ ।**
**భృశం చుకోప భూపాయ వృద్ధమన్యుర్మహాబలః ॥ 28**

**ప్ర :** సోదరైః కథితమ్ = సోదరులచే చెప్పబడిన, ధేను+ఆకర్షణం అప్రియమ్ = బాధ కలిగించు కామధేనువు యొక్క అపహరణమును, శ్రుత్వా = విని, వృద్ధ మన్యుః = రెచ్చిన కోపము గలవాడైన, మహాబలః = మహాబలశాలియైన రాముడు, భూపాయ = రాజు కార్తవీర్యునికై, భృశం చుకోప = మిక్కిలి కోపించెను.

**తా :** కామధేనువుయొక్క అపహరణమును గూర్చి సోదరులు చెప్పగా విని రాముడు చాల కోపించెను. కార్తవీర్యునికై ఆ కోపము వృద్ధియాయెను.

**శ్లో॥ పితరం ప్రాహ మద్వీర్యం పశ్య లోకాన్ దిధక్షతః ।**
**రాజా చోరోఽయమున్మత్తో బ్రహ్మద్వేషీ సుగర్వితః ॥ 29**

**శ్లో॥ సబలం తం నిహన్మ్యద్య శాస్తాఽస్మ్యుత్పథగామినామ్ ।**
**తదర్థమవతీర్ణోఽహం నైవ జానాతి మాం ఖలః ॥ 30**

**ప్ర :** పితరం ప్రాహ = తండ్రి కిట్లనెను, మత్ వీర్యం పశ్య = నా వీరమును చూడుము, లోకాన్ = లోకములను, దిధక్షతః = హానిపరచు, రాజా = రాజు, అయమ్ = ఈతడు, ఉన్మత్తః = మదించినవాడు, సుగర్వితః = అతిగర్వము గలవాడు, బ్రహ్మద్వేషీ = బ్రహ్మణ్యమూర్తులను ద్వేషించువాడు, చోరః = దొంగ, తమ్ = వానిని, సబలమ్ = బలముతో సహ, నిహన్మి = చంపుదును, అద్య = నేడు, ఉత్పథగామినామ్ = దైవము దిక్కుగా నడచువారికి, శాస్తా అస్మి = శాసకుడ నగుదును, అహమ్ = నేను, తత్+అర్థమ్ = ఆ ప్రయోజనమునకై, అవతీర్ణః = అవతరించితిని, ఖలః = ఈ దుర్మార్గుడు, మామ్ = నన్ను, న జానాతి ఏవ = ఎఱుగనే ఎఱుగడు.

**తా :** రాముడు తండ్రి కిట్లనెను : నా ప్రతాపము చూడుము. లోకకంటకుడైన ఈ కార్తవీర్యుడు గర్వితుడు, బ్రహ్మద్వేషి, మదించినవాడు, దొంగ. వానిని ససైన్యముగా సంహరింతును; నే నిపుడు దైవమార్గమున నడచువారికి శాసకుడనగుదును. నా జన్మ ఆ ప్రయోజనమును సాధించుటకే. ఈ దుర్మార్గుడు నన్నెఱుగకున్నాడు.

**శ్లో॥ ఇత్యుక్త్వా క్షత్రముచ్ఛేత్తుం రామో రక్తాన్తలోచనః ।**
**ప్రవిశన్తం పురం భూపం నిర్ధార్యాహ గభీరవాక్ ॥ 31**

**ప్ర :** ఇతి ఉక్త్వా = అని పలికి, రామః = రాముడు, క్షత్రమ్ = క్షత్రియులను, ఉచ్ఛేత్తుమ్ = వధించుటకు, రక్త+అన్తలోచనః = ఎఱ్ఱబారి కన్నులు గలవాడై, పురం ప్రవిశన్తమ్ = తన నగరమును ప్రవేశించుచున్న, భూపమ్ = కార్తవీర్యుని, నిర్ధార్య = అడ్డుకొని, గభీరవాక్ = గంభీరమైన వాక్కుతో, ఆహ = ఇట్లనెను.

**తా :** ఇట్లని పలికి రాముడు క్షత్రియవధకు ఎట్టబారిన కన్గవతో, తన నగరమును ప్రవేశించుచున్న కార్తవీర్యుని నిలువరించి గంభీరకంఠస్వరముతో ఇట్లనెను.

**శ్లో॥ రే! చోర! చోర! దుష్టాద్య క్వ యాస్యసి మదగ్రతః ।**
**ధేనుం క్వ నేష్యసి క్షేత్రే కిము క్షత్రాధమోచితమ్ ॥ 32**

**ప్ర :** రే చోర చోర = ఒరే దొంగ! దొంగా!, దుష్ట = దుష్టుడా!, అద్య = నేడు, మత్ అగ్రతః = నా సమక్షమున, క్వ యాస్యసి = ఎక్కడకు పోవుచున్నావు?, ధేనుమ్ = కామధేనువును, క్వ నేష్యసి = ఎక్కడకు తీసికొనిపోవుచున్నావు, క్షత్రాధమ! = క్షత్రియాధమ!, క్షేత్రే = యుద్ధరంగమున, కిము ఉచితమ్ = ఉచితవర్తనమేమి?

**తా :** ఓరీ దొంగా! దుష్టుడా! నా సమక్షమున ఎక్కడకు పోదువు? కామధేనువును ఎక్కడకు తీసికొని పోదువు? క్షత్రియాధమ! యుద్ధరంగమున సముచితప్రవర్తన మిదియా?

**శ్లో॥ ఇత్యుక్తః స సుధీ రామం జ్ఞాత్వా విష్ణుం నృపోఽర్జునః ।**
**క్షాత్రధర్మేణ తుష్ట్వాఽముం ప్రయాస్యే తత్పదం పరమ్ ॥ 33**

**శ్లో॥ ఇతి కృత్వా మతిం భూపో యుద్ధాయ ప్రేరయద్భటాన్ ।**
**స్వశక్త్యా తేఽపి యుయుధూ రామేణ పరమాత్మనా ॥ 34**

**ప్ర :** ఇతి+ఉక్తః = అని చెప్పబడినవాడై, సః సుధీః = ఆ వివేకియైన కార్తవీర్యుడు, రామమ్ = రాముని, విష్ణుం జ్ఞాత్వా = విష్ణువుగా తెలిసికొని, నృపః అర్జునః = రాజైన అర్జునుడు, అముమ్ = వీనిని, క్షాత్రధర్మేణ = క్షాత్రధర్మముచేత, తుష్ట్వా = సంతోషపరచి, తత్ పదం పరమ్ = ఆ పరమపదమును, ప్రయాస్యే = చేరబోదును, ఇతి = అని, మతిం కృత్వా = మనసున నిశ్చయము చేసికొని, భూపః = రాజు, భటాన్ = సైనికులను, యుద్ధాయ = యుద్ధమునకై, ప్రేరయత్ = ప్రేరేపించెను, తే అపి = ఆ సైనికులున్నూ, పరమాత్మనా రామేణ = శ్రీమహావిష్ణువైన రామునితో, స్వశక్త్యా = తమ శక్తికొలది, యుయుధుః (యుయుధూ) = యుద్ధము చేసిరి.

**తా :** ఇట్లని రాముడు పలుకగా వివేకియైన రాజు అర్జునుడు రాముని విష్ణువుగా తెలిసికొని, వీనిని క్షాత్రధర్మముతో తృప్తిపరచి పరమపదమును చేరబోదును, అని నిశ్చయించికొని, రాజు సైనికులను యుద్ధమునకు పురికొల్పెను. ఆ సైనికులు గూడ శక్తికొలది రామునితో యుద్ధము చేసిరి.

**శ్లో॥ యుద్ధ్యమానాన్మహావీర్యాన్ క్రుద్ధో రామః ప్రతాపవాన్ ।**
**క్షణాజ్జఘాన నిఃశేషం నైశం ధ్వాన్తమివారుణః ॥ 35**

**ప్ర :** ప్రతాపవాన్ రామః = ప్రతాపవంతుడైన రాముడు, క్రుద్ధః = కోపించినవాడై, యుద్ధ్యమానాన్ = యుద్ధము చేయుచున్న, మహావీర్యాన్ = మహావీరులను, అరుణః = ఉదయసూర్యుడు, నైశం

ధ్వాన్తమ్ = రాత్రి చీకటిని, ఇవ = వలె, నిఃశేషమ్ = మిగులు లేకుండ, క్షణాత్ = క్షణములో, జఘాన = సంహరించెను.

**తా :** ప్రతాపవంతుడైన రాముడు కోపించి, యుద్ధము చేయుచున్న మహావీరులను ఉదయారుణ సూర్యుడు రాత్రి చీకటిని హరించినట్లు శేషము లేకుండ సంహరించెను.

**శ్లో॥ దేవా దైత్యా అపి న మే సంముఖే స్థాతుమీశ్వరాః ।**
**నాద్యాపి కోఽపి శక్తో మాం జేతుం మర్త్యస్య కా కథా ॥ 36**

**ప్ర :** దేవాః = దేవతలు, దైత్యాః అపి = రాక్షసులు గూడ, మే సంముఖే = నా ఎదుట, స్థాతుమ్ = నిలచుటకు, న ఈశ్వరాః= సమర్థులు కారు, అద్య అపి = నేడైనను, కః అపి = ఎవడైనను, మాం జేతుమ్ = నన్ను జయించుటకు, న శక్తః = సమర్థుడు కాడు, మర్త్యస్య కా కథా = మానవుని గూర్చి చెప్పవలెనా?

**తా :** దేవతలు దానవులు గూడ నా ఎదుట నిలుచుటకు సమర్థులు గారు. నేడైనను, నన్ను జయించుట కెవడునూ సమర్థుడు గాడు. ఇంక మానవు డెంత?

**శ్లో॥ తథాప్యద్య ద్విజో జేతుం సమర్థో మామయం నహి ।**
**ద్విజోఽవతీర్ణో విష్ణుర్వా ఇతి యోత్స్యే ద్విజన్మనా ॥ 37**

**ప్ర :** తథా+అపి = అట్లయినను, అద్య = నేడు, అయం ద్విజః = ఈ బ్రాహ్మణుడు, మామ్ = నన్ను, జేతుమ్ = జయించుటకు, నహి సమర్థః = సమర్థుడు కాడు, ద్విజః = బ్రాహ్మణుడు, అవతీర్ణః విష్ణుః వా = అవతరించిన విష్ణువు కాడు కదా, ఇతి = అని, ద్విజన్మనా = బ్రాహ్మణునితో, యోత్స్యే = యుద్ధము చేతును,

**శ్లో॥ ఇతి నిశ్చిత్య సహసా యోద్ధుమభ్యాయయౌ నృపః ।**
**యుయుధే వివిధాస్త్రైః స శ్రీదత్తం సంస్మరన్ హృది ॥ 38**

**శ్లో॥ జగర్జ సింహనాదేన వవర్ష శరపఞ్జరాన్ ।**
**ఆచ్ఛాదయామాస రామం మహీధ్రమివ తోయదః ॥ 39**

**ప్ర :** ఇతి నిశ్చిత్య = ఇట్లని నిశ్చయించి, సహసా = వెంటనే, యోద్ధుమ్ = యుద్ధము చేయుటకు, నృపః = రాజు, అభ్యాయయౌ = వెడలెను, హృది = మనసులో, శ్రీదత్తం సంస్మరన్ = శ్రీదత్తుని స్మరించుచు, సః = ఆతడు, వివిధ+అస్త్రైః = అనేకరీతుల అస్త్రములతో, యుయుధే = యుద్ధము చేసెను; సింహనాదేన జగర్జ = సింహమువలె గర్జించెను, శరపఞ్జరాన్ = బాణసమూహములను, వవర్ష = వర్షించెను, రామమ్ = రాముని, మహీధ్రమ్ = పర్వతమును, తోయదం ఇవ = మేఘము వలె, ఆచ్ఛాదయామాస = కప్పివేసెను.

**తా :** అట్లయినను, నే డీ బ్రాహ్మణుడు నన్ను జయించుటకు చాలడు, ఈతడు విష్ణువు అవతారమూర్తి కాడు కదా, అని వానితో యుద్ధము చేయుటకు నిశ్చయించి వెంటనే బయలుదేరి, మనసులో శ్రీదత్తుని స్మరించుచు, అనేక విధములైన అస్త్రములను వర్షించి, సింహగర్జన చేసి, రాముని బాణములతో కప్పి వేసెను. అదెట్లుండెననగా, మేఘము జడివానతో పర్వతమును కప్పివేసి నట్లుండెను.

**శ్లో॥ స సహస్రకరో దీప్తో దుర్ధర్షస్తేజసోఽర్జునః ।**
**రేజే రథీవ మార్తణ్డో దుర్నిరీక్ష్యః ప్రతాపవాన్ ॥ 40**

**ప్ర :** సః అర్జునః = ఆ అర్జునుడు, ప్రతాపవాన్ దుర్నిరీక్ష్యః = తేరి చూడరాని ప్రతాపవంతుడై, తేజసః = తేజస్సుచేత, దుర్ధర్షః = నిలువరింపలేనివాడై, సః = ఆతడు, రథీ = రథికుడై, మార్తణ్డః ఇవ = సూర్యునివలె, సహస్రకరః దీప్తః = వేయిచేతులుగలవాడై, మూర్తిమంతుడై, రేజే = ప్రకాశించెను.

**తా :** ఆ కార్తవీర్యుడు తన వేయి చేతులతో రథమెక్కి ప్రతాపవంతుడై ఎదురులేక పోరుచుండగా, వాని తేజస్సు దుర్నిరీక్షమై మధ్యాహ్నసూర్యునివలె వెలుగొందెను.

**శ్లో॥ తుతోష రామస్తద్ధస్తలాఘవం వీక్ష్య హర్షితః ।**
**వాతోఽభ్రాణీవ తద్బాణాన్నిరస్య చ ధనూంషి చ ॥ 41**

**శ్లో॥ క్షిత్వేక్షూనివ తత్తేజః శమయిత్వా పరశ్వధీ ।**
**విరథీకృత్య తద్బాహూంశ్చిచ్ఛేద ద్రోరివాఙ్కురాన్ ॥ 42**

**ప్ర :** రామః = రాముడు, తత్ = ఆ కార్తవీర్యునియొక్క, హస్తలాఘవం వీక్ష్య = శరప్రయోగమున వాని హస్తకౌశలము చూచి, హర్షితః = మెచ్చినవాడై, తుతోష = సంతోషించెను; వాతః = వాయువు, అభ్రాణి ఇవ = మేఘసమూహములను వలె, తత్ బాణాన్ = కార్తవీర్యుని బాణములను, నిరస్య చ = తొలగించి, ధనూంషి = ధనుస్సులను, క్షిత్వా చ ఇక్షూన్ ఇవ = చెఱకుగడలను వలె త్రుంచి వేసి, తత్ తేజః = వాని తేజస్సును, శమయిత్వా = నిరోధించి, పరశ్వధీ = పరశు (గండ్రగొడ్డలి) వును చేపట్టి, విరథీకృత్య = విరథిని చేసి, తత్ బాహూన్ = వాని చేతులను, ద్రోః = చెట్టుయొక్క, అఙ్కురాన్ ఇవ = కొమ్మలను వలె, చిచ్ఛేద = త్రుంచివేసెను.

**తా :** రాముడు ఆ కార్తవీర్యుని బాణప్రయోగనైపుణ్యమును చూచి, మెచ్చి, సంతోషించెను. వాయువు మేఘసమూహమును చెదరగొట్టినట్లు కార్తవీర్యుని బాణములను చెదరగొట్టి, వాని ధనుస్సులను తునియలు చేసి, వాని తేజస్సును నిలువరించి, గొడ్డలి పట్టి, వానిని విరథుని చేసి, వాని చేతులను, చెట్టుకొమ్మలను వలె నరికి వేసెను.

**శ్లో॥ దత్తాత్రేయప్రసాదేన నిర్గతైరపరైః పునః ।**
**బాహుభిర్యుయుధే వీరో మహాబలపరాక్రమః ॥ 43**

**శ్లో॥ పునశ్చిచ్ఛేద రామోఽపి పునస్తే నిర్యయుః కరాః ।**
**ఆగ్నేయాస్త్రేణ రామోఽథ శోషయామాస నిర్గమమ్ ॥ 44**

**ప్ర :** దత్తాత్రేయప్రసాదేన = దత్తాత్రేయుని అనుగ్రహము చేత, పునః నిర్గతైః = మరల పుట్టిన, అపరైః బాహుభిః = వేరు బాహువులతో, మహాబలపరాక్రమః వీరః = మహాబలశాలి, పరాక్రమవంతుడైన వీరుడు, యుయుధే = యుద్ధము చేసెను, పునః = మరల, రామః అపి = రాముడు గూడ, చిచ్ఛేద = నరికివేసెను, పునః = మరల, తే కరాః = ఆ బాహువులు, నిర్యయుః = యేర్పడినవి; అథ = అంతట, రామః = రాముడు, ఆగ్నేయాస్త్రేణ = ఆగ్నేయాస్త్రముతో, నిర్గమమ్ = మూలమును, శోషయామాస = ఎండింపజేసెను.

**తా :** దత్తాత్రేయుని అనుగ్రహముచేత మరల పుట్టిన వేరు బాహువులతో మహాపరాక్రమి కార్తవీర్యుడు యుద్ధము చేసెను. రాముడు వానిని గూడ మరల త్రుంచివేసెను. మరల ఆ బాహువులు యేర్పడగా, రాముడు వానిని మరల ఛేదించెను. బాహువులు మరల మొల్చెను. రాముడంతట ఆగ్నేయాస్త్రముతో ఆ బాహువుల మూలమును ఎండింపజేసెను.

**శ్లో॥ తదా సస్మార హృదయే రాజా తత్త్వం గురూదితమ్ ।**
**అన్తర్బహిర్వ్యవహృతీర్విస్మృత్యైకాగ్ర్యమాస్థితః ॥ 45**

**ప్ర :** తదా = అప్పుడు, రాజా = కార్తవీర్యుడు, హృదయే = మనసులో, గురు+ఉదితమ్ = గురువు బోధించిన, తత్త్వమ్ = తత్త్వమును, (ఆత్మతత్త్వమును), సస్మార = స్మరించెను, అన్తః +బహిః+వ్యవహృతీః = లోపలి, వెలుపలి, (జాగ్రదవస్థ, స్వప్నావస్థల) వ్యవహారములను, విస్మృత్య = మరచిపోయి, ఏకాగ్ర్యమ్ ఆస్థితః = ఏకాగ్రబుద్ధి యాయెను.

**తా :** అప్పుడు కార్తవీర్యుడు మనసులో గురువుపదేశించిన తత్త్వసత్యమును స్మరించి, జాగ్రత్ స్వప్నావస్థలలోని సమస్తవ్యవహారములను విస్మరించి, ఏకాగ్రతను పొందెను.

**శ్లో॥ న ఛిన్ద్యమానమప్యేతద్బ్రహ్మభూతోఽర్జునః శిరః ।**
**పరశ్వధాచ్ఛిన్నశీర్షం పపాత భువి తద్వపుః ॥ 46**

**ప్ర :** బ్రహ్మభూతః అర్జునః శిరః = బ్రహ్మభూతుడైన అర్జునుని శిరస్సు, న ఛిన్ద్యమానమపి ఏతద్ = త్రెంపరానిదే అది యైనను, పరశ్వధాత్ = పరశుధారచేత, ఛిన్నశీర్షమ్ = తలతెగినదై, తత్ వపుః = వాని శరీరము, భువి పపాత = భూమిపై బడెను.

**తా :** అర్జునుడు బ్రహ్మభూతుడు, వాని తల త్రెంపరానిదే. ఐనను పరశుధారచే త్రెంపబడినది కాగా, వాని శరీరము భూమిపై బడెను.

**శ్లో॥ విమానస్థాః సురాః సర్వే సంగ్రామం ప్రేక్ష్య దారుణమ్ ।**
**అతర్క్యం తత్ప్రయాణం చ పుష్పాణి వవృషుర్ముదా ॥ 47**

**ప్ర :** సర్వే సురాః = దేవతలందఱు, విమానస్థాః = విమానములందుండి, దారుణం సంగ్రామం ప్రేక్ష్య = భయంకరయుద్ధమును గాంచి, అతర్క్యమ్ = నిర్వివాదమైన, తత్+ప్రయాణం చ = ఆ కార్తవీర్యుని మోక్షమునున్నూ, ముదా = సంతోషముతో, పుష్పాణి = పూవులను, వవృషుః = వర్షించిరి.

**తా :** దేవతలందఱు తమ విమానములలో నిలచి ఆ భీకరయుద్ధమును చూచి మరణించిన కార్తవీర్యునకు మోక్షము తథ్యమనియు తలచిరి. విజేత విష్ణువనియూ వారెఱుగుదురు కావున పుష్పములను వర్షించిరి.

**శ్లో॥ జీవన్నేవ స ముక్తోఽపి కైవల్యం పరమం యయౌ ।**
**యోగీశ్వర ప్రసాదేన నిత్యముక్తోఽర్జునః స చ ॥ 48**

**ప్ర :** సః అర్జునః = ఆ అర్జునుడు, జీవన్ ఏవ = జీవించి యుండగనే, ముక్తః అపి = ముక్తుడైనను, పరమం కైవల్యం యయౌ = పరమమైన కైవల్యమును పొందెను; సః చ = ఆతడును, యోగీశ్వర ప్రసాదేన = శ్రీదత్తానుగ్రహము చేత, నిత్యముక్తః = నిత్యముక్తుడు.

**తా :** ఆ కార్తవీర్యార్జునుడు జీవన్ముక్తుడే యైనను, వాని ఆత్మ పరమకైవల్యమును పొందగా ఆతడు శ్రీదత్తప్రసాదముచే నిత్యముక్తుడాయెను.

**శ్లో॥ స్వస్వహేతౌ లయం జగ్ముః సర్వాస్తస్య కలాః స్వయమ్ ।**
**శ్రీదత్తేనైకతాం ప్రాప రాజా యుక్తః సమాధినా ॥ 49**

**ప్ర :** తస్య కలాః = వాని కళలు, సర్వాః = అన్ని అంశలును, స్వస్వ హేతౌ = తమ తమ మూలమునందు, లయం జగ్ముః = లీనమైనవి, రాజా = కార్తవీర్యార్జునుడు, సమాధినా యుక్తః = సమాధిలో శ్రీదత్తయుక్తుడై, శ్రీదత్తేన = శ్రీదత్తునితో, ఏకతాం ప్రాప = ఐక్యతను పొందెను.

**తా :** ఆ అర్జునుని అంశలు తమ మూలమునందు లీనమైనవి. ఆతడు సమాధిలో శ్రీదత్తునిలో ఐక్యమాయెను.

**శ్లో॥ ధేనుమాదాయ రామోఽపి తాతమేత్య న్యవేదయత్ ।**
**పిత్రాఽఽదిష్టోఽకరోద్రామో రాడ్వధోత్థాఘనిష్కృతిమ్ ॥ 50**

**ప్ర :** రామః అపి = రాముడు గూడ, ధేనుం ఆదాయ = కామధేనువును తీసికొని, తాతం ఏత్య = తండ్రిని జేరి, న్యవేదయత్ = నివేదించెను; పిత్రా = తండ్రిచేత, ఆదిష్టః = ఆదేశింపబడినవాడై, రామః = రాముడు, రాడ్వధోత్థ =రాజు వధవలన కలిగిన, అఘనిష్కృతిమ్ = పాపమునుండి విమోచనమును, అకరోత్ = చేసెను.

**తా :** రాముడు గూడ కామధేనువును తీసికొని తండ్రిని జేరి జరిగినదంతయు నివేదించెను. తండ్రి ఆజ్ఞానుసారము రాజవధాపాపమునకు శాంతిక్రియ జేసెను.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం చతుర్థాష్టకే షష్ఠాధ్యాయః ॥

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీ దత్తపురాణమ్

## చతుర్థాష్టకము - సప్తమాధ్యాయము

**శ్లో॥ ఇన్ద్రం వోతాన్యమప్యాజౌ జేతారమపరాజితమ్ ।**
**ద్విజోఽప్యహన్నిగృహ్యేదం న సాధ్వస్మత్సు సత్స్వితి ॥ 1**

**ప్రతిపదార్థం :** ఇన్ద్రం వా+ఉత+అన్యమ్ అపి = ఇంద్రుని గాని లేక ఇతరునైనగాని, అపరాజితమ్ = పరాజయమెఱుగనివానిని, అజౌ = యుద్ధమున, జేతారమ్ = జయించినవానిని, ద్విజః అపి = బ్రాహ్మణుడై యుండియు, నిగృహ్య = నిగ్రహించి, అహన్ = చంపెను, సత్సు అస్మత్సు = సత్పురుషులయిన మనయందు, ఇదమ్ = ఇది, న సాధు = మంచిది కాదు, ఇతి = అని

**తాత్పర్యం :** ఇంద్రునిగాని వేరొకరినిగాని, అపజయమెఱుగని వీరుణ్ణి యుద్ధమున నిగ్రహించి చంపెను. బ్రాహ్మణుడై యుండియు రాముడీ పనిచేసెను. ఇది మనవంటి సత్పురుషుల యెడ తగిన ప్రవర్తన కాదు, అని

**శ్లో॥ హృద్యానీయార్జునసుతా బద్ధవైరాః సుదుఃఖితాః ।**
**పితృహన్తృవధే యత్నమాస్థితా ఏకదా యయుః ॥ 2**

**ప్ర :** అర్జునసుతాః = కార్తవీర్యార్జునుని కుమారులు, సుదుఃఖితాః = మిక్కిలి దుఃఖించినవారై, హృది = మనసులో, ఆనీయ = తలంచి, బద్ధవైరాః = శత్రుత్వమును వహించి, పితృహన్తృవధే = తండ్రిని చంపినవానిని వధించుటయందు, యత్నమ్ ఆస్థితాః = ప్రయత్నశీలురై, ఏకదా = ఒకప్పుడు, యయుః = వెడలిరి.

**తా :** మనసులో నిశ్చయించికొని, కార్తవీర్యుని కుమారులు మిక్కిలి దుఃఖించి, శత్రుత్వము వహించి, తమ తండ్రిని చంపినవానిని వధించు ప్రయత్నమున ఒకప్పుడు బయలువెడలిరి.

**శ్లో॥ తత్పూర్వం నిర్యయౌ రామో వనం సభ్రాతృకో బలీ ।**
**అథాగత్యార్జునసుతా చాశ్రమం రురుధుర్భృశమ్ ॥ 3**

ప్ర : తత్ పూర్వమ్ = అంతకు మునుపు, సభ్రాతృకః బలీ రామః = సోదరులతో గూడి బలశాలియైన రాముడు, వనమ్ = వనమునకు, నిర్యయౌ = ఇల్లువిడచి వెళ్లెను, అథ = ఆ తర్వాత, అర్జునసుతాః ఆగత్య = కార్తవీర్యుని కుమారులు వచ్చి, భృశమ్ = మిక్కిలిగా, ఆశ్రమం రురుధుః= ఆశ్రమమును ముట్టడించిరి.

**తా :** అంతకు ముందుగ బలశాలి రాముడు సోదరులతో కలసి వనమునకు ఇల్లు విడచి వెళ్ళెను. ఆపై కార్తవీర్యుని కుమారులు వచ్చి ఆశ్రమమును ముట్టడించిరి.

**శ్లో॥ అన్వేష్యేతస్తతో రామమదృష్ట్వా సహసా మునిమ్ ।**
**జమదగ్నిం సుఖాసీనం దృష్ట్వా తం వ్యహనద్రుషా ॥ 4**

ప్ర : ఇతః తతః అన్వేష్య = ఇటునటు వెదకి, రామమ్ = రాముని, అదృష్ట్వా = కానక, సహసా = వెంటనే, జమదగ్నిం మునిమ్ = జమదగ్ని మహర్షిని, సుఖాసీనమ్ = సుఖముగ కూర్చొనియున్న వానిని, దృష్ట్వా = చూచి, రుషా = కోపముతో, తమ్ = ఆ మునిని, వ్యహనన్ = వధించిరి.

**శ్లో॥ ఆక్రోశన్తీం పురోభాగే రేణుకాం మూఢబుద్ధయః ।**
**తాం నిరస్య మునిం హత్వా స్వపురం సత్వరం యయుః ॥ 5**

ప్ర : పురోభాగే = ఎదుట, ఆక్రోశన్తీమ్ = యేడ్చుచున్న, తాం రేణుకాం నిరస్య = ఆ రేణుకను త్రోసిపుచ్చి, మూఢబుద్ధయః = అవివేకులై, మునిం హత్వా = మునిని వధించి, సత్వరమ్ = వేగముగా, స్వపురం యయుః = తమ నగరమునకు వెడలిరి.

**తా :** ఎదుట యేడ్చుచున్న రేణుకను త్రోసివేసి, మునిని చంపి, మూఢులై వారు తమ నగరమునకు వేగముగా పోయిరి.

**శ్లో॥ దుర్నిమిత్తాని రామోఽపి వీక్ష్య శీఘ్రం గృహం యయౌ ।**
**హతం స్వపితరం జ్ఞాత్వా విలలాప సుదుఃఖితః ॥ 6**

ప్ర : రామః అపి = రాముడున్నూ, దుర్నిమిత్తాని వీక్ష్య = దుశ్శకునములను చూచి, శీఘ్రమ్ = వేగముగ, గృహం యయౌ = ఇంటికి పోయెను, స్వపితరమ్ =తన తండ్రిని, హతం జ్ఞాత్వా = మృతునిగా తెలిసికొని, సుదుఃఖితః = బహుదుఃఖముగలవాడై, విలలాప = యేడ్చెను.

**తా :** రాముడున్నూ దుశ్శకునములజూచి వేగముగ యింటికి పోయి, తన తండ్రి మరణించెనని తెలిసికొని గాఢ దుఃఖముతో యేడ్చెను.

**శ్లో॥ మన్నిమిత్తం మృతిం యాతః పితా ధిఙ్మాం సుదుర్మతిమ్ ।**
**హా! తాత! హా! దయాసిన్ధో క్వ గతోఽసి గుణాకరః ॥ 7**

ప్ర : పితా = తండ్రి, మత్ నిమిత్తమ్ = నా కారణముగా, మృతిం యాతః = మరణించెను, ధిక్

మాం సుదర్మతిమ్ = దుర్బుద్ధినైన నాపై ధిక్కారము, హా తాత! = అయ్యో తండ్రీ!, హా! దయాసిన్ధో గుణాకరః = అయ్యో దయగలవాడవు, సుగుణములకు నెలవైనవాడవు, క్వ గతః అసి = ఎందు బోతివి?

**తా :** తన కారణముగా తన తండ్రి మరణించెనని తనను తానే ఛీత్కరించికొని, నిందించుకొని, అయ్యో తండ్రీ! దయామయుడవు, గుణఖనివి, నీ వెక్కడ బోతివి? అని దుఃఖించెను.

**శ్లో॥ రుదిత్వైవం సమాశ్వాస్య జననీం సాశ్రులోచనామ్ ।**
**మాత్రాఽగ్రజైర్నిషిద్ధోఽపి క్రుద్ధో హన్తుం యయౌ రిపూన్ ॥ 8**

**ప్ర :** ఏవం రుదిత్వా = ఈ రీతిగా రోదించి, సాశ్రులోచనాం జననీమ్ = కన్నీరునిండిన కన్నులు గల తల్లిని, సమాశ్వాస్య = ఓదార్చి, క్రుద్ధః = కోపించినవాడై, మాత్రా = తల్లిచేత, అగ్రజైః = అన్నలచేత, నిషిద్ధః+అపి = నివారింపబడిన వాడయ్యును, రిపూన్ = శత్రువులను, హన్తుమ్ = చంపుటకు, యయౌ = బయలు వెడలెను.

**తా :** ఇట్లు దుఃఖించి కన్నీరు నించుచున్న తల్లిని ఓదార్చి, క్రోధమూర్తియై, తల్లియు అన్నలును వారించినను, శత్రువులను వధించుటకై బయలుదేరెను.

**శ్లో॥ ముహూర్తేనాహనత్సర్వాన్సబలానర్జునాత్మజాన్ ।**
**సప్రాకారం పురం భిత్త్వా సర్వం మాత్రే న్యవేదయత్ ॥ 9**

**ప్ర :** సర్వాన్ సబలాన్ అర్జునాత్మజాన్ = కార్తవీర్యార్జునుని కుమారులందఱను వారి సైన్యములతో గూడ, ముహూర్తేన = అల్పకాలములో, అహనత్ = వధించెను, సప్రాకారం పురం భిత్త్వా = పురమును ప్రాకారముతోగూడ, కూలగొట్టి, సర్వమ్ = జరిగినదంత, మాత్రే = తల్లికి, న్యవేదయత్ = నివేదించెను.

**తా :** కార్తవీర్యుని కుమారులందఱను వారి బలగముతో బలముతోగూడ తృటిలో సంహరించి, వారి పురమును ప్రాకారముతో సహ పడగొట్టి, విషయమునంతయు తల్లికి నివేదించెను.

**శ్లో॥ మునిభిర్భ్రాతృభీ రామో వీర్యమాణోఽపి శృణ్వతామ్ ।**
**ఋషీణాం మాతురగ్రే స ప్రతిజ్ఞామకరోదిమామ్ ॥ 10**

**ప్ర :** మునిభిః భ్రాతృభిః = మునులతో సోదరులతో, రామః = రాముడు, వీర్యమాణః అపి = వీరమును చూపువాడై, శృణ్వతాం ఋషీణామ్ = వినుచున్న ఋషులకు, సః = రాముడు, మాతుః అగ్రే = తల్లి సమక్షమున, ఇమాం ప్రతిజ్ఞాం అకరోత్ = ఈ ప్రతిజ్ఞను చేసెను.

**తా :** మునులతో సోదరులతో వీరముచు చూపుచు, వినుచున్న ఋషులకు తన తల్లి సమక్షమున ఈ ప్రతిజ్ఞ చేసెను.

**శ్లో॥ త్రిసప్తధా కరిష్యామి బలాన్నిఃక్షత్రియాం మహీమ్ ।**
**పితౄన్ తదస్రకుణ్డేషు తర్పయామ్యృణముక్తయే ॥ 11**

**ప్ర :** మహీమ్ = భూమిని, త్రిసప్తధా = ఇరువదియొక్క మార్లు, బలాత్ = నా బలమువలన, నిఃక్షత్రియామ్ = క్షత్రియులు లేని దానినిగా, కరిష్యామి = చేయుదును, తదస్రకుణ్డేషు = వారి రక్తపు మడుగులలో, పితౄన్ = పితరులను, ఋణముక్తయే = పితౄణమునుండి ముక్తికై, తర్పయామి = తర్పణ లర్పింతును.

**తా :** భూమిని ఇరువదియొక్కమార్లు క్షత్రియవంశములు లేకుండ వధించి, వారి రక్తముతో నా పితరులకు తర్పణలిచ్చి పితౄణమునుండి ముక్తుడనగుదును.

**శ్లో॥ తచ్ఛ్రుత్వా రేణుకా ప్రాహ సమ్యగుక్తం త్వయాఽనఘ! ।**
**ప్రాక్ సంస్కృత్య పితుర్దేహం ప్రతిజ్ఞాం సఫలాం కురు ॥ 12**

**ప్ర :** తత్ శ్రుత్వా = ఆ ప్రతిజ్ఞను విని, రేణుకా ప్రాహ = రేణుక ఇట్లనెను, అనఘ! = ఓ పాపము లేనివాడా!, త్వయా = నీచే, సమ్యక్ ఉక్తమ్ = చక్కగ పలుకబడినది, ప్రాక్ = తొలుత, పితుః దేహమ్ = తండ్రి శరీరమును, సంస్కృత్య = ప్రేతసంస్కారములు జరిపించి, ప్రతిజ్ఞామ్ = నీ ప్రతిజ్ఞను, సఫలాం కురు = ఫలవంతము చేయుము.

**తా :** ఆ మాటలు విని, రేణుకాదేవి యిట్లనెను : పుణ్యాత్మా! నీవు పలికినది సరియే. తొలుత నీ తండ్రి శరీరమునకు ప్రేతసంస్కారము జరిపించి, ఆపై నీ ప్రతిజ్ఞను తీర్చుము.

**శ్లో॥ అర్జునో దత్తభక్తోఽయం యది క్రుధ్యతి స ప్రభుః ।**
**త్వాం నాశయిష్యత్యత్రాముముపాయం కథయామి తే ॥ 13**

**ప్ర :** అయం అర్జునః = ఈ కార్తవీర్యార్జునుడు, దత్తభక్తః = శ్రీదత్తాత్రేయుని భక్తుడు, సః ప్రభుః = ఆ దత్తాత్రేయస్వామి, యది క్రుధ్యతి = కోపించినట్లయిన, త్వామ్ = నిన్ను, నాశయిష్యతి = నాశము జేయును, అత్ర = ఈ విషయమున, అముం ఉపాయమ్ = ఈ ఉపాయమును, తే = నీకు, కథయామి = చెప్పుచున్నాను.

**తా :** ఈ అర్జునుడు శ్రీదత్తభక్తుడు. ఆ స్వామి అలిగెనేని, నిన్ను నాశము జేయును. అట్లు జరుగకుండ నీకీ ఉపాయమును చెప్పుచున్నాను.

**శ్లో॥ కృత్వైకతస్త్వం పితరం తులాయాం మాం తథైకతః ।**
**గృహీత్వా యాహి తిష్ఠేతి యత్ర శ్రోష్యసి ఖాద్వచః ॥ 14**

**ప్ర :** త్వమ్ = నీవు, పితరమ్ = నీ తండ్రిని, తులాయామ్ = త్రాసులో, ఏకతః కృత్వా = ఒక ప్రక్కనుంచి, తథా = అట్లే, మామ్ = నన్ను, ఏకతః =వేరొక ప్రక్కనుంచి, గృహీత్వా = తీసికొని,

యాహి = పొమ్ము, యత్ర = ఎక్కడ, తిష్ఠ = నిలువుము, ఇతి = అని, ఖాత్ = ఆకాశమునుండి, వచః = వాక్కు, శ్రోష్యసి = నీవు వినెదవో,

**శ్లో॥ తత్రైవ బ్రాహ్మణం యోగ్యం లక్ష్యసే త్వం తదావయోః ।**
**సంస్కారం విధినా కృత్వా కృతకార్యో భవిష్యసి ॥ 15**

**ప్ర :** తత్ర+ఏవ = ఆ తావుననే, యోగ్యం బ్రాహ్మణమ్ = యోగ్యుడైన బ్రాహ్మణుని, త్వం లక్ష్యసే = నీవు చూచెదవు, తదా = అప్పుడు, ఆవయోః = మా యిద్దరకును, విధినా = శాస్త్రోక్తముగా, సంస్కారం కృత్వా = అంత్యసంస్కారము చేసి, కృతకార్యః = ధన్యుడవు, భవిష్యసి = అగుచున్నావు.

**తా :** నీవు నీ తండ్రిని నన్ను త్రాసులో నిరుప్రక్కల నుంచి తీసికొని పొమ్ము. మార్గమున యే తావున 'నిలువుము' అని ఆకాశవాణి పలుకు వినబడునో, అక్కడ మా ఇద్దరకును అంత్య సంస్కారములు చేసి ధన్యుడవు కమ్ము. అందుకు దగిన బ్రాహ్మణుడు నీ కా తావుననే కన్పడును.

**శ్లో॥ ఏవముక్తో జనన్యా స రామః పితృపరాయణః ।**
**తదాజ్ఞాం శిరసా ధృత్వా తులామాదాయ భక్తిమాన్ ॥ 16**

**శ్లో॥ విన్యస్యైకత్ర పితరం మృతమన్యత్ర మాతరమ్ ।**
**స్వాశ్రమాన్నిర్యయౌ స్కన్ధే తులామాదాయ భక్తితః ॥ 17**

**ప్ర :** జనన్యా = తల్లిచే, ఏవమ్ ఉక్తః = ఇట్లని చెప్పబడినవాడై, పితృపరాయణః సః రామః = తల్లితండ్రులయెడ విధేయుడైన ఆ రాముడు, తత్ ఆజ్ఞామ్ = తల్లి ఆజ్ఞను, శిరసా ధృత్వా = తలదాల్చి, భక్తిమాన్ = భక్తిగలవాడై, తులామ్ = కావడి, ఆదాయ = తీసికొని వచ్చి, ఏకత్ర = ఒకప్రక్క, మృతం పితరమ్ = మరణించిన తండ్రిని, అన్యత్ర = వేరొకప్రక్క, మాతరమ్ = తల్లిని, విన్యస్య = ఉంచి, స్కన్ధే = భుజముపై, తులాం ఆదాయ = త్రాసునెత్తుకొని, భక్తితః = భక్తితో, స్వ+ఆశ్రమాత్ = తన ఆశ్రమమునుండి, నిర్యయౌ = బయలు దేరెను.

**తా :** తల్లి ఇట్లని తెల్పగా, పితృవిధేయుడైన రాముడు ఆమె ఆజ్ఞను తలదాల్చి, భక్తితో కావడిని (తులను) తీసికొని వచ్చి, అందొక ప్రక్క తండ్రి శవమునుంచి, రెండవ ప్రక్క తల్లిని కూర్చుండజేసి, ఆ కావడిని భుజమున కెత్తుకొని తన ఆశ్రమమునుండి బయలుదేరెను.

**శ్లో॥ సంస్కర్తుం పితరౌ భక్త్యా కాన్యకుబ్జప్రదేశతః ।**
**యయౌ స్థానాని సంపశ్యన్ తీర్థాన్యాయతనాని చ ॥ 18**

**ప్ర :** భక్త్యా = భక్తితో, పితరౌ సంస్కర్తుమ్ = తల్లిదండ్రులకు సంస్కరణ చేయుటకు, కాన్యకుబ్జప్రదేశతః = కన్యాకుబ్జ పరిసరములకు, తీర్థాని ఆయతనాని స్థానాని చ సంపశ్యన్ = పుణ్యతీర్థములను, దేవాలయములను, చారిత్రక ప్రదేశములను చూచుచు, యయౌ = సాగెను.

**తా :** తల్లిదండ్రులకు సంస్కారము చేయుటకు కన్యాకుబ్జ పరిసరములలోని పుణ్యతీర్థములు దేవతాస్థానములను చూచుచు సాగెను.

**శ్లో॥ దృష్ట్వా పుణ్యాన్యరణ్యాని పవిత్రాంస్తాపసాశ్రమాన్ ।**
**వివిధాంశ్చాచలాన్ పుణ్యాన్ నదీస్తీర్థాని సర్వశః ॥ 19**

**ప్ర :** పుణ్యాని అరణ్యాని = మహర్షులుండు అరణ్యాలను, పవిత్రాన్ తాపసాశ్రమాన్ = పవిత్రమైన ఋష్యాశ్రమములను, వివిధాన్ అచలాన్ = నానావిధ పర్వతములను, పుణ్యాన్ నదీః తీర్థాని చ = పుణ్యనదీతీర్థములను గూడ, దృష్ట్వా = చూచి,

**శ్లో॥ ఏవం స పర్యటన్రామో ధీమాన్ ధర్మభృతాం వరః ।**
**యయావామలకీగ్రామం సహ్యాద్రౌ మునిమణ్డితమ్ ॥ 20**

**ప్ర :** ఏవమ్ = ఈ రీతిగా, సః రామః = ఆ రాముడు, ధీమాన్ = బుద్ధిమంతుడు, ధర్మభృతాం వరః = ధర్మము నాదరించువారిలో ఉత్తముడు, సహ్యాద్రౌ = సహ్యాద్రిపై, మునిమణ్డితమ్ ఆమలకీ గ్రామం యయౌ = మునులచే ప్రకాశించు ఆమలకమను పేరుగల గ్రామమునకు చేరెను.

**శ్లో॥ ప్రశాన్తబాధం నిర్వైరం సర్వకాలసుఖావహమ్ ।**
**ఋషిభిః సంవృతం రమ్యం కన్దమూలఫలాన్వితమ్ ॥ 21**

**శ్లో॥ సిద్ధవిద్యాధ్రగన్ధర్వకిన్నరోరగచారణైః ।**
**వృతం సహ్యాచలప్రాన్తే దదర్శాశ్రమముత్తమమ్ ॥ 22**

**ప్ర :** ప్రశాన్తబాధమ్ = బాధలులేక ప్రశాంతముగ నున్నదానిని, నిర్వైరమ్ = శత్రుత్వములు లేని దానిని, సర్వకాలసుఖావహమ్ = అన్ని ఋతువులలో సుఖముగ నుండునది, ఋషిభిః సంవృతమ్ = ఋషులతో చుట్టుకొనబడినది, రమ్యమ్ = ఆహ్లాదకరమైనది, కన్దమూలఫలాన్వితమ్ = దుంపలు, పండ్లు కలిగినది, సిద్ధ = సిద్ధులు, విద్యాధ్ర = విద్యాధరులు, గన్ధర్వ = గంధర్వులు, కిన్నర = కిన్నరులు, ఉరగ = సర్పజాతులు (నాగులు), చారణైః = చారణులు, వీరందరితో, వృతమ్ = వర్తిల్లునదియైన, సహ్యాచలప్రాన్తే = సహ్యాద్రిపరిసరములలో, ఉత్తమం ఆశ్రమం దదర్శ = ఉత్తమమైన ఆశ్రమమును చూచెను.

**తా :** సహ్యాద్రి పరిసరములలో ఆతడొక ఆశ్రమమును చూచెను. ఆ ప్రదేశము ఋషులతో నిండియుండుటయే కాక బాధాకారణములులేక ప్రశాంతముగ జాతివైరములులేని ప్రాణులతో సంవత్సరమంతయు సుఖప్రదమై, ఆహ్లాదకరమై, దుంపలు, పండ్లు గలిగి, సిద్ధులు, విద్యాధరులు, గంధర్వులు, కిన్నరలు, నాగులు, చారణులు ఇత్యాది దేవయోనులతో నిండి యున్నది.

**శ్లో॥ రామం తత్రైవ సాక్షేపమువాచ సురవర్త్మవాక్ ।**
**భో భోః! పరశురామ! త్వం శ్రీదత్తాచార్యసంయుతః ॥ 23**

**శ్లో॥ యథావిధి స్వపితరం భక్త్యా సంస్కర్తుమర్హసి ।**
**సఙ్కల్పోఽపి తవాత్రైవ సుఫలశ్చ భవిష్యతి ॥ 24**

**శ్లో॥ ఇతి శ్రుత్వాఽశరీరాం గాం తథేత్యుక్త్వా స భార్గవః ।**
**అవతీర్య తులాం తత్ర శ్రీదత్తాశ్రమమావిశత్ ॥ 25**

**ప్ర :** రామమ్ = రాముని, తత్ర ఏవ = అచటనే, సురవర్త్మవాక్ = ఆకాశవాణి, సాక్షేపమ్ = నిలుపుచు, ఉవాచ = ఇట్లనెను, భో భోః పరశురామ! = ఓయీ పరశురామా!, త్వమ్ = నీవు, శ్రీదత్తాచార్యసంయుతః = శ్రీదత్తగురువునుగూడి, యథావిధి = శాస్త్రవిధిగా, భక్త్యా = భక్తితో, స్వపితరమ్ = నీ తండ్రిని, సంస్కర్తుం అర్హసి = సంస్కరింప దగుదువు, అత్ర ఏవ = అచటనే, తవ = నీదైన, సంకల్పః అపి = సంకల్పమున్నూ, సుఫలః చ = సుఫలమున్ను, భవిష్యతి = అగును, ఇతి = అని, అశరీరాం గామ్ = అశరీరవాణిని, శ్రుత్వా = విని, తథా ఇతి ఉక్త్వా = అట్లేయని పలికి, సః భార్గవః = ఆ భార్గవరాముడు, తులామ్ = కావడిని, తత్ర = అచట, అవతీర్య = దించి, శ్రీదత్తాశ్రమమ్ = శ్రీదత్తుని ఆశ్రమమును, ఆవిశత్ = ప్రవేశించెను.

**తా :** రాముని ఆకాశవాణి అచటనే నిలువుమని యిట్లనెను : ఓయీ పరశురామా! నీవు శ్రీదత్తగురువు సన్నిధిలో నుంటివి; అచటనే నీ తండ్రికి అంత్యసంస్కారము చేయుము; నీ సంకల్పమున్ను గూడ ఇచటనే నెరవేరును. అది విని రాముడచ్చటనే భుజముపై నుండి కావడిని దించి, శ్రీదత్తాశ్రమమున ప్రవేశించెను.

**శ్లో॥ తులస్యోదుమ్బరాశ్వత్థబిల్వపర్ణశమీవటైః ।**
**అన్యైశ్చ ఫలపుష్పాఢ్యైస్తృణగుల్మలతాదిభిః ॥ 26**

**శ్లో॥ జలైః సుశీతలైర్మిష్టైః స్రవద్భిః పరివేష్టితమ్ ।**
**సర్వర్తుగుణసమ్పన్నం యోగివృన్దనిషేవితమ్ ॥ 27**

**శ్లో॥ ప్రవిశ్యాశ్రమమాసీనం దత్తాత్రేయం దిగమ్బరమ్ ।**
**దదర్శానఘయాశ్లిష్టం దేవ్యా రామో మహామతిః ॥ 28**

**శ్లో॥ క్రీడన్తమపి తం దేవ్యా పానపత్రధరం మునిమ్ ।**
**అభివాద్యేశ్వరం మత్వా ప్రార్థయామాస భక్తితః ॥ 29**

**ప్ర :** తులస్యా = తులసిచే, ఉదుమ్బర, అశ్వత్థ, బిల్వ, పర్ణ, శమీ,వటైః = చెప్పబడిన ఆ యా వృక్షములయొక్కయు, అన్యై చ = తదితరముల యొక్కయు, ఫలపుష్పాఢ్యైః = పండ్లచే, పూలచే, తృణగుల్మలతా+ఆదిభిః = గడ్డి, పొదలు, తీవెలు మొదలగు వానిచే, స్రవద్భిః సుశీతలైః మిష్టైః జలైః = పారుచున్న, చల్లనితియ్యనినీటితో, సర్వర్తుగుణసంపన్నమ్ = అన్ని ఋతువుల గుణములతో నిండియున్న దానిని, యోగివృన్దనిషేవితమ్ = యోగిబృందములచే సేవింపబడిన, పరివేష్టితమ్

= నిండియున్నదానిని, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ప్రవిశ్య = ప్రవేశించి, దత్తాత్రేయం దిగంబరమ్ = దిగంబరుడైన దత్తాత్రేయుని, దేవ్యా అనఘయా ఆశ్లిష్టమ్ = అనఘాదేవిచే కౌగలించబడియున్న వానిని, పానపత్రధరమ్ = పానీయముతో నిండిన పత్రమును ధరించిన వానిని, దేవ్యా క్రీడన్తమ్ = దేవితో క్రీడించుచున్న వానిని, మునిమ్ = మునిని, మహామతిః రామః = మహాబుద్ధిశాలియైన రాముడు, దదర్శ = చూచెను, తమ్ = వానిని, ఈశ్వరం మత్వా = ఈశ్వరునిగా తలచి, అభివాద్య = నమస్కరించి, భక్తితః ప్రార్థయామాస = భక్తితో ప్రార్థించెను.

**తా :** తులసి, ఉదుంబర, అశ్వత్థ, బిల్వ, పలాశ, శమీ, వటాది వృక్షములతోను, ఫలపుష్పములతోను, గడ్డి, పొదలు, తీవెలు మొదలగు వానితోను, చల్లని, తియ్యని, పారుచున్న నీటితోను, అన్ని ఋతువుల సుగుణములతో సంపన్నమైన ఆశ్రమమును ప్రవేశించి, బుద్ధిశాలియైన రాముడు, దిగంబరుడై అనిందితయైన దేవిని కౌగలించి పానపాత్రను బట్టియున్న ముని దత్తాత్రేయుని దర్శించెను. వానిని ఈశ్వరునిగా భావించి భక్తితో నమస్కరించి, ప్రార్థించెను.

**శ్లో॥ కృపాం కురు మయి బ్రహ్మన్! భక్తవత్సల! సర్వవిత్! ।**
**సంస్కర్తుం పితరావత్ర ప్రాప్తోఽస్మి బ్రూహి మే విధిమ్ ॥ 30**

**ప్ర :** బ్రహ్మన్ = ఓ దేవా!, భక్తవత్సల! = భక్తులను తల్లివలె కాపాడువాడా!, సర్వవిత్ = సర్వమెఱిగిన వాడా!, మయి = నా యందు, కృపాం కురు = దయజూపుము, పితరౌ = నా తల్లితండ్రులకు, సంస్కర్తుమ్ = అంతిమసంస్కారము చేయుటకై, అత్ర = ఇచటకు, ప్రాప్తః అస్మి = చేరినవాడనైతిని, మే =నాకు, విధిమ్ = శాస్త్రీయవిధానమమును, బ్రూహి = తెలియజెప్పుడు.

**తా :** ఓ దేవా!, భక్తవత్సలా!, సర్వజ్ఞా! నా యందు దయయుంచుడు. నా తల్లితండ్రులకు అంతిమసంస్కారములు చేయుటకై నే నిటకు వచ్చితిని. నాకు ఈ సందర్భమున అనుసరించదగిన శాస్త్రీయపద్ధతియేమో వివరింపుడు.

**శ్లో॥ శ్రీదత్తః ప్రాహ న విధిం నిషేధం వా న వేద్మ్యహమ్ ।**
**యథేష్టాం మతిమాశ్రిత్య స్థితోఽస్మీహ పిశాచవత్ ॥ 31**

**శ్లో॥ అనాచారం న జానామి ధర్మం వాఽధర్మమప్యుత ।**
**ఇత్యుక్తః ప్రాహ రామస్తం త్వమేవ మునిసత్తమ! ॥ 32**

**శ్లో॥ యోగీశ్వరః సర్వగురుః కర్తా హర్తా జగత్ప్రభుః ।**
**సదానన్దో గుణాతీతో ధర్మాధర్మౌ కుతస్తవ ॥ 33**

**ప్ర :** శ్రీదత్తః ప్రాహ = శ్రీదత్తుడిట్లనెను, న విధిం వేద్మ్యహమ్ = నేను శాస్త్రమెఱుగను, వా = లేక, నిషేధమ్ = నిషేధమును, న = ఎఱుగను, యథా ఇష్టాం మతిమ్ = నా ఇష్టప్రకారము బుద్ధిని, ఆశ్రిత్య = ఆశ్రయించి, పిశాచవత్ = పిశాచమువలె, ఇహ = ఇక్కడ, స్థితః అస్మి = ఉన్నవాడనైతిని,

అనాచారమ్ = అనాచారమును, ధర్మమ్ = ధర్మమును, వా = లేక, అధర్మం అపి ఉత = అధర్మమునే యైనను, న జానామి = నే నెఱుగను.

ఇతి ఉక్తః రామః = ఇట్లు చెప్పబడినవాడై రాముడు, తం ప్రాహ = వాని కిట్లనెను, త్వం ఏవ = నీవే, మునిసత్తమ! = మునిశ్రేష్ఠ!, యోగీశ్వరః = యోగముకు ప్రభువు, సర్వగురుః = అందరికంటె పెద్దవు, కర్తా = కర్తవు, హర్తా = సంహరించువాడవు, జగత్ ప్రభుః = జగత్తునకు సర్వాధికారివి, సదానన్దః = ఎల్లప్పుడు సత్యమయిన ఆనందముగల వాడవు, గుణ+అతీతః = సత్త్వరజస్తమో గుణత్రయమునకు అందనివాడవు, తవ = నీకు, ధర్మ+అధర్మౌ కుతః = ధర్మము, అధర్మము అను విచక్షణ యెందుకు?

**తా :** శ్రీదత్తుడిట్లనెను : నేను శాస్త్రమెఱుగను, నిషేధమునూ యెఱుగను. నేనిక్కడ పిశాచమువలె నా బుద్ధికి తోచినట్లు బ్రతుకుచున్నాను; అనాచారము ధర్మము, అధర్మము ఇవేమియు నాకు తెలియదు. ఈ మాటలు విని రాముడిట్లనెను : మునిశ్రేష్ఠ! నీవే యోగులకీశ్వరుడవు, అందరికంటె అన్నిటనూ పెద్దవు; కర్తవు నీవే; సంహర్తవు నీవే. ఈ సృష్టికి సర్వాధికారివి, నియామకుడవు. నీ వానందమయుడవు, త్రిగుణవికారములు లేనివాడవు. అట్టి నీకు ధర్మాధర్మముల ననుసరించట కేమి పని?

**శ్లో॥ శ్రీశః ప్రాహ బ్రవీష్యత్ర పశ్యన్నప్యన్యథా కథమ్ ।**
**దిగమ్బరేయం ప్రమదా మదిరావిహ్వాలేక్షణా ॥ 34**

**శ్లో॥ తథాప్యహం న నౌ వేత్సి మదిరాస్వాదలాలసౌ ।**
**అస్పృశ్యోఽహమసమ్భావ్యో విధివార్తా కుతో మమ ॥ 35**

**ప్ర :** శ్రీశః ప్రాహ = శ్రీదత్తుడిట్లనెను, అత్ర = ఇచట, ఇయం ప్రమదా = ఈ స్త్రీ, మదిరావిహ్వాల+ఈక్షణా = మద్యపానమువలన చంచలమైన చూపులు గలది, దిగమ్బరా = ఒడలిపై వస్త్రము లేనిది, అహం అపి = నేనుగూడ, తథా = అట్లే, నౌ మదిరాస్వదలాలసౌ = మద్యపానమనందాసక్తులమైన మమ్ము, పశ్యన్ అపి = చూచుచున్నను, న వేత్సి = తెలియకున్నావు, అన్యథా = వేరుగా, కథం బ్రవీషి = ఎట్లు వర్ణించగలవు?, అహమ్ = నేను, అస్పృశ్యః = అంటరానివాడను, అసంభావ్యః = మన్నింపరానివాడను, విధివార్తా = నియమముల విషయము, మమ కుతః = నా కెందుకు?

**తా :** శ్రీదత్తుడిట్లనెను : ఇక్కడ నిదిగో ఈ స్త్రీ వివస్త్ర, మద్యపానాసక్త, నేనును అట్లే; మే మిద్దరము త్రాగుబోతులమే. చూచుచున్నావు కదా, మరి నన్నెట్లు అంతగా స్తుతింతువు?! నేను అంటరాని వాడను. నా కింత గౌరవమీయరాదు. నాకు నియమముల గురించి పనేమి?

**శ్లో॥ తతో రామోఽభవత్తూష్ణీం తులాస్థా రేణుకావదత్ ।**
**కిం మోహయస్యమేయాత్మన్! వాక్యైర్లోకానుసారిభిః ॥ 36**

ప్ర : తతః = అంతట, రామః = రాముడు, తూష్ణీమ్ అభవత్ = మారుబలుక కుండెను, తులాస్థా = కావడిలోనున్న, రేణుకా అవదత్ = రేణుకాదేవి యిట్లనెను, అమేయ+ఆత్మన్ = ఓ అనంతుడా!, లోక+అనుసారిభిః వాక్యైః = లోకాచారముగ పలుకు మాటలతో, మోహయసి కిమ్ = భ్రమింపజేయుచున్నావా?

తా : అంతట రాముడూరకుండగా, కావడిలో నున్న రేణుక యిట్లనెను : నీవు అనంతమైన ఆత్మస్వరూపుడవు; లోకములో పరిపాటిగ చెప్పికొను మాటలతో మమ్ము భ్రమపెట్టుచున్నావేమి?

**శ్లో॥ ఇత్యుక్తో భగవాన్ దత్తః ప్రహస్యోత్థాయ సత్వరమ్ ।**
**తుష్టావ రేణుకాం దేవీం లక్ష్యాలక్ష్యస్వరూపిణీమ్ ॥ 37**

ప్ర : ఇతి ఉక్తః = ఇట్లని పలుకబడినవాడై, భగవాన్ దత్తః = శ్రీదత్తభగవానుడు, ప్రహస్య = చిన్నగా నవ్వి, సత్వరం ఉత్థాయ = వెంటనే లేచి, లక్ష్య+అలక్ష్య-స్వరూపిణీమ్ = కన్పడునది, కన్పడనిది రూపములు గల, రేణుకాం దేవీమ్ = రేణుకాదేవిని, తుష్టావ = స్తుతించెను.

తా : ఇట్లని రేణుకాదేవి పలుకగా, భగవాన్ శ్రీదత్తుడు చిన్నగా నవ్వి, వెంటనే లేచి, కనబడి, కనరాని రూపములుగానున్న రేణుకాదేవిని స్తుతించెను.

**శ్లో॥ మాతః! సర్వం త్వమేవైకా వన్దనీయా పరావరా ।**
**ఏకవీరా మహామాయా సృష్టిస్థిత్యన్తకారిణీ ॥ 38**

**శ్లో॥ ఏకైవానేకరూపేషు స్థితాపి త్వమనామయా ।**
**దేహేన్ద్రియమనఃప్రాణాహఙ్కారేభ్యో విలక్షణా ॥ 39**

ప్ర : మాతః! = ఓ తల్లీ!, ఏకా ఏవ త్వం సర్వమ్ = ఒక్కదానవే యైన నీవు సర్వమును (అయియున్నావు), వన్దనీయా = నమస్కరింపదగినదానవు, పరావరా = నామరూపప్రకృతివిన్నీ, సర్వాతీతమైన ఆత్మస్వరూపిణివి, ఏకవీరా = అసహాయవీరము గలదానవు, సృష్టిస్థితి+అన్తకారిణీ మహామాయా = సృష్టిస్థితిలయములను నిర్వహించు మహామాయవు, త్వమ్ = నీవు, అనామయా = పరిణామస్వరూపిణివయ్యునూ పరిణామాతీతమైనదానవు, ఏకా ఏవ = ఒక్కదానవే, అనేకరూపేషు = బహురూపములందు, స్థితా అసి = నిలచియున్నావు, దేహ+ఇన్ద్రియమనః-ప్రాణ+అహంకారేభ్యః విలక్షణా = శరీరము, ఇంద్రియములు, మనస్సు, ప్రాణము, అహంకారము అను విశేషలక్షణములు గలదానవు.

**శ్లో॥ స్తుత్వైవం రేణుకా భర్త్రా సహ దాహార్థమీశ్వరమ్ ।**
**ప్రార్థయామాస స ప్రాహ పతిస్తేఽసౌ కథం మృతః ॥ 40**

ప్ర : ఏవం స్తుతా రేణుకా = ఇట్లు కీర్తింపబడినదై రేణుకా దేవి, భర్త్రా సహ = భర్తతో, దాహార్థమ్

= తానును బూదియగుటకు, ప్రార్థయామాస = అనుమతి నర్థించెను, సః ప్రాహ = ఆ స్వామి యిట్లనెను, అసౌ తే పతిః = ఈ నీ భర్త, కథం మృతః = ఎట్లు మరణించెను.

**తా :** శ్రీదత్తుడట్లు రేణుకను కీర్తింపగా, ఆ దేవి తాను భర్తదేహముతో చితినెక్కుటకు అనుమతి నర్థించెను. శ్రీదత్తుడిట్లడిగెను : నీ భర్త ఎట్లు మరణించినాడు?

**శ్లో॥ సా నృపైర్హత ఇత్యూచే దత్తః ప్రాహ జ్వలన్ రుషా ।**
**మత్తా నశ్యన్తు భూపా యే ఘాతయన్తి ద్విజానపి ॥ 41**

**ప్ర :** సా = ఆ రేణుకాదేవి, నృపైః = రాజులచేత, హతః = చంపబడెను, ఇతి ఊచే = అని చెప్పెను, దత్తః = శ్రీదత్తుడు, రుషా = రోషముచే, జ్వలన్ ప్రాహ = మండుచూ యిట్లనెను, మత్తాః భూపాః =మదించిన రాజులు, యే = ఎవరు, ద్విజాన్ అపి = బ్రాహ్మణులను సైతము, ఘాతయన్తి = చంపుచున్నారో, (తే = వారు), నశ్యన్తు = నశింతురుగాక!

**తా :** రాజులు చంపినారని ఆ రేణుకాదేవి చెప్పగా శ్రీదత్తుడు కోపముతో బ్రాహ్మణులనైన చంపెడు మదించిన రాజులు నశింతురు గాక! అనెను.

**శ్లో॥ రామోఽవదత్కరిష్యేఽహం మహీం నిఃక్షత్రియామితి ।**
**సఙ్కల్పితమృతం భూయాత్త్వత్ప్రసాదాద్భవతోఽధునా ॥ 42**

**ప్ర :** రామః అవదత్ = రాముడనెను, అహమ్ = నేను, మహీమ్ = భూమిని, నిఃక్షత్రియాం కరిష్యే ఇతి = క్షత్రియులు లేనిదానిగా చేతును అను, సంకల్పితమ్ = సంకల్పము, అధునా = నేడు, త్వత్ ప్రసాదాత్ = నీ అనుగ్రమము వలన, ఋతం భూయాత్ = సత్యమగును గాక!

**తా :** రాముడు, నేను భూమిని క్షత్రియులు లేకుండ జేతునని సంకల్పించితిని. తమ అనుగ్రహము వలన నేడు అది సత్యమగుగాక, అనియెను.

**శ్లో॥ యోగజ్ఞోఽపి భవచ్ఛిష్యః కృతాగస్త్వాన్మయా హతః ।**
**క్షన్తుమర్హసి దేవేశ సత్యసంధం విధేహి మామ్ ॥ 43**

**ప్ర :** భవత్ శిష్యః = తమ శిష్యుడు, యోగజ్ఞః అపి = యోగియై యుండియు, కృత+ఆగస్త్వాత్ = అపరాధము చేయుటవలన, మయా హతః = నాచే హతుడాయెను, సత్యసన్ధమ్ = నన్ను సత్యసంధుని, విధేహి = చేయుము, క్షన్తుమర్హసి = క్షమింపునకు తగినవాడను.

**తా :** తమ శిష్యుడు, యోగియై యుండియు, అపరాధము చేయుటవలన, నాచే హతుడాయెను. నన్ను సత్యసంధుని గావింపుము. క్షమింపునకు తగినవాడను.

**శ్లో॥ దత్తః ప్రాహ తమాలిఙ్గ్య త్వం సఖామేఽసి నిశ్చితమ్ ।**
**కృతం సాధు త్వయా రామ! సత్యసన్ధో భవిష్యసి ॥ 44**

**ప్ర :** దత్తః = శ్రీదత్తుడు, తమ్ = వానిని, ఆలిఙ్గ్య = కౌగలించి, ప్రాహ = ఇట్లనెను, త్వమ్ = నీవు, నిశ్చితమ్ = నిశ్చయముగా, మే = నాకు, సఖా+అసి = సఖుడవగుదువు, త్వయా = నీ చే, సాధు కృతమ్ = సరియైన కార్యమే చేయబడినది, రామ! = ఓ రామా!, సత్యసంధః భవిష్యసి = నీ ప్రతిజ్ఞ సత్యమే యగును (నెరవేరును).

**తా :** శ్రీదత్తుడు వానిని కౌగలించికొని యిట్లనెను : నీవు నా సఖుడవు. నీవు చేసినది సరియైన కార్యమే. రామా! నీ ప్రతిజ్ఞ తప్పక నెరవేరును.

**శ్లో॥ తతః శ్రీశాజ్ఞయాఽఽనీయ సర్వతీర్థాని సాయకైః ।**
**భిత్త్వాఽద్రిం విధివత్సస్నౌ రామః పశ్చాచ్చ రేణుకా ॥ 45**

**ప్ర :** తతః = అంతట, శ్రీశ+ఆజ్ఞయా = శ్రీదత్తుని ఆజ్ఞచే, సాయకైః = బాణములతో, అద్రిం భిత్త్వా = పర్వతమును పగులగొట్టి, సర్వతీర్థాని ఆనీయ = అన్ని పుణ్యనదీజలముల దెచ్చి, రామః = రాముడు, చ = మరియు, పశ్చాత్ = తరువాత, రేణుకా = రేణుకాదేవి, విధివత్ = శాస్త్రవిధిననుసరించి, సస్నౌ = స్నానముచేసిరి.

**తా :** అంతట శ్రీదత్తుని ఆజ్ఞగొని రాముడు పర్వతమును పగులజేసి అందుండి పుణ్యనదీజలములను రప్పించి, ముందు రాముడు తరువాత రేణుకాదేవియును శాస్త్రవిధిననుసరించి స్నానము జేసిరి.

**శ్లో॥ భూషితా సా జగన్మాతా శ్రీదత్తం ప్రాహ చాత్మజమ్ ।**
**స్వస్థానం గన్తుమిచ్ఛామి పత్యా సహ ముదాన్వితా ॥ 46**

**శ్లో॥ భో! రామ! త్వం ద్విజాన్ పాహి ప్రతిజ్ఞాం సఫలాం కురు ।**
**ఇత్యుక్త్వాచార్యమర్కం చ నత్వాఽదాద్వాయనాని సా ॥ 47**

**ప్ర :** సా జగన్మాతా = ఆ జగన్మాత, భూషితా = ఆభరణములు ధరించి, శ్రీదత్తం చ ఆత్మజమ్ = శ్రీదత్తుని, తన కుమారుని ఉద్దేశించి, ప్రాహ = ఇట్లనెను, పత్యా సహ = నా భర్తతో గూడి, ముదా+అన్వితా = సంతోషముతో, స్వస్థానమ్ = నాదైన తావును, గన్తుం ఇచ్ఛామి = పోవ గోరుచున్నాను, భో రామ! = ఓ రామా!, త్వమ్ నీవు, ద్విజాన్ = బ్రామ్మణులను, పాహి = రక్షించుము, ప్రతిజ్ఞామ్ = నీ ప్రతిజ్ఞనను, సఫలాం కురు = ఫలవంతము జేయుము, ఇతి ఉక్త్వా = ఇట్లని పలికి, ఆచార్యమ్ అర్కం చ = శ్రీదత్తుని, సూర్యుని గూడ, నత్వా = నమస్కరించి, వాయనాని = వాయనములను, అదాత్ = ఇచ్చెను.

**తా :** ఆ జగన్మాత రేణుక ఆభరణములు ధరించి, శ్రీదత్తునితో తన కుమారునితోనూ ఇట్లనెను : నేను నా భర్తతో కలసి సంతోషముతో నా నెలవును చేరగోరుచున్నాను. ఓ రామా! నీవు బ్రాహ్మణులను రక్షించుము, నీ ప్రతిజ్ఞను తీర్చుకొనుము. ఇట్లని పలికి ఆమె శ్రీదత్తునకును సూర్యునకును నమస్కరించి వాయనము లిచ్చెను.

**శ్లో॥ వసురుద్రాదిత్యముఖాః సస్త్రీకా నిఖిలాః సురాః ।**
**స్వర్యానైరాయయుర్ద్రష్టుముత్సవం మునయోఽపి చ ॥ 48**

ప్ర : వసురుద్ర+ఆదిత్యముఖాః నిఖిలాః సురాః = ఆపుడు, ధృవుడు, సోముడు, అథర్వుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసుడు, అనబడు అష్టవసువులున్నూ,; అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట, రుద్రుడు, హరుడు, శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు అనబడు ఏకాదశరుద్రులున్నూ; ధాత, మిత్రుడు, అర్యముడు, శక్రుడు, వరుణుడు, అంశుమంతుడు, భృగుడు, వివస్వంతుడు, పూష, సవిత, త్వష్ట, విష్ణువు అనబడు ద్వాదశాదిత్యులును ముఖ్యులైన దేవతలందఱును, సస్త్రీకాః = తమ భార్యలతో గూడి, స్వర్యానైః = విమానములపై, ఉత్సవం ద్రష్టుమ్ = ఆ ఉత్సవమును చూచుటకు, మునయః అపి చ = మునులున్నూ, ఆయయౌ = వచ్చి చేరిరి.

**తా :** ఆ ఉత్సవమును చూచుటకు మునులును, దేవతలందఱునూ భార్యలతోగూడ తమ విమానములపై వచ్చి చేరిరి.

**శ్లో॥ గురుణాపి సమాధాయ క్రవ్యాదాగ్నిం యథావిధి ।**
**సుమఙ్గలా వివేశాసౌ సహ పత్యాఽఽహితాగ్నినా ॥ 49**

ప్ర : గురుణా అపి = గురువు శ్రీదత్తుని చేతగూడ, క్రవ్యాద+అగ్నిమ్ = శవదాహకమైన అగ్నిని, యథావిధి = శాస్త్రోక్తముగా, సమాధాయ = యేర్పఱచి, సుమఙ్గలా = ఆ సుమంగలియైన రేణుకాదేవి, ఆహితాగ్నినా పత్యా సహ = ఆహితాగ్నియైన పతితోగూడ, అసౌ = ఆమె, వివేశ = ప్రవేశించెను.

**తా :** శవదాహకాగ్నిని (చితిని) పేర్చి, అందు అగ్నిని శ్రీదత్తునిచే జ్వలింపజేసి, శాస్త్రోక్తవిధానమున, ఆహితాగ్నియైన తన భర్తృపార్థివదేహముతోగూడ సుమంగళి రేణుక ఆ చితిని ప్రవేశించెను.

**శ్లో॥ సతీస్పర్శాత్ ప్రదీప్తోఽగ్నిః శుశుభేఽర్క సహస్రవత్ ।**
**ప్రణేముర్హర్షితాః సర్వే చక్రురుచ్చైర్జయధ్వనిమ్ ॥ 50**

ప్ర : సతీస్పర్శాత్ = పతివ్రత స్పర్శవలన, ప్రదీప్తః అగ్నిః = వెలిగించబడిన అగ్ని, అర్క సహస్రవత్ = వేయిమంది సూర్యులవలె, శుశుభే = ప్రజ్వరిల్లెను, హర్షితాః = సంతోషించినవారై, సర్వే = అందఱును, ప్రణేముః = నమస్కరించిరి, ఉచ్చైః = బిగ్గరగా, జయధ్వనిమ్ = జయ జయ అను నాదమును, చక్రుః = చేసిరి.

**తా :** వెలుగుచున్న అగ్ని ఆ పతివ్రత శరీరస్పర్శ తగలగనే వేయిసూర్యులవలె ప్రజ్వరిల్లి వెల్గెను. అందుకు సంతోషించి అందఱును నమస్కరించిరి, బిగ్గరగా జయజయధ్వానములు చేసిరి.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం
వాసుదేవ్యాం చతుర్థాష్టకే సప్తమాధ్యాయః ॥

ఓమ్ శం



శ్రీః

ప.ప. శ్రీవాసుదేవానందసరస్వతీవిరచితమ్

# శ్రీదత్తపురాణమ్

## చతుర్థాష్టకము - అష్టమాధ్యాయము

**శ్లో॥ యజ్ఞాయ జ్ఞాయ తే దత్త! నమస్త్వం మే సఖాస్యతః ।**
**భూత్వాఽఽచార్యః కారయౌర్ధ్వదైహికం విధివత్తయోః ॥ 1**

**ప్రతిపదార్థం :** దత్త! = ఓ దత్తాత్రేయప్రభూ!, యజ్ఞాయ జ్ఞాయ = యజ్ఞరూపివైన జ్ఞానికి, తే = నీకు, నమః = నమస్కారము, త్వమ్ = నీవు, మే =నాకు, సఖా అసి = సఖుడవైయున్నావు, అతః = ఆ కారణమున, ఆచార్యః భూత్వా = ఆచార్యుడవై, తయోః = నా తల్లిదండ్రులిద్దరకు, విధివత్ = వేదవిహితముగ, ఔర్ధ్వదైహికమ్ = మృతులకై దానాదికములను, కారయ = చేయించుము.

**తాత్పర్యం :** ఓ దత్తప్రభూ! నీవు యజ్ఞరూపివి, జ్ఞానివి. నీకు నమస్కారము. నీవు నాకు సఖుడవైనందువలన ఆచార్యుడవై నా పితరులకు మరణానన్తరము వేదవిహితముగ చేయదగిన దానాదులను చెప్పి చేయించుము.

**శ్లో॥ ఇత్యర్థితః స రామేణ భూత్వాఽఽచార్యోఽప్యకారయత్ ।**
**విధినాఞ్జలిదానాది పిణ్డనిర్వాపణాది చ ॥ 2**

**ప్ర :** ఇతి అర్థితః = ఇట్లు కోరబడినవాడై, సః = ఆ దత్తప్రభువు, రామేణ = రామునిచే, ఆచార్యః భూత్వా = ఆచార్యుడై, విధినా = శాస్త్రోక్తముగ, అఞ్జలిదానాది = అంజలి, దానము, మొదలగువానిని, చ = మరియు, పిణ్డనిర్వాపణ+ఆది = పిండప్రదానము మొదలగు వానిని, అపి = కూడ, అకారయత్ = జరిపించెను.

**తా :** ఇట్లు ప్రార్థింపబడి శ్రీదత్తుడు తానే ఆచార్యుడుగూడ నగుచు రామునిచేత విధిగా అంజలి దానము, పిండప్రదానము మొదలగు వానిని చేయించెను.

**శ్లో॥ శ్రీదత్తః ప్రాహ పితరౌ క్వ గతౌ రామ! వేత్సి కిమ్ ।**
**స ప్రాహ త్వత్ప్రసాదాత్తౌ స్వర్గతావితి భాతి మే ॥ 3**

**ప్ర :** శ్రీదత్తః ప్రాహ = శ్రీదత్తుడిట్లనెను : రామ = ఓ రామా!, పితరౌ = నీ తల్లిదండ్రులు, క్వ గతౌ = ఎక్కడకు వెళ్లినారో, వేత్సి కిమ్ = నీ వెఱుగుదువా?, సః ప్రాహ = రాముడనెను, త్వత్ ప్రసాదాత్ = నీ అనుగ్రహమువలన, తౌ = వారిద్దరు, స్వః+గతౌ = స్వర్గమునకు వెడలిరి, ఇతి = అని, మే = నాకు, భాతి = తోచుచున్నది.

**తా :** శ్రీదత్తుడు రాముని, నీ పితరులు ఎక్కడకు పోయిరో తెలియునా?, అని అడుగగా, ఆతడు, తమ అనుగ్రహమువలన వారిద్దరు స్వర్గమునకు పోయిరి అని నాకు తోచుచున్నది, అనెను.

**శ్లో॥ శ్రీశః ప్రాహ మృతౌ స్వర్గం గతావిత్యజ్ఞభావనా ।**
**న మృతౌ న గతావేతౌ పశ్య లీలావిహారాణి ॥ 4**

**ప్ర :** శ్రీశః ప్రాహ = శ్రీదత్తుడిట్లనెను, మృతౌ = మరణించినవారు, స్వర్గం గతౌ ఇతి = స్వర్గమునకు పోయిరి, అనునది, అజ్ఞభావనా = అజ్ఞానుల భావన, ఏతౌ = వీరు, న మృతౌ = మరణించనూ లేదు, న గతౌ = వెళ్లిపోనూలేదు, లీలావిహారాణి = వారి లీలావిహారములను , పశ్య = చూడుము.

**తా :** శ్రీ దత్తుడు, మరణించిన వారు స్వర్గమునకు పోదురనునది అజ్ఞానుల ఊహ, వీరు మరణించనూ లేదు వెళ్లిపోనూ లేదు, వీరి లీలావిహారమును చూడుము.

**శ్లో॥ రామోఽపి పితరౌ దృష్ట్వా ద్యోతయన్తౌ దిశస్త్విషా ।**
**ననామ పరయా భక్త్యా తౌ తతోఽదర్శనం గతౌ ॥ 5**

**ప్ర :** రామః అపి = రాముడున్నూ, పితరౌ = తల్లితండ్రులను, దిశః = దిక్కులను, త్విషా = తేజస్సుతో, ద్యోతయన్తౌ = ప్రకాశింపజేయుచున్నవారైయున్నవారిని, దృష్ట్వా = చూచి, పరయా భక్త్యా = పరమభక్తితో, ననామ = నమస్కరించెను, తతః = అంతట, తౌ = వారు, ఆదర్శనం గతౌ = అదృశ్యులయిరి.

**తా :** రాముడున్నూ తమతేజస్సుతో దిక్కులను ప్రకాశింపజేయుచున్న తల్లితండ్రుల జూచి పరమభక్తితో నమస్కరించెను. అంతట వారు అదృశ్యులయిరి.

**శ్లో॥ ప్రాహాశ్లిష్య ప్రభూ రామం క్షత్రియాన్ జహ్యధార్మికాన్ ।**
**మచ్చిదంశయుతస్త్వం తు సఖే! జిష్ణుర్భవిష్యసి ॥ 6**

**ప్ర :** ప్రభుః = ప్రభువు, రామమ్ = రాముని, ఆశ్లిష్య = కౌగలించి, ప్రాహ = ఇట్లనెను, అధార్మికాన్ క్షత్రియాన్ = అధర్మవర్తనులైన క్షత్రియులను, జహి = నశింపజేయుము, త్వం తు = నీవేమో, మత్ = నా యొక్క, చిత్+అంశయుతః= చైతన్యాంశము గలవాడవు, సఖే! = ఓ సఖా!, జిష్ణుః = విజేతవు, భవిష్యసి = అగుచున్నావు.

**తా :** దత్తప్రభువు రాముని కౌగలించి యిట్లనెను : అధర్మము చేయు క్షత్రియులను నశింప జేయుము. నీవు నా చైతన్యాంశగలవాడవు. విజేతవగుదువు.

**శ్లో॥ తతో రామః ప్రణీతాయాం స్నాత్వా సంకల్ప్య సాయుధః ।**
**త్రిసప్తవారం నిఃక్షత్రాం క్ష్మాం కృత్వాఽస్రసరాంస్యధాత్ ॥ 7**

**ప్ర :** తతః = అంతట, రామః = రాముడు, ప్రణీతాయామ్ = ప్రణీతానదిలో, స్నాత్వా = స్నానము చేసి, సంకల్ప్య = క్షత్రియసంహారమును సంకల్పించి, సాయుధః = ఆయుధముగొని, క్ష్మామ్ = భూమిని, త్రిసప్తవారమ్ = ఇరువదియొక్కమారు, నిఃక్షత్రాం కృత్వా = క్షత్రియులు లేకుండ చేసి, అస్రసరాంసి = నెత్తుటి సదస్సులను, అధాత్ = ఉంచెను.

**తా :** అంతట రాముడు, ప్రణీతానదిలో స్నానముజేసి, క్షత్రియసంహారమునకు సంకల్పము జెప్పికొని, ఆయధముగొని, భూమిపై క్షత్రియులను ఇరువదియొక్కమారు సంహరించి నెత్తుటి సదస్సులను ఉంచెను.

**శ్లో॥ పితౄన్ సన్తర్ప్య శాస్త్రాణి ప్రక్షాల్యాచార్యమత్రిజమ్ ।**
**ఋత్విజః కశ్యపముఖాన్ వృత్వా సోమేన సోఽయజత్ ॥ 8**

**ప్ర :** పితౄన్ = పితరులకు, సంతర్ప్య = తర్పణములిచ్చి, శాస్త్రాణి = శాస్త్రములను, ప్రక్షాల్య = పవిత్రీకరించి, అత్రిజం ఆచార్యమ్ = శ్రీదత్తుని ఆచార్యునిగా, ఋత్విజః కశ్యపముఖాన్ = కశ్యపుడు ఆదిగాగల వారిని ఋత్విజులనుగా, వృత్వా = వర్ణముచేసి (ఎన్నుకొని), సోమేన = సోమముతో, సః = ఆతడు, అయజత్ = యాగముచేసెను.

**తా :** రాముడు పితరులకు తర్పణ లిచ్చి, శాస్త్రములను పవిత్రీకరించి, శ్రీదత్తుని ఆచార్యునిగా, కశ్యపాదులను ఋత్విజులునుగా ఎన్నుకొని సోమముతో యాగముచేసెను.

**శ్లో॥ సర్వే దేవా యత్ర తృప్తా విప్రాశ్చాన్నదానాంశుకైః ।**
**సర్వాం క్ష్మాం కశ్యపాయాదాద్విశుద్ధాత్మా విధానతః ॥ 9**

**ప్ర :** సర్వే దేవాః = దేవతలందఱును, యత్ర = ఎచట, తృప్తాః = తృప్తిజెందిరో, అన్నదాన+అంశుకైః = అన్నము, వస్త్రము, దక్షిణలతో, విప్రాః = బ్రాహ్మణులున్నూ, (యత్ర తృప్తాః), సర్వాం క్ష్మామ్ = సమస్తభూమిని, విధానతః = శాస్త్రీయపద్ధతిలో, విశుద్ధాత్మా = నిర్మలమైన మనస్సు గలవాడై, కశ్యపాయ = కశ్యపునకై , అదాత్ = ఇచ్చెను.

**తా :** ఆ తావున దేవతలను తృప్తిపరచి, అన్నము, వస్త్రము, దక్షిణల నిచ్చుటతో బ్రాహ్మణులను తృప్తిపరచి, రాముడు భూమినంతయు శాస్త్రోక్తరీతిలో నిర్మలమనస్కుడై కశ్యపున కిచ్చెను.

**శ్లో॥ స్వర్ణవస్త్రధనై రామో దత్తాచార్యమపూజయత్ ।**
**తత్సర్వం బ్రాహ్మణేభ్యోఽదాద్భగవాన్ భక్తిభావనః ॥ 10**

**ప్ర :** స్వర్ణవస్త్రధనైః = బంగారము, వస్త్రములు, ధనము, వీనిచే, రామః = రాముడు, దత్తాచార్యమ్ = ఆచార్యుడైన దత్తుని, అపూజయత్ = పూజించెను, భగవాన్ = శ్రీదత్తుడు, భక్తిభావనః = భక్తిభావముతో, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకు, తత్ సర్వమ్ = అది యంతయు, అదాత్ = దానమిచ్చెను.

**తా :** రాముడు శ్రీదత్తాచార్యునికి బంగారము, వస్త్రములు, ధనములిచ్చి పూజించినాడు. ఆ దత్తభగవానుడు అది యంతయు భక్తితో బ్రాహ్మణుల కిచ్చినాడు.

**శ్లో॥ ప్రాహ రామం నివేశ్యాఙ్కే భాలేదం దుష్కరం కృతమ్ ।**
**కర్మామీ క్షత్రియా దుష్టా దుర్జయాపి తే హతాః ॥ 11**

**శ్లో॥ కృతో యజ్ఞోఽపి విధివచ్ఛూరోఽసి త్వం హరిః స్వయమ్ ।**
**రామః ప్రాహ న శూరోఽహం ప్రసాదో భవతామయమ్ ॥ 12**

**ప్ర :** రామమ్ = రాముని, అఙ్కే నివేశ్య = ఒడిలో నుంచికొని, ప్రాహ = ఇట్లనెను, బాల! = ఓ నాయనా!, కుమారా!, ఇదం దుష్కరం కృతమ్ = దుష్కరమైన దానిని చేసితివి, అమీ క్షత్రియా కర్మా = ఈ క్షత్రియ కర్మ, దుష్టా = చెడ్డది, దుర్జయాః అపి = జయించుటకు కష్టమేయైనను, తే = వారు, హతాః = నశించిరి; విధివత్ = శాస్త్రవిధిగా, యజ్ఞః అపి కృతః = యజ్ఞముగూడ చేసితివి, శూరః అసి = నీవు శూరుడవు, త్వమ్ = నీవు, స్వయం హరిః = సాక్షాత్ విష్ణువువే; రామః ప్రాహ = రాముడిట్లనెను, అహం = నేను, న శూరః = శూరుడనుగాను, అయమ్ = అది, భవతామ్ = తమయొక్క, ప్రసాదః = ప్రసాదము.

**తా :** శ్రీదత్తుడు రాముని ఒడిలో కూర్చుండబెట్టికొని ఇట్లనెను : కుమారా! క్షత్రియసంహారకార్యము క్షత్రియకర్మయే. ఇది దుఃఖకారకము, దుష్టము. జయింపరాని వారిని వధించితివి. యజ్ఞము గూడ చేసితివి. నీవు శూరుడవు, సాక్షాత్ విష్ణువువే. అది విని రాము డిట్లనెను : నేను శూరుడను గాను; ఈ జరిగిన దంతయు తమ అనుగ్రహమే.

**శ్లో॥ సాధు సాధ్వితి తే ప్రాహుర్దేవాశ్చ మునయోఽపి చ ।**
**రామేణ సత్కృతా జగ్ముః స్వస్వధామాఖిలా సురాః ॥ 13**

**ప్ర :** సాధు సాధు ఇతి = బాగు బాగు అని, తే దేవాః మునయః అపి చ = దేవతలు మునులున్నూ, ప్రాహుః = పలికిరి, రామేణ సత్కృతా = రామునిచే సత్కారములు గొని, స్వస్వధామ = తమ తమ నెలవులకు, అఖిలాః సురాః = దేవతలందఱు, జగ్ముః = వెడలిరి.

**తా :** దేవతలు, మునులు వారి సంభాషణ విని బాగు! బాగు! అని ప్రశంసించిరి. రాముడు సత్కరింపగా దేవతలందఱునూ తమ తమ తావులకు వెడలిరి.

**శ్లో॥ సఖ్యం కృత్వాఽవసద్రామస్తస్మై తుష్టోఽవదత్ప్రభుః ।**
**రహస్యం త్రిపురాదేవ్యాః శ్రవణాన్ముక్తిదం క్షణాత్ ॥ 14**

**ప్ర :** రామః = రాముడు, సఖ్యం కృత్వా = సఖ్యము చేసి, అవసత్ = ఉండెను, తస్మై = వానితో, తుష్టః = సంతృప్తిజెందినవాడైన, ప్రభుః = శ్రీదత్తుడు, అవదత్ = ఇట్లని పలికెను, త్రిపురాదేవ్యాః = రేణుకాదేవియొక్క, రహస్యమ్ = తత్త్వమును, శ్రవణాత్ = వినుటవలన, క్షణాత్ = నిముషములో, ముక్తిదమ్ = ముక్తిని ప్రసాదించును.

**తా :** రాముడు స్నేహముతో అట నుండెను. సంతుష్టుడైన శ్రీదత్తుడు వానితో నిట్లనెను : రేణుకాదేవితత్త్వమును వినుట సత్వరముక్తిదాయకము.

**శ్లో॥ సఖా మే త్వం చిరం జీవ కఞ్చిత్కాలం వసాత్ర తు ।**
**తపశ్చర తతో లోకశర్మణే పశ్చిమామ్బుధౌ ॥ 15**

**శ్లో॥ మయి తేజోఽద్య యత్న్యస్తమవతారాన్తరే పునః ।**
**ఆదాస్యే త్వం తతో బ్రాహ్మ్యా లక్ష్మ్యా యుక్తస్తపశ్చర ॥ 16**

**శ్లో॥ భవిష్యసి మహర్షిస్త్వం నూనం సావర్ణికేఽన్తరే ।**
**తతః ప్రాప్తే మహాకల్పే మత్సాయుజ్యం గమిష్యసి ॥ 17**

**ప్ర :** త్వమ్ = నీవు, మే సఖా = నాకు మిత్రుడవు, చిరం జీవ = చాలకాలము జీవించుము, కంచిత్కాలం తు = కొలది కాలమేమో, అత్ర వస = ఇచట నుండుము, తపః చర = తపము నాచరించుము, తతః = ఆపై, లోకశర్మణే = లోకకల్యాణమునకై, పశ్చిమ+అమ్బుధౌ = పడమటి సముద్రమున, యత్ న్యస్తం తేజః అద్య మయి = నేడు యే తేజము నా యందు నిక్షిప్తమై యున్నదో, తమ్ = ఆ తేజమును, పునః = మరల, అవతారాన్తరే = అవతారమును చాలించినప్పుడు, ఆదాస్యే = నిక్షిప్తము చేయుదును, తతః = అంతట, బ్రాహ్మ్యా లక్ష్మ్యా యుక్తః =బ్రహ్మతేజస్సుతో గూడినవాడవై, త్వం తపః చర = నీవు తపము జేయుము, త్వమ్ = నీవు, నూనమ్ = నిశ్చయముగా, మహర్షి భవిష్యసి = మహర్షి వగుదువు, తతః = ఆపై, సావర్ణికే అన్తరే ప్రాప్తే మహాకల్పే = ఎనిమిదవ మనువైన సావర్ణి సంబంధిత మహాకల్పము ముగియునప్పుడు, మత్ సాయుజ్యమ్ = నాతోడి సాయుజ్యముక్తిని, గమిష్యసి = పొందెదవు.

**తా :** నీవు నాకు మిత్రుడవు. చిరంజీవివి కమ్ము. కొంతకాల మిచటనుండి తపస్సు చేయుము. ఆపై లోకకల్యాణమునకై నాలో నిక్షిప్తమైయున్న తేజస్సును నేను అవతారమును చాలించునప్పుడు మరల పడమటి సముద్రమున నిక్షిప్తము చేయుదును. అంతట నీవు బ్రహ్మతేజస్సుతో తపస్సు

జేసి మహర్షివగుట నిశ్చయము. అటు తర్వాత ఎనిమిదవ మనువగు సావర్ణి మహాకల్పాంతమున నీవు నాతోడి సాయుజ్యముక్తిని పొందుదువు.

కల్పము, బ్రహ్మకల్పము అనబడునది బ్రహ్మదేవుని కొక్కదినము, మానవుని కాలమానము ప్రకారమిది సహస్రయుగములు, అనగా మొత్తము 432000000 సంవత్సరములు. ఇది మానవ జీవితపు నూరేండ్ల మానమునకు సరి. ఇది నూరు మహాయుగముల కాలము. కాగా, ఈ కాలమున అనుసరించదగిన ధర్మములను నిర్దేశించువారు పదియునల్గురు మనువులనబడు శాసకులు. వారిపేర్లు : 1. స్వాయంభువ, 2. స్వారోచిష, 3. ఔత్తమి, 4. తామస, 5. రేవత, 6. చాక్షుష, 7. వైవస్వత, 8. సావర్ణి, 9. దక్షసావర్ణి, 10. బ్రహ్మసావర్ణి, 11. ధర్మసావర్ణి, 12. రుద్రసావర్ణి, 13. రౌచ్యదేవసావర్ణి, 14. ఇంద్రసావర్ణి. ఈ పదునాలుగు మన్వంతరముల కాలము 4,320,000 మానవ సంవత్సరములు, బ్రహ్మ దినములో 14వ అంశము.

**శ్లో॥ ఏవం రామం జామదగ్న్యముక్తవాన్ భగవాన్ ప్రభుః ।**
**రామోఽపి స్వాశ్రమం గత్వా కఞ్చిత్కాలమువాస హ ॥ 18**

**ప్ర :** ఏవమ్ = ఈ విధముగా, జామదగ్న్యం రామమ్ = జమదగ్ని కుమారుడైన రామునితో, భగవాన్ ప్రభుః = భగవంతుడైన దత్తప్రభువు, ఉక్తవాన్ = చెప్పినవాడాయెను, రామః అపి = రాముడున్నూ, స్వ+ఆశ్రమం గత్వా = తన ఆశ్రమమునకు బోయి, కంచిత్ కాలమ్ = కొంతకాలము, ఉవాస = అటనుండెను, హ = ఏమాశ్చర్యము.

**తా :** ఈ విధముగా జమదగ్ని కుమారుడైన రామునితో దత్తభగవానుడు చెప్పగా, ఆ రాముడున్నూ తన ఆశ్రమమునకు బోయి కొంతకాలమచట నుండెను. ఇదంతయు నెంత ఆశ్చర్యము!

**శ్లో॥ త్రిసప్తకృత్వా యేనేదం నిఃక్షత్రం జగతీతలమ్ ।**
**నిహతం తీక్ష్ణధారేణ దృఢం పరశునా భృశమ్ ॥ 19**

**ప్ర :** త్రిసప్తకృత్వా = ఇరువదియొక్కమార్లు, యేన = ఎవనిచే, ఇదం జగతీతలమ్ = ఈ భూతలము, నిఃక్షత్రమ్ = క్షత్రియరహితముగా, తీక్ష్ణధారేణ పరశునా = తీవ్రమైన పదనుగల గొడ్డలితో, భృశమ్ = మిక్కిలిగా, నిహతమ్ = వధింపబడినదో, అది ఆశ్చర్యము.

**తా :** ఇరువది యొక్కమార్ల భూతలముపై క్షత్రియులు లేకుండ ఆ రాముడు తన గొడ్డలితో నరికి రాజులను చంపి, పరశురాముడని ప్రసిద్ధుడగుట మహదాశ్చర్యము.

**శ్లో॥ తతో యుగాన్తరే సూర్యవంశీ దేవోఽవతీర్య తత్ ।**
**ఆదదేఽత్యుల్బణం తేజస్తతో రామస్తపోఽతపత్ ॥ 20**

**ప్ర :** తతః = అటుపై, యుగాన్తరే = వేరొక యుగమున, దేవః = విష్ణువు, సూర్యవంశీ = సూర్యవంశజుడై, అవతీర్య = అవతరించి, తత్ = ఆ పరశురాముని, అతి+ఉల్బణమ్ = దట్టమైన,

తేజః = తేజమును, ఆదదే = స్వీకరించెను, గ్రహించెను, తతః = అంతట, రామః = పరశురాముడు, తపః అతపత్ = తపస్సు చేసెను.

**తా :** అటుపై యుగాంతరమున విష్ణువు సూర్యవంశపు రాముడై అవతరించి, ఆ పరశురాముని తేజమును హరించెను. అంతట పరశురాముడు తపము జేసెను.

**శ్లో॥ ఈదృశో లీలయా రామః పితృభక్తో హరేః సఖా ।**
**భక్తిం ప్రథయితుం లోకే జాతోఽయం ద్విజరూపధృక్ ॥ 21**

**ప్ర :** ఈదృశః పితృభక్తః రామః = ఇట్టి పితృభక్తిగల రాముడు, హరేః సఖా = శ్రీదత్తుని సఖుడు, లీలయా = క్రీడగా, లోకే = లోకమున, భక్తిం ప్రథయితుమ్ = భక్తిని స్థాపించుటకు, అయమ్ = ఈతడు, ద్విజరూపధృక్ జాతః = బ్రాహ్మణరూపధారియై జన్మించెను.

**తా :** పితృభక్తిగల రాముడు శ్రీదత్తుని సఖుడు, క్రీడగా లోకమున భక్తిని స్థాపించుటకు బ్రాహ్మణరూపమున జన్మించెను.

**శ్లో॥ రేణుకా సా జగన్మాతా సాక్షాదేవేశ్వరీ ఖలు! ।**
**స్వయం శివోఽవతీర్ణోఽత్ర జమదగ్నిర్మహామునిః ॥ 22**

**ప్ర :** సా రేణుకా = ఆ రేణుకాదేవి, సాక్షాత్ ఏవ = సాక్షాత్తుగనే, జగన్మాత ఈశ్వరీ ఖలు = జగన్మాతయైన ఈశ్వరియే, మహామునిః జమదగ్నిః = మహర్షి జమదగ్ని, అత్ర = భూమిపై, అవతీర్ణమ్ = అవతరించిన, శివః స్వయమ్ = శివుడే తాను.

**తా :** రేణుకాదేవి సాక్షాత్తూ జగన్మాత ఈశ్వరియే. మహర్షి జమదగ్ని పుడమిపై అవతరించిన శివుడే సుమా!

**శ్లో॥ శ్రీదత్తేనాత ఏవేయం లోకశిక్షార్థమీశ్వరీ ।**
**ప్రార్థితా బ్రహ్మణా చాఽపి స్వకార్యార్థమభిష్టుతా ॥ 23**

**ప్ర :** అతః = ఆ కారణమున, శ్రీదత్తేన ఏవ = శ్రీదత్తుని చేతనే, ఇయం ఈశ్వరీ = ఈ ఈశ్వరి, లోకశిక్షార్థమ్ = లోకమున కుపదేశించుటకై, స్వకార్యార్థం చ = తన కార్యసిద్ధికై గూడ, బ్రహ్మనా అపి = బ్రహ్మచేతను గూడ, ప్రార్థితా = ప్రార్థింపబడినదై, అభిష్టుతా = స్తోత్రము చేయబడినది.

**తా :** అందువలన శ్రీదత్తు డీ ఈశ్వరిని లోకశిక్షార్థము ప్రార్థించినాడు. బ్రహ్మగూడ నుతించినాడు.

**శ్లో॥ పురాఽవిద్యాం పఞ్చపర్వాం ససృజే యాం విధిస్తయా ।**
**కదాచిద్దేవదత్తాస్తా విసస్మార శ్రుతీః సమాః ॥ 24**

**ప్ర :** పురా = సృష్టికి ముందు, విధిః = బ్రహ్మ, పఞ్చపర్వాం అవిద్యామ్ = ఐదు కణుపులు లేక భాగములు గల అవిద్యను, యాం ససృజే = ఎవరిని సృష్టించెనో, తయా = ఆ అవిద్యచేత,

కదాచిత్ = ఒకప్పుడు, దేవదత్తాః = అంతఃకరణప్రబోధితుడై, సమాః తాః శ్రుతీః = సమస్తమైన శ్రుతులను, విసస్మార = విస్మరించెను.

**తా :** సృష్టికి ముందు బ్రహ్మ అవిద్యను సృష్టించెను. ఆ అవిద్యచే అంతఃకరణ బోధితుడై శ్రుతుల నన్నిటినీ విస్మరించెను.

**శ్లో॥ హృది శశ్వద్విచార్యాపి న బుబోధాత్మనా స్వయమ్ ।**
**గత్వా మాతాపురం దేవీమస్తౌషీద్రేణుకాం శుభామ్ ॥ 25**

**ప్ర :** హృది = మనసులో, శశ్వత్ = మరల మరల, విచార్య అపి = ఆలోచించి కూడ, స్వయమ్ = తనంతట, ఆత్మనా = మనసుచేత, న బుబోధ = తెలియలేదు, మాతాపురమ్ = మాతాపురమునకు, గత్వా = వెడలి, శుభామ్ = శుభప్రదమైన, దేవీం రేణుకామ్ = రేణుకాదేవిని, అస్తౌషీత్ = స్తుతించెను.

**తా :** మనసులో మరల మరల యెంత ప్రయత్నించినను మరపుదగిలిన వేదములు స్ఫురించలేదు. అంతట మాతాపురమునకు బోయి శుభము లిచ్చు రేణుకాదేవిని స్తుతించెను.

**శ్లో॥ దేవి! త్వం వేదమాతాసి గాయత్రీ వాఙ్మయీశ్వరీ ।**
**ప్రసీద విస్మృతాన్వేదాన్సంప్రకాశయ పూర్వవత్ ॥ 26**

**ప్ర :** దేవి! = ఓ మాతా!, త్వమ్ = నీవు, వేదమాతా = వేదములకు తల్లివి, గాయత్రీ = గాయత్రీదేవివైన ప్రేరకశక్తివి, వాఙ్మయీశ్వరీ = వాక్కురూపమున వెలయు శక్తివి, అసి = అయియున్నావు. విస్మృతాన్ వేదాన్ = మరపుదగిలిన వేదములను, పూర్వవత్ = ముందటివలె, సంప్రకాశయ = చక్కగా ప్రకాశింపనిమ్ము, ప్రసీద = దయసేయుము.

**తా :** ఓ మాతా! నీవు వేదముల ప్రసవించిన జ్ఞానశక్తివి, గాయత్రివైన కార్యప్రేరకశక్తివి, వాగ్రూపశక్తివి. నాకు మరపు దగిలిన వేదములను మునుపటివలెనే చక్కగా ప్రకాశింపనిమ్ము! దయసేయుము!

**శ్లో॥ దేవ్యాహ గత్వా శ్రీదత్తం పరిపృచ్ఛ స వక్ష్యతి ।**
**ఇత్యుక్తః స ప్రభుం గత్వా శ్రీదేవ్యోక్తం న్యవేదయత్ ॥ 27**

**ప్ర :** దేవీ ఆహ = దేవి యనెను, గత్వా = వెడలి, శ్రీదత్తమ్ = శ్రీదత్తుని, పరిపృచ్ఛ = తెలియనడుగుము, సః వక్ష్యతి = ఆ దత్తప్రభువు చెప్పును, ఇతి ఉక్తః = ఇట్లని చెప్పబడిన, సః = బ్రహ్మ, ప్రభుం గత్వా = శ్రీదత్తుని చెంతకేగి, శ్రీదేవ్యా ఉక్తమ్ = శ్రీదేవి చెప్పినదానిని, న్యవేదయత్ = నివేదించెను.

**తా :** దేవి యిట్లనెను : పోయి, శ్రీదత్తుని తెలియగోరి అడుగుము, ఆతడు నీకు చెప్పును. ఆ మాటలు విని బ్రహ్మ శ్రీదత్తుని జేరి దేవి ఆనతిని నివేదించెను.

**శ్లో॥ శ్రీదత్త! సర్వవిత్! శ్రేష్ఠ! సర్వదేవనమస్కృత! ।**
**సర్వాధార! నిరాధార! గుణాత్మాఽప్యసి నిర్గుణః ॥ 28**

**శ్లో॥ సాఙ్గోపనిషదాన్వేదాన్విస్మృతోఽస్మ్యద్య దైవతః ।**
**బుద్ధిప్రదీప! తాన్ బ్రూహి వర్ణమాత్రాస్వరాత్మకాన్ ॥ 29**

**ప్ర :** శ్రీదత్త = ఓ శ్రీదత్తా!, సర్వవిత్ = సర్వజ్ఞా!, శ్రేష్ఠ = సర్వోత్తమ!, సర్వదేవనమస్కృత = అందఱు దేవతలచే నమస్కరింపబడువాడా!, సర్వాధార! = సమస్తసృష్టికి ఆధారమైనవాడా!,, నిరాధార! = ఏ ఆధారములేక నిల్చువాడా!, గుణాత్మా = గుణములు గలవాడా!, అపి = మరియు, నిర్గుణః అసి = గుణాతీతుడవును అయియున్నావు; అద్య దైవతః = నేడు దైవవశమున, స+అఙ్గ+ఉపనిషదాన్ వేదాన్ = అంగములతో కూడిన, ఉపనిషత్తులను వేదములను, విస్మృత అస్మి = మరచియున్నాను, బుద్ధిప్రదీప! = బుద్ధిని ప్రకాశింపజేయువాడా!, తాన్ వర్ణమాత్రా-స్వరాత్మకాన్ = అక్షరములు, మాత్రలు, స్వరములు కలిగిన వానిని, బ్రూహి = బోధించుము.

**తా :** ఓ దత్తప్రభూ! నీవు సర్వజ్ఞుడవు, సర్వోత్తముడవు, సర్వపూజ్యుడవు, సర్వమున కాధారమీవు, నీ కేదియు ఆధారము కాదు, సగుణమూర్తివీవు, నిర్గుణతత్త్వమీవు. దైవవశమున నేడు నాకు వేదములు సర్వాంగోపనిషత్తులతో సహ మరపుదగిలినవి. నీవు బుద్ధిప్రకాశకుడవు. వర్ణములతో, మాత్రలతో, స్వరములతో కూడిన విజ్ఞానము నంతయు నాకు ప్రకాశింపనిమ్ము.

**శ్లో॥ శ్రీదత్తః ప్రాహ హే బ్రహ్మన్! విద్యయా పఞ్చపర్వయా ।**
**విముహ్య విస్మృతోఽస్యేతామతో వేదాన్న బుధ్యసే ॥ 30**

**ప్ర :** శ్రీదత్తః ప్రాహ = శ్రీదత్తుడిట్లనెను, హే బ్రహ్మన్ = ఓ బ్రహ్మో!, పఞ్చపర్వయా విద్యయా = అయిదు పర్వముల విద్యచేత, విముహ్య = మోహితుడవై, ఏతాం విస్మృతః అసి = వానిని మరచినావు, అతః = అందువలన, వేదాన్ = వేదములను, న బుధ్యసే = ఎఱుగకున్నావు.

**తా :** శ్రీదత్తుడిట్లనెను : ఓ బ్రహ్మదేవా! అయిదు పర్వముల విద్యచేత భ్రాంతుడవై వానిని మరచినావు. అందువలన వేదముల నెఱుగకున్నావు.

**శ్లో॥ వర్ణా యస్యాం ప్రకాశన్తే వర్ణేష్వేకైవ యా స్థితా ।**
**త్రిపురా వర్ణరూపా సారేణుకేకైవ నాపరా ॥ 31**

**ప్ర :** వర్ణాః = వర్ణములు, యస్యాం ప్రకాశన్తే = ఎవ్వతెయందు ప్రకాశించుచున్నవో, వర్ణేషు = వర్ణములందు, ఏక ఏవ = ఒక్కదానియందుగూడ, యా త్రిపురా వర్ణరూపా = యే త్రిపురసుందరి వర్ణరూపమున వెలుగునో, సా రేణుకా = ఆ రేణుక, ఏకా ఏవ = ఒక్కతెయే, న అపరా = మరి యొకతె కాదు.

**తా :** వర్ణమాల ఆమెయందే ప్రకాశించును. వర్ణములలోని ప్రతియొక్కటియును ఆ దేవి రూపమే.

అట్టి త్రిపురసుందరియే రేణుకాదేవి. ఆమెకు సాటి మరియొకరు లేరు. ఏకమాత్రశక్తి స్వరూపిణి యామె.

**శ్లో॥ సవర్ణా వేదమాతా సా సావిత్రీ బ్రహ్మరూపిణీ ।**
**ఏకైవ చిత్కలా దేవీ జగద్ధాత్రీ న చాపరా ॥ 32**

**శ్లో॥ ఏకమాత్రైకవీరేశా సాష్టపర్యాయవాచకా ।**
**ఓంకారైకస్వరా జ్ఞేయా రేణుకా బ్రహ్మరూపిణీ ॥ 33**

**శ్లో॥ ఏకైవానేకరూపా సావేకవీరేతి గీయతే ।**
**మనసా స్మర తాం దేవీం లబ్ధవేదో భవిష్యసి ॥ 34**

**ప్ర :** సా = ఆ రేణుకాదేవి, సవర్ణా = వర్ణరూపిణి, వేదమాతా = వర్ణరూపమున వేదమాత, సావిత్రీ = సూర్యశక్తి, బ్రహ్మరూపిణీ = బ్రహ్మస్వరూపిణి, ఏకా చిత్కలా ఏవ = ఒక్కటేయైన చిత్కళ, జగద్ధాత్రీ దేవీ = జగత్తును ధరించు శక్తి, న చ అపరా = వేరొకరు కారు, పరాశక్తి; ఏకమాత్రా = అద్వితీయమైనది, ఏకవీరా ఈశా ఏకా ఏవ అనేకరూపా = ఒక్కతెయే యైన ఈశ్వరి బహురూపముల ప్రకాశించుచు, అసౌ = ఈమె, ఏకవీరా ఇతి గీయతే = ఏకవీరగా కీర్తింపబడుచున్నది, సా+అష్టపర్యాయవాచకా = రొమ్ము, కంఠము, శిరస్సు, జిహ్వామూలము, దంతములు, ముక్కు, పెదవులు, దౌడలు అను ఎనిమిది స్థానములలో వర్ణాకృతియై ప్రకటమగునది, ఓంకార+ఏకస్వరా = 'ఓం' అను ఒకే స్వరమున వసించునది, జ్ఞేయా = ఎఱుగదగినది, బ్రహ్మరూపిణీ = పరబ్రహ్మ సాకారమైన, రేణుకా = రేణుకాదేవి, మనసా = మనసుంచి, తాం దేవీం స్మర = ఆ దేవిని స్మరించుము, లబ్ధ వేదః భవిష్యసి = వేదములను పొందినవాడవగుదువు.

**తా :** వర్ణస్వరూపగా వేదమాత రేణుకాదేవి. సూర్యశక్తియగు సావిత్రిగా బ్రహ్మరూపిణి, జగత్తును ధరించే ఏకైక చిత్కళ, పరాశక్తి, అద్వితీయ యైనను అనేకరూపములలో భాసించు ఏకవీర. వర్ణాత్మగా ఈమె మానవశరీరమున ఎన్మిది స్థానములలో స్ఫురించును. ఒకే స్వరముగా ఓంకారమున వసించును. ఈమెయే జ్ఞేయవస్తువు, జ్ఞానదాత, జ్ఞానప్రవర్తకా. మనసుంచి ఆ దేవిని స్మరించుము, వేదములు తిరిగి నీకై ప్రకాశించును.

**శ్లో॥ కః ప్రాహ సాధు సాధూక్తం సైవ మే విస్మృతా ఖలు! ।**
**ప్రబుద్ధోఽస్మ్యధునా భక్త్యా సంస్మరే రేణుకాం శుభామ్ ॥ 35**

**ప్ర :** కః = బ్రహ్మ, ప్రాహ = ఇట్లనెను, సాధు సాధు+ఉక్తమ్ = బాగు బాగుగ చెప్పబడినది, సా ఏవ = ఆ రేణుకయే, మే విస్మృతా ఖలు! = నాకు మరుపు దగిలినది కదా!, అధునా = ఇప్పుడు, ప్రబుద్ధః అస్మి = తెలివి దెచ్చుకొంటిని, భక్త్యా = భక్తితో, శుభామ్ రేణుకామ్ = శుభప్రదమైన రేణుకను, సంస్మరే = స్మరింతును.

**తా :** బ్రహ్మ యిట్లనెను : బాగు బాగు, సరిగా చెప్పితివి. నే నామెనే మరచితిని. ఇప్పుడు తెలివి కలిగినది. భక్తితో నమస్కరింతును.

**శ్లో॥ ఏవం తయోర్వివదతోః ప్రాదురాసాపి రేణుకా ।**
**తన్ముఖాదపి వేదాశ్చ సాఙ్గోపాఙ్గాః సశీర్షకాః ॥ 36**

**ప్ర :** ఏవం తయోః వివదతః = ఇట్లు సంభాషించుచున్న వారికి, ప్రాదుః = ఎదుట, ఆసా = నిలచినదై, రేణుకా అపి = రేణుకయును, తత్ ముఖాత్ = ఆమె ముఖమున, వేదాః చ = వేదములున్ను, సాఙ్గోపాఙ్గాః సశీర్షకాః = వేదాంగములు, ఉపాంగములు, ఉపనిషత్తులు కూడ.

**తా :** ఇట్లు మాట్లాడుకొనుచున్న వారి ఎదుట రేణుక సాక్షాత్కరించెను. ఆమెతోగూడ అంగములు, ఉపాంగములు, ఉపనిషత్తులతో గూడిన వేదములు గూడ సాక్షాత్కరించినవి.

**శ్లో॥ పరమేష్ఠీ తతో హృష్టః శ్రీదత్తం రేణుకాం చ తామ్ ।**
**తుష్టావ లబ్ధవేదోఽసౌ ప్రసన్నముఖపఙ్కజః ॥ 37**

**ప్ర :** పరమేష్ఠీ = బ్రహ్మ, తతః హృష్టః = దానివలన సంతృప్తుడై, శ్రీదత్తమ్ = శ్రీదత్తుని, తాం చ రేణుకామ్ = ఆ రేణుకాదేవిని గూడ, లబ్ధవేదః = వేదములను పొందినవాడై, అసౌ = ఆతడు, ప్రసన్నముఖపంకజః = విప్పారిన ముఖపద్మముగలవాడై, తుష్టావ = స్తుతించెను.

**తా :** బ్రహ్మవేదము నట్లు తిరిగి పొంది, సంతోషించి, విప్పారిన ముఖపద్మముతో శ్రీదత్తుని, రేణుకాదేవిని గూడ స్తుతించెను.

**శ్లో॥ హ్రీర్భీర్ధీః శ్రీస్త్వమేవైకా శ్రద్ధా మేధా చ ధారణా ।**
**ప్రజ్ఞా త్వమేవ ఛన్దాంసి తవాఙ్గాన్యేవ వాఙ్మయీ! ॥ 38**
**శ్లో॥ స్వరవర్ణాత్మికేఽనన్తే! త్వమేవోఙ్కారరూపిణీ ।**
**ఏకవీరే! ప్రసీద త్వం సదా మే సన్నిధా భవ ॥ 39**

**ప్ర :** హ్రీః భీః ధీః శ్రీః త్వం ఏకా ఏవ = బీజాక్షరరూప శక్తివి నీవొక్కతెవే, శ్రద్ధా = శ్రద్ధ, మేధా చ ధారణా ప్రజ్ఞా = మేధస్సు, ధారణ, ప్రజ్ఞ అనునవి, త్వం ఏవ = నీవే, ఛన్దాంసి = వేదములు, తవ అఙ్గాని ఏవ = నీ అవయవములే, వాఙ్మయీ =ఓ వాగ్రూపదేవతా!, స్వరవర్ణ+ఆత్మికే! = అచ్చులకు హల్లులకు ఆత్మయైన దానా!, అనన్తే! = అంతములేనిదానా!, ఏకవీరే = ఓ ఏకవీరా!, ప్రసీద = దయసేయుము, త్వం సదా = నీ వెప్పుడునూ, మే సన్నిధా భవ = నాకు ప్రత్యక్షవై యుండుము.

**తా : శ్రీరేణుకాదేవి అనుష్టుభ్ ద్వయీ మహామంత్రం** నీవు బీజాక్షరరూపదేవతవు, శ్రద్ధ, మేధ, ధారణ, ప్రజ్ఞ అనునవి నీ అంశలే. వేదములు నీ అంగములు. వాగ్రూపదేవతా! స్వరవర్ణాత్మికా! ప్రణవాధిదేవతవు, ఏకవీరా! దయసేయుము. నా కెప్పుడును ప్రత్యక్షముగ నుండుము.

**శ్లో॥ స్తుత్వైవం సా తథేత్యుక్త్వా రేణుకాఽన్తర్దధే విధిః ।**
**నత్వా దత్తం తదాజ్ఞప్తః స్వధామ ప్రయయౌ ముదా ॥ 40**

**ప్ర :** ఏవం సా స్తుతా = ఇట్లామె స్తుతింపబడినదై, తథా ఇతి ఉక్త్వా = అట్లే యని పలికి, రేణుకా = రేణుక, అన్తర్దధే = అదృశ్యమాయెను, విధిః = బ్రహ్మ, దత్తం నత్వా = దత్తునకు నమస్కరించి, తత్ ఆజ్ఞప్తః = వారి ఆజ్ఞగొన్నవాడై, ముదా = సంతోషముతో, స్వధామ = తన నివాసమునకు, ప్రయయౌ = వెడలెను.

**తా :** ఇట్లు స్తుతులందుకొని, రేణుకాదేవి 'తథాస్తు' అని అదృశ్యము కాగా, బ్రహ్మగూడ శ్రీదత్తునకు ప్రణమిల్లి వాని ఆజ్ఞగొని, తన నివాసమునకేగెను.

**శ్లో॥ ఏవం ప్రభావా సా దేవీ రేణవే తపసః ఫలమ్ ।**
**దాతుం తత్పుత్ర్యభూన్నామ్నా రేణుకేత్యఖిలశ్రుతా ॥ 41**

**ప్ర :** ఏవం ప్రభావా = ఈ విధమైన ప్రభావశాలియైన, సా దేవీ = ఆ దేవి, రేణవే = రేణు రాజునకు, తపసః ఫలం దాతుమ్ = తపస్సునకు ఫలమునిచ్చుటకు, తత్ పుత్రీ = వాని కుమార్తె, రేణుకా ఇతి నామ్నా = రేణుక యను పేరుతో, అఖిలశ్రుతా = అందఱకు తెలిసినదిగా, అభూత్ = ఆయెను.

**తా :** ఇట్టి ప్రభావశాలి ఆ దేవి రేణురాజునకు తపఃఫలముగా కుమార్తెయై జన్మించి, రేణుకయను పేరున జగత్ప్రసిద్ధి గాంచినది.

**శ్లో॥ సాఽద్యాప్యామలకీగ్రామే సాక్షాన్మాతాపురే స్థితా ।**
**శ్రీదత్తాశ్రమసామీప్యే పవిత్రే సహ్యసానుని ॥ 42**

**ప్ర :** సా = ఆ రేణుకాదేవి, అద్య = నేడు, అపి = కూడ, ఆమలకీగ్రామే = ఆమలకీగ్రామంలో, సాక్షాత్ మాతాపురే = సాక్షాత్తూ మాతాపురములోనే, శ్రీదత్తాశ్రమసామీప్యే = శ్రీదత్తాశ్రమ సమీపమున, పవిత్రే సహ్యసానుని = పవిత్రమైన సహ్యాద్రి సానువులలో, స్థితా = ఉన్నది.

**తా :** ఆ రేణుకాదేవి నేటికిని ఆమలకీగ్రామంలో మాతాపురంలో శ్రీదత్తాశ్రమసమీపంలో పవిత్రమైన సహ్యాద్రి సానువులలో ఉన్నది.

**శ్లో॥ మాతృతీర్థం శుభం తత్ర మాతా స్నాతా స్వయం సతీ ।**
**నృణాం సద్గతిదం తత్తు దర్శనస్పర్శనాదినా ॥ 43**

**ప్ర :** శుభం మాతృతీర్థమ్ = మాతృతీర్థము శుభమైనది, తత్ర = అచట, మాతా = రేణుకాదేవి, స్నాతా సతీ = స్నానము చేసినది సాధ్వి, స్వయమ్ = ఆ మాతృతీర్థము తాను, నృణామ్ = రాజులకు, సద్గతిదమ్ = సద్గతుల ప్రసాదించునది, తత్ తు = అదియును, దర్శన స్పర్శన ఆదినా = దర్శనము స్పర్శనము మొదలగు వానిచే,

**శ్లో॥ అనసూయాత్రితత్పుత్రదత్తశ్రీరేణాకాశ్రమాన్ ।**
**దేవ్యాత్మకృష్ణామలకీం దృష్ట్వైతి న పునర్భవమ్ ॥ 44**

**ప్ర :** అనసూయా+అత్రి తత్ పుత్ర దత్త శ్రీరేణుకా–ఆశ్రమాన్ = అనసూయా అత్రి దంపతుల ఆశ్రమమును, వారి కుమారుడు శ్రీదత్తుని ఆశ్రమమును, శ్రీరేణుకాదేవి ఆశ్రమములను, దేవీ+ఆత్మ కృష్ణామలకీమ్ = దేవియే ఆత్మగానున్న, కృష్ణ+ఆమలకీ గ్రామమును, దృష్ట్వా = చూచి, న పునః భవమ్ = మరల పుట్టుక ఉండదు.

**తా :** అనసూయాత్రి ఆశ్రమమును, శ్రీదత్తుని ఆశ్రమమును, రేణుకాశ్రమమును, కృష్ణామలకీ గ్రామమును చూచినవారికి పునర్జన్మ కలుగదు.

**శ్లో॥ పద్మతీర్థం సర్వతీర్థం మాతృతీర్థమితి త్రికమ్ ।**
**పావనం సర్వలోకానాం నేదృక్ కాఽప్యాశు తారకమ్ ॥ 45**

**ప్ర :** పద్మతీర్థం సర్వతీర్థం మాతృతీర్థమ్ ఇతి త్రికమ్ = ఈ పేర్లుగల మూడు తీర్థములును, సర్వలోకానామ్ = అందఱకు, అన్నిలోకముల వారికి, పావనమ్ = పవిత్రమైనవి, ఈదృక్ = ఇట్టిది, కా అపి = యేదైనను, ఆశు తారకమ్ = వెంటనే ముక్తినిచ్చునది, న = లేదు.

**తా :** పద్మతీర్థము, సర్వతీర్థము, మాతృతీర్థము అను మూడును అన్నిలోకముల వారికి పవిత్రమైనవి. వీనివలె వెంటనే ముక్తినిచ్చు తీర్థము మరేదియు లేదు.

**శ్లో॥ కుష్ఠీ పురాభవత్సూర్యః స్వాత్మజాకామదూషితః ।**
**పద్మతీర్థస్నానమాత్రాచ్ఛుద్ధోఽన్యార్తిహరోఽభవత్ ॥ 46**

**ప్ర :** స్వ+ఆత్మజా కామదూషితః సూర్యః = తన కుమార్తెను కామించి పాపియైన సూర్యుడు, పురా = పూర్వకాలమున, కుష్ఠీ అభవత్ = కుష్టరోగియాయెను, పద్మతీర్థస్నానమాత్రాత్ = పద్మతీర్థమున స్నానము చేసినంత మాత్రమున, శుద్ధః = పరిశుద్ధుడై, అన్య+ఆర్తిహరః అభవత్ = ఇతరుల ఆర్తిని హరించువాడుగా ఆయెను.

**తా :** సూర్యుడు పూర్వము తన కుమార్తెను కామించి, ఆ దోషము వలన కుష్ఠరోగియాయెను. అంతట పద్మతీర్థస్నానము జేసి పరిశుద్ధుడై, ఇతరుల బాధలను తొలగించ గలవాడాయెను.

**శ్లో॥ దుర్గతిస్థపితృూద్ధృత్యై చాన్ధ్రీకః పర్యటన్ మహీమ్ ।**
**మాతృతీర్థస్నానమాత్రాన్ముక్తా న్పితౄన్దదర్శ హ ॥ 47**

**ప్ర :** దుర్గతిస్థ = దుర్గతిలో నున్న, పిత్రు+ఉద్ధృత్యై = తల్లిని తండ్రిని ఉద్ధరించుటకు, ఆన్ధ్రీకః చ = ఆంధ్రీకుడు కూడ, మహీం పర్యటన్ = భూమిని ద్రిమ్మరుచు, మాతృతీర్థస్నానమాత్రాత్ = మాతృతీర్థమున స్నానము చేసినంత మాత్రమున, పితౄన్ = (తల్లితండ్రులను) పితరులను, ముక్తాన్ దదర్శ = ముక్తినొందినవారినిగా దర్శించెను, హ = ఏమాశ్చర్యము!

**తా :** దుర్గతిలో (నరకములో) నున్న తల్లితండ్రులను ఉద్ధరించుటకై ఆంధ్రీకుడనువాడు తీర్థముల సేవించుచు భూమియంతయు దిరుగుచు వచ్చి మాతృతీర్థమున స్నానము చేయగనే, తన పితరులను ముక్తినొందుచుండుట దర్శించెను. ఇది ఎంత అద్భుతము.

**శ్లో॥ నత్వా దేవీం మాతృతీర్థే పిణ్డాన్దాస్యన్తి యే నరాః ।**
**సముద్ధృతాస్తత్పితరోఽక్షయ్యతృప్తిం ప్రయాన్తి హి ॥ 48**

**ప్ర :** దేవీం నత్వా = రేణుకాదేవిని నమస్కరించి, మాతృతీర్థే = మాతృతీర్థమున, పిణ్డాన్ యే నరాః దాస్యన్తి = యే నరులు పిండప్రదానము చేయుదురో, తత్ పితరః = వారి పితరులు, సముద్ధృతాః = ఉద్ధరింపబడినవారగుచు, అక్షయ్యతృప్తిమ్ = తఱుగని తృప్తిని, ప్రయాన్తి హి = పొందుట నిశ్చయము.

**తా :** రేణుకాదేవికి నమస్కరించి మాతృతీర్థమున పిండప్రదానములు చేసినచో వారి పితరులు సద్గతి నంది తఱుగని ఆనందమును పొందుదురు.

**శ్లో॥ ద్వ్యష్టకాభ్యామిదం ప్రోక్తం దత్తమాహాత్మ్యముత్తమమ్ ।**
**యశస్తత్ప్రియశిష్యస్య కార్తవీర్యార్జునస్య చ ॥ 49**

**ప్ర :** ద్వి+అష్టకాభ్యామ్ = రెండు అష్టకములలో, ఇదం ఉత్తమం దత్తమాహాత్మ్యమ్ = ఈ దత్తమాహాత్మ్యము, తత్ ప్రియశిష్యస్య కార్తవీర్యార్జునస్య యశః చ = వాని ప్రియశిష్యుడైన కార్తవీర్యార్జునుని కీర్తిగూడ, ప్రోక్తమ్ = చెప్పబడినది.

**తా :** ఇది ఉత్తమమైన దత్తమాహాత్మ్యకథ. ప్రాసంగికముగ వాని ప్రియశిష్యుడైన కార్తవీర్యార్జునుని యశస్సుగూడ కీర్తించబడినది. ఇది యంతయు రెండు అష్టకములలో చెప్పబడినది.

**శ్లో॥ ముక్తస్యాప్యర్జునస్యాస్య స్మరణం సద్య ఏవ హి ।**
**దదాత్యభీప్సితం దేవో యథా దత్తస్త్ర్యధీశ్వరః ॥ 50**

**ప్ర :** ముక్తస్య అపి = ముక్తుడైనను, అర్జునస్య స్మరణమ్ = అర్జునుని స్మరించుట, సద్యః ఏవ = అనతికాలముననే, అభీప్సితమ్ =కోరినదానిని, దదాత్ హి = ఇచ్చును, దేవః-త్రి+అధీశ్వరః దత్తః యథా = ముల్లోకనాథుడైన దత్తుని వలెనే.

**తా :** కార్తవీర్యార్జునుడు ముక్తుడే యైనను వాని స్మరణము కోరినదిచ్చును. ఇదియే వాని గురువగు శ్రీదత్తుని కృప.

ఇతి శ్రీమద్దత్తపురాణే సార్ధత్రిసాహస్ర్యాం త్రికాణ్డమణ్డితాయాం సంహితాయాం

వాసుదేవ్యాం చతుర్థాష్టకే అష్టమాధ్యాయః ॥

ఆంధ్రటీకా రచనారంభము : ది.01.03.2019 చతుర్థాష్టక అష్టమాధ్యాయ టీకారచనా
సమాప్తి : ది.16.08.2019. శ్రీదత్తపురాణము - ప్రథమభాగము సంపన్నము.